

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ సాయి భరద్వాజ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సాయి భరద్వాజ వెబ్ సైట్: http://issuu.com/saibabamagazine లేక http://www.saibharadwaja.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## సాయి భరద్వాజ వారి వెబ్ సైట్

**http://issuu.com/saibabamagazine లేక http://www.saibharadwaja.org**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

POSTAL REGD.NO.PRAKASAM/16/2012-2014
REGD.NO. 37926/83
ESTABLISHED : 1983
JANUARY 2012
వెల – ₹ 10/-

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంచిక : 09 సంపుటి : 29



సాయిబాబా పాఠకులకు 2012 నూతన సంవత్సర శుభాకాంక్షలు!!



నూతన సంవత్సరం 2012 ప్రవేశ సందర్భంగా

శ్రీ సాయి మాస్టర్ కృపాశీస్సులు మనందరిపై ఉండాలని ప్రార్ధన.

# ఆధ్యాత్మికతకు అసలు పేరు 'సాయి'

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

జనవరి 2012

ఆధ్యాత్మికత అంటే దేవాలయాలు, మసీదులూ, చర్చీలు గుర్తొస్తాయి. తిరుపతి గుండ్లు, సాయిబుల గడ్డాలూ, ఫాదర్‌ల తెల్లటి గౌన్లూ మనసులో మెదుల్తాయి. ఓం, శిలువ, చంద్రవంక, కళ్ళముందు తళుక్కుమంటాయి. కారణం 'ఆధ్యాత్మికత' అంటే 'మతాలు' అన్న స్థాయికి తిరుక్కుంది సమాజం. ఇది మనలో పెక్కుమంది అవగాహన. మతాలపేరిట జరిగే మోసాలు, లూటీలు, మారణ హోమాలు, భయాలు గుర్తొచ్చి 'మతం వద్దు – కడుపులో చల్ల కదలకుండా వుంటే చాలు' అనుకునేలా చేస్తున్న నేటి పరిస్థితులెన్నో!

నిజానికి ఆధ్యాత్మికత అంటే ఏమిటి.... అది ఏ మతంయొక్క సొంతసొమ్మూ కాదు. ఎవరికి వారు మా మతంద్వారానే మానవజాతి యావత్తూ తరిస్తుందనడానికి. పరాయి దేశంవాడు వచ్చి మనల్ని పేరు పెట్టి పిలువకముందు ఈ దేశంలోవున్న మతానికి ఏం పేరు? మహమ్మద్ ప్రవక్త ఆచరించిన మతం పేరేమిటి? ఏసుక్రీస్తు ఏ మతం పుచ్చుకున్నాడు? బుద్ధుడు ఏ మతంవాడు? వారందరూ పొందిన ఆధ్యాత్మిక పరిపూర్ణతయే వారి మతం! మతం అంటే ఏమిటి? ఆ మహాత్ములు పరిపూర్ణత నొందడానికి ఆచరించి చూపిన జీవిత విధానమే, వారి ధర్మాచరణమే 'మతం'. వారు సాధించిన పరిపూర్ణతే అన్ని మతాలకూ ఆధారం! అది ఏ ఒక్క మతానికీ చెందదు. అన్ని మతాల గమ్యమూ అదే.

> *మహమ్మద్ ప్రవక్త ఆచరించిన మతం పేరేమిటి? ఏసుక్రీస్తు ఏ మతం పుచ్చుకున్నాడు? బుద్ధుడు ఏ మతంవాడు? వారందరూ పొందిన ఆధ్యాత్మిక పరిపూర్ణతయే వారి మతం!*

పతితులకూ, భ్రష్టులకూ, బాధాసర్పగ్రస్థులకు, మానవజాతి యావత్తుకూ దు:ఖాగ్నిలో తపిస్తూ ఏడవాల్సిన గతి పట్టకుండా అశాంతినించి, కష్టంనించీ, దు:ఖంనించీ తప్పించి తృప్తీ, శాంతీ, ఆనందములతో జీవితాలకు సంపూర్ణ వికాసం చేకూర్చేదే ఆధ్యాత్మికత! అన్ని మతాలకూ మూల పురుషులైన మహాత్ములు ఏది సాధించేందుకు అంకితమైనారో, ఏది సాధించడానికి అంకితం కమ్మని జాతిని ఉద్బోధించారో అట్టి శాశ్వతానందము చేకూర్చేదే ఆధ్యాత్మికత! తృప్తీ, శాంతీ ఎవరివి? ఎవరు పొందితే వారివి! అందుకే ఆధ్యాత్మికత అందరిదీ!

ఈ మతాల, చిహ్నాల, సంకుచితత్వాల బారినించీ తప్పించడానికా అన్నట్లు మతపు రంగుకిరణాల వెనుక రంగులేని తేజస్సులా, మతపు మబ్బు తెరల వెనుక నీలాలనింగిలా అవతరించారు సాయి. గాలికి లాగ, వెలుగుకులాగ, ఆకాశానికిలాగ ఆయనకూ మతం లేదు. చెట్టు యిచ్చే నీడదీ, చంద్రుడిచ్చే వెన్నెలదీ ఏ మతమో ఆయనదీ అదే మతం. ఆయన ఈ విశ్వానికి ప్రతీక! ఈ విశ్వం అందరిదీ, ఆయనా అందరివాడే! అందుకే ఆధ్యాత్మికతకు మరో పేరు సాయి! గాలి ఎవరిది? ఎవరు పీల్చుకుంటే వారిది కాదా!! అడవిలోని చెట్టునీడ ఎవరిది? ఎవరు దాని క్రిందకు వెళ్తే వారిది కాదా!! వెన్నెలంతా ఎవరిది? ఎవరు ఆస్వాదిస్తే వారిది కాదా!! సాయి కూడా అంతే! ఎవరు తల్చుకుంటే వారికే!! అందుకే ఆధాత్మికతకు అసలు పేరు 'సాయి'. కొత్త సంవత్సరమంతా నిరంతరంసాయిని స్మరించుకుందాం!

SRI MANGA BHARDWAJA TRUST

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంపుటి: 29 జనవరి-2012 సంచిక: 9

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST

*పరమపూజ్య శ్రీ ఆచార్య ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"*

## విషయసూచిక



చిరునామా

Sri Manga Bharadwaja Trust,

Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,

Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068

Phone No. - 040 65741550

website: **www.saibharadwaja.org**

**www.saimasterforums.org**

చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి

ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ ఆర్.ఎస్. శశిధర్, పిహెచ్. డి

**చందా వివరములు**

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10-00 |
| సంవత్సర చందా | : రూ. 100-00 |
| రాజపోషకులు | : రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000-00 |


*నిజమైన ఆధ్యాత్మిక జీవితం ఆత్మ పరిశీలన, ఆత్మ విమర్శ, పశ్చాత్తాపాలతో ప్రారంభం గావాలి. రోగి, తనకు రోగమెంత ముదిరించే గుర్తిస్తేనే, వైద్యుణ్ణి విశ్వాసంతో ఆశ్రయించగలడు. భూమి యొక్క నిజస్థితి తెలుస్తేనే, అది సస్యశ్యామలమవాలంటే ఏమిచేయాలో సరిగా తెలిసేది. అందుకే వేదకాలం నుండీ అన్ని సత్కర్మలకూ ఆరంభంలో ప్రాయశ్చిత్తమనే క్రతువు చేయడం ఆచారమైంది. మనము తెలిసి చేసిన పాపాలను గురించి ఆత్మవిమర్శ చేసుకుని నిజమైనపరితాపం చెందాలి. పాపాలు సేసేలా మనసును ప్రేరేపించే మనలోని దుర్గణాలను -ప్రక్కవారి తప్పులెన్నినంత నిష్కర్షగా-గుర్తించి, మన దుష్టస్వభావానికి హృదయపూర్వకంగా దు:ఖించాలి. అప్పుడే అంతటి దుస్థితి నుంచి మనలనుద్ధరించుకోవాలన్న నిజమైన తపన ప్రారంభమవుతుంది; మనలనుద్ధరించమని భగవంతుని నజంగా ప్రార్థించ గలుగుతాం.*

**- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ**

# సంబరాలు తెచ్చింది సంక్రాంతి

జనవరి 2012

జాతిలో సమైక్యతను సృష్టించేవి పండుగలు. అవి మన సంస్కృతీ సాంప్రదాయాలను ప్రతిబింబిస్తాయి. ఇతర కారణాలు ఎలావున్నా కష్టాలు మరచి బంధుమిత్రులతో కలసి, దేవతారాధనలో పాల్గొని, వున్నంతలో శారీరక అలంకరణ చేసుకొని, పదిమందితో కలిసి భుజించి, లేని వారికి ఇంత పెట్టటము పండుగలలో ముఖ్య ఉద్దేశ్యము.

సంక్రాంతి, మార్గశిర పుష్యమాసములో ఉత్తరాయణ పుణ్యకాలములో వస్తుంది. మన పూర్వులు సూర్యసంచారాన్ని 2 భాగాలుగా చూసారు. సూర్యుడు భూమధ్యరేఖకు ఉత్తరదిశయందు ఉంటే ఉత్తరాయణమని అన్నారు. ఖగోళశాస్త్ర దృష్ట్యా భూమి తన అక్షంపై తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ పరిభ్రమిస్తుంది. అలా సూర్యుడు ఆకాశంలో ప్రయాణించేమార్గమును క్రాంతివృత్తం అంటారు. ఈ మార్గంలోనే నక్షత్రసముదాయమైన రాశిచక్రముంది. దీనినే జోడియాక్ అంటారు. దీనిని 12 రాశి చక్రాలుగా మన పూర్వులు విభజించారు (మేషాదిరాశులు మొదలగునవి). ఒక రాశినుండి మరొకరాశికి జరిగే సూర్యచలనమునే సంక్రమణము అంటారు - కర్కాటకమునుండి ధనుస్సువరకుగల రాశులలో సూర్యుడు సంచరించే సమయాన్ని దక్షిణాయణమని, మకరము నుంచి మిధునందాకా ఉత్తరాయణమని పూర్వులు ఏర్పరచారు. దక్షిణాయనంలో విపరీతంగా వర్షాలుకురిసి నదులుపొంగి గ్రామాలు, పంటలు నాశనమవటమేకాక ప్రాణనష్టంకూడా జరుగుతుంది. అంతేగాక కలరా, శీతలవ్యాధులు బాగా వ్యాపిస్తాయి. ఉత్తరాయణం వచ్చేసరికి వానలుతగ్గి, ఎండగాచి జనజీవనము ప్రశాంతముగా వుంటుంది. ఈ సమయములోనే రకరకాల పుష్పజాతులు ఎక్కువగా పుష్పిస్తాయి.

ఈ సమయములోనే రైతులు పండిన పంటలను ఇంటికి తెచ్చుకొని గాదెలలో నింపుకుంటారు. స్త్రీలు, ఆవుపేడతో గొబ్బిళ్ళు యింటిముంగిట అలంకరిస్తారు. ఇటీవల 'ఆవుపేడ' వాతావరణకాలుష్యాన్ని నివారిస్తుందని శాస్త్రవేత్తలు కనుగొన్నారు. మధుర ప్రేమకు, భక్తికి సంకేతముగా గోదాదేవి ఈ మాసంలో వ్రతమాచరించి శ్రీరంగనాధుని పతిగా పొందినకాలము, ఈ మకర సంక్రమణ మాసము. దీనినే ధనుర్మాసముగా ఆలయాలలో జరుపుతారు. ఎక్కడచూచినా మంగళవాయిద్యాల ఘోష విన్పిస్తుంది. హరిదాసుల హరిస్మరణ వీనులవిందు చేస్తుంది. కలిమిని అందరితోకలిసి పంచుకొనడము ఈ పండుగలోని ప్రత్యేకత. ఒక విధముగా ఈ పండుగ ఒక ఆధ్యాత్మికసూత్రాన్ని కూడా మనకు అందిస్తుంది. సూర్యుడు నిష్కాముడు. సాటిజీవులనుండి ఏమీకోరక వెలుగును, వేడిని ప్రసాదిస్తాడు, తనధర్మాన్ని తూ.చ. తప్పక ఆచరిస్తాడు. జీవులు కూడా తమ ధర్మాన్ని తూ.చ. తప్పకుండా ఆచరించి, చేసే ప్రతిపనిని నిష్కామంగా చెయ్యడము అలవర్చుకోవాలి. దీనినే శ్రీసాయి, "విత్తులు మొలిచినందుకు సంతోషించవు. మాడితే దుఃఖించవు" అని చెప్పారు. ఈ పవిత్రదినములలో స్వర్గ ఉత్తరద్వారము తెరిచివుంటుందని శాస్త్రము. అందుకనే భారతయుద్ధంలో అంపశయ్యగతుడైన భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలమువచ్చిన తార్వాతనే దేహత్యాగం చేస్తాడు. జనసందోహంలో ఒక క్రాంతి, ఒకవెలుగు, కోలాటాలు, గొబ్బిళ్ళు, బొమ్మలకొలువులతో పదిమంది ఒకచోట చేరి ఆనందించే వేడుక సంక్రాంతి. సహాయము చేసినవారికి కృతజ్ఞతలు చెప్పడము జీవనధర్మము. ఈ పండుగకాలములో పశువులకు విశ్రాంతి వుంటుంది. పశువులను (ఎడ్లు, దున్నలు) అలంకరించి వాటిని పూజించటమూ కూడా ఈ పండుగలోని ఒక విశిష్టత, కలసిమెలసి జీవించటము, ఆనందముగా వుండగలగడము, ఉన్నంతలో ఇతరులకు సాయపడటము, కృతజ్ఞతాభావము కలిగివుండటము, సద్గురువును, దైవాన్నీ సేవించడము, ఈ సంక్రాంతిలో అంతర్లీనముగావున్న ధర్మోద్దేశము.

# ఆంగ్ల నూతన సంవత్సరాది–2012

దివ్యజనని అలివేలు మంగమ్మ



ఆంగ్ల నూతన సంవత్సరం ప్రవేశించబోతోంది. ఇది ఆంగ్లేయుల నూతన సంవత్సరమైనప్పటికీ మనం దీనిని చేసుకోవడానికి అలవాటుపడ్డాము గనుక చేసుకుంటున్నాము. అంతేగాక మనము మన తెలుగు సంవత్సరాలు, తిధులు గాక ఆంగ్ల తేదీలనే, సంవత్సరాలనే వాడుతున్నాముగూడ.

శ్రీ సాయిమాస్టర్ భక్తులందరికీ గడిచిన సంవత్సరం ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. కారణం గడిచిన సంవత్సరంలో మనము అతి విశిష్టమైన, అత్యంత ప్రధానమైన నిర్ణయాన్ని తీసుకోవడం జరిగింది. అదే- మన ప్రియతమ పూజ్యశ్రీ మాస్టరుగారి 75వ జన్మదిన సందర్భంగా కృతజ్ఞతామహోత్సవం జరుపుకోవాలనే సంకల్పం కలగడము, నిర్ణయించుకోవడమూ జరిగింది.



ఇంతటి శుభకరమైన విషయం మరొకటి ఏమున్నది?

పూజ్యశ్రీ మాస్టరుగారికి కృతజ్ఞత తెలుపుకోవడానికి మనం అనేక మార్గాలను ఇంతకు ముందే ప్రస్తావించుకున్నాము. అయితే మనం ఎంత చేసినా ఆయనకు కృతజ్ఞత తెలుపుకోవడానికి సరిపోదేమో! కనుక ఆయన మనకు చేసిన శ్రేయస్సుకు కృతజ్ఞతగా యింకా యింకా చేస్తూనే వుండాలి.

గురువుకు కృతజ్ఞతగా తను, మన, ధనాలను సంపూర్ణంగా సమర్పించుకోవాలని పెద్దలు చెబుతారు. అయితే ఈ సమర్పించుకోవడంలో తరతమ స్థాయిలుంటాయి. *పూర్తిగా సర్వసమర్పణ చేసుకోలేని స్థాయి మనది. అయితే మనం ఏమేమి ఎలా సమర్పించుకోవాలి? దీనికి కొలబద్ధ ఏమిటి? అన్నది ప్రశ్న.*

ఈ విషయంలో ఎవరికి వారే కొలబద్ధ. కారణం ఎవరి పరిస్థితులు, మనస్థితులూ వారివి. అందుకని ఎవరినీ ఎవరితోనూ పోల్చడానికి వీలులేదు. కారణం ఒకడు ఒకానొక పరిస్థితిలో పూర్తి ధ్యాస పెట్టలేకపోతున్నాడని అనుకుందాము. ఆ పరిస్థితిలో వుంటే మనమెలా వుండేవాళ్ళమో మన ఊహకు అందదు. ఒకవేళ ఇలా వుండేవాళ్ళము అని అనిపించినా నిజంగా ఆ పరిస్థితిలో వున్నప్పుడు మన ప్రతిస్పందన వేరుగా వుండవచ్చు. అందుకని ఎవరితో ఎవరినీ అంచనా వేయడానికి వీలులేదు. కనుక మన సమయాన్ననుసరించి మనం నిరంతరం ఆయన స్మరణ చేసుకోవడానికి ప్రయత్నించాలి. మనలోని బలహీనతలను తొలగించుకోవడానికి ప్రయత్నిస్తూ వుండాలి. ఇది నియమంగా పెట్టుకోవాలి.

గురువుకు తను, మన, ధనాలను సమర్పించుకోవాలని అనుకున్నాము.

ఇందులో మొదటిది తనువుతో, అంటే శరీరంతో చేయగలిగిన వాటిని చేయడం. శరీరంతో ఏ విధమైన సేవయైనా చేయవచ్చు. గురువు యొక్క సేవ, గురు సన్నిధిలోని సేవ మాత్రమే గాక, ఇతరులకు శరీరంతో

చేయగలిగిన ఎటువంటి సహాయమైనా చేయవచ్చు.

రెండవది మనస్సు. అంటే మనస్సును భగవంతునికర్పించడం. అంటే నిరంతరం మన మనస్సును ఆయన ధ్యాసలో వుండేలా చూసుకోవడం. ఏపని చేసినా అది భగవంతుని సేవగా భావించి చేయడము. తనకు ఏది లభించినా భగవంతుని ప్రసాదమని భావించడము, జీవితంలో సంభవించే కష్టనష్టాలను ఆయన మనకు శ్రేయస్సు చేకూర్చడానికే చేస్తున్నారని భావించడము– ఇలా అన్ని విషయాలలోనూ ఆయన పరంగా ఆలోచించడము అభ్యసించాలి.

మూడవది ధనము. మన పరిస్థితిని బట్టీ శక్తి కొలది ధనం గురువుకు సమర్పించుకోవడం. అంటే గురువుకు గానీ, గురుపరంగా జరిగే ఏ ఇతర కార్యక్రమాలకైనా ధనాన్ని సమర్పించుకోవడము. గురు సేవగా భావించి పేదలకు సహాయం చేయడము, కష్టాలలో వున్నవారిని ఆదుకోవడము గూడ గురువుకు సమర్పించుకోవడం క్రిందకే వస్తుంది.

కొందరు ఎంతో చేస్తూగూడ ఏమీ చేయలేదని అనుకుంటూ వుంటారు. మరి కొందరు ఏమీ చేయకుండాను కొద్దిగా చేసి గూడ ఎంతో చేసామని అనుకుంటూ వుంటారు. అలా ఎంతో చేస్తున్నామని అనుకునే వాళ్ళంతా ఏమి చేసినా తమ గొప్ప కోసం చేస్తున్నారన్నమాట. అందువలన అట్టి పని వారికి అహంకారం ప్రబలడానికి దోహదకారి అవుతుందే తప్ప ప్రయోజనమేమీ వుండదు. అంతేగాక అట్టి అహంకారం వల్ల తనకంటె ఎక్కువ చేసారని ఎవరినైనా అంటే అసూయ కలిగి, అది ద్వేషంగా మారే అవకాశం గూడ వున్నది.

ఇతరులకు ఏదైనా చేయాలనే ఆసక్తిగలవారు తాము చేస్తున్నామని అనుకోరు. ఇంకా ఎంత చేయగలమనే ఆలోచిస్తూవుంటారు. వారికి చేయాలనే ఆరాటం తప్ప ఎంత చేసామనే ఆలోచన వుండదు.

నిజంగా ఇది భగవంతుని గుణం. అవతార పురుషుల గుణం. భగవద్భక్తుల గుణం, సజ్జనుల గుణం, సాధు సత్పురుషుల గుణం, సద్గురువుల గుణం, అందుకే అట్టి వారిని ఆశ్రయించిన మనం వారి గుణాలను అలవరచుకోవాలి. అట్టివారి అనుగ్రహం పొందాలంటే అట్టి గుణాలను అలవరచుకోక తప్పదు గూడ.

అందుకని మన మనస్సును సరిగా వుంచుకోవాలి. మనస్సును సరిగా వుంచుకోవడానికి పూజ్యశ్రీ మాస్టరుగారు చెప్పిన వాటిని కొన్నింటిని స్మరించుకొందాము.

ముఖ్యంగా మనస్సును సరిగా వుంచుకోవడానికి అంటే మనస్సు సరియైన ఆలోచనలు చేయడానికి వివేకంతో ఆలోచించడమనేది అతి ప్రధానమైన అంశమని పూజ్యశ్రీ మాస్టరుగారు చెప్పారు. వివేకంతో ఎలా ఆలోచించుకోవాలో గూడ ఆయన అనేక విధాలుగా చెప్పివున్నారు.

అంతేగాక, రోజంతా బాబా ధ్యాసలో ఎలా గడపాలో గూడ ఆయన స్మరణ, మనన, ధ్యాన పద్ధతుల ద్వారా తెలిపారు. వీటిని ఆయన రచించిన ధ్యానయోగ సర్వస్వంలో చూడవచ్చు.

దానమెలా చేయాలో, అసలు ఏ పనైనా ఏ భావంతో చేస్తే ఎలాంటి ఫలితాలు వస్తాయో, సరియైన ఫలితాలు రావాలంటే కర్మనెలా చేయాలోగూడ ఆయన ఎన్నో ప్రవచనాల ద్వారా వివరించారు.

ఆయన తమ వద్దకు వచ్చిన వారితో గురు శిష్య సంబంధమువలెగాక సాధారణ తండ్రిలా తాపత్రయపడి హితవు బోధించారు. ఆయన మనకోసం, ఈ ప్రపంచం కోసం పడ్డ తాపత్రయానికి బదులుగా మనమేమి సమర్పించుకుంటే సరిపోతుంది?

ఇక్కడ శ్రీ గురుచరిత్రలోని 11వ అధ్యాయంలో పూజ్యశ్రీ మాస్టరుగారు 'ప్రస్తావన'లో వ్రాసిన దానిని ప్రస్తావించుకోవడం ఎంతో అవసరం:–

*"శ్రీ పాదస్వామి గాని, శ్రీ నృసింహ సరస్వతీ స్వామి గాని, తాము భగవదవతారములని లోకానికి చాటుకోలేదు. శ్రీ రాముడు గూడ 'ఆత్మానం మానుషం మన్యే', 'నేను మానవుడననే తలుస్తున్నాను' అన్నాడు. శ్రీ కృష్ణుడు తాము భగవదవతారమని అర్జునిడివంటి అంతరంగికులకు కొద్దిమందికి మాత్రమే చెప్పాడు గాని లోకానికి చాటలేదు. దీనినిబట్టి నిజమైన అవతార*

> *ఇతరులకు ఏదైనా చేయాలనే ఆసక్తిగలవారు తాము చేస్తున్నామని అనుకోరు. ఇంకా ఎంత చేయగలమనే ఆలోచిస్తూవుంటారు .... నిజంగా ఇది భగవంతుని గుణం. అవతార పురుషుల గుణం. భగవద్భక్తుల గుణం, సజ్జనుల గుణం, సాధు సత్పురుషుల గుణం, సద్గురువుల గుణం, అందుకే అట్టి వారిని ఆశ్రయించిన మనం వారి గుణాలను అలవరచుకోవాలి.*

> ఆయన అవతార పురుషుడనడానికి ఈనాటి సాయి ప్రభంజనమే తార్కాణము. ఆయన గూర్చి మహాత్ములు చెప్పిన వాక్యాలే ప్రమాణము.

పురుషుడు తన నిజతత్త్వాన్ని లోకానికి చాటుకోడని తెలియాలి. వేదవ్యాసులవంటి సత్యద్రష్టలు కొద్దిమంది మాత్రమే ఈ రహస్యాన్ని గుర్తించి లోకానికి తెలియబరచారు.

ఈ అవతార మూర్తులందరూ తమ నిజమైన విశ్వరూపాన్ని అంతరంగికులకు ప్రసాదించి అనుభవపూర్వకంగా తమ దైవత్వాన్ని నిరూపించారు. అలాగాక పౌండరీక వాసుదేవుని వంటి కీర్తికాములు మాత్రమే తాము అవతార పురుషులమని లోకాన్ని నమ్మింపజూచారు.

అవతార పురుషులందరూ సద్గురువులనాశ్రయించి సత్సాంప్రదాయాన్ని పాటించారేగాని, తమకట్టి ఆలంబనలు అనవసరమని, తాము సర్వధర్మాలకూ అతీతులమనీ చెప్పి స్వేచ్ఛాచారులు గాలేదు.

అవతార పురుషులందరిలాగే వీరిద్దరూ తాము జన్మత: పరిపూర్ణులైనప్పటికీ వినమ్రులైన సాధకులవలెనే ప్రవర్తించారు గాని, సిద్ధులమని విఱ్ఱవీగలేదు.

వీరు దివ్య లీలలను ప్రదర్శించినప్పటికీ అవి ఆర్తులను రక్షించేవిగాను, అర్థార్థులను పోషించేవిగాను, నిర్దుష్టమైన ఆధ్యాత్మ భావనను భక్తులకు ప్రసాదించి, వారిని మోక్షోన్ముఖులుగా చేసేవిగా మాత్రమే వున్నాయి. కేవలం తమ శక్తి సామర్థ్యాలతో లోకులకు సంభ్రమాశ్చర్యాలలో ముంచి తమకు కీర్తిని చేకూర్చే సాధనాలైన చిల్లర చమత్కారాలు వారెన్నడూ ప్రదర్శించలేదు".

పూజ్యశ్రీ మాస్టరుగారు వ్రాసిన పై విషయాలన్నీ ఆయనకు అక్షరాలా సరిపోతాయని ఆలోచిస్తే మనకర్థమవుతుంది. ఆయన గూడ సాధకునిగా సాధన చేసారు. సాధారణ గృహస్థుగా మెలగి అందులోని కష్టనష్టాలను ఎలా ఎదుర్కోవాలో మనకు తెలియజేసారు. ఆయన అవతార పురుషుడనడానికి ఈనాటి సాయి ప్రభంజనమే తార్కాణము. ఆయన గూర్చి మహాత్ములు చెప్పిన వాక్యాలే ప్రమాణము.

ఆయనకేమీ అవసరం లేకపోయినా మనకోసం ఆదర్శ జీవితాన్ని గడిపారు. అందుకని మనం ఆయన జీవితాన్ని నిశితంగా గమనిస్తూ అట్టి జీవితాన్ని గడపడానికి ప్రయత్నించాలి. అప్పుడు అడగడుగునా ఆయన మన వెంట వుండి మనలను సరియైన మార్గాన నడిపిస్తారు. అంతకంటే మనకు కావలసినది ఏమున్నది? ఇంతకుమించి మననుంచి ఆయన ఆశించేదేమున్నది?

'కృతజ్ఞతకు మరోపేరు సాయి' అని పూజ్యశ్రీ మాస్టరుగారన్నారు. అలాగే కృతజ్ఞతకు మరోపేరు పూజ్యశ్రీ మాస్టరుగారు గూడా. శ్రీ సాయినాథుడు తమకు ప్రసాదించిన ఆధ్యాత్మికానుభవానికి కృతజ్ఞతగా ఆయన తమ జీవితాన్నే సాయి సేవకు అంకితం చేసారు.

పూజ్యశ్రీ మాస్టరుగారు చేసినట్టు మనం గూడ సేవ చేసి ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి. దయ, సహనము, పరోపకారము, సద్గ్రంథ పఠనము, శ్రవణ, మనన, నిధి ధ్యాసనము, సత్సంగము, భజన, సద్గురు సమాగమము, మహాత్ముల దర్శనము సాధ్యమైనంతవరకూ వీటన్నింటినీ చేయడానికి ప్రయత్నించాలి.

ఇంతకూ మనం ముఖ్యంగా తెలుసుకోవలసినది ఒక్కటే. ఇలాగే ఎన్నో నూతన సంవత్సరాలు వస్తుంటాయి, పోతుంటాయి. ఎన్నో లెక్కకుమీరిన జీవులు లాగే పుడుతూ, గిడుతూ వుంటాయి. అలాగే మనమూను. మన పెద్దలు చెప్పిన ప్రకారమయితే ఇప్పటికి మనం ఎన్ని జన్మలెత్తి వుంటామో, ఇలాగే ఎన్ని నూతన సంవత్సరాలు జరుపుకున్నామో! కానీ ఇప్పుడు మనమెత్తిన జన్మకొక ప్రత్యేకత వున్నది. అదే పూజ్యశ్రీ మాస్టరుగారు మనకు గురువుగా లభించడం. మన జీవితాలను సార్థకం చేసుకోవడానికి ఆయన చెప్పినటువంటి సులభతరమైన సూత్రాలను మరెవరూ వివరించి వుండలేదేమో! అందుకే ఇట్టి అమూల్య అవకాశాన్ని మనం జారవిడుచుకోకూడదు. అలా జారవిడుచుకుంటే మనంతటి వివేకహీనులు మరొకరు వుండరేమో! మన జన్మజన్మలన్నింటిలోనూ ఆయన వెంట మనముండాలన్నా, మన వెంట ఆయన వుండాలనుకున్నా ఆయన చెప్పిన విధంగా, తమ గురువు చెప్పినట్లు ఆయన చేసిన విధంగా మనమూ శక్తి వంచన లేకుండా కృషి చేయవలసిన అవసరమున్నది. కనుక ఈ నూత్న సంవత్సరంలో ఆయన చెప్పిన విధంగా నడుచుకోడానికి ప్రయత్నిద్దాము. లౌకికంగా కృతజ్ఞతా మహోత్సవము మహావైభవంగా జరుపుకున్నప్పటికీ, అంతరంగికంగా జరుపుకోవలసిన కృతజ్ఞతా మహోత్సవం మాత్రం ఇదే!

---

# గంగా యమున సంగమము

జనవరి 2012

కలకత్తాలోని సిమ్లాయను పేటలో విశ్వనాధదత్తా, భువనేశ్వరిదేవి అను పుణ్య దంపతులకు పుష్యబహుళ సప్తమినాడు జన్మించిన జాతిరత్నము నరేంద్రుడు. చిన్నతనమునుంచి పారమార్థిక చింతనపై ప్రీతి. కళాశాలలో చదివే రోజులలో బ్రహ్మ సమాజం నాయకులతో సాహచర్యం ఏర్పడింది. "మీరు నాకు దేవుని చూపగలరా?" అన్నదే అతని ప్రశ్న. కారణజన్ముడైన వివేకానందుని అన్వేషణ సద్గురువు దర్శనముతో ఫలించినది. "అవును నాయనా, నిన్నుచూచునట్లే దేవుని చూస్తున్నాను! మాట్లాడుతున్నాను!! కాని భగవంతునికై పరితపించువారెవరు? నిజముగా పరితపించిన కనపడకయుండునా!" అన్నారు. లోకులు పిచ్చివాడు అనుకొన్న ఆ అవతారపురుషుడే శ్రీ రామకృష్ణ పరమహంస. లేగదూడ తల్లియొద్దకు చేరినట్లు రామకృష్ణుని దర్శనముతో అన్వేషణ ఫలించి, ఆత్మసిద్ధి పొందిన నరేంద్రుడే, శ్రీ స్వామి వివేకానంద.

తండ్రి దివంగతుడైనాడు. ఇంట్లో పస్తుంటున్నారు. దారిద్రబాధనుండి తనను తప్పించవలసినదిగా శ్రీ వివేకానందుడు శ్రీ రామకృష్ణుని కోరినాడు. పరమహంస కాళికాలయములోనికి వెళ్ళి జగజ్జననినే అడగమనిపంపారు. నరేంద్రుడు ముమ్మారు జగన్మాత వద్దకు వెళ్ళినా, అడగవలసినది మరచి, "తల్లీ! నిర్మల జ్ఞానభక్తి వైరాగ్యములు ప్రసాదింపుము" అని కోరినాడు. వెలువలికి వచ్చి పరమహంసను కలుసుకున్నాడు. పరమహంస దారిద్ర్యమును బాపుమని మాతను కోరితివా అని అడుగగా? భూమండలాధిపతి కడకేగి కూరగాయలు అడిగినట్లు, జగజ్జననీయొద్దకేగి ఐహికభోగములు కోరడమా?" అన్నాడు నరేంద్రుడు. కొలదికాలములోనే కాషాయాంబరములు ధరించినాడు. వివేకానందుడుగా రూపొందినాడు. శ్రీ పరమహంస తనపాద తాడనముతోనే శిష్యునికి ఆత్మానుభూతి కలిగించినారు. రామకృష్ణ పరమహంస తన దివ్యశక్తినంతటిని వివేకానందునికి ధారపోసినారు. ఈ విషయమై పరమహంస, "నాకున్నదంతా యిచ్చి నేను ఫకీరునైతిగదోయి!" అని అన్నారు.

అది 1893వ సంవత్సరము. షికాగో నగరములో ప్రపంచ మత మహాసభ వేదిక, ఉపన్యాసకర్త 30 సంవత్సరాల యువకుడైన వివేకానందుడు, గంభీర కంఠధ్వని. సనాతన ధర్మముయొక్క విశిష్టతను చాటిచెప్పుట అతని లక్ష్యము. వివేకానందుని నోటివెంట ప్రేమభావనతో చేసిన సంబోధన, "అమెరికా సోదర సోదరీమణులారా!" అని. వెంటనే నిశ్శబ్దముగానున్న ఆ సభాసాగరమునుండి, కరతాళ ధ్వనులు మిన్నుముట్టినాయి. ఆ మహాసభలో స్వామి చాలా విషయాలను బోధించారు. "వివిధ ప్రదేశములలో పుట్టిన నదులు సముద్రములో సంగమించునట్లే, వివిధ భావములతో మనుష్యులవలంబించు, వివిధ ఆరాధన మార్గములు సవ్యముగా కన్పించినను, అపసవ్యముగా కన్పించినను సర్వేశ్వరా! నిన్నే చేరుచున్నవి." విదేశాలలో విజయదుందుభి మోగించి మాతృదేశంలో అడుగుపెట్టారు. ఆసేతు హిమాచలము పర్యటించి భారత జాతిని ఉప్పొంగింపచేశారు, స్వామి వివేకానంద.

ఈ జయంతి సందర్భముగా వారి బోధలను కొన్ని మననము చేసుకుందాము.

*సాంఘిక వ్యవస్థగాని, నాగరికతకాని, ధర్మము మీద లేదా మనుష్యుల సత్ప్రవర్తనమీద ఆధారపడి వుంటుంది.*

*ఈ విశ్వములోని ప్రతి అణువునుగూర్చి తెలుసుకున్నా నీకు ఆనందం లభించదు. నిన్ను నీవు జయించుకొన్నప్పుడు మాత్రమే నీకు ఆనందం కలుగుతుంది.*

*అస్పృశ్యత అనేది ఒక మానసికమైన జబ్బు. ప్రేమద్వారా అందరిని నీలో కలుపుకో.*

*శక్తియే జీవనము, సంకుచితమంతా మరణము.*

*నిరుపేదల కష్టాలుచూచి వలవల ఏడ్చేవాడే గొప్పవాడు. లేనిచో వాడు చెడ్డవాడే. భారతదేశంలో ఒక కుక్కయైన క్షుద్బాధతో బాధపడకుండా నుండనంతవరకు మరలా మరలా జన్మించి సమాజ శ్రేయస్సుకు శ్రమిస్తాను గాని స్వీయముక్తిని కోరను.*

స్వామి వివేకానంద జయంతి సందర్భంగా వారి పాద పద్మములకు శతకోటి నమస్సుమాంజలులు.

# సిద్ధపురుషుడు ప్రసాదించిన వైకుంఠ ప్రసాదం

కోటంరాజు జానకిరామ్, గుంటూరు



'సాయిబాబా' పత్రిక ప్రారంభ సంచికనుండి మా యింటికి వస్తూనే వుంది. వచ్చీ రాగానే, నేను ఆత్రంగా ముందు ద్వారకామాయి అనుభవమంటపము చదవటం ఒక అలవాటుగా మారిపోయింది. ఇప్పటివరకు జీవితంలో జరిగిన అనుభవాలు నన్ను అప్పుడప్పుడు ఆనంద సాగరంలో ముంచివేస్తుంటాయి.

అవి 9-7-1989కు ముందురోజులు. నా వివాహము కొద్దిరోజులు ముందుగా, నా మేనత్తగారి భర్త భట్టిప్రోలు రాధాకృష్ణమూర్తిగారు వచ్చి నేను శ్రీ రంగన్నబాబుగారిని చూడడానికి వెళుతున్నాను. నీవుకూడా రావలసినది అని వత్తిడి చేశారు. సరే అని చెరొక సైకిలు తీసుకొని గుంటూరు తవుడుకోట్ల బజారు దగ్గర బాబుగారు వచ్చి విశ్రాంతి తీసుకొను గృహానికి సరిగ్గా ఉదయం 10గం॥కు చేరాము. తర్వాత ఆ గృహ యజమానురాలిని బాబుగారు ఎప్పుడు వస్తారని మావయ్య అడిగారు. వారు వచ్చే సమయం అయింది అని ఆమె చెప్పింది. మేము వారు వస్తారని 10గం॥ల 45 ని॥ వరకు నిరీక్షించటం జరిగింది. నేను యిక ఉపేక్షించలేక "మనం 11 గం॥లకు ఇంటికి వెళ్లిపోదాము" అని మావయ్యతో అన్నాను. సరే అని మావయ్య నా మాట కాదనలేక 5ని॥లు తక్కువ 11గం॥లకు అక్కడ నుండి బయలుదేరి సందు మలుపు తిరిగాము. వెంటనే మావయ్య సైకిలుదిగి "అరుగో బాబుగారు" అని నమస్కారం చేశారు. నేను అనుసరించి నమస్కారం చేశాను. కానీ నేను మనసులో "ఈయన సామాన్యమైన మనిషి, పైన చొక్కాలేదు, మావయ్య ఈయనకు నమస్కారం చేస్తున్నారు" అనుకోవటం జరిగింది. ఆ తర్వాత వారితోపాటు వారు విశ్రాంతి తీసుకొను గృహానికి అందరం కలిసివెళ్ళాము. ఆ యింటివారు మంచముపై మంచి దుప్పటి పరచి, మంచినీళ్ళు అవీ పెట్టివుంచారు. బాబుగారు మంచముమీద ఆసీనులయి మంచి చుట్ట ఒకటి చుట్టుకొని కాల్చుకున్నారు. ఆ తర్వాత మావయ్యగారి పెద్ద అబ్బాయి (శ్రీ బి.హెచ్. శివకుమార్, హైద్రాబాద్‌లో పనిచేస్తున్నారు)ని, తర్వాత నన్ను ఎవరు అని బంధువులందరి క్షేమ సమాచారములు తెలుసుకున్నారు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఈయనకు ఇంతమంది పేర్లు ఎలా గుర్తున్నాయి అని విస్తుపోయాను.

తర్వాత బాబుగారు ఆ యింటి ఆవిడకు కొంత డబ్బు యిచ్చి లెక్కచెప్పమన్నారు. ఆవిడ లోగడ ఎంత యిచ్చింది, ఇప్పటి సొమ్ము లెక్క బాబుగారికి చెప్పారు. ఆ సమయంలోనే మావయ్య రూ10॥లు సమర్పించుకొన్నారు. తర్వాత బాబుగారు వారి దగ్గరయున్న సంచిలోంచి నిండుగావున్న వేరుశనగకాయలు, మరమరాలు, శనగపప్పు మాకు యివ్వాలని చేతులు పట్టమన్నారు. మావయ్య యింటి యజమానురాలిని అడిగి రెండు కాగితం కవర్లు తీసుకున్నారు. చెరొక కవర్లో వారు మాకు పెట్టింది సద్దుకున్నాము. కాని విచిత్రమేమంటే అవి ఎంత వేడిగా వున్నాయంటే చేతులతో పట్టుకోలేము. ఇక్కడ ఒక విషయం మరిచాను. ఈ సంచి బాబుగారి వద్ద మొదట మేముచూచిన దగ్గరనుండి వారి వద్ద వుంది. నేను వారి బట్టలసంచి ఏమో అనుకొన్నాను. మొత్తానికి పావుకిలో, పావుకిలోవున్న ఆ రెండు కవర్లు పాక్ చేసి నా దగ్గరే పెట్టుకున్నాను. తర్వాత బాబుగారు లేచారు. ఆ సంచిని తీసుకొని వారివెంట అక్కడవున్న కొంతమంది భక్తులు వారిని అనుసరించారు. ఆయన బయటకు రాగానే ఆ వీధి పిల్లలందరు "తాతయ్య మాకు, మాకు" అని చుట్టూ మూగారు. వారు నడుచుకుంటూ పిల్లలందరికి పెడ్తూ వీధి చివరికి వెళ్ళారు. అక్కడ సంచిని దులిపి వీధి చివరనేయున్న బైండింగ్ వర్కుషాపులోనికి వెళ్ళి డబ్బులు వారు అడగడమో వారికి షాపువారు యివ్వడమో జరిగింది. తర్వాత బాబుగారితో సహా అందరం విశ్రాంతి గృహానికి వచ్చాము. అక్కడ బాబుగారు కోదండరామస్వామిని గూర్చి

కొన్ని విషయాలు చెప్పారు. తర్వాత మావయ్య, బాబుగారిని ప్రసాదం అడిగారు. వారు ఎందుకు అడిగారంటే, హైదరాబాదులోవున్న మీ బావగారికోసం అని చెప్పారు నాతో తర్వాత.

వెంటనే బాబుగారు మైసూరుపాకుముక్క మా ఇద్దరికి పంచియిచ్చారు. దానిని తీసుకొని ఇద్దరం నమస్కరించి వారివద్ద సెలవు తీసుకొని గృహోన్ముఖులయ్యాము. నా దగ్గరయున్న రెండు కవరు ప్యాకులను ఇంటికి వచ్చిన తర్వాతగాని మావయ్యకు అందజేయలేదు నేను. ఇంకొక విషయం, వీధిలో బాబుగారు పంచుతున్నప్పుడు గూడా వాటిని నేను వదలలేదు. తర్వాత మా కుటుంబ సభ్యులందరూ మా ఇద్దరికోసం భోజనాలకై సామూహికంగా ఎదురుచూస్తున్నారు. సరే అందరం కూర్చుని నా కవర్లలోయున్న వేరుశనగకాయలు వగైరా అందరికి పంచమని మా అమ్మగార్కి చెప్పారు. వారు ఆ విధంగా అందరికీ పెట్టారు. ఈ లోపల మావయ్య తన పొట్లం తీసుకొని హైదరాబాద్ వెళ్ళటానికి సూట్‌కేసు సద్దుతూ వాటిని ప్లాస్టిక్ కవరులోకి మార్చటానికి ఊడతీసి ఒక్క అరుపు అరిచారు. "ఏమిటిరా? దీనిలో అటుకులు వున్నాయని," నేనూ మా కుటుంబసభ్యులు అందరం ఆశ్చర్యపోయాము. ఒక ప్రక్క వేరుశనగకాయలు, మరమరాలు, శనగపప్పు తింటున్నారు కుటుంబ సభ్యులు; మరొక ప్రక్క మావయ్య పొట్లంలో అటుకులు. ఎంత విచిత్రమో చూడండి. అప్పుడు ఇంక మావయ్యకు, నాకు పోట్లాట ప్రారంభమయింది.

ఆయన "ఏరా? దారిలో ఏమైన మార్చావా?" అని. దానికి సమాధానంగా నేను "వారు యిచ్చినప్పటినుండి నేను వాటిని వదలకుండా చేతిలోనే ఉంచుకున్నానుకదండి"-అని నేను అనటం జరిగింది. దానికి మావయ్య నన్ను "ఏదో లోపంజేసావురా! నిజం దాచకుండాచెప్పరా!" అని అన్నారు. నేను విచారంగా బాబుగారు యిచ్చిన మైసూరుపాకు దారిలో పారేశాను అన్నాను. దానికి మావయ్య ఎంతపని చేశావురా అని చీరాలలో బాబుగారితో జరిగిన సంఘటనలు చాలా చెప్పారు. వారు ఒకేసారి కొంతమంది యిండ్లలో భోజనం చేయటం ప్రధానంగా విన్నాను. శ్రీ భరద్వాజ మాస్టరుగారు వ్రాసిన 'శ్రీ గురుచరిత్ర' గ్రంథంలో, శ్రీ నృసింహసరస్వతి స్వామి 8 మంది భక్తులయింట ఒకేసారి భిక్షగావించటంతో పోలివుంది యీ లీల. తర్వాత బాబుగారు రెండు, మూడు పర్యాయములు మా యింటికి వచ్చి భిక్ష కావించటం జరిగింది. ఆ సమయంలోనే యదార్ధ సంఘటన ఒకటి జరిగింది. ఒకరోజు బాబుగారు వచ్చి భిక్ష తర్వాత, గదిలో విశ్రాంతి తీసుకుంటూ మా అమ్మగారితో "అమ్మా యీ రోజు మీకు దైవప్రసాదం యిస్తాను" అన్నారు. సరిగ్గా 1గం॥కు బయటకు వచ్చారు. నేను, నా సోదరుడు త్రివిక్రమరావు వారితో వున్నాము. బాబుగారు "ప్రసాదం" అనగానే అందరం(ముగ్గురు) బయటకు వచ్చాము వారితో. నా సోదరుడు "మీ వద్దనే వుంది ఆ ప్రసాదం" అని అన్నాడు. దానికి ఆయన తన పంచ ఊడతీసి దులిపి చూపారు. సరే అని, నవ్వులతో ఆ కార్యక్రమం ముగిసింది. బాబుగారు ఆకాశంవంక చూస్తూ అమ్మా "అదిగో వైకుంఠం, శ్రీ మహావిష్ణువుకు ఋషులు వేదమంత్రాలు చదువుతున్నారు. నారద తుంబురులు గానం చేస్తున్నారు." అంటూ ఆకాశంలోకి రెండుచేతులతో నమస్కారంచేసి క్రిందకుదించారు. చేతిలో ఒక పండు వుంది. ఇదిగో వైకుంఠ ప్రసాదం అని అన్నారు. పొడవాటి కిస్‌మిస్‌లు, 7 మాత్రమే వున్నాయి. మా కుటుంబ సభ్యులసంఖ్య 7గురికి మాత్రమే ఒకటి చొ॥న తీసుకోమన్నారు. ఆ రకమైన కిస్‌మిస్‌లు యింతవరకు మార్కెట్‌లోనే చూడలేదు. దొరకవు. ఈ విధంగా ఒక సిద్ధపురుషుని మనసార దర్శించుకొనే భాగ్యం నా జన్మకు కలగటం చాలా అదృష్టం అని నేను అనుకొన్నాను. తర్వాత శ్రీ పూర్ణానంద స్వామిజీగారు కూడా వచ్చి మా గృహాన్ని పావనం చేయటం జరిగింది. ఈ నెల 5వతేది (సెప్టెంబరు) మా యింటికి శ్రీ పూర్ణానందస్వామిజీ శిష్యులుకూడా వచ్చారు. అది ఏవిధంగా జరిగిందంటే, శ్రీ భరద్వాజ మాస్టరుగారి సంతకంతోవున్న గురుచరిత్ర గ్రంథం. శ్రీ శేషగిరిరావుగారు వచ్చి ఎవరైనా సాధువులు వస్తారు అని పారాయణ చేయొచ్చు. 21 రోజులు మళ్ళీ చేయమన్నారు. ఆదే విధంగా చేస్తే 5వతేదీన యతీశ్వరుల దర్శనం జరగటం యీ జన్మ అదృష్టంగా భావిస్తున్నాను. బాబా యీ విధంగా తన లీలలు చూపిస్తుంటారని నేను విశ్వసిస్తాను.

# హంస పుత్రుని దివ్య వైభవం

పాదరేణువు



మానవజాతి ఉద్ధరణకై దైవం తన ప్రతిరూపంగా మహాత్ములను మనకు అందిస్తారు. వారు తమ ఆచరణ ద్వారా దైవాన్ని ఎట్లా చేరుకోవాలో మనకు నేర్పించుటకై అనేక సాధనలు చేస్తూ మనకు మార్గదర్శకమవుతారు. అట్టివారిలో శ్రీ రామకృష్ణులు అగ్రగణ్యులు. అనేక సాంప్రదాయాల సాధనలను అనుష్టించి దైవ సాక్షాత్కారం పొంది శ్రీ రామకృష్ణులు పరమహంస అయినారు. వారికి జగజ్జనని నిత్య సాక్షాత్కారం వుండేది.

ఆయన తన అవతారకార్యం లక్ష్యసిద్ధికై తన ప్రియ శిష్యులను తానే ఎన్నుకొనేవారు. అందుకొరకై ఆయన ఒకరోజు జగన్మాత కాళికాదేవిని మన:పూర్వకంగా ఈ విధంగా ప్రార్థించారు. "తల్లీ! భగవంతుని యందు తీవ్ర ప్రేమగల ఒక బాలుడు నాతో నివసించాలని నా కోరిక! అటువంటి బాలుణ్ణి అనుగ్రహించు తల్లీ!" కొన్ని రోజులు తరువాత ఓ వట వృక్షం క్రింద కూర్చొని ఒక దృశ్యంలో ఆయన ఒక బాలుని దర్శించారు.

శ్రీ రామకృష్ణులింకొక దృశ్యం గాంచారు : అమ్మ(కాళికామాత) ఆయన ఒడిలో ఒక బిడ్డనుంచి - "ఇతడు నీ పుత్రుడు" అన్నది. ఆశ్చర్యంతో "అమ్మా! ఇదేమిటి? నాకు గూడా పుత్రుడు కలగటమా?" అని అడిగారు. అపుడామె మందహాసంతో అతడు ఆయనకు ఆధ్యాత్మిక పుత్రుడు కాగలడని వివరించింది. ఈ దృశ్యం చూచిన కొద్దిరోజులకే "రాఖాల్" రావటం, అతడిని చూడగానే దివ్యజనని అనుగ్రహించిన పుత్రుడతనేనని గుర్తించటం జరిగింది.

శ్రీ రామకృష్ణులు 1881వ సంవత్సరం మధ్యకాలంలో మరొక దృశ్యం గాంచారు. గంగానదిలో పూర్తిగా వికసించిన కమలంలో యిరువురు బాలురు నృత్యం చేస్తున్నారు. వారిలో ఒకరు శ్రీ కృష్ణుడు. ఇంకొకరు యింతకు ముందు జగన్మాత తన ఒడిలో వుంచిన బాలుడే!

రాఖాల్ చంద్రఘోష్ 1863 జనవరి 21వ తేదీ మంగళవారం నాడు శిక్రాకులిన్‌గ్రాం అనే గ్రామంలో జన్మించారు. రాఖాల్ తల్లి కైలాష్ కామిని, శ్రీ కృష్ణ భక్తురాలు. తన కుమారునకందుకనే 'రాఖాల్' (కృష్ణ సఖుడైన గొపబాలుడు అని అర్థం) అని నామకరణం చేసింది.

రాఖాల్ చాలా సుందరమైన, శక్తివంతుడైన బాలుడు. క్రీడలలోనూ, తోటల పెంపకంలోనూ, చేపల పెంపకంలోనూ అతను దిట్ట. భక్తి గీతాలపన అంటే అతడికెంతో ఇష్టం. బాల్యంలోనే, కాళి ఆలయంలో ధ్యాన సాధన చేసేవాడు. దుర్గాపూజ సమయంలో పూజారి వెనుకనే కూర్చొని యోగివలె ధ్యానం చేసేవాడు. బాల్యం



నుండే రాఖాల్ పరమ సాత్వికుడేగాక, ఆధ్యాత్మిక తత్పరుడుగూడా!

భక్తి ధ్యాన తత్పరత రాఖాల్‌కి సహజంగా వచ్చిన గుణాలు. క్రమక్రమంగా లౌకిక విషయాల యెడల అనాసక్తి కనబరచేవాడు. రాఖాల్‌యొక్క ఆధ్యాత్మిక తత్పరత గమనించి, అతని తండ్రి తన పుత్రుని మనస్సు మార్చటానికి రాఖాల్‌కి వివాహం ఏర్పాటు చేశాడు. తండ్రి నిర్ణయాన్ని రాఖాల్ శిరసావహించాడు.

రాఖాల్ బావమరిదే అతణ్ణి 1881 జూన్ జులైలో శ్రీ రామకృష్ణుల వద్దకు తీసుకు వెళ్లాడు. రాఖాల్‌ను చూడగానే శ్రీ రామకృష్ణులు పక్కనే వున్న మన్‌మోహన్ మిత్రాతో చిరుమందహాసంతో "అతడు పరమ యోగ్యుడు" అన్నారు.

రాఖాల్ మొదట్లో అప్పుడప్పుడూ శ్రీ రామకృష్ణులను సందర్శించేవాడు. ఆ తర్వాత దక్షిణేశ్వరంలోనే ఉండసాగాడు. ఆ తర్వాత శ్రీ రామకృష్ణులు ఈ విధంగా తెలిపారు : "రాఖాల్ భార్యవైపు కుటుంబ స్త్రీలు తరచూ యిక్కడికి వస్తూండేవారు కనుక రాఖాల్ గురించి వారికి యే అభ్యంతరమూ లేదు. మొదటిసారి రాఖాల్ యిక్కడికి వచ్చిన వెంటనే అతడి అత్తగారు, అతడి భార్య విశ్వేశ్వరిని గూడా తీసుకు వచ్చింది. రాఖాల్ భగవద్భక్తికి ఆమె ఏమైనా అంతరాయం అవుతుందేమోనని పరిశీలించాను కాని ఆమెను దివ్యశక్తియొక్క పవిత్ర తత్వపు ప్రతినిధిగా గ్రహించాను. కబురు చేసి, ఒక రూపాయి ఇచ్చి "విశ్వేశ్వరి మేలిముసుగు తొలగించమని సహబత్(శారదాదేవి)కి కబురుచేశాను". (అత్తగారు కోడలికి స్వాగతం పలికే సాంప్రదాయం యిది. శ్రీ రామకృష్ణ, శారదామాతల ఆధ్యాత్మిక పుత్రుడు రాఖాల్ గనుక విశ్వేశ్వరి వారి కోడలయింది).

నిజమైన గురువు ప్రేమమయి అయిన తల్లి – శిక్షణనిచ్చే తండ్రిగా రెండు పాత్రలు ధరిస్తాడు. శిష్య శిక్షణ కోసం అవసరమైతే దండిస్తాడు. ఒకరోజు రాఖాల్ దేవాలయ ప్రసాదం వెన్నను శ్రీ రామకృష్ణుల కోసం వేచివుండకుండా తిన్నాడు, "నువ్వెంత ఆశాపరుడివి! ఇక్కడ వుంటున్నందుకు, నిన్ను నువ్వు స్వాధీనంలో ఉంచుకొనటం నేర్చుకోవాలి, అన్నారు" భయంతో కుచించుకుపోయిన రాఖాల్ ఆ తరువాత ఎన్నడూ అటువంటి తప్పిదం చేయలేదు.

ఒకసారి రాఖాల్‌కి వీధిలో ఒక చిల్లర నాణెం కనిపించింది. అతడు దానిని తీసి దయతో ఒక బిచ్చగానికిచ్చాడు. పసి బిడ్డ తన తల్లికి అన్ని విషయాలూ తెలియజేసే విధంగా శ్రీ రామకృష్ణులకు అన్ని విషయాలూ తెలియజేయటం రాఖాల్ స్వభావం.

రాఖాల్ చెప్పినది వినగానే శ్రీ రామకృష్ణులు ఈ విధంగా చివాట్లు పెట్టారు. "చేపలు తినని వ్యక్తి చేపల బజారుకి ఎందుకెళతాడు? ధనమే అవసరంలేని వాడివయితే ఆ నాణాన్నెందుకు తీసుకుంటావు?" ఎంత అద్భుతమైన తర్కం! తన ఆధ్యాత్మిక పుత్రుడు – ఆధ్యాత్మిక జీవనానికి తీవ్ర అంతరాలయిన కామినీకాంచనాల నుండి పూర్తిగా విముక్తుడవ్వాలని శ్రీ రామకృష్ణులు ఆకాంక్షించారు.

రాఖాల్, ఒక వ్యాయామశాలలో నరేంద్రనాథ్ దత్తాను (వివేకానంద స్వామి) కలుసుకున్నాడు. వారిద్దరూ సమానవయస్కులవటం వలననూ, ఒకే విధమైన ధార్మిక భావాలు కల్గివుండుటవలననూ, కొద్దికాలంలో వారిద్దరూ మంచి స్నేహితులయ్యారు.

ఒకసారి శ్రీ రామకృష్ణులు ఈ విధంగా అన్నారు, " రాఖాల్‌కు మహారాజుకు ఉండవలసిన సునిశిత మేధాశక్తి, తెలివి ఉన్నవి. కావాలనుకుంటే అతడు రాజ్యాన్ని ఏలగలడు". గురుదేవులు తన శిష్యుల భావినాయకునిగా రాఖాల్‌నే ఎంచుకున్నారని నరేంద్రుడు అర్థం చేసికొని సోదర శిష్యులతో ఈ విధంగా అన్నాడు. "ఇక నుంచి రాఖాల్ మన రాజు. అతణ్ణి రాజా అని పిలుద్దాం".

1886 అగస్టు 16వ తేదిన శ్రీ రామకృష్ణులు మహాసమాధి నొందిన తరువాత శిష్యులందరూ తీవ్రశోకంలో మునిగిపోయారు. నరేంద్రుని మార్గ దర్శకత్వంవల్లా 1887 జనవరి నెల మూడవవారంలో విరజాహోమం ఆచరించి సన్యాసం స్వీకరించారు. రాఖాల్, "స్వామి బ్రహ్మానంద" అయినారు. తరువాత స్వామి బ్రహ్మానంద తీవ్ర తపస్సాధనలు, తీర్థయాత్రలు చేశారు.

ఈ సాధనా సమయంలో వివేకానంద స్వామి అమెరికాలో జరిగిన విశ్వమత మహాసభలో (1893 సెప్టెంబరు) సాధించిన దిగ్విజయం గురించి బ్రహ్మానంద స్వామి విన్నారు. సోదర శిష్యులందరూ కలసి ఒక బృందంగా శ్రీ రామకృష్ణ సందేశ వ్యాప్తికి కృషి చేయాలని వివేకానందస్వామి అందరికీ విన్నపం చేశారు.

పాశ్చాత్య దేశాల నుండి తిరిగి వచ్చిన వివేకానంద స్వామి 1897 ఫిబ్రవరి 19వ తేదీన కలకత్తా

చేరారు. వివేకానంద స్వామిని బ్రహ్మానంద స్వామి పుష్పమాలాంకృతలను చేశారు. వివేకానంద స్వామి గౌరవ పూర్వకంగా బ్రహ్మానందునికి వంగి నమస్కారం చేస్తూ "గురువత్ గురుపుత్రేషు – గురు పుత్రుణ్ణి గురువులాగానే గౌరవించాలి" అన్నారు. వెంటనే బ్రహ్మానందస్వామి తాను గూడా వంగి వందనం చేస్తూ "జ్యేష్ఠభ్రాతా పితృసమ:" పెద్ద అన్నయ్య తండ్రి వంటివాడు అన్నారు. అప్పుడు వివేకానంద స్వామి తాను విదేశాల నుండి భారత దేశాభివృద్ధికై సంపాదించిన ధనాన్నంతా బ్రహ్మానంద స్వామికిచ్చివేసి, "ఇప్పుడు నేను విముక్తుడనయ్యాను. పవిత్రమైన బాధ్యతను సరియైన వ్యక్తికి చేర్చాను" అన్నారు.

1897 మే 1వ తేది శ్రీ వివేకానంద, శ్రీ బ్రహ్మానంద, యితర శిష్యులూ, రామకృష్ణుల భక్తులు "శ్రీ రామకృష్ణ మిషన్" సేవా సంస్థను ప్రారంభించారు. వివేకానందులు సర్వాధ్యక్షునిగాను, బ్రహ్మానందుడు కలకత్తా కేంద్ర అధ్యక్షునిగా సంస్థ ప్రారంభింప బడింది.

బ్రహ్మానంద స్వామి, జమా–ఖర్చులు చూడటం, పశువులశాల నిర్వహణ మఠకార్యక్రమాల నిర్వహణ చూసుకుంటూ, కొత్తగా చేరిన బ్రహ్మచారులకు ఆధ్యాత్మిక ఉపదేశాలనిచ్చేవారు. శ్రీ రామకృష్ణ పరమహంస తర్ఫీదులో కామినీ కాంచనాలను అధిగమించిన తరువాత కాలాంతరంలో శ్రీ వివేకానందులు శ్రీ బ్రహ్మానందులకు ధనాన్ని అప్పగించడం, ధనంతో చేసే కార్యక్రమాలను చేయించడం చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. తండ్రి బిడ్డకు చక్కని శిక్షణను ఇచ్చిన తరువాత బాధ్యతలు అప్పగించినట్లు శ్రీ రామకృష్ణుని ఆధ్యాత్మిక పుత్రునికి ఆయన ముందు తర్ఫీదునిచ్చి తరువాత బాధ్యతలను అప్పగించారని తోస్తుంది.

ఒకసారి ఒక విదేశీయుడు వివేకానంద స్వామి దగ్గరకు కొన్ని ఆధ్యాత్మిక ప్రశ్నలకు సమాధానం కొరకు వచ్చాడు. అతణ్ణి వివేకానంద స్వామి బ్రహ్మానందస్వామి

> ...వివేకానందస్వామి తన శిష్యుడితో, "రాఖాల్‌కి గల ఆధ్యాత్మికత నాకు గూడా లేదు. మా మఠానికున్న రత్నం అతను. అతనే మా రాజు" అన్నారు.



వద్దకు పంపుతూ, "అక్కడ ఒక పెద్ద శక్తి కేంద్రం(డైనమో) ఉన్నది. మేమంతా అతని క్రిందనే పనిచేస్తున్నాం" అన్నారు. ఇంకొకసారి వివేకానందస్వామి తన శిష్యుడితో, "రాఖాల్‌కి గల ఆధ్యాత్మికత నాకు గూడా లేదు. మా మఠానికున్న రత్నం అతను. అతనే మా రాజు" అన్నారు.

ఒకసారి పనిచేయటంలోని రహస్యాన్ని బ్రహ్మానంద స్వామి ఈ విధంగా తెలియ జేశారు. "ఏదో ఒక పనిని ఏదో ఒక విధంగా చేయటం సరిపోదు. వ్యక్తిగత ప్రయోజనం కోసంగాక భగవంతుని సేవ అనే సరియైన దృక్పథంతో చేయాలి. మీ మనస్సులో ముప్పాతిక భాగం భగవంతునిపై కేంద్రీకరించి, మిగతా పాతిక భాగంతో మీరు చేయదలుచుకున్నది చేయండి! ఈ పద్ధతిని అనుసరిస్తే మీరు ఆదర్శ కర్మయోగిగా మారి శాంతిని, ఆనందాన్ని పొందుతారు. ఆ విధంగా కాక ధ్యాన సాధన చేయక, కార్యక్రమాలలోనే నిమగ్నమైతే, అహంకారమూ, గర్వమూ కలిగి, కలహాలూ, భిన్నాభిప్రాయాలూ బయలుదేరి, మీ మానసిక స్థిరత్వాన్ని భగ్నపరుస్తాయి. అందుచేతనే పనిచేసినా, చేయకపోయినా ఎట్టిపరిస్థితులలోనూ సాధనను అంటిపెట్టుకొని తప్పక చేస్తుండమని చెబుతారు. ధ్యానంకానీ, వేరే కార్యక్రమాలుగానీ, ఏ పనియైనా సమాన ప్రాధాన్యత

కలిగినదే! దానిని సరియైన దృక్పథంతో చేయండి. పనియే ఆరాధన''.

బ్రహ్మానందస్వామి ఆధ్యాత్మికోపదేశాలు సరళంగా, స్పష్టంగా, ఆచరణ యోగ్యంగా ఉండేవి. శాస్త్రగ్రంథాల నుండి ఉటంకించక తన స్వంత అనుభవంనుండే ఎక్కువగా బోధించేవారు. విశుద్ధానందస్వామి ఈ విధంగా చెప్పారు – "బలరామబోసు గృహాన ఒక సందర్భంలో బ్రహ్మానందస్వామి ఈ విధంగా చెప్పారు – 'ధ్యానం, జపం కొద్దిరోజులు చేయగానే కొంత పురోభివృద్ధి కలుగుతుంది. ఆ తర్వాత రసహీన శుష్కకాలం వస్తుంది. అపుడు ద్వారాలన్నీ బంధించబడినట్లు అనిపిస్తుంది. ఆ సమయంలో అనంత సహనంతో నీ ఆధ్యాత్మిక సాధనలను అంటిపెట్టుకొనివుండటం, కొనసాగించటం అత్యంత ఆవశ్యకం. ఆ విధంగా చేయటంచేత ఒకరోజున హఠాత్తుగా ద్వారాలు తెరువబడటం చూడగలవు. అపుడెంత ఆనందంగా ఉంటుంది! ఆధ్యాత్మిక జీవనంలో అటువంటి కష్టాలనెన్నో గట్టెక్కవలసి ఉంటుంది'.

ఒక భక్తుడితో మహరాజ్ ఈ విధంగా అన్నారు : ధ్యానం చేసేటప్పుడు, భగవంతుడు పురాణ కథలలోని కల్పవృక్షం వలె నీ ఎదుట నిలుచొని ఉన్నట్లు భావించాలి.

మరొకరోజు అదే భక్తుడితో యిలా అన్నారు: 'ధ్యాన సమయాన నువ్వొక సముద్ర మధ్యంలో ఉన్నట్టూ, నీ చుట్టూ పర్వతాల వంటి తరంగాలున్నట్లూ, నీకు సహాయం చేయటానికి సిద్ధంగా భగవంతుడు నీ ఎదుట నిలుచొని ఉన్నట్లూ భావించాలి'. మద్రాసులో ఒకరోజు ఆయనతో పాటు నడుస్తూంటే, మహరాజ్ అన్నారు. "ఈ ఒక్కటీ తప్పక చేయి. ఎల్లప్పుడూ భగవంతుని జ్ఞప్తికలో ఉంచుకో. నేనూ అదే చేస్తాను."

ఒకసారి ఒక శిష్యునితో బ్రహ్మానంద స్వామి ఇలా అన్నారు. "ప్రారంభంలో ఒక నిర్ణీత కార్యక్రమం ఏర్పరచుకొని దానిని క్రమం తప్పక అనుసరించటం మంచిది. నీ మనస్సు దానికి యిష్టపడినా, పడకపోయినా ఆ క్రమం తప్పగూడదు. నీ జప, ధ్యానాలను దైనందిన కార్యక్రమంగా చేయాలి. నీ గురువు నుంచి విలువైన మంత్రం స్వీకరించావు. ఇప్పుడు సచ్చిదానంద సాగరంలోనికి లోతుగా మునుగు! నిన్ను నీకు ఆసనంగా చేసుకో. ఆధ్యాత్మిక జీవితంలో స్వయంకృషి తప్పనిసరిగా ఉండాలి. కనీసం నాలుగు సంవత్సరాలు కొంచెం సాధన చేయండి! ఆ తరువాత మీలో స్పష్టమైన పురోభివృద్ధి కలుగలేదనిపిస్తే, తిరిగి వచ్చి నా చెంపలు వాయించండి".

> "ఆధ్యాత్మిక జీవితంలో స్వయంకృషి తప్పనిసరిగా ఉండాలి."
>
> "సత్సంగ ప్రభావం అమోఘం. దాని ఫలితం తప్పనిసరిగా కలుగుతుంది."

సత్సంగ ప్రభావం అమోఘం. దాని ఫలితం తప్పనిసరిగా కలుగుతుంది. అది వెంటనే గానీ, ఆ తరువాత కొంచెం కాలానికిగానీ కలుగవచ్చు. బ్రహ్మానందస్వామితో పరిచయం కలిగిన వారందరూ తమ జీవితాలలో స్పష్టమైన మార్పును, అనుభూతినీ పొందారు. బ్రహ్మానందస్వామి భక్తులకీ విధంగా గుర్తు చేసేవారు. "నువ్వుచేసే సత్సంగమూ, నువ్వు వినే ఆధ్యాత్మిక సంభాషణా, అవన్నీ నీ మనస్సుపై చెరగని ముద్రను వేస్తాయి. కాలక్రమేణా వాటి ఫలితాలనూ, వాటి వలన నీ జీవితంలో కలిగే ప్రబలమైన మార్పునూ గమనించగలవు".

"సుగంధ పుష్పాలలో దాగి ఉండే పెద్ద తేనెటీగ ఆ పుష్పాలతోపాటు భగవంతుని పాదపద్మములను స్పర్శిస్తుంది. అదే విధంగా, సాధు పురుషుల సాంగత్యం, అనుగ్రహం వలన సాధకుడు దేవతలను గూడ అధిగమించి, ముక్తిని పొందుతాడు."

శ్రీ రామకృష్ణుల ఆధ్యాత్మిక పుత్రుడు బ్రహ్మానందస్వామి 1922 ఏప్రిల్ 10వతేదీ–సోమవారంనాడు. రాత్రి 8గం॥ల 45 ని॥లకు తన భౌతిక దేహాన్ని విడిచారు.

బ్రహ్మానంద స్వామి తమ ఆచారం ద్వారా మనకు ఎన్నో మార్గ దర్శకాలు సూచించారు. వాటిని మనము నిత్యజీవితంలో ఆచరించే శక్తిని ప్రసాదించమని, మరియు వారి కృప మనందరిపై వర్షించాలని వారి జయంతి (జనవరి 25, 2012) వారికి ప్రార్థన. ("దైవంతో సహజీవనం" గ్రంథం సౌజన్యంతో)

జై సాయి మాస్టర్!

# సద్గురు ప్రాశస్త్యము

జనవరి 2012

నేటి మానవాళి ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు పరిష్కారమార్గం చూపిన మన గురుదేవులకు పాదాభివందనం చేస్తూ ఒక్కసారి ఆ పరిష్కారం ఎంత విలువైనదో స్మరించుకుందాం.

మానవుడు తనకు ఏమి కావాలో తనకే తెలియక అనేక సమస్యలకు బలి అవుతున్న తరుణంలో మహాత్ములు అవతరిస్తూ దేశకాల పరిస్థితులను బట్టి అప్పటికి అనువైన మార్గాన్ని చూపుతారని, అదే దత్త సాంప్రదాయం అని పూజ్య గురుదేవులు తమ గ్రంథాలలో చెప్పివున్నారు.

నేడు వైజ్ఞానిక అభివృద్ధి ఉన్నా చాలా మందికి అసలు దైవము అన్నా, ఆధ్యాత్మికత అన్నా ఏమిటో తెలియని పరిస్థితులలో గురుదేవులు అవతరించి, వైజ్ఞానికతకు ఆధ్యాత్మికతకు సమన్వయం అందిస్తూ, దాదాపు లుప్తమైన గురు సాంప్రదాయం తిరిగి మన అందరికీ తెలియజేసి, మన జీవితాలను చక్కదిద్దుకొనటంలో ఎవరూ పోషించలేని అద్భుతమైన పాత్రను పోషిస్తూ, రచనల ద్వారా మనకు అనేక మార్గాలను తెలియజేసావున్న భరద్వాజ గురుదేవులకు ఏ విధంగా కృతజ్ఞత చెప్పుకోగలం?



ఒక్కసారి గురు సాంప్రదాయం గురించి వివేకానందులవారు తమ శిష్యులతో చెప్పిన కొన్ని సంఘటనలు ఇక్కడ ప్రస్తావించడం సముచితమని తోస్తున్నది.

ఒకరోజు యువకుడొకడు వచ్చి, వివేకానందులతో "స్వామిజీ! మీరు భారతదేశంలోనూ, పాశ్చాత్య దేశాలలోనూ ఒక క్రొత్త మతాన్ని ప్రచారం చేస్తున్నారా?" అని ప్రశ్నించాడు.

**శ్రీ వివేకానందులు** : క్రొత్త మతమని నువ్వు దేనిని ప్రస్తావిస్తున్నావు?

**యువకుడు** : 'గంగాస్నానం వలన ముక్తి కలుగుతుంది' లాంటి నమ్మకాలను మీరు అంగీకరించరు కదా? దానినే ప్రస్తావించాను.

**శ్రీ వివేకానందులు** : అవేం మాటలు నాయనా! నేను రోజూ గంగాస్నానం చేస్తున్నాను. స్నానం చేయలేని పక్షంలో కనీసం గంగాజలం తల మీద చల్లుకొంటాను. తల మీద చల్లుకొని, కొన్ని నీటి చుక్కలు గ్రోలుతున్నాను కూడా.

కాసేపటి తారువాత ఒక వృద్ధ బ్రాహ్మణుడు అక్కడకు వచ్చాడు.

**వృద్ధుడు** : స్వామిజీ! మీరు మన సనాతన హైందవ ధర్మాన్ని లోకమంతా ప్రచారం చేసి వచ్చారు. మీరు సుప్రసిద్ధులు!

**శ్రీ వివేకానందులు** : సనాతన హైందవ ధర్మమని మీరు దేనిని పేర్కొంటున్నారు.

**వృద్ధుడు** : అదేమిటి! కాశీలో మరణిస్తే ముక్తి తథ్యమని నమ్ముతున్నారు. అలాంటి వాటి గురించే చెప్పాను.

**శ్రీ వివేకానందులు** : లేదు, జ్ఞానం లభించకుండా ముక్తి లేదు. జ్ఞాని ఎక్కడ ఉన్నప్పటికీ అతడికి ముక్తి తథ్యం.

జ్ఞానం గురించి విచారణ చేయండి. నేను రోజూ చేస్తున్నాను.

ఈ విధంగా ఇద్దరితోనూ శ్రీ వివేకానందులు రెండు రకాలుగా మాట్లాడడం చూసి శుద్ధానంద (శ్రీ వివేకానందులవారి శిష్యుడు) విస్తుపోయారు. శ్రీ వివేకానందులువారి ఎదుట మోకరిల్లి, "స్వామిజీ! వచ్చినవాళ్ళు వచ్చినట్లే వెళ్ళిపోయారు. ఇప్పుడు నేను గందరగోళంలో పడ్డాను" అన్నాడు. అప్పుడు శ్రీ వివేకానందులు అతడితో "నువ్వు అడుగు. నీకు అవసరమైన జవాబు నేనిస్తాను" అన్నారు. వెంటనే శుద్ధానంద, "సరి చెప్పండి. ముక్తి దేని వలన లభిస్తుంది?" అని అడిగాడు. శ్రీ వివేకానందులు గంభీర ముద్ర వహించి శుద్ధానందను చూస్తూ "గురుసేవ వలన" అన్నారు.

మరొక శిష్యునితో గురువు అనుగ్రహాన్ని శిష్యునికి ఈ విధంగా చెప్పారు.

శిష్యుడు : గురువు అనుగ్రహాన్ని ఎందుకు అభిలాషించాలి?

శ్రీ వివేకానందులు : ఏ మార్గం గుండా విమోచనం లభిస్తుందో మనిషి తనంతట తాను తెలుసుకోలేడు. అప్పుడు మార్గం తెలిసిన ఒకరిని ఆశ్రయిస్తాడు. ఆయన అతడికి మార్గం చూపుతాడు. ఆ మార్గంలో సాధనలు



*శ్రీ వివేకానందులు గంభీర ముద్ర వహించి శుద్ధానందను పరికిస్తూ "గురు సేవ వలన" అన్నారు.*

అనుష్ఠిస్తే ముక్తి మార్గాన్ని చేరుకోగలడు. ఇది గురువు అనుగ్రహంకాక మరేమిటి?

అలహాబాద్‌లో జీవించిన సాధువు అమూల్యుడు. శ్రీ వివేకానందుల కళాశాల సహాధ్యాయి. సేవ, త్యాగాలలో పావన జీవితం గడిపిన ఆయన కాలాంతరంలో సన్న్యాస మార్గం నుంచి వైదొలగారు. దానిని గురించి విన్నప్పటికీ శ్రీ వివేకానందులు ఆయనను విమర్శించలేదు. "ఆహా! గొప్ప వాడు! కాని ఈ జన్మ వృథా అయిపోయింది. పోనీ మరుజన్మలో ముక్తుడవుతాడు" అన్నారాయన. పిదప ఇలా కొనసాగించారు. "ఆయనకు గురువులేడు. అందుకే ఇలా జరిగింది. సాధకుడు అధోముఖంగా పోసాగినప్పుడు, గురువు వుంటే, ఆయన అతణ్ణి ఆ విధంగా సమతౌల్యం తప్పనివ్వడు. అతణ్ణి రక్షిస్తాడు".

ఇంతటి అమూల్యమైన గురు సాంప్రదాయాన్ని మనకు అందించి, తాను ఆ మార్గం ఆచరించి చూపించి, అందులోని మెలకువలు మనకు నేర్పించి, ఎనలేని మేలు చేసిన పూజ్య గురుదేవులకు ఎలా కృతజ్ఞత తెలుపుకోగలం? భరద్వాజ మహరాజ్ ద్వారా మనం పొందిన ప్రేమను, అవగాహనను అందరికీ పంచడం మన కనీస ధర్మం. అందునా, నేటి ప్రజలు పరాయి దేశ పోకడలకు బానిసలు అవుతున్న ఈ కాలంలో గురుదేవుల రచనలు వారికి అత్యంత ఆవశ్యకాలు. అందుకే భరద్వాజ గురుదేవులకు ఒక చిన్న విన్నపం. "ఈ జాతిని ఉద్ధరించడం మీకే సాధ్యం. మీరు మాకు అందించిన, అమూల్యమైన ఈ సంపదను అందరికీ పంచియిచ్చే ఈ మహా యజ్ఞంలో మీ అనుగ్రహానికై ప్రార్థిస్తున్నాము."

గురుదేవ దయాకరో దీనజనే

జై సాయి మాస్టర్ !

# శ్రీ దత్తలీలామృతము

శ్రీమతి శ్రీదేవి

జనవరి 2012 డిసెంబర్ సంచిక తరువాయి



పరశురాముడు ఆ సహ్యాద్రిపై ఒక సువిశాలమైన, రమ్యమైన ప్రదేశాన్ని యాగము నిమిత్తము ఎంచుకొని, అచటికి మునులనందరినీ ఆహ్వానించాడు. వారందరు కలసి చక్కని యాగశాలను నిర్మించారు. ఆ యాగశాల చుట్టూ ఎన్నోద్వారములు, పుష్పపత్ర తోరణములు, అన్ని వైపులా పతాకములతో గూడి, అద్భుతమైన ఆధ్యాత్మిక శక్తి పూరితమై, చూచే వారి మనస్సులకు ఎంతో ఆహ్లాదకరము, పవిత్రతలను చేకూరుస్తున్నవి. ఆ శాలకు మధ్య యజ్ఞమండపము నిర్మింపబడినది. ఆ మండపము ఎన్నో వేదీకుండములతో స్వర్ణకలశలములతో నిండి, వింతైన శోభతో అలరారుతున్నది. పరశురాముడు శ్రీదత్తస్వామి ఆచార్యకత్వముతో అసంఖ్యాక మునిజన సమూహముతో కూడి యజ్ఞము చేయసన్నద్ధుడైనాడు. ఒకానొక శుభదినమున శుభలగ్నమున స్వామికి నమస్కరించి, కశ్యపుడు మొదలయిన ఋత్విజుల అనుమతి గైకొని యజ్ఞదీక్ష స్వీకరించాడు, పరశురాముడు.

ఆ యజ్ఞకార్యము దిగ్విజయవంతంగా నెరవేరింది. శ్రీదత్తాత్రేయస్వామి, క్యాశ్యప మునీంద్రులు వేయి కనులతో కనిపెట్టి ఎక్కడా, ఏ లోపము రాకుండా నిర్వహించారు. అన్న, పాన, వస్త్రములు కోరినవారికి కోరినన్ని యివ్వబడ్డాయి. దేవతలు ఎంతో సంప్రీతులై స్వయముగా వచ్చి హవిస్సులనందుకొన్నారు. ఇక ఆ యజ్ఞశాలలో చేయబడిన దానధర్మములకు సాటి మరెక్కడా జరిగియుండదని చెప్పవచ్చు. ఎవరేది అడిగినా 'లేదు' అన్న శబ్దమే అచట విన్పింపదు. ఆ విధంగా సర్వజనులను సంప్రీతులను కావించాడు, పరశురాముడు. చాతుర్హోత్ర విధానముననుసరించి పరశురాముడు కశ్యపునకు సమస్త మహీమండలమును ధారపోశాడు. శ్రీ దత్తాత్రేయస్వామిని రత్నములు, బంగారము, ఆభరణములతో పూజించాడు. అచట యజ్ఞకార్యమును నిర్వహించిన ఋత్విక్కులను వారి వారి కోర్కెలు తెలుసుకొని నెరవేర్చాడు. శ్రీదత్తస్వామి తనకు యివ్వబడిన రత్నహేమ ఆభరణములను భూసురులకు యిచ్చాడు. కశ్యపమహాముని రాముడు తనకు ధారపోసిన సమస్త భూమిని బ్రాహ్మణులకు దానం చేశాడు. దత్త కాశ్యపుల వితరణను, వైరాగ్యమును చూసి పరశురాముడు ఆశ్చర్యచకితుడై వారినెంతగానో ప్రశంసించాడు. వారిరువురిని మనసారా పూజించాడు అని వేదధర్ముడు దీపకునికి చెప్పాడు.

ఎంతో ఆనందంతో వింటున్న దీపకుడు తన గురుదేవుని యిలా ప్రశ్నించాడు – "గురుదేవా! పరశురాముని దివ్యచరితము ఎంతో అద్భుతముగా వున్నది. అయితే – యిందులో నాకొక చిన్న సందేహము కలుగుతున్నది. దానిని తీర్చవలసిందిగా ప్రార్థిస్తున్నాను." అన్నాడు. వేదదర్ముని అనుమతిబడసి అతడు గురువును యిలా అడిగాడు – "గురుదేవా! పరశురాముడు దుష్టక్షత్రియ సంహారము చేసే సమయంలో ఇరువది ఒక్కసార్లు దండెత్తి నిక్షత్రియము గావించాడని చెప్పారు. అతడు ఆవిధముగా యిరువది ఒక్క సంఖ్యను ఎందుకు

ఎన్నుకున్నాడు? అందులోని మర్మమేమిటి?" గురుదేవులు నవ్వుతూ యిలా అన్నారు - దీపకా! పరశురాముడు సాక్షాత్తు విష్ణువు యొక్క అవతారము. ఇక అతిముఖ్యమైన విషయమేమంటే, అతడు క్షత్రియసంహార మొనరంచటానికి కూడా ప్రబలమైనకారణము వున్నది. అదేమంటే ఆ సమయంలో పెక్కుమంది రాక్షసగణము భూలోకములో క్షత్రియులుగా జన్మించి వుండటం వలన వారు చేస్తున్న అరాచకములను అరికట్టి ధర్మ సంస్థాపన చేసే నిమిత్తం భగవంతుడు పరశురాముడుగా అవతరించి ఆ కార్యం నెరవేర్చాడు. ఇక, అతడు యిరువది ఒక్క సార్లు దండెత్తిన కారణమేమంటే తండ్రి మరణ సమయంలో, సమిధలకై అడవికి వెళ్లిన అతడు దుశ్శకునాలు ఎదురవ్వటం చూసి ఆశ్రమానికి తిరిగి వచ్చి, అచట తండ్రిమరణాన్ని చూసి కలత చెందాడు. ఆ సమయంలో అతని తల్లి రేణుకాదేవి తన భర్త శవముపైబడి యిరువది ఒక్కసార్లు గుండెలు బాదుకుంటూ ఆక్రందనలు చేస్తూ విలపించింది. ఆ కారణంగా తల్లి దుఃఖాన్ని చూసి వికల మనస్కుడైన పరశు రాముడు యిరువది ఒక్కసార్లు క్షత్రియులపై దండెత్తి నిఃక్షత్రియముగావించటం జరిగింది.

మరల దీపకుడు యిలా అడిగాడు - "స్వామీ! శ్రీ దత్తాత్రేయస్వామి రేణుకా దేవిని జగద్ధాత్రిగా స్తోత్రము చేశాడు. ఇంతవరకు నేను రేణువు అనే పేరుగల మహారాజు కుమార్తెగా మాత్రమే రేణుకా దేవిని గురించి భావిస్తూ వున్నాను. మరి, అటువంటి ఒక రాజకుమార్తెకు శ్రీదత్తస్వామి ఎందుకు నమస్కరించారు? ఇది కాక, నాకు మరొక సందేహమున్నది. పరశురాముడు దేవదేవుడని, సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు అని మీరు చెప్పారు. అతడు సహ్యాద్రియందలి ఆమలకీ గ్రామమునందు ఆశ్రమము ఏర్పరచుకొనటానికి కారణమేమిటి?"

వేదధర్ముడిలా చెప్పసాగాడు -

"కుమారా! ఈ విషయాన్ని పూర్వము శ్రీశైల శిఖరాన మహర్షులు కార్తికేయుని అడుగగా ఆయన యిలా చెప్పాడు -

పూర్వము బ్రహ్మదేవుడు కృతయుగములో వేదములను ప్రామాణికములుగా చేసుకొని, లోకాలను, లోకపాలురను, దేవ, దైత్య, మనుష్యాదులను, పశు, పక్ష్యాదిగణములను వర్ణాశ్రమ ధర్మాలను సృష్టించాడు. అయితే, చిత్రవేమంటే, అలా సృజింపబడిన ప్రాణులన్నీగూడా తపోనిష్ఠులు, జ్ఞానసంపన్నులు, నిశ్చల వైరాగ్యపూరిత హృదయములు అయివుండటంవలన నానావిధముల సృష్టి వృద్ధి చెందకపోవటం వలన బ్రహ్మ ఎంతగానో విచారించాడు. అతడు అందుకు ఉపాయమునాలోచించి, జీవులు మోహపూరితులు అయ్యేటందుకుగాను, దీమము, మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము అనే పంచపర్వములతో గూడిన అవిద్యను సృష్టించాడు. అయితే తానొకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తుందన్నట్లయింది, బ్రహ్మ దేవుని పరిస్థితి. జీవులకోసం అవిద్యను సృష్టిస్తే అది తననే ఆవరించగా బ్రహ్మ చతుర్వేదములను మరచిపోయాడు. అందుకు బ్రహ్మదేవుడు ఎంతగానో చింతించాడు. ఏమి చేయాలో పాలుపోక చివరకు అతడు హంసనెక్కి పరుగెత్తుకొంటూ సహ్యాద్రికి వచ్చి రేణుకాదేవిని ధ్యానించాడు. బ్రహ్మదేవుని తపస్సుకు మెచ్చి, రేణుకాదేవి ప్రత్యక్షమై ఏమికావాలని అడుగగా బ్రహ్మ ఆమెకు నమస్కరించి, "త్రైలోక్యవందితా! మాతా! నన్ను రక్షించు, వేదములను మరచిపోయాను, గాయత్రి స్ఫురించటం లేదు. సర్వవేదమయీ! వానిని మరల నా మనసులో స్ఫురణకు వచ్చేలాగా చేయి. నన్ను అనుగ్రహించు తల్లీ!" అని ప్రార్థించాడు. అందుకు రేణుకాదేవి "బ్రహ్మదేవా! భయపడకు. వాసుదేవుని అడుగు. అతడు నీ కోర్కె తీర్చగలడు" అని చెప్పగా అతడు వాసుదేవునికోసం విష్ణులోకానికి వెళ్లాడుకానీ, ఆయనకు అక్కడ శ్రీహరి కన్పించలేదు. నిరాశతో బ్రహ్మ సకలప్రదేశములలోను విష్ణువుకై వెదకి వెదకి స్వామి జాడ తెలియక మరల రేణుక వద్దకు వచ్చి "అమ్మా! స్వామి ఎక్కడా కన్పించలేదు." అని చెప్పాడు. రేణుక శ్రీదత్తస్వామిని అచటకు పిలిపించి, "శ్రీదత్తాత్రేయా! ఈ బ్రహ్మ నీకోసమే వెదుకుచున్నాడు. అతనికేదో కావలసి వచ్చింది. అదేమిటో అడుగు" అన్నది. స్వామి రేణుకకు నమస్కరించి. చతుర్ముఖా! ఎందుకోసం వచ్చావు? నీకేమి కావాలి?" అని అడిగాడు. బ్రహ్మ దత్తస్వామికి నమస్కరించి, "నేను సకల వేదములను మరచిపోయాను. దయయుంచి, వానిని నా స్మృతి పథమునకు తెప్పించి, అనుగ్రహించు." అని వేడుకున్నాడు - దత్తస్వామి యిలా చెప్పారు.

సశేషం

# తాజుద్దీన్‌ను అనుగ్రహించిన మహాత్ముడు

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

జనవరి 2012

ఒకప్పుడు హైదరాబాద్ రాజ్యానికి ప్రధాన మంత్రిగా వున్న మహరాజ కిషన్‌ప్రసాద్‌గారు ఏదో పొరపాటు చేయటంవలన అతనిని నిజాము సుల్తాను పదవి నుండి తొలగించాడు. అప్పుడు కిషన్‌ప్రసాదు ఔరంగబాదు వెళ్ళి హజరత్ బన్నేమియాగారిని కలసి తన పరాభవాన్ని తొలగించమని ప్రార్థించాడు. ఉన్మత్తావస్థలో వున్న హజరత్ బన్నేమియాగారు అతనిని అకస్మాత్తుగా ఒక పెద్ద గోతిలోనికి తోసివేసారు. అందులో పడిపోయిన కిషన్ ప్రసాదుకు బలమైన గాయాలు తగిలాయి. నివ్వెరపోయి చూస్తున్న అతనిని పైకి ఎగబ్రాకి బయటకురమ్మని ఆదేశించాడు. "ఈ కష్టంలోనుండి నాకై నేను బయటకు రాగలిగితే నేనిక మిమ్మల్ని ఆశ్రయించడం దేనికీ?" అన్నాడతడు. హజరత్ బన్నేమియాగారు పెద్దగా నవ్వి, అతని చేతిని పట్టుకొని అమాంతం లాగివేసి, "నీవు హైదరాబాదు వెళ్ళు, అంతా బాగుంటుంది" అన్నారు. ఆయన తిరిగివెళ్ళిన కొద్దిరోజులలోనే నైజాం నవాబు అతనిని హైదరాబాదు రాజుగా నియమించారు.

ఒకసారి సౌదీ అరేబియానుండి ఒక అరబ్బు జాతివాడు వచ్చి ఔరంగబాదులోని తాజ్ బజార్ అను ప్రాంతంలో తన స్నేహితులతో కలసి కొన్ని రోజులున్నాడు. అతడు ఆ అరబ్బును బన్నేమియా దర్శనానికి తీసుకువెళ్ళాడు. అప్పుడు అక్కడ వారిచుట్టూ, భక్తులు, పేదవాళ్ళు, శిష్యులూ వున్నారు. ఆయనను చూస్తూనే ఆ అరబ్బు, "అరే, హజరత్ బన్నేమియాగారంటే వీరా? వీరు హజ్ యాత్రకు ఈ సంవత్సరం మక్కా వచ్చినప్పుడు దర్శించానే!" అన్నాడు. అప్పుడు బన్నేమియాగారు, "అవును, మేము హజ్‌యాత్రకు వచ్చాము. అయితే దివ్య రూపంలో వచ్చాముగాని, ఈ భౌతిక రూపంలో గాదు" అన్నారు. అలాగే కాబోలు భౌతికంగా శిరిడీలో వుంటూనే సాయిబాబా, "నేనిప్పుడు కాశీ వెళ్ళి గంగలో స్నానం చేసి వస్తున్నాను. మరల ఇక్కడ స్నానమెందుకు?" అనేవారు. స్నానం చేయనివారల్లా అవధూతలు, మహాత్ములని మనము పొరబడుకుందుము గాక!

అవి మొదటి ప్రపంచ యుద్ధం జరిగిన రోజులు. మన ప్రభుత్వం భారతీయ సైనికులను యుద్ధం చేయడానికి విదేశాలకు పంపాలని నిశ్చయించింది. వారిలో ఒకడైన అబ్దుల్ రహమాన్ అనువాడు బన్నేమియాగారిని దర్శించి తాను విదేశాలలో యుద్ధానికి వెడుతున్నానని చెప్పి తనను కాపాడవలసిందని ఆయనను ప్రార్థించాడు. ఆయన ఆశీర్వదించి అతనిని పంపాడు. తర్వాత సైనికుడు పయనిస్తున్న నౌక సముద్రం మధ్యలో భయంకరంగా కంపించసాగింది. అది ఏక్షణానైనా సముద్రంలో మునిగిపోవచ్చునని ఓడ కెప్టను అందరినీ హెచ్చరించాడు. అప్పుడు ఆ నౌకలోని వారందరినీ రక్షించమని బన్నేమియాగారిని ప్రార్థించి నిశ్చింతగా నిద్దరపోయాడు అబ్దుల్ రహమాన్. అతనికి స్వప్నంలో ఆ మహనీయుడు కనిపించి నౌకను తమ చేతులతో నెడుతూ, "నీవేమీ భయపడకు, నేను నీతో గూడా వున్నాను. మీకెట్టి ప్రమాదము సంభవించదు" అని చెప్పారు. అతడికి మరుక్షణమే మెలుకువవచ్చి చూచేసరికి "ప్రమాదం తప్పిపోయింది. ఇక మనకెట్టి భయమూలేదు" అని నౌక కెప్టెను చెబుతున్న మాటలు అతని చెవినబడ్డాయి.

ఒకరోజు తాజుద్దీన్ అను ఒక సైనికుడు ఈయనను దర్శించి, "నా మనస్సు నా స్వాధీనంలో వుండటంలేదు. నాకు పిచ్చి అని నిర్ణయించి నన్ను సైన్యంలోనుండి తొలగించారు." అని మనవి చేసాడు. బన్నేమియాగారు అతని మాటలు ఎంతో శ్రద్ధగా విని అతనివైపు తదేకంగా కొంచెంసేపు చూచి, ***"నీవు యుద్ధంలో జనులను చంపవలసినవాడివి కావు, దుష్టులను సైతం సంస్కరించి ఉద్ధరించే వాడివి. నీ స్థానము నాగపూర్. అచ్చటికి వెళ్ళి పేదలను ఉద్ధరిస్తూ ఉండు"*** అని చెప్పి ఆశీర్వదించారు. అతడు నాగపూర్ చేరి హజరత్ తాజుద్దీన్‌బాబాగా ప్రసిద్ధిచెందాడు. హజరత్ బన్నేమియాగారు 1921 ప్రాంతంలో సమాధి చెందారు. ఈ వివరాలు మాకు సోదరుడు జి.వెంకటరావుగారు (హైదరాబాద్) అందచేసారు.

# పాండురంగ భక్తుడు – దామాజి పండితుడి చరిత్ర

శ్రీమతి వేదవతి



బిదరి అనే ఊరిలో దామాజి పండితుడనే ఒక వైష్ణవుడు వుండేవాడు. అతడు నిర్మలమైన మనస్సుతో ప్రపంచమంతా భగవంతుని రూపంగా భావిస్తూ, సాటివారి బాధలను తొలగిస్తూ, పరోపకారం చేస్తూ నిరంతరము భగవంతుని స్మరిస్తూ వుండేవాడు. ఆ దేశపు రాజు దామాజి పండితుడిని మంగళవటము అనే ఊరికి అధికారిగా నియమించాడు. దామాజి పండితుడు సకుటుంబంగా ఆ ఊరిలో నివసిస్తూ, తన ఉద్యోగ ధర్మాన్ని నెరవేరుస్తూ, అన్ని బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తూ కూడా శ్రీమన్నారాయణుని ధ్యానాన్ని నిరంతరం కొనసాగిస్తూనే వున్నాడు. ఒకసారి ఆ ప్రాంతమంతా భయంకరమైన కరువు వచ్చింది. దానివలన ప్రజలు ఆహారము లేక అల్లాడిపోయారు. అప్పుడు దామాజి పండితుడు తన దగ్గరవున్న సమస్త సంపదను దీనులకోసం వినియోగించాడు. ఆ భయంకరమైన కరువుకాలంలో ఎంతోమంది ప్రజలు ఆకలిబాధతో మరణించారు. ఇంకెందరో దేశం విడిచి వలస వెళ్ళిపోయారు. పండరీపురంలో నివసించే ఒక బ్రాహ్మణుడు తన ఇంటిని, కుటుంబాన్ని విడిచి వేరే దేశానికి వెళ్తూ మంగళవటానికి చేరాడు. అప్పుడు అతనిని సాక్షాత్తూ పాండురంగడిగా భావించి దామాజి పండితుడు ఆ బ్రాహ్మణుని పూజించి, అతనిని విచారించి, అతనికి ఆతిధ్యమిచ్చాడు. ఆ బ్రాహ్మణుడు భోజనానికి ముందు ఆపోశనము చేస్తూ కన్నీరు కార్చాడు. అది చూసి దామాజి పండితుడు, "మహానుభావా! భోజన సమయంలో మీరెందుకు కన్నీరు కారుస్తున్నారు? నాకు సాధ్యమైనంతలో మీ బాధను పోగొట్టడానికి ప్రయత్నిస్తాను. ఆ పరమేశ్వరుడే అతిథిరూపం ధరించి మానవుల పూజలను అంగీకరించి వారిని రక్షిస్తూవున్నాడు. కాబట్టి శ్రీ పాండురంగని స్వరూపమైన మీకు సంతోషం కలిగించడము నాకు ధర్మము" అన్నాడు. ఆ మాటలు విని ఆ బ్రాహ్మణుడిలా అన్నాడు:

"మహాత్మ! నీ మాటలు నీ సహృదయతను తెలుపుతున్నాయి. నేను పండరీపురము విడిచి నాలుగు రోజులైంది. ఈ నాలుగు రోజులుగా నేను ఆహారం తీసుకోలేదు. పండరీపురంలోని నా కుటుంబము అన్నం లేక బాధపడుతూవుంది. ఈ భోజనాన్ని చూడగానే నా భార్యాపిల్లలు పస్తులుంటూ వుంటే నేను మాత్రం భోజనం చేయడం నాకు బాధ కలిగిస్తూవుంది. అందుకే కన్నీరు కారుస్తున్నాను" అన్నాడు.

అది విని దామాజి పండితుడు ఎంతో బాధపడి, "అయ్యా! మీరేమి బాధపడకుండా తృప్తిగా భోజనం చేయండి. మీ కుటుంబానికి ఒక సంవత్సరానికి సరిపడేంత ధాన్యం నేనిస్తాను" అని చెప్పాడు. ఆ బ్రాహ్మణుడు ఎంతో సంతోషించాడు. అతడి కళ్ళు ఆనందబాష్పాలతో నిండిపోయాయి. అతడు ఆనందంగా ఆపోసనము చేసి షడ్రసోపేతమైన భోజనాన్ని గోవిందనామస్మరణ చేస్తూ స్వీకరించాడు. ఆ తర్వాత ఉత్తరాపోశనం చేసి లేచి, చేతులు

*దామాజి పండితుడు సకుటుంబంగా ఆ ఊరిలో నివసిస్తూ, తన ఉద్యోగ ధర్మాన్ని నెరవేరుస్తూ, అన్ని బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తూ కూడా శ్రీమన్నారాయణుని ధ్యానాన్ని నిరంతరం కొనసాగిస్తూనే వున్నాడు. ఒకసారి ఆ ప్రాంతమంతా భయంకరమైన కరువు వచ్చింది. దానివలన ప్రజలు ఆహారము లేక అల్లాడిపోయారు.*

కాళ్ళు కడుగుకొని తన ఆసనం మీద కూర్చుని భగవంతుడిని ధ్యానించి, స్తుతించి దామాజిపండితుడు భక్తి శ్రద్ధలతో యిచ్చిన చందనము, కుంకుమ, తాంబూలాలను స్వీకరించాడు.

తరువాత దామాజి పండితుడు అతిథి స్వీకరించగా

> *నాలుగు రోజులుగా నేను ఆహారం తీసుకోలేదు. పండరీపురంలోని నా కుటుంబము అన్నం లేక బాధపడుతూవుంది. ఈ భోజనాన్ని చూడగానే నా భార్యాపిల్లలు పస్తులుంటూ వుంటే నేను మాత్రం భోజనం చేయడం నాకు బాధ కలిగిస్తూవుంది. అందుకే కన్నీరు కారుస్తున్నాను"*

మిగిలిన భోజనాన్ని పరమపావనమైనదని ప్రసాదంగా తీసుకుని తన సేవకులను పిలిచి "నాలుగొందల బస్తాల ధాన్యాన్ని రాజుగారి ధాన్యపు కొట్టునుంచి తీసుకుని వెళ్ళి యీ బ్రాహ్మణుడి ఇంటికి చేర్చిరండి" అని అజ్ఞాపించాడు. ఆ భటులు తమ యజమాని ఆజ్ఞానుసారం ధాన్యాన్ని బండ్లకెక్కించుకుని ఆ బ్రాహ్మణుడితో కలిసి పండరీపురానికి వెళుతూవుండగా దారిలో ఆకలితో అలమటిస్తున్న ప్రజలు ఆ బండ్లమీదపడి ఆ ధాన్యాన్నంతా కొల్లగొట్టుకుపోయారు. ఆ బ్రాహ్మణుడు అది చూసి బాధపడి "దయామయుడైన దామాజి పండితునివలన నా దరిద్రము తొలగిపోయినదని నేను సంతోషిస్తూ వుంటే, నా పాపమంతా ఈ మనుషుల రూపంలో వచ్చి ధాన్యాన్నంతా కొల్లగొట్టుకుపోయింది. సముద్రం ఎంత పెద్దదైనా మన గిన్నెకు తగినన్ని నీళ్ళే మనకు లభిస్తాయి కదా! నాకు దామాజి పండితుడి భోజనము ఒక పూట వరకే ప్రాప్తమైవుంది. నా పాపానికి అతడేమి చేయగలడు? పూర్వజన్మలలో నేను అతిథులకు భోజనం పెట్టలేదు కాబోలు. తపస్సు చేసి సత్యలోకాన్నిపొంది కూడా అన్నదానము చేయకపోవడంవల్ల శ్వేతమహారాజు ఆ మహాలోకంలో కూడా ఆకలితో అలమటిస్తూ బ్రహ్మ పంపగా భూలోకానికి వచ్చాడు. ఎవ్వరికీ పెట్టకుండా తానే భోజనం చేస్తూ వుండడం వల్ల పెరిగిన తన శవంలోని శరీర భాగాలలోని మాంసాన్ని భుజిస్తూ వుండేవాడు. అతడు ప్రతిరోజూ భోజనానికి భూలోకానికి వచ్చేవాడు. బ్రహ్మ అనుగ్రహం వలన అతని శవం ప్రతిరోజూ క్రొత్తగా ఉండేది. ఇలా దాని నుండి మాంసాన్ని భుజిస్తూ ఆకలి తీర్చుకుంటూ చాలాకాలం గడిపాడు. తరువాత భగవంతుని అనుగ్రహం వల్ల ఆయనకు అగస్త్యమహాముని దర్శనమైంది. ఆ మహర్షికి నమస్కరించి తనకెంతో ప్రీతికరమైన రత్నహారాన్ని ఆయనకు సమర్పించి ఆయన అనుగ్రహాన్ని పొంది పరిశుద్ధుడయ్యాడు. అతని అంతులేని ఆకలిబాధ కూడా తొలగిపోయింది. తన శవం కూడా అదృశ్యమైపోయింది. అతడు పరమానందభరితుడై సత్యలోకములో వుండిపోయాడు. ఈ కథ శ్రీమద్రామాయణంలో చెప్పబడివుంది. కాబట్టి గత జన్మలో చేసిన పాపాలకు యిప్పుడు బాధపడిలాభంలేదు" అనుకుంటూ పండరీపురానికి వెళ్ళి భార్యాపిల్లలను వెంటబెట్టుకొని మంగళవటానికి వచ్చాడు. ఆ దేశంలోని దీనులైన ప్రజలంతా దామాజి పండితుని ఔదార్యాన్ని గురించి విని అన్నంకోసం వేలాదిగా మంగళవటానికి తరలివచ్చారు. వారంతా దామాజి పండితుని చూసి,

> *తపస్సు చేసి సత్యలోకాన్నిపొంది కూడా అన్నదానము చేయకపోవడంవల్ల శ్వేతమహారాజు ఆ మహాలోకంలో కూడా ఆకలితో అలమటిస్తూ బ్రహ్మ పంపగా భూలోకానికి వచ్చాడు. ఎవ్వరికీ పెట్టకుండా తానే భోజనం చేస్తూ వుండడం వల్ల పెరిగిన తన శవంలోని శరీర భాగాలలోని మాంసాన్ని భుజిస్తూ వుండేవాడు.*

"మహాత్మా! ఆహారము లేక చాలామంది మరణించారు. మిగిలిన మేము మేఘముకోసం ఎదురుచూస్తూ వున్న చాతక పక్షులలాగా మీ దయకోసం ఎదురు చూస్తూ వున్నాము" అన్నారు. అది విని దామాజి పండితుడు



పరమపతివ్రత అయిన తన భార్యను చూసి, “ప్రేయసీ! ఇప్పుడు మనమేమి చేయాలి? వేలాదిమంది దీనులు మనకు అతిథులుగా వచ్చారు. సర్వాంతర్యామి అయిన పాండురంగడు, తన అనంతనామాలకు సంకేతంగా చాలామంది అతిథుల రూపంలో మనకు సేవ చేసే అవకాశం యిచ్చాడు కాబోలు! నేను సంపాదించినదంతా అతిథిసేవకోసం వినియోగించాను. ఇప్పుడిక నా దగ్గర ఏమీ మిగలలేదు. అయ్యో! మరచిపోయి తప్పుగా మాట్లాడాను. నా ప్రాణనాథుడైన పాండురంగడు అంతటికీ అధిపతి కదా! అటువంటప్పుడు అతడి కుమారుడైన నేను ఏమీలేనివాడిని ఎలా అవుతాను? భగవంతుడిచే సృష్టించబడిన సమస్త ప్రపంచము నాదే అయినప్పుడు నేనెలా ఏమీలేనివాడినౌతాను? భగవంతుడి ధనంతోనే భగవంతుని స్వరూపాలైన వీరిని సేవిస్తాను. రాజుకు చెల్లించవలసిన వేలకొలది బస్తాల ధాన్యం నా అధీనంలోనే వుంది. దానిని శ్రీ పాండురంగనికి సంతోషం కలిగేలాగా వినియోగిస్తాను. నాలో వుండి యిచ్చేవాడు. వీరందరిలో వుండి తీసుకునేవాడూ శ్రీ పాండురంగడేకదా! అందరిలో వున్న ఆ భగవంతుడే రాజులో కూడా వున్నాడు. కాబట్టి నేను చేస్తున్న యీ పనివలన రాజు ఆనందిస్తాడని భావిస్తున్నాను. ఒకవేళ రాజుకు నామీద కోపం వచ్చినా అతడు శిక్షించగలిగినది నన్నొక్కడినే కదా! ఆ పరమాత్మ కరుణ వలన ఇంతమంది తృప్తి పడతారు కదా! అది కూడా నన్ను తరింపచేస్తుంది” అని చెప్పాడు. అతడు ఆ ధాన్యాగారమును తెరిచి, “భగవంతుని రూపాలైన ఓ అతిథులారా! మీకు కావలసినంత ధాన్యాన్ని తీసుకుని వెళ్ళండి” అని ప్రార్థించాడు. వారంతా విచ్చలవిడిగా ధాన్యాన్ని తీసుకెళ్ళారు. మూడు నెలలలో ధాన్యశాలలన్నీ ఖాళీ అయ్యాయి. దామాజి పండితుడి కీర్తి దశదిశలా వ్యాపించింది.

దామాజి పండితుని సేవకులలో ఒకడు యీ విషయాన్ని రాజుకు తెలియబరచాడు. ఆ రాజుకు కోపం వచ్చి దామాజి పండితుని బంధించి తీసుకురమ్మని తన భటులను పంపాడు. వారు మంగళవటానికి వచ్చి, రాజాజ్ఞననుసరించి దామాజి పండితుడిని బంధించి తీసుకొని వెళ్తూ దారిలో పండరీపురము చేరారు. దామాజి పండితుడు ఆ భటులను బ్రతిమాలి శ్రీ పాండురంగడి దర్శనానికి ఆలయంలోకి వెళ్ళి భగవంతుడిని ఇలా స్తుతించసాగాడు:

“అనంతమైనది, దాటనలవికానిది, కామము, క్రోధము, మొహము మొ॥న తిమింగలాల చేత భయంకరమైనదయిన సంసారసాగరాన్ని దాటడానికి నావ అయినవాడు, అటువంటి సంసారసాగరానికి తీరమువంటివాడు, గురు పరంపర ద్వారా తెలియబడేవాడు, అనంత శక్తిమంతుడు, దేశకాలాలకు అతీతుడు, తన నామ ప్రభావం చేత కర్మయోగము మొ॥న వాటికి ఫలప్రదాన శక్తిని యిచ్చేవాడు, బ్రహ్మాదులకంటే గొప్పవాడు, సచ్చిదానంద స్వరూపుడు, బ్రహ్మాదులలాగా

*అయ్యో! మరచిపోయి తప్పుగా మాట్లాడాను. నా ప్రాణనాథుడైన పాండురంగడు అంతటికీ అధిపతి కదా! అటువంటప్పుడు అతడి కుమారుడైన నేను ఏమీలేనివాడిని ఎలా అవుతాను? భగవంతుడిచే సృష్టించబడిన సమస్త ప్రపంచము నాదే అయినప్పుడు నేనెలా ఏమీలేనివాడినౌతాను?*

కాలపరిమితుడు కాకుండా అన్ని శక్తులు కలిగివుండి, శాశ్వతుడై అపరిమిత తేజస్సుతో ప్రకాశించే దివ్యమంగళస్వరూపముతో ఆనందస్వరూపుడై వుండేవాడు, సృష్టికి కారణము తానై, వేదాలను, ఆచారాన్నీ పరిపాలించేవాడై, సృష్టి, జీవుడు ప్రళయంలో లయించే స్థానమై, అందరికీ అందని మహాసముద్రమై, ముక్తిపొందిన వారికంటే ఉత్తముడని చెప్పదగిన కార్యకారణ సంబంధము కలవాడై, కారణత్వ శేషిత్వము కలవాడై, ప్రపంచానికి పర్యవసాన కాలంలో పర్యవసాన స్థానమై, ఆకాశము మొ॥న అనేకరకాలైన ద్రవ్యాలలో నిండినవాడై వున్న శ్రీ విష్ణుదేవా! ఈ జగత్తుకు కారణమైన విరాట్‌పురుషుడు, విరాట్‌పురుషుడికి కారణమైన అహంకారము, దానికి కారణమైన మహత్తత్వము, దానికి కారణమైన ప్రకృతి తానై ఈ తత్వాలయొక్క ముఖ్యమైన కార్యాలై కార్యకారణరూపంగా కనిపించే స్వభావసిద్ధములైన అనంతములైన జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి తేజస్సు, సౌశీల్యము, వాత్సల్యము, శౌర్యము, ధైర్యము మొ॥న సకల కళ్యాణ గుణాలకు ఆశ్రయమై క్రియాస్వరూపాల చేత, కర్మస్వరూపాల చేత, చేతనాచేతనాలనన్నింటినీ రక్షిస్తూవుంటావు. వేదాలకు అధిపతివి, వేదవేదాంత వేద్యుడివి, వేదవేదాంత శాస్త్ర స్వరూపుడివి నీవే. అటువంటి నీవు భక్తులను పరిపాలించడం కోసము పండరీక్షేత్రంలో శ్రీపాండురంగడనే పేరుతో అర్చింపబడుతూ అవతరించి ప్రకాశిస్తున్నావు. కాబట్టి నిన్ను సేవించి, చింతించి, శరణుపొందిన నా విషయంలో మంచిపనులు చేయడానికి

*రాజు విధించబోయే శిక్షననుభవించి నీ సన్నిధికి వచ్చి భీమానదిలో స్నానం చేసి నిన్ను సేవిస్తాను. ఆ రాజు కోపించి నా శరీరాన్ని ఖండించినా ఈ ప్రకృతినుంచి విముక్తుడినై విరజానదిలో స్నానంచేసి శ్రీవైకుంఠంలో నిన్ను దర్శిస్తాను"*



అటంకమైన రాగ ద్వేషలోభమోహాది దుర్గుణాలన్నీ శాంతించేలా అనుగ్రహించు" అని పరిపరివిధాల ప్రార్థించి యింకా యిలా అన్నాడు:

"పాండురంగా! నీ ఐశ్వర్యము తనదని భావించి దురభిమాని అయిన రాజు నన్ను శిక్షించడానికి పిలిపించాడు. నీ వాడినైన నేను ఎక్కడ ఎటువంటి పరిస్థితిలో వున్నప్పటికీ నా హృదయంలో నీ ధ్యానము మాత్రం తప్పక వుండాలి. రాజు విధించబోయే శిక్షననుభవించి నీ సన్నిధికి వచ్చి భీమానదిలో స్నానం చేసి నిన్ను సేవిస్తాను. ఆ రాజు కోపించి నా శరీరాన్ని ఖండించినా ఈ ప్రకృతినుంచి విముక్తుడినై విరజానదిలో స్నానంచేసి శ్రీవైకుంఠంలో నిన్ను దర్శిస్తాను" అని విన్నవించుకుని, శ్రీ పాండురంగడి దివ్యమంగళరూపాన్ని తన హృదయంలో నింపుకుని రాజభటులతో కలసి బీదర్‌కు బయలుదేరాడు.

ఇది యిలా వుండగా, భక్త వత్సలుడైన శ్రీ పాండురంగడు ఒక తలారి వేషము ధరించి, ఒక పాతగుడ్డను చుట్టుకొని, చేతిలో ఒక కర్ర పట్టుకుని, లెక్క వ్రాసివున్న ఒక కాగితాన్ని చేతిలో వుంచుకుని, డబ్బులసంచీని తలపై పెట్టుకుని పరుగున బీదర్ పట్టణము చేరాడు. ఆయన రాజమందిర ద్వారంలో

నిలబడి, "మంగళవటమునుంచి దామాజి పండితుడిచే పంపబడిన తలారి, ధాన్యానికి వెలకు సరిపడినంత ధనాన్ని లెక్కతో సహా తీసుకువచ్చాడని రాజుకు తెలియబరచవలసినది" అని ద్వారపాలకులతో చెప్పి పంపాడు. రాజు అనుమతితో ఆయన లోపలకు వెళ్ళి

*నిన్ను చూస్తే తలారిగా కనిపించడంలేదు. నీ తేజస్సు ఎంతో విశేషంగా వుంది. నీ ముఖ వర్చస్సు మనస్సును ఆకర్షిస్తున్నది. నీ శరీరభాగాలు సాముద్రికా శాస్త్రాన్ననుసరించి శుభలక్షణాలు కలిగి వున్నాయి. నీవు తలారివని నేనెలా నమ్మగలను?*

ఆస్థానంలోవున్న రాజుకు ఎదురుగా వెళ్ళి నమస్కరించి చేతులు కట్టుకుని సవినయంగా నిలబడ్డాడు. రాజు ఆ తలారిని చూసి, "ఏమిటి విషయము?" అని అడిగాడు.

అప్పుడా తలారి రాజును చూసి, "రాజా! దామాజి పండితుడు రాచరికానికి చెందవలసిన ధాన్యాన్ని మంచివెలకు అమ్మి ఎనభైనాలుగు లక్షల వరహాలను లెక్కతో సహా నాతో యిచ్చి పంపించాడు. నేనవి తీసుకుని మీ దగ్గరకు చేరాను. కృపతో తీసుకొనవలసినది" అని చెప్పి తాను తెచ్చిన లెక్కల కట్టలను, డబ్బుల సంచీని రాజుకెదురుగా వుంచాడు. అది చూసి రాజు ఆశ్చర్యపడి, "తలారీ! నిన్ను చూస్తే తలారిగా కనిపించడంలేదు. నీ తేజస్సు ఎంతో విశేషంగా వుంది. నీ ముఖ వర్చస్సు మనస్సును ఆకర్షిస్తున్నది. నీ శరీరభాగాలు సాముద్రికా శాస్త్రాన్ననుసరించి శుభలక్షణాలు కలిగి వున్నాయి. నీవు తలారివని నేనెలా నమ్మగలను? నీవు తెచ్చిన యీ చిన్న సంచీలో ఎనభైనాలుగు లక్షల వరహాలు యిమడగలవా? నీ వూరేది? నీ పేరేమిటి? నీ తల్లిదండ్రులెవరు? నిన్ను పెంచినవారెవరు? నీవేమి చేస్తావు? నీ బంధువులెక్కడుంటారు? దామాజి పండితుడు నీకెంత జీతమిస్తున్నాడు?" అని అడిగాడు. అప్పుడా తలారి యిలా సమాధానమిచ్చాడు:

"రాజా! నా కథవిను, నాకే ఊరూ లేదు. కానీ లోకమంతా నాదే. నాకు ఏ పేరూ లేదు. అయినా ఈ ప్రపంచంలోని అన్ని పేర్లూ నావే. నాకు తల్లిదండ్రులు లేరు. అంతటికీ నేనే జన్మస్థానాన్ని. నన్నెవరూ పెంచలేదు. నేనే అందరినీ పోషిస్తూ వుంటాను. నేను అన్ని పనులూ చేస్తాను. అన్ని విద్యలూ నాకు వచ్చు. నాకు బంధువులెవ్వరూలేరు. అందరూ నావారే. దామాజీ పండితుడిచ్చే జీతంతో జీవించేవాడిని కాదు. సమస్త జీవుల కర్మ పరిపాకాన్నిబట్టి అందరికీ కర్మానుగుణంగా వేతనము యిస్తాను. ఇలా వుండిగూడా, అన్నింటా వుంటూనే నేను పండరీపురంలో వుంటాను. పుండరీకుడు నన్ను అక్కడ వుండమని ఆజ్ఞాపించాడు. కనుక నాకదే నివాసస్థానము. అన్ని నామములతో పిలువబడుతూ వున్నా, విఠలనాయకుడనే పేరుతో పిలువబడుతున్నాను. నా యజమాని అయిన దామాజి పండితుడు మొ॥న సాధుపురుషులు నన్ను ఆ పేరుతోనే పిలుస్తూవుంటారు. కాబట్టి అదే నా పేరు. అన్నిటికీ కారణభూతుడనయిన నాకు తల్లిదండ్రులు దేవకీ వసుదేవులు. వారు నన్ను కుమారుడిగా కోరుకున్నారు కాబట్టి నేను వారికి బిడ్డనయ్యాను. అన్నింటినీ రక్షించే నన్ను, పెంచినవారు యశోదానందులు. వారు నన్ను తప్ప వేరేమీ కోరరు. కాబట్టి నేను వారిని పోషిస్తూవున్నాను. నన్ను ఆశ్రయించినవారి కోసం నేనెంతటినీచమైన వృత్తినైనా చేస్తాను. వారు నాకు ప్రాణసమానులు. కాబట్టి వారికోసం నేనన్నింటినీ నెరవేరుస్తాను. అందరికీ ఆత్మబంధువునైన నాకు, నా నామాన్నే స్మరిస్తూ, నిరంతరమూ ధ్యాననిమగ్నులై అంతటినీ నా స్వరూపముగా చూస్తూ విరాగులై యితరుల కష్టాలను తొలగిస్తూ, జీవులపట్ల కరుణతో ప్రవర్తించే పరమ భాగవతులు నాకు సమీప బంధువులు. వారు భారాన్నంతా నా పాదాల దగ్గర వుంచి నిర్భయంగా వుంటారు. కాబట్టి అటువంటి మహాత్ములను నేను ఆత్మబంధువులుగా అభిమానించి వున్నాను. అన్ని ప్రాణులకు జీవనాన్ని యిచ్చే నాకు, దామాజి పండితుడి అతిథిసత్కార సద్గుణమే నా వేతనము. నేనేమీ కోరను గనుక, ఆ సత్పురుషుని శుభ గుణాలనే జీతంగా అంగీకరించి అతనికి నమ్మినబంటునై వుంటాను. పరమయోగుల వాక్కుకు, మనస్సుకూగూడ అతీతుడనైన నేను, భక్తపరాధీనుడనై వారి ఇంటి వాకిట్లో సేవకుడివలె కాచుకుని వుంటాను. బ్రహ్మాదుల కిరీటముల అంచులతో

*పరమయోగుల వాక్కుకు, మనస్సుకూగూడ అతీతుడనైన నేను, భక్తపరాధీనుడనై వారి ఇంటి వాకిట్లో సేవకుడివలె కాచుకుని వుంటాను. బ్రహ్మాదుల కిరీటముల అంచులతో అలంకరింపబడిన పాదపద్మాలు కలిగిన నేను, పరమ భక్తుల పాదధూళిని నా కిరీటముపైన ధరిస్తాను.*

అలంకరింపబడిన పాదపద్మాలు కలిగిన నేను, పరమ భక్తుల పాదధూళిని నా కిరీటముపైన ధరిస్తాను. నా పాదాల దగ్గర వుద్భవించిన గంగానదిచేత మూడులోకాలను పునీతం చేస్తున్న నేను. పరమభక్తుల పాద తీర్థాన్ని భక్తితో స్వీకరిస్తాను. వేదపురుషుని స్తోత్రానికిగూడా దర్శనమివ్వని నేను భాగవతుల కీర్తనలను తలవూపుతూ వింటాను. నా స్వభావము యిది అని చెప్పడానికి నేను అశక్తుడిని. నా యజమాని అయిన దామాజి పండితుడికి నీవు యజమానివి గనుక నీ ప్రశ్నలకు ఒక విధంగా సమాధానమిచ్చాను" అని చెప్పి తానెవరో ఎవ్వరికీ తెలియనీయకుండా మాయ చేశాడు. తన వరహాలు సంచీని విప్పి కొండలాగా వరహాలను రాజు ముందు పోసి, "నేను ధనాన్ని చెల్లించినట్లు రసీదు యివ్వవలసినది" అని అడిగాడు.

రాజెంతో సంతోషించి ఎనభై నాలుగు లక్షల వరహాలకు రసీదు వ్రాసి అతని చేతికిచ్చి అతనికి వస్త్రాలను, ఆభరణాలను బహుమానముగా యిచ్చి, దామాజీ పండితుడికి పల్లకీలు, ఏనుగులు, గుర్రాలు, విలువైన వస్త్రాభరణాలు బహుమానముగా యిచ్చి పంపించాడు. శ్రీ పాండురంగడు ఆ వస్తువులన్నింటినీ మంగళవటానికి తెచ్చి దామాజి పండితుడి ఇంటికి చేర్చి అదృశ్యుడయ్యాడు. ఆ మరునాడు రాజభటులు దామాజి పండితుణ్ణి తెచ్చి రాజు ఎదుట నిలబెట్టారు.

రాజు దామాజి పండితునికి నమస్కరించి, "మహాత్మా! నీవు పంపించిన విఠ్ఠలనాయకుడను తలారి యనభైనాలుగు లక్షల వరహాలను చెల్లించి నిన్ననే రసీదు తీసుకుని వెళ్లాడు. నీవేమీ తెలియనివాడిలాగా యీ భటులవెంట వచ్చావు" అని చెప్పాడు. అది విని దామాజీ పండితుడు అది శ్రీ పాండురంగడి లీలేనని తెలుసుకుని, "శ్రీ పాండురంగా! నాకోసం నీవు యీ నీచమైన వేషాన్ని ధరించి వచ్చావే" అని శోకిస్తూ భూమిమీద పడిపోయాడు. రాజు అతనికి తగిన వుపచారాలు చేయగా అతడు లేచి నిలబడి, "రాజా! నీవు చాలా అదృష్టవంతుడివి, కాబట్టే నీకు ఆ భగవంతుడు సేవ ప్రసాదించాడు" అని చెప్పాడు.

ఆ రాజు ఆనందభరితుడై, "నా తప్పులను క్షమించి యింతకు ముందులాగే అధికారాన్ని నిర్వర్తిస్తూ వుండు" అని ప్రార్థించాడు. అది విని దామాజి పండితుడు, "నేనిక ఏ వృత్తీ చేయదలచలేదు. ఇకముందు నేను భగవంతుడైన శ్రీ పాండురంగడి సన్నిధిలో నా శేష జీవితాన్ని గడుపుతాను" అని చెప్పి మంగళవటానికి వచ్చి, రాజు విఠ్ఠలనాయకునివలన పంపిన బహుమానాలన్నింటినీ సాధుసత్పురుషులకిచ్చి పండరీపురం చేరాడు. అక్కడే నివసిస్తూ శ్రీ పాండురంగడిని ఎల్లప్పుడూ సేవిస్తూ తన మనస్సు, శరీరములతో భగవంతుడికి ప్రీతికరమైన పనులనే చేస్తూ అక్కడే పరమపదము పొందాడు. మహానుభావుడైన దామాజి పండితుడి చరిత్రను నిత్యనూతనమైనదిగా గౌరవించి సాధువులందరూ అనేకవిధాలుగా కీర్తిస్తున్నారు.

**గమనిక**

గతసంచికలో శ్రీ మాణిక్య ప్రభువుల గురించిన వ్యాసమునందు. వారి జన్మసంవత్సరము తప్పుగా (1817కు బదులుగా 1871గా) ముద్రించడమయినది. శ్రీ మాణిక్య ప్రభువు సంస్థానము నుండి భక్తులు గుర్తింపజేయగా సరిచేసి తెలియజేస్తున్నాము. ఈ పొరపాటుకు క్షంతవ్యులము. వారి జన్మసంవత్సరము 1817 మరియు మహాసమాధి 1865గా పాఠకులు గుర్తించవలసినది.

# వార్తాలాపము

 **డిసెంబర్ సంచిక తరువాయి**

## ఇరువది ఆఱవ ప్రసంగము

తరువాత రోజున ఉదయము అందరును టీ వేళకు శ్రీ నిత్యానందస్వామివారిచెంత సమావేశమయిరి. పెద్దవిద్యార్థి యిట్లు ప్రశ్నించెను :-

"క్షమించండి. తెలిసికొనుటకుమాత్రమే ప్రశ్నించుచున్నాను. మా విజ్ఞానవాదము దేవుని అంగీకరించదు. అంతయు స్వభావ సిద్ధమేనని అనును. దేవుని అస్థిత్వమును గురించి తమ అభిప్రాయము ఏమియో దయయుంచి తెలియజెప్పుడు."

### దేవుని అస్థిత్వము

స్వా.ని. :- ప్రొఫెసరు జోషీ మీ గురువులు. వారు ఉపనిషత్తులు, సూత్రములు, భాష్యాదులు మొదలగునవి అధ్యయనము చేసియున్నారు. వారిని ప్రశ్నించుడు. నేను చదువుకొనలేదు.

ప్రొ. జోషీ:- తమ ఎదుట చెప్పుటకు తగిన తాహత్తు నాకు లేదు. తమ శ్రీ ముఖము నుండి వినదలచియున్నాను. తమరే చెప్పుడు.

స్వా.ని. :- వైజ్ఞానికుల అభిప్రాయమునకును, వైజ్ఞానికుల పద్ధతికిని భేదము కలదు. వైజ్ఞానిక పద్ధతి ప్రకారము జగన్నియంతను గురించిన ప్రశ్న అప్రస్తుతము. ఏలనన, వైజ్ఞానిక పద్ధతి దృశ్య జగత్తును ప్రయోగముద్వారా తెలుపుటకు ప్రయత్నించును. కావున ప్రస్తుతము అడిగిన ప్రశ్న వైజ్ఞానికుల వ్యక్తిగతాభిప్రాయముగా తెలిసికొనవలెను.

ఈశ్వరుని అస్థిత్వమును గురించి ఆలోచించినను ఆ ఆలోచనలు వ్యక్తిగతాభిప్రాయములనుకొనవలెననియే చెప్పవలసివచ్చుచున్నది. సర్వమాన్యముగు సిద్ధాంతరూపమున గ్రహించవీలులేదు. దృశ్యపదార్థమును మాత్రమే విజ్ఞానము ప్రయోగముద్వారా ఋజువుజేసి సత్యమని తలచును. అదృశ్యము ప్రయోగ సాధ్యము కాదు.

ప్రభువునుగురించిన కల్పన కల్పనమాత్రమే. వ్యక్తిగతమగు కల్పన వ్యక్తిగత వైశిష్ట్యముపై ఆధారపడియుండును. "ఇది అంతయు స్వభావసిద్ధమే" అని వైజ్ఞానికులు తలచెదరు.

పెద్దవిద్యార్థి:- దేవుని గురించి తమ అభిప్రాయము సెలవిండు.

### సృష్టికర్త ఉండవలెను

స్వా.ని. :- దేవుని అస్థిత్వమును అంగీకరించకపోయినను సృష్టికర్త ఒకడు ఉండవలెనుకదా! ఎట్లన, ఒక అరణ్యమధ్యమున తోటలలో ఒక భవనము కలదనుకొనుడు. దానిలో ప్రస్తుతము ఎవరును లేకపోయినను, ఎప్పుడో ఒకప్పుడు ఆ భవనమును ఎవరో నిర్మించిరనియూ, వారు మరణించిరనియు, అనంతరము ఆ భవనము పాడువడినదనియు అనునది ఊహించదగినది కదా!

సృష్టికార్యమును చేసినవాడు సర్వజ్ఞుడును,
సర్వశక్తిమంతుడును అగు చైతన్యస్వరూపుడు.

అటులనే సృష్టికికూడ ఎవడో ఒక కర్త ఉండి ఉండవలెననునది యుక్తిసంగతము. ఆ సృష్టి అనెడు కార్యము మరియొక విధముగా జరుగదు. కావున ఆ సృష్టికర్త సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును అగు చైతన్య స్వరూపుడని తెలిసికొనవలెను. అనగా కార్యముచే కారణమును ఊహించవలెను. సృష్టియను కార్యమునకు కారణము సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును అగు చైతన్య స్వరూపుడగు దేవుడని ఊహించవలెను.

### వైజ్ఞానికుల దృష్టిలో జగత్తుకు ఉపాదానకారణము పరమాణువు

పెద్దవిద్యార్థి:- విజ్ఞాన దృష్టిని పరికించినచో పరమాణువుచే జగమంతయు ఉత్పన్నమయినదని తెలియును. కాన జగమునకు పరమాణువు ఉపాదానకారణమని తెలియుచున్నది. అందుచే

జగత్కారణము దేవుడని అంగీకరించవలసిన అవసరము ఏమియును లేదు.

### మధ్యవర్తియగు తటస్థ స్వభావము

స్వా.ని. :- పరమాణుస్వభావమును గురించి మొదట ఆలోచించెదము.

పృథ్వి, జలము, తేజము, వాయువు - వీనికి పరమాణువులు కలవు. ఈ అన్ని రకములగు పరమాణువుల స్వభావము ఒకటేనా? లేక వేరు వేరు స్వభావములు కలవా? ఒకే స్వభావము అన్నచో పరమాణుభూత స్వభావగతమగు వైలక్షణ్యాభావముచే కార్యవైలక్షణ్యమునకు తావు లేదు. కాని కార్యమునందు వైలక్షణ్యము ప్రత్యక్ష సిద్ధము. అందుచే కార్యగతవైలక్షణ్యముచే పరమాణురూపమగు కారణమందు స్వభావవైలక్షణ్యమును అంగీకరించవలెను. పరమాణు వైలక్షణ్యముచే ఒక పరమాణువుతో మరియొక పరమాణువునకు కల సంబంధములచే విలక్షణపరిమాణములు కలుగుచున్నవి. ఈ ప్రత్యక్షములగు పరమాణుస్వభావములయందు పరిణామములను కలుగజేయు కారణము వేరొకస్వభావమని తెలిసికొనవలెను. ఏలనన ఏ భౌతిక పదార్ధమును అన్య పదార్ధసంయోగముగాని, అన్య పదార్ధస్వభావ ప్రభావముగాని లేనిదే రూపాంతరమును పొందదు. ఈ కారణముననే మీ విజ్ఞానవేత్తలు వేరు వేరు పరమాణువుల స్వభావములను కలుపుటకు మధ్యవర్తియగు వేరొక తటస్థస్వభావముయొక్క ఉనికిని అంగీకరించవలసి వచ్చుచున్నది.

### సమిష్టిస్వభావరూపుడు సృష్టికర్త

ప్రతి పరమాణువుయొక్క స్వభావమును వేరువేరని అంగీకరించినప్పుడు వాని సహాయమున ఘటము తయారుచేయుటకు ఒక సమిష్టిస్వభావమును అంగీకరించవలెను, దాని ప్రభావమే ప్రతి పరమాణు స్వభావముపైనను పడును. పృథ్వియొక్క ఒక అణువునకు మరియొక అణువునకును భేదము లేదు. కావున పృథ్వియొక్క పరమాణుస్వభావములయందు అభేదమును అంగీకరించుట యుక్తి సమ్మతము. కాని పార్థివపరమాణువుల స్వభావమును ఏకముచేయుటకు సమిష్టిస్వభావము కలదని కార్యవైవిధ్యము స్పష్టమగుటకు యుక్తిచే అంగీకరించవలెను. ఇటులనే జలము, తేజము, వాయువు మొదలగువాని పరమాణువులను ఆధారముగా చేసికొని విచారించిన ఒక సమిష్టి స్వభావముల యందును వ్యాపకమయి ఉన్న స్వవ్యాపకమగు సమిష్టి స్వభావము.

### "సత్" అను నియామక స్వభావమే ఆ సృష్టికర్త

ఈ విధముగనే ప్రపంచమునందలి పదార్థములన్నియును పరమాణువులచే తయారయినవి అనియును, పరమాణుస్వభావములను సమ్మేళనముచేయు ఒక మహత్స్వభావము (వ్యాపకస్వభావము) ప్రపంచమునంతను నియమించుచున్నదనియును అంగీకరించవలసియున్నది. ప్రతి పదార్థమొక్కయు స్వాభావిక అస్థిత్వము వ్యాపక అస్థిత్వముచే శాసించబడుచున్నది. ఆ వ్యాపక వస్తువు "సత్" స్వరూపము. ఆ వస్తువు "అసత్" అనుకొనువారు దానిస్వభావముకూడ "అసత్" అని ఒప్పుకొనవలసివచ్చును. "అసత్" నుండి "సత్" ఉద్భవించుననునది యుక్తము కాదు. కావున ప్రతిపదార్థస్వభావమును శాసించు పూర్ణస్వభావమే జగత్తునంతను నియమించుచున్నది. భావమును నియమించు ఈ పూర్ణస్వభావము సద్రూపము.

### సచ్చిదానందస్వరూపమును, సర్వస్వభావనియామకమును అగు స్వభావమే పరమేశ్వరుడు

చైతన్యమునందు కన్పించు జ్ఞానసత్యస్వభావము, జడమందలిచైతన్యముయొక్క క్రియాసత్యస్వభావముమాత్రమే. జడ పదార్థముల క్రియా శక్తికి, చైతన్యముయొక్క జ్ఞానశక్తి మూలస్వరూపము. ఈ విధముగనే సర్వస్వభావములను శాసించు స్వభావము "సత్" అను జ్ఞానరూపము. అది సచ్చిదానందమును, పూర్ణానందమును, సర్వశక్తిమయమును అగు వ్యాపక స్వభావము. ఈ స్వభావము జగమునంతను-విశ్వమునంతను నియమించును.

ఈ పై చెప్పిన విధముగా విచారించిచూచిన బలమగు తర్కముతో స్వభావవాదమును చేయు విజ్ఞానము శాస్త్రముకూడ తానెంతదూరము పోయినను అద్వితీయమును, సచ్చిదానందరూపమును, సర్వస్వభావనియామకమును అగు ఒక స్వభావము ఉన్నదని ఒప్పుకొనవలసి వచ్చును. ఆ పదార్థమే పరమేశ్వరుడు అని అనుకొనవలెను. ఇట్లు తార్కికదృక్పథముతో చూచిన స్వభావ వాదమునందుకూడ దేవుని అస్తిత్వము సిద్ధించును.

పరమాణుస్వభావవాదులుగానుండి దేవుని అస్థిత్వమును ఒకప్పుకొననివారు స్వభావవాదము యొక్క యదార్థ తత్త్వమును తెలిసికొనుట లేదు.

*సృష్టి అను కార్యమునకు కర్త ఉండవలెను.*

మీ తత్త్వవిచారము ప్రకారము జగమంతము పరమాణుజనితము. ప్రతికార్యమునకును నిస్సంశయముగా రెండు కారణములు ఉండును. 1. ఉపాదాన కారణము 2. నిమిత్త కారణము. కార్యమునకు ఉపాదానకారణము పరమాణువు అని తలచినచో వేరొకటి నిమిత్తకారణముగా మీరంగీకరించవలెను. ఘటమను కార్యమునకు ఉపాదానకారణము కపాలము అనగా మృత్తిక. అటులనే పటమునకు ఉపాదానకారణము తంతువులు. వానికి భిన్నములగు కుంభకారుడు, దండము, చక్రము మొదలగునవి నిమిత్త కారణములు కదా! అవియే ఉపాదానకారణమును వ్యవస్థీకరించి ఘటరూపమును, పటరూపమును పొందించును. అటులనే జగమునకు ఉపాదానకారణము పరమాణువు ఆయినను ఈశ్వరుని కాదనుటకు వీలుపడదు. పరమాణువు చేతనమా? అచేతనమా? చేతనమనినచో అనేక చేతనములను సంయోగపరచు ఒక వ్యావక చేతనమును అంగీకరించవలసివచ్చును. అచేతనము అనినను ప్రతివరమాణున్వభావమును శాసించు ఒక స్వతంత్రస్వభావమును ముందు చెప్పిన విధముగా అంగీకరించవలెను. ఈ విధముగ సృష్టియను కార్యము కర్తృసాపేక్షము. ఆ కర్త సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వస్వభావశాసకుడును అగు ఒక స్వతంత్రస్వభావమని మీరు అంగీకరించవలసి వచ్చును. అదియే దేవుడు. ఇట్లు విజ్ఞాన దృక్పథములోకూడ ఈశ్వరుని అస్తిత్వము రుజువు అగును.

*అనుమానప్రమాణముచేగూడ దేవుడు ఋజువు అగును*

ఆనుమానప్రమాణముచేకూడ దేవుడు రుజువు చేయబడునని మనదేశపు ప్రాచీనవిద్వాంసుకులు తెలిసికొనిరి. సర్వతంత్ర స్వతంత్రులగు శ్రీ ఉదయనాచార్యులు స్వీయరచితమగు కుసుమాంజలియను గ్రంథమునందు దేవుని రుజువు చేయుటకు కార్యత్వ, ఆయోజనత్వ, ధృతిత్వాది హేతువులు అనేకములను చూపించెను.

*"కార్యా22 యోజనధృత్యాదేః"*

కార్యత్వము, ఆయోజనత్వము, ధృతిమత్త్వము మొదలగు వానిచే దేవుడు రుజువు చేయబడును. వానిని గురించి వరుసగా చర్చించెదము.

*కార్యత్వము*

*"క్షిత్యఙ్కురాదికం సకర్తృకమ్ కార్యత్వాత్ ఘటవత్"*

ఘటపటాది కార్యములు సకర్తృకములు. కర్తచే నిర్వహించబడును. అటులనే పృథ్వి, పృథ్వీగతములగు అంకురాదులునుకుకూడ కార్యములగుటచే సకర్తృకములు. ఆ కర్త జీవభిన్నుడు, పృథివ్యాది ఉపాదానగోచరమగు అపరోక్షజ్ఞానమును, చికీర్షయును, కృతిమత్త్వమును కలిగియుండును. అతడు దేవుడు.

*అయోజనత్వము*

*"సర్గాద్యకాలీన ద్వ్యణుకారంభక పరమాణుద్వయ సంయోగ జనకం కర్మ, చేతన ప్రయత్నపూర్వకం, కర్మత్వాత్, అస్మదాదిశరీర క్రియావత్"*

మనశరీరక్రియలు చేతనవ్యాపారముచే జరుగును. అటులనే సృష్ట్యాదినుండియు జరుగు ద్వ్యణుకము మొదలుకొని వరమాణుద్వయ సంయోగము పరకును కల కర్మలు చేతన ప్రయత్నములే. కాని ఈ చేతనము జీవస్వభావముకల చేతనముమాత్రమే కాదు. సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును అగు ఒక చేతన పదార్థము అని ఒప్పుకొనవలెను. అదియే దేవుడు.

*ధృతిమత్త్వము*

ఏతత్ బ్రహ్మాణ్డం పరనప్రతిబన్ధకీభూత ప్రయత్నవదధిష్ఠితమ్, ధృతిమత్త్వాత్, వియతి విహఙ్గమధృతకాష్ఠవత్.

ఆకాశమునందలి పక్షి తననోటిలో కట్టెను కరచుకొని ఉండునట్లు ఈ పృథివ్యాదులతో కూడిన బ్రహ్మాండమును ఎవడో పట్టుకొని వున్నాడా అనునట్లు వున్నది. ఈ బ్రహ్మాండాదులు స్వకీయపతన ప్రతిబంధకమగు ఒకానొక ప్రయత్నయుతమగు పదార్థమున నిలిచియున్నవి. ఆ పదార్థము సర్వశక్తియుతము అయి ఉండవలెను. అనగా బ్రహ్మాండమంతయు నిలచియుండుటకు వీలగు శక్తికలవాడు దేవుడనియే అంగీకరించవలెను.

ఈ విధముగనే దేవుని రుజువు చేయుటకు అనేకములగు అనుమానప్రామాణములను చూపించవచ్చును.

**సశేషం**

# ఆనందానుభూతి – శారీరక శాస్త్రము

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

జనవరి 2012

ఆధ్యాత్మికానుభూతి కేవలం చిత్తభ్రమేనని అనేక మంది నాస్తికులు, పదార్థవాదులు తలచడానికి కారణం – ఆధ్యాత్మిక గ్రంథాలన్నీ అట్టి అనుభవాలు ఏ ఇంద్రియాన్నుండీ లభించేవి కావనడమొక పెద్ద కారణం. రెండవది యోగ గ్రంథాలలో వర్ణించబడిన నాడీ మండలం, షట్చక్రాలు శరీరంలో భౌతికంగా కనిపించకపోవడం. యోగ గ్రంథాలు శిరస్సులో బ్రహ్మరంధ్రమున్నదని, అదే ఆనందానుభూతికి కేంద్రమని చెప్పారు. అక్కడ సహస్రారమనే చక్రము లేక కమలము ఉన్నదని, యోగాభ్యాసం వలన దానిని చేరి అందు నిలువగలిగిన యోగికి బాహ్య విషయానుభూతి లేకున్నా ఏ ఇంద్రియానుభూతీ ఇవ్వలేని నిర్హేతుకమైన ఆనందం కలుగుతుందనీ యోగశాస్త్రం చెబుతుంది. ఏదైనా మూర్తిని గాని, మంత్ర శబ్దాలను గాని ధ్యానించినప్పుడు లేక శ్వాసను నియమించడం వలన నాడీ మండలం శుద్ధి చెంది జీవుడు ఆ స్థానాన్ని చేరుతాడని యోగశాస్త్రం చెబుతుంది. కాని ఆధునిక శారీరిక శాస్త్రానికిట్టి నాడీ మండలం గాని, అట్టి చక్రాలు, లేక కమలాలు గాని ఎక్కడా గోచరించవని, కనుక అట్టి ఆనందానుభూతి కూడ యోగము, భక్తి, జపము పేరిట వ్యక్తులు సలిపే వెఱ్ఱిచేష్టల వలన మనస్సుకు స్థాయితప్పి ఏదో ఆనందమనుభవమైనట్లు భ్రమపడతారనీ వీరంటారు. కాని ఆధునిక శారీరక మానసిక శాస్త్రాలు వీరి వాదాన్ని నట్టేటముంచి నిర్దాక్షిణ్యంగా ఆధ్యాత్మిక వాదాన్నే బలపరుస్తున్నాయి.

హార్వార్డు విశ్వవిద్యాలయంలో మనస్తత్వ శాస్త్రాధ్యాపకుడు ఫ్రెడరిక్ స్కిన్నర్ (Frederic Skinner) నేటి మనస్తత్వ శాస్త్రజ్ఞులలోకెల్లా ప్రతిభావంతుడని 'టైమ్స్' పత్రిక ప్రశంసించింది. ఈయన ఒక పంజరాన్ని నిర్మించి అందులో ఒక ఎలుకనుంచాడు. దానికాకలైనప్పుడల్లా ఒక కడ్డీని లాగితే ఆహారం సరఫరా అయ్యేలా ఏర్పాటు చేశాడు. క్రమంగా కొంత యత్నంతో ఆ ఎలుక అలా చేయడం నేర్చుకుంది. అలానే పావురాలకు నృత్యము, పింగ్ పాంగ్ ఆడడము నేర్పాడు. డా॥ ఓల్డ్ జేమ్సు (Dr. Old James) ఆ ఎలుకల మెదడులోకి సూక్ష్మమైన విద్యుత్ వాహకములను (Electrodes) దింపాడు. ఆ ఎలుక కడ్డీని లాగినప్పుడు ఆ ఎలక్ట్రోడ్లలోకి స్వల్పంగా విద్యుత్ ప్రవహించి ఎలుక మెదడులోని వివిధ కేంద్రాలకు సోకుతుంది. మొదట ఆ కడ్డీని లాగి రుచికరమైన ఆహార పదార్థాలను పొందడానికి ఆ ఎలుకనలవాటు చేశాడు. ఆ తర్వాత ఆ కడ్డీని లాగినప్పుడు తినుబండారాలు లభించే బదులు మెదడులో ఒకానొక కేంద్రానికి విద్యుత్ సోకేలా చేశాడు. అందువలన దాని మెదడులోనే ఆ కేంద్రం ప్రబోధాన్ని పొందుతుంది. అది ఆ ఎలుకకు అత్యంత ప్రీతికరమైన అనుభూతిగా ఉండడం జేమ్సు గమనించాడు. ఆహారము లభించకపోయినా ఆ ఎలుక పదే పదే ఆ కడ్డీని లాగి మెదడులోని ఆ కేంద్రాన్ని విద్యుత్తుతో ఉత్తేజపరచుకొని ఆనందిస్తూ వుందట! తర్వాత ఆ ఎలుకను ఆహారమివ్వక మాడ్చాడు. దానిలోని ఆ ప్రత్యేక కేంద్రంలోకి ఎలక్ట్రోడును దింపాడు. దాని పంజరంలో ఎన్నో రుచికరములైన తినుబండారాలనుంచాడు. సహజంగా ఆ ఎలుక వాటిపై దాడిచేసి శీఘ్రంగా వాటినారగిస్తుందని తలుస్తాము. కాని ఆ ఎలుక మాత్రం ఆ తినుబండారాల జోలికి పోక ఎంతసేపటికీ కడ్డీని లాగి మెదుడులోని ఆ కేంద్రాన్ని ఉత్తేజపరచుకొని ఆనందిస్తోందట. ఆ విద్యుత్ ప్రవాహంతో మెదడులోని ఆ భాగాన్ని ఉత్తేజపరచుకోవడం వలన కలిగిన ఆనందంతో ఆ తినుబండారాల నారగించినందువలన కలిగే సుఖము సాటికాదన్నమాట.

మరొక పరిశోధనలో కామోద్దీపనాన్ని ఆ ఎలుక పొందివున్నప్పుడు మరొక ఈడు జోడు కలిగిన ఎలుకను ఆ పంజరంలోకి వదిలారు. సహజంగా ఆ మొగ ఎలుక ఆడ ఎలుక పొత్తుకు పరుగెత్తాలి. కాని అలా జరుగలేదు. ఆడ ఎలుకను కన్నెత్తైనా చూడక ఆ కడ్డీ మీదికురికి దానిని లాగి మెదడులోని కేంద్రాన్ని విద్యుత్ప్రవాహంతో ఉత్తేజ పరచుకొని ఆనందిస్తుందట. అంటే దాంపత్య సుఖంకంటే

కూడా ఆ ఆనందమే శ్రేష్ఠమైనదన్నమాట.

తర్వాత అట్టా విద్యుద్దీపనంతో ఆనందపడే ఎలుకల మెదడులను కోసి పరిశీలించారు శాస్త్రజ్ఞులు. అట్టి ఆనందాన్నిచ్చే కేంద్రం ఆకలి, కామము, నిద్ర మొదలైన అనుభవాలను పొందే కేంద్రాలకతి సమీపంలో ఉన్నదట. ఈ పరిశోధనల వలన మనకు తేలిన అంశాలు -

***(1)*** మెదడులోని ఆనంద కేంద్రాన్ని ఉత్తేజ పరచడం వలన ఎంత సాటిలేని తృప్తి కలుగుతుందంటే, అటుపై లౌకికమైన సుఖాలపట్ల వ్యామోహం నశిస్తుంది.

***(2)*** మెదడులో యోచనాత్మకమైన మానసిక క్రియలకు కేంద్రమైన స్థానాలకు భిన్నంగా ఈ ఆనందానుభూతి కేంద్రం ఉండడంవలన ఆనందానుభూతిని ఊహించడం గాని, దానిని పదజాలంలో నిర్వచించడంగాని సాధ్యం కాదు. ఆధ్యాత్మికానందానుభూతి అనిర్వచనీయమన్న కారణంగా అవాస్తవికమనడం అర్థరహితమని మెదడులోని కేంద్రాలపై ఆధునిక శాస్త్రజ్ఞులు చేస్తున్న ప్రయోగాలు నిరూపిస్తున్నాయి.

***(3)*** *సరియైన విచారణ ద్వారాగాని, ధ్యానం ద్వారా గాని ఆనందానుభూతి కేంద్రాలను మెదడులో జాగృతం చేసుకొన్న వ్యక్తికి లౌకిక వ్యామోహాలు, కోరికలు నశిస్తాయి. అట్టి కోరికే ప్రాకృతికమైన (Instinctive) ఉద్రేకాలకు కారణం. కనుక ఆనందానుభూతి కేంద్రాలు, లౌకిక సుఖానుభూతుల కేంద్రాలు ఒకే మెదడులోనే ఉండి, ఒకే పదార్థం చేత చేయబడి, ఒకే శక్తి చేత పనిచేసేవే అయినా పరస్పర విరుద్ధంగా పనిచేస్తాయన్నమాట. భగవద్గీతాది ఆధ్యాత్మిక గ్రంథాలు గాని, శ్రీ రామకృష్ణ పరమహంస వంటి అనుభవజ్ఞులుగాని అందుకే ఇంద్రియాలను, మనస్సును లౌకిక వాంఛల నుండి నిగ్రహించనిదే ఆధ్యాత్మికత సాధ్యం కాదన్నారు. యదార్థమైన ఆధ్యాత్మిక జ్ఞానం కలవారు తుచ్ఛ వ్యామోహాలు, వాటి వలన ఏర్పడి బలపడే స్వార్థ మమకారాదులు కల్గియుండరని, అవి కలవారు మిథ్యాచారులనీ చెబుతారు. సరియైన ఆధ్యాత్మికత సమాజంలో స్వార్థాన్ని, డబ్బును, విలాస వస్తువులను కూడ బెట్టుకునే గుణాన్ని ఎవరికి వారు జయించేలా చేస్తుందని ఋజువౌతుంది. అంటే ఆనందానుభూతి కేంద్రం మేల్కొననిదే ఇది సాధ్యం కాదని తేలుతుంది. అంటే ఆధ్యాత్మికత వినా, స్వార్థాన్ని నిర్మూలించ వీలుకాదని, సమాజాన్ని యదార్థంగా సంస్కరించ సాధ్యం కాదనీ మెదడు గూర్చి చేయబడిన శాస్త్రీయ పరిశోధనలు నిరూపిస్తాయి.*

***(4)*** కోరికే భయానికి కారణం. ప్రాకృతమైన జీవితేచ్ఛవలననే మృత్యుభీతి కలుగుతుంది. తక్కిన భయాలన్నింటికీ బాధాకరమైన అనుభూతులను గుర్తించే మెదడులోగల కేంద్రాలే కారణం. అందుకే మెదడులో ఎక్కడా భయానుభూతికి కేంద్రమేలేదట! ఆనందానుభూతి ఇతర కోరికలను రూపుమాపుతుందిగనుక వాటి వలన కలిగే భయాన్ని కూడ రూపుమాపుతుంది. అంటే ఆనందానుభూతి కేంద్రం జాగృతం కాకపోవడమే భీతికి కారణమన్నమాట. ఆ కేంద్రాన్ని కృత్రిమంగా ప్రేరేపించడం వలన ఇట్టి ఆనందాన్ని పొందనలవాటుపడిన ఎలుక జీవనాధారమైన ఆహారాన్ని కూడ లక్ష్యపెట్టక పోవడాన్ని బట్టి మృత్యుభీతి నతిక్రమించేందుకు కూడ ఆనందానుభూతే కారణం కాగలదని తేలుతుంది. అందుకే ఆధ్యాత్మిక గ్రంథాలలో ఆత్మజ్ఞానం భయరహిత స్థితి అని నిర్వచించబడింది. బుద్ధత్వం పొందినవాడికి మృత్యుభీతి వలన జీవితాన్నంటి పెట్టుకునే 'తన్హా' (తృష్ణ) నశిస్తుందని బౌద్ధ గ్రంథాలు కూడా చెబుతాయి.

***(5)*** ప్రాకృతికమైన ఆహార, నిద్ర, మైధునాలకు సంబంధించిన కేంద్రాలు, ఆనందానుభూతి కేంద్రము ప్రక్క ప్రక్కనే ఉండడం మన ప్రాచీన ఆధ్యాత్మిక గ్రంథాల్లో సూచించబడి వున్నది. ఉదాహరణకు మాండుక్యోపనిషత్తులో "ద్వాసుపర్ణ" అన్న మంత్రమున్నది. (III 1.1) ఒకే చెట్టు కొమ్మ మీద రెండు పక్షులున్నాయని (గ్రద్దలు) వాటిలో ఒకటి దాని ఫలాలను తిని అనుభవిస్తుందని, రెండవది దానిని సాక్షీభూతంగా చూస్తూ ఉన్నదని చెప్పి యున్నది. తర్వాతి మంత్రంలో (III 1.2) ఆ పండ్లు తినే పక్షి భ్రాంతిలో తగులుకొని దుఃఖానికి గురియైనదని, అది దాని ప్రభువైన దానిని తెలుసుకొన్నప్పుడు సర్వదుఃఖాల నుండి విముక్తి పొందుతుందనీ చెప్పబడ్డది. అంటే ఒకే మెదడులో విషయాలననుభవించే కేంద్రాలు, వాటిననుభవించక ఆ ఆనందానుభూతినిచ్చే కేంద్రము ఉన్నాయని సూచించడమైనది. ఆనందానుభూతిని పొందినవాడు దుఃఖ విముక్తుడౌతాడని అర్థం. ఇంద్రియసుఖాలను గ్రహించు కేంద్రములతో కలిసే దుఃఖాన్ని, బాధను గుర్తించే కేంద్రాలు కూడ ఉన్నాయని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. కనుక లౌకికము, ఇంద్రియ గోచరమైన సుఖం దుఃఖ మిశ్రమమని, 'అసలైన' ఆనందాన్నివ్వలేదనీ ప్రాచీన గ్రంథాలలో చెప్పబడ్డ సత్యాన్నే ఆధునిక శారీరక శాస్త్రం నిరూపిస్తుంది.

# బ్రెయిలీలో "శ్రీ సాయిలీలామృతం" ఆవిష్కరణ

జనవరి 2012

శ్రీ దత్తప్రభువు జన్మించిన శుభదినమున శ్రీ దత్తజయంతి పర్వదినం ఎంతో భక్తి శ్రద్ధలతో, దివ్యజనని సన్నిధిలో వైభవంగా జరిగింది. 10 రోజుల పాటు గురురూపమైన ధునిని అమ్మగారి ఆశీస్సులతో పూజించుకున్న భక్తులందరూ 11వరోజు దత్తజయంతికాగా చక్కటి వేదికను ఏర్పాటు చేసి అమ్మగారిని ఆహ్వానించి, ఆమె దివ్య సన్నిధిలో, శ్రీ సాయి, శ్రీ దత్తప్రభువు, శ్రీ గురు భరద్వాజుల చిత్రపటాల ఎదుట ధుని పూజ నిర్వహించారు. షోడశోపచారాలతో, దత్తభజనలు గురు పుత్రిక శ్రీమతి వేదవతి పాడుతుండగా శ్రీ ద్వారకనాధ్ ధుని పూజ చేశారు.

అనంతరం అమ్మగారి దివ్య హస్తములమీదుగా "బ్రెయిలీ" భాషలోకి అనువదించబడిన శ్రీ సాయిలీలామృతం అవిష్కరించబడింది. అంధులయిన సోదర సోదరీమణులకు శ్రీ సాయిలీలామృత గ్రంధ పారాయణ అనే మహదవకాశాన్ని అందించాలనే ఆశయంతో చక్కటి కృషి సల్పి ఆ గ్రంధాన్ని దత్తజయంతికల్లా అందించగలిగిన శ్రీ మంగభరద్వాజ ట్రస్టు వారికి, సహకరించిన భక్తులకు కృతజ్ఞతలు చెప్పి తీరాలి. అమ్మగారి చేతులమీదుగా అట్టి గొప్ప గ్రంధం అవిష్కరించబడటం, అదీ పరమ పవిత్రమయిన దత్తజయంతినాడు, గురుమూర్తిని ధునిగా పూజించుకొన్నాక జరగడం నిజంగా ఎంత గొప్ప విషయం!

ఈ గ్రంధాన్ని అంధులకు ఉచితంగా అందిచాలన్న సంకల్పం కలిగినది తరువాయి, ఎందరో భక్తులు ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి ముందుకు వచ్చారు. వారందరి సహకారంతో ఈ గ్రంధం వెలువడింది.

అయితే విజ్ఞుల సలహా మేరకు అంధులకు ఈ గ్రంధంతోపాటు ఆడియో CDల రూపంలో, mp3ల రూపంలో గ్రంధాలు అందితే బాగుంటుందని సంకల్పం. ఈ గ్రంధాలు వెలువడడానికి తమ కృపను ఎలా కురిపించారో, అలానే ఈ ఆడియో CDలు వెలువడే మహత్కార్యాన్ని అనుగ్రహించమని, అట్టి సదవకాశాన్ని విజయవంతంగా పూర్తి చేసే కార్యదీక్షను ప్రసాదించమని శ్రీ సాయినాధునికి, శ్రీ అలివేలుమంగా సమేత భరద్వాజ మహరాజ్‌కూ ప్రార్ధన!



## Books on Sri Ramakrishna Paramhansa and Swami Vivekananda

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 |
| భారతం నా అమర భారతం | 20.00 |
| జ్ఞాన యోగం | 30.00 |
| బుద్ధి యోగం | 15.00 |
| కర్మ యోగం | 15.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 |
| స్వామి వివేకానంద (2 భాగాలు ) | 60.00 |
| మహాభారతం | 5.00 |
| నా అమర సందేశం | 30.00 |
| భక్తి యోగం | 10.00 |
| సందేశ తరంగిణి(కొలంబో-అల్మోరా) | 40.00 |
| వివేక సూర్యోదయము | 20.00 |
| దైవంతో సహజీవనం | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 |
| మువివేకానంద లేఖావళి | 25.00 |
| రామాయణం | 5.00 |
| My Idea of Education | 34.00 |
| Karma Yoga | 18.00 |
| God Lived with Them | 170.00 |
| The Lived with God | 140.00 |
| Raja Yoga | 36.00 |
| Bhakti Yoga | 16.00 |
| Jnana Yoga | 50.00 |
| Letters of Swami Vivekananda | 110.00 |
| Reminiscences of Swami Vivekananda | 100.00 |
| Talks with Swami Vivekananda | 58.00 |
| Complete Works of Swami Vivekananda-9 | 110.00 |
| Meditation and Its Methods | 18.00 |
| Vivekananda on Himself | 100.00 |
| Ramakrishna and Vivekananda | 7.00 |
| Tales and Parables of Sri Ramakrishna | 45.00 |
| Lectures from Colombo to Almora | 40.00 |
| Complete Works of Swami Vivekananda | 50.00 |
| Sayings of Sri Ramakrishna | 25.00 |

### జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయిమాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయిమాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు-పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine Subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone :040-20063300

**OR, Sri Manga Bharadwaja Trust , Ongole Branch Office**
Kothapeta, Kondaiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.** **Magazine** మరియు **General Donations** ను **"Sri Manga Bharadwaja Trust"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Annadanam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Sai Master)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Ashramam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Peace Foundation)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల్వారా పంపగలరు

**Books order** ను **"Sri Manga Bharadwaja Trust (Publications)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు**

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

**ఇతర ప్రచురణలు**

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

**BOOKS IN ENGLISH**

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

**BOOKS IN OTHER LANGUAGES**

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300

**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**

*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*



అమ్మగారి సన్నిధిలో శ్రీ దత్తజయంతి సందర్భంగా
ధునిపూజ, "బ్రెయిలీ సాయిలీలామృతం" ఆవిష్కరణ.

edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust,
ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.

POSTAL REGD.NO.PRAKASAM/16/2012-2014
REGD.NO. 37926/83
ESTABLISHED : 1983
FEBRUARY 2012
వెల – ₹ 10/-

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంచిక : 10 సంపుటి : 29



ఆచార్యుల ఆధ్యాత్మికానుభూతి 50వ వార్షిక మహోత్సవానికి
ఆరంభ సంచిక!



ఆచార్యుల ఆధ్యాత్మికానుభూతి

# 50వ వార్షిక మహోత్సవానికి

ఆరంభ సంచిక!

# మహాశివరాత్రి



ఫిబ్రవరి 2012

మహాశివరాత్రి. ఇది పరమేశ్వరునికి అత్యంత ప్రీతి పాత్రమైన రోజు. భక్తులు ఈ దినము ఉపవాస, జాగరణలతో శివుని భక్తితో సేవించుకునే రోజు. అబుద్ధి పూర్వకముగా ఈ దినము ఉపవాస, జాగరణ చేసినా కూడా, అమోఘమైన ఫలప్రాప్తి కలుగుతుంది. శ్రీగురుచరిత్రలోని విమర్షుడు కుముద్వతుల కథ ఈ సత్యాన్ని తెలుపుతుంది.

ఈశ్వరలింగము వృత్తాకారములో వుంటుంది. అంటే ఆది అంతము లేనిది. పూర్ణ పరబ్రహ్మము. అది స్ఫటికమయము. అనగా శుద్ధమైనది. స్ఫటికము ఎన్ని విభాగములు పొందినను, ప్రతి విభాగము పూర్వ స్ఫటిక గుణములు కలిగి వుంటుంది. అనగా ఆది అంతములేక, శుద్ధమై స్వచ్ఛమై, ఎన్ని రీతులుగా పొడచూపినను ఒక విధమైన తత్వమును సూచించునది. అది శివము. నిత్యసత్యము.

ఈశ్వరుడు అర్ధనారీశ్వరుడు, నటరాజమూర్తి, దక్షిణామూర్తి, త్రినేత్రుడు. అర్ధనారీశ్వరము స్త్రీని ప్రకృతిపరంగా, పురుషుని శివపరంగా సూచిస్తుంది. సృష్టి వికాసము, శివ శక్తుల సంగమము చైతన్యమే అని అర్థము. సృష్టిలోని దివారాత్రములు, ఋతుచక్రములు, గ్రహ పరిభ్రమణములు, కాల గమన లయల విన్యాసమే నటరాజమూర్తి నాట్య విలాసము. జగతికి హితము బోధించటము దక్షిణామూర్తి తత్త్వము. అంతర్ దృష్టి ఆత్మవికాసానికి, నిరంతర అన్వేషణను సూచిస్తుంది. అది త్రినేత్రునికి అర్థము.

శివుడు ఆదిభిక్షువు. లేనివారికి మనము చేసే ప్రతి సహాయము అందరిలోవున్న శివ స్వరూపానికే చెందుతుంది. అన్నపూర్ణ అభీష్టప్రదాయిని. ఇతరుల నుంచి మనము పొందేది కూడా ఆ అమ్మ అనుగ్రహమే. దానికి సాయి చెప్పినది చక్కగా సరిపోతుంది. "నేను చేసేదేమిటి, ఒకటి తీసుకొని పది యిస్తున్నాను" అని అన్నారు. శివశక్తులు అభిన్నులు కారు. వారు ఒక్కటే.

అక్షరాభ్యాసములో వర్ణమాలకు ముందు "ఓం నమః శివాయః" అని దిద్దపెట్టటములోని అంతరార్థము, జగతికి చైతన్య స్వరూపమైన శక్తిని సదా గుర్తుపెట్టుకోవటము కోసమే.

విజ్ఞానపరంగా చూచినా ఈ సృష్టి అంతా క్షేత్రం (ప్రకృతి), అందులోని అణుజాలమంతా శివం (మూలకములు). శక్తి (చైతన్యం) వల్ల నిరంతర అణుపరిభ్రమణము జరుగుతుంది. మూలకాల సంయోగము వల్ల జీవ, జంతు, జడ పదార్థములు ఉద్భవిస్తాయి. ఈ విధముగా సృష్టి రచనా విధానము నిరంతరము కొనసాగుతూనే వుంటుంది. నటరాజుని నాట్యకేళిలో అంతర్లీనముగావున్న భావన యిదే.



*విజ్ఞాన పరంగా చూచినా ఈ సృష్టి అంతా క్షేత్రం (ప్రకృతి), అందులోని అణుజాలమంతా శివం (మూలకములు). శక్తి (చైతన్యం) వల్ల నిరంతర అణుపరిభ్రమణము జరుగుతుంది. మూలకాల సంయోగము వల్ల, జీవ, జంతు, జడ పదార్థములు ఉద్భవిస్తాయి.*

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

SRI MANGA BHARDWAJA TRUST

సంపుటి: 29 ఫిబ్రవరి-2012 సంచిక: 10

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


పరమపూజ్య శ్రీ ఆచార్య ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"

విషయసూచిక




చిరునామా

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**



చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి
ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ ఆర్.ఎస్. శశిధర్, పిహెచ్. డి

చందా వివరములు

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10-00 |
| సంవత్సర చందా | : రూ. 100-00 |
| రాజపోషకులు | : రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000-00 |


నిజమైన గురువు మనలోనే చైతన్య స్వరూపుడుగా ఉన్నాడని రమణమహర్షి, యోగి వేమన, సాయిబాబావంటి మహాత్ములూ, ఉపనిషత్తులూ, గురుగీత మొ॥న శాస్త్ర గ్రంథాలు చెబుతాయి. ఈ విషయాన్నే బైబిల్ *"Be still and know that I am God"* అంటే – "నిశ్చలంగా ఉండి నీలోని "నేనే" దైవమని గుర్తించు" అని అర్థము. దీన్నే ఖురాన్‌లో భగవంతుడు తాను భక్తుడికి అతని కంఠనాళాల కంటేకూడా సన్నిహితంగా ఉన్నానని చెపుతాడు. ఈ అనుభవాన్నే బౌద్ధమతం, "బోధి", "నిర్వాణము", "బుద్ధత్వము" అనే పదాలతో చెబుతుంది.

- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ

# ఇవి సాయిచేసే హెచ్చరికలా?



ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

ఫిబ్రవరి 2012



ఏ విషయంలోనైనా మనకు సాయిబోధ ఏమిటో తెలియాలంటే ఆయన చరిత్రలో సామాన్యంగా తారసిల్లే సన్నివేశాలను పట్టుకుని చూచుకుంటే బాగుంటుంది. అయితే వీటిలో కొన్ని అంశాలు కొంచెం గుహ్యంగా వుంటాయి. అలాటి సూచన ఒకటి మనస్సుకు స్ఫురించినది చదువరులతో పంచుకుంటాను.

సాయిని సేవిస్తున్నవారికి గూడ నిత్యజీవితంలో పొడుగునా యిబ్బందిగల్గించే పరిస్థితి కొనసాగితే అది సామాన్యంగా ఆయననుండి మనకొచ్చే హెచ్చరికయై యుంటుంది. దానిని మనం అర్థం చేసుకొని అనుసరించే వరకూ ఆ యిబ్బంది తొల్గదేమో. ఈ విషయాన్ని సూచించే ఒక సన్నివేశాన్ని దీక్షిత్ తన డైరీలో వ్రాసుకొన్నాడు.

"ఒక శనివారంనాడు నేను బండిలో ఆఫీసుకు వెడుతుండగా నాకు జ్వరమొచ్చింది. నేను సాయిని స్మరించి యిలా ప్రార్థించాను: 'నాకు జ్వరం ఎక్కువయ్యేట్లయితే నన్ను మీరు శిరిడీ రమ్మని పిలిచినట్లు తలుస్తాను.' నేను ఆఫీసు చేరగానే నా బల్లమీద శిరిడీ నుండి వచ్చిన జాబు పెట్టి వున్నది! అందులో సాయిబాబా నన్ను శిరిడీ రమ్మని వ్రాయమన్నారని వున్నది!! ఆ రోజంతా నాకు జ్వరమున్నది; ఆ రాత్రి నేను రైలులో ప్రయాణం చేస్తున్నంత సేపూ జ్వరమున్నది. కానీ నేను శిరిడీ చేరిన క్షణం నుండి జ్వరం లేదు!! అయితే ఆ రోజునుండి బాబాకు నాల్గు రోజులు జ్వరమొచ్చింది!!

*సుఖదే తుని భక్తాంసే*
*త్వంచే దు:ఖ స్వయం సోశ॥*

తా: "నీ భక్తులకు సుఖమిచ్చి, వారి దు:ఖం నీవనుభవిస్తావు కదా!"

అలానే వెంగుర్లలోని దభోలీ మఠ్ (రత్నగిరి జిల్లా)లో ఒక సాంప్రదాయకుల సభ ప్రతి సంవత్సరమూ జరుగుతుంది. అన్నా సాహెబ్ ధభోల్కర్ (హేమాద్పంత్) 'మహామండల్' అనబడు ఆ సాంప్రదాయానికి చెందినవాడు. అతనిని ఆ సభకు అధ్యక్షత వహించమని 1917లో అడిగారు. సాయి అనుమతి లేని కారణంగా అతడు అంగీకరించలేదు. తరువాత సం॥ గూడా అతనిని కోరారు. కానీ అంతకు కొద్ది రోజుల ముందే అతనికొక స్వప్నమొచ్చింది. అపుడతడు బాంద్రాలో వున్నాడు. అధ్యక్ష స్థానము అంగీకరించమని దాని సారాంశం. దానిననుసరించి అతడు అంగీకరించాడు. అంతవరకూ ఎన్నో రోజులుగా హిస్టీరియా, జబ్బుతోను, అనారోగ్యంతోనూ బాధపడుతున్న అతని కుమార్తె ఆరోగ్యం నాటితో బాగుపడింది! ఇక బాధే లేకండా పోయింది. అంటే సద్గురు, సద్ధర్మాలకు సంబంధించిన విషయాలలో తన కర్తవ్యం నిర్వహించేవరకూ సద్భక్తులను కొన్ని బాధలు వదలవేమో!

---



# "మామిడి పూతంతా పండ్లవుతాయా?

ఫిబ్రవరి 2012

ఇహాపర శ్రేయస్సుకు ప్రతి మనిషికీ సత్సంగమవసరం. కారణం ప్రాకృతిక జీవితంలో మానవ హృదయంలో 'సంగము' (లోలత) చోటు చేసుకొని కర్మ బంధాన్ని కల్గిస్తుంది. మమకారము మొదలుకొని మనము మళ్ళీ మళ్ళీ చేసే పనులన్నీ, ఆలోచనలన్నీ అభ్యాసాలుగా మారుతాయి. మన శరీరము, మనస్సు మరల మరలా ఆ పనులే అట్టి యోచనలే చేయటానికి ఆరాటపడతాయి. గోళ్ళు కొరుక్కోవడం దగ్గరనుండీ, కాఫీ టీల దగ్గరనుండి, చీట్లపేక, గాలికబుర్లు, సాటివారి గురించి ఈర్ష్యాద్వేషాది భావాలతో యోచించడము, మాట్లాడడందాకా అన్నీ మనలో వాటివల్ల ఏర్పడిన సంగంమీదనే ఆధారపడి అభ్యాసాలవుతాయి. వాటిని మానుకోడానికి ప్రత్యేకమైన యత్నమెంతో అవసరమవుతుంది.

సంగము చాలా బలమైనది. అది ఏర్పడడం సులభమేగాని, వాటిని నిర్మూలించడం చాలా కష్టం. ఎంత కష్టంగా అన్పించే పనైనా పట్టుదలతో కొంతకాలం చేస్తుంటే, అభ్యాసం వలన ప్రీతికరమై చివరికి వదలుకోలేనిదిగా తయారవుతుంది. ఉదాహరణకు కారం పసిపిల్లలకెంత దుర్భరంగా ఉంటుంది? కాని బాల్యంనుండీ తింటూంటే ఒకనాటికి కారంలేకుండా భోజనంగాని, అల్పాహారం గాని తినడమెంత కష్టంగా వుంటుంది!

ఇంత బలీయమైన సంగం మామూలుగా మనకు యింద్రియాల ద్వారా అనుభవమయ్యే విషయాలపట్ల, వాటివలన మనకు కల్గే సుఖ దుఃఖాల పట్ల, అభ్యాసం వల్ల ఏర్పడుతుంది. అలా అది ఏర్పడ్డాక మరలా మనము ధ్యానము, సాధన చేయదలచినప్పుడు అమిత బలమైన చాంచల్యంగా ప్రకటమై తొలగించుకోలేని ప్రతిబంధకమవుతుంది. అదెంత బలీయమో తెలియాలంటే ఎందరు పూజలు పునస్కారాలు, యాత్రలు మొ॥నవి చేస్తున్నారో, వారిలో రామకృష్ణ పరమహంసలవలే కృతార్థులయ్యే వారెంత కొద్దిమంది? దీనినే శ్రీ కృష్ణుడు భగవద్గీతలో ("మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్ యతతి సిద్ధయే" అన్న శ్లోకంలో) యిలా చెబుతాడు – "కొన్ని వేలమంది మనుష్యులలో ఎవడో ఒకడు ఆత్మజ్ఞానం కోసం నిజంగా ప్రయత్నించేవాడుంటాడు. అలా ప్రయత్నించేవారిలో ఏ ఒక్కరో పూర్ణత్వం చెందుతాడు". అంటే మనం చూచే అసంఖ్యాకులైన భక్తులు, సాధువులందరూ కృష్ణుని ప్రకారం ముముక్షువులేగారు. ఎక్కువమంది మొదట అదే లక్ష్యంగా



*మనం చూచే అసంఖ్యాకులై భక్తులు, సాధువులందరూ కృష్ణుని ప్రకారం ముముక్షువులేగారు, ఎక్కువమంది మొదట అదే లక్ష్యంగా సాధన ప్రారంభించినా, మధ్యలో కీర్తి, ధనము, మొదలైన వాటి ప్రాబల్యము ప్రబలుతాయి. ఎక్కువమంది పేరుకుమాత్రమే సాధకులుగాను, భక్తులుగానూ మిగులుతారు.*

సాధన ప్రారంభించినా, మధ్యలో కీర్తి, ధనము, మొదలైన వాటి ప్రాబల్యము ప్రబలుతాయి. ఎక్కువమంది పేరుకుమాత్రమే సాధకులుగాను, భక్తులుగానూ మిగులుతారు. కొందరు యితర మతాలకంటే తమ మతమే ఆధిక్యమని నిరూపించడానికి ప్రాకులాడుతూంటే, మరొకరు తాము ఆత్మజ్ఞానం సాధించకనే లోకులకు గురువులై, వీలైనంతమంది శిష్యులను– చిల్లర చమత్కారాలతోనో, మంత్రోపదేశాలతోనో, ప్రశ్నలతోనో, పూనకాలతోనో– సమకూర్చుకోజూస్తూంటారు. కొందరు విరాగులమని కాషాయం ధరించాక ఆశ్రమాలేర్పరచి వాటికి ఆస్తిపాస్తులు చేకూర్చుకోవడానికి ప్రాకులాడుతుంటారు. మరీ యింతటి ఆత్మవంచనకో, పరవంచనకో సాహసించలేనివారు సంసారులుగా వుంటూనే గురుదేవులన్పించుకోజూస్తారు. అందుకే క్రీస్తు అన్నారు– **"Many are called but only a few are chosen"** – "ఎందరో (సన్మార్గానికి) ఆకర్షించబడతారు కాని వారిలో (భగవంతునిచేత) ఆమోదించబడేవారు ఏ కొద్దిమందో!" అని. అదే విషయం సాయి "మామిడి చెట్టు మీద పూతంతా పండ్లవుతాయా? పూతగాను, పిందెలుగానూ ఎక్కువ భాగం రాలిపోతాయి. చివరిదాకా నిలిచియుండి పండ్లయ్యేవి ఏకొద్దో!" అని చెప్పారు. మానవులలో ఎందరో సాధన ప్రారంభిస్తే, వారిలో ఏకొద్దిమంది తీవ్రమైన తపస్సు, యజ్ఞయాగాలు పట్టుదలతో చేయగల్గుతారో; కాని వీరిలో కొందరు భస్మాసురుడు, రావణాసురులలాగ రాక్షసులవుతారు; కొందరు యింద్రాది దేవతలవుతారు. మిగిలిన వారిలోగూడ కొందరు విశ్వామిత్రునిలా చిరకాల తపస్సు తర్వాత గూడ 'కామ–కాంచనాలకు' దాసులై పతనమవుతుంటారు. ఏ కొద్దిమందో ఆయనలా చివరకు బ్రహ్మజ్ఞానులవుతారు. శ్రీకృష్ణుడి కాలమైన ద్వాపరయుగంలోనే ముముక్షువులంత కొద్దిమందివుంటే, యిక కలియుగమైన మన కాలం సంగతి చెప్పవలసినదేమున్నది? ఈ యుగంలో ఆత్మజ్ఞానంలేక గురువులై శిష్య సేకరణ చేసేవారే ఎక్కువన్నది ఋషులనిర్ణయం. అందుకే సాయిబాబాగూడ "నిజమైన ఫకీరు చాలా అరుదు" అన్నారు. 'ఫకీరు' అంటే వారి పరిభాషలో 'గురువు' అని అర్థం. తమ గురువు గురించి ఆయనెప్పుడూ అలానే అనేవారని మరువగూడదు.

> *ఈ యుగంలో ఆత్మజ్ఞానంలేక గురువులై శిష్య సేకరణ చేసేవారే ఎక్కువన్నది ఋషులనిర్ణయం. అందుకే సాయిబాబాగూడ "నిజమైన ఫకీర్లు చాలా అరుదు" అన్నారు. 'ఫకీరు' అంటే వారి పరిభాషలో 'గురువు' అని అర్థం.*

ఇంత భీభత్సానికి కారణం సంగమే! అందుకే భగవద్గీత 15వ అధ్యాయంలో పురుషోత్తమప్రాప్తికి మార్గం "అసంగ శస్త్రేణ దృఢేన చిత్త్వా" – అంటే "సంగరాహిత్యమనే ఆయుధంతో సంగం వలన నానాటికీ విజృంభిస్తూండే సంసార వృక్షాన్ని ఛేధించాలి" అని చెప్పాడు. అయితే మనకొచ్చిన సమస్య మనవద్ద యీ అసంగమనే శస్త్రం లేకపోవడమే! అది మనం సిద్ధం చేసుకొంటేగా? దానినెలా సిద్ధం చేసుకోవాలి?

# మానవులు శ్రమించి జీవించాలన్నారు సాయి



ఫిబ్రవరి 2012

ఆధ్యాత్మికపరమైన జీవితమంతా భగవంతునిపట్ల కృతజ్ఞతతో జీవించడమేనని ముందరి సంచికలలో వివరించారు. ఈ జీవిత విధానమేమో దానిని అమలులోపెట్టే ముందు అవి సార్ధకంకావాలంటే మానవులు తెలుసుకోవలసినదేమో అదే సత్యం; దానిని చక్కగా అర్థం చేసుకుని సరియైన భావంతో ఆచరణలో పెట్టడమే ధర్మము, ధర్మాచరణ. ఈ రెంటినీ హృదయపూర్వకంగా మానవులు అలవాటు చేసుకోవడం అంత తేలిక గాదు. అందుకు భగవంతునిపట్ల అచంచలమైన విశ్వాసము, ఆచరణలో ఎదురయ్యే సాధక బాధకాలను ఓర్చుకొనడం, ప్రేమ పారవశ్యము కొంతైనా వుండాలి. ఈ రెండు భగవదనుగ్రహాన్ని కొంతైనా చవిచూడనిదే కలగవు, మానవుడు పశువుగానే వుండిపోతాడు. ఇంద్రియాలకూ మనస్సుకు విషయ సుఖాలపట్ల గల సహజమైన చాపల్యము. ఇంతా అంతా అని చెప్పరానిది. పసిబిడ్డలుగా వున్నప్పుడు కించిత్తైనా నాలుకకురాస్తే భరించలేనంతగా బాధించే కారంగూడా తినగా, తినగా అదిలేకుంటే ముద్ద ఎత్తలేని పరిస్థితికి తేగలదు. ఇలా ఎన్ని రుచులకో అలవాటుపడిన మనస్సు, సుఖాలకు అలవాటుపడిన శరీరము ఈ అంతర్ యుద్ధంలో మనలోని మలిన సంస్కారాల పక్షమే వహిస్తుంటాయి. ఇది తెలిసిన ఋషులు పిల్లలను చిన్నవయస్సునుండే ఆరితేరిన ఆచార్యునివద్దనుంచి ఒక వంక వారి మనస్సులను సదవగాహనతోనూ, శరీరాలకు క్రమశిక్షణను అలవరిచేలా చూచుకోవాలని ఆదేశించారు. ఇదే బ్రహ్మచర్యాశ్రమము. అది అలవడ్డాకనే, అలవరచుకొనినవారికి మాత్రమే, గృహస్థు జీవితం అలవర్చుకోడానికి, అతనిని అన్ని రీతులా పరీక్షించిన ఆచార్యమండలి అనుమతి, ఆశీస్సులు ఇవ్వవలసి వుండేది. ఇదే ఈనాడు వివాహమహోత్సవములో 'సదస్యం' అని చెప్పబడుతుంది. ఆచార్యులను సేవించి భగవదనుగ్రహాన్ని చవిచూచి, పరవశించి తన జీవితమంతటినీ సంపూర్ణంగా దానిని పొందడానికి మాత్రమే అంకితము చేయదల్చి అందుకవసరమైన వేదాంతోపదేశంకోసం సర్వమూ విడచి బయలుదేరిన వారికి మాత్రమే గృహస్థాశ్రమానికి అర్హత లభించేది. కారణం అట్టివారు మాత్రమే రాగ, ద్వేష, మమకారాదులలో తగులుకొనకుండా సర్వ జీవుల శ్రేయస్సు కోసమై తన శక్తి సామర్థ్యాలను అంకితం చేసి, అట్టి పవిత్ర జీవికతో తనను పోషించుకుంటూ, తిరిగి అటువంటి ఉన్నత సంస్కారాన్ని పొందిన బిడ్డలను సమాజానికి అందించడమే గృహస్థాశ్రమము యొక్క లక్ష్యము. అప్పుడుమాత్రమే అనేక జన్మలుగా మనలో పాతుకొన్న



*ఋషులు పిల్లలను చిన్నవయస్సునుండే ఆరితేరిన ఆచార్యునివద్దనుంచి ఒక వంక వారి మనస్సులను సదవగాహనతోనూ, శరీరాలకు క్రమశిక్షణను అలవరిచేలా చూచుకోవాలని ఆదేశించారు. ఇదే బ్రహ్మచర్యాశ్రమము. అది అలవడ్డాకనే అలవరచుకొనినవారికి మాత్రమే గృహస్థు జీవితం అలవర్చుకోడానికి అతనిని అన్ని రీతులా పరీక్షించిన ఆచార్యమండలి అనుమతి, ఆశీస్సులు ఇవ్వవలసి వుండేది.*

కామాదివికారాలు అత్యంత సహజములన్న నిర్లిప్తభావమేర్పడి, వాటివట్ల మానవులకున్న భ్రమతొలగగలదు. గృహస్థ జీవితమంతా సమాజం పట్ల, తన పూర్వీకుల పట్ల, యింతటి ఉత్తమ ధర్మాలు మనకు ప్రసాదించిన ఋషుల వట్ల, మనకున్న గౌరవం వ్యక్తమవ్వాలి. అప్పుడే వారి అనుగ్రహాన్ని సంపూర్ణంగా పొందగలగాలన్న ప్రయత్నం ఆరంభమవుతుంది.

కానీ అంత మాత్రమేచాలదు. ఇలా జీవునికి ప్రబోధమయ్యాక అనాదిగా అతని హృదయంలో నాటుకుపోయిన మలిన సంస్కారాలకు, పై భగవదనుగ్రహం పొందాలన్న ఆకాంక్షకూ సంఘర్షణ ప్రారంభమవుతుంది. అప్పటినుండి అడుగడుగునా ప్రతి జీవిత సంఘటనలోనూ సద్గురువు తెల్పిన ధర్మానికి– మానవులలోని దృఢములు, మలినములు అయిన సంస్కారాలకూ అంతరయుద్ధం ప్రారంభమవుతుంది. సాధకుడు అనుక్షణము జాగరూకుడై ప్రతి సన్నివేశంలోనూ సాయి చెప్పిన ధర్మం వైపుకు అడుగువేస్తూ, యిట్టి కుసంస్కారాలను వెలివేస్తూ పోవల్సివుంటుంది. కాని ఈ పరిస్థితి ఏర్పడకముందు నుండే జీవితంలో మనకు మన మలిన సంస్కారాలను అనుసరించి జీవించడం అలవాటయిపోయి వుంటుంది. అదే అభ్యాసంగా ఘనీభవించి వుంటుంది. అభ్యాసబలం అందువలన అతనిలో తలయెత్తే స్వార్ధము, మమకారము, వాటి ప్రతిబింబాలైన అసూయా, ద్వేషము, అహంకారము మొదలైనవి మన హృదయాలలో మహావృక్షాలుగా నాటుకొనిపోయి వాటి శాఖలు అనంతమైన ఆకాశం వంటి పరమాత్మనుగూడ మన దృష్టి నుండి మరుగు పరుస్తాయి. అట్టి జీవి భగవంతుని అనుగ్రహము ఒక్క సారైనా చవి చూస్తే గాని యిట్టి అవరోధాలను అతిక్రమించి ఉత్తమ జీవితానికై ప్రయత్నించే సంకల్పమైనా కల్గదు. ఆ భగవదనుగ్రహము నిప్పురవ్వలాగా మన హృదయంలో రాచుకొని ఆ మహా వృక్షాలను భస్మంచేసి ఆకాశంవంటి పరమాత్మ తత్వంపై మనదృష్టి ప్రసరించేలా చేస్తుంది. అటువంటి భగవదనుగ్రహమే సాయి వంటి పూర్ణుడయిన సద్గురువు లభించటమంటే. వారి రూపంలో భగవంతుని అనుగ్రహము సర్వశక్తి మత్వము జీవులు చవి చూస్తాయి. అటు తర్వాత ఎంత శ్రమించియైనా ఆయన ఋణం తీర్చుకొని అటు తర్వాత మన పట్ల, భగవంతుని పట్ల తీర్చుకోవలసిన ఋణాలను తీర్చుకొనగలడానికి అట్టి మానవుడు ఎదురు చూస్తాడు. అదే ఆత్మవిద్య లేక బ్రహ్మవిద్య.

మనస్సు, ఇంద్రియాలు మరియు శరీరాన్ని సంపూర్ణంగా అందుకు అంకితమయ్యేలా శిక్షణమివ్వడమే వానప్రస్థాశ్రమము. అట్టి శిక్షణ సంపూర్ణంగా అలవడిన స్థితియే సన్యాసాశ్రమం. అట్టి స్థితి అతనికి కలిగినదో లేదో పరీక్షించిన తర్వాత మాత్రమే వెనుకటి రోజులలో అతనికి అట్టి దీక్షనిచ్చేవారు. సామాన్యులందరికీ యిలా ఒక ఆశ్రమం తర్వాత ఇంకొక ఆశ్రమాన్ని సార్ధకం చేసుకుంటూ మాత్రమే పురోగమించడం భద్రము, నిర్దిష్ఠము అని ఋషులు నొక్కి చెప్పారు.

ఈ ఆశ్రమాలలో దేనికితగిన శిక్షణ, బోధ దానికి ప్రత్యేకంగా వుండేది. ఆదిశంకరులవంటి సాయిబాబాల వంటి అవతారమూర్తులకు మాత్రమే యిది వర్తించదని మహాత్ములందరూ చెప్పారు. అట్టివారు తమ భక్తులకు మరియు శిష్యులకు బోధించినదిగూడ ఈ ప్రకారమే వుండేది. సామాన్యులైన బోధకులలాగ ఉన్నతస్థాయికి చెందిన వేదాంతము వారెన్నడూ విక్రయించరు; గురువుల మనిపించుకోవడానికి పాటుపడరు. ప్రత్యక్షంగా సాయిని దర్శించిన 'నారాయణ్ ఆశ్రం' అను సన్యాసి, "బాబా మహా వాక్యాలు గాని లేక శంకరాచార్యుడు వ్రాసిన ఆత్మబోధ లేక 'వివేక చూడామణి' వంటి గ్రంథాలలో చెప్పినరీతిన (వేదాంతం) ఉపదేశించడం నేనెన్నడూ వినలేదు" అని



*మనస్సు, ఇంద్రియాలు మరియు శరీరాన్ని సంపూర్ణంగా అందుకు అంకితమయ్యేలా శిక్షణమివ్వడమే వానప్రస్థాశ్రమము. అట్టి శిక్షణ సంపూర్ణంగా అలవడిన స్థితియే సన్యాసాశ్రమం. అట్టి స్థితి అతనికి కలిగినదో లేదో పరీక్షించిన తర్వాత మాత్రమే వెనుకటి రోజులలో అతనికి అట్టి దీక్షనిచ్చేవారు.*



*మోక్షము మరియు వివేక వైరాగ్యాలు మొ॥న విషయాల గురించి బాబా చెప్పడమెన్నడూ నేను వినలేదు. ఆసనాలు, ప్రాణాయామ ధ్యానము మొ॥న వాటికి బాబా ఏమాత్రమూ విలువనివ్వలేదు. సమాజంలో నివసిస్తూ శ్రమించి వస్తువులనుత్పత్తి చేయాలన్న ఆదర్శాన్నే బాబా ఆచరించిచూపారు.*

వ్రాశాడు. ప్రొఫెసర్ నార్కేగూడ, "మోక్షము మరియు వివేక వైరాగ్యాలు మొ॥న విషయాల గురించి బాబా చెప్పడమెన్నడూ నేను వినలేదు. ఆసనాలు, ప్రాణాయామ ధ్యానము మొ॥న వాటికి బాబా ఏమాత్రమూ విలువనివ్వలేదు. సమాజంలో నివసిస్తూ శ్రమించి వస్తువులనుత్పత్తి చేయాలన్న ఆదర్శాన్నే బాబా ఆచరించిచూపారు. ఆయన ధాన్యాన్ని పిండిగావిసిరేవారు. సామాన్యులందరూ గృహస్థ జీవితాలే కొనసాగించాలని వారి భావం. భగవంతుని గురువులోనే చూచుకొనడమే వారి బోధంతటికీ మూలం. సాయిబాబాకు శిష్యులే లేరు. శిష్యుడన్నవాడు గురువునే సేవిస్తూ వారి అభీష్టాలనే అక్షరాలానెరవేర్చాలి. ఆయననలా సేవించగలవారు శిరిడీలో ఎవ్వరూ లేరు. వాచా బోధించి, భక్తులను సంస్కరించడం బాబా మార్గంగాదు. ఆయన చెప్పే నీతికథలు, చేసే కొద్ది సూచనలు బోధించడమేననవచ్చు. కాని ఆయనలా ఎంతో అరుదుగా మాత్రమే చేసేవారు. గురువును సంపూర్ణంగా శరణుపొందడమే, ఆత్మార్పణం చేసుకొనడమే సాయిబాబా సాంప్రదాయం. అట్టి భక్తులు ప్రత్యేకించి జపము, ధ్యానము వంటి సాధనలు చేయనవసరంలేదు. సరికదా, జపము, ధ్యానము లేక మేధస్సుతో చేసే సాధనలన్నీ కర్తృత్వాభిమానంతో గూడియుండడంవలన (సాధనకు) అంతరాయాలే అవుతాయి. గురువు చేయదలచిన ఉద్ధరణకు ఆటంకాలవుతాయి. (నిజమైన) గురువు బోధించడు. (ఆత్మ) ప్రభావాన్ని విరజిమ్ముతుంటారు. పూర్తిగా శరణుపొందిన శిష్యుడు దానిని యిముడ్చుకుని సంపూర్ణ శ్రేయస్సు పొందుతాడు. స్వంత తెలివితేటలు, స్వయంకృషి, అభిమానములు ఈ ప్రభావానికి అడ్డంకులవుతాయి. 'మెదలకుండా నా చెంతవుండు మిగలినదంతా నేను చేస్తాను' అన్నదే వారి వాగ్దానం.




*పూజ్యశ్రీ మాస్టరుగారి చిత్రపటముతో జ్ఞానప్రదాయినిగా, శుభప్రదంగా తయారయిన 2012వ సం. కాలండరును భక్తులు ట్రస్టు ఆఫీసులవద్ద ఉచితంగా పొందవచ్చును.*

# పిచ్చుక కాలికి దారం కట్టి లాగినట్లు నావాణ్ణి నా చెంతకు చేర్చుకుంటాను.



దివ్యజనని అలివేలు మంగమ్మ

ఫిబ్రవరి 2012



"పిచ్చుక కాలికి దారం కట్టి లాగినట్లు నావాణ్ణి నా చెంతకు చేర్చుకుంటాను" అని బాబా చెప్పారు. పూజ్యశ్రీ మాష్టరుగారి విషయంలో ఇది నూటికి నూరుపాళ్ళూ సరిపోతుంది. కారణం ఆయనను బాబా అలానే తమ చెంతకు చేర్చుకున్నారు.

పూజ్యశ్రీ మాష్టరుగారికి సుమారు పది సంవత్సరాల వయస్సున్నప్పుడు వాళ్ళ తండ్రిగారైన శ్రీమాన్ ఎక్కిరాల అనంతాచార్యులవారు వారి మేనత్త కూతురైన లక్ష్మీనరసమ్మగారింటికి వెళ్ళారు. వాళ్ళు బాబా భక్తులు. అందుకని వాళ్ళు తమ ఇంట్లో చిన్న మట్టి విగ్రహాన్ని పెట్టుకుని పూజించుకుంటూండేవారు. శ్రీమాన్ అనంతాచార్యులవారు పిల్లలతో సహా వాళ్ళింట్లో నాలుగురోజులు వున్నారు. అప్పుడు పూజ్యశ్రీ మాష్టరుగారు, శ్రీ వేదవ్యాసగారు లక్ష్మీనరసమ్మగారితో, "ఈ బాబా దైవంగాదు, ఇటువంటి బాబాలను, స్వాములనూ మేము నమ్మము" అని వాదనకు దిగారు. ఆమె వీళ్ళకు ఎంతో నచ్చచెప్పాలని చూసిందిగానీ వీళ్ళ వాదనాపటిమ, తెలివితేటలముందు వారిని ఒప్పించడానికి అశక్తురాలైంది. చివరకు ఆమె, "ఏమో నాయనా! ఎవరి నమ్మకాలు వాళ్ళవి. పిచ్చో, ఎచ్చో ! మేము ఆయననే నమ్ముకున్నాము. పూజించుకుంటున్నాము. మిమ్మల్ని నమ్మమని నేనేమి చెప్పడంలేదుగదా! మా దోవన మమ్మల్ని వదిలెయ్యండి" అన్నది. ఆమె అలా చెప్పినప్పటికీ పూజ్యశ్రీ మాష్టరుగారు ఊరుకోలేదు. మర్నాటి మధ్యాహ్నం ఆమె దొడ్లో కూర్చుని పాత్రలు తోముకుంటున్నది. అదే సరియైన సమయముగా తోచింది పూజ్యశ్రీ మాష్టరుగారికి, అంతే! ఆయన బాబా విగ్రహం మెడకు త్రాడుకట్టి తీసుకువెళ్ళి దొడ్డివైపు



*ఆయన బాబా విగ్రహం మెడకు తాడు కట్టి తీసుకువెళ్ళి దొడ్డివైపు వసారాకున్న తలుపుకు గడియ పెట్టారు. కటాకటాల్లోంచి ఆమెకు కన్పించేలా బాబా విగ్రహాన్ని ఊపుతూ ఆమెతో, "ఇదిగో చూడు! నీ బాబాను మెడకు త్రాడుకట్టి గోడకేసి కొడుతున్నాను. ఆయన ఏం చేస్తాడో చూస్తాను " అంటూ ఊపసాగారు.*

వసారాకున్న తలుపుకు గడియపెట్టారు. కటాకటాల్లోంచి ఆమెకు కన్పించేలా బాబా విగ్రహాన్ని ఊపుతూ ఆమెతో, "ఇదిగో చూడు! నీ బాబాను మెడకు త్రాడు కట్టి గోడకేసి కొడుతున్నాను. ఆయన ఏం చేస్తాడో చూస్తాను" అంటూ ఊపసాగారు. ఆమె లబ్బో దిబ్బోమని మొత్తుకుంటూ అలా చేయవద్దని పూజ్యశ్రీ మాష్టరుగారిని ఎంతగానో ప్రాథేయపడింది. కానీ పూజ్యశ్రీ మాష్టరుగారు అదేమి పట్టించుకోకుండా ఇంకా పెద్దగా, "ఇదిగో పగలగొడుతున్నాను" అంటూ ఆ విగ్రహాన్ని బలంగా గోడకేసి కొట్టి పగలకొట్టారు. ఇక ఆమె దు:ఖానికి అంతు లేదు. భోజనం కూడా చేయకుండా అలా దు:ఖపడుతూనేవుంది. సాయంత్రానికి ఇంటికి వచ్చిన ఆమె భర్త విషయం తెలుసుకొని ఆమెను సముదాయించాడు. "పిచ్చిదానా! బాబా అంటే ఆ విగ్రహమేనని అనుకొంటున్నావా! అయినా అది పగిలిపోతే ఏమైంది? మరొక విగ్రహాన్ని కొనుక్కుందాము" అని ఆమెను ఓదార్చి ఇంకా ఇలా అన్నాడు, "ఈ రోజు వీడు బాబా మెడకు త్రాడు కట్టాడు. ముందు ముందు వీడి కాలికి దారం కట్టి బాబా తమ దగ్గరకు చేర్చుకుంటారు చూడు!". ఆయన ఆనాడు అన్నమాట అక్షరాలా నిజమైంది.

అప్పటికా సంఘటన ముగిసింది. దాదాపు పది,పదిహేను సంవత్సరాలు గడిచిపోయాయి. సం॥ 1963లో పూజ్యశ్రీ మాష్టరుగారి రెండవ అన్నగారైన శ్రీ వేదవ్యాసగారు శిరిడీ వెళ్తూ పూజ్యశ్రీ మాష్టరుగారినిగూడ రమ్మన్నారు. అయితే పూజ్యశ్రీ మాష్టరుగారు ఏమాత్రం అంగీకరించలేదు. అప్పుడు శ్రీ వేదవ్యాసగారు శిరిడీలో తెలుగువారు ఎవరూ వుండరుగనుక (అప్పుడక్కడ తెలుగువారు కన్పించేవారుగాదు) తమకు తోడుగా మాత్రమే పూజ్యశ్రీ మాష్టరుగారిని రమ్మని కోరారు. అంతేగాక అక్కడ బాబాను సేవించనవసరంలేదనిగూడ చెప్పారు. అందుకంగీకరించి మాత్రమే పూజ్యశ్రీ మాష్టరుగారు శిరిడీ వెళ్ళారు. అలా బలవంతంమీద వెళ్ళిన పూజ్యశ్రీ మాష్టరుగారిని తమను వదలకుండా జీవితాంతం పట్టుకుని వుండేలాగా సాయిబాబా కట్టిపడేసుకున్నారు. అలా ఆయనను తమ చెంతకు చేర్చుకున్నారు బాబా.



అయితే శ్రీవేదవ్యాసగారు అంతకు ముందే బాబాను సేవిస్తుండగా పూజ్యశ్రీ మాష్టరుగారినే బాబా బలవంతంగా ఎందుకు తమ వద్దకు రప్పించుకున్నారు అన్నది ప్రశ్న. అందుకు కారణం లేకపోలేదు.

అయితే శ్రీ వేదవ్యాసగారు అంతకు ముందే బాబాను సేవిస్తుండగా పూజ్యశ్రీ మాష్టరుగారినే బాబా బలవంతంగా ఎందుకు తమ వద్దకు రప్పించుకున్నారు అన్నది ప్రశ్న. అందుకు కారణం లేకపోలేదు. కారణం బాబా సర్వజ్ఞులు. పూజ్యశ్రీ మాష్టరుగారి ద్వారా తాము చేయించుకోవలసిన లోకకళ్యాణ కార్యక్రమం ఎంతోవున్నదని ఆయనకు తెలుసు కనుకనే ఆయనలా చేసారు. నిజంగానే బాబా ఆయనచేత చేయించుకున్న బృహత్తర కార్యక్రమమేమిటో ఈనాడు మనకు స్పష్టంగా తెలుస్తూనే వున్నదిగదా!

అలా కాలికి దారం కట్టి బాబా తమవద్దకు లాగుకున్న ఈ 'పిచ్చుక' ఆధ్యాత్మిక ప్రపంచాన్నే సాయిమయంగా మార్చివేసింది. (క్షమించాలి, ఇక్కడ 'పిచ్చుక' అన్న పదాన్ని బాబా చెప్పిన మాటను ఉపయోగించడం మాత్రమే జరిగిందిగాని పూజ్యశ్రీ మాష్టరుగారిని కించపరచడం మాత్రం జరుగలేదని భావించాలి).

పూజ్యశ్రీ మాష్టరుగారు బాబా సన్నిధికి చేరేనాటికి చాలాకొద్దిమందికి మాత్రమే తెలిసిన సాయి నేడు ప్రపంచమంతటా ఏకచ్ఛత్రాధిపత్యంగా విరాజిల్లుతున్నారు. అంతేగాక ఆనాడు అసలైన ఆధ్యాత్మికత అంటే ఏమిటో తెలియక ఏదో గుళ్ళకు, గోపురాలకు వెళ్ళడమూ, ప్రదక్షిణలు, పూజలు చేయడమూ, నోములు, వ్రతాలు చేయడము మాత్రమే భక్తి అని కొద్దిగా ఆధ్యాత్మిక సాధన చేయడమే ఆధ్యాత్మిక సాధనలో పూర్ణతచెందడమని, వారే గొప్ప ఆధ్యాత్మికవేత్తలని భావించేవారు కొందరయితే, మరికొందరు భగవంతుని పూర్తిగా విశ్వసించని వారుండేవారు. కారణం ఆనాడు పాశ్చాత్య నాగరికత తలకెక్కి అలా జీవించాలన్న కోరిక రానురానూ ప్రజలలో బలీయమౌతూ మన సంస్కృతిని చిన్న చూపుచూడడము, తిరస్కరించే దశ ప్రారంభమైంది, ఊపందుకుంది కూడా. అందుకని ఆ రోజుల్లో దైవాన్ని ఎక్కువగా ప్రార్థించేవాళ్ళన్నా, దేవుని గుడికి వెళ్ళేవాళ్ళన్నా హేళన చేయడం ప్రారంభమైంది. అందుకని కొందరు చాటుమాటుగా దైవప్రార్థనలు

చేనుకునేవారు. మహాత్ములను సేవించేవారిని చూస్తేగూడా అదే విధమైన అవహేళన, పిచ్చివాళ్ళనే భావన ప్రజలలో మేల్కొంది.

అట్టి పరిస్థితులలో పూజ్యశ్రీ మాష్టరుగారు సాయి గురించి ప్రచారం చేయడం ప్రారంభించారు. అందుకని ఆయన సమాజం నుంచి గట్టి వ్యతిరేకతనే ఎదుర్కొన్నారు. కారణం రాముడు,కృష్ణుడు వంటి అవతారపురుషులను సేవించడమే అవివేకమని తలచే ఆరోజులలో ఒక ఫకీరును ఆరాధించడం మరీ పిచ్చిగా అనిపించేది వాళ్ళకు. అయితే పూజ్యశ్రీ మాష్టరుగారి పట్టుదల అమోఘం, అది అవతార పురుషులకు మాత్రమే సాధ్యం.

ఆయన తమ దగ్గరకు వచ్చినవారికి సాయిబాబాగూర్చి, ఆయన మహిమల గూర్చి, సాయి తత్త్వంగూర్చి చెప్పనారంభించారు. వారికి సాయిబాబా ప్రసాదించిన అనుభవాలవల్ల వారంతా శ్రీ సాయిని ఆరాధించడం ప్రారంభించారు. అంతేగాక 'శ్రీ సాయి లీలామృతము' అనే గ్రంధం రచించి దాని పారాయణ ద్వారా బహుళ ప్రచారం చేసారు. ఆనాడు శ్రీ రాముని గూర్చి తెలిపిన వాల్మీకి రామాయణం ఎలా ప్రచారమైందో అలానే ఈనాడు 'శ్రీ సాయి లీలామృతం' ద్వారా శ్రీ సాయిబాబా గూర్చిన సమగ్ర చరిత్ర ప్రజలకు లభ్యమైంది. దానితో సాయి మహిమ ప్రపంచానికి వెల్లడైంది. అందువలన ప్రజలు శిరిడీ రానారంభించారు. నేడు కోటానుకోట్ల ప్రజలు తండోపతండాలుగా శిరిడీ దర్శిస్తున్నారు. శ్రీ సాయిని సేవిస్తున్నారు.

ఆంతేకాదు, పూజ్యశ్రీ మాష్టరుగారిలో మరొక ప్రత్యేకతగూడ వున్నది. కేవలం బాబాను సేవించమని చెప్పడమేగాక ఆయనను ఎందుకు, ఎలా సేవించాలి? పారాయణ ఎలా చేస్తే సఫలమౌతుంది! సాయి బాబా యొక్క బోధలలోని అంతరార్ధమేమిటి? ఆయనను సేవించిన వారిని ఆయన ఏరీతిన సరియైన మార్గంలో నడిపించుకుంటూ వచ్చారు? ఆయన అవతార కార్యక్రమమేమిటి? ఆయన సూక్తులలోని అంతరార్ధమేమిటి? - వీటన్నింటి గూర్చి గూడ పూజ్యశ్రీ మాష్టరుగారు చెప్పేవారు.

అసలు ఆధ్యాత్మికత అంటే ఏమిటి? నిజమైన మహాత్ములు ఎలా వుంటారు? వారిని ఏవిధంగా గుర్తించవచ్చు? దొంగ సాధువులెలా వుంటారు? వారిని గుర్తుపట్టడమెలా? అసలు ఆధ్యాత్మికత ఎందుకు అవసరము? ధర్మానికి, ఆధ్యాత్మికతకూగల సంబంధమేమిటి? మానవుడు ధర్మంగా లేకపోతే ఏమౌతుంది? ఆధ్యాత్మికతకూ, ఆధునిక విజ్ఞానానికిగల సంబంధమేమిటి? - ఇలా ఎన్నో విషయాలను ఆయన వివరించేవారు. మానవులు ఇహపర సౌఖ్యాలను పొందడానికి ఆయన శాయశక్తులా ప్రయత్నించారు. అయితే ఆయన సంకల్పం పూర్తిగా నెరవేరినట్లేనా? అని ఎవరికైనా సందేహం కలుగవచ్చు. అందుకు ఆయన ఇచ్చిన సమాధానమే మనమూ ఇక్కడ చెప్పుకుందాము.

"నా ప్రయత్నం పూర్తిగా సఫలమైందా? లేదా? అన్నది నాకనవసరము. నాకు తెలిసిన విషయాలు చెప్పి నా సాటివారికి సాధ్యమైనంత మేలు చేయడానికి ప్రయత్నిస్తునాను. ఫలితం నా చేత సేవచేయించుకుంటున్న సాయియే చూసుకుంటారు. నేను ప్రస్తుతం విత్తనం మాత్రమే వేస్తున్నాను. అది పెరిగి మహావృక్షమవడానికి కొంత కాలం పట్టవచ్చు. ఏది ఏప్పైనప్పటికి ఫలితం నిర్ణయించవలసింది కాలము, కాలస్వరూపుడైన సాయి మాత్రమే" అనేవారు. ఇతరుల శ్రేయస్సు కోసం కన్నతండ్రిలా అమితంగా తాపత్రయపడుతూ ఫలితం ఆయన గురువుకు వదిలి వేయడం ఆయనకే సాధ్యం.

మానవుని స్వభావం చాలా చిత్రమైనది, దేనినైనా స్వార్ధంగా మలుచుకోగల సామర్ధ్యం దానికున్నది. కనుక పూజ్యశ్రీ మాష్టరుగారు ఆధ్యాత్మికత అంటే ఏమిటో, సాయిబాబాను సేవించడమంటే ఏమిటో అంతగా బోధించినప్పటికీ ప్రజలు ఆధ్యాత్మికత, సాధన జోలికి వెళ్ళకపోయినా, కనీసం బాబాను సేవించడంలోగూడ స్వార్ధము తొంగి చూస్తున్నది. ప్రజలోని ఆశ, భయాలను ఆసరాగా తీసుకుని కీర్తి, ధన కాంక్షగల కొందరు (దొంగ)



*మానవుని స్వభావం చాలా చిత్రమైనది, దేనినైనా స్వార్ధంగా మలుచుకోగల సామర్ధ్యం దానికున్నది. కనుక పూజ్యశ్రీ మాష్టరుగారు ఆధ్యాత్మికత అంటే ఏమిటో, సాయిబాబాను సేవించడమంటే ఏమిటో అంతగా బోధించినప్పటికీ ప్రజలు ఆధ్యాత్మికత, సాధన జోలికి వెళ్ళకపోయినా, కనీసం బాబాను సేవించడంలోగూడ స్వార్ధము తొంగిచూస్తున్నది.*

సాయి భక్తులు తమను తావే గురువులుగా భావించుకుంటూ తమదగ్గరకు వచ్చినవారిని అసలైన సాయిభక్తినుండీ ప్రక్క దారిపట్టిస్తున్నారు. అమాయక ప్రజలు వారినే సద్గురువులని, మహాత్ములనీ, అవతార పురుషులనీ భావించి సేవిస్తున్నారు. ఈనాడు ఈ దొంగ గురువుల బెడద చాలా ఎక్కువగానే కనిపిస్తున్నది. దీనివల్ల ఆధ్యాత్మికతకే చీడపట్టినట్లవుతున్నది. నిజంగా పూజ్యశ్రీ మాష్టరుగారు ఆశించినదిదేనా? ఆయన బాబా ప్రచారం అంతగా చేసినదిందుకేనా? అని అనిపించకమానదు.

A.K 47 రైఫిల్‌ను కనిపెట్టినవాడూ, మహా శక్తివంతమైన అణుబాంబును కనిపెట్టినవాడూ వాటిని ప్రస్తుతం ఉపయోగించుకుంటున్న విధానాన్ని చూసి తావెందుకు వాటిని కనిపెట్టామా అని ఎంతో బాధపడ్డారట, పశ్చాత్తాపపడ్డారుట. అలాగే జీవితాంతం పోరాడి స్వాతంత్ర్యాన్ని తెచ్చి మన చేతిలో పెట్టిన గాంధీ మహాత్ముడు నేటి మన దేశ పరిణామాలను చూస్తే తానెందుకలా చేశానా అని గుండె పగిలి మరణించేవారేమో! ఒకసారి ఎవరో ఒకరు మరణించాడట, అతనిని చూడవచ్చిన వారితో ఒకడిలా అన్నాడుట "నిజంగా ఈయన చచ్చిపోయాడుగాబట్టి బతికిపోయాడు, గానీ బ్రతికుంటే నిజంగా చచ్చిపోయేవాడే" అని అలాగే గాంధీ మహాత్ముని పరిస్థితిగూడ అని మనం ఊహించవచ్చు.

అయితే ఎంత గొప్పవారైనా మానవులేగనుక బాధపడితీరుతారు. పశ్చాత్తాపపడవచ్చుగూడ. కానీ మహాత్ములు, అవతార పురుషులు బాధపడడం వేరేవిధంగా వుంటుంది. వారు ఆధ్యాత్మిక వేత్తలు గనుక ఎప్పటి జబ్బుకు అప్పటి మందు; 'జైసా దేశ్, వైసా వేష్' అని బాబా అన్నట్లు దేశకాలాలను బట్టి వేషాలను అంటే అవతారాలను మారుస్తూ అప్పటి రోగానికి తగిన మందును కనిపెట్టిమరీ యిస్తారు. అదే వారి ప్రత్యేకత.

దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేయడానికి మళ్ళీ మళ్ళీ అవతరిస్తూనే వుంటారు. అట్లా అవతరించిన వారే పూజ్యశ్రీ మాష్టరుగారుగూడా. ఆయన ఈ శరీరాన్ని ధరించి వచ్చినప్పుడు కలి ప్రభావాన్ని అరికట్టి మనలను సన్మార్గాన నడిపించడానికి అనేక విధాల ప్రయత్నించారు. ఆధ్యాత్మికతకు వచ్చిన ఈ రుగ్మతను నివారించడానికి అనేక ఔషధాలను మనకందించారు. అవే- ధర్మ ప్రభోధము, గురు సాంప్రదాయాన్ని గౌరవించి పాటించడమూ, మహాత్ముల సేవ, వారి బోధలను ఆచరించడము.

వీటిని ఆచరించడానికి ప్రయత్నిస్తే క్రమంగా మనలో మార్పు వచ్చి సన్మార్గానికి వస్తామని, కలిమలం మనకంటదనీ ఆయన బోధించారు.

*అయితే ఆయన ప్రయత్నం ఫలించలేదని మటుకు చెప్పలేము. ఆనాడు ఆధ్యాత్మికత అంటేను, భక్తి అంటేనూ అయిష్టత వున్న ప్రజలు, మన శక్తికి మించిన అతీతమైన శక్తి ఒకటి వున్నదని, దానిని ఆశ్రయిస్తే తమ కోరికలు నెరవేరుతాయని భావిస్తున్నారు.* నేటి ప్రజలలో చాలా మంది బాబాలనో, స్వాములనో, అమ్మలనో ఆశ్రయించి తగిన ఫలితాలను పొందుతున్నారు.కనుక ప్రజల మనస్సులలో 'భక్తి' అనే బీజం పడింది గదా! ఆధ్యాత్మికత అంటే ఏమిటో తెలియకపోయినా ఆధ్యాత్మికత అంటే అయిష్టత తొలిగిపోయిందిగదా!!

ఇదంతా బాగానే వుంది. అయితే ఇప్పుడు మనకర్తవ్యమేమిటి? అని మనకు అనిపించవచ్చు. మనం చేయవలసిందల్లా పూజ్యశ్రీ మాష్టరుగారు యిచ్చిన ఔషధాలను బలవంతంగానైనా సేవించడమే. అవి నిజంగా అమృతతుల్యాలే అయినా మన అంతరాంతరాలలో వాటిపట్ల విముఖత వుంటుంది గనుక అవి మన పాలిట ఔషధాలే ! వాటిని బలంతంగానైనా సేవించడమెందుకంటే ఒకవేళ మనం పూజ్యశ్రీ మాష్టరుగారు చెప్పిన వాటిని పాటించాలనుకున్నా ఆచరణలో పెట్టలేకపోతున్నాము గనుక.

పూజ్యశ్రీ మాష్టరుగారి ప్రభంజనం ప్రభావిస్తున్న ఈ కాలం ఎంతో విశిష్టమైనది. ఈ కాలంలో జీవిస్తున్న మనం ఎంతో భాగ్యశాలురమే. పూజ్యశ్రీ మాష్టరుగారు మనలాంటి ఎందరినో(పిచ్చుకలను) ఏదో ఒక మిషతో తమ చెంతకు చేర్చుకుంటున్నారు, చేర్చుకుంటారు, సాయిసన్నిధికి చేరుస్తారు గూడ.

పూజ్యశ్రీ మాష్టరుగారిని బాబా తమ చెంతకు చేర్చుకున్న పవిత్రమైన విశిష్టమైన రోజు ఫిబ్రవరి తొమ్మిది. కనుక ఈ ఫిబ్రవరి తొమ్మిదిన మన శక్తి మేరకు మహోత్సవం జరుపుకుందాము. ఈ కృతజ్ఞతా మహోత్సవ సందర్భంగా ఎందరో పూజ్యశ్రీ మాష్టరుగారి వద్దకు రావాలని, ఆయన ఇచ్చే ఆధ్యాత్మికత అనే ఔషధాన్ని సేవించి నిత్యానందమనే ఆరోగ్యాన్ని పొందాలని పూజ్యశ్రీ మాష్టరుగారిని ప్రార్థిద్దాము. అలా జరగాలని ఆశిద్దాము.

**జై సాయి మాష్టర్**

# రాముడు, కృష్ణుడే రామకృష్ణుడు



ఫిబ్రవరి 2012

రామకృష్ణ జయంతి సందర్భముగా ప్రత్యేక వ్యాసం

**శ్రీ** రామకృష్ణ పరమహంస 1936వ సంవత్సరము ఫిబ్రవరి నెల 18వ తేదీన పశ్చిమబెంగాల్ రాష్ట్రములోని కామార్పుకూర్ అనే చిన్న గ్రామములో, కుధీరామ్ ఛటోపాధ్యాయ, చంద్రామణిదేవి అనే పుణ్యదంపతులకు జన్మించారు. పరమహంసకు తల్లిదండ్రులు పెట్టిన నామము గదాధరుడు. చిన్న తనములోనే పురాణములలోని కథలను ఎంతో శ్రద్ధగా, ఆసక్తిగా వినేవారు. చిన్నతనమున ఆరవ సంవత్సరమున ఒకసారి ఆకాశమార్గమున పోతున్న కొంగల బారునుచూచి, సమాధిస్థితిని పొందినారు. 5వ సం॥లో స్కూలుకు పంపినా కూడా చదువు మీద అంత ఎక్కువ శ్రద్ధ చూపేవారు కాదు. 1843వ సం॥లో తండ్రి మరణానంతరము 1849లో పెద్ద అన్నగారైన రామకుమార్‌గారివద్దకు గదాధరుడు కలకత్తా చేరినాడు. రామకుమార్ ఎలాగైనా తమ్ముని చదివించాలని తలచాడు. కాని, దానికి గధాధరుడు, "జీవనమునకు ఉపయోగపడు చదువుతో పనియేమి? దైవత్వాన్ని కనుగొనడము మానవ జీవిత ప్రధాన ఆశయము కావాలి. దానిని పొంది తీరాలి" అని బదులిచ్చెను. పోతన భాగవతములో ప్రహ్లాదుని చేతపలికించిన ఈ మాట "నిర్మలమందాకినీ వీచికలతూగు రాయంచచనునే తరంగిణులకు" అన్నది ఎంత సత్యము!





*ఒక రోజున "తల్లీ నీ దర్శనము కాని ఈ జన్మము వృథా! నేను జీవించి మటుకు ఏమి లాభము?" అని గోడకు వేలాడుతున్న కత్తిని తీసుకొని జీవిత పరిసమాప్తికి ప్రయత్నించగా, ఒక్కసారిగా శ్రీ రామకృష్ణ పరమహంస తీవ్ర సమాధిస్థితిలో మునిగిపోయారు.*

రాణిరాసమణిదేవి దక్షిణేశ్వరంలో నిర్మించిన కాళి ఆలయమునకు రామకృష్ణ పరమహంస, పూజారిగా నియమించబడెను. రామకృష్ణుడు కాళీమాత ఎదుట కూర్చొని నిరంతరధ్యానములో మునిగిపోయేవారు.

తరచుగా, "తల్లీ! కనపడవేమి? దయదలచవేమి? కరుణించు. నిన్ను చూచే భాగ్యము ప్రసాదించు!" అని విలపించేవారు. ఒక రోజున "తల్లీ నీ దర్శనము కాని ఈ జన్మము వృథా! నేను జీవించి మటుకు ఏమి లాభము?" అని గోడకు వేలాడుతున్న కత్తిని తీసుకొని జీవిత పరిసమాప్తికి ప్రయత్నించగా, ఒక్కసారిగా శ్రీ రామకృష్ణ పరమహంస తీవ్ర సమాధిస్థితిలో మునిగిపోయారు. కాళీదేవి విగ్రహము నుండి దివ్యకాంతులు తనలోకి ప్రసరించటము, చిరునవ్వులతో ఆశీర్వదించు కాళీమాత దర్శనము పొందినారు. పరమహంస అయినారు. తరువాత తల్లి కోరికను అనుసరించి శారదాదేవిని వివాహమాడినారు.

కాళీమాత అనుగ్రహమా అన్నట్లు భైరవీబ్రాహ్మణి అను యోగిని రామకృష్ణునివద్దకు వచ్చి తను సాధించిన తంత్రసాధనలన్నింటినీ రామకృష్ణునికి నేర్పినది. శైవ, వైష్ణవ పండితుల సభను ఏర్పాటుచేసి, సంపూర్ణ విచారణ తదుపరి, భైరవీబ్రాహ్మణీ శ్రీ రామకృష్ణులని భగవంతుని అవతారముగా ప్రకటించింది. జగన్మాత ఆదేశానుసారంగా "తోతాపురి" అను జ్ఞాని రామకృష్ణునికి నిర్గుణ పరబ్రహ్మ సాధనము చేయు విధానము తెలియపరచెను. రామకృష్ణ పరమహంస ఆ సాధనను కూడా మూడు రోజులలోనే సాధించెను. ఈ సత్యమును ఇతర మతముల విధానములను సైతం ఆచరించి సాధించారు. ఈ విధముగా భగవదవతారమైన శ్రీ రామకృష్ణ పరమహంస విభిన్న మార్గములలో ఆత్మానుభూతి పొంది విశ్వజనీన మతమును ప్రబోధించారు.

రామకృష్ణుని అద్భుతశక్తికి ఎందరో యువకులు ఆకర్షితులైరి. వారిలో అగ్రగణ్యుడు వివేకానంద. తన జాతి ఔన్నత్యమును; తన జాతి ఆధ్యాత్మిక సంపదను విశ్వమెల్ల వెలుగెత్తిచాటినారు. శ్రీ వివేకానందునిచే స్థాపింపబడిన రామకృష్ణ మిషన్ ఆధ్యాత్మిక సేవాకార్యక్రమాలు, మానవ సేవా కార్యక్రమములు ప్రపంచ మన్ననలను పొందినవి.

రామకృష్ణ పరమహంస బోధించిన సర్వమత సౌభ్రాతృత్వము, శ్రీ శిరిడీ సాయిబాబా అవతార కార్యము ఒకే విధానము కలిగియున్నవి. బాబా తన 72 గంటల సమాధి తర్వాత అల్లా ఆజ్ఞ మేరకే తాను తిరిగి వచ్చానని, గదాధరుడు సాగించవలసిన జగత్కళ్యాణభారము అల్లా తనపై ఉంచినాడని చెప్పటము, అవస్థే గారు చెప్పినట్లుగా పరమహంస నిర్యాణము, శ్రీసాయి తిరిగిలేచిన సమయము ఒకటిగా వుండటము శ్రీ సాయి లీలామృతము లో చూడవచ్చు. ఈ శ్రీ రామకృష్ణ జయంతి రోజు వారి బోధలను సదా మననము చేసి ఆచరించుకొనడమే మనము సమర్పించే దక్షిణ.



*గదాధరుడు సాగించవలసిన జగత్కళ్యాణభారము అల్లా తనపై ఉంచినాడని చెప్పటము, అవస్థే గారు చెప్పినట్లుగా పరమహంస నిర్యాణము, శ్రీసాయి తిరిగిలేచిన సమయము ఒకటిగా వుండటము శ్రీ సాయి లీలామృతము లో చూడవచ్చు.*




*శ్రీ రామకృష్ణపరమహంస మహాత్ములలో ఎంతో విశిష్టమైన వారని పూజ్యశ్రీ మాస్టరుగారు తెలియజేసారు. ఆధ్యాత్మిక శ్రేయస్సును కలిగించే శ్రీ రామకృష్ణుల జీవిత చరిత్ర, సంబంధిత గ్రంథాలను పూజ్య బాబుగారు ఎందరి చేతనో పారాయణ చేయించారు. చదువరుల సౌలభ్యం కోసం SMBT ట్రస్టువారు ఈ పుస్తకాలనుకూడా విక్రయిస్తున్నారు. ఇతర గ్రంథాలలాగానే భక్తులు ఈ పుస్తకాలను ట్రస్టువారి నుండి కొనుక్కొని, ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు.*

# శ్రీ గురుని అంతర్ధాన లీల



ఫిబ్రవరి 2012

శ్రీ గురుని అంతర్ధాన సందర్భముగా ప్రత్యేక వ్యాసం

అది బహుధాన్య నామ సంవత్సరము, ఉత్తరాయణ పుణ్యకాలం. సూర్యుడు కుంభరాశిలో, బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించారు. శిశిర ఋతువు, మాఘ మాసము, కృష్ణ పక్షము, పాడ్యమి, శుక్రవారం. శ్రీ గురుడు-నృసింహ సరస్వతి స్వామి తనతో కలిసివస్తున్న నలుగురు శిష్యులు సాయందేవుడు, నందిశర్మ, నరహరికవి, సిద్ధ సరస్వతులతో శ్రీ శైలము వద్దనున్న పాతాళగంగ వద్దకు చేరారు. అక్కడ స్నానం చేసి నలుగురు శిష్యులను పుష్ప ఆసనము సిద్ధం చేయమని, శిష్యులను ఆజ్ఞాపించారు. తర్వాత ఆ ఆసనమును నదిపై వుంచమని ఆదేశించారు. శిష్యులు అలా చేయగానే శ్రీ గురుడు, "ఈ పూలనావలో పాతాళగంగ దాటి శ్రీశైలం చేరి, మల్లిఖార్జునునితో ఐక్యం చెందుతాము. మీరందరూ తిరిగి గంధర్వపురం వెళ్ళండి" అని ఆదేశించారు. ఆ మాట వినగానే శిష్యులు నిశ్చేష్టులైనారు. కన్నీరు కారుస్తూ అలానే నిలబడి ఆ ఆజ్ఞకు కృంగిపోయారు. అంత శ్రీ గురుడు వారిని ఓదారుస్తూ "ప్రియశిష్యులారా! మీరు దిగులు పడవద్దు. మీరు గంధర్వపురం వెళ్ళండి, అక్కడ ఎప్పుడూ మీకు మా దర్శనం లభిస్తుంది. భక్తిలేనివారికి కన్పించక, భక్తులకు మాత్రమే దర్శనమివ్వదలచి మేమక్కడ గుప్తరూపంలో వుంటాము. మేము ఆనంద నిలయానికి వెళ్తున్నాము. మేమచటికి చేరగానే అందుకు గుర్తుగా నాలుగు తామర పువ్వులు ఈ నదిలో కొట్టుకొనివస్తాయి. మీ నలుగురు వాటిని ప్రసాదంగా తీసుకోండి. మీరు వాటిని ప్రాణంకంటే ఎక్కువగా భద్రపరుచుకొని, పూజించుకోండి. ఇది మా ప్రమాణం. సంశయించరాదు" అని ఆదేశించి, ఆ పూల ఆసనంపై దివ్యతేజస్సుతో తరలిపోయారు. ఇంతలో శ్రీ గురుడు, వారి పూల నావ కనుమరుగై అంతర్హితమైంది. శిష్యులు కన్నీటితో ఆ దిశచుట్టూచూస్తూ నిశ్చేష్టులై నిలబడిపోయారు. ఇంతలో కొందరు బేస్తలు ఆ శిష్యుల వద్దకు వచ్చి "అయ్యా! మేము నది ఆవలి ఒడ్డున ఒకస్వామి తూర్పువైపు వెళ్తుంటే చూచాము. వారి కాళ్ళకు బంగారు పాదుకలున్నాయి. కాషాయవస్త్రం ధరించారు. చేతిలో దండము వుంది. ఆయన మాతో 'మీరు వెళ్ళి మా శిష్యులతో మేము మీకెదురైనట్లు చెప్పండి. నాలుగు పువ్వులు నదీజలాలలో కొట్టుకొని వస్తాయి. అవి తీసివారికివ్వండి. మా పేరు నృసింహ సరస్వతి. మేము స్థూలరూపంలో కదళీవనము వెదుతున్నాము. కాని గుప్త రూపంలో గాణ్గాపురంలోనే వుంటాము. అక్కడ ఎప్పుడూ మా సేవలో నిమగ్నమై వుండమని చెప్పండి', అని చెప్తున్నంతలో -- నాలుగు పువ్వులు నదీజలాలలో కొట్టుకొనిరావటము కన్పించింది. అంత ఆ బెస్తలు ఆ నదిలో దూకి ఆ పువ్వులను శిష్యులకు అందించారు. పూలు తీసుకొని ఆ శిష్యులు కళ్ళకద్దుకొని గంధర్వ నగరం మఠంలోకి చేరుకున్నారు. శ్రీ గురుని సాగనంపి అక్కడి ప్రజలు మాట్లాడుకుంటూ మఠం చేరుకొని చూసేసరికి, శ్రీగురుడు యధాపూర్వం తమస్థానంలో కూర్చుని కన్పించారు. అందరూ ఆశ్చర్యచకితులై నమస్కరించేసరికి శ్రీ నృసింహ సరస్వతి స్వామి అంతర్హితులైనారు. అంతటితో ఆ గ్రామస్థులకు ఆ అవతారమూర్తిని సామాన్య మానవునిగా సంశయించటము ఎంతటి అపచారమో అర్థమయింది. అందరూ ఆ సర్వగతునికి సాష్టాంగ నమస్కారము చేసుకొని తమ ఇళ్ళకు వెళ్లిపోయారు.

ఆ పూవులు ప్రసాదంగా పొందిన శిష్యులలో ఒకడైన సిద్ధ సరస్వతి, తన మనస్సును గురుపాదాలపై నిలుపుకొని 'శ్రీ గురుచరిత్ర' ను కూర్చి ఈ జగతికి అందించారు.' శ్రీ గురుచరిత్ర' యిహంలో పురుషార్థాలను, తదుపరి పరమార్థాన్ని కల్గించే గ్రంథరాజము. దీని పారాయణ వలన, సుఖము, పవిత్రత, శాంతి కలుగుతాయి. పాపాలు, రోగాలు, నశిస్తాయి.

శ్లో॥ *"అనసూయా గర్భరత్న: భోగ, మోక్ష సుఖప్రదః ।*
*శ్రీ పాదవల్లభః పాతు శ్రీ నృసింహ సరస్వతి ॥ "*

శ్రీ దత్తాయ గురవే నమ:!

---

*ఆచార్యుల ఆధ్యాత్మికానుభూతి 50వ వార్షిక మహోత్సవానికి ఆరంభ సంచిక!*

# శ్రీసాయిబాబా చిత్రపటం (9)

## ప్రభాతకాలే గురుస్మరణం



శ్రీమతి వేదవతి

ఫిబ్రవరి 2012



మొదట పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. ఆయన అనేక రూపాలు ధరించాడు. అంటే అన్ని రూపాలూ ఆయనలోనే ఉన్నాయన్నమాట. వాటినన్నింటినీ సాక్షీ భూతుడై చూస్తూ, వినోదిస్తూ వుంటాడు కాబట్టి వాటికతీతంగా కూడా ఆయన ఉన్నాడు. అయితే ఈ సృష్టికంతటికీ గమ్యమేమిటి?

పరమాత్మ ఆనందస్వరూపుడు. అంటే అంతులేని తృప్తి, శాంతులు ఆయన స్వంతం. అది ఆయన సహజస్థితి. అయితే ఈ సృష్టిలోని సకలజీవరాశికీ నానారూపాలతో కూడిన ఈ సృష్టి అనుభవమవుతూండటం వలన అవి లోపించాయి. అంతరాంతరాలలో అవి కూడా పరమాత్మ స్వరూపమే గనుక అంతులేని తృప్తి, శాంతుల కోసం తపన వాటికి సహజసిద్ధము. ఈ సకల చరాచర సృష్టి ఎక్కడనుంచి ఉద్భవించిందో ఆ పరమాత్మలో లయించినప్పుడే సృష్టిలోని నానాత్వము నశించి అంతులేని శాంతి, ఆనందాలు సహజమౌతాయి. అది సాధించడమే ఈ సృష్టియొక్క గమ్యం.

మరి సృష్టియొక్క గమనమేమిటి? అంతులేని శాంతి, ఆనందాలు పూర్ణత్వమనుకుంటే, సృష్టియొక్క గమనమంతా పూర్ణత్వం నుంచి పూర్ణత్వం వైపుకు వెళుతూవుంటుంది. అంటే సృష్టి అంతా పూర్ణత్వం నుంచి పుట్టింది. పూర్ణత్వం వైపు పయనిస్తూ, పూర్ణత్వంలో కలిసిపోతుంది. అదే సృష్టి యొక్క గమనము.

సృష్టి మొదలైనప్పుడే కాలం మొదలైంది. కాలమంటే మార్పుల సమాహారం. మార్పులంటే అనుభవాలు, జ్ఞాపకాలు, స్మృతులూ, వాటికాధారం కార్య-కారణ సంబంధాలు (ఒక పని జరగాలంటే దానికి కారణమేదో ఉండాలి). వాటి వ్యక్తరూపమే మన జీవితాలలో తారసిల్లే వస్తువులు, వ్యక్తులు, సంఘటనలు. వీటిలో ప్రతిదానికీ ఒక జీవితకాలం వుంటుంది. మనకులాగే, మనలోని ప్రతి అంశం లాగే, వీటిలో ప్రతిదీ (అది వస్తువైనా, వ్యక్తైనా, సంఘటనైనా) ఏదో ఒక సమయంలో పుడుతుంది. కొంతకాలం కొనసాగుతుంది. ఏదో ఒక సమయంలో ఉనికిని కోల్పోతుంది - అంటే నశిస్తుంది. అలా సృష్టిలోని ప్రతి అంశానికీ జరుగుతుంది. ఒకరకంగా చెప్పాలంటే ఈ సూత్రమే ఈ సకల చరాచర సృష్టినీ పాలిస్తూ వుంటుంది. అందుకే త్రిమూర్తులు ఈ సృష్టిని నడిపిస్తూ వుంటారని మన పెద్దలు చెబుతారు. అందుకే

ప్రతిదానినీ సృష్టిచేసే శక్తిని, సంకల్పాన్నీ, మౌలిక సూత్రాన్నీ బ్రహ్మదేవుడనీ, ప్రతిదానినీ కొన్నాళ్ళు ఉనికి ఉండేటట్లు చేయగలిగిన శక్తినీ, సంకల్పాన్నీ, మౌలిక సూత్రాన్నీ విష్ణుదేవుడనీ, ప్రతిదానినీ నశింపజేసే శక్తినీ, సంకల్పాన్నీ, మౌలిక సూత్రాన్నీ పరమేశ్వరుడనీ అన్నారు.

గురుధ్యాన శ్లోకం ఇలా చెబుతుంది –

శ్లో॥ *గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।*
*గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥*

సద్గురువే బ్రహ్మ, విష్ణు మహేశ్వరలనీ, ఆయనే సాక్షాత్తూ వీటికి మూలకారకుడైన పరబ్రహ్మమనీ, అటువంటి గురువుకు నమస్కరిస్తున్నాననీ ఈ శ్లోకానికి అర్థం.

అయితే ఈ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల సమగ్రతత్వాన్ని గురుస్వరూపమని ఎందుకన్నారు? ఎందుకంటే ఈ మూలసూత్రమే, సమగ్రతత్వమే మనకు ఈ సృష్టి అశాశ్వతమని నిరంతరం బోధిస్తూ వుంటుంది గనుక. ఈ సూత్రం ఆధారంగా మనకు ద్వంద్వాలు అనుభవమౌతూ వుండటంవల్ల, రాగ ద్వేష అసూయాది భావాలవల్ల వస్తువులు, వ్యక్తులు సంఘటనల పట్ల ఎన్నో అశాశ్వతమైన బంధాలేర్పడుతూవున్నా, అవి సరైనవి కావని, అశాంతి కారకాలనీ నిరంతరమూ మనకు గుర్తుచేస్తూనే వుంటుంది ఈ మూలసూత్రం. అంతేకాదు. ఈ మూలసూత్రాన్ని నడిపిస్తూ వున్న ఒక మహత్తరమైన తత్వం దానిని నియంత్రిస్తూ, దానికతీతంగా వుందని, అది శాశ్వతమైనదనీ, అదే పొందదగినదంటూ మనలను నిత్యం ప్రేరేపిస్తూ వుంటుంది. అందుకే అది గురుతత్వం. సద్గురువు యొక్క నిజస్థితి. అందుకే సద్గురువు త్రిమూర్తుల సమగ్ర రూపమయ్యారు. దాని వ్యక్త రూపమే మనమధ్య మనలో ఒకరుగా సంచరించే సద్గురు స్వరూపులైన మహాత్ములు. వారిలో అగ్రగణ్యులు, కోహినూర్ వజ్రం వంటి వారూ శ్రీ శిరిడీ సాయినాథులు. అందుకే ఆయన తలచుకుంటే నిప్పు, నీరు ఒకే చోట వుడతాయి, కూలబోతున్న మసీదు పైకప్పు పడకుండా ఆగిపోతుంది, పులి ఆయన పాదాలచెంత సద్గతి పొందుతుంది. భక్తులకు బోధించడం కోసం సంఘటనలు జరుగుతాయి. బోధ ఆయన నిజరూపమైతే ఆయన దేహం, రూపం దానికి ఒక ఆచ్ఛాదన. ఆయన జననముండీ, జననం లేనివాడు, ఆయన శరీరంతో వుండికూడా శరీరానికి పరిమితుడు కాడు. ఆయన మరణించగలడు, మరలా తిరిగి జీవించగలడు. సమాధి చెందికూడా శాశ్వతుడుగా శోభిల్లగలడు. ఆయన బోధలను సరిగ్గా అర్థం చేసుకుంటే, ఒక మహాత్ముడు చెప్పినట్లు, మనం సంసారంలో వున్నా మనలో సంసారముండదు. అందుకే ఆయన సమర్థసద్గురువు, దత్తాత్రేయుడు, త్రిమూర్తి స్వరూపుడు.

కానీ చిత్రమైన విషయం ఒకటుంది. ఈ సకల చరాచర సృష్టిలో ఆయన బోధకు ఎవరు అర్హులు? మానవులు మాత్రమే. ఈ సృష్టిలో అన్ని వస్తువుల, జీవులలో మానవుడు మాత్రమే ఈ బోధను గ్రహించగల సామర్థ్యాన్ని కలిగివుంటాడు. అందుకే అన్ని జీవరాశులలోనూ మానవుడిలో మాత్రమే చైతన్యం అంతగా వికసించి వుంటుంది. ఒకవిధంగా చూస్తే ఈ సృష్టి అంతా మానవుడిని తరింపజేయడానికే ఏర్పడినదా అనిపిస్తుంది. మానవుడు తిరిగి ఈ సృష్టికి ఏ ఉపకారం చేసినా, చేయకపోయినా ఈ సృష్టిలోని ప్రతి అంశమూ, ప్రతి జీవీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో మానవజన్మకు ఉపకరిస్తూనే వుంటుంది. నిరంతరం దాని అశాశ్వతమైన వైఖరిని గుర్తుచేస్తూనే వుంటుంది. మరలా సద్గురు ప్రేరితమైన సన్మార్గ రూపంలో అతనికి సరైన మార్గాన్ని, గమ్యాన్నీ తెలుపుతూనే వుంటుంది. అంతటి అవకాశమున్న మానవజన్మ అందుకే అతి దుర్లభమైనది. దానిని సద్వినియోగ పరచుకోవడమే మానవ జీవిత గమ్యం, ఈ సృష్టియొక్క గమ్యం కూడా.

మనింట్లో మన ఎదురుగా వుండే బాబా చిత్రపటం పైన చెప్పుకున్న అన్ని విషయాలనూ మనకు నిరంతరం గుర్తుచేస్తూ వుంటుంది. ఈ విషయాన్నంతా మనసులో నిలుపుకుంటూ ఉదయమే సద్గురు స్మరణతో రోజును ప్రారంభించాలి. పూజ్యశ్రీ మాస్టరుగారు కూడా పిల్లలమైన మా చేత రోజూ నిద్ర లేవగానే శ్రీ సాయిచిత్రపటానికి నమస్కారం చేయించి, గురుధ్యానశ్లోకం మూడుసార్లు చదివించి రోజును ప్రారంభింపజేసేవారు. దీనివలన మన గమ్యము, మార్గము మనలో పునఃప్రతిష్ఠితమౌతాయి. ఆరోజు మన ప్రవర్తనంతటికీ మార్గనిర్దేశం చేస్తాయి.

# వార్తాలాపము



ఫిబ్రవరి 2012

జనవరి సంచిక తరువాయి

**ఈశ్వరప్రోక్తమగు వేదముచే కూడ దేవుడు ఋజువు చేయబడును.**

అనుమానప్రమాణముచే దేవుడు ఋజువు అగునట్లుగనే ఈశ్వరప్రోక్తము అగు వేదముచేగూడ దేవుడు ఋజువగును. ఎట్లనిన 'ద్యావాభూమీ జనమన్దేవ ఏక:విశ్వస్య కర్తా భువనస్య గోప్తా స్వర్గమును, భూమిని సృష్టించు ఒకే దేవుడు విశ్వమును సృజించును, రక్షించును.

వేదవ్యాస భగవానుడుకూడా బ్రహ్మ సూత్రములయందు "జన్మాద్యస్య యత:" "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్" మొదలగుసూత్రములచే ఈశ్వర లక్షణమును తెలిపెను.

"సృష్టిస్థితిలయములకు కారణుడు బ్రహ్మస్వరూపుడగు దేవుడు." "ప్రతిజ్ఞా దృష్టాంతములచే దేవుడు జగత్కారణము." అటులనే పతంజలి మహర్షి కూడ దేవుని రుజువు చేయుటకు వివరించెను.

"క్లేశకర్మవిపాకాశైరపరామృష్ట: పురుషవిశేష ఈశ్వర:"

క్లేశము, కర్మ, విపాకము, సూక్ష్మవాసన–ఇవి లేని పురుష విశేషము దేవుడు.

**జీవుని అస్తిత్వము.**

పెద్దవిద్యార్థి:– " నేటి భౌతికాదివిజ్ఞానములు శరీరభిన్నమగు ఆత్మ అను వేరొక వస్తువు లేదని చెప్పుచున్నవి" అని కొందరు విజ్ఞానవేత్తలు చెప్పుదురు. శరీరము మృతినొందగనే ఆత్మ శరీరమునందే లయమును పొందును. కావున ఆత్మ శరీరభిన్నమగు వస్తువు కాదని వారి అభిప్రాయము. సున్నము, వక్క, తమలపాకులు వేరుగానున్నంతకాలము ఎర్ర రంగు పుట్టదు. కాని అవి మూడును కలసిన వెంటనే ఎర్రని రంగు పుట్టును. అటులనే భౌతిక పదార్థమగు శరీరమునందు చైతన్య శక్తి ఉద్భవించును. కాని ఆ శరీరము నశించిన వెంటనే చైతన్య శక్తి కూడా వెను వెంటనే నశించిపోవును. కావున జీవాత్మ శరీరమునకు భిన్నమైనది కాదు అనెదరు. కాని మన శాస్త్రములు శరీరము కంటే ఆత్మ భిన్నమైనదని చెప్పును. ఈ రెండు అభిప్రాయములలోను ఏది నిజమో దయయుంచి చెప్పుడు.

**నచికేతుని ప్రశ్న - మృత్యువు తరువాత ఆత్మ ఏమగును?**

స్వా. ని.:–కఠోవనిషత్తునందు నీవలనే సాత్వికసాధనసంపన్నుడగు నచికేతుడు "మృత్యువు తరువాత ఆత్మ శరీరభిన్నముగనుండునా? శరీరరూపముగానుండునా?" అని యముని ప్రశ్నించెను.

*యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే స్తీత్యేకే*
*నాయమస్తీతి చైకే ।*
*ఏతద్విద్యామనుశిష్ట: త్వయాహం వరాణామేష*
*వర:తృతీయ: ॥*

"కొందరు ఆత్మ వున్నదని చెప్పెదరు. మరి కొందరు లేదని చెప్పుదురు. ఈ సందేహము వారికీ చనిపోయిన వ్యక్తియందు కలుగును. మీ ఉపదేశము పొందిన నేను ఈ వృత్తాంతమును తెలిసికొనదలచియున్నాను యిది నా మూడవ వరము."

శరీరము, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, బుద్ధి–వీనికి భిన్నమగునదియు శరీరముతో సంబంధము కలిగినదియు అగు ఆత్మ అనునది కలదని కొందరు విద్వాంసులు చెప్పుదురు. ఇట్టి ఆత్మ లేదని మరికొందరు చెప్పుదురు. ఏలనన, శరీరపాతానంతరము ఆత్మ ఉన్నదా లేదా అను సందేహము కలుగును. ఈ

సందేహనివృత్తి ప్రత్యక్షప్రమాణముచేతగాని, అనుమానప్రమాణముచేతగాని కలుగదు. పరమ పురుషార్థము సంశయనివృత్తి ద్వారా లభించు ఆత్మజ్ఞానమునకు లోబడియున్నది. మీ ఉపదేశము ద్వారా జీవాత్మవిజ్ఞానమును పొందగోరుచున్నాను.

### జీవతత్త్వజ్ఞానము కడుసూక్ష్మము.

నచికేతుని ఈ ప్రార్థన విని యముడు సమాధనమును చెప్పెను.

*దేవైరత్రాపి విచికిత్సితం పురా న హి*
*సుజ్ఞేయమణురేష ధర్మః ।*
*అనమవరంనచికేతో వృణీష్వ మా మొపరోత్సీరతి*
*మాసృజైమ్ ॥*

ఓ నచికేతుడా, ఈ విషయమున పూర్వము దేవతలకు కూడా సందేహము కలిగినది. సామాన్య జనులు వినినను ఈ వస్తువును సరిగా తెలుసుకోలేరు. ఏలనన, ఆత్మ అత్యంతసూక్ష్మమైనది. కావున సందేహరహితమగు ఫలమునిచ్చు మరియొక వరమును కోరుకొనుము. ఈ విషయమున నన్ను ఇబ్బంది పెట్టకుము.

### ఆత్మతత్త్వము అపూర్వము

ఇట్లు యముని వాక్యములను విని నచికేతుడు మరల యముని ప్రార్థించెను. ఈ వరముతో సమానమగు మరియొకవరము నేనడుగవలసిన పనిలేదు. కావున అదియే కోరుచున్నాను.

*దేవైరత్రాపి విచికిత్సితం కిల త్వంచ మృత్యో*
*యన్న సువిజ్ఞేయమాత్థ ।*
*వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో నాన్యో*
*వరస్తుల్య ఏతస్య కశ్చిత్ ॥*

(కఠోప)

"ఆత్మతత్త్వమును గూర్చు సందేహము దేవతలకే కలిగెను కదా! ఓ యమధర్మరాజా! నీవే ఆత్మ తత్త్వమును పూర్తిగా ఎరుగెదవు. కావున ఈ తత్త్వమును గురించి వివరింప సమర్థుడు నీవుతప్ప మరియొకడు లేడు. నాకు దీనితో సమానమైన ఇంకొకవరము కోరవలసినది ఏదియులేదు."

ఆత్మతత్త్వమునుగురించి సందేహము దేవతలకు కూడా కలిగెను అని మీనుండియే తెలుసుకొనుచున్నాను. అనగా ఆత్మతత్త్వము సామాన్యునకు శ్రవణముచేకూడా సరిగా బోధపడదని తెలియుచున్నది. ఇది పండితులకు కూడా బోధింప సాధ్యంకానిది. ఇక మీరు తప్ప ఇంకొక ఉపదేశకుడు ఎంతవెదికినను లభించడు. మీరుమాత్రమే ఈ ఆత్మతత్త్వమును వివరించగల సమర్థులు. ప్రపంచమునందలి అనిత్యపదార్థములకు సంబంధించిన వరములన్నిటిని విడచి ఈ ఆత్మతత్త్వమును మాత్రమే తెలుపమనికోరుచున్నాను.

### చైతన్యరహితమగు దేహము పట్టుట.

ఈ విధముగా నచికేతుడు అడిగిన ప్రశ్నకు యమధర్మరాజు చెప్పిన సమాధానమును చూచినచో ఆత్మతత్త్వమును తెలిసికొనుటచాలా కష్టమని తెలియును. ఈ శరీరము పంచభూతముల (పృధివి, జల, తేజో, వాయు, ఆకాశముల) పరిణామమని కొందరు చెప్పుదురు. దానికి ప్రమాణముగా "పాఞ్చభౌతికో దేహః" అను వాక్యమును ఉదహరించెదరు. పృధివ్యాది చతుర్భూతములయందును పరమాణువులచే కార్యారంభకత్వము సిద్ధించును. కాని పరమాణువుల అభావముచే ఆకాశమునందు కార్యారంభకత్వమునకు తావులేదు అని వారి అభిప్రాయము. కావున దేహము చాతుర్భౌతికము అని "చాతుర్భౌతిక మిత్యేకే" అని ప్రమాణమును చూపెదరు.

మరికొందరి మతమునను సరించి దేహము వృధ్వీమాతృపరిణామము ఈ జలాదులు దాని ఉపష్టంభకములు అనగా ఆధారములు అని చెప్పి సాంఖ్యసూత్రమునందలి "ఏకభౌతికమిత్యపరే" అను వాక్యమును చూపెదరు. ఈ విధమగు వాదములననుసరించి భౌతికపరిణామము శరీరమని చెప్పినచో చేతనత్వదృక్పధముతోవిచారించిన శరీరమునందు చేతనత్వము యుక్తిసంగతము కాదు. ఏలనన, ప్రతిభూతము నందును స్వభావసిద్ధమగు చైతన్యము కన్పట్టుటలేదు.

ఈవిషయమున విజ్ఞులు ఇట్లు పలికెదరు.

*"న సాంసిద్ధికం చైతన్యంప్రత్యేకాదృష్టేః"*

'ప్రతిభూతమునందును చైతన్యము ఉండదు. కావున శరీరమునందు కూడా చైతన్యము లేదు' అని వారి వాదము.

తాంబూలమునందలి ఎరుపు తాంబూలకారణములగు వస్తువులయందు కన్పట్టుట లేదని మీరే చెప్పుచున్నారు కదా! అయినను అది వక్క సున్నము మొదలగు వస్తువులతో కలిసిన

వదార్ధమునందు కన్పట్టుచున్నది. అటులనే ప్రతిభూతమునందును చైతన్యభావము వున్నను భూతస్వభావపరిణామమునందు తాంబూలమునందలి రక్తిమ వంటి శక్తికల చైతన్యము ఉండవలెను. కాని దీనికి సమాధానముగా ప్రతివదార్ధమునందును వేరువేరుగానున్నప్పుడు కన్పడనట్టి విశిష్టగుణములు సముదాయములయందు కనవడును. వైయక్తికములుగానున్నప్పుడు మరుగుపడిన గుణములు సముదాయములందు కాననగును అని చెప్పెదరు.

కాని వైయక్తికపదార్థములయందు లేని గుణములు సంఘాతమునందు కూడా వుండవు. ప్రతిభూతమునందును లేని చైతన్యము సముదాయమునందును వుండదు. "తాంబూలవస్తుసముదాయముచే జనించిన రాగముచే తాంబూలకారణములగు దృశ్యములయందు కూడా రాగము ఊహించదగును. అటులనే పంచభూతకార్యమగు దేహమునందు చైతన్యము ఉండుటవలన అనుమానప్రమాణముచే ప్రతిభూతమునందును చైతన్యము ఉండవలెనని తేలుచున్నది" అని ప్రశ్నించవచ్చును.

తత్వవిచారము చేసినచో అది సరికాదని తోచును వృధివ్యాదులందలి విశిష్ట గుణములు సజాతీయకారణగుణజన్యత్వముకలవి. పృధివ్యాదిరూపమగు కారణమందు చైతన్యము లేనిచో వరిణామమగు దేహమునందు కూడా చైతన్యము ఉండదు. ఆ చైతన్య స్వరూపమగు ఆత్మ శరీరభిన్నము శరీరమే చైతన్యరూపమగు ఆత్మ అని అంగీకరించినచో బాల్యమునందలి పదార్థములు వార్ధక్యమునందు స్మరణకురాకూడదు. ఏలనన శరీరావయవముల ఉపచయావచయములచే (వృద్ధిక్షయములచే) ఉత్పత్తి, వినాశములు జరుగును.

### శరీరము ఆత్మా ఒకటి కావు

బాల్యమునందలి శరీరావయవములు వార్ధక్యమునందు వుండవు. అందుచే విస్మృతి కలుగును బాల్యమునందలి శరీరమునందు చైతన్యముచే కలిగిన అనుభవములు వార్ధక్యమునందలి శరీరచైతన్యమునందు జ్ఞాపకము వుండవు. కావున శరీరము, ఆత్మ వేరువేరు అనునది నిశ్చితము. "పూర్వశరీరోత్పన్నమగు సంస్కారముచే అనంతర శరీరమునందు సంస్కారములు ఉద్భవించి స్మరణము ఉండును"అని చెప్పుచో అది యుక్తి సంగతము కానేరదు. ఏలనన, అనంతములగు నమస్కారములను అంగీకరించుటకంటే శరీరభిన్నమగు చైతన్యమును స్వీకరించుటయే యుక్తి సంగతము. శరీరమే చైతన్యమని అనుకొనినచో బాలుడు మాతృస్తన్యపానమునకు ప్రవర్తించుటకు తావులేదు.

స్వా. ప్ర. :--దూడయొక్క స్తన్య పాన ప్రవృత్తికి కారణము అనుకూలసాధనత్వపరిజ్ఞానము. బాలునకు ఇష్టసాధనజ్ఞానము ఉండనందున మాతృస్తన్యపానాప్రసక్తి కలుగదు. వైదికసిద్ధాంతమునననుసరించి జన్మాంతరముయందలి ఇష్టసాధనజ్ఞానానుభవములచే తజ్జన్య సంస్కారములచే బాలుడు అట్లు ప్రవర్తించును.

### ఆత్మ స్వయంప్రకాశమగు జ్ఞానస్వరుపుడు

పూర్వోక్తములగు కారణములచే ఆత్మ శరీరభిన్నము అనునది యధార్ధమని బోధపడును. ఆ ఆత్మ అవిద్యా జనితములగు అనేక జన్మముల అదృష్టముద్వారా జన్మజన్మాంతరములకు లభించును. వాస్తవమునకు ఆత్మజ్ఞానస్వరూపము. కాని అవిద్యకు లోనైనందున అజ్ఞానివలె కన్పించును. జనులు త్రాడునందుసర్పమును చూచునట్లును, ముత్యపుచిప్పయందు రజతమును చూచునట్లును, సచ్చిదానందస్వరూపమగు ఆత్మయందు అజ్ఞానకృతమున జననమరణధర్మములను చూచెదరు. జ్ఞానరూపమగు ఆత్మ పదార్థములన్నింటిని ప్రకాశింపజేయును. పదార్థజ్ఞానము కూడా ఆత్మసద్భావముచేతనే కలుగును. జగమునందుజ్ఞాన స్వరూపము ఆత్మ అని తెలిసికొనకుండుటకు కారణము ఏమియులేదు. ఏలనన, సర్వప్రపంచమును ఆత్మచేతనే తెలిసికొనబడును. ఏలనన ఆత్మ జ్ఞానస్వరూపము. తాను స్వయంప్రకాశముగా నుండి అన్యములను పృకాశింపజేయును.

*యేన రూపం రసం గన్ధం శబ్దాన్స్పర్శాంశ్చ మైథునాన్ ।*
*ఏతనైవ విజానాతి కిమ్త్ర పరిశిష్యతే ॥*

(కఠో)

లోకమంతయు రూప, రస, గంధ, శబ్ద, స్పర్శ విషయభోగములను దేనిచే తెలిసుకొనుచున్నదో అది.... యిదియే.

సశేషం

# శ్రీ దత్తలీలామృతము



శ్రీమతి శ్రీదేవి

ఫిబ్రవరి 2012

జనవరి సంచిక తరువాయి



"శ్రీకారాది సర్వవర్ణంబులందు అనంతమైన నాదం ఒక్కటే వున్నది. అదే సర్వవర్ణములను ప్రకాశింపజేస్తుంది. ఆ సవర్ణయే రేణుక. రేణుక తప్ప మరొకటి యేమీలేదు. అందువలననే ఆమె బ్రహ్మరూపిణి. వేదమాత, సావిత్రి. ఆమె ఒక్కతే జగద్ధాత్రి. రెండవ వస్తువు లేనే లేదు. ఆ బ్రహ్మరూపిణినే యేకమాత్ర - ఏకవీర - ఓంకారైకస్వర అని అంటారు. ఇంకా ఆమెను హ్లాదిని - విమల - ఉత్కర్షిణి - జ్ఞానయోగ - ఇత్య - ఈశాన - ప్రహ్వి - అనుగ్రహ అనే ఎనిమిది నామములు వుండటంతో అష్టపర్యాయవాచక అని కూడా ఆమెను పిలుస్తారు. ఆమె ఒక్కతియే అనేక రూపములు ధరించటం చేత ఏకవీర అని ఆమె పిలువబడుతుంది. బ్రహ్మదేవా! మళ్లీమళ్లీ చెబుతున్నాను. ఆమెయే వేదమాత - గాయత్రి - బ్రహ్మరూపిణి".

దత్తస్వామి పలుకులు విన్న బ్రహ్మ ఆశ్చర్యంతో "ఏమీ? లోకమాతయే వేదమాత - గాయత్రి అయిందా?" అంటూ వుండగానే తక్షణమే దత్తస్వామి అంకముననున్న శ్రీదేవి ముఖమునుండీ వేదములు ఆవిర్భవించి రేణుకాదేవి యందు ప్రవేశించటం జరిగింది. అది చూచిన పరమేష్ఠి సంతోషముతో రేణుకను భక్తితో పూజించి, నమస్కరించాడు. బ్రహ్మదేవుడు రేణుకాదేవినిలా స్తోత్రము చేశాడు - "దేవీ! గాయత్ర్యాది ఛందస్సులు నీ అంశములు. అకారోకారమకారార్ధమాత్రాత్మకంబగు (అకార, ఉకార, మకార, అర్ధమాత్రలతో కూడినట్టి) ఓంకారము నీ స్వరూపము. నీవే అనంతరూపముల భాసిల్లుతున్నావు. ఇది తెలిసికొని, తెలియక కాని నిన్నునిందించు వారి పుణ్యములు ఫలింపవు." - ఈ విధంగా ఎన్నో రకముల స్తుతించిన బ్రహ్మదేవుడు వేదములన్నీ స్మృతి పథమునకు వచ్చినందుకు సంతృప్తుడై దత్తాత్రేయ స్వామికి నమస్కరించి, తన లోకమునకు తిరిగి వెళ్లాడు.

జగన్మాత రేణువు తపస్సుకు మెచ్చి, ఆయనకు కూతురై పుట్టి శివాకృతి అయిన జమదగ్నిని వివాహమాడింది. అటు తర్వాత వారు పార్థివ దేహములను విడచి తమ స్వస్వరూపములను పొందారు.

దీపకా! ఒక సందేహం తీరింది కదా! ఇక నీవడిగిన ఆమలకీ వృత్తాంతమును చెబుతాను.

బ్రహ్మదేవుడు వేదములను మరచిపోయి, రేణుకా దేవిని ఆశ్రయించి ప్రార్థించగా ఆ తల్లి వాసుదేవుని అడుగమని చెప్పింది. అపుడు బ్రహ్మ వాసుదేవుని వెదకుచూ క్షీరాబ్ధికి పరుగెత్తి అక్కడ కూడా స్వామి కన్పించక ఎంతో వ్యథపోతున్న కృష్ణామలక వృక్షాన్ని చూచి, దానిని గ్రహించి సహ్యాద్రికి తిరిగి వచ్చాడు. అపుడు రేణుకాదేవి పరుశురామునితో యిలా

అన్నది – "నాయనా పరశురామా! ఈ ఆమలకీ వృక్షము సాక్షాత్తు విష్ణుస్వరూపము. బ్రహ్మగ్రహించి తెచ్చిన యీ వృక్షముతో నీవు ప్రవేశించి, ఈశ్వరస్వరూపుడగు నీ తండ్రిని స్తుతించు. అపుడు యీ వృక్షం దేవత్రయ స్వరూపము అవుతుంది. దత్తస్వామితో కలసి నీవు యీ వృక్షాన్ని దత్తాశ్రమములోని దండకయందు స్థాపించి, నీవు కూడా యిచటనే నివసించు. త్రిదేవమయమయిన యీ ఆమలక వృక్షాన్ని చూచిన, తాకిన ప్రాణులు సద్గతిని పొందుతారు. ఇక నమస్కరించి, పూజిస్తే వచ్చే ఫలము యింతింతని చెప్పతరముకాదు." పరుశురాముడు తల్లి చెప్పినట్లే చేశాడు.

దీపకా! దీనిని బట్టి పరశురాముడు దేవదేవుడని స్పష్టమైంది కదా! ఆమలకీ వృక్ష వృత్తాంతము కూడ తెలిసి కొన్నావుకదా! ఆ తర్వాత బ్రహ్మ రేణుకా దత్తాత్రేయులకు నమస్కరించి, తనలోకమునకు వెళ్లి పోయాడు. దత్తాత్రేయుడు పాపనాశని అయిన రేణుకా దేవికి నమస్కరించి, ఆమలకీ వృక్షము క్రింద కూర్చొని ధ్యానమగ్నుడైనాడు.

పద్మ తీర్థమున స్నానాదికములు నిర్వర్తించుకొని నరనారీమణులు ఆ వృక్షాన్నీ, దానిక్రింద వున్న మహేశ్వరాకారుడగు దత్తుని సందర్శించి, పూజిస్తే వారికి మోక్షపదము లభిస్తుంది. పూర్వము దేవదానవులు క్షీరసాగరాన్ని చిలికినపుడు మనోహరములయిన పుష్పములను పూసే పీయూషామలక వృక్షము ఉద్భవించింది. దానిని దేవతలు కృష్ణునికి అర్పించారు. అదిగాక, లక్ష్మీదేవిని, కౌస్తుభము మొదలయిన రత్నములను, శుభాభరణములను క్షీరసాగరమే స్వయంగా కృష్ణునికి సమర్పించి, పూజించింది. విష్ణుమూర్తి పీయూషామలక వృక్షాన్ని లక్ష్మీదేవి ప్రీతి కొరకు ఆ క్షీరసాగర మందిరమునందే స్థాపించాడు. ఆ తర్వాత శ్రీహరి దత్తావతారుడై వెలసినపుడు ఆ వృక్షము నుండి సగము అంశను తీసుకొని రావటం జరిగింది. అదే దత్తాశ్రమములో వున్న సిద్ధామలక వృక్షముగాను, కృష్ణామలక వృక్షముగాను పిలువబడుతున్నది. దానినిబట్టే ఆ ప్రదేశమునకు ఆమలకీ గ్రామము అని పేరువచ్చింది. అటు తర్వాత అదే మాతాపురముగా పిలువబడింది. అంతే కాదు, పీయూషామలకము మరొక అంశతో పాతాళ లోకములో కూడా వుండి పూజింపబడుతున్నది. ఈ విధంగా ఆమలకము మూడు లోకములలోనూ వ్యాపించి విరాజిల్లుతున్నది." అని చెప్పి వేదధర్ముడు దీపకుని సందేహాలను సమాధానపరచి, తదుపరి అతిపవిత్రము, మహిమాన్వితము అయిన శ్రీదత్తాత్రేయస్వామి చరితమును యిలా కొనసాగించాడు.

ప్రణీతా నదీ తీరములోనున్న కృష్ణామలకీ వృక్షము క్రింద ఒకనాడు శ్రీ దత్తాత్రేయ స్వామి కూర్చుని వున్న సమయంలో అక్కడకు పింగళ నాగుడు వచ్చాడు. అతడు స్వామికి సాష్టాంగ నమస్కారము చేసి లేచి నిలువబడి చేతులు జోడించి, యిలా ప్రార్థించాడు.

"స్వామీ! నాదొక సందేహమున్నది. కానీ దానిని వ్యక్తం చేయాలంటే, తమరేమనుకొంటారోనని భయపడుతున్నాను". స్వామి నవ్వి "పింగళా! భయమెందుకు? నీవు నీ సందేహాన్ని తొలగించుకొనటం అవసరం. నిర్భయంగా చెప్పు." అనగానే పింగళ నాగుడిలా అన్నాడు – "స్వామీ! నా ప్రశ్నలలో ఏమైనా తప్పువుంటే మన్నించండి. వేద శాస్త్రాలలో నాలుగు ఆశ్రమములు, వాటి ధర్మాలు తెలియజేయబడ్డాయి. అయితే, మీరు మాత్రము యీ నాలుగు ఆశ్రమములలో ఏ ఒక్క ఆశ్రమమునకు చెందక వున్నారు. ఈ నాలుగు ఆశ్రమములలోని ఏ ఒక్క ఆశ్రమ ఆచార, ధర్మములు మీ ఆచరణలో కన్పింపవు. దిగంబరులై, మద్యపానరతులై యువతిని అంకపీఠంపై కూర్చుండ బెట్టుకొని వుంటారు. ఇది ఏ ఆశ్రమము? ఈ ఆశ్రమమును మీకిప్పించిన గురువు ఎవరు? దయచేసి తెలియజేయండి."

దత్తస్వామి, "నీవన్నమాట వాస్తవము. శాస్త్రము నాలుగు ఆశ్రమముల గురించి చెపుతున్నది. అయితే ఈనాది అయిదవ ఆశ్రమమయ్యా! ఈ సకల చరాచర విశ్వమంతా స్వాత్మస్వరూపంగా ఎవరైతే చూస్తారో వారిది యీ అయిదవ ఆశ్రమం. పింగళా! నేను చెప్పిన యీ తత్త్వం ఆ నాలుగు ఆశ్రమములలో వున్నదో లేదో చెప్పు. చెప్పలేవులే. నీవెరుగవు. బ్రహ్మవాదులు మాత్రమే యీ విషయాన్ని తెలిసినవారై వుంటారు" అని చెప్పగనే ముని రూపములో వున్న పింగళుడు " సత్యము, సత్యము, స్వామీ ! నీవు చెప్పినది నిజము. విశ్వంభరా! సృష్టి స్థితి లయ కారకా ! సకల వేద శాస్త్రములకాధార భూతుడవైన నిన్నెరుగ నేనెంతవాడను ! పురుషోత్తమా ! అనసూయానందనా ! నా అజ్ఞానము నన్నట్లు పలికించింది. నన్ను క్షమించు. శరణాగతవత్సలా ! శరణు, శరణు. నన్ను రక్షించు. నన్ను నీ పొట్టలో దాచుకొని కాపాడు" అని ప్రార్థించాడు.

*" శ్రీ రామ ! నారాయణ ! వాసుదేవ !*
*గోవింద ! వైకుంఠ ! ముకుంద ! కృష్ణ !*
*శ్రీ కేశవానంత ! నృసింహ ! విష్ణో !*
*మాంత్రాహి సంసార భుజంగ దష్టం. "*

అంటూ పింగళనాగుడు స్తుతించగనే దత్తస్వామి శివరూపమును దాల్చి వానిని తన ఉదరమున ధరించాడు. వేదధర్ముడు యింకా కధను యీ విధంగా వివరించాడు.

" దీపకా! పూర్వం కృతయుగంలో 'పురందరము' అనే గ్రామంలో 'చాంధ్రికుడు' అనే పేరు గల బ్రాహ్మణుడుండేవాడు. అతని భార్య పేరు భామ. ఆ దంపతుల మనసులలో స్వర్గసుఖములను అనుభవించాలన్న బలమైన కోరిక కలిగింది. ఆ కోర్కె నెరవేరటం కోసం వారు తపస్సు చేయాలని భావించి, తపస్సు చేయటానికి అనుకూలంగా వుండే ప్రదేశాన్ని వెదుకసాగారు. అలా వెదుకుతూ భూమండలమంతా తిరుగుతుండగా దుర్ధర్షులు అనే వారి పితృదేవతలు ఆకాశంలో వారికి ప్రత్యక్షమై చాంధ్రికునితో "పుత్రా! ఎందుకు వ్యర్థంగా అక్కడా, యిక్కడా వెదుకుతున్నావు? దత్తాశ్రమములో మాతృ తీర్థము అనే పేరుతో రేణుకా తీర్థమున్నది. అక్కడికి వెళ్లి రేణుకాదేవి ఎదుట తిలోదక పిండ ప్రదానము చేయండి. మొదట పితృ దేవతల ఆదేశం మేరకు చాంధ్రికుడు భామతో కలసి దత్తాతటాకమున స్నానం చేసి అందున్న ఆమలకీ వృక్షము క్రిందినున్న రేణుకాదేవి సాక్షిగా పిండోదకములను అర్పించాడు. అపుడు అతని పితృదేవతలు పుణ్యలోకములను పొందారు. చాంధ్రికుడు, భామ ఆ పుణ్యప్రదేశంలో తపస్సు చేసి స్వర్గ లోకమునకు చేరారు.

ఎంతో శ్రద్ధతో దత్తస్వామి కథను ఆలకిస్తున్న దీపకుడు వేదధర్మునికి నమస్కరించి యిలా అన్నాడు - "గురుదేవా! దత్తస్వామి కథామృతము ముందు దేవతలు త్రాగే అమృతము ఏపాటి? ఇంతటి మధురాతి మధురము, మహిమాన్వితము అయిన స్వామి చరితము ఎంత విన్నా యింకా వినాలనిపిస్తున్నదే కానీ యింక చాలులే అనిపించటం లేదు. నా యందు వాత్సల్యముతో ఎన్నో అపూర్వ విషయములు చెపుతున్నారు. గురుదేవా! ఏదేవి ఈ ప్రపంచమునందలి భక్త జనుల పాలిటి కామధేనువో, ఏదేవి జగద్ధాత్రియో, ఏదేవి దివ్య ప్రభావ ఖనియో ఆదేవి యొక్క దివ్యప్రభావమును తమవంటి తపస్సంపన్నులుగాక ఎవరెరుగగలరు? ఆ రేణుకాదేవి గురించి యింకా యింకా వినాలని ఎంతో కుతూహలంగా వున్నది. దయతో తెలియజేయండి"

వేదధర్ముడిలా చెప్పసాగాడు -

"కుమారా! నీ భక్తి శ్రద్ధలు నన్నాకర్షిస్తున్నాయి. స్వామి కథలపై నీ ఆసక్తి చూస్తుంటే నాకానందంగా వున్నది. నీవంటి వారికి కాక స్వామి చరితము వినే అర్హత మరెవ్వరికి వుంటుంది? ఈ విధంగా స్వామి స్మరణ నాకు కూడ ఆనందం కలిగిస్తున్నది. నీవడిగిన రేణుకా ప్రభావమును తప్పక తెలియజేస్తాను.

ఒకనాడు శ్రీదత్తస్వామి సుర, ముని గణములు చుట్టూ పరివేష్టించి యుండగా పరశురామునితో యిలా అన్నారు - ''పరశురామా! నిన్నొక విషయం అడగాలనుకొంటున్నాను. నీవు సాధారణ మానవుడవుకావు. త్రైలోక్యాధిపతివి. సాక్షాత్తు గణాధిపతి నీయందలి ప్రేమతో స్వయముగా నీ కాత్మస్వరూపమును బోధించియున్నారు. ఇటువంటి విశేష తేజో సంపన్నుడవు అయిన నీవు నీతల్లి అయిన రేణుకా స్వరూపాన్ని బాగా తెలిసిన వాడవై వుంటావు. కనుక నువ్వు ఆదేవిని గురించి సవివరంగా మాకు వినిపింపగోరుతున్నాను.'' పరశురాముడు స్వామికి చేతులు జోడించి నమస్కరించి "స్వామీ! నేను ఏకవీర పుత్రుడనన్న మాటేగానీ ఆమె స్వరూప వివరములు తెలిసినవాడనుగాను. యోగవిదుడవైన మీరే రేణుకాదేవి గురించి చెప్పి మాకానందము చేకూర్చండి" అన్నారు. స్వామి నవ్వి "రామా! నీవెరుగక కాదులే. నాచేత చెప్పించాలనీ వుద్దేశంతో యీ విధంగా అడుగుతున్నావు. సరే, నీ కోరిక ప్రకారం రేణుక మహాత్మ్యం వివరిస్తాను. శ్రద్ధగా విను'' అంటూ యిలా చెప్పసాగారు.

"రేణుకా దేవికి స్థూల, సూక్ష్మ శరీరములు రెండు వున్నాయి. ఒకటి సాకారము. రెండవది నిరాకారము. చూడు రామా! ఈ వనములు, సముద్రములు, నదులు, పర్వతములు, భూతములు, భూతధాత్రి, స్వర్గము సర్వతీర్థములు, సప్తమహర్షులు, సప్త పాతాళ భువనములు, శేష, కూర్మములు మున్నగు జంతుజాలములు - ఎన్నని చెప్పను? ఈ ముల్లోకములలో నీ తల్లి అయిన ఏకవీర స్థూలశరీరము. ఇక బ్రహ్మమే ఆమె సూక్ష్మ శరీరము. పరబ్రహ్మమే ఆమె అసలు స్వరూపము." రేణుకను గూర్చి వివరించిన స్వామికి సాష్టాంగ నమస్కారములొనరించి, పరశురాముడు స్వామి నుండి సెలవు గైకొని ఆ ఆమలకీ వృక్షము క్రింద తపోమగ్నుడైనాడు.

సశేషం

# ఆధ్యాత్మిక పరిశోధకుడు



శ్రీ ఎక్కిరాల అనంత కృష్ణ

ఫిబ్రవరి 2012

*(వీరు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి పెద్ద కుమారుడు. వీరు శ్రీ మాస్టరు ఇ.కె. ఆధ్యాత్మిక సేవా సంస్థ ప్రెసిడెంట్‌గా ఆధ్యాత్మిక బోధన, హోమియోవైద్య సేవను అందిస్తూ, తండ్రిగారి అడుగు జాడలలో నడుస్తున్న ఆదర్శమూర్తి).*

శ్రీ భరద్వాజ గారు మా బాబాయి గారు. నా పేరు అనంతకృష్ణ. ఎక్కిరాల కృష్ణమాచార్యగారు మా నాన్నగారు. నాకు ఊహతెలియని వయసులోనే మా నాన్నగారు నన్ను మా తాతగారి దగ్గరికి పంపించారు. అంచేత చిన్నప్పటినుంచి నాకు మా భరద్వాజ బాబాయి గారితో, మిగిలిన బాబాయిల కంటే సాన్నిహిత్యం వుండేది. నాకు బాగా ఊహ తెలిసేసరికి ఆయన ఇంకా విద్యార్థి దశలోనే వున్నారు. ఆయన చాలా చురుకైన వారు. వారు నాకెన్నో విషయాలు చెప్తుండేవారు. తనతో పాటు బయటికి తీసుకెళ్ళేవారు. వారు చాలా ధైర్యశాలి. ఎప్పుడు, ఏ పరిస్థితులలోగాని, భయపడటం కాని, జంకటం కాని చూడలేదు. గుంటూరులో నాన్నగారు లెక్చరర్‌గా చేసేవారు. బాబాయ్ గారు మెట్రిక్యులేషన్ పాసయిన తర్వాత గుంటూరు హిందూ కాలేజిలో చేరారు. మొదట్లో కొన్నాళ్ళు బెజవాడ, గుంటూరు తిరిగేవారు. ఆ తరువాత కొన్నాళ్ళు మా నాన్నగారి దగ్గరే వుండి చదివారు. వారు కేవలం పాఠ్య పుస్తకాలేగాక ఇతర గ్రంథాలు కూడా ఎన్నెన్నో చదివేవారు. ఆ చదవటం కూడా చాలా ఫాస్ట్‌గా చదివేవారు. జ్ఞాపక శక్తి కూడా చాలా ఎక్కువగానే వుండేదనే చెప్పాలి. చదువుతో పాటు క్రీడలలో కూడా చాలా యాక్టివ్‌గా వుండేవారు. ఆయనకు క్రికెట్ అంటే బాగా ఇష్టం. కాలేజీలో రోజూ ఆడటమే గాక, ఇంటి దగ్గర నాక్కూడా నేర్పించేవారు. ఇంట్లో మాతోటి ఎంతో సరదాగా వుండేవారు.

నాకు తెలిసినంత వరకు ఆయన అనారోగ్యంగా వున్నట్లు గుర్తులేదు. చాలా దృఢమైన, మంచి ఆరోగ్యమైన శరీరం. వారు చాలా పట్టుదల మనిషి. ఏదైనా ఒక పని అనుకుంటే ఆ పని అయ్యేవరకు చాలా పట్టుదలగా కృషి చేసేవారు. ఏదైనా సరే తాను పూర్తిగా లాజికల్‌గా కన్విన్స్ అయితే తప్ప అవతలి వారు చెప్పిందాన్ని వెంటనే ఒప్పుకునే స్వభావం కాదు. తండ్రిగారంటే చాలా గౌరవం వుంది. ఆయన వేద విదులు, మహాద్రష్ట అయినా సరే, వారు ఏమి చెప్పినా కూడా మూఢంగా నమ్మేవారు కాదు. నేను అప్పుడప్పుడు గుంటూరులో నాన్నగారి దగ్గరకెళ్తుండేవాణ్ణి. అందువల్ల వారితో ఎక్కువ సాన్నిహిత్యం వుండేది. నాన్నగారంటే బాబాయిగారికి కూడా చాలా గౌరవం. కేవలం అన్నదమ్ముల అనుబంధమేగాక తాత్విక పరమైన సాన్నిహిత్యం వుండేది. ఇద్దరూ ఆధ్యాత్మిక మార్గంలో చాలా ఉన్నతమైన స్థితిలో ఉన్నప్పటికీ వారి మధ్య పరస్పర అనురాగం, ప్రేమ, ఆప్యాయతలుండేవి. మా బాబాయి గారు విద్యా సముపార్జనలో చాలా త్వరగా పైకి రావటం మూలాన వారిలా నేనూ చాలా త్వరగా చదువుకోవాలని వుండేది. ఆయన 19వ సం॥ము వచ్చే సరికే ఎమ్.ఎ. అవటం మూలాన నాకు వారు ఆదర్శప్రాయంగా నిలిచారు. వారికి సబ్జెక్ట్ మీద కమాండ్ వుండేది. నేను అనుకున్నట్టు వారి ఆశీస్సుల వల్ల నా చదువు కూడా అలానే పూర్తయింది.

బాబాయి గారు ఎమ్.ఎ. చదివే రోజులలో నేను మామ్మగారు, మా తాతగారితో కలసి వైజాగ్ వెళ్ళానొకసారి. వారు అక్కడ హర్షవర్ధని హాస్టల్‌లో వుండి చదువుతున్నారు. ***విద్యార్థిగా వున్నప్పుడు కూడా చాలా ధైర్యసాహసాలు, తనదైనటువంటి ఒక విశిష్టమైన వ్యక్తిత్వముండేది. విద్యాంశాలనైనా రొటీన్‌గా చదువుకోకుండా నిశితమైన పరిశీలన చేసేవారు. ఒక రీసెర్చ్ టైప్ ఆఫ్ వ్యూ వుండేది. "దేన్నైనా సరే కూలంకషంగా తెలుసుకోనిదే ఏ విషయాన్నీ వదిలిపెట్టరు" అని వారి సహ విద్యార్థులు చెప్పేవారు.*** అందువలన వాళ్ళు ఆయనని ఒక ప్రత్యేకమైన గౌరవంతో చూసేవారు. తాను చేయవలసిన పనిని యెట్టి పరిస్థితులలోనైనా సరే ఓర్పు వహించి నిర్వహించేవారు. ఆయనుండే హాస్టల్



చాలా పాతది. భోజన సదుపాయాలు ఇంటి దగ్గరున్నట్టుండవు. అయినప్పటికీ వాటినన్నింటినీ కూడా లెక్క చేయకుండా తననెందుకు పంపించారో ఆ పనిని సాధించుకొని వచ్చారు. ఒకరోజు రాత్రి ఈయన నిద్రలేచి లైట్ వేసే సరికి సరిగ్గా వాకిటి దగ్గర ఒక పాము పడగెత్తి నిల్చుని వున్నది. బయటికి రావడానికి వీల్లేకుండా వాకిటి దగ్గరే వున్నది. ఈయన ఒక్కడే లోపల వున్నారు. అప్పుడేం చెయ్యాలి? పడగెత్తిన పాము ఎదురుగా వుండటమన్నది చాలా కష్టమైన పరిస్థితి. ఎంతో ధైర్యముంటే తప్ప లాభం లేదు. ఈయన చలనం లేకుండా భయపడకుండా అలా నిల్చునే వున్నారు. ఈ లోపల పాము వచ్చిందని తెలిసిన చుట్టుప్రక్కల విద్యార్థులు కొంతమంది వచ్చారు గాని లోపలికి రావడానికి అందరికీ భయమే. అది కదిలితే కాటేసే పరిస్థితిలో వుంది. పైగా త్రాచుపాము. ఈయన సమయస్ఫూర్తితో కట్టుకున్న లుంగీ తీసి దాని మీద విసిరి వేసి, దాని బారినుండి తనను తాను, సహ విద్యార్థులను కాపాడుకున్నారు.

వారిలో ఒక దార్శనికమైన దృష్టి మొదటినుండి వున్నట్లనిపిస్తుంది. ఇంట్లో తాతగారు వేదము, పూజ యివన్నీ చేయటం వున్నాయి. అసలు దేముడంటే ఏమిటి? ఎక్కడుంటాడు? ఎలా వుంటాడు? అనేటటువంటి పరిశీలనాత్మక దృష్టి ఈయనకు బాగా వుండేది. ఇంతలో ఒక సంఘటన జరిగింది. భరద్వాజ బాబాయి గారి ఉపనయనము జరపాలన్నది పెద్దల నిర్ణయం. అదే సమయంలో నా తర్వాత భాస్కరాచార్య అనే తమ్ముడుండేవాడు. వాడంటే మా బాబాయిగారికెంతో ఇష్టం. నాన్నగారి దగ్గరుండి బాబాయ్‌గారు చదువుకునేటప్పుడు వాడు పుట్టడం, అమ్మగారు పనిచేసుకుంటుంటే వాణ్ణెక్కువగా ఎత్తుకుని సముదాయించటం వల్ల వాడంటే బాగా యిష్టంగా వుండేది. ఉపనయనం జరిగే సమయంలో వాడు ఎండ దెబ్బ తగిలి చనిపోయాడు. ఆ సంఘటన ఈయన మీద బాగా ప్రభావం చూపింది. అప్పటి నుంచి ఈయన చనిపోవటం అంటే ఏమిటి? పుట్టడం అంటే ఏమిటి? అనే విషయాల మీద బాగా దృష్టి మళ్ళించి చాలా తీవ్రంగా కొన్నేళ్ళపాటు దీన్ని గురించే ఆలోచించేవారు. ముందు వాడు చనిపోవటం వల్ల చాలా బాధపడ్డా, వారిలో మొదలైన అన్వేషణలోనే ఆయన విద్యాభ్యాసం పూర్తి అయింది. తాతగారు పిల్లలెవరికైనా ఒక విశిష్టమైన పద్ధతిలో ట్రైనింగ్ ఇచ్చారు. ఆయన ఏంచేసేవారంటే గైడెన్స్ మాత్రం ఇచ్చేవారు. స్పూన్ ఫీడింగ్ వుండేది కాదు. ఎమ్.ఎ. అయిన తర్వాత ఒంగోలు కాలేజీలో లెక్చరర్ పోస్ట్ ఖాళీగా వుందని తెలిసి అప్లయ్ చేశారు. మొదట్లో ఇంటర్వ్యూకనే వెళ్ళారు. తర్వాత ఎప్పుడో పిలుస్తారులే అని అనుకున్నారు. కానీ ***వాళ్ళు వెంటనే ఉద్యోగంలో చేరమన్నారు. మంచి డ్రెస్ తెచ్చుకోవటానికి కూడా అవకాశం లేదు. అట్లాగే వెళ్ళి జాయిన్ అయితే, ఆ స్టూడెంట్స్ ఈయనను కూడా ఒక స్టూడెంటేనని అనుకున్నారు.*** లెక్చరర్ అని అనుకోలేదు. ఈయనకప్పుడు 19 సం॥లే. దయాస్ మీదకెళ్ళి అటెండెన్స్ తీసుకుంటుంటే "ఈయన లెక్చరరా!?" అని ఆశ్చర్యపోయారు. ఈయన కంటే పెద్దవారైన స్టూడెంట్స్ కూడా వున్నారా క్లాస్‌లో. అది లెక్చరర్‌గా ఆయన మొదటి అనుభవం. (మొట్టమొదటిసారిగా ఒంగోలులోనే ఉద్యోగంలో చేరటం, చివరకు ఆయన కార్యక్రమం మొత్తానికీ ఒంగోలే కేంద్ర బిందువు అవటం, చివరకు వారు సమాధి చెందటం కూడా ఒంగోలులోనే జరగటానికి అంతర్లీనంగా ఏదో ఒక సంబంధం వున్నట్లు అనిపిస్తుంది). సరి అయిన భోజనవసతిలేక ఈయనకు టైఫాయిడ్ వచ్చింది. నాకు తెల్సినంత వరకు బాబాయిగారు అనారోగ్యంతో వుండటం అదే ప్రథమం. నాకు వూహ తెలిసేసరికి ఆయన భీమునిలా వుండేవారు. చాలా బలవంతుడని మా నాన్నగారు చెపుతుండేవారు. బాల్యంలో యింకా స్ట్రాంగ్‌గా వుండేవారట.

టైఫాయిడ్ వచ్చిన తర్వాత మా తాతగారు బాబాయిగారి చేత శెలవు పెట్టించి, బెజవాడ తీసుకువచ్చి ఆయుర్వేద చికిత్స వారే చేశారు. చాలా త్వరగానే టైఫాయిడ్ తగ్గిపోయింది. తగ్గినా చాలా బలహీనపడ్డారు. కొంతకాలం ఒంగోలులో పనిచేసిన తర్వాత అక్కడ రిజైన్ చేసి హైద్రాబాద్ వెళ్ళి వివేక వర్ధిని కాలేజ్‌లో చేశారు. అక్కడ ఆయన మా వ్యాస్ బాబాయ్ గారింట్లో వుండేవారు. ఆయన ఎక్కడ పనిచేసినా స్టూడెంట్స్ వారిని బాగా లైక్ చేసేవారు. ఎందుకంటే వారి బోధనా పద్ధతిలో ఒక ప్రత్యేకత వుండేది. సబ్జెక్టు చెప్పేటప్పుడు పాఠ్యాంశాలు మాత్రమే చెప్పక, వాళ్ళకి జీవితంలో కావాల్సిన గైడ్ లైన్స్ కూడా కలిపి ఇవ్వటం వారి ప్రత్యేకత. అది ఏ కొద్దిమందిలోనో వుంటుంది. ఇప్పటికీ ఎంతో పెద్దవాళ్ళుకూడా "నేను భరద్వాజ మాస్టరుగారి స్టూడెంట్‌నండి" అని ఎంతో గర్వంగా చెపుతుంటారు. అలా చెపుతున్నారంటే వారు ఎంతగా ఇంప్రెస్ అయ్యారోనన్నది తెలుస్తుంది.

***నైట్ కాలేజీలో ఎందుకు పనిచేశారంటే డే టైములో సత్యాన్వేషణకై చేసే పరిశోధనకు కావలసిన గ్రంథాలెన్నింటినో చదవాలనే ఆకాంక్ష వల్లనే. లేకపోతే పి. హెచ్. డి. చేయటం ఆయనకు పెద్ద లెక్కలోనిది కాదు. ఎకడమిక్ రీసెర్చి కంటే జీవిత విలువల మీద పరిశోధన అనేదే వారి లక్ష్యం.***

ఆత్మవిశ్వాసం అనేది ఆయనలో ఎక్కువగా వుండేది. ఐ.ఎ.యస్. పాస్ అయిన తర్వాత పోస్టింగ్ వచ్చినా వెళ్ళలేదు. వాళ్ళు 6 నెలల పాటు వెయిట్ చేశారు. తాతగారిక్కూడా చాలా సార్లు కబురు పెట్టారు. ఎంతో మంది తాతగారిని అడిగేవారు, "ఏమండీ, మీ వాడు ఐ.ఎ.ఎస్. పాసై ఉద్యోగం వచ్చినా ఎందుకు వెళ్ళలేదు'' అని. తాతగారి స్వభావం ఏమిటంటే ఎవరిమీదా ఏ ప్రెషర్ తీసుకొచ్చేవారు కాదు. అప్పుడు భరద్వాజ గారిని అడిగారు, "ఏరా వీళ్ళందరూ ఇలా అడుగుతున్నారు.మరి నువ్వెందుకు వెళ్ళటం లేదు?" అని అడిగితే, "ఐ.ఎ.ఎస్. చదివాను కానీ ఆ లైన్‌లో వెళ్ళడానికి కాదు. నా లైన్ వేరే వుంది కదండి" అని స్పష్టంగా చెప్పారు. అందువల్ల ఎంతటి పనైనా సరే తను సాధించగలను అనేటటువంటిది తనకు తాను నిర్ధారణ చేసుకోవటానికే ఐ.ఎ.ఎస్. చదివారు, కానీ ఆ సుఖాల కోసం కాదు. వారికి తన లైఫ్ యొక్క పర్పస్ ఏమిటోనన్నది తెలుసు.

ఈయన పెళ్ళి విషయం కూడా చాలా చిత్రంగా జరిగింది. చాలా మంది పిల్లనిస్తామని వచ్చేవారు గాని తాను పెళ్ళి ఎట్టి పరిస్థితిలోనూ చేసుకోనని స్పష్టంగా చెప్పేవారు. తాతగారు ఎవరినీ ఏ విషయంలోనూ బలవంతం పెట్టరు. తన ఉద్దేశ్యాలను ఇతరుల పైన రుద్దరు. ఆయన తన ప్రిన్స్‌పుల్స్‌కు భిన్నంగా తన పిల్లల్నైనా సరే బలవంతంగా ఏ పనీ చెయ్యమని చెప్పడమేగాని నిర్ణయం వారికే వదిలేసేవారు. చాలా మంది బాబాయి గారిని కన్విన్స్ చేయడానికి ప్రయత్నించారు. కొంతమంది ఏదో ఒక ఆశ చూపేవారు. కాని వారు వేటికీ లొంగలేదు. వివాహం చేసుకోవాల్సిన అవసరం లేదు. జీవితమంతా ఈ రకమైన అన్వేషణ చేయాల్సి వుంది, అందువల్ల వివాహం దానికి అవరోధం కావచ్చు అని అనుకున్నారేమో! నాన్నగారు కూడా కొన్ని సందర్భాలలో చెప్పారు. "వివాహం చేసుకోవటం మంచిది. యోగానికి కూడా అవసరం'' అని అన్నారుగాని, అంతకంటే వారు ప్రెస్ చెయ్యలేదు. ఎందుకంటే నాన్నగారనేవారు, ''దేని టైమ్ దానికుంది. అది వచ్చినప్పుడు వివాహం అవుతుందిలే" అని.

హైదరాబాద్‌లో వివేకవర్ధని కాలేజిలో జాబ్ వదిలేసి అక్కడ్నించి బాపట్ల కాలేజిలో పన్జేశారు. అప్పుడు జిల్లేళ్ళమూడికి తరచుగా వెళ్తూండేవారు. "ఎందుకు రిజైన్ చేశారని" తాతగారు అడగలేదు. ఎందుకంటే పర్పస్ లేకుండా ఏ పనీ చేయడు అని వారికి తెలుసు. మామూలు వాడైతే మళ్ళీ ఏమౌతాడోనన్న భయముంటుంది. సామర్థ్యం కలవాడుగనక, తాతగారికి అలాంటి భయం లేదు. నేనేమౌతానో అన్న భయం బాబాయిగారికి లేదు.

బాపట్ల కాలేజిలో కూడా రిజైన్ చేసి జిల్లేళ్ళమూడి వెళ్ళి 'అమ్మ' ఆశ్రమంలో కొంత కాలమున్నారు. ఆ సమయంలో నేను, తాతగారు చాలాసార్లు అక్కడకు వెళ్ళటం జరిగింది. ఆశ్రమంలో వారు సేవా కార్యక్రమాలలో ఎక్కువగా పాల్గొనటం చూశాను. ఆశ్రమ జీవితాన్ని వారెక్కువగా ఇష్టపడ్డారన్నది స్పష్టంగా కన్పడేది. తాతగారిలాగానే చాలా నిరాడంబరంగా జీవించేవారు. ఆశ్రమానికి అమ్మ దర్శనార్ధమై చాలా మంది వచ్చేవారు. అటువంటి వారికి అమ్మ గురించి వివరించటం, వారెక్కడుండాలి? ఏం చెయ్యాలి? ఎలా వుండాలి? చెప్పటం, వారికి కావాల్సిన సహకారాన్నందించటం బాబాయిగారు చేస్తూండేవారు. అక్కడ కూడా ***వారికో ప్రత్యేక స్థానముండేది. అమ్మకు అందరూ ఒకటే అయినా అమ్మకు బాబాయిగారంటే ప్రత్యేకమైన శ్రద్ధవున్నట్లు నాకన్పించేది. కారణం నాకు తెలియదు. ఎందుకంటే ఆవిడ అవతారమూర్తి, ఆయన మహానుభావుడు. కారణాలు వారికి తెలుస్తాయిగానీ మనకు తెలియవు.*** కానీ లౌకికంగా చూస్తేకూడా అమ్మకి తాతగారన్నా, తాతగారి కుటుంబమన్నా చాలా ప్రేమ, విశిష్టమైన గౌరవం కూడా వున్నట్లు అన్పించేది. వారి మాటలలోగాని, వారి వైఖరిలో గాని బాబాయిగారంటే ఆమె ఎంతో ఆప్యాయంగా, ఇష్టంగా వుండేవారు. వారిద్దరికీ సిద్ధాంత పరంగా బేధాలున్నా అవి వారి పరస్పర ప్రేమాభిమానాలకు అడ్డురాలేదు. దేశంలో వున్న ఎంతోమంది మహాత్ములను ఆయన

దర్శించారు, సేవించారు. వారిలోని ఆధ్యాత్మికతను విశ్లేషించి చూచారు. అది కేవలం ఒక మూఢభక్తి కాదు. ఆ దర్శించటంలో ఒక పర్పస్ రాబోయే తరాలకు భక్తి సాధనకు ఎంత అవసరం అనేటటువంటి నిరూపణ ఆయన చేశారని చెప్పాలి. ఉత్తర హిందూ స్థానమంతా తిరిగి ఎక్కడెక్కడ ఆధ్యాత్మికమైన గురువులు, మహానుభావులు, సాధువులు, సన్యాసులున్నారో వెతికి వాళ్ళని దర్శించి వాళ్ళని తరచి చూడటానికి ఎక్కువ కాలం వెచ్చించారు. మహాత్ముల దగ్గరకు కొన్ని వేల మంది ప్రవాహంలా వెళ్తుంటారు. బాబాయిగారు వెళ్ళటంలో ఒక ప్రత్యేక పరిశోధనాత్మక అంశం నాక్కన్పించేది. తన యొక్క గురువు ఎవరు? తనను నడిపించేటటువంటి శక్తి ఏమిటి? లేదా మార్గమేమిటి? వాళ్ళ దగ్గరకు వెళితే వాళ్ళ ప్రభావం ఎటువంటిది? వారి దగ్గరకు వెళ్ళే భక్తులకు ఏమి లభిస్తుంది? అన్న అంశాలపై కేవలం తనకేగాక మిగిలిన వారికి, రాబోయే తరాలవారిక్కూడా వుపయోగపడే విధంగా వాళ్ళ విశేషాలన్నింటిని కూలంకషంగా సేకరించటం అనే ఒక ఆధ్యాత్మిక పరమైన పరిశోధన చేశారనే చెప్పాలి. ఇది చాలా సాహసోపేతమైన కృషి. ఎలాగంటే ఒక మార్గాన్ని అనుసరిస్తూ వెళ్ళటం అదొక పద్ధతి. అలా గాకుండా మిగిలిన వారికి ఆథెంటిక్‌గా చెప్పటానికి "ఫలానాచోట ఇలా వుంటుంది. ఫలానా చోటికి మీరెళ్ళవచ్చు" అని చెప్పాలంటే ఎంతో పరిశోధన చేస్తే తప్ప అలా చేయలేరు. అటువంటి పరిశోధనలో ఎన్నో ప్రయాసలకోర్చి కట్టుబట్టలతో వెళ్ళి కొన్ని రోజులపాటు నిద్రాహారాలు కూడా లేక ఎన్నోరోజులు ఎదురుచూసి, వాళ్ళను దర్శించి, వారిని పరిప్రశ్న చేసి, వారి నుండి భక్తులకు ఏమి లభిస్తుంది అన్న సూక్ష్మ పరిశీలన ఆయన చేయగల్గటం వల్లనే నిగ్గుదేలిన నిజమైన మహాత్ములను వెలుగులోకి తెచ్చి వారి చరిత్రలను గ్రంధస్థం చేసి రాబోయే తరాల వారికందించగల్గారు. అది సామాన్యమైన కృషికాదు. అందుకెంతో ఓర్పు, పట్టుదల, ఆత్మబలం కావాలి. ఇవన్నీ వారిలో పుష్కలంగా వున్నాయి. అందువల్లనే వారు జీవించింది 50 సం॥లే అయినా, కొన్ని వందల సం॥ల దాకా వారు ఆధ్యాత్మికమైన మార్గంలో నడవాలంటే ఏం చేయాలి? గురు సన్నిధిని ఎలా పొందాలి? అన్న వాటి గురించి పరిశోధనచేసి దాన్ని తాను ఆచరించి, నిరూపించారన్నది స్పష్టంగా బోధ పడ్తున్నది. కేవలం ఎన్నో జన్మల నుంచి చేస్తున్న సాధనవల్లే ఈ జన్మలో అటువంటి అనుభూతిని పొందగల్గారు. మన కళ్ళకు కన్పించేది కొంచేమే అయినా కన్పించనిది ఎంతో వుంటుంది కదా! ***ఎన్నో జన్మల నుండి మహాసాధకుడయ్యుండటం వల్లనే యింతటి మహాద్రష్ట అయినటువంటి అనంతాచార్యుల వారి పుత్రుడుగా పుట్టారు. తాను ఎంతో మంది మహాత్ములను***



***దర్శించడమే గాక వారిలో వున్న ఆధ్యాత్మిక తేడాలని అందరికీ తెలియజేయాలి, అందరికీ ఆ అవకాశం కల్పించాలి అనేటటువంటిది విశేషమైన కృషి. అదే ఆయన లైఫ్‌వర్క్ అని చెప్పాలి.*** దేశంలో ఎక్కడెక్కడ ఎంతమంది మహానుభావులున్నారన్నది ఎవరికి వారు తెలుసుకోవాలంటే చాలా కష్టమైన పని. తాను ఒక్కరే ఇంత మందిని దర్శించి, పరిప్రశ్న చేసి, పరిశోధన చేసి, అవన్నీ కూడా గ్రంధస్థం చేసి అందరికీ అందుబాటులోకి తేవడమనేది చాలా గొప్ప విషయంగా, అన్నింటినీ మించిన పనిగా కన్పిస్తుంది. ఎందుకంటే మిగిలినవెన్ని సాధించినా మన జీవితం ఎందుకు? అన్న ప్రశ్న వేసుకున్నప్పుడు ఆధ్యాత్మిక సాధన అనేది లేకపోతే ఈ జన్మ వృధా అని అన్పిస్తుంది. అందరి ధ్యేయం ఆత్మ వికాసం – ఆత్మ దర్శనం అని ఉపనిషత్తులు చెప్తున్నాయి. అది కావాలంటే మహాత్ముల సన్నిధి కావాలి. ఎందుకంటే ఆత్మదర్శనం మనంతట మనం చేసుకునే స్థితి కాదు. ఇనుప ముక్క ఆయస్కాంతం కావాలంటే మరో ఆయస్కాంతం తప్పదు. ఆయస్కాంతం ఎక్కడ వుందో, అక్కడికి ఈ ఇనుప ముక్కలను తీసుకు వెళ్ళాల్సిందే. అలా వారు దర్శించి గ్రంధస్థం చేసిన మహనీయులలో పాకలపాటి గురువుగారొకరు. ఆయన సన్నిధి ప్రత్యక్షంగా అనుభవించిన వారిలో నేనొకడ్ని. బాబాయిగారి

జీవితంలో వారిని దర్శించటం ఒక ముఖ్యమయిన సన్నివేశమనే చెప్పాలి. ఆయనను వివాహానికి సుముఖులను చేసిన వారు ఆ మహాత్ముడే. కొన్ని రోజులు వారి సాన్నిధ్యంలో వుండి వచ్చిన తర్వాత, "నేను వివాహం చేసుకుంటానని" బాబాయి గారు చెప్పటం జరిగింది. ఆయన వివాహం చేసుకుంటాననటం మాకెంతో ఆశ్చర్యం కలిగించింది. సాధారణంగా ఇంట్లో పెద్దవాళ్ళకవ్వకుండా చిన్నవాళ్ళు వివాహం చేసుకోరు. ఆయన వివాహం చేసుకోనని స్పష్టంగా చెప్పటం వలన 71 లో నా వివాహం జరిగింది. అందువలన మాకు ఆయన వివాహానికి అంగీకరించటం ముందు ఆశ్చర్యాన్ని, ఆ తర్వాత ఆనందాన్నీ కల్గించాయి. ఆ తర్వాత ఫలానా ఆవిడను చేసుకుంటానని చెప్పారు. ఆవిడ కూడ ఆధ్యాత్మిక చింతన కలిగినావిడ. భవిష్యత్ ప్రణాళికననుసరించే ఈ జీవితాలు ముడిపెట్టి వుంటాయి అన్నటువంటిది ఒక నిదర్శనం. ***నిజానికి లేట్ మ్యారేజి అయినప్పటికీ అది కూడా ఆధ్యాత్మిక సాధనలో భాగంగా, పాకలపాటి గురువు గారి రూపంలో తన గురువుగారిచ్చిన ఆదేశంగా తీసుకొని, ఆ తర్వాత షిరిడీ వెళ్ళి ఆ ఆదేశాన్ని బాబా ఆదేశమేనని నిర్ధారణ చేసుకొని, గృహస్థాశ్రమాన్ని స్వీకరించటం జరిగింది.*** వివాహం చేసుకున్నప్పటికీ తన ఆధ్యాత్మిక పరిశోధననేమాత్రం వదిలి పెట్టలేదు. ఆవిడ సహకారంతో అది యింకా ధృడ పడింది.

ఆ తర్వాత సాయిబాబా మందిర నిర్మాణం అనేది ఆయన జీవితంలో మరొక ముఖ్యమైన ఘట్టం. సాయితత్వ ప్రచారమే వారి అవతార కార్యక్రమమన్నది సుస్పష్టం. అందుకు స్పష్టమైన రూపకల్పనే సాయిబాబా మందిర నిర్మాణం. ఆ మందిర నిర్మాణ సమయంలో నేను బాబాయిగారి దగ్గరకెళ్ళటం జరిగింది. ఎక్కడైనా విద్యార్థులకు, లెక్చరర్స్‌కి క్లాస్ అయిపోయిన తర్వాత వారికీ, వీరికీ మధ్య సంబంధం వుండదు. వారి దోవ వారిదే, వీరి దోవ వీరిదే. కానీ అక్కడ వీరి స్టూడెంట్స్ కేవలం కాలేజీ చదువుకే పరిమితంగాక ఇంటికి వచ్చి ఆయన పిల్లల్లాగా, శిష్యుల్లాగా ఆధ్యాత్మిక శిక్షణను పొందడం విద్యానగర్‌లో బాబాయిగారి దగ్గర చూశాను. అక్కడ విద్యార్థులవల్ల సత్సంగాలు ప్రారంభం అయ్యాయి. ఆ సత్సంగాలలో విద్యార్థులు అంతా ఎక్కువ సంఖ్యలో పాల్గొనటం, వారి జీవితంలో బాబాయిగారు చెప్పిన దానిని ఆచరణలో పెట్టడం అక్కడ బాగా కన్పించింది. అక్కడ ఆలయ నిర్మాణం వారి జీవిత గమ్యం అన్నది ఒక ముఖ్యమైన పాయింట్‌గా అన్పిస్తుంది. బాబా ఆలయ ప్రతిష్టకు మేమందరం వెళ్ళాం. ఆ మహాయజ్ఞంలో పాలుపంచుకునే అదృష్టం నాక్కూడా కల్గటం చాలా ఆనందకరమైన విషయం. కొన్ని వేల మంది ఆ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఇప్పటికీ ఆ దృశ్యం నాకంటికి కన్పిస్తుంది. బాబా మందిర నిర్మాణం అయి అక్కడే స్థిరపడ్తారనుకుంటున్న సమయంలో ఈయన లీవ్ పెట్టి వచ్చెయ్యాల్సిన పరిస్థితులు రావటం చాలా చిత్రంగా అన్పిస్తుంది. భౌతికమైన దృష్టికి తన యొక్క మందిరం కట్టించి, తన కార్యక్రమాన్ని ఎంతో చేయాల్సిన వారిని ఎందుకు అక్కడనించి పంపించారన్నది అప్పుడు తెలియదు. కానీ తర్వాత అర్థమౌతుంది. ఈయన యివతల కొచ్చి ఇంకో చోట కేంద్రం ఏర్పడి అక్కణ్ణించి విజృంభిస్తే తప్ప వారి అవతార కార్యక్రమం యింకా యింకా విస్తృతం కాదు. అందువల్ల బాబా ఆయనను అక్కణ్ణించి ఒంగోలుకు పంపించటం జరిగింది. అప్పటికే ప్రారంభించబడిన సత్సంగాలు యింకా చాలా చోట్లకు విస్తరించాయి. ***ఒంగోలు లీగల్ ఇంప్లికేషన్స్‌కి ప్రసిద్ధమైన వూరు. మరి అలాంటి చోటుకొచ్చి వుండి అక్కడ ఎన్నో ఇబ్బందులను, విమర్శలను ధైర్యంగా ఎదుర్కొని, తాను చేపట్టిన కార్యక్రమాలను, ఎట్టి పరిస్థితులలోనూ సడలనీయకుండా అకుంఠిత దీక్షతో చేస్తుంటే వారికి అనుగుణంగా వుండి అన్నింటా ఏకీభవిస్తూ ఏ మాత్రం వెనుకంజకు తావీయలేదు పిన్నిగారు. ఇదంతా బాబాగారి ప్రణాళికే అన్నది సుస్పష్టం.***

ఆ విధంగా వారి జీవితంలో ఎన్నో మలుపులున్నాయి. ఇతరుల శ్రేయస్సుకోసం బాబా చేతిలో ఒక ఇన్‌స్ట్రుమెంట్‌గా ఆయన వుపయోగపడ్డారు. హోమియోపతి వైద్య విధానంపట్ల ఆయన చివరి 3, 4 సంవత్సములలో ఇంట్రస్ట్ చూపారు. తన అనుయాయులను హోమియో వైద్యం నేర్చుకోమని, ఆ వైద్యం చేయించుకోమని చెప్పేవారు. నేను ఒంగోలు వెళ్ళినప్పుడల్లా అక్కడి డిస్పెన్సరీ వర్క్ అంతా అయిన తర్వాత రాత్రివూట వెళ్ళేవాడిని. మేమిద్దరం కూర్చుని అలా తెల్లవారురఝామువరకు మాట్లాడుకునేవాళ్ళం. దాంట్లో హోమియోపతి ముఖ్యమైన అంశంగా వుండేది. హోమియో టీచింగ్స్ గురించి నాన్నగారు ఏమేమి చెప్తూండేవారని అడిగేవారు. హోమియోపతి బుక్స్ గురించి నాతో ఎనలిటికల్‌గా డిస్కస్ చేసేవారు. ఇంచుమించుగా చివరి మూడేళ్ళలో మా ప్రతి సిట్టింగ్‌లో హోమియో మెయిన్ సబ్జెక్ట్‌గా వుండేది. ఆయన అతి తక్కువ కాలంలో ఎన్నో హోమియోబుక్స్‌ని బాగా స్టడీ చేసి, ఆధ్యాత్మిక శిక్షణతో పాటు, హోమియో శిక్షణ కూడా ఇవ్వాలన్న సంకల్పం వుందని వారి మాటల్లో గ్రహించాను. నాతో వారు డిస్కస్ చేసిన వాటిల్లో హోమియో మొదటి అంశమైతే, ఇండియన్ హిస్టరీ రీరైట్ చెయ్యాలన్నది రెండవ ప్రధాన అంశం. ఇప్పుడు మన పిల్లలు చదివే హిస్టరీ అంతా డిస్టార్టెడ్ హిస్టరీ అని నిజమైన ఇన్సిడెంట్స్‌తో, ఆధారాలతో ఆథెంటిక్‌గా ఇండియన్ హిస్టరీని రీరైట్ చెయ్యాలన్నది ఆయన

రెండవ సంకల్పం, "దాని కోసం మనం కలసి పన్జేయాలి. నీవు కొంత టైం స్పెండ్ చెయ్యాల్సిన పని వుంది. అందుకుగాను కావాల్సిన మెటీరియల్ని గ్యాదర్ చేస్తున్నాను. నీవు తప్పక కొంత టైమ్‌ని వినియోగించాలని" చెప్పేవారు. ఇవేగాక మా సంభాషణలో ఇంకా చాలా విషయాలు దొర్లుతుండేవి. "మనం ఆధ్యాత్మిక రంగంలో వర్క్ చేస్తున్నాము, లెక్చర్స్ ఇస్తున్నాము, గోష్ఠులు చేస్తున్నాము. కాని ఇదంతా ఒక ఎత్తు. భావి తరాల వారికి చిన్నప్పట్నించి ట్రెనింగ్ ఇస్తే తప్ప ఎంతో మార్పు రావడానికి సాధ్యపడదు" అని అనేవారు. తాతగారికి భరద్వాజాశ్రమం అనే పేరుతో రెసిడెన్షియల్ స్కూల్స్ పెట్టి అందులో మామూలు చదువుతో పాటు, ఆరోగ్యం, దేశభక్తి, ఆధ్యాత్మికతను గురించి కూడా శిక్షణ ఇవ్వాలన్న ప్రపోజల్ వుండేది. ఈ విధమైన సంకల్పం బాబాయి గారిలో కూడా వుండేది.

వారు చిన్నప్పట్నించి బాగా ధైర్యశాలి, పైగా ఆధ్యాత్మికంగా అప్పటికే ఉన్నత స్థితిలో వున్నారు. మా నాన్నగారు శరీరం వదిలేసే రోజున విచిత్రంగా "నేను ఒంగోలు వెళ్ళి వస్తాను" అని వెళ్ళిపోయారు. వారు సగం దూరం వెళ్ళేసరికే నాన్నగారు శరీరాన్ని వదిలేయడంతో వారికి మెసేజ్ ఇస్తే మార్గ మధ్యంలో వున్న ఆయన వెనక్కి వచ్చి ఆ కార్యక్రమం పూర్తయ్యేవరకూ మా ప్రక్కనే వుండటం మాకెంతో ధైర్యాన్నిచ్చింది.

***బాబాయి గారు వ్రాసినటువంటి గ్రంథాలు చూస్తే వారు రాబోయే తరాలలో వచ్చే సాధకులు ఈ కష్టాలన్నీ పడాల్సిన అవసరం లేకుండా వాళ్ళకు కావాల్సిన సారాన్నంతటినీ తాను మథించి వారికి డైరెక్ట్‌గా ఆ గ్రంథాలలో పొందుపరిచారు. వారి గ్రంథాలను పారాయణ చేస్తే, అన్వయించుకుంటూ అనుసరిస్తే ఆ స్థితి పొందగలరు.*** ఇంతటి విశిష్టమైన, విలువైన పరిశోధనాత్మకమైన గ్రంథావళిని మానవాళికి అందించటం వారికి జన్మనిచ్చిన భగవంతునికి చేసిన సేవ. ఇంతకు మించిన సేవ ఇంకొకటి వుండదేమోనని అన్పిస్తుంది. ఈ విషయాన్ని ఆలోచించినప్పుడల్లా అదే మాక్కూడా ఆదర్శమన్పిస్తుంది. వారిని ఆదర్శంగా తీసుకొని నిరంతరం స్మరించటం వల్లనే ఈ రోజున మేమిలా వర్క్ చేయగల్గుతున్నామని నాకన్పిస్తుంటుంది. ఇతరులకు ఎంతో మందికి వుపయోగకరమైన పనిని చేయటమే మన జీవిత లక్ష్యం కావాలి. తర్వాత తన దగ్గరకు వచ్చే వ్యక్తులను భగవత్ స్వరూపులుగా భావించటం అన్న సాధనకు ప్రత్యక్ష నిదర్శనం బాబాయిగారు. ఎందుకు మనం జీవిస్తున్నాం? మన పర్పస్ ఏమిటి? అంటే కేవలం మన కోసం, మన కుటుంబం కోసం కాక దాని యొక్క పరిధిని ఇంకా ఇంకా పెంచి మన యొక్క జీవితమన్నది ఎంతో మందికి ఎన్నో తరాలకి పనికొచ్చేటటువంటి పనిచేసేందుకు ఒక ఇన్‌స్ట్రుమెంట్‌గా చేయటం అన్నది ఒక వరం. అయితే అది అందరికీ సాధ్యమౌతుందా? అంటే, ఔతుంది. కృషిచేస్తే అది సాధించవచ్చు అని స్పష్టంగా ఋజువు చేశారు బాబాయిగారు. మామూలుగ మనం అనుకుంటాం ఎవరో మహాత్ములకు కాని మనకేం సాధ్యమౌతుందిలే అని. మనం చేసే పనిని చేద్దాంలే, చూద్దాంలే అని చెయ్యకుండా ఎస్కేప్ చేస్తూంటాం. అలాంటి ఎస్కేపిజం లేకుండా ఎవరమైనా, ఆ రకమైన సాధన చేస్తే ఆ స్థితి పొందవచ్చని తన యొక్క జీవితాన్ని ఉదాహరణగా మన ముందుంచారు బాబాయిగారు.

ఎన్నో మలుపులతోటి, ప్రయాసలతోటి కూడిన జీవితం వారిది. మహాత్ముల జీవితాలను కర్పూరంతోటి పోలుస్తారు. కర్పూరం యితరులకు మంగళప్రదమైందిగా వుంటూ తాను



హరించుకుపోతుంది. బాబాయి గారి విషయంలో కూడా అదే జరిగింది. రాత్రింబవళ్ళనే బేధం లేకుండా, నిద్రాహారాలు పట్టించుకోకుండా, తాను పొందినటువంటి అనుభూతిని మిగతావారికి త్వరగా అందిస్తే రాబోయే తరాల వారికి నిజమైన ఆధ్యాత్మిక సాధన అనేది ఏమిటో తెలుస్తుందన్న తపన వల్ల, విపరీతంగా శ్రమించడంవల్ల తన భౌతికకాయాన్ని 51 సం॥ములకే వదిలేశారు. 200 సం॥ములో చేసే పనిని వారు అతి తక్కువ వ్యవధిలో, అంటే కేవలం పది, పన్నెండు సం॥ములలో చేయటమన్నది ఆలోచిస్తే అది అనితరసాధ్యమని అన్పిస్తుంది.

బాబాయిగారు శరీరం వదలడమనేది ఒక అనూహ్యమైన విషయం. పైగా ఆయన అన్నారు కూడా, "మనిద్దరం కలసి ఫ్యూచర్‌లో చేయవలసిన పని చాలా వుంది. అందుకని ఇక్కడ వుండి నువ్వెక్కువ టైం స్పెండ్ చేయాలి" అని.ఈ నేపథ్యంలో ఆయన అకస్మాత్తుగా శరీరం వదిలేశారంటే నాకు ఒక రకంగా షాకే. అయితే ఒకటి, భగవత్సంకల్పం ఏది ఎలా జరుగుతుందో దాన్ని గురించి డిప్రెస్ అవటం, సిక్ అవటం లేకుండా వుండగల్గే స్థితికి వాళ్ళు నాకు ట్రెనింగ్ ఇచ్చినందువల్ల నిలబడగల్గాను. అయితే మా బాబాయి గారి అబ్బాయికి ఉపనయనం కానందువల్ల, లెక్క ప్రకారం మా పెద్ద బాబాయ్ గారు చేయాలి, కాని వారు నేను చేయనని ప్రక్కకు తప్పుకోవటం వలన భరద్వాజ బాబాయి గారికి చేయాల్సిన సంస్కారాలు చేసేటటువంటి అవకాశం నాకు రావటం ఎంతో అదృష్టంగా భావించాను. బాబాయిగారికి నా మీద వున్న వాత్సల్యం వల్ల ఇప్పటిక్కూడా బాబాయిగారి ప్రెసెన్స్ ఎప్పటికప్పుడు ఫీల్ అవుతుంటాను. ఒంగోలులో సమాధి దగ్గర వున్నప్పుడు, పిన్నిగారి దగ్గర కూర్చున్నప్పుడు బాబాయిగారి దగ్గరున్నట్లుగానే ఫీల్ అవుతాను.

***ఎంతో మంది మహనీయుల ప్రభావం వారు జీవించివున్నప్పటికంటే కూడా, వారు సమాధి అయిన తర్వాత ఇంకా విస్తృతము, ఉధృతము అవడాన్ని మనం చూస్తూంటాం. దానికి ఉదాహరణ షిరిడీ సాయిబాబా, జీసస్ మొదలైన మహానుభావుల జీవితాలెన్నో వున్నాయి.*** మహానుభావులు వారి వైపునించి అయితే వారు భౌతికంగా వున్నా, సమాధి అయినా వారి ప్రభావం ఒకటే. మన గురువుగారు భౌతికంగా వున్నప్పుడు ఒంగోలులోనో, వాకాడులోనో వున్నారని మన మైండ్‌కి ఒక ఫిజికల్ లొకేషన్ వుంటుంది. అలా ఫిజికల్ లొకేషన్ వున్నప్పుడు మన మైండ్ ఆయన అంతర్యామిత్వం మీదకి పోదు. అదొక లిమిటేషన్. అందువల్ల వారు శరీరం వదలి సమాధి అయినప్పుడు ఒక లోకేషన్ వుండదుగదా! అప్పుడు మనకి మన గురువు అంతర్యామిత్వం – ఆయన ఇప్పుడు అన్నిచోట్ల వున్నారు అనే సాధన మనలో మొదలౌతుంది. అది మొదలైనప్పుడు ఆయన యొక్క ప్రెసెన్సు ఎక్కడైనా, ఎప్పుడైనా పొందుతాం. ఇటువంటి మహానుభావులంతా నిత్యముక్తులైనటువంటి వారు కాబట్టి వారి అవతారకార్యక్రమాన్ని వారు శరీరాన్ని వదిలేసిన తర్వాత తమ యొక్క సమాధి ద్వారా కూడా చేస్తారు. దానికి కారణమేమంటే తమను శరణని వచ్చిన వారిని తమ స్థితికి తీసుకురావటమే వారి లక్ష్యం. నిజానికి వాళ్ళకంటూ ఏమీలేదు. వాళ్ళకి కర్మ అనేది అంతకంటే లేదు. వాళ్ళు మిగతా జీవుల కర్మలను వర్కౌట్ చేసి ఉద్ధరించి తమ స్థితికి తీసుకురావటమే వారి ప్రయత్నం. ఉదాహరణగా భరద్వాజ బాబాయిగారు ఉన్నారనుకోండి. ఆయన భౌతికంగా వున్నప్పుడు ఆయన దగ్గరకు వెళ్ళేవాళ్ళం. సత్సంగాలలో పాల్గొనే వాళ్ళం. వారు శరీరం వదిలేసిన తర్వాత మనం ఆ సమాధిని దర్శిస్తాం. తర్వాత చాలామందికి ఆయనను చూడలేక పోయామే అనేటటువంటి తహతహ వుంటుంది. వారి గ్రంథాలను చదివిన వారికి, వారి క్యాసెట్స్ విన్నవారికి "అరె! వారిని చూడలేక పోయామే" నన్న ఒక ఆవేదన వుంటుంది. అటువంటి ఆవేదన కల్గిన వారికి వారి సమాధి దగ్గర కొచ్చేసరికి ఆ అనుభూతి పొందటం జరుగుతుంది. అందువలన ***వారు సమాధి అయినప్పటికీ వారి ప్రభావం రాబోయే తరాలలో కూడా విస్తృతంగా పన్జేస్తుంది. మహాత్ములు ఎవరైనా సరే వారి అవతార ప్రభావం సమాధి అనంతరం ఉధృతమౌతుంది. అనుభూతి పొందాలన్నటువంటి ఆవేదనని భక్తుల్లో వాళ్ళే పుట్టిస్తారు.***

## Books on Sri Ramakrishna Paramhansa and Swami Vivekananda

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 | My Idea of Education | 34.00 |
| భారతం నా అమర భారతం | 20.00 | Karma Yoga | 18.00 |
| జ్ఞాన యోగం | 30.00 | God Lived with Them | 170.00 |
| బుద్ధి యోగం | 15.00 | The Lived with God | 140.00 |
| కర్మ యోగం | 15.00 | Raja Yoga | 36.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 | Bhakti Yoga | 16.00 |
| స్వామి వివేకానంద (2 భాగాలు ) | 60.00 | Jnana Yoga | 50.00 |
| మహాభారతం | 5.00 | Letters of Swami Vivekananda | 110.00 |
| నా అమర సందేశం | 30.00 | Reminiscences of Swami Vivekananda | 100.00 |
| భక్తి యోగం | 10.00 | Talks with Swami Vivekananda | 58.00 |
| సందేశ తరంగిణి(కొలంబో-అల్మోరా) | 40.00 | Complete Works of Swami Vivekananda-9 | 110.00 |
| వివేక సూర్యోదయము | 20.00 | Meditation and Its Methods | 18.00 |
| దైవంతో సహజీవనం | 100.00 | Vivekananda on Himself | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 | Ramakrishna and Vivekananda | 7.00 |
| మువివేకానంద లేఖావళి | 25.00 | Tales and Parables of Sri Ramakrishna | 45.00 |
| రామాయణం | 5.00 | Lectures from Colombo to Almora | 40.00 |
| | | Complete Works of Swami Vivekananda | 50.00 |
| | | Sayings of Sri Ramakrishna | 25.00 |

### జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయిమాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయిమాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు-పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine Subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone :040-20063300

**OR, Sri Manga Bharadwaja Trust , Ongole Branch Office**
Kothapeta, Kondaiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.** **Magazine** మరియు **General Donations** ను **"Sri Manga Bharadwaja Trust"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Annadanam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Sai Master)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Ashramam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Peace Foundation)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల్వారా పంపగలరు

**Books order** ను **"Sri Manga Bharadwaja Trust (Publications)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

వరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్మ్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

## ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

## BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

## BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300

**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**

*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*



శిరిడీలోని సమాధి మందిరంలో శ్రీ సాయిమాస్టర్



ద్వారకామాయిలో శ్రీ సాయిసన్నిధిలో శ్రీ సాయిమాస్టర్



సత్యాన్వేషియైన శ్రీ భరద్వాజుని సాటిలేని ఆచార్యునిగా
మనకందించిన సమర్థ సద్గురు శ్రీ సాయినాథమహరాజ్‌కి
కృతజ్ఞతాభివందనాలు.

edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust,
ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.



భక్తితో అలంకరించిన వేదికపై గురుమూర్తులు



"టిబెట్ యోగి మిలారేపా చరిత్ర" కన్నడ గ్రంథ ఆవిష్కరణ సందర్భంగా ధూపం సమర్పిస్తున్న "అమ్మ"

# ఉగాది సందేశము

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

మార్చి 2012

ఉగాది పండుగ అనగానే మొదట అందరికీ గుర్తుకొచ్చేది ఉగాది పచ్చడి. పులుపు, తీపి, చేదు, కారము, వగరు, ఉప్పు కలసింది. అందులో కలిపే పదార్థాలకు వైద్యపరమయిన ప్రయోజనమున్నది. ఈ వైద్య ప్రక్రియకు మూలం – ఏ ప్రాంతంలో, ఏ ఋతువులో ఏమేమి పండుతాయో అవి మన ఆరోగ్యానికి దోహదం చేస్తాయన్న సూత్రమే: వృక్షాలకూ, జంతువులకూ దేశకాలంలో సన్నిహిత సంబంధం వుంటుందన్న అవగాహనే. ఋతువులననుసరించి చెట్లు– పూయడము, కాయడము జరిగినట్లే కాలగతిలో ఒక్కొక్క యుగానికి తగిన రీతిన భగవంతుడు అవతరిస్తాడని గూడ ఋషులు చెప్పారు. నిజానికి మన పండుగలన్నీ జరుపుకొనే రీతిలో ఇటువంటి అవగాహనే యిమిడియున్నది.

దీనికితోడు ఉగాది పచ్చడిలోని తీపి జీవితంలో సుఖానికి; చేదు దుఃఖానికి, పులుపు మొదలైన రుచులన్నీ మనోవికాసాలకు సంకేతాలనుకోవచ్చు. ఈ ఆరు రుచులూ గల ఉగాది పచ్చడి ఆరోగ్యకరము. అలాగే జీవితానుభవాలన్నింటినీ అవగాహనతో అంగీకరించగలగటమే భగవంతునిపట్ల విశ్వాసమనే పరమౌషధం. ఇది చేతనయ్యేవరకు బాబాపట్ల మనకుగల విశ్వాసం స్థిరంగా వుండదు. సరియైన అవగాహనంటే? భగవంతుడు సహజంగా జీవులన్నింటికీ సరిపడేరీతిన సృష్టి చేశాడు. దేహం యొక్క నిర్మాణం, ఆహారం, నీరు, గాలి జాతిని సంరక్షించే వాత్సల్యము అన్ని జీవులకూ సమంగా యిచ్చారు. జీవులే 'ఆశ'కులోనై పాపంచేసి, దుఃఖరూపమైన కర్మ ఫలాన్ని రూపొందించుకుంటాయి. అవి అలా చేయకుండటము నేర్చుకొనడమే సృష్టియొక్క పరమావధి. ఆలోచిస్తే సృష్ట్యాదినుండీ భగవంతుడు మనకు చేసిన దానికి కృతజ్ఞత, ప్రేమ, విధేయతలు మాత్రమే తగినవి. వాటిని ధర్మము, భక్తి అంటాము. ఆయన మనకు చేసిన మేలంతా మరచి, మహాత్ముల ద్వారా ఆయన హెచ్చరించినా తప్పకుండా తప్పులు చేస్తూ, వాటి ఫలితాలుమాత్రం రాకూడదంటాము – అపథ్యం చేస్తూ రోగం తగ్గాలన్నట్లు! అలా జరిగితే శ్రద్ధగా పూజలు చేస్తాము. ఎప్పుడు, ఏ ఒక్కటి జరగకున్నా, ఆయన చేసినది మరచి, 'తూనాబద్దు' అంటాము. అయినా ప్రార్థిస్తే ఆయన పల్కుతుండాలి. మన బిడ్డ అలా చేస్తే మనంమాత్రం నెత్తీనోరూ బాదుకుంటాము. ఆయనను కనీసం మనతో సమానుడుగానైన చూడము.

సృష్టి ఎంత అద్భుతమైనదో ఆలోచిస్తే దైవం (లేక సద్గురువు) మనకీనాడు కష్టాలు, కోర్కెలు తీర్చకున్నా ఆయనపట్ల, కృతజ్ఞత, అభిమానము తప్ప వేరొకటి కల్గదు. అవగహన లోపిస్తే మన అభిమాన, విధేయతలన్నవి మనలోని స్వార్థమూ, దురహంకారము, పోటీలు; పంతాలపట్ల మాత్రమే వుంటాయి. వాటిపట్ల మిగిలేది కృతఘ్నతే!! భగవంతునిపట్ల కృతజ్ఞతతో కూడిన విధేయతే ధర్మాచరణ, అందుకవసరమైన నిగ్రహమూ, వివేకములను ప్రసాదిస్తుంది. వీటివంటివే నిష్ఠ, ఓరుములు. వీటిని అలవరచుకొనడమే ప్రత్యేకంగా ఉగాది పండుగ చేసుకొనడమంటే, ఈ సంవత్సరంలో శ్రీసాయి మనందరికీ ఇటువంటి ఉగాది పచ్చడి పెట్టుగాక! సాయి భక్తులందరికీ శ్రీ నందన నామ సంవత్సర శుభాకాంక్షలు!

SRI MANGA BHARDWAJA TRUST

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంపుటి: 29 మార్చి–2012 సంచిక: 11

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


**పరమపూజ్య శ్రీ ఆచార్య ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"**

## విషయసూచిక




<u>చిరునామా</u>

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**



చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి
ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: **డా॥ ఆర్.ఎస్. శశిధర్,** పిహెచ్. డి


**<u>చందా వివరములు</u>**

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10–00 |
| సంవత్సర చందా | : రూ. 100–00 |
| రాజపోషకులు | : రూ. 3,000–00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000–00 |

*శ్రీ సాయివంటి సద్గురువుపై భక్తి శ్రద్ధలు కలగడం ఎంతో అదృష్టం. కాని అటుపైన పొడగునా మనకు ఆయన తోడుగా వుండి సరియైన మార్గంలో నడిపించాలంటే ఏం చేయాలి? "నాపై నీ దృష్టి నిలుపు. నీపై నా దృష్టి నిలుపుతాను" అన్నారు సాయి. ఆయన గురించి అనన్యంగా చింతన చేసిన వారి యోగక్షేమమే ఆయన వహిస్తారు. ఇదే శ్రీకృష్ణుడు, రమణ మహర్షి చెప్పిన శరణాగతి. ఇది అంత సులభంగా, ఒక్కసారిగా కుదరదు. అనుకున్నవి నెరవేరినప్పుడు మన విశ్వాసం పొంగుతూ, లేనప్పుడు క్రుంగుతూ వుంటుంది. సద్గురువు సాంగత్యము, సేవవల్ల మాత్రమే స్థిరమైన శరణాగతి క్రమంగా కుదురుతుంది.*

**- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ**

# అందరిలో ధర్మం ప్రతిష్ఠించడం కార్యశూరతే

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

మార్చి 2012

మానవ హృదయంలో జరిగే ధర్మాధర్మాల మధ్య ఘర్షణకు బాహ్య సంకేతం భారతయుద్ధం. వ్యక్తిగతమయిన రాగ, ద్వేష, అసూయాది భావాల వలన ప్రేరేపించబడి యుద్ధం చేసేవారు దుర్యోధనాదులు-సహజంగా సామాన్యుల హృదయాలలో అధిక సంఖ్యలో వుండే అధర్మ ప్రవృత్తులకు సంకేతం కౌరవులు. అప్పడే సామాన్యులలో మేల్కొంటున్న ధర్మ ప్రవృత్తికి సంకేతాలు భీష్ముడు, ద్రోణుడు మొదలయినవారు. వారు వ్యక్తిగత పంతాల సాకున ధర్మానికి వ్యతిరేకంగా వున్న అధర్మ ప్రవృత్తుల పక్షంలో వుండికూడా వాటితో సంపూర్ణంగా కలసి కట్టుగా సహరించక హృదయాలలో విజయాన్ని అంతరంగంలో కాంక్షిస్తారు. బాహాటంగా తాము వారి ఉప్పతిన్నామన్న వ్యక్తిగత మొహమాటాలకు తమ ధర్మ ప్రవృత్తిని తాకట్టు పెట్టి అందుకు హృదయాలలో రహస్యంగా పరితాపం కలవారు. అధర్మప్రవృత్తికి భిన్నంగా సహజంగా స్వల్ప సంఖ్యలో వుండి, స్వతహాగా తమ ఉనికికి అవసరమయిన అయిదు గ్రామాలనయినా యివ్వనిరాకరించిన దుష్ట సంస్కారాలతో పోరాడే సత్సంస్కారాలు పాండవులు. స్నేహంగా జూదానికాహ్వానింపబడి వంచింపబడిన సత్సంస్కారాలు హృదయగత దుష్ట సంస్కారాల ఉనికిని సహించక వాటి పూర్ణ వినాశనానికి తీవ్రంగా కృషి చేస్తాయి. వాటిని నిర్మూలించనిదే వీలులేని పరిస్థితిలో చిక్కిన పాండవులు గత్యంతరం లేక కురువంశ నాశనం చేస్తారు. అధర్మ వాసనలను నశింపచేయడమే శుభ వాసనల ప్రయోజనం. ఆ పైన వాటికెట్టి ప్రయోజనమూ లేదు. అందులో నిస్వార్థ ధర్మ స్వరూపుడయిన "శాశ్వత ధర్మగోప్త" శ్రీకృష్ణుని సత్సంకల్పానికి శరణాగతులవుతారు వాటికి సంకేతులయిన పాండవులు. మలిన వాసనా నిర్మూలనమయ్యాక శుభవాసనలు గూడ ముముక్షుహృదయాన్ని వీడాలన్న ఆధ్యాత్మ సూత్రాన్ననుసరించి మహా ప్రస్థానానికి పూనుకొంటారు. అసలెట్టి వాసనలూ లేని హృదయం నుండి సగుణ (కృష్ణ) రూపంగూడ మరుగై నిర్గుణ బ్రహ్మతత్త్వం ముముక్షు హృదయంలో స్థిరపడడం శ్రీ కృష్ణనిర్యాణం. అంటే మానవ హృదయంలోని అధర్మ ప్రవృత్తి నశించాక ప్రత్యేక ధర్మ ప్రవృత్తి అవసరం వుండదు. ఆపైన జీవన్ముక్తావస్థలో అట్టి జ్ఞాని జీవన్ముక్తుడిగా జీవించటానికి సంకేతం పరీక్షిత్తు రాజ్యాన్ని ఉత్తమంగా చిరకాలం పరిపాలించడం. ఆ పై వృద్ధాప్యం సహజంగా తన ధర్మాన్ననుసరించి ఆ శరీరాన్ని నశింపజేయడమే తర్వాత కలి ప్రాబల్యం, శరీర ధర్మాల పట్టు సడలినట్లు ధర్మం యొక్క పట్టు సడలుతుంది.

ఇటువంటి మానవ హృదయగతమైన ధర్మ యుద్ధానికి సూత్రధారి "శాశ్వతధర్మగోప్త" శ్రీకృష్ణుడు. అతడు అతి విషమ సమయంలో చేసిన గీతా ప్రబోధమంతా ''శాశ్వతధర్మ'' మనే దాని తత్త్వవివరణ. అట్టి ధర్మానికి కల్గిన గ్లానిని నివారించడమే వైద్యుని లక్షణం.

అందుకుపయోగపడే వస్తువులేవయినా అతడుపయోగిస్తాడు. అలా అది నివారించబడగానే మిగిలేది స్వస్థతే-రోగం లేకపోవడమే ఆరోగ్యం గాని ఆరోగ్యమనేది ఒక ప్రత్యేకమయిన వస్తువుగాదు. అందుకప్పటి పరిస్థితిలో ఉపయోగించబడే వస్తువు 'ఆరోగ్యము' కానవసరం లేదు. అది సహజంగా ఆరోగ్యవంతుడికి అంత వాంఛనీయము కాకపోవచ్చు. కాని అవి ధర్మగ్లానిని కలిగించే ప్రమాణాలలో వుండక పోవడం అధర్మ నిగ్రహానికి అడ్డుపడక ఉపయోగపడేవిగా వుంటే చాలు.

*అశుభవాసనలను నివారించగల శుభవాసనలే సాక్షాత్తూ ముక్తి తత్త్వంగావు. ముక్తికి అవి అనర్థం గూడ కావచ్చు. మలిన వాసనాక్షయం తర్వాత శుభ వాసనలనుగూడ త్యజించవలసి వుంటుందన్న సత్యాన్ని మహాభారత యుద్ధానంతరం కృష్ణుడు పాండవులను విడచి నిర్యాణం చెందడం సూచిస్తుంది.*

ఆధ్యాత్మ పరిభాషలో చెప్పాలంటే అశుభవాసనలను నివారించగల శుభవాసనలే సాక్షాత్తూ ముక్తి తత్త్వంగావు. ముక్తికి అవి అనర్థం గూడ కావచ్చు. మలిన వాసనాక్షయం తర్వాత శుభ వాసనలనుగూడ త్యజించవలసి వుంటుందన్న సత్యాన్ని మహాభారత యుద్ధానంతరం కృష్ణుడు పాండవులను విడచి నిర్యాణం చెందడం సూచిస్తుంది. అలా, పాండవులేమీ పత్తిత్తులుకారని వాదించి విమర్శించి తద్వారా మహాభారత ప్రతిష్ఠను దెబ్బతీయగలిగామని సంతోషించే ఆధునిక 'విమర్శకులు' మహాభారతం యొక్క లక్ష్యాన్ని తత్త్వాన్నీ గుర్తించలేదనే చెప్పాలి - ప్రియురాలు శృంగారంలో భాగంగా గిల్లినా, అలిగినా తప్పపట్టిన విరసునిలాగ!

ఇక శాశ్వత ధర్మమొకటున్నదా? ఉంటే ఎలాంటిది దాని తత్త్వమన్నది పరిశీలిద్దాము.

ఏ వ్యక్తీ తనకధర్మం జరిగితే సహించలేడు. కనుక ధర్మమన్నది సార్వజనికమైనది. ప్రతివారి హృదయంలోను దానిని ప్రతిష్టించడమే ఆశయం. పెక్కుమంది హృదయాలలోనైనా ప్రతిష్టించగల్గితే అది కార్యశూరతే. అయితే చివరికంటా గమనిస్తే ఏ వ్యక్తికావ్యక్తి స్వశక్తితోగాని, పరబోధ ప్రభావ సహాయంతోగాని తన హృదయంలో తాను బుద్ధిపూర్వకంగా ధర్మాన్ని ప్రతిష్ఠించుకోవలసినదే. అట్టిది ప్రతి వ్యక్తీ కోరదగిన దానిలో ముఖ్యాంశం ధర్మమైతేనే సాధ్యం. ప్రతి వ్యక్తి దేనిని హృదయమంతటితోనూ పొందజూస్తాడు? తాను ధర్మం చేసినా, అధర్మం చేసినా దేనికోసం అలా చేస్తున్నాడు? దేనికోసం జీవిస్తున్నాడు. భూమిపై వచ్చినప్పటి నుండీ భూస్థాపితుడయ్యేవరకూ అతడు దేనినన్వేషిస్తాడో ఆ లక్ష్యానికి, ధర్మానికిగల సంబంధమేమిటి? ఇది మరో సారి చర్చిద్దాము.

# సాధన

దివ్యజనని అలివేలు మంగమ్మ



దేనినైనా సాధించడానికి చేసే ప్రయత్నాన్ని సాధన అంటారు. అది మంచి కావచ్చు, చెడు కావచ్చు. లౌకికము కావచ్చు, పారమార్థికము కావచ్చు.

సాధారణంగా చాలామంది 'ముక్తి' కోసం చేసే ప్రయత్నాన్నే 'సాధన' అనుకుంటారు. కానీ లౌకికంగా గూడ ఏ పని సాధించాలన్నా కొద్దో గొప్పో సాధన అవసరం. మనం చేసే పనిని బట్టీ దాని యొక్క సాధన అంత ఎక్కువగా గానీ, తక్కువగా గానీ వుంటుంది. సులభంగా గానీ, కష్టంగా గానీ వుంటుంది. లౌకికంగా గూడ గొప్ప పనులు చేసినవారంతా ఆ పనులు సాధించడానికి ఎంతో సాధన చేయవలసిందే. ఉదాహరణకు ఒక శాస్త్రవేత్త దేనినైనా నూతనమైనదానిని ఆవిష్కరింపజేయడానికి కఠోర సాధన చేయవలసిందే. అలాగే సామాజికంగా కొత్త పరిణామం తేవాలంటే ఎంతో క్లిష్టతరమైన సాధన అవసరం. ఇలా అన్ని విషయాలలోనూ తరతమ భేదాలతో సాధన చేయకుండా వుండడం సాధ్యపడదు.

అయితే ఆధ్యాత్మిక సాధన ప్రత్యేకమైనది, విశిష్టమైనది. అది మానవుని తత్త్వాన్ని గూర్చిన సాధన అవడం వల్ల అది ప్రత్యేక ఫలితాలను యిస్తుంది. భౌతికమైన వాటితో సంబంధంవున్నా, లేకపోయినా అది భౌతిక ప్రపంచానికి అతీతమైన స్థితిని కలుగజేస్తుంది. కనుక అది పూర్తి మానసికమైనది. భౌతికంగా మనం చేయలేని పనులను, లేక ఎంతో ఖర్చు, ప్రయత్నంతోగానీ చేయలేని పనులను కేవలం మానసిక శక్తితోనే చేయగలగడం దాని విశిష్టత. అనేక రకాలైన సాధనల ద్వారా అనేక విధాలైన శక్తులను సాధించవచ్చు.



అయితే ఏ విధమైన సాధనలైనా ముక్తికోసం మాత్రమే నిర్దేశింపబడినవి. అందుకని ఆ సాధనా మార్గంలో ఎంతటి అద్భుత శక్తులు వచ్చినా వాటిని లౌకిక ప్రయోజనాలకు వాడుకోకుండా సాధనలో ముందుకు సాగిపోవాలని పెద్దలు చెప్పారు.

ఏదైనా సాధించడానికి పట్టుదల కావాలి. అంటే ఏదైనా సాధించాలనుకుంటే గట్టి పట్టుదలతో కూడిన సాధన అవసరము. పట్టుదల లేనివాడు దేనినీ సాధించలేడు. కొందరు దేనినైనా సాధించాలని అనుకుంటారట గానీ దానిలో విఘ్నాలొస్తాయనే

భయంతో ప్రారంభించనే ప్రారంభించరట. మరికొందరు ప్రారంభిస్తారు గానీ విఘ్నాలు కలుగగానే ఆపేస్తారట. మరి కొందరు ఎన్ని విఘ్నాలొచ్చినా భయపడక ఆ పనిని సాధించేవరకూ కొనసాగిస్తారట. వీరినే ధీరులు అంటారని పెద్దలు చెప్తారు.

***కానీ ఆయన ఎక్కడో ముక్కుమూసుకుని చేయలేదు. బుద్ధుని వలె సర్వమూ త్యజించి వెళ్ళిపోయీ చేయలేదు. తానున్న చోటనే వుంటూ, ఒక ప్రక్క విద్యనభ్యసిస్తూ, మరొక ప్రక్క గృహావసరాలను చూసుకుంటూ సాధన చేసారు. పైగా తాము చేసే సాధన మరెవ్వరికీ తెలియకుండా చేసారు. ఆయన సాధన చేస్తున్నట్లే ఇంట్లో వారికి గానీ, బయటివారికి గానీ ఎవ్వరికీ తెలియదు.***

బాబా తాము 12 సం॥ల పాటు కేవలం వేపాకులు మాత్రమే తీసుకుని జీవించామని చెప్పారు. దీనిని బట్టి ఆయన ఎటువంటి సాధన చేసారో మన ఊహకు అందదు.

అలాగే పూజ్యశ్రీ మాస్టరుగారు ఎన్నో కఠినతరమైన సాధనలు చేసారు. కానీ ఆయన ఎక్కడో ముక్కుమూసుకుని చేయలేదు. బుద్ధునివలె సర్వమూ త్యజించి వెళ్ళిపోయీ చేయలేదు. తానున్న చోటనే వుంటూ, ఒక ప్రక్క విద్యనభ్యసిస్తూ, మరొక ప్రక్క గృహావసరాలను చూసుకుంటూ సాధన చేసారు. పైగా తాము చేసే సాధన మరెవ్వరికీ తెలియకుండా చేసారు. ఆయన సాధన చేస్తున్నట్లే ఇంట్లో వారికి గానీ, బయటివారికి గానీ ఎవ్వరికీ తెలియదు.

"సాధన జీవితంలో ఒక భాగం అవడంగాదు. జీవితమే సాధన కావాలి" అని పూజ్యశ్రీ మాస్టరుగారు చెప్పారు. అంటే మనం రోజూ ఎంతో కొంత సమయాన్ని మాత్రమే సాధనకు ఉపయోగించుకుంటాము. అంటే భగవంతుని మీద ధ్యాస నిలపడానికి ప్రయత్నిస్తుంటాము. అప్పుడు సాధన మన జీవితంలో ఒక భాగమన్నమాట. అంటే జీవితం వేరు, సాధన వేరు అని మనం భావిస్తున్నామన్నమాట.

సాధనకు ఏవేవో ఆటంకాలు వస్తున్నాయని, అందుకని సాధన ఎంతగా చేయాలనుకున్నా చేయలేకపోతున్నామనీ కొందరు బాధపడుతుంటారు. అంటే వారికి 'సాధన' అనే దానిమీద సరియైన అవగాహన లేనట్లేనని చెప్పుకోవాలి. 'సాధన' అనేది ఒకచోట కూర్చుని మాత్రమే చేసుకునేది మాత్రమేననో, లేక ఎక్కడికైనా వెళ్ళి చేసుకునేది మాత్రమేననో అనుకుని దానికి ప్రత్యేక సమయం కావాలనుకోవడంవల్ల వచ్చే అవరోధం మాత్రమే అది. అందుకని ఈ పనివల్ల చేయలేకపోవడము, ఆ పరిస్థితివల్ల చేయలేకపోవడము – ఇలా ఎన్నో అవరోధాలు మనకు కనిపిస్తాయి. కానీ 'సాధన' అనేది పూర్తి మానసికమని గుర్తించాలి. 'సాధన' బాహ్యమైనది ఎప్పటికీ కాదు, మానసికమైనది మాత్రమే. అందుకని దానికి ఎట్టి అవరోధాలూ వుండవు–ఒక్కమనస్సుతప్ప. అంటే మనస్సుకు మనస్సే అవరోధమన్నమాట. కూర్చుని చేసే పూజ, జపము, ధ్యానము మొదలైనవన్నీ సాధనకు ఇంకా యింకా దోహదం చేయడానికి మాత్రమే ఉపయోగపడతాయి. అవి చేస్తున్నప్పుడు మనస్సు అందులో నిమగ్నమవకపోతే వ్యర్థమే అవుతాయి. కనుక మనస్సును సాధనయందు నిలపడమే ప్రధాన కర్తవ్యము.

కనుక మనస్సును సాధనయందు నిలపడానికి ఏవీ ఆటంకం కావని గుర్తించాలి. కారణం ఏపని చేస్తున్నా మన మనస్సు దానిపని అది చేసుకుపోతూవుంటుంది. అందుకని మనస్సుకు పనితో సంబంధం వుండవచ్చు, లేకపోవచ్చు, కారణం పనితో సంబంధం వున్నంతవరకే మనస్సు దానిపైన పనిచేసి, ఇతర ఆలోచనల మీదకు అప్రయత్నంగానే పరిగెత్తుతుంది. కనుక పనితో సంబంధం లేని అట్టి ఇతర ఆలోచనలకు బదులు సాధనపరమైన ఆలోచనల మీద పెడితేచాలు. కాని మనస్సు చిత్రమైంది. ఇతర ఆలోచనమీదకు వద్దన్నా పరుగెత్తుతుంది. కానీ సాధనపరమైన ఆలోచనల మీదకు మళ్ళిద్దామంటే మొరాయిస్తుంది. అందుకని సాధనయందు ప్రీతి లేని

మనస్సును సాధనయందు ప్రీతి కలిగేలా చేసే ప్రయత్నమే సాధన.

అందుకని సాధన చేయడానికి భగవంతుని మీద ప్రీతి వుండాలి. అంటే భగవంతుని యొక్క ఔదార్యాన్నీ, ఆయన మనకు చేస్తున్న శ్రేయస్సును గూర్చీ ఆలోచిస్తూంటే ఆయన మీద మనకు ఇష్టం కలుగుతుంది. కనుక మనం ఆయనను గూర్చి ఎక్కువగా ఆలోచిస్తాము. ఇందుకు పూజ్యశ్రీ మాస్టరుగారు ఒక ఉదాహరణ చెప్పేవారు : "వయస్సులో వున్న వారిరువురు ఒకరినొకరు ప్రేమించుకున్నారనుకుందాము. వారిరువురి ఆలోచనంతా నిరంతరమూ తాము ప్రేమించిన ప్రియుడి మీదనో, ప్రియురాలి మీదనో మాత్రమే తిరుగుతుంటుంది. వీలైనంత సమయం వారితోనే ఎక్కువగా మాట్లాడాలనీ, వారితోనే గడపాలనీ చూస్తుంటారు. అందుకు అవకాశాలకోసం ప్రయత్నిస్తుంటారు. వారికి ఏ ఇతర సంభాషణలు, ఏ ఇతర వ్యాపకాలూ పట్టవు. సాధ్యమైనంత తక్కువ సమయాన్ని ఇతర విషయాల కోసం వెచ్చిస్తారు. ఏ ఇతర ఆలోచనలూ ఎక్కువగా వుండవు. తాను ప్రేమించిన వారిపై వుండే ఆలోచనలకు ఏ ఇతర ఆలోచనలూ అడ్డురావు. పైగా ఏవైనా యితరమైన వాటిని ఆలోచింపవలసివచ్చినా, చేయవలసివచ్చినా కోపము, చిరాకు వస్తాయి.

అట్లాగే భగవంతుని మీద ప్రేమ పెరిగిన కొద్దీ ఇతర ఆలోచనల మీద ధ్యాస తగ్గుతూ భగవంతుని మీద పెరుగుతూ పోతుంది. అప్పుడు వీలున్నప్పుడల్లా సాధనకు కూర్చోవాలనిపిస్తుంది. కూర్చోడం జరుగుతుంది. అలా కూర్చోడానికి వీలుపడకపోతే ఏపని చేస్తున్నా భగవంతుని మీదే ధ్యాస వుంటుంది. కనుకనే భగవద్గీతలో శ్రీకృష్ణుడు, భక్తుడైనవాడు కూర్చున్నా, నిలుచున్నా, తింటున్నా, నడుస్తున్నా– ఇలా ఏ పని చేస్తున్నా నిరంతరమూ భగవంతుని ధ్యాసలోనే వుంటాడు అని చెప్పాడు. ఈ విధంగా ఆలోచిస్తే సాధనకు అంతరాయమైనదేదీ కనిపించదు".

అలాగాక కొన్ని పనులు మనసుపెట్టి మాత్రమే చేయవలసి వుంటుంది. ఉదాహరణకు ఉద్యోగము – చదువు మొదలగునవి. అప్పుడెలా? అంటే పూజ్యశ్రీ మాస్టరుగారిలా చెప్పారు: ''అప్పుడు పని ప్రారంభించేముందు, మధ్యమధ్య విరామ సమయాలలోనూ, పని అయిపోయిన తర్వాత భగవంతుని స్మరించుకోవాలి. మధ్యమధ్యలో మనకు వచ్చే ఇతర అనవసరమైన ఆలోచనలకు బదులు బాబాపై ధ్యాస నిలుపుకోవాలి. పని ప్రారంభించబోయేముందు, 'బాబా ఈ నా కర్తవ్యాన్ని మీరు నాకిచ్చిన మీ సేవగా భావిస్తాను. నా కర్తవ్యాన్ని సక్రమంగా, ధర్మబద్ధంగా నిర్వర్తించేలా చేయి' అని ప్రార్థించాలి. అలాగే పని ముగించేటప్పుడు గూడ బాబా స్మరణతో ముగించాలి. ఇలా చేస్తే మన సాధన అంతకంతకూ సులభతరమవుతుంది".

అంతేగాక మన సాధన వల్ల ఇతరులకెప్పుడూ ఎటువంటి ఆటంకమూ కలుగకూడదు. మన కర్తవ్యాన్నెప్పుడూ తప్పించుకోగూడదు. కొంతమంది తాము చేసే సాధనలో అంటే భగవంతుని స్మరణలో అందరికీ ఇబ్బంది కలిగిస్తూ వుంటారు. తాము

> ***తాను ప్రేమించిన వారిపై వుండే ఆలోచనలకు ఏ ఇతర ఆలోచనలూ అడ్డురావు. పైగా ఏవైనా యితరమైన వాటిని ఆలోచింపవలసివచ్చినా, చేయవలసివచ్చినా కోపము, చిరాకు వస్తాయి. అట్లాగే భగవంతుని మీద ప్రేమ పెరిగిన కొద్దీ ఇతర ఆలోచనల మీద ధ్యాస తగ్గుతూ భగవంతుని మీద పెరుగుతూ పోతుంది. అప్పుడు వీలున్నప్పుడల్లా సాధనకు కూర్చోవాలనిపిస్తుంది.***

భగవంతుని పూజలోనో, పారాయణలోనో వుంటాము గనుక అత్యవసరమైనా సరే తమను ఇతరులు పలుకరించగూడదని, అవతలివారికి ఇబ్బంది అయినా సరే తాము కూర్చున్న చోటునుంచి తమను కదపగూడదని, ఎంత ముఖ్యమైన, అవసరమైన, తాము

మాత్రమే చేయవలసిన పనులను గూడ తమకు చెప్పగూడదని, తాము (మహాభక్తులము లేక సాధకులము) గనుక తాము చేసే పనులకు ఎవ్వరూ అడ్డు చెప్పకూడదనీ ఆంక్షలు పెడతారు. అంతేగాదు, ఇతరులు అన్నీ సకాలంలో సక్రమంగా తమకు సమకూర్చాలనీ తలుస్తారు. ఉదాహరణకు ఇంట్లోకి అవసరమైన వస్తువులు గానీ సరుకులుగానీ తాము తేకపోయినప్పటికీ అవతలివారికి ఎక్కువ పనులున్నా లేక తీరికలేకపోయినాసరే వారే ఆ పనులను గూడ చేసి వీరికి సకాలంలో ఉపాహారము, భోజనమూ సిద్ధం చేయాలన్నమాట. ఇతరులు అందుకు అభ్యంతరం చెబితే వారిపై విరుచుకుపడతారు. తామేదో గొప్పగా సాధన చేయాలనుకుంటుంటే అందరూ తమకు అడ్డువస్తున్నారని కోపగించుకుంటారు. ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. వారిలాగే ఇతరులుగూడ ప్రవర్తిస్తే ఎలా వుంటుందో ఆలోచిస్తే వారి ప్రవర్తన ఎంత అసమంజసమైనదో అర్థమవుతుంది.

ఇలా మన మనస్సు చిత్రవిచిత్రంగా ప్రక్కదారులు పడుతుంటుంది. వీటిని జాగ్రత్తగా గమనించుకుంటూ మన సాధనను సరియైన మార్గంలో తీసుకువెళ్తుండాలి. అంతేగాక నిర్దుష్టంగా సాధన చేస్తున్నప్పటికీ సాధనలో కొంచెం పైకి ఎదగగానే సిద్ధులనే క్రూరమృగాల బారిన పడే ప్రమాదం పొంచి వుంటుంది. అందుకని సాధనలో అడుగడుగునా జాగ్రత్త వహిస్తూనే వుండాలి.

పూజ్యశ్రీ మాస్టరుగారు ఒకసారిలా చెప్పారు; “మన సాధనకోసం ఎవరికీ ఆంక్షలు పెట్టకూడదు. ఎవరినీ ఇబ్బంది పెట్టకూడదు. ఎవరికీ మనవల్ల ఎటువంటి అసౌకర్యమూ, ఆటంకమూ కలుగకుండా చేసేదే నిజమైన సాధన. కొందరు తాము పూజ, పారాయణ, ధ్యానము మొదలైనవి చేసుకుంటున్నప్పుడు ఇంట్లో ఎవ్వరూ పెద్దగా మాట్లాడగూడదని, పసిపిల్లలు గూడ ఏడవగూడదనీ కోపగించుకుంటుంటారు. అంటే ఏమిటి అర్థం? ఏమాత్రం శబ్దమైనా, ఆటంకం వచ్చినా మన మనస్సు భగవంతుని మీద నిలవదన్నమాట. అంటే మన సాధన ‘తుమ్మితే ఊడిపోయే ముక్కు’ అన్నమాట. అటువంటి వాడికి సాధన ఏనాటికీ జరుగదు. కారణం ఇంట్లో ఎవరు ఏ శబ్దం చేసినా, ఏమి జరిగినా వీరికి వాళ్ళను కోప్పడడంతోనే సరిపోతుంది. ఇక జపధ్యానాదులెక్కడ చేస్తాడు? అందరినీ ఉరిమిరిమి చూడడము, అరవడముతోనే సరిపోతుంది. చివరకు

*కొందరు తాము పూజ, పారాయణ, ధ్యానము మొదలైనవి చేసుకుంటున్నప్పుడు ఇంట్లో ఎవ్వరూ పెద్దగా మాట్లాడగూడదని, పసిపిల్లలు గూడ ఏడవగూడదనీ కోపగించుకుంటుంటారు. అంటే ఏమిటి అర్థం? ఏమాత్రం శబ్దమైనా, ఆటంకం వచ్చినా మన మనస్సు భగవంతుని మీద నిలవదన్నమాట. అంటే మన సాధన ‘తుమ్మితే ఊడిపోయే ముక్కు’ అన్నమాట. అటువంటి వాడికి సాధన ఏనాటికీ జరుగదు.*

అందరినీ తిట్టుకుంటూ సాధననుంచి లేవడమే జరుగుతుంది. అంత ఏకాంతము కావాలనుకున్నవాళ్ళు బయటకు వెళ్ళి ఏకాంత ప్రదేశములో సాధన చేసుకోవాలి. ఇటువంటి వారికి అక్కడ గూడ పక్షుల యొక్క, జంతువుల యొక్క అరుపులు ఆటంకమవుతాయి. కనుక ఎక్కడ వున్నా, ఎటువంటి పరిస్థితులలో వున్నా మన ధ్యాస భగవంతుని మీద నిలుపుకోవడానికి ప్రయత్నించాలి. అప్పుడు మన సాధనకు ఎట్టి ఆటంకాలూ వుండవు. ఒకడు బాణాలు తయారు చేస్తున్నాడట. వాడికి తన ముందుగా వెళ్తున్న పెద్ద ఊరేగింపుగూడ అతని గుర్తింపులోకి రాలేదుట. అలాంటి ఏకాగ్రతకు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే వుండాలి. ఉదాహరణకు మనమొక నవల చదువుతున్నామనుకోండి. అప్పుడు ఇంట్లోని విషయాలేవీ మనకు ఆటంకం కావు. మరి పారాయణ చేస్తున్నప్పుడు అలా జరుగుతున్నదంటే మనకు పారాయణలో ఏకాగ్రత కుదరలేదన్నమాట. అందుకని

ఏకాగ్రతకు ప్రయత్నించాలి.

కొందరు తాము సాధకులము గనుక తమ బాధ్యతలను తాము నిర్వర్తించనవసరం లేదని తలుస్తారు. సంసారంలో వున్నంతవరకూ మన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించవలసినదే. కారణం అది ధర్మంగనుక. ధర్మం తప్పిన సాధన సరియైన సాధనకాదు. సర్వమూ త్యజించి భిక్షతో మాత్రమే జీవించి సాధన చేసుకునేవారికి మాత్రమే ఏ బాధ్యతలూ వుండవు. కనుక మనం మన కర్తవ్యం నిర్వర్తిస్తూనే సాధన కొనసాగించాలి.

మరికొందరు రోజులో కొంత సమయం మాత్రమే సాధనలో గడిపి, మిగతా సమయమంతా వ్యర్థ కాలక్షేపాలతో గడుపుతూ, తామెంతో సాధన చేస్తున్నామని, మిగతా వాళ్ళు అజ్ఞానంతో కొట్టుకుపోతున్నారనీ తలుస్తుంటారు. అంటే అటువంటి వారిలో తావేదో గొప్ప అనే అహంకారం బలపడుతున్నదన్నమాట. నిజంగా సాధన చెయ్యాలనుకున్న వారెవ్వరూ తాము సాధన చేస్తున్నామని విఱ్ఱవీగరు. ఎవరికీ గొప్పగా చెప్పుకోరు. లక్ష్యంమీద దృష్టివున్నవాడికి సాధన చేస్తూ పోవడమే జరుగుతుంది గానీ అహంకరించడానికి, ఆలోచించడానికి సమయముండదు. ర్యాంకు రావాలని చదివేవాడు యింకాయింకా చదవాలనే అనుకుంటాడు గాని తాను అంతగా చదువుతున్నానని అహంకరిస్తాడా? గొప్పలు చెప్పుకుంటాడా? అలాగే ఇదీను. అసలు సాధనంతా అహంకార నిర్మూలనం కోసమే. నేను గొప్పగా సాధన చేస్తున్నాను అనుకునేవాడు లక్ష్యం మీద కన్నా తన గొప్పల మీద కోరికగలవాడన్నమాట."

అసలు సాధన ఎందుకు చేయాలి? అంత కష్టపడి సాధన చేయడం అవసరమా? ఇప్పటిలాగా హాయిగా వుండవచ్చుగదా! అని కొందరు ప్రశ్నించవచ్చు. నిజవేు! అలా అనిపించబట్టే చాలామంది ఆధ్యాత్మికతవైపుకు, సాధనవైపుకూ కన్నెత్తి గూడ చూడరు. వాళ్ళకు ఆధ్యాత్మిక సాధన చేస్తే అన్నీ వదులుకోవలసివస్తుందని భయం. అందుకే ఆమడదూరం పారిపోతుంటారు. అయితే 'హాయిగా వుండచ్చుగా' అని వారనుకున్నట్టు హాయిగా వుండడానికే సాధన అని వారికి తెలియదు. ఏవో కొన్ని కోరికలు తీరినప్పుడో, కొన్ని పరిస్థితులు అనుకూలించినప్పుడో హాయిగా వుండడం గాక ఎప్పుడూ హాయిగా వుండే

> *ర్యాంకు రావాలని చదివేవాడు యింకాయింకా చదవాలనే అనుకుంటాడు గాని తాను అంతగా చదువుతున్నానని అహంకరిస్తాడా? గొప్పలు చెప్పుకుంటాడా? అలాగే ఇదీను. అసలు సాధనంతా అహంకార నిర్మూలనం కోసమే. నేను గొప్పగా సాధన చేస్తున్నాను అనుకునేవాడు లక్ష్యం మీద కన్నా తన గొప్పల మీద కోరికగలవాడన్నమాట."*

ప్రయత్నమే ఆధ్యాత్మిక సాధన అనివారికి తెలియదు.

అయితే ఆధ్యాత్మిక సాధన కష్టంకాదా? అంటే కష్టమేని ఒప్పుకోక తప్పదు. కారణం ఆధ్యాత్మిక సాధన నాన్వేఘాట్ దున్నపోతుమీద దాటటం కంటె గూడ కష్టమని, శక్తినంతా వినియోగించి కృషి చేస్తేనేగాని సాధ్యం కాదనీ బాబానే చెప్పారు. పూజ్యశ్రీ మాస్టరుగారు గూడ యిలా అంటారు : "ఒక్క క్షణకాలం గూడ మన మనస్సును నిగ్రహించుకోవడం ఎంతో కష్టం" అని. ఆయన యింకా యిలా అంటారు : "ఆధ్యాత్మిక సాధన ఎంతో కష్టమే. అయినప్పటికీ సద్గురువును సేవిస్తే అది సులభమే అవుతుంది. అందునా సద్గురువులలో కోహినూర్‌వంటివారయిన శిరిడీ సాయినాథుని సేవిస్తే యింకా సులభమని. కారణం ఆయన ఈ సకల చరాచర జగత్తంతా తమ రూపమేనని అనుభవాలనిస్తున్నారు. అందుకే సాధకునకు ఆటంకమయ్యే ఈ ప్రపంచం సాయి భక్తుని సాధనకు దోహదకారియై అతని సాధనను సులభతరం చేస్తుంది."

ఎక్కడో ముక్కుమూసుకుని చేసే సాధనగా

గాకుండా పూజ్యశ్రీ మాస్టరుగారు అంత సులభంగా సాధన ఎలా కొనసాగించవచ్చో అనేక విధాల మనకు బోధించారు. మన ఆలోచనలను సరియైన విధంగా సరిదిద్దుకుంటే మన ప్రవర్తన అదే మారిపోతుందని, మన ప్రవర్తనను సరిగా మలచుకోవడమే సాధనలో అతి ముఖ్యమైన అంశమని ఆయన చెప్పేవారు. మన ఆలోచనలు, ప్రవర్తన సరిగా లేకుండా బాబాను ఏవిధంగా సేవించినా అది సరియైన సాధన కాజాలదని ఆయన చెప్పేవారు. అంతేగాక మన ప్రవర్తనను మలచుకోవడం మన చేతిలోనే వుంటుంది గనుక సాధనకు ఆటంకమేముంటుంది? అనేవారాయన.

పూజ్యశ్రీ మాస్టరుగారు యింకా యిలా చెప్పారు: "సాధనకు గమ్యమేమిటి? పరమాత్మను చేరుకోవడం. అంటే బాబాను చేరుకోవడం. అందుకు సాధన చాలా కష్టమని చాలామంది అనుకుంటారు. సాధనకు బాబా స్మరణకు మించిన సులభతరమైన సాధన మరొకటి లేదు. కారణం బాబా మనకు ఎంతో దగ్గరగా వుంటారు. పిలిస్తే పలుకుతారు. తలిస్తే మన చెంతనుంటారు. ఆయన ఎంతటి దయామయులో ఆయన లీలలను చూస్తే తెలుస్తుంది. తన దుష్కర్మను పది జన్మలలో అనుభవింపజేయమని ప్రార్థించిన భక్తుని కర్మను తక్షణమే ప్రక్షాళన చేసారు బాబా. మరొకరిని మృత్యువునుంచే కాపాడారు. ఇలా బాబా ఎన్నో లీలలు చేసారు. ఇప్పటికీ చేస్తున్నారు గూడ. ఇది ఆయనను స్మరించేవారందరికీ అనుభవమే. ఆయన మన లౌకిక కోరికలు తీరుస్తూనే తగురీతిన మన ప్రవృత్తులను గూడ సంస్కరిస్తారు. కనుక ఆయనవద్ద మనకు ఇహము, పరమూ గూడ దక్కుతాయి. దానికి మనం చేయవలసిందల్లా ఒక్కటే. ఆయన చేసిన అద్భుత లీలలను ఎప్పుడూ స్మరించుకుంటూ వుండాలి. అంతేగాక ఇతరులకు కలిగిన అనుభవాలను, మనకు కలిగిన అనుభవాలను, ఆయన శరీరంతో చేసిన అద్భుత లీలలను ఇతరులతో గూడ చెబుతూ వుండాలి. మనింట్లో పసిబిడ్డ వుంటే ఆ బిడ్డ గురించి ఎంతెంతగా చెప్పుకుంటుంటామో అలాగే బాబా లీలలను గూర్చి చెప్పుకుంటుంటే బాబా మీద ప్రీతి యింకా యింకా పెరుగుతుంది. ఆయన పట్ల ప్రీతి పెరిగిన కొద్దీ స్మరణ పెరుగుతుంది. అలా జరగడం వల్ల ఎంతో కష్టమనిపించే సాధన సులభతరమవుతుంది. ఇతరులతో చెప్పుకొనడం వల్ల మరొక సౌలభ్యము గూడ వున్నది.

*మనింట్లో పసిబిడ్డ వుంటే ఆ బిడ్డ గురించి ఎంతెంతగా చెప్పుకుంటుంటామో అలాగే బాబా లీలలను గూర్చి చెప్పుకుంటుంటే బాబా మీద ప్రీతి యింకా యింకా పెరుగుతుంది. ఆయన పట్ల ప్రీతి పెరిగిన కొద్దీ స్మరణ పెరుగుతుంది. అలా జరగడం వల్ల ఎంతో కష్టమనిపించే సాధన సులభతరమవుతుంది*

వారికి గూడ సత్సంగమై వారికి గూడ బాబా స్మరణ జరుగుతుంది.

పూజ్యశ్రీ మాస్టరుగారు చెప్పిన వాటిని మననం చేసుకుంటూ, మన ఆలోచనలను, ప్రవర్తనను మలచుకుంటూ పోతుంటే మనకు సాధన సులభతరమవుతుందని వేరే చెప్పుకోనవసరం లేదు. కనుక ఈ కృతజ్ఞతా మహోత్సవ సందర్భంగా పైన చెప్పుకున్న బలహీనతలు మనలో వున్నాయో లేదో నిశితంగా పరిశీలించుకుని సాధనను సరియైన విధంగా చేసుకోవడానికి ప్రయత్నిద్దాము. అందుకు ఆశీస్సులందించమని పూజ్యశ్రీ మాస్టరుగారిని, శ్రీ సాయిబాబాను మనసారా ప్రార్థిద్దాము.

# యుగపురుషుడు

శ్రీమతి వేదవతి



ఒక్కసారి మన చుట్టూ వున్న ప్రపంచాన్ని చూడండి! ఎంత అగమ్యగోచరంగా వుందో! ఆధునిక జీవన విధానమనే ముసుగులో మనుషులు ఆలోచనారహితంగా తమకే తెలియని ప్రలోభాల మాయలో గమ్యంలేని అవిశ్రాంత ప్రయాణీకులలాగా ఒక ప్రవాహంలో కొట్టుకుపోతున్నారు. డబ్బు అనే మానవుడి బానిస, తన స్థానాన్ని మార్చి వాడి యజమానిగా మారి తన ఇంద్రజాల మహేంద్రజాలంతో వాడి జీవిత విధానాన్నే శాసిస్తోంది. అందులో వాడి ఆహార నిద్రామైథునాలకు గాని, ఆయురారోగ్యాలకు గాని, సుఖశాంతులకుగాని, సంబంధ బాంధవ్యాలకుగాని ధనం తర్వాతే ప్రాధాన్యత. ఆ బలహీనత ఆధారంగా డబ్బు ఎర చూపించి వాడి కాలాన్ని, ఆరోగ్యాన్నీ, మనశ్శాంతినీ పిండి అశాంతిని పెంపొందించే వ్యవస్థలెన్నో! ఆ వ్యవస్థ అనే చట్రంలో ఇమిడితే తప్ప మనలేని కృత్రిమ పరిస్థితిని కల్పించి జీవితం పట్ల అభద్రతను పెంచి పోషించే చిత్రమైన విపత్తులో ఇరుకున్నాడు మనిషి. మంచి విషయాలను గురించి ఆలోచించడానికి గాని, తెలుసుకోవడానికి గాని ఆ ఘర్షణలో కొంచెమైనా వెసులుబాటులేదు. దాని నుంచి తప్పుకోవడానికి తనకూ, సాటివారికీ ఎందుకూ పనికిరాని కాలక్షేపాలెన్నో! తనకూ, సమాజానికీ హానికరమైన వ్యసనాలు, పోకడలూ ఎన్నో! జీవించడానికి ఒక నిర్దుష్టమైన విధానము లేక, ఉన్న జీవితం ఎందుకలా వుందో అర్థం కాక సామాన్యుడు తన శాంతినీ, సుఖాన్నీ, సంబంధాలనూ, ఆరోగ్యాన్నీ, క్షేమాన్నీ వ్యక్తిగతంగానూ, సామాజికంగానూ కోల్పోతున్నాడు. జీవించడానికి ధైర్యంలేక, జీవితంలో ఎదురయ్యే సమస్యలను ఎదుర్కొనే అవగాహన లేక తీవ్రమైన అశాంతిలో, అభద్రతలో మగ్గిపోతున్నాడు మానవుడు. ఇక ధనదాహంతోనూ, అధికార దాహంతోనూ నిండిన ప్రపంచంలో విపరీతపు పోకడలెన్నో! కల్తీ వ్యవస్థలెన్నో? గందరగోళంలో చిక్కిన మానవుని మనస్సుకు చల్లని విశ్రాంతి తీరం కావలసిన ఆధ్యాత్మిక ప్రపంచం కూడా కల్తీ చెందింది. నకిలీ



సిద్ధాంతాలు, నకిలీ ధర్మాలు, నకిలీ మతాలు, నకిలీ గురువులు... ఇక చెప్పుకుంటూ పోతే ఆ చిట్టాకు అంతుండదు. తత్ఫలితంగా మానవ సమాజంలో కొందరు అవి నకిలీవని తెలుసుకోలేక వాటిలో పడి

> *ఆహార నిద్రామైథునాలకు గాని, ఆయురారోగ్యాలకు గాని, సుఖశాంతులకుగాని, సంబంధ బాంధవ్యాలకుగాని ధనం తర్వాతే ప్రాధాన్యత. ఆ బలహీనత ఆధారంగా డబ్బు ఎర చూపించి వాడి కాలాన్ని, ఆరోగ్యాన్నీ, మనశ్శాంతినీ పిండి అశాంతిని పెంపొందించే వ్యవస్థలెన్నో!*

కొట్టుకుపోతూవుంటే మరికొందరికి ధర్మము, ఆధ్యాత్మికత బూటకాలనీ, వాటిని 'లౌకిక' జీవితంలో సమన్వయ పరచుకొని జీవించడం అసాధ్యమనీ అనిపిస్తుంది. తత్ఫలితంగా సమాజానికి క్రమము లేకుండా పోతుంది. అందుకే నేరాలు, ఘోరాలు మితిమీరిపోతున్నాయి. ఈ 'అధునాతన' ప్రపంచంలో మానవుడికి భద్రతే లేదు. మరి ఈ సమస్యకు పరిష్కారమేమిటి? మనమూ, మన భావితరాలు ఇంకా ఇంకా అభద్రతలో కూరుకుపోవలసినదేనా? అసలు మనకెంటువంటి మార్పుకావాలి?

మనకు వ్యక్తిగతంగానూ, సామాజికంగానూ భద్రత కావాలి. అంటే శారీరకంగానూ మానసికంగానూ, కుటుంబపరంగాను, సమాజం నుంచీ, దేశం నుంచి, ప్రపంచం మొత్తంగానూ భద్రత కావాలి. అంటే పరస్పర హానికరమైన పోకడలు పోయి, పరస్పరము వృద్ధిని కలిగించే సంస్కృతి మనకు కావాలి. దానినే ధర్మబద్ధమైన నడవడిక అని అంటారు. ధర్మానికి మూల సూత్రం మానసికంగానూ, శారీరకంగాను వ్యక్తిగతంగాను, సామాజికంగాను హానికరమైనవేవీ చేయకపోవడమే. అంతేకాదు! పరస్పరం శ్రేయస్కరమైనవి చేయడము. దానివలన మనిషికి, ఇతర ప్రాణికోటికీ భద్రత లభిస్తుంది. అందుకే 'ధర్మో రక్షతి రక్షితః' అన్నారు. అంటే మనం ధర్మాన్ని కాపాడితే అది మనలను కాపాడుతుంది. ఎలా? భద్రత ప్రసాదించడం ద్వారా. భద్రతవల్ల ఎంతో మనశ్శాంతి, సుఖమూ కలుగుతాయి. అంతేకాదు జీవితానికి ఒక పంథా ఏర్పడుతుంది. స్పష్టత వస్తుంది.

అయితే ఈ ధర్మ సూత్రం దేశకాలాలకు అతీతమైనది. అన్ని మతాలకు, సంస్కృతులకు ఆధారం ఈ ధర్మసూత్రము. అయితే ఈనాడు మిగిలిన వ్యవస్థలలాగే ఇవి గూడా ఈ సత్యాన్ని విస్మరించి కల్తీ అయిపోయాయి. ఇప్పుడసలు ఎవ్వరినీ, దేనినీ నమ్మలేని స్థితికి వచ్చారు జనం.

మతాలన్నీ ఈ ధర్మసూత్రాలని దేశకాలాలననుసరించి అమలు పరచుకునేందుకు ఆచరణయోగ్యాలు. అందుకే అవి అన్నీ శాంతి సౌఖ్యాలను, భద్రతను కలిగించే మనస్తత్త్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ పెంపొందించడానికే ఉద్దేశింపబడ్డాయి. అయితే ఈనాడు ఈ స్పష్టతలేని మత గురువులు, మత ప్రచారకులు దేశకాలాల వ్యత్యాసాలవల్ల వచ్చిన వైవిధ్యాలను మతాల మధ్య వైవిధ్యాలుగా భ్రమించి, ప్రజలను భ్రమింపజేసి మత కలహాలకు కారణభూతులౌతున్నారు. వివిధ మతాలలోని మూలగ్రంథాలను సైతం తిరగవ్రాసేందుకు వారు వెనుకాడడం లేదు.

ధర్మంగా బ్రతకాలనుకునే సామాన్యుడికి ఏ మూలగ్రంధాన్ని ప్రామాణికంగా తీసుకోవాలో అర్థంగాదు. ఏ మతాన్ని అనుసరించాలో తెలియదు. ఎందుకంటే అన్నీ కల్తీ అయిపోయాయి. పోనీ ఏ గురువునైనా అనుసరిద్దామా అంటే ఎవరు సద్గురువో ఎవరు కారో తెలియదు. పైగా నేటి సమాజం ధర్మబద్ధమైన జీవితమే అసాధ్యం అన్నట్లుగా నూరిపోస్తూ వుంటుంది. మరి మనబోటి సామాన్యులకు దిక్కెవ్వరు?

దీనికొక్కటే సమాధానం. మనకొక యుగపురుషుడు కావాలి. ప్రపంచంలోని ఆధ్యాత్మికతకంతా అతడు ప్రతినిధియై వుండాలి. అంటే

అన్ని మతాలూ ఆయనలో సమన్వయమై వుండాలి. అంతేకాదు ఆధునిక విజ్ఞానము (సైన్సు), ఆధ్యాత్మికతల సమన్వయం స్పష్టంగా చేయగలిగివుండాలి. మానసికము, శారీరకము, సామాజికము అయిన

> *మనకొక యుగపురుషుడు కావాలి. ప్రపంచంలోని ఆధ్యాత్మికతకంతా అతడు ప్రతినిధియై వుండాలి. అంటే అన్ని మతాలూ ఆయనలో సమన్వయమై వుండాలి. అంతేకాదు ఆధునిక విజ్ఞానము (సైన్సు), ఆధ్యాత్మికతల సమన్వయం స్పష్టంగా చేయగలిగివుండాలి.*

ధర్మాన్ని పునః ప్రతిష్ఠింపజేయాలి. ఈ సమాజంలో నిర్భీతితో వుంటూనే తన బోధలద్వారా, ఆచరణద్వారా దానిని సామాన్యుడికి ఆచరణయోగ్యంగా మలచాలి. సామాన్య ప్రజానీకానికి అటువంటి జీవన విధానం పట్ల నమ్మకము కలిగించి అందుకు స్ఫూర్తిని, ఉత్సాహాన్ని కలుగజేయాలి.

అంతేకాదు ఆయన జీవితం చూస్తే బాల్య, కౌమర, యౌవన, వార్ధక్యాలలో ఎలా వుండాలో తెలియాలి. ఇంకా బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమాలలో (బాహ్యమైన వేషభాషలతో సంబంధ లేకుండా) ఎలా మెలగాలో తెలియాలి. ఆ ధర్మసూత్రం వీటన్నింటిలో సూత్ర ప్రాయంగా అనుసంధానమై ఎలా ఆచరణయోగ్యమౌతుందో ఆయన జీవితం చూస్తే, ఆయన బోధనలను వింటే మనకర్థమవ్వాలి.

అయితే ఇంకొక ముఖ్యమైన విషయం వుంది. అదే ఈ సృష్టి ఉనికికి మూలం. అదే స్త్రీ, పురుష బేధం. మానవులందరూ మోక్షార్హులైతే – అందులో స్త్రీలూ వున్నారు, పురుషులూ వున్నారు. వీరిద్దరి శారీరక, మానసిక, సామాజిక పరిస్థితులన్నింటిలో వ్యత్యాసముంటుంది. వీరి శారీరక, మానసిక, సామాజిక బాధ్యతలు, ధర్మాలూ వేరు. కాబట్టి వారిద్దరి ధర్మాచరణకూ ఆచరణయోగ్యమైన ఒక యుగపురుషుడు ఉదయించాలి. అంటే ఆ యుగపురుషుడికి రెండు పార్శ్వాలు వుండాలి. అంటే అర్ధనారీశ్వర తత్త్వమన్నమాట. ఆ తత్వం ఒక స్త్రీరూపాన్ని ఒక పురుష రూపాన్నీ ధరించి ధర్మస్థాపన చేయాలి. అదే అలివేలు మంగా సమేత భరద్వాజ తత్త్వం. వారి జీవితాలను, బోధలను తరచి తరచి చూస్తే ఎన్నో విలువైన ధర్మసూత్రాలు మనకు సమన్వయమౌతాయి. అందుకే వారి కళ్యాణం లోక కళ్యాణమే. ఒకే దేహము రెండు రూపాలు గల వారి సమగ్రరూపం మన ముందుకు వచ్చేసింది. ఇక వారిననుసరించి తరించడమే మనం చేయవలసినది.

***శ్రీ అలివేలు మంగా సమేత భరద్వాజ మహరాజ్ కీ జై!***

# 'ఇలాచేస్తే శిరిడీ వచ్చి నువ్వు పొందేదేమిటి?'

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

మార్చి 2012

పుణ్య క్షేత్రాలలోకెల్లా మేటిదైన శిరిడీని ఎందరో దర్శిస్తారు గాని సందర్శించరు. వూరికే చర్మ చక్షువులకు కన్పించే కట్టడాలను స్థలాలను చూచి రావడం దర్శించడం. ఆయా స్థానాలలో నేటికీ పెల్లుబికే ఆధ్యాత్మిక శక్తి పుంజాన్ని ఆత్మతో అనుభవించి రావడం, అటు తర్వాత దానిని హృదయంలో నిశ్చలంగా భద్రపరచుకోవడం సందర్శించడమంటే. ఊరికే చూచి రావడం దర్శించడం. మన హృదయాన్ని భక్తి అనే నూనెతో నింపుకొని శ్రద్ధ అనే వత్తిని వేసుకువెళ్ళి, శిరిడీలోని శ్రీసాయి అనే పరంజ్యోతిలో వెలిగించుకొని కామక్రోధాలనేభావాలగాలికి ఆ దీపం ఆరిపోకుండా యింటికి తెచ్చుకొని భద్రంగా శాశ్వతంగా ప్రతిష్ఠించుకొని మన జీవితాలను ఆధ్యాత్మ జ్యోతిలో వెలిగించుకోగల్గడం సందర్శించడమంటే!

దీనికి మొదటిది శిరిడీ బయలుదేరే ముందు శ్రీ సాయిబాబా సమగ్ర చరిత్రను మూడుసార్లు నిత్య పారాయణచేసి వారి లీలలను గూర్చి బాగా ఆలోచించి వాటిలో ప్రకటమైన దివ్యత్వాన్ని బాగా మననం చేయడం అవసరం. శిరిడీకి బయలుదేరేముందు మొదట యింటిలో శ్రీసాయిని పూజించి ఆయన కృప లభించేలా చేయమని ప్రార్థించి బయలుదేరాలి. దారి పొడగునా వారి లీలలను, నామాన్ని స్మరిస్తూ వారిగురించే ముచ్చటించుకొంటూ ప్రయాణం చేయాలి. మన బాహ్యమైన ప్రయాణం మన అంతరంగం శ్రీ సాయీశు నికి చేరువవడానికి సంకేతం కావాలి. ఎందరో మహనీయులచేత పునీతం చేయబడిన భారత భూభాగానికీ, మనకు జన్మనిచ్చిన రాష్ట్రానికీ, ఎందరో సాటిలేని దత్తావతారాలైన శ్రీపాద శ్రీ వల్లభ, శ్రీనృసింహసరస్వతి, శ్రీమాణిక్య ప్రభు, శ్రీ అక్కల్‌కోటస్వామి, శ్రీ సాయినాథుడు వంటి దివ్య పురుషులకు నిలయమైన మహారాష్ట్ర దేశానికి, అందులో మరింత పుణ్యవంతమైన గోదావరీ తీరానికి నమస్కరించుకోవాలి. శ్రీసాయికి నిలయమైన కోపర్గామ ప్రాంతానికి చేరగానే అక్కడ మనసారా వందనం చేయాలి. అక్కడనుండి శిరిడీసమీపిస్తూనే శ్రీసాయిపాదమూనిన పుణ్య భూమిమీద పాదరక్షలు ధరించదగదు గనుక వాటిని సంచిలో భద్రపరచుకోవాలి. మందువేసవికాలమై అవి ధరించడం అనివార్యమైతే మనస్సులో శ్రీ సాయీశునికి క్షమార్పణ చెప్పుకుని ధరించవచ్చు. దూరాన్నుండి కాషాయపతాకంతో శోభిస్తూ దర్శనమిచ్చే గోపురమే శ్రీ సాయీశుని సమాధి మందిర గోపురం, సంసార సాగరంలో మునకలు వేసే, అజ్ఞానపు కారడవిలో మార్గాన్నన్వేషించుకొనే అసంఖ్యాకులైన సాధుపుంగవులకు, పామరులకూ మార్గ దర్శకమై, గమ్యస్థానం చేర్చే ఆధ్యాత్మ శిఖరమే శ్రీసాయి అని అది తెల్పుతుందని గుర్తించి వందనమాచరించి సాయి స్మరణను నిశ్చలం చేసుకోవాలి.

శిరిడీ బస్సుస్టాండులో దిగబోయేముందు "శ్రీ సచ్చిదానంద సద్గురూ సాయినాథ్ మహరాజ్‌కీ జై" అని జయవాక్యం పలికి ఆ పుణ్యక్షేత్రాన్ని దర్శించే భాగ్యాన్ని మనకు ప్రసాదించిన ఆ సద్గురు మూర్తికి కృతజ్ఞత, వినమ్రతలతో ప్రసాదించిన ఆ సద్గురు మూర్తికి కృతజ్ఞత, వినమ్రతలతో మనసా నమస్కరించాలి.

శిరిడీలో కాలూనిన దగ్గర నుండీ ఆ ప్రాంతమంతా ఆ దివ్యమూర్తి పాదస్పర్శతో పునీతమైనదని గుర్తుంచుకుని శ్రద్ధాభక్తులతోనే అక్కడ సంచరించాలి.

బస్సుస్టాండ్ ఎదుట కన్పించే శ్రీ సాయినాథ్ ఆస్పత్రి దగ్గర కుడివైపునుండే మఱ్ఱి చెట్టు వెనుక కన్పించే పురాతనమైన చిన్న మందిరమే ఖండోబా ఆలయం. ఖండోబా శివుని రూపం. ఆ గ్రామానికాయనే దేవత. శ్రీ సాయికూడ మొదట అచటకు వచ్చే తర్వాత శిరిడీలో నిలచాడు. తమ సచ్ఛిష్యులైన ఉపాసనీ బాబాగారిచేత ఏకాంత తపోదీక్ష వారు చేయించినదక్కడే. తమ మహాసమాధి తర్వాత పూజారి మాహల్సాపతికి తాము, ఖండోబా వేరుకామని శ్రీసాయి నిదర్శనమిచ్చారు. ఇది స్మరించి హృదయపూర్వకంగా వందనమాచరించి శ్రీ ఖండోబా దేవునితో మన యాత్ర సార్ధకమయ్యేలా అనుగ్రహించమని ప్రార్థించుకుని గ్రామంలో ప్రవేశించాలి.

అక్కడ నుండీ శిరిడీలో వున్నంతకాలం ఆ స్థలం యొక్క పవిత్రతను మరపించే వ్యర్థ ప్రలాపాలు, కాలక్షేపాలకూ స్వస్తి చెప్పాలి. ఎంతమేరకు సత్యాన్ని మరచే వ్యర్థమైన లౌకిక ప్రలాపాలలో కాలం గడుపుతామో అంతమేరకు మనమే ఫలితాన్ని కోల్పోతాము – పాఠశాలలో కూర్చుని అన్యతలంపులతో మునిగిపోయిన విద్యార్థిలాగ, సినిమాహాలులోకి వెళ్ళి నిద్రబోయి సినిమాచూడని ప్రేక్షకుని లాగ! శ్రీ సాయి చరిత్ర చూస్తే ఆయనే యీ విషయాన్ని స్పష్టంగా భక్తులకు చెప్పడం చూడవచ్చు. ఆయనను దర్శించవచ్చి కొద్దిరోజులక్కడ నిలచిన దాదాసాహెబ్ ఖాపర్డే మొదలైన భక్తులను భావయుక్తంగా సాయి "ఈ రోజంతా ఎలా గడిపావు?" అని హెచ్చరించేవారు. సద్గ్రంథ పఠన, జపధ్యానాలతో గడిపిన వారిని మెచ్చి ప్రత్యేకంగా ప్రోత్సహించేవారు. అలాగాక ఒకరినొకరు పరోక్షంగా నిందించుకోవడం వంటివి చేసినపుడు అది పంది మలభక్షణ చేయడంతో సమానమని చెప్పి "ఇలా చేస్తే శిరిడీ వచ్చిగూడా నీవు పొందేదేమిటి?" అన్నారు. ఇక కామాది వికారాలను కల్గించే వారపత్రికలు, నవలలు, రేడియోలతో కాలక్షేపం చేసేవారిగూర్చి వేరే చెప్పనవసరంలేదు. శ్రీ గురుగీతలో పుణ్యమైనా, పాపమైనా అట్టి మహాక్షేత్రాలలో చేస్తే కొన్ని వేల రెట్లుగా పుణ్యపాపఫలమందుతారని స్పష్టంగా చెప్పబడ్డది. ఇలాంటివి గుర్తుంచుకోకపోతే వ్యయ ప్రయాసలతో ఏం పొందుదామని అంతదూరం పోవాలి?

శ్రీ సాయి సంస్థానాన్ని సమీపించగానే మనకుమొదట దర్శనమయ్యేది 'గురుస్థానం'.శ్రీ సాయికి

*భక్తులను భావయుక్తంగా సాయి "ఈ రోజంతా ఎలా గడిపావు?" అని హెచ్చరించేవారు. సద్గ్రంథ పఠన, జపధ్యానాలతో గడిపిన వారిని మెచ్చి ప్రత్యేకంగా ప్రోత్సహించేవారు. అలాగాక ఒకరినొకరు పరోక్షంగా నిందించుకోవడం వంటివి చేసినపుడు అది పంది మలభక్షణ చేయడంతో సమానమని చెప్పి "ఇలా చేస్తే శిరిడీ వచ్చిగూడా నీవు పొందేదేమిటి?" అన్నారు.*

అచ్చట మొదట ఆశ్రయమైన వేపచెట్టు, దానిక్రింద మూసివేయబడిన భూగృహంలో తమ గురువు సమాధి యున్నదని సాయి చెప్పారు. ఆ భూగృహంలోనే తాము 12 సం॥లు వేపాకు మాత్రం తింటూ ఘోర తపస్సు చేశామని సాయి చెప్పారు. ఆ విషయం గుర్తుంచుకొని అక్కడ శ్రీ సాయిని దర్శించి దక్షిణ సమర్పించి శిరిడీలో మన ప్రవాసము సార్థకం కావాలని ప్రార్థించుకోవాలి.

ఆ తర్వాత నాలుగు హారతులకూ నియమము తప్పక హాజరు కావాలి. ద్వారకామాయిలో కూర్చొని పారాయణ చేసుకోవాలి. సమాధి మందిరంలో ప్రదక్షిణలు, గురు స్థానానికీ, లిండీతోటలో నంద దీపానికీ, దత్తమూర్తికీ ప్రదక్షిణలు చేసుకోవాలి. సమాధి మందిరంలో సాయి విగ్రహాన్ని చూస్తూ ఆయనను ప్రేమగా స్మరించుకుంటుంటే ఎంతో బాగుంటుంది. ఈసారి శిరిడీ వెళ్ళినప్పుడు ఇవన్నీ గుర్తుంచుకుంటారు కదూ!

# అందరికోసం... అందరూ!

'సాయిబాబా'

మార్చి 2012

సాయిబంధూ! ఒక్క క్షణం ఇలా విను. ఎటుపోతున్నావో తెలియకుండా ఏమిటా పరుగు. నిజమే, నేటి సమాజంలో మనుగడ కోసం చదువు, సంపాదన, ఆరోగ్యం వసతికోసం ప్రక్కవాడితో నిరంతరం పోటీ. ఈ పరుగు పందెంలో ఏమాత్రం బద్ధకించినా వెనుకబడిపోతాము. తోటివారంతా మనగురించి పట్టించుకోకుండా నిర్ధాక్షణ్యంగా మనమీదనించే అడుగులు వేస్తూ వెళ్ళిపోతారు ముందుకు. అలా వెళ్ళినవారే మనుగడకోసం జరుగుతున్న పరుగుల పోటీలో నెగ్గినవారిక్రింద లెక్క.

అయినా ఒక్కక్షణం ఆగి మరలా ఆలోచించు. చదువు, సంపాదన, ఆరోగ్యం, వసతి, సాధించినవారు, సాధించలేక వెనుకబడిపోయినవారు కూడా ఇంకా ఏదో "వెలితి" గానే ఉన్నారు. ఆ వెలితిని పూడ్చుకోవడానికి నిరంతరం సుత్తికొట్టడమో లేక సుత్తిగాళ్ళవద్దకు పోవడమో చేస్తూవుంటారు. లేక కాసేపు ఏ వ్యాపకమూ లేకుండా కూర్చుంటే "బోర్" కొడుతుంది అంటారు లేక అనుకుంటారు. కొందరు తాత్కాలికంగా ఇప్పుడు శాంతిగా తృప్తిగా ఉన్నట్లు అనిపించినా ఇంతకుముందు జీవితంలో అశాంతిని, బాధలను చవిచూచే వుంటారు. ఒక్కొక్కసారి "నేను పడిన శారీరక, మానసిక యాతన పగవాడికికూడా వద్దు" అనటం కద్దు. అలాంటి స్థితి ఇకముందు జీవితంలో ఎదురవ్వదనే నమ్మకం ఏమాత్రం లేదు. ఎందుకంటే భవిష్యత్తు పొరలలో ఏ విషాదాలుదాగి వున్నవో ఎవరికెరుక! అందువలన వారుకూడా నిజానికి అశాంతిగానే వున్నట్లు లెక్క. దీనికంతటికి కారణం నేటి సమాజానికీ వ్యక్తికీ ఒక లక్ష్యం అంటూ లేకపోవడమే. వ్యక్తి ఏమి సాధించాలి అనే స్థిరమైన అవగాహన లేకపోవడమే. మానవుడి వ్యక్తిగత సామాజిక సమస్యలకు ఏకైకమైన పరిష్కారము ఇది అని అందరు అంగీకరించిన ఒక అవగాహన లేకపోవటమే.

పూర్వం అంటే విదేశీ దాడుల బారిన మనదేశం పడకుండా ఉన్న రోజులలో, మన సమాజానికి ఒకటే లక్ష్యం వుండేది. ప్రతి వ్యక్తికి ఒకటే లక్ష్యం వుండేది. "సర్వేజనా సుఖినోభవంతు, లోకా సమస్తా సుఖినోభవంతు'' – సర్వ జీవులు సమస్తలోకస్థులు సుఖంగా వుండాలి, అందులోనే తన సుఖము, ఆనందము ఇమిడి ఉన్నాయి. అందుకే తనకు, సమాజానికీ తృప్తిని, శాంతిని, ఆనందాన్నీ ఇవ్వగల లక్ష్యాన్ని సాధించాలి. అదే మానవజాతి జీవిత లక్ష్యం. దానినే శ్రేయస్సు లేక ముక్తి అన్నారు. జీవితం అంటే ఏమిటో, ఎందుకో పూర్ణమైన అవగాహనతో, స్పష్టమైన లక్ష్యం వైపుకు ముందుకు ముందుకు సాగిపోయే జీవితాల వాహిని మన సంస్కృతి.

*ఒక్కరి కోసం అందరు – అందరి కోసం ఒక్కరు*
*ఒక్కరి కోసం ఒక్కరు – అందరి కోసం అందరు*

ఇదే మన సంస్కృతి హృదయం. పైన చెప్పిన

జీవిత లక్ష్యాన్ని సాధించటానికి అనేక యుగాల యోచనతో ఒక సామాజికమైన జీవిత పంథాను మన జాతి ఏర్పరచుకుంది. ఆ జీవిత పంథాలోని ముఖ్యమైన విషయం ఏమిటంటే వ్యక్తిగత, సామాజిక శ్రేయస్సుకొరకు సాటివారు చేస్తున్న కృషిని భంగపరచకుండా వుండటం. అంటే వ్యక్తియొక్క జీవనం ఇతరుల సుఖశాంతులకు భంగం కలిగించనిదిగా ఉండాలి, తనను శ్రేయస్సు వైపుకు తీసుకొని వెళ్ళేదిగా వుండాలి. దానినే ధర్మం అన్నారు. వ్యక్తి యొక్క దైనందిన కార్యక్రమాలన్నీ ఈ ముఖ్య సూత్రాన్ని దృష్టిలో వుంచుకొని అత్యంత క్రమశిక్షణాయుతంగా నిర్దేశింపబడ్డాయి. బాహ్యమైన క్రమశిక్షణకు మూలం మానసికమైన యోచన కనుక వ్యక్తియొక్క యోచనను కూడా పై సూత్రాన్ని దృష్టిలో పెట్టుకొని అట్టి అవసరాన్ని అవగాహన కలిగించే రీతిలో తీర్చిదిద్దటం జరిగేది.

*జీవిత లక్ష్యాన్ని సాధించటానికి అనేక యుగాల యోచనతో ఒక సామాజికమైన జీవిత పంథాను మన జాతి ఏర్పరచుకుంది. ఆ జీవిత పంథాలోని ముఖ్యమైన విషయం ఏమిటంటే వ్యక్తిగత, సామాజిక శ్రేయస్సుకొరకు సాటివారు చేస్తున్న కృషిని భంగపరచకుండా వుండటం. అంటే వ్యక్తియొక్క జీవనం ఇతరుల సుఖశాంతులకు భంగం కలిగించనిదిగా ఉండాలి, తనను శ్రేయస్సు వైపుకు తీసుకొని వెళ్ళేదిగా వుండాలి. దానినే ధర్మం అన్నారు.*

మానవుని వ్యక్తిగత, సామాజిక సమస్యలను తరచి తరచి చూచిన ఋషులు, తత్త్వ వేత్తలు శాశ్వత పరిష్కారాన్ని కనుగొన్నారు. సకల చరాచర విశ్వమంతా శాశ్వత ఆనందాదాయకమైన చైతన్యమని వ్యక్తికూడా అందులో భాగమేనని అనుభవపూర్వకంగా కనుగొన్నారు. అందులో భాగమైన జీవి అనబడే పరిమిత చైతన్యం శాశ్వత ఆనందదాయకమైన విశ్వచైతన్యం నుంచి తాను భిన్నుడనని తలచడమే సర్వ దుఃఖాలకు మూలమని కనుగొన్నారు. నేను వేరు, మిగతా జగత్తు వేరు అనే అన్యత్వ భావమే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు అనే అరిషడ్వర్గాలకు వ్యక్తిని బానిసను చేస్తుంది – అక్కడనుండి చుట్టూగల సమాజంలో ఘర్షణ ఏర్పడి వ్యక్తిగత సామాజిక అశాంతిని లేపుతుంది. ప్రతి వ్యక్తిలో జరిగే ఇలాంటి ప్రక్రియల సామూహిక ఘర్షణే ఎన్నటికీ పరిష్కరించలేని సామాజిక సమస్యలను ఏర్పరుస్తుంది.

అరిషడ్వర్గాలకులోనైన వ్యక్తి తనకూ సమాజానికి ఎన్నిరకాలుగానైనా కీడేచేస్తూ వుంటాడు, తనకూ, సమాజానికీ కీడు అంటే పైన చెప్పిన 'సర్వేజనాస్సుఖినోభవంతు – లోకాస్సమస్తా స్సుఖినోభవంతు' అనే లక్ష్యానికి తీసుకుపోయే జీవిత పంథాకు భిన్నంగా ప్రవర్తించి ఆ లక్ష్య సాధనను చెడకొడతాడన్నమాట. దీనికంతటికీ పరిష్కారం అందరమూ ఒకే విశ్వచైతన్య స్వరూపులమనీ, ఒకరికొకరం భిన్నులము కాదనీ అనుభపూర్వకంగా తెలుసుకోవడమే! అందుకు ప్రయత్నించడమే. అందుకే సాయి "మనుషులు వారంతా ఒకరి నుంచి ఇంకొకరు వేరనుకొంటారు. కాని అదే పొరబాటు, నేను నీలో వున్నాను, నీవు నాలో వున్నావు. ఇలా భావన చేస్తుండు అదే అనుభవమవుతుంది" అన్నారు. అందుకు సర్వ సృష్టి తానుగా నిరూపించే లీలలు ప్రదర్శించిన సాయి చరిత్ర మననం చేసుకుంటే సరిపోతుంది. నూతన సంవత్సర సందర్భంగా అందరమూ సాయిని స్మరిద్దామని దీక్షవహిద్దాము.

# సమాజ శ్రేయస్సుకు పాటుపడటమే ధర్మం

'సాయిబాబా'



మన వద్ద ఎన్ని వైద్య గ్రంథాలున్నా, మనం వైద్యులంగానప్పుడు అవన్నీ వ్యర్థమే, వాటిని చూచి మనకుగానీ, సాటివారికిగానీ చికిత్స చేసుకోబూనడం ఎంతో అవివేకం. రోగ నిర్ణయం, రోగియొక్క శరీర తత్త్వము, పథ్యము స్పష్టంగా తెలియకుంటే ఎంత మంచి మందైనా ప్రమాదించవచ్చు. అందుకనే వైద్యం తెలియకుండానే చికిత్సను చేయబూనిన వారు నరకానికి పోతారని శాస్త్రం. స్థూలమైన శరీరం విషయంలోనే యిలా అయితే, అంతకంటే సూక్ష్మము, సున్నితమూ అయిన మనస్సు విషయంలో బోధకులెంతో జాగ్రత్తవహించాలి. మహనీయుల సాంగత్యంతో, నిష్కామమైన కర్మద్వారాను చిత్తశుద్ధి సాధించకండా, రాగద్వేషాలు, మనోవికారాలను వివేకంతో జయించకండానే ధ్యానం చేయబూనటం ఎంతో ప్రమాదకరమని ఋషులు చెప్పారు. అలా చేయడం చాలా కష్టం గూడాను. అదీ మన అదృష్టమే. మూర్ఖించి అలా ధ్యానము, తపస్సు చేయగలిగినా, ధృఢంగా హృదయంలో దాగియున్న వికారాల మీదకు మనమేకాగ్రత సాధించుకొన్న మనస్సు పరుగెత్తి, మనకూ సాటివారికి గూడా సామాన్య మానవులుగా చేయలేని అపకారం చేస్తాము. అందుకే అలా చేసిన భస్మాసురుడు, తనకెట్టి అపకారము చేయని వారుగూడ, తన చేయి వారి శిరస్సు పై పెట్టగానే వారు భస్మమై పోవాలని కోరగల్గాడు. ఈశ్వర సాక్షాత్కారం గూడ అతని హృదయాన్ని పరిశుద్ధం చేయలేక పోయింది. ఇది తెలిసిన మన ఋషులు, మొదట బ్రహ్మచర్యాశ్రమంలో గురుశుశ్రూష, గృహస్థా శ్రమంలో నిష్కామకర్మ, వానప్రస్థాశ్రమంలో వైరాగ్యము సాధించుకొన్నాకనే మానవులందరూ సన్యాసా శ్రమంలో నిరంతరమూ ఆత్మనిష్ఠలో నిలవాలని శాసించారు. ఇది తెలిసిన పరమగురువైన దత్తాత్రేయుడు శ్రీ పాద శ్రీ వల్లభుడు మొదలుకొని శ్రీ శిరిడీ సాయిబాబా వరకూ గల తమ అవతారాలలో ఏ భక్తుణ్ణి సర్వసంగ పరిత్యాగం చెయ్యమని ప్రోత్సహించలేదని గమనించాలి.

ఇట్టి ధర్మాల్ని ప్రజలకాదర్శంగా ఆచరించి చూపడానికే భగవంతుడు రాముడు, కృష్ణుడుగా అవతరించాడు. కురుక్షేత్రంలో అర్జునుడెంత వైరాగ్యం ఒలక బోసినా కృష్ణుడు అతని వాదాన్ని నిరశించి, నిష్కామంగా తన కర్మలనాచరించాలని ఆదేశించాడు. తాను సాక్షాత్తూ భగవంతుడే ఐనా, తనను తాను ఆశ్రమ ధర్మాల ద్వారా సంస్కరించుకోవలసిన అవసరం లేకున్నా, తాను మాత్రం సంసారిగా వున్నాడు. ఆయన పరమాత్మగనక, ఆయనేంచేసినా చెల్లుతుందని మనం సమర్థించుకోడానికి వీలులేదు. ఆ భగవంతుడే ధర్మానికంకితమై సామాన్య మానవుడుగా అవతరించి శ్రీరాముడుగా మానవాళికి ఆచరణ మార్గం చూపాడు. ఋషులు, అవతార పురుషులు చెప్పినా వినకుండా సన్యాసం దగ్గరదారియని భ్రమించి, దుస్సాహసంతో దానిని స్వీకరించి యీనాడు లోకానికి ఎందుకింత ధర్మభ్రష్టతగావిస్తున్నారో! మనజాతి నిర్వీర్యమవడానికి అదే ప్రబలమైన కారణమని శ్రీ వివేకానందుడు గూడ ఎంతగానో ఘోషించాడు.

అయితే యింతకూ సామాన్యులమైన మనము గృహస్థాశ్రమంలో వుంటూ ఆచరించవలసిన ధర్మం

ఏమిటి? మనకూ, కుటుంబానికి కూడు, గుడ్డ, ఆస్థి సంపాదించుకుంటూ, మిగిలిన సమయంమంతా పూజలు, పునస్కారాలలో గడపడమేనా! అలా అయితే యిక నిష్కామకర్మకు తావేది? మనం చేసే పూజలు, పునస్కారాలు, నిష్కామంగా చేయడమా? అది కానేకాదనడానికి ఒక్కటే గుర్తు – మన మనస్సు ఎప్పుడంటే అప్పుడు నిశ్చలంగా ధ్యానస్థం కాకపోవడమే! ఇంకొక గుర్తు రాగద్వేషాలతో సాటి వ్యక్తులపై సంశయాలు పెట్టుకొని వాటిలో మ్రగ్గడమే. ధర్మమంటే ఏమిటో కూలంకషంగా పెద్దలనుండి తెలుసుకొని దాని సూక్ష్మమెరిగి, మనలోనూ, మన సాటివారిలోనూ అది ధృఢంగా నెలకొనేలా నిరంతరమూ యత్నిస్తూండడమే. ఈ ప్రయత్నంలో జయాపజయాలను, మానావమానాలను, సుఖదుఃఖాలను నశింపచేసుకోవడమే. అలా జీవిస్తూ జీవనం సంపాదించుకొంటేనే, అది పరిశుద్ధమైన ఆహారమై మనకు సత్వశుద్ధినిస్తుంది. నిజమైన సాధన మనకు సాధ్యమయ్యేలా చేస్తుంది. ఈ ధర్మాన్ని ఎంత స్వల్పంగా ఆచరించినా భయంనుండి తరింప చేయగలదని శ్రీకృష్ణుడు చెప్పాడు. సాటివారికి ధర్మప్రబోధం చేస్తూ మనమాచరిస్తూ, మన బిడ్డలకూ, సాటివారి బిడ్డలకు ధర్మాన్ని ప్రబోధించడమే మనమాచరించవలసిన ధర్మమని పై చెప్పిన అవతార పురుషులందరూ అదే మార్గాన్ని నడచిచూపారు. అలాగాక ఆధ్యాత్మికత పేరిట భార్యాబిడ్డల క్రమశిక్షణను, సాటివారిని గురించి పట్టించుకొనకపోవడం మన స్వధర్మాన్ని పరిత్యజించడమే అవుతుంది. అలాచేస్తే స్వధర్మాన్ని విడిస్తే – పాపము మాత్రమే సంక్రమిస్తుందని కృష్ణుడు చెప్పాడు. అన్ని పురుషార్థాలకూ మూలమైన ధర్మాన్ని యిలా రక్షించుకుంటే, ఆ ధర్మమే మనల్ని రక్షించి తక్కిన మూడు పురుషార్థాలనూ సమకూరుస్తుంది.

ధర్మానికి వేరువేరు స్మృతులలో చెప్పబడిన నిర్వచనాలు చూస్తే దేశమంతటికీ సుఖశాంతులను, శక్తి సామర్థ్యాలను పెంపొందించగల విధానమే ధర్మమని తెలియగలదు. అంటే సమాజం యొక్క శ్రేయస్సు గురించి శక్తివంచన లేకుండా అవగాహనతో పాటుపడడమే వుత్తమ ధర్మమన్నమాట. రోగియొక్క స్థితిని, మందుయొక్క లక్షణాన్ని పథ్యాన్ని తెలుసుకొనిమాత్రమే చికిత్సకుపక్రమించదలచినట్లు, మనలో ప్రతి ఒక్కరమూ మన సమాజాన్ని నైతికంగా పతనం చెందిస్తున్న కారణాలను, వాటి

> *యింతకూ సామాన్యులమైన మనము గృహస్థాశ్రమంలో వుంటూ ఆచరించవలసిన ధర్మం ఏమిటి? మనకూ, కుటుంబానికి కూడు, గుడ్డ, ఆస్థి సంపాదించుకుంటూ, మిగిలిన సమయంమంతా పూజలు, పునస్కారాలలో గడపడమేనా! అలా అయితే యిక నిష్కామకర్మకు తావేది?*

నివారణోపాయాలను కష్టించి తెలుసుకొని పని చేయడం మన ప్రధాన కర్తవ్యం. ఇదే శ్రీరాముడు ఆచరించి చూపినది. శ్రీ కృష్ణుడు ఆచరించి చూపినది, అర్జునుడికి బోధించినదీనూ, మెట్టవేదాంతపు మాటలతో మన కర్తవ్యం నుండి తప్పుకొనమనిగాదు శ్రీ కృష్ణుడు చెప్పినది. రాముడు చెప్పినది. రాముడు యిలాటి అపోహలో చిక్కినప్పుడు వశిష్ఠుడు మహత్తరమైన యోగవాశిష్ఠం చెబుతాడు. ఇంతటి మహత్తరమైన గ్రంథాలను భ్రష్టంగా అర్థం చేసుకొని, ముఖ్యమైన వాటి బోధన ప్రక్కకు తోసి, మన తలకు మించిన వేదాంత వాక్యాలను మాత్రం వల్లించుకుంటూ యిహపరాల రెండింటికీ చెడిన రేవళ్ళు కావద్దని శ్రీ రామనవమి మనకు బోధిస్తున్నది. ఈ సత్యాన్ని గుర్తుంచుకోమని హెచ్చరించడానికే శ్రీరామనవమిని జరుపుకొమ్మని శ్రీ సాయిబాబా ప్రత్యేకంగా తన భక్తులకు హెచ్చరించారు. అంతేగాదు వేరొక సందర్భంలో, "నేను చెప్పింది విననివాడితో నాకేమిపని?" అన్నారని గూడ మనం గుర్తుంచుకోవాలి.

# శ్రీ సాయిబాబా చిత్రపటం (10)– భూస్పర్శనం

శ్రీమతి వేదవతి



గురుస్మరణ చేసిన తరువాత మనం భూమిమీద ఆ రోజు మొట్టమొదటిసారిగా పాదం మోపుతాం. అంటే ఆ రోజు మనం గడిపేరోజంతా, చేసే ప్రతి కార్యక్రమము భూమిమీదే ఆధారపడి వుంటుంది. అంతేకాదు మన ఉనికి అంతా భూమిమీదే ఆధారపడివుంది. భూమినుండే మనకు ఆహారము వస్తుంది. దానినుండి నీరు మనం త్రాగడానికి, వాడుకోవడానికి లభిస్తుంది. దానిమీదే మనం గృహాలు నిర్మించుకుని జీవిస్తాం. ఇలా ఆలోచిస్తూపోతే ఈ భూమి యొక్క ఉపయోగాలకు అంతేవుండదు. ఇలా సృష్టిలోని ప్రతి అంశం గురించి ఆలోచిస్తే ప్రతిదీ మనకెన్నో విధాల ఉపయోగపడుతోందని అర్థమౌతుంది. అలా సృష్టిలోని ప్రతి అంశానికీ, సకల సృష్టికీ కృతజ్ఞులమై వుండాలని మన పూర్వీకులు చెబుతారు. అదే మన ధర్మశాస్త్రాల అంతరార్థము కూడా. అది మరిచిపోవడం వలననే నేడు సృష్టిలోని ప్రతి అంశాన్నీ దుర్వినియోగ పరుస్తూ, దానిని కలుషితం చేస్తూ మానవజాతి తన విధ్వంసానికి తానే పునాదులు వేసుకుంటోంది. తాత్కాలిక ఉపయోగం కోసం శాశ్వత భద్రతకు విఘాతం కలిగిస్తోంది. కాబట్టే సృష్టిలోని ప్రతి అంశం పట్ల కృతజ్ఞత కలిగివుండడం మానవజాతికి అవసరం. దానిలోని ప్రతి అంశంపట్ల ప్రేమ, గౌరవం కలిగివుండి ప్రయత్నించాలి. దానివలన మనం పొందుతున్న మేలును మనమెన్నటికీ మరచిపోకూడదు. అందుకే సృష్టిలోని ప్రతి అంశాన్నీ గౌరవించి, పూజించడం ఒక సాంప్రదాయంగా పెట్టారు మన పెద్దలు. అందుకే ఉదయం మొట్టమొదటి సారిగా భూమిపై పాదం మోపేటప్పుడు ఈ క్రింది శ్లోకం చదువుకోవడం ఒక సాంప్రదాయం :-

శ్లో॥ ***సముద్ర వసనే దేవీ పర్వత స్థన మండలే ।***
***విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే ॥***



"సముద్రములో నివసించేటటువంటి, పర్వత సమూహాలే స్థనములుగాగల శ్రీమహావిష్ణువుయొక్క భార్య అయిన ఓ భూదేవీ! నిన్ను నా పాదాలతో తాకవలసి వస్తున్నందుకు క్షమించవలసినది" అని ఈ శ్లోకానికి భావం.

మన భూగోళం మీద మూడువంతులు సముద్రము, ఒక వంతు మాత్రమే భూమి. అందుకే మనం నివసించే భూమి సముద్రంలో నివసిస్తూ వుంటుందని చెప్పవచ్చు. ఆధ్యాత్మిక వర్షం కురిపించే దేవాలయాలు, జల వర్షానికి దోహదం చేసే అరణ్యాలు,

మనకు నిత్యావసరాలకు ఉపయోగపడే జలనిధులైన నదులు పర్వతాలమీదే ఉద్భవిస్తాయి. కాబట్టి పర్వతాలను భూదేవి యొక్క స్థనమండలంగా వర్ణించారు. శ్రీమహావిష్ణువు సృష్టి, స్థితి, లయ క్రియలలో 'స్థితి' అనే సృష్టి ధర్మాన్ని పరిపాలించేవాడు. 'స్థితి' అంటే సృష్టికీ, లయానికీ మధ్యనున్నది అంటే ఒక జీవి పుట్టడానికి, గిట్టడానికీ మధ్య ఉన్న స్థితి. భూమిపై నివసించే మనందరి ఉనికికీ భూమి ఆధారం. కాబట్టి భూదేవిని శ్రీమహావిష్ణువు భార్యగా పూజిస్తారు. అంటే భూమి లేనిదే మన ఉనికి లేదు. ఆ ఉనికే శ్రీమహావిష్ణువు. కాబట్టే వారిద్దరూ భార్య భర్తలు. ఈ విషయం స్మరించి భూదేవిని గౌరవించడానికి ఆలంబనగా ఈ శ్లోకం కూర్చబడింది.

అంతేకాదు సద్గురు భక్తులకు భూమిగూడా సద్గురుస్వరూపమే. సద్గురువైన శ్రీ సాయిబాబా శ్రీ సాయి చిత్రపటంలో వున్నట్లే భూమిలో కూడా వుంటారు. సాయిభక్తులకు భూమి కూడా సద్గురు స్వరూపమై మన ప్రవర్తనను సంస్కరించే బోధ చేస్తుంది. భూమి నుంచి బోధను ఎలా గ్రహించవచ్చో శ్రీ మాస్టరుగారు రచించిన శ్రీ గురుచరిత్రలోని అవధూతోపాఖ్యానం తెలుపుతుంది. అందులోని అవధూత తాను భూమినుంచి ఏమి నేర్చుకున్నారో ఇలా చెబుతారు –

''నా మొదటి గురువు భూమి. పూర్వకర్మననుసరించి జీవులకు ఈశ్వరుడే ఆయా దేహాలు ప్రసాదించి వాటి జీవనానికి అవసరమైన రీతిన ప్రవర్తింపజేస్తాడు. అటువంటి పశుపక్ష్యాదులన్నీ భూమిపై నివసిస్తాయి. మానవులు భూమిని దున్నుతారు. బావులు, చెరువుల, కోనేర్లకోసం భూమిని తవ్వుతారు. జీవులన్నీ ఆమెపై మలమూత్రాలు విసర్జిస్తాయి. అయినప్పటికీ భూమి ఓర్పు వహించి జీవులకు సస్యాలు, ఆశ్రయము యిచ్చి పోషిస్తుంది. ఇన్ని జీవులనుండి తనకెంత బాధ కలిగినా చలించక తన ధర్మాన్ని తాను అనుసరిస్తుంది. అలానే పూర్వకర్మవలన ప్రేరేపించబడిన సకల భూతాలవలన పీడింపబడినప్పటికీ ముముక్షువు ప్రేమ, ఓరిమిలతో సహించి ధర్మమార్గం నుండి చలించకుండా ధైర్యం వహించి వుండాలని భూమినుండి నేర్చుకున్నాను. అలాగే భూమిపైనున్న కొండలు దేవాలయాలకు, సకాలవర్షానికి కారణమైన అరణ్యాలకూ నెలవులు. ఎన్నో జీవులు వాటి గుహాలలో జీవిస్తాయి. మానవులకెంతో ఉపకరించే నదులు వాటిలో జన్మిస్తాయి. గృహ, ఆలయాది నిర్మాణాలకు కావలసిన రాళ్ళను ప్రసాదించడమే గాక పరమార్ధాన్ని కూడా మానవులకు ప్రసాదించగల ఎన్నో పవిత్ర తీర్థాలకు నిలయాలు పర్వతాలు. పర్వతం సకల జీవుల శ్రేయస్సు కొరకు మాత్రమే వుంటుంది. ముముక్షువైనవాడు అలా జీవించగలగాలని దానినుండి నేర్చుకున్నాను."

శ్రీ సాయి చిత్రపటం రూపంలో మన ఇంట్లో కొలువైవున్న బాబా ఏనాడూ శరీరపరిమితులుగా లేరు. అందుకే ఆయన శ్రీ ఉపాసనీబాబాతో ఇలా అన్నారు – "నువ్వు ఎక్కడ చూస్తే అక్కడ నేనున్నాను. గుర్తుంచుకో" అంటే శ్రీ సాయి చిత్రపటంలో మాత్రమే కాదు, మనదృష్టి ఎక్కడపడితే అక్కడ వున్నారన్నమాట. అలాగే మనం తెల్లవారుఝామున నిద్ర లేవగానే పాదం మోపే భూమి రూపంలో కూడా వున్నారు. అందుకే ఆయన అవలీలగా నిప్పును, నీరును ఒకేచోట సంకల్పమాత్రంగా పుట్టించగలిగారు. కాల్చని కుండలలో నీరు తెచ్చారు. నానాకు మంచినీరు అతను కూర్చున్న బండక్రిందే సృష్టించి అతని దప్పిక తీర్చి అతనిని కాపాడారు. తన పాదాలలోనే గంగా యమునను పుట్టించారు. తన సమాధినుంచే సమాధానమిస్తున్నారు. తన విగ్రహాల రూపంలో ప్రపంచమంతా పూజలందుకుంటూ భక్తులను దేశ, కాలాలకతీతంగా అనుగ్రహిస్తున్నారు.

ఉదయం నిద్రలేచిన తర్వాత శ్రీ సాయి చిత్రపటం చూస్తూ గురుస్మరణ చేసి, శ్రీసాయియే మనం పాదం మోపబోయే భూమిరూపంలో కూడా వున్నారని గుర్తుపెట్టుకోవాలి. అటువంటి మహోన్నతమైన భూదేవిని మన పాదాలతో తొక్కక తప్పనందుకు క్షమించమని ప్రార్థించాలి. పై చెప్పుకున్న వివరణను మనస్సులో నింపుకుని భూదేవి పట్ల గౌరవము, కృతజ్ఞత, ప్రేమ మన మనస్సులలో పెంపొందించుకోవాలి. దానిని సద్వినియోగ పరచుకునేలా మన ప్రవర్తన వుండాలని, ఆ రోజు చేసే ఏ కార్యక్రమమూ భూదేవి పట్ల బాధ్యతారహితంగా వుండకూడదని నిర్ణయించుకుని మన నిత్యకృత్యాలకుపక్రమించాలి. ఆధునిక జీవితంలో ఈ అవగాహన కోల్పోవడమే మానవజాతికి పతన హేతువు.

# శ్రీ దత్తలీలామృతము

ఫిబ్రవరి సంచిక తరువాయి

శ్రీమతి శ్రీదేవి





వేదధర్ముడు దీపకునితో "వత్సా! పూర్వము ఒకప్పుడు మునులందరు కుమారస్వామి వద్దకు వెళ్ళి ఎంతో వినయంతో నమస్కరించి, "దేవా! రేణుకను గూర్చి, రేణుకా తీర్థ ప్రభావమును గురించి మాకు చెప్పి, మమ్ముకృతార్థులు చేయప్రార్థిస్తున్నాము.'' అని వేడుకున్నారు. షణ్ముఖుడీ విధంగా దేవి ప్రభావం చెప్పసాగాడు –

"మునులారా! పరబ్రహ్మ స్వరూపిణి అయిన రేణుకామాత దేహధారణ చేసి వసించిన స్థలము అతి పవిత్రమైనది. దానినే మాతృతీర్థమని అంటారు. దత్తాత్రేయస్వామి యీ మాతృతీర్థమునందు పరశురాముని చేత రేణుకాయాగమును చేయించాడు. ఆ స్వామియే స్వయముగా ఆచార్యుడై యాగము నిర్వహించాడు. ఆ యాగములో బ్రహ్మదేముడు ఋత్త్విగ్గణమునందు చేరి బ్రహ్మస్థానమును స్వీకరించాడు. మహర్షులందరు వేదపఠన చేశారు. నారదాది మునులు, సిద్ధ, చారణ, గంధర్వులు రేణుకాదేవి చరిత్రమును గానము చేశారు. దేవ దుందుభులు మ్రోగాయి. అప్సరసలు నాట్యమాడారు. పాల సముద్రము నుండి పాలు; పెరుగు సముద్రము నుండి పెరుగు; నేయి సముద్రము నుండి నేయి; కృష్ణామలక వృక్షము నుండి మధు; శర్కరలు గ్రహించి గంగాది సర్వపుణ్యనదీ జలములతో శ్రీదత్తాత్రేయస్వామి ఏకవీరకు అభిషేకము చేశాడు.

'ఆ సమయంలో శ్రీదత్తస్వామి ఒక దివ్యలీల చేశారు. సకల మునిజనులతో గూడి భార్గవరాముని చేత జరిపించుచున్న ఆ అపూర్వ యజ్ఞకర్మకాండలో ఒకనాడు వున్నట్లుండి స్వామి అంతర్ధానమైనారు. అందరూ దిగ్భ్రాంతులైనారు. దేవతలు విస్మయంతో ''స్వామి ఏమైనారు? ఎక్కడికి వెళ్ళారు? ఉన్నట్లుండి అదృశ్యులైనారే! ఆయన నిరంతర రేణుకా చింతనలో వుంటారు. స్వామికి ఆ ధ్యాస తప్ప మరొక ధ్యాస లేదు. మనమందరము చూస్తుండగానే మాయమైన ఆ స్వామి రేణుకాదేవిలో ఐక్యమైనారేమో!" అన్నారు. ఋషులు "రేణుకా హృదయము మనము ఎరుగము. దత్తస్వామి సంకల్పము కూడ మనము తెలిసికొనలేము. దేవి తన దివ్యతేజస్సుతో స్వామిని ఆచ్ఛాదించినదేమో! లేక స్వామి వేడుకగా ఏలోకమునకైనా వెళ్లారేమో!" అని పలికారు. సిద్ధులు "స్వామి యీ ప్రదేశంలోనే అదృశ్య

రూపంతో వుండాలని అనుకొని యిక్కడే వుండ వచ్చుకూడా" అన్నారు. విద్యాధరులు "లక్ష్మీసమేతుడై స్వామి ఏక్షణమందైనా రావచ్చు" అన్నారు. చారణులు "మాయారూపముతో స్వామి యిక్కడే వున్నారేమో!" అని పలికారు. ఇలా వారందరూ మాట్లాడుకొంటున్న మాటలు వింటూ స్వామి సంతోషంతో సాక్షాత్కరించారు. స్వామిని చూసి పట్టరాని సంతోషంతో స్వామి చుట్టూ చేరి అందరూ "స్వామీ వున్నట్లుండి మీరెక్కడికి వెళ్లారు? మంత్ర ద్రష్టలకు, ఋషులకు కూడా కన్పించరైతిరి!" అని ప్రశ్నించారు.

దత్తయోగి – "భార్గవరాముని యజ్ఞకర్మములో నిమగ్నమై వుండగా సంధ్యావందన కాలము మించి పోసాగింది. కాలాతీతం కాకుండా సంధ్యావందన మహాయజ్ఞము నాచరించటానికై ఆమె వద్దకు వెళ్లాను." అన్నారు. స్వామి అలా చెప్పగానే ఋషులు ఎంతో కూతూహలంతో "స్వామీ! సంధ్య ఎవరు? ఆ కాలమేది? దాని కర్త ఎవరై వున్నారు? ఆ తీర్థము ఎక్కడ వున్నది? ఆ సర్వవిషయాలు మాకు తెలియజేయండి." అని ప్రార్థించారు..

దత్తస్వామి యిలా చెప్పసాగారు –

''మునులారా! సర్వయోగుల హృదయములయందు సర్వదా నివసించు యోగినియే సంధ్య. ఆమె సకల జనులకు వంద్యురాలు. ధ్యానమువలన నిర్మలమై ఆనందామృతముతో నిండిన మనసులలో నిండివుండే సంధ్యాదేవి సర్వదా నమస్కరింపదగినది. సంధ్య ఎవ్వరోకాదు. సర్వ తీర్థమయి అయిన రేణుకయే సంధ్య. అందువలన యోగులు ఎల్లప్పుడు ఆమెను ధ్యానిస్తూ వుంటారు. రేణుకయే మహామాయ. ఆమెయే సంధ్య. ఇందు ఎంటువంటి సందేహమూ లేదు. ఆ సంధ్యయే ఏకవీర. సిద్ధ, గంధర్వ, యోగులు, మునులు, నేను వందనము లొనర్చునది ఆమెకే. అందువలనే నేను వెళ్లి ఆమెకు వందనము చేసి వచ్చాను."

స్వామి చెప్పినది విని ఋషులు "స్వామీ! సంధ్యా వందనమునకు కాలమంటిరే! ఆ కాలమేది?" అని అడిగారు. స్వామి ''ఋషులారా! సంధ్యార్చనకు కాలపరిమితి ఏముంది? కూర్చున్నప్పుడు, నిలుచున్నపుడు, నడచుచున్నపుడు, పరుండినపుడు ఒకప్పుడు అనేది ఏమీలేదు. సర్వకాల సర్వావస్థలలోనూ సంధ్యను పూజించవచ్చును" అన్నారు. అందుకు ఋషులు "స్వామీ! ప్రాణులు ఎల్లప్పుడు దారుణమైన కర్మఫలములనుభవిస్తూ వుంటారు. అటువంటి జనులు సర్వకాలములలో సంధ్యను అర్చింప అశక్తులుగావుంటారు. వారికి సంధ్యనర్చించే మార్గమేది?" అని వేడుకొన్నారు. "ఋషులారా! కాలము అఖండమైనది. అయితే, మానవ దృష్టిచే సంధ్యను అర్చించేందుకు శ్రేష్టమైన కాలము చెపుతాను జాగ్రత్తగా వినండి. చైత్రము, ఆషాఢము, కార్తికము, ఈ మూడు మాసములందు విడువక సంధ్యార్చన చేస్తే బ్రహ్మ స్వరూపిణి అయిన ఆ దేవి కృపతో యిహలోకములో కోర్కెలు సిద్ధించటమే కాక జన్మాంతమునందు పరమపదమును పొందగలరు. అంతేకాదు, ఆ రేణుక సర్వకాలానువర్తిని పరబ్రహ్మైకరూపిణి. ఆమెయే మహాకాళి ఇడ. మహాలక్ష్మి పింగళ, ఏకవీర అయిన సుషుమ్న. ఆమె ఒక్కతే. ఇలా నాడీ త్రయరూపిణియై వెలుగొందుతున్నది. అంతేకాదు. ఆమెయే త్రిసంధ్యాస్వరూపిణి అయినది. భక్తిశ్రద్ధలతో మూడు కాలములందు స్నానము చేసి రేణుకా ధ్యానము చేసినట్లయితే భక్తులు ఆమెను తప్పక దర్శింపగలరు. అలాంటి వారు యిహపర సుఖాలనందుకొంటారనటంలో ఎలాంటి సందేహం లేదు.'' అని దత్తస్వామి సంధ్య మాహాత్మ్యాన్ని తెలియజెప్పారని శ్రీ కుమార స్వామి తెలియజేశారు. ఆ తర్వాత దేవతలు, ఋషులు సకల తీర్థములనుండి పవిత్ర జలములను తెచ్చి విష్ణువును అభిషేకించారు. రేణుకా దేవిని పూజించి, కృష్ణామలకమునకు మ్రొక్కి దత్తస్వామిని పొగడుకొనుచు రేణుకా ప్రభావమును చెప్పుకొనుచు తమ తమ స్థానములకు తిరిగి వెళ్లారు." అని వేదధర్ముడు చెప్పి, దీపకునితో "బిడ్డా! ఇంకా ఏమి చెప్పమంటావు?" అని అడిగాడు. దీపకుడు కొంత సంకోచభావంతో యిలా అడిగాడు – "గురుదేవా!

నేనడగబోయే ప్రశ్న మీకు కోపము తెప్పిస్తుందోమో నని భయముగా వుంది. అయినప్పటికీ దయామయులయిన మీరు నన్ను మన్నించి నా సందేహము తొలగించగలరనే నమ్మకంతో అడుగుతున్నాను. ఓ మహాత్మా! శ్రీ దత్తుడు ఋషిగా, అవతార పురుషునిగా ఏ శాస్త్రములోగానీ, పురాణములోగానీ కీర్తింపబడ్డారా? మీరు సకల శాస్త్రకోవిదులు. మీరెరుగని పురాణములేదు. కనుక దయయుంచి తెలియజేయండి. వేదధర్ముడు నవ్వుతూ "వత్సా! నీ ప్రశ్నలన్నీ కూడా దత్తస్వామి మహాత్మ్యాన్ని స్మరింపజేసేవే. అందులో తప్పు ఏమున్నది? నీవడిగిన ప్రశ్నకు సంతోషంగా సమాధానమిస్తాను. ఎన్నో శాస్త్రములలో, పురాణములలో శ్రీదత్త స్వామి ప్రస్తుతింప బడ్డారు. ఉదాహరణకు మత్స్యపురాణములో స్వారోచిష మన్వంతరమునందు "దత్తుడు, నిశ్చవనుడు, స్తంభుడు, ప్రాణుడు, కశ్యపుడు, ఔర్యుడు, బృహస్పతి – వీరు సప్తర్షులు, తుషితులు, దేవతలు అని వున్నది. హరివంశమునందు కూడ యిదే విధముగా చెప్పబడి వున్నది. మత్స్యపురాణములో ద్వాదశ వ్రతమును గురించి చెపుతూ, "విష్ణుదేవుని అవతారములయిన మత్స్య–కూర్మ–వరాహ నరసింహ– వామన – భార్గవరామ – శ్రీరామ – బలరామ– బుద్ధ– కలికి– దత్తాత్రేయ – వ్యాసుడు– అనే పండ్రెండు మందిని మానమునకు ఒకరిని చొప్పున పండ్రెండు మాసములలోను పూజించాలి" – అని చెప్పారు. ఇక – శ్రీమద్భాగవతములో ఏకాదశ స్కంధమున నాల్గవ అధ్యాయములో "హంస స్వరూప్యవదదచ్యుత ఆత్మయోగం దత్తః కుమార ఋషభో భగవాన్ పితానః విష్ణుశ్శివాయ జగతాం కలయావతీర్ణం" అని ద్రుమిళు డు నిమికి చెప్పినట్లు వ్రాయబడి వున్నది. అంటే విష్ణువు జగత్కళ్యాణార్థము హంస, దత్త, సనత్కుమార, ఋషభ మొదలైన అవతారము లెత్తినట్లుగా చెప్పటం జరిగింది.

శ్రీమద్భాగవతము షష్టమస్కంధము అష్టమ అధ్యాయంలో ".... దత్త స్త్వయోగా దథ యోగనాథః పాయాత్" అని వున్నది. యోగనాథుండైన దత్తుడు నన్ను అయోగము నుండి రక్షించుగాక" అని భావము.

శ్రీమద్భాగవతము షష్ట స్కంధము పంచదశ అధ్యాయంలో వున్న నారాయణ కవచములో....

**సశేషం**




*శ్రీ రామకృష్ణపరమహంస మహాత్ములలో ఎంతో విశిష్టమైన వారని పూజ్యశ్రీ మాస్టరుగారు తెలియజేసారు. ఆధ్యాత్మిక శ్రేయస్సును కలిగించే శ్రీ రామకృష్ణుల జీవిత చరిత్ర, సంబంధిత గ్రంధాలను పూజ్య బాబుగారు ఎందరి చేతనో పారాయణ చేయించారు. చదువరుల సౌలభ్యం కోసం Sri Manga BharadwajaTrust వారు ఈ పుస్తకాలనుకూడా విక్రయిస్తున్నారు. ఇతర గ్రంధాలలాగానే భక్తులు ఈ పుస్తకాలను ట్రస్టువారి నుండి కొనుక్కొని, ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు.*

# వార్తాలాపము

ఫిబ్రవరి సంచిక తరువాయి



*యేన రూపం రసం గన్ధం శబ్దాన్స్పర్శాంశ్చమైథునాన్ ।*
*ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే ॥ (కఠ) ॥*

లోకమంతయు రూప, రస, గంధ, శబ్ద, స్పర్శ విషయభోగములను దేనిచే తెలుసుకొనుచున్నదో అది ఇదియే. ఇది తప్ప మిగిలినది ఇంక ఏమి కలదు? మానవులందరును జ్ఞానస్వరూపమగు ఆత్మ ద్వారా రూప, రస, గంధ, శబ్ద, స్పర్శ, విషయానుభవములను తెలిసికొనెదరు. అటులనే రూపాదుల జ్ఞానమునుకూడ పొందెదరు. స్థూలసూక్ష్మ సంఘాతరూపమగు ఈ జడశరీరముచే రూపాదిజ్ఞానము కలుగదు. సచ్చిదానందస్వరూపమగు ఆత్మ ఉండుటచేతనే రూపరసాదివిషయముల పరిజ్ఞానము ప్రాణులకు కలుగును. విశ్వమందలి పదార్థములన్నియు ఆత్మ చేతనే తెలిసికొనబడును. ఆత్మ స్వయంప్రకాశమగుటచే తనంతట తానే తెలిసికొనబడును. దానిని తెలిసికొనకుండుటకు సామాన్యకారణముకాని విశేష కారణముకాని ఏదియును లేదు. ప్రధాన అజ్ఞాన విరోధియగు జ్ఞానమే ఆత్మను తెలిసికొనుటకు సాధనము. ఆత్మ అతిసూక్ష్మము. దుర్విజ్ఞేయము. అజ్ఞానముచే జీవాత్మ తాను బ్రహ్మముకంటె భిన్నుడనని అనుకొనును. ఆ కారణముచే జనన మరణప్రవాహమున మునుగుచు తేలుచు ఉండును. కాని జీవాత్మ తాను బ్రహ్మమునకు అభిన్నమని తెలిసికొనునప్పుడు ఆత్మకు శోకము కలుగదు.

## బ్రహ్మాభిన్నమగు అద్వైతాత్మ

*స్వప్నాంతం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి ।*
*మహాన్తం విభుమాత్మానం మత్వాధీరో న శోచతి ॥*

స్వప్నావస్థయందును జాగ్రదవస్థయందును తెలుసుకొనవలసిన పదార్థములను, ఆ రెండు అవస్థలనుకూడ చూచిన విద్వాంసుడే ఆత్మ బ్రహ్మాభిన్నము అని తెలిసికొనగలరు. కల్పనాసర్వమునకు అధిష్ఠానము అని గ్రహించును. అతడు జననమరణాదుల దుఃఖమును పొందడు. ఏ ప్రాణి అయినను కర్మఫలభోక్తయును, ప్రాణాదిసమూహమును ధరించనదియు జీవరూపమగు ఆత్మను, దేశకాలములను, వానియందలి పదార్థములను నియమించు ఈశ్వరుని తనకంటె అభేదముగా తెలిసికొనినతరువాత, తనకు కలిగిన ఆ అభేజ్ఞానానంతరము ఆత్మను పొందును. అభయస్వరూపుడగుటచే ఆత్మరక్షణకు ఆప్రాణి యత్నించడు. తానే నిత్యఅద్వైతరూపుడయిన తనను రక్షించువాడు. మరి ఇతరుడు యెచ్చటనుండి వచ్చును? ఎవరినుండి రక్షించును? ఈ వృత్తాంతమును చెప్పు శ్రుతికూడ ఇట్లు చెప్పుచున్నది.

*య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవమన్తికాత్ ।*
*ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ॥ (కఠ)*

కర్మఫలభోక్తయును, జీవస్వరూపుడును అగు ఆత్మయు,భూతభవిష్యనియామకుడగు ఈశ్వరుడును అభిన్నులు అని తెలిసికొనినవాడు దేనినుండియు రక్షణ పొందగోరడు.

## జీవుని స్వరూపము

పెద్దవిద్యార్థి :- మైక్రోస్కోపుతో కూడ అతి కష్టమున చూడదగిన అతిసూక్ష్మజీవులయందును, ఏనుగులు మొదలగు స్థూలశరీరము కలవాని యందును జీవాత్మ ఒకేరకముగా నుండునా? లేక ప్రమాణములో భేదము ఉండునా? జీవాత్మ శరీరమునంతటియందును ఉండునా? లేక ప్రత్యేకభాగమునందు ఉండునా?

## జీవాత్మ అతిసూక్ష్మము

*వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ ।*
*భాగో జీవః సవిజ్ఞేయః సచా22నన్త్యాయ కల్పతే ॥*

"వాలాగ్రభాగమును నూరు భాగములుగాచేసి, అందలి ఒక భాగమును మరల నూరుభాగములుగా చేసినచో ఎంత చిన్నదిగా ఉండునో జీవుడు అంత సూక్ష్మముగా నుండును".

## అతిసూక్ష్మమగు జీవుని సామర్థ్యము

*బ్రహ్మోపనిషత్తునందు ఈ వివరములు కలవు.*
*నేత్రస్థం జాగరితం విదాయత్ కంఠే స్వప్నం సమావిశేత్ ।*
సుషుప్తం హృదయస్థం తు తురీయం మూర్ధ్ని సంస్థితమ్ ॥

"జీవాత్మ నేత్రస్థానమున ఉన్న జాగ్రదవస్థను పొందును. కంఠమనందున్న స్వప్నావస్థను పొందును. హృదయమునందుండగా గాఢనిద్రను పొందును. బ్రహ్మరంధ్రమునందు ఉన్న తురీయావస్థను పొందును."

జీవాత్మ జాగ్రదవస్థయందున్నపుడు నేత్రస్థానమన ఉండి ప్రత్యేక్షాది ప్రమాణవృత్తుల ద్వారా సకలవ్యవహారములనుచేయును. స్వప్నావస్థయందు కంఠమునందుండి 'హిత' అను నాడియందు ప్రవేశించి భ్రమద్వారా పెద్ద పెద్ద పట్టణములు, అరణ్యములు, సముద్రములు, ఏనుగులు, గుర్రములు మొదలగువానిని సృష్టించును. సుషుప్తి యందు హృదయప్రదేశమునందలి పురీతతమను నాడియందు ప్రవేశించుటచే బుద్ధి అవిద్యయందు లీనమయిపోవును. కాని అచ్చట అవిద్యావృత్తి యుండును. ఏలనన నిద్రనుండి లేచినతరువాత నేను సుఖముగా నిద్రించియుంటిని అని చెప్పును. ఆ వృత్తిలేనిచో సుఖాద్యనుభవము ఎట్లు జరుగును? ఆ వృత్తి సత్త్వప్రధానమయిన బ్రహ్మరంధ్రమును చేరి సమాధిద్వారా జీవబ్రహ్మముల మధ్యకల ఆవరణమును భంగముచేసి బ్రహ్మసుఖమును అనుభవించును. అదియే అద్వైత భావన అను నిర్వికల్పసమాధి. ఆ సమయమున సత్త్వ ప్రధానమగు వృత్తియుండును. ఆ వృత్తి కూడ స్వరూపమునందు లయమును పొందును. అదియే అద్వైతావస్థ అను నిర్వికల్ప సమాధి. అదియే గుణాతీతావస్థ.

సశేషం

# ఆచార్యుల బ్రహ్మానుభూతి వేడుకలు 2012

దీపం



***జై సాయి మాస్టర్!***
***శ్రీ సమర్థ సద్గురు సాయినాధునికి జయము!***
***శ్రీ అలివేలు మంగా సమేత గురుభరద్వాజులకు జయము!***

*పూజ్య ఆచార్య భరద్వాజ మహరాజ్* 1963 February 9th *శిరిడీ మొట్టమొదడిసారిగా దర్శించారు. తీవ్ర అన్వేషణతో, సాధనతో వారు అప్పటికే ఎంతో ఎత్తైన ఆధ్యాత్మిక స్థాయికి చెంది ఉన్నారు కాబోలు, శ్రీ సాయిని దర్శించిన మొదటి దర్శనం తోటే వారికి అత్యుత్తమ ఆధ్యాత్మికానుభూతి కలిగింది. అంతటితో వారు శ్రీ సాయినాధుని భక్తుడైనారు. శ్రీ గురుచరిత్ర పారాయణ అనంతరం శ్రీ సాయినాధుడు మాస్టర్‌గారిని తమ శిష్యునిగా ఆమోదించి సత్కరించారు. అంతటితో వారు శ్రీ సాయినాధుని శిష్యులైనారు. ఆనాటి ఆ సంఘటనే ఈనాడు ఈ వ్యాసానికి కారణం. శ్రీ 'సాయిమాస్టర్' భరద్వాజ మహరాజ్ "శ్రీ సాయి లీలామృతము", "శ్రీ గురు చరిత్ర" మరియూ ఇతర గ్రంధాలు వ్రాయకుంటే నేను ఈ వ్యాసాన్ని వ్రాసేవాడినే కాదు. బహుశ: మీరుకూడా ఈ పత్రిక చదివేవారు కాదేమో.*

*ఆలోచించిన కొద్దీ రెండు విషయాలు స్ఫురిస్తున్నాయి. మనకు పూజ్య గురుదేవులు, శ్రీ సాయినాధులు రక్షణగా లభించడానికి కారణం మొదట శ్రీ భరద్వాజ మహరాజ్‌కు* 1963 *లో జరిగిన అనుభవము మరియు, శ్రీ సాయి ఆదేశానుసారం పూజ్య శ్రీ అలివేలుమంగమ్మగారితో ఆచార్యులకు కళ్యాణం జరగటం. ఈ రెండూ కూడా, అద్వయుడు, పరాత్పరుడు, కారుణామయుడు అయిన శ్రీ సాయి సద్గురుని పరమానుగ్రహ స్వరూపాలు అని అంగీకరించక తప్పదు.*

*ఆ కారణంగా* February 9th *మరియూ* March 6th *మనకు పర్వదినాలు. "గురుపూర్ణిమ", "దత్తజయంతి", ఆచార్య భరద్వాజమహరాజ్ జన్మదినము మనకు ఎంత పవిత్రమైన రోజులో, ఈ రెండు తేదీలు కూడా అంతే పవిత్రమైనవి.*

*ఆ కారణంగా ఈ రెండు రోజులలోనూ మనందరం వేడుకలు, సత్సంగాలు, భజనలు,*



ప్రార్థన, ధ్యానాల ద్వారా, సామాజిక సేవా కార్యక్రమాల ద్వారా శ్రీ సాయిమాస్టర్‌ను అర్చించుకునే రోజులుగా నిలవాలి. శ్రీ సాయి మాస్టర్ అశేష భక్త జనావళి యావత్తుకూ ఈ రెండూ కూడా పండుగ రోజులు.

ప్రతి సంవత్సరమూ ఈ పండుగలను పూజ్య గురుపత్ని అలివేలుమంగమ్మ సన్నిధిలో జరుపుకునే మహద్భాగ్యం నాకు లభించింది. ఈ సంవత్సరం February 9th వేడుకలు చాలా బాగా జరిగాయి.

మొదట రోజంతా కార్యక్రమాలతో, వేదికతో పండుగ జరుపుకుంటాము అనుకున్నాను. కానీ ద్వారకనాథ్ గారు ఇలా చెప్పారు -

"ఈ పండుగ శ్రీ సాయిమాస్టర్ భక్తులకు పండుగ. ఆ విధంగా నాకు కూడా పండుగ. అయితే అంతమాత్రమే కాదు. ఆయన మా నాన్నగారు. వారి జీవితంలో అతి ముఖ్యమైన ఈ సంఘటన జరిగినరోజు మా కుటుంబంలో ప్రత్యేక పండుగ. అది మేము ఎంతో ఆనందంగా జరుపుకుంటాము.

అయితే మీరందరూ కూడా వారి బిడ్డలే కదా! ఆయన మనందరికీ తండ్రిగారే కదా! కనుక ఇది మనందరికీ కుటుంబ పండుగ. కనుక February 9th న ప్రతి ఒక్కరమూ ఎవరి ఇంట్లో వాళ్ళం మన తండ్రిగారికి సకల పరిచర్యలూ చేసి సేవించుకుందాము. ఇది కూడా దీపావళి పండుగ లాగే ప్రతి కుటుంబంలోనూ సాంప్రదాయంగా నిలిచిపోవాలి. పైగా అది మనలో ప్రతి ఒక్కరికీ పండుగే! అందుకని శ్రీ మాస్టర్ గారిని ప్రతి ఒక్కరూ తమ ఇంట్లోనే ఉన్నారని భావించుకుని శక్తి మేరకు వారిని పూజించుకోండి. వారు మన ఇంట్లో ఉన్నారనే భావాన్ని దృఢం చేసుకోండి". అన్నారు.

అపుడు మేము "మరి మాకు ఆ పండుగరోజున అమ్మ దర్శనం లభించదా?" అని అడిగితే ఆయన, "తప్పక లభించాలి. ఆమె అందరికీ అమ్మయే. మీరందరూ తండ్రిగారిని పూజించాక తల్లిని కూడా దర్శించాలికదా! అందుకని పొద్దుట అంతా ఎవరి ఇంట్లో వారు గురుదేవులను పూజించుకోండి. సాయంత్రం సత్సంగం ఏర్పాటు



చేసుకుని అమ్మగారి సన్నిధిలో పండుగ జరుపుకుందాము" అన్నారు.

ఆ విధంగానే మా పిల్లలతో కలిసి మేము ఇళ్లలో పూజలు జరుపుకుని మధ్యాహ్నం సత్సంగ ప్రాంగణం వద్దకు వెళ్ళాము. అక్కడ అలంకరణ, మరియూ ఇతర సేవలలో పాల్గొన్నాము. "గురుదేవులు మనందరికీ తండ్రి" అన్న ద్వారకనాథ్‌గారి మాటలను తిరిగి తిరిగి తలుచుకొని పులకరిస్తూ ఆ దివ్య మంగళమూర్తి, గురుపత్ని అయిన అమ్మ దర్శనానికై ఎదురుచూస్తూ ఆ మధ్యాహ్న సమయం గడిపాము.

సాయంత్రానికల్లా వేదిక అంతా సిద్ధమైంది, ఇక్కడ ఉన్న ఎందరో యువకులు, పిల్లలు, పెద్దలు అందరూ ఆ గురుదేవుని చిత్రపటాన్ని, వేదికనూ, మహనీయుల పటాలనూ ముచ్చటగా అలంకరించారు. మాస్టర్‌గారి పెద్ద ఫోటోను అక్కడ ఉంచారు. అందులోనుండి ఆయన, మా తండ్రిగారు, మా గురుదేవులు అయిన ఆయన దృష్టి మాపై ప్రసరిస్తూ ఉన్నది.

కార్యక్రమానికి భక్తులందరూ రాసాగారు. పెద్దాపురం నుంచి భక్తబృందం అమ్మగారి సన్నిధిలో దీక్షా విరమణ చేయటానికి యాత్రలన్నీ చేసుకుని వచ్చారు. కార్యక్రమానికి సన్నాహాలు ఒకవైపు జరుగుతూ ఉంటే మరోవైపు వీరు ఎంతో శ్రద్ధతో భజన చేసారు. మేమంతా భజన చేస్తూ సన్నాహాలను పూర్తిచేసాము.

ఇంతలో ద్వారకానాథ్‌గారు అక్కడకు వచ్చి 6:20 నిమిషములకు కార్యక్రమాన్ని ప్రారంభించారు. "ఈ దివ్యమైన కార్యక్రమానికి వచ్చిన భక్తులందరికీ ఆహ్వానము. మీ అందరి రూపంలో ఈ పర్వదినాన ఇక్కడకు వేంచేసిన దత్తస్వామికి నమస్కారము" అని ప్రారంభించి కార్యక్రమాన్ని వివరించారు.

ముందు పెద్దాపురం భక్తులు ఒక్కొక్కరుగా దీక్ష మాలలను, ఇతర దీక్షా సామగ్రిని గురుదేవుల వద్ద విడిచారు. ఒక పక్క చక్కగా, ఉత్సాహంగా, భక్తిగా "ఓం సాయినాథ జై! గురు భరద్వాజ జై!" అనే నామాలు భజనగా మిన్నుమింటుతున్నాయి. ఎదురుగా ఆచార్యులు తమ పటం రూపంలో ఆశీనులై ఉన్నారు. ఈ కార్యక్రమానికి వచ్చిన వారందరి హృదయాలు పరవశించనారంభించాయి. అందరూ ఒక్కొక్కరుగా భజనలోకి లీనమయినారు.

ఈ దీక్షా విరమణ అనంతరం అందరమూ ఎదురుచూసిన ఆ మహదవకాశం కలిగింది. శాంతమూర్తి, గురుపత్ని అలివేలు మంగమ్మ వేంచేశారు. వేదికను అలంకరించారు. అలాగే వేదమ్మగారు కూడా వచ్చారు. వేదమ్మగారు, ద్వారకనాథ్‌గారూ అమ్మగారికి నమస్కరించాక అమ్మగారి ఆజ్ఞపై ద్వారకనాథ్‌గారు ప్రసంగించారు.

"రోజూ పారాయణ చేయటం శ్రేయస్కరమే కానీ గురుదేవుల బిడ్డలమైన మనం అంతటితో ఆగరాదు. జీవితాలను సాధనామయం చేసుకోవాలి. వారి రచనలను మరింత శ్రద్ధతో అధ్యయనం చేయాలి. మనందరం చేయవలసిన కార్యక్రమాలు ఎన్నో ఉన్నాయి. మచ్చుక వాటిలో ఒకటి ప్రస్తావిస్తాను.

జీవితంలోని, సమాజంలోని ప్రతి సమస్యకూ పరిష్కారం ఆధ్యాత్మికత. అది మహనీయుల గ్రంథాలలో లభిస్తుంది. వాటిని




మనందరం అధ్యయనం చేసి ఈ సమస్యలన్నిటికీ నిర్దుష్టంగా మహనీయులు చెప్పిన పరిష్కారాలను తెలుసుకోవాలి. వాటిని ప్రతి ఒక్కరితోనూ పంచుకోవాలి. అందరం కలిసి వాటిని అవలంబించే ప్రయత్నం చేయాలి. 'ఇది మా వల్ల కాదు!' అని భయపడకండి. మన గురుదేవులు భరద్వాజులు, సమర్థ సద్గురు సాయినాథుల కృప ఉంది కనుక మనం అది సాధించగలము. తప్పక సాధించగలము. మనవైపునుంచి చిత్తశుద్ధిగా ప్రయత్నించాలి అంతే" అంటూ ఎంతో దివ్యంగా ప్రసంగించారు.

"వచ్చే సంవత్సరం యావత్ప్రపంచంలోని సాయి మాస్టర్ భక్తులందరూ ఈ పండుగను తమ ఇళ్లలో తాము వేడుక చేసుకోవాలి. గురుదేవులు మన కుటుంబాలలో ప్రతి ఒక్కదానికీ పెద్దవారు. వారి దయవలననే మన జీవితాలు, కుటుంబాలూ నడుస్తున్నాయి అని గుర్తుంచుకుని ఆయనను ప్రతి ఒక్కరమూ మన ఇళ్లలో ప్రతిష్ఠించుకోవాలి. చుట్టుపక్కలవారిని పిలుచుకుని వారికి శ్రీ సాయిని, మాస్టర్‌గారిని, వారి బోధలను, లీలలను పరిచయం చేయాలి. రాబోయే February 9th 2013, ఈ వేడుకకు 50 సంవత్సరాలు నిండిన రోజు. ఆ రోజు మాస్టర్ ఆశించినట్లు శ్రీ సాయిమాస్టర్ భక్తుల ఇళ్లలో, ప్రతి ఇంటిలో సత్సంగము జరగాలి. అందరమూ ఒక చోట కలిసి చేయటంకాదు. ఎక్కడున్నవారము అక్కడ అంతటా ఉన్న ఆయనలో కలవటం జరగాలి. ప్రతి ఒక్క సాయిమాస్టర్ భక్తుడూ తన ఇంట బంధుమిత్రులను పిలచి సత్సంగం చేయాలి" అని వివరించారు.

శ్రీ సాయిమాస్టర్ ఎంత సంతోషిస్తారు! ఆయన కోరింది అదే కదా! కృష్ణాష్టమికి మనం ప్రతి ఇంట్లోనూ కృష్ణుని ఆహ్వానించి పండుగ జరుపుకుంటాము. వినాయక చవితికి కూడా మనం అలానే చేస్తున్నాము. ఇకపై ఈ February 9th పండుగ కూడా వేలాది, లక్షలాది కుటుంబాలలో అలానే జరుగుతుంది అంటే ఎంత గొప్ప విషయం! ఈ అద్భుత సందేశంతో ద్వారకనాథ్‌గారు శ్రీ సాయిమాస్టర్ తత్త్వాన్ని కేవలం ఒక సిద్ధాంతంగా కాక ఒక శాశ్వత సాంప్రదాయంగా తరతరాలూ నిలిచేలా రూపొందిస్తున్నారని అర్థమైంది. "ప్రభంజనం" ప్రారంభమయ్యింది.

ద్వారకనాథ్‌గారి ప్రసంగానంతరం గొప్ప శుభకార్యం జరిగింది. "శ్రీ టిబెట్ యోగి మిలారేపా" గారి చరిత్ర కన్నడ భాషలోనికి తర్జుమా చేయబడి గురుపత్ని చేతులమీదుగా ఆవిష్కరింపబడింది. "అమ్మ" ఆ గ్రంధాలకు పూజ చేసి, ఆరతి ఇచ్చి, అప్పుడు ఆవిష్కరించారు. ఈ కార్యక్రమాన్ని కన్నులారా చూసిన మేము ఎంతటి ధన్యులం? లక్షలాది మందిని ఆధ్యాత్మిక ఉన్ముఖులను చేసే ఈ గ్రంధం మా కనులముందే ఆవిష్కరింపబడటం తలుచుకుంటేనే పులకరింత కలుగుతున్నది!

ఆవిష్కరణ అనంతరం ద్వారకబాబుగారు అందరి తరపున అమ్మగారికి మాలవేసి వస్త్రాలు సమర్పించి, నైవేద్యమిచ్చి మంగళ ఆరతి ఇచ్చారు. తదనంతరం పిల్లల భజన చేస్తుంటే మేము వెనుకనే పలుకుతూ ఉండగా ఆ చల్లని తల్లి, గురుపత్ని బయలుదేరారు. వారు బయలుదేరిన వెనుక భజన జరుగుతూ ఉండగా ఒక్కొక్కరమూ గురుదేవుల పటానికి నమస్కరించుకుని ప్రసాద వినియోగానికి నిష్క్రమించాము.

అప్పుడుగానీ తెలియలేదు. ఎంత వేడుకగా ఆ పండుగ జరిగిందోనని! ఒక్కొక్కరూ ఆనందాశ్రువులతో, ఒకరు ఆనందంతో కంపిస్తున్న శరీరాలతో గురుదేవులకు నమస్కరించటం చూస్తుంటే ఆ దివ్య సన్నిధి ప్రభావం ఎంతటిదో అర్థమయ్యింది. ఇంతటి దివ్యమైన వేడుకలో పాల్గొనే భాగ్యం శ్రీ సాయి, శ్రీ మాస్టర్‌ల అనుగ్రహం కాక మరేమిటి? వారు మనపై చూపే ఈ అపార కరుణకు తగినట్టుగా జీవితంలో నడుచుకుంటే అంతే చాలు. అంతటి దివ్య పురుషునికి శతకోటి వందనాలు అర్పిస్తూ సెలవు తీసుకుంటాను!

**జై సాయి మాస్టర్!**
**శ్రీ సమర్థ సద్గురు సాయినాధునికి జయము!**
**శ్రీ అలివేలు మంగా సమేత గురుభరద్వాజులకు జయము!**

## Books on Sri Ramakrishna Paramhansa and Swami Vivekananda

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 |
| భారతం నా అమర భారతం | 20.00 |
| జ్ఞాన యోగం | 30.00 |
| బుద్ధి యోగం | 15.00 |
| కర్మ యోగం | 15.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 |
| స్వామి వివేకానంద (2 భాగాలు ) | 60.00 |
| మహాభారతం | 5.00 |
| నా అమర సందేశం | 30.00 |
| భక్తి యోగం | 10.00 |
| సందేశ తరంగిణి(కొలంబో-అల్మోరా) | 40.00 |
| వివేక సూర్యోదయము | 20.00 |
| దైవంతో సహజీవనం | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 |
| మువివేకానంద లేఖావళి | 25.00 |
| రామాయణం | 5.00 |
| My Idea of Education | 34.00 |
| Karma Yoga | 18.00 |
| God Lived with Them | 170.00 |
| The Lived with God | 140.00 |
| Raja Yoga | 36.00 |
| Bhakti Yoga | 16.00 |
| Jnana Yoga | 50.00 |
| Letters of Swami Vivekananda | 110.00 |
| Reminiscences of Swami Vivekananda | 100.00 |
| Talks with Swami Vivekananda | 58.00 |
| Complete Works of Swami Vivekananda-9 | 110.00 |
| Meditation and Its Methods | 18.00 |
| Vivekananda on Himself | 100.00 |
| Ramakrishna and Vivekananda | 7.00 |
| Tales and Parables of Sri Ramakrishna | 45.00 |
| Lectures from Colombo to Almora | 40.00 |
| Complete Works of Swami Vivekananda | 50.00 |
| Sayings of Sri Ramakrishna | 25.00 |

జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయిమాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయిమాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు-పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine Subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone :040-20063300

**OR, Sri Manga Bharadwaja Trust , Ongole Branch Office**
Kothapeta, Kondaiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.** **Magazine** మరియు **General Donations** ను **"Sri Manga Bharadwaja Trust"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Annadanam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Sai Master)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Ashramam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Peace Foundation)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల్వారా పంపగలరు

**Books order** ను **"Sri Manga Bharadwaja Trust (Publications)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు**

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్మ్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

**ఇతర ప్రచురణలు**

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

**BOOKS IN ENGLISH**

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

**BOOKS IN OTHER LANGUAGES**

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |


SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300

**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**


*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*



March 12 శ్రీ రామకృష్ణ పరమహంస జయంతి సందర్భంగా
వారి అనుగ్రహానికై ప్రార్థన



పూజ్య గురు దంపతులకు వారి కళ్యాణమహోత్సవ సందర్భంగా శతసహస్రకోటి వందనములు

edited, printed and published by p. srinivasarao B.A. , B.L. , advocate for Sri Manga Bharadwaja Trust, ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.



ఏప్రిల్ 30న శ్రీ ఆనందమయి అమ్మ జయంతి సందర్భంగా వారి కృపాశీస్సులకై ప్రార్థన.

# "ఆచార్య భరద్వాజ" అంటే...



**"ఆచార్య భరద్వాజ" అన్న పేరు వినగానే మీకేమి గుర్తొస్తుంది?**

*ప్రేమ పూరితమైన ఆయన కంఠస్వరమా, సింహం లాంటి ఆ నడకా, అందంలో యీ విశ్వంలో మరేమీ సాటిరాని ఆ రూపమా?*

అయితే మీరు అదృష్టవంతులు.

*ఆయనతో మీరు గడిపిన నిముషాలు. సన్నివేశాలు గుర్తుకొస్తున్నాయా?*

అయితే మీరు పుణ్యాత్ములు.

*ఆయన సాక్షాత్తు పరమాత్మే అని వెల్లడి చేసే ఆయన లీలలు మీ మనస్సులో మెరుస్తాయా?*

అయితే మీరు రక్షింప బడ్డట్టే.

*మీ లోపలా బయటా, ప్రతీ వస్తు, ప్రాణి, పదార్థ రూపంలో ఉన్న సత్యమేదైతే ఉందో, అదే ఆయన అన్న స్ఫురణ మీకు కలుగుతున్నదా?*

అయితే మీరు ధన్యులు.

*మీకూ, యీ మానవాళికీ ఆయనే దిక్కు అని కృతజ్ఞతతో హృదయము ఉప్పొంగుతున్నదా?*

అయితే మీరు శరణాగతులు.

*ఆయనే మీరుకూడా అని, మీరుగా ఏదైతే ఉన్నదో అది తత్త్వత: ఆయనే అని అనుభూతి కలుగుతున్నదా?*

అయితే మీరు పూజ్యులు, మహర్షులు.

*పై భావాలేవీ స్పష్టంగా కలగడంలేదా?*

అయితే మీరూ నా లాంటి వాళ్ళే.

*ఒక్క విషయం గుర్తుచేస్తా వినండి.*

**మాస్టరుగారు శ్రీ సాయి లీలామృతములో *"శ్రీ సాయిపట్ల మన భావం ఎంత విశాలంగానూ, ఎంత గంభీరంగానూ ఉంటుందోనన్నదానిమీదే మన ధ్యానఫలం ఆధారపడుతుంది"* అని వ్రాశారు. శ్రీ సాయి మాస్టర్ పట్ల కూడా మనకున్న భావం విశాలంగా, గంభీరంగా అయ్యేలా మన మనస్సులను మలుచుకుందాం. అనంతుడైన భరద్వాజునిపట్ల మన భావం కూడా అనంత వైశాల్యము, గాంభీర్యములను పొందేలా అనుగ్రహించమని అంతటా ఉన్న ఆయనను ప్రార్థిద్దాం. ఏప్రిల్ 12 ఆరాధనా మహోత్సవ సందర్భంగా యీ ప్రార్థనను ఆయన మన్నించాలని ప్రార్థిస్తూ నమస్కరిస్తున్నాను.**

**– దీపం**

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

SRI MANGA BHARDWAJA TRUST

సంపుటి: 29 ల ఏప్రిల్-2012 సంచిక: 12

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


## పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"

### విషయసూచిక




చిరునామా

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**




**చందా వివరములు**

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10-00 |
| సంవత్సర చందా | : రూ. 100-00 |
| రాజపోషకులు | : రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000-00 |

*బుద్ధి, శక్తిగల మానవుడికి స్వల్పమైన యోచనతో ప్రతివారికి 'నేను' అన్న అనుభవం ఒక్కటేనని గుర్తించడం సాధ్యం. 'సాయినాధపూజ,' 'ఏదినిజం?' 'విజ్ఞాన వీచికలు' లో వివరించినట్లు 'నేను' - అన్నది సర్వగతమని తెలుసుకుంటే 'నాలో నీవున్నావు, నీలో నేనున్నాను' 'అన్ని జీవుల రూపాలలో నేనే సంచరింస్తున్నాను' అన్న సాయి వాక్యాలు అర్థమౌతాయి. అట్టి అవగాహన ఎంతగా కలిగితే అంతగా ధర్మాచరణ సులభమౌతుంది. అట్టి గుర్తింపుతో కూడిన ధర్మాచరణే ప్రేమ అంటే!*

**- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ**

"ఇహపర శ్రేయస్సుకు సద్గురువును సేవించి, ఆయన అనుగ్రహానికి పాత్రులవడమే ముఖ్యం. ప్రాయశ్చిత్తమేలేని మహాపాపాలకుగూడ సద్గురుసేవే తరుణోపాయమని ధర్మశాస్త్రం చెబుతుంది. కనుక ప్రజలలో ఎక్కువ మందికి అదొక్కటే తరుణోపాయం."

- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ



ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

# రామాయణంలో గురు సాంప్రదాయం

***ధర్మమనేది కేవలం శాస్త్ర గ్రంథాలు చదువుకొన్నంత మాత్రానే తెలిసేదిగాదు. దానిని ఆచరణలో పెట్టేటప్పుడు నిత్య జీవితంలో శతకోటి సందేహాలు వస్తాయి. అప్పుడెలా నిర్ణయించుకోవాలో, ఏంచేస్తే ధర్మమవుతుందో తెలుసుకోవడం ఎంతో కష్టము.*** అది తెలియాలంటే దానిని ఆచరణలో పెట్టగలిగిన మహాత్ముల చెంతన సేవిస్తూ వుండవలసిందే. ధర్మాచరణమన్నది మహాత్ములను చూచి నేర్చుకోవలసిందే. మహాత్ములు చేసినది ఎలా ధర్మమో మనకు తెలియకపోతే వారిని అడిగి - అంటే, పరిప్రశ్న చేసి తెలిసికోవలసిందే. నిజానికి యిలా చేసాకనే ఆధ్యాత్మ విద్య గురించి పరిప్రశ్న చేసే అధికారము వస్తుంది. ఇలా ఎన్నడూ ధర్మాన్ని తప్పకుండా అనుక్షణం ఆచరిస్తూ వుండడం అన్నది స్వభావసిద్ధమై పోవాలి. అపుడు మాత్రమే మనలోని మానవత్వం సంపూర్ణం అవుతుంది. అటు తర్వాతనే దైవత్వము, లేక ఆధ్యాత్మికత సాధ్యమవుతుంది. ఇటువంటి అవకాశము అందరికీ ఎల్లప్పుడూ లభించదు. కనుకనే వీలైనంతవరకు ప్రజలకు యిట్టి సౌలభ్యం చేకూర్చడానికి, ధర్మాన్ని అనుక్షణమూ పాటించిన శ్రీ రామచంద్రుని వృత్తాంతము వీలైనంత వివరంగా వ్రాసి వాల్మీకి మహర్షి మనకు అందించారు. అందుకే, "రామో విగ్రహవాన్ ధర్మ:" అని ఆయన చెప్పాడు. "మానవాకృతిలో వున్న ధర్మమే రాముడు" అని అర్థము.

అంటే శ్రీరాముడు ఏమి చేసినందువలన ఉత్తముడైన మానవుడు అయ్యాడో అది తెలిసికొని మనమూ అలానే చెయ్యాలని వాల్మీకి మొదలైన మహర్షుల భావము. శ్రీరాముడు మొదట చేసినదేమి? అంతవరకూ కేవలం తండ్రిచాటు బిడ్డగా వున్న రాముణ్ణి, తనతో యాగ రక్షణకు పంపమని విశ్వామిత్ర మహర్షి దశరధుణ్ణి కోరాడు. దశరధునికి మహర్షులయందు ఎంతో విశ్వాసము, విధేయత వుండేవి. కాని తన కొడుకు విషయంలో మాత్రం మనందరిలాగనే, మమకారం అడ్డం వచ్చింది. ఎన్నెన్నో సాకులు చెప్పి, శ్రీరాముడ్ని పంపకుండా చూడాలనుకొన్నాడు. అపుడు అతని గురువు, బ్రహ్మజ్ఞానీయైన వశిష్ఠుడు ఆదేశించడంవల్ల

మాత్రమే శ్రీరాముని యాగరక్షణకు పంపాడు. 'భగవంతుని భజించమని చెప్పే తండ్రే తండ్రి' అన్నట్లు, నిజంగా బిడ్డల శ్రేయస్సునుకోరే తండ్రే తన బిడ్డల విషయంలో తన మమకారంకంటే బ్రహ్మజ్ఞానియైన గురువు చెప్పినదానికే ప్రాధాన్యత యివ్వాలని మనము తెలిసికోవాలి. పామరదృష్టితో చూస్తే, అలా చేసినందువల్లనే శ్రీరామునికెన్నో కష్టాలు వచ్చాయి. విశ్వామిత్రుడు చేస్తున్న యాగాన్ని పాడుచేయజూచిన రాక్షసులను అతడు చంపడం వల్లనే వారికి అతనిపై ద్వేషం కలిగింది. మనవలె యిందుకు వెరచి దశరధుడు శ్రీ రాముణ్ణి పంపకుంటే అతడు విశ్వామిత్రుణ్ణి సేవించి ధర్మము, అస్త్రశస్త్రాలు నేర్చుకోగల్గేవాడు కాదు. ముందు ముందు కైకేయి కోరికననుసరించి అతడు అరణ్యానికి వెళ్ళినపుడు రావణుడు సీతను అపహరిస్తే, యుద్ధంలో అతనిని ఓడించి సీతను పొందగల్గేవాడు కాదు. కనుక దశరధుడు తనకెంత యిష్టం లేకపోయినా తన గురువు చెప్పినట్లు వినడమెంతో మేలైంది. ఇది రామయణంనుండి మొదట మనము తెలిసికోవలసిన అంశము.

అంతేకాదు.... మనము ఆశ్రయించవలసినది బ్రహ్మజ్ఞానియైన గురువును మాత్రమే. బ్రహ్మజ్ఞానం లేనివారికి యిష్టాయిష్టాలు వుంటాయి. అట్టి వారిని ఆశ్రయిస్తే, మనము మన యిష్టాయిష్టాలకు బలి అయ్యేబదులు, అట్టి బోధక గురువు యొక్క యిష్టాయిష్టాలకు బలియవుతాముగాని, ఎట్టి శ్రేయస్సూ జరుగదు. విశ్వామిత్రుడు బ్రహ్మజ్ఞాని గనుకనే, అతని సేవకు శ్రీరాముణ్ణి పంపమని వశిష్ఠ మహర్షి ఆదేశించాడు.

అంతేకాదు. మనము ఆశ్రయించవలసినది బ్రహ్మజ్ఞానియైన గురువును మాత్రమే. బ్రహ్మజ్ఞానం లేనివారికి యిష్టాయిష్టాలు వుంటాయి. అట్టి వారిని ఆశ్రయిస్తే, మనము మన యిష్టాయిష్టాలకు బలి అయ్యేబదులు, అట్టి బోధక గురువు యొక్క యిష్టాయిష్టాలకు బలియవుతాముగాని, ఎట్టి శ్రేయస్సూ జరుగదు. విశ్వామిత్రుడు బ్రహ్మజ్ఞాని గనుకనే, అతని సేవకు శ్రీరాముణ్ణి పంపమని వశిష్ఠ మహర్షి ఆదేశించాడు. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అనడానికి గుర్తు, ఆయనగూడ మూర్తీభవించిన ధర్మస్వరూపమై యుండడమే, ఆ విషయం వాల్మీకి స్పష్టంగా వ్రాసాడు. శ్రీరాముడు రాక్షసులను సంహరించగలిగింది గూడ విశ్వామిత్రుని అనుగ్రహం వల్లనేనని వశిష్ఠుడు చెప్పిన వివరం వాల్మీకి ఎంతో జాగ్రత్తగా వ్రాసాడు. విశ్వామిత్రుడు గూడ, "ఈ రాముడు నా గుప్తమైన రక్షణలో, తన స్వతేజస్సుతో దుర్మార్గులైన రాక్షసులందరినీ నాశనం చేయ సమర్థుడు. ఈ రామునికి ముల్లోకాలలోను ఖ్యాతి కల్గేలా అనేక రీతుల శ్రేయస్సును ప్రసాదిస్తాను" అని (బాలకాండ 19 : 9, 10) చెప్పాడు. వశిష్ఠుడు యింకా స్పష్టంగా, "ఈ రాముడు అస్త్రశస్త్రాలలో సమర్థుడైనా కాకపోయినా, విశ్వామిత్రుని రక్షణలో వున్నంతవరకూ అతనిని రాక్షసులు ఏమీ చేయలేరు. విశ్వామిత్రుడు మానవాకృతి ధరించిన ధర్మమే. నీ కొడుకులకు వేలు చేయడానికే నిన్నిలా అడుగుతున్నాడు" అని చెప్పాడు. శ్రీసాయిబాబాకు వారి గురువిచ్చిన అభయము సరిగ్గా యిలాగే 'గుప్తమైనది'. శ్రీ సాయి మనికిచ్చే అభయంగూడ అలాంటిదే. అట్టి విశ్వాసంతో మనము గూడా కష్టాలకు వెరవక, ధర్మం కోసం పోరాడాలని శ్రీసాయి భావం. ఇంతటికీ మూలం-శ్రీరాముడు ఆశ్రయించిన విశ్వామిత్రుని గురించి వాల్మీకి, వశిష్ఠుడు గూడ, 'ఏష విగ్రహవాన్ ధర్మః' - ఈయన మూర్తీభవించిన ధర్మమే! అన్న వాక్యమే. రామాయణంగూడ శ్రీసాయి చెప్పిన సద్గురు సేవయే శ్రీరామునియంతటి అవతారపురుషునికి గూడ ఆచరణీయమైన మార్గమని చెబుతున్నది. ఇలా చేస్తేనే శ్రీరామనవమి పండుగ సార్థకమవుతుంది.



"నా దగ్గరికి వచ్చేవారికి పాయసం పోసి జుర్రుకోమంటే సంస్కారముండి చేతనైన వాడు జుర్రుకుంటాడు. చేతకాని వాడు కుక్కలకు పెడతాడు. అర్థంచేసు కున్న వాడికి అమరబోధ. చేసుకోనివాడికి ఏమిచేయను? ప్రేమను పంచి యివ్వటం నా ధర్మం".

**- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

# ఇక దుఃఖము ఎక్కడిది?

**(శ్రీ సాయినాథ ప్రబోధామృతము గ్రంథం నుండి)**

*భూమి విత్తులను ధరిస్తుంది; మేఘాలు వాటిమీద వర్షిస్తాయి. సూర్యుడు తన కిరణాలను ప్రసరింపజేసి వాటిని మొలిపిస్తాడు. అవి మొలిచాక భూమి, మేఘాలు, సూర్యుడు వాటిపని అవి చేసుకుపోతాయి. విత్తనాలు మొలిచినందుకు సంతోషించవు. మాడిపోతే దుఃఖించవు. అలాగే నువ్వూ చలించగూడదు. ఇక దుఃఖమెక్కడిది? దుఃఖం లేకపోవడమే ముక్తి.*

భగవద్గీతాది సద్గ్రంథాలు బోధించినట్లే ఈ వాక్యంలో సాయి సుఖదుఃఖాలలో సమంగా వుండడం నేర్చుకోమంటున్నారు. ఇందుకు వివేకం అవసరం. వివేకమే బుద్ధియోగమంటే. ఎలా యోచించాలో వాచా వివరించి చెప్పేవాడూ, ఆచరించి చూపేవాడే గురువంటే.

మన సామాన్య దృష్టి యిందుకు విరుద్ధంగా వుంటుంది. మనకిక దుఃఖవిముక్తి ఎలా కలుగుతుంది? మనం నిశితంగా ఆలోచించక పోవడం వలననే! మొదట ప్రయత్న పూర్వకంగా యోచిస్తే అదే అభ్యాసమై క్రమంగా ఆ ప్రయత్నంగానే సరైన అవగాహన పొందుతాము. అదే వివేకం, దాని ఫలితమే వైరాగ్యం. రాగమంటే అనాలోచితంగా, గుడ్డిగా మనం వస్తువుల, వ్యక్తుల సంఘటనలపట్ల ఏర్పరచుకొన్న భ్రాంతిమయమైన ప్రీతి. యోచనతో - అంటే వివేకంతో - దానిని తొలగించుకొని

సత్యదృష్టిని, వాస్తవిక దృష్టినీ అలవరచుకోవడమే వైరాగ్య (రాగం లేకపోవడం) మంటే.

మనం అవివేకం వలన కొన్ని సంఘటనలను కష్టాలని, కొన్నింటిని సుఖాలనీ భ్రమిస్తాము. కష్టాలు తొలగి సుఖాలు సమకూడితే మనకు దుఃఖ రాహిత్యం కల్గుతుందని అనాలోచితంగా విశ్వసిస్తాము. అందుకై సాయినిగాని, దైవాన్నిగానీ ప్రార్థిస్తాము. మన ప్రార్థనను వారు మన్నిస్తే క్షణకాలం మన కృతజ్ఞత అవధులు దాటుతుంది. వారు మన్నించకుంటే మనభక్తి చాలాకాలమువరకూ చలించిపోతుంది. కాని యిది సమంజసమా?

మనకు కల్గే కష్టసుఖాలు మన పూర్వ కర్మ ఫలితాలని నమ్మేట్లయితే, ప్రస్తుతము దుఃఖకరమైన ఫలితాన్నిచ్చే కర్మలు పూర్వజన్మలలో చేసి యిప్పుడు ఆ ఫలితం రాగూడదని కోరడం సమంజసమా? అదే సమంజసమైతే మనకన్యాయం చేసిన వ్యక్తి ఆ కర్మ ఫలితాన్ని ప్రార్థన వలన తప్పకోగల్గితే మనం దైవాన్ని క్షమించగలమా? అతడు పక్షపాతి అని తలచమా. అలానే జరిగితే దైవం ధర్మమెలా అవుతాడు? అందరిపైనా సమాన ప్రేమగల జగత్పిత ఎలా అవుతాడు? ఇలా ప్రతివాడు తప్పగా నడచి ప్రార్థన ద్వారా తత్ఫలితాన్ని తప్పకోవడం సాధ్యమైతే యిక ధార్మిక జీవితమెందుకు? జీవుల ధర్మాధర్మాలతో పనిలేక తనను ప్రార్థించినవారిని మాత్రమే రక్షించేట్లయితే కీర్తికాముడు, స్వార్థపరుడు, అవినీతిపరుడూ కాక దైవమేమవుతాడు? అట్టి వాణ్ణి దైవమనడమెలా? ప్రార్థన ఒక విధమైన లంచమని తలుస్తున్నామా? అట్టి అపవిత్రభావం సాధ్యమైతే అది పరమార్థమనీ, పరమ పవిత్రమైనదనీ మనం మన్నించి, అనుసరించడమెందుకు? అది గూడా నిషిద్ధకర్మ అయింది గదా! అంతేకాదు. ఎవడికైనా తానుగాని, తన తండ్రి, తాత ముత్తాతలుగాని మరణించడం యిష్టముంటుందా? అలానే కొడుకు, మనుమడు, మునిమనుమడు మరణించడమిష్టముంటుందా? అలా అని మనం వారిని మృత్యువు నుండి కాపాడమని చేసిన ప్రార్థనలను మన్నించి దైవం వారిని జీవించనిస్తే భూమిమీద కొంతకాలానికి మన కుటుంబానికిదప్ప మరెవ్వరికైనా స్థానముంటుందా? అంతేకాదు. అట్టి మన వారందరికీ కల్గే కోర్కెలన్నీ ప్రార్థనద్వారా నెరవేరుతూ వాళ్లకు ఎప్పడూ సుఖమే కల్గుతుండాలి గదా? అందులో కొందరు మనపై అసూయ, కక్ష వహించి మన వినాశనం కోరితే? అప్పడు గూడా దైవం వారి ప్రార్థనను మన్నించాలా? లేక మన ప్రార్థనను మన్నించి వారిని నశింపచేయాలా? అంటే ప్రార్థనను గురించి మనకున్న అభిప్రాయం సరియైనదా? ఒకనాడు జీవితంపైన ప్రీతితో ప్రార్థిస్తే మనలను మృత్యువు నుండి ఆయన కాపాడాలా? లేక ఎప్పడైనా మనకు జుగుప్స కల్గి ప్రార్థిస్తే ఆయన మనకు మరణాన్ని ప్రసాదించాలా? జీవితంపట్ల రోసి ఆత్మహత్యకు పాల్పడేవారెందరో చివరి క్షణంలో జీవించాలని తపించడం మనమెరిగినదే. అందుకే ఆత్మహత్య చేసుకునే వారంతా మరలా తిరిగి తమనుతాము రక్షించుకోవడానికవకాశంలేని పథకాన్ని వేసుకొనే మరణిస్తారు. లేకుంటే ఊరికే తన ముక్కు తాను మూసుకొని మనిషి ఆత్మహత్య చేసుకోగల్గేవాడే!

బాగా యోచిస్తేగాని వాస్తవమర్థంగాదు. వాస్తవమంటే మన మీ గ్రంథంలో మరొకచోట వివరించినట్లు 'నేను' అంటే ఏమిటో, మరణమంటే ఏమిటో, జీవనమంటే ఏమిటో తెలియని అజ్ఞానమే సర్వ దుఃఖాలకూ మూలం. అది వీడేదాక మనకు ఎన్ని కోరికలు నెరవేరినా, కష్టాలు తొలగినా ఉన్నదానితో అసంతృప్తి లేనిదానికోసం తపన అనబడు దుఃఖం మనకు తప్పదు.

ఉదాహరణకు ఒకదంపతులకు బిడ్డలు లేకుంటే దుఃఖం. ఎలాగో వారికి సంతతికల్గితే వారు పెరిగి పెద్దయ్యేదాకా అనుక్షణం ఆందోళనే. వారు మనం చెప్పినమాట వినకుంటే దుఃఖం. మనం చెప్పినట్లు 'తూచ' తప్పక నడచుకొంటే "ఇంత నోట్లోనాలుక లేని వాడు యీ ప్రపంచంలో ఎలా బ్రతుకుతాడబ్బా!'' అన్న చింత. వాడికి చదువురాకుంటే, వివాహం కాకుంటే, అయినా దంపతులమధ్య సామరస్యంలేకుంటే, వారికి బిడ్డలు లేకుంటే, ఉన్నా చెప్పినమాట వినకుంటే చింత! ఇలా చింతాపూర్వకమైన దుఃఖవలయమే అవివేకి జీవితమంతా. ఎన్ని కోరికలు తీరినా, కష్టాలు తొలగినా యింకాకోరికలు, కష్టాలు తలెత్తుతూనే

వుంటాయి. ఎన్నింటికని ఎంతని ప్రార్థిస్తాము? ఎంత సద్గురువైతే మాత్రం ఎంతచేసి మనలను శాంతపరచగలడు?

తండ్రికి బిడ్డప్రయోజకుడై తనస్వశక్తిపై స్వతంత్రుడుగా నిలబడి అవసరమైతే పదిమందికి చేయూత నివ్వగలగాలని వుంటుంది గాని ఎల్లకాలం కావలసినదానికల్లా తనదగ్గర చేయిజాపేవాడుగా ఉండాలన్పించదు. అదే అతడి తపన. ప్రాకృతికమైన దేహాన్ని ప్రసాదించే పామరుడు, స్వార్ధపరుడూ అయిన తండ్రికే యింత తపనవుంటే తల్లీ, తండ్రి, గురువు, దైవమూ తానే అయిన ప్రేమమూర్తికి, సద్గురువుకు ఎంత ఆరాటముంటుంది. సాయి ఆశించేది మనం సాధ్యమైనంత త్వరగా ఏమీ కోరనక్కర్లేని స్థితిని చేరాలనే. అదే దుఃఖనివృత్తి. ముక్తి పొందాలని భక్తునికున్న కోరికకంటే ఎన్నోరెట్లు ఆరాటం గురువుకట్టి స్థితిని ప్రసాదించాలని ఉంటుంది. అట్టి నిర్హేతుకమైన ప్రేమ స్వరూపి గనుకనే అతడు దైవం, నిజమైన తల్లి, తండ్రి, ఆప్తుడు. అతడట్టి ప్రేమమయుడనీ, దానికితోడు సర్వజ్ఞుడనీ మనం విశ్వసించడమే అతణ్ణి గురువుగా తలచడమంటే. అట్టివాణ్ణి మనవేంకోరాలి? మనం దానిని కోరుతున్నమాటే నిజమైతే, దానిని సులభంగా పొందేలాగ యోచించడమెలాగో ఆయన బోధిస్తే దానినెందుకు ఆచరించము? అంటే దుఃఖనివృత్తికై మనకు సత్యమైనకోరిక లేదన్నమాట! నిజంగా కోరనిదే ఆయన ఎందుకు ప్రసాదించాలి? అలా వివేకంతో యోచించడానికి సంసిద్ధుడుగాని వ్యక్తికి నిజంగా దుఃఖనాశమవసరంలేదన్నమాట. అటువంటప్పుడు దానికై ప్రార్థించడం బూటకం కాదా? బూటకాన్ని గుర్తించలేనివాడు దైవమెలా అవుతాడు? దుఃఖమంటే మనకంత ప్రీతివుంటే మనం దుఃఖించడమెందుకు? హాయిగా వుండవచ్చుగదా? అప్పడు దుఃఖమెక్కడిది? అపుడు మనం ప్రార్థిస్తున్నది దేనికోసం?

దీని సారాంశమొక్కటే. ఎన్ని కోరికలు తీరినా, ఎన్ని కష్టాలు తొలగినా లభించే తృప్తి తాత్కాలికమే. మరలా కొత్తవి తలెత్తుతూంటాయి. కారణం అజ్ఞానమే. దుఃఖం, అశాంతి, అది తొలగేమార్గం ఆయన మనమడుగకనే వాచా, కర్మణా బోధిస్తున్నారు. అందులో ముఖ్యాంశం వివేకం. వివేకమంటే యీ సూక్తిలో తెల్పినట్టియోచనే. వైరాగ్యమంటే దాని పర్యవసానంగా సిద్ధిస్తుందని చెప్పిన సుఖ దుఃఖాల యెడల సమత్వం, నిర్లిప్తత. అప్పడు మిగిలే భక్తి నిజమైన, సాత్వికమైన భక్తి - శ్రీసాయికి వారి గురువుపట్ల కల్గినట్టిది, నిష్టసబూరీలను దక్షిణలుగా సమర్పించగలది. "కావాలి అన్న కోరికలన్నీ విడచి, సర్వగతుడైన దైవంమీద మనస్సు నిలపండి. గమ్యం చేరుతారు" అని బాబా చెప్పిన దాని సారాంశమిదే. భక్తి, తదితర సాధనల విషయం గూడ "నువ్వేంచేసినా సంపూర్ణంగా, క్షుణ్ణంగా చెయ్యి" అన్న సూత్రాన్ని పాటించడమంటే యిదే. అసలైన జీవిత గమ్యము దైవమని, ఆయనే సర్వస్వమనీ, ఆయనిదివరకే మనలో ప్రతిష్ఠించిన ఆత్మరూప శాశ్వతానందము (అంటే దైవమిచ్చినది) పోదనీ, మానవులిచ్చినది నిలువదనీ మొదట వివేకంతోనూ, శ్రీసాయి వాక్యాలపై విశ్వాసంతో పరోక్షంగా తెలుసుకోవాలి. తదనుసారం ఆయన సూచించిన బాటన యత్నంతో నడచి ప్రత్యక్షానుభవంగా దానిని తెలుసుకొని దుఃఖ నివృత్తిని పొందడమే ముక్తి. అయితే యిట్టి సమత్వస్థితి ఒక్కరోజులో కుదిరేదికాదు. ఇప్పటికిప్పడే అట్టి స్థితి కుదరలేదని నిస్పృహ చెందనక్కర్లేదు. ఈ లోపున మానవ నైజాన్ననుసరించి కష్టసుఖాలు మనస్సును కలతపెడుతూనేవుంటాయి. అంతవరకూ మన కష్టాలను, కోరికలను ఆయనకు మనస్ఫూర్తిగా నివేదించి వాటికొఱకై ప్రార్థించవచ్చు. వారెందరి ప్రార్థనలనో మన్నించడం భక్తుల అనుభవాలలో చూస్తున్నాము. అట్లా అని ఎల్లకాలం వాటిలోనే మునిగితేలుతూ 'మనమట్టి అతీతస్థితికి రాలేదుగా!' 'అది మనవంటి వారికి సాధ్యమా' అన్న వ్యర్థప్రలాపాల మాటున మన నిష్క్రియతను పదిలపరచుకొంటే ప్రయోజనం లేదు. ఒక వంక శక్తినంతటినీ వినియోగించి, వివేచించి మనస్సును సమత్వంలో మరలమరలా నిలుపుకునే యత్నం చేస్తుండాలి. క్రమంగా నానాటికీ మన శ్రేయస్సు నెడతెగక, ఏమారక కనిపెట్టే

సద్గురువున్నాడన్న విశ్వాసాన్ని బలీయం చేసుకుంటూ, మనమడగవలసిన ఆవశ్యకతలేదని గుర్తుంచుకో యత్నిస్తుండాలి. 'నాపై నీ దృష్టినిలుపు; నీపై నా దృష్టి నిలుపుతాను' అన్న వారి వాక్యాన్ని స్మరించి అందులో మొదటి అంశాన్ని మనం నిర్దుష్టంగా నెరవేర్చడమే రెండవ అంశానికర్హులమయ్యే మార్గమని గుర్తించాలి. అలాచేస్తే అంతకంతకూ నిజమైన శరణాగతి కుదురుతుంది.

ఇందుకొక్క విషయాన్ని గమనించాలి. సాయిచరిత్రలో ఎక్కువ భాగం భక్తుల కష్టాలను తొలగించడం, కోరికలు తీర్చడమే అయినా, కొందరి విషయంలో ఆయన కల్పించుకోకపోవడం ఉన్నది. అటువంటప్పుడు ఆయనపై అసంతృప్తి చెందడం తగదు. మన ఆత్మ పరిపాకం దృష్ట్యా మన పూర్వ కర్మానుసారం అట్టి సమస్యలననుభవించడం ఆవశ్యకమని - కుండనుకాల్చడంలాగ, నగతయారుచేయడానికి గాని, శుద్ధిచేయడానికి గాని బంగారాన్ని కరిగించడం లాగ - గుర్తించి తృప్తిగా వారి అతీత సంకల్పాన్ని స్వీకరించాలి - మన వ్యాధినిబట్టి వైద్యుడిచ్చినమందు చేదుగా వున్నా విశ్వాసంతో స్వీకరించినట్లు. అట్టి స్థితిలో గూడ నిష్ఠ, సబూరీలతో ఆయనపై విశ్వాసంతో మన దృష్టిని నిలపాలి. దీనినభ్యసించాలి. అదే సాధన. "అనన్యాశ్చింతయంతో మామ్" అన్న గీతా శ్లోకంలో తనను అనన్యంగా భక్తితో స్మరించే వారి యోగక్షేమాలను తాను వహిస్తానని గీతాచార్యుడు వాగ్ధానం చేసారు. అంటే తన భక్తుల ప్రేమస్సు (ప్రియము, లేక యిష్టము) ను గాక వారి యోగమును, వారి క్షేమము (శ్రేయస్సు) ను తాను చేకూర్చగలనని చెప్పారు. బాబాకూడా అదే చెబుతున్నారు. అంటే అజ్ఞానంతో మనం కోరినది ఆయన నెరవేర్చనివాడు అట్టి అనుభవం సుఖదుఃఖాలలో సమత్వంతో నిలచి, వారిని భక్తితో స్మరించడంలో ఎట్టిలోపమూ చేయని స్థితి మనకు రావడం మనం గమ్యాన్ని చేరడానికవసరమని గుర్తించాలి. సద్గురువిస్తున్న తర్ఫీదును బాధ్యతనెరిగిన పుత్రుడు తండ్రియిచ్చు తర్ఫీదును సంతోషంతో స్వీకరించినట్లు, స్వీకరించడం నేర్వగలగాలి. ఇది వివేకంతోను, సద్గ్రంథ శ్రవణంతోనూ, సత్పురుష సాంగత్యంతోను స్థిరపడుతుంది. సత్పురుషుల చరిత్ర పఠనలో యీ మూడు యిమిడియున్నాయి. 'పనిచేయి, సద్గ్రంథాలు పఠించు; దేవుని నామముచ్చరించు" అన్న సూక్తి యిందుకు మార్గదర్శకం

"నువ్వు నిశ్చలంగాకూర్చో, అవసరమైనదంతా నేను చేస్తాను. నిన్ను చివరికంటా గమ్యం చేరుస్తాను" అన్న సూక్తిలో బాబా బోధించినది యీ సూత్రమే. అయితే యిది నిష్క్రియతను బోధించదు. "పని చెయ్యి" అన్నారుగదా? అంటే మనకర్తవ్యాన్ని, ధర్మాన్ని - మేఘాలు, సూర్యుడు, వాయువులవలె - మనం నిర్దుష్టంగా 'క్షుణ్ణంగా' చేయాలి గాని అంతరంగం కోరికలతో, కర్మఫలాపేక్షతో చలించకూడదు. అదీ 'నిశ్చలంగా కూర్చో' అంటే. ధర్మంపట్ల కార్యదీక్షత, ప్రతిఫలంపట్ల నిర్లిప్తత - యిది సకలయోగసారం. ఇలా చేస్తే రెండింటికి చెడతామేమోనని శంకించరాదు. 'నన్ను నమ్మిన వారినెన్నడూ పతనం కానివ్వను' అని, 'నా సమాధినుండి కూడా నా కర్తవ్యాన్ని నిర్వహిస్తాను' అని, 'నేనెవ్వరినీ మధ్యలోవిడువను' అనీ వాగ్ధానంచేశారు గదా!



"మీకు ఆలోచనల్లేని స్థితికి రావటం ఎంత కష్టమో,
నాకు ఆలోచనలున్నస్థితికి దిగిరావటం అంత కష్టం"

**- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

(శ్రీమతి. యస్. లక్ష్మిగారి డైరీ విషయం 18-6-1980)

దివ్యజనని అలివేలు మంగమ్మ

# తల్లికి తగిన బిడ్డడు - మహాత్ముల ముద్దు బిడ్డడు

***"తల్లికి తగిన బిడ్డలు కండి - మీ భాండాగారాలను నింపుకోండి" అని శ్రీ శిరిడీ సాయిబాబా చెప్పారు.*** ఆయన 'ద్వారకామాయికి తగిన బిడ్డలు కండి' అని చెప్పినప్పటికీ తనకు తగిన బిడ్డలు కండి అనే అర్థం. మశీదును 'ద్వారకామాయి' అనేవారు బాబా. ఈ 'మశీదు తల్లి' అని గూడ అంటూండేవారాయన. అయితే ఆ మశీదు 'ద్వారకామాయి' ఎలా అయింది? అందులో బాబా నివశించడం వల్లనే అయింది. అంటే ద్వారకామాయియే తామని పరోక్షంగా చెప్పినట్లే అయింది. అంతేగాదు, 'నాకెవ్వరి మీదా కోపం రాదు, తల్లికి ఎప్పుడైనా కోపం వస్తుందా!' అని గూడ అన్నారు బాబా.

అయితే తల్లికి తగిన బిడ్డలుగా అవడమంటే ఏమిటి? సర్వసంగ పరిత్యాగమా? కఫ్నీ ధరించి భిక్షతో జీవించడమా? కానీ బాబా ఉద్దేశ్యం, ఆయన ఆధ్యాత్మిక స్థితికి వారసత్త్వమేగాని మిగతావేవీ అందుకు ప్రమాణాలు గావు. ఎవరైనా

సరే భిక్షతో జీవించవచ్చు, జీవించకపోవచ్చు; కష్టే

*శ్రీ వాసుదేవానందస్వామి శిష్యులైన శ్రీ గుళవణీమహరాజ్ పూజ్యశ్రీ మాస్టరుగారిని చూస్తూనే 'సాయిబాబా-కా-బేటా' అన్నారు. ఆయనలా ఎందుకన్నారు? పూజ్యశ్రీ మాస్టర్‌గారు శ్రీసాయిబాబా యొక్క బిడ్డడు ఎలా అయ్యారు?*

ధరించవచ్చు, ధరించకపోవచ్చు, కానీ ఆధ్యాత్మిక స్థితిలో మాత్రం ఆయనకు తగిన బిడ్డలుగా వుండాలన్నమాట. కారణం ఏ మహాత్ముని యొక్క శిష్యుడుగానీ, భక్తుడుగానీ ఆ మహాత్ముని వల్ల పరిపూర్ణులయ్యారు కానీ వారి వలె జీవించడం చూడము. అంటే ఇక్కడ తల్లికి తగిన బిడ్డ అవడం అంటే ఆధ్యాత్మికంగా పరిపూర్ణులవడమనే అర్థం.

శ్రీ వాసుదేవానందస్వామి శిష్యులైన శ్రీ గుళవణీమహరాజ్ పూజ్యశ్రీ మాస్టరుగారిని చూస్తూనే 'సాయిబాబా-కా-బేటా' అన్నారు. ఆయనలా ఎందుకన్నారు? పూజ్యశ్రీ మాస్టర్‌గారు శ్రీసాయిబాబా యొక్క బిడ్డడు ఎలా అయ్యారు?

తల్లికి తగిన బిడ్డడు అంటే తల్లి గుణాలను పుణికి పుచ్చుకున్నవాడు అని అర్థం. అయితే తల్లి యొక్క గుణాలేమిటి? తన బిడ్డల పట్ల ప్రేమ, ఓర్పు, వారి శ్రేయస్సునే ఎప్పుడూ కోరుకునే మనస్తత్త్వము, వారి కోసం అపార త్యాగము, తన పట్ల వారి ప్రవర్తన ఎట్లావున్నా క్షమించేగుణము మొదలగునవి.

ఈ సృష్టిలో తల్లిది ఒక ప్రత్యేకమైన స్థానము. ఉన్నత స్థానము, ప్రథమ స్థానము. అందునా 'ద్వారకామాయి' లేక 'సాయి' మామూలు తల్లిగాదు. ఐహిక, ఆధ్యాత్మికతలను ప్రసాదించే జగజ్జనని. అట్టి తల్లికి తగిన బిడ్డలవడమంటే మాటలా? పూజ్యశ్రీ మాస్టరుగారిలో వున్న ప్రత్యేకత ఏమిటి?

పూజ్యశ్రీ మాస్టరుగారికి అట్టి తల్లికిగల గుణాలన్నీ సంపూర్ణంగా వున్నాయి. దయ, క్షమ, దానము, సమాజసేవ, గురుసేవ మొదలగునవన్నీ వున్నాయి.

ఇవిగాక ఆయనలోని ప్రత్యేక లక్షణం ధర్మాచరణ.

పైన చెప్పుకున్న గుణాలన్నీగానీ, కొన్నిగానీ మామూలు వ్యక్తులలోగూడ చూస్తాము. కానీ ధర్మాచరణగలవారు మాత్రం చాలా కొద్దిమందే వుంటారు. ఉదాహరణకు ఒకనికి దానగుణం ఎంతగానో వుండవచ్చు. కానీ అతనికి అసూయగానీ, లేక మరేదో బలహీనతగానీ వుండవచ్చు. అలాగే ఒక సుగుణం వుంటే దానిని దెబ్బతీసే మరొక బలహీనత వుంటుంది. ఒకనికి ఇంట్లో వాళ్ళవరకే త్యాగం వుంటుంది. అతనికి బయటి వాళ్ళపట్ల, స్వార్థము వుండవచ్చు. ఒకరు ఇంట్లో వాళ్ళను మాత్రమే పట్టించుకుంటే మరొకరు బయట వాళ్ళను మాత్రమే పట్టించుకుంటారు. ఇలా వ్యక్తికీ వ్యక్తికీ సుగుణాలు-దుర్గుణాలు మేళవించి వుండడం చూస్తాము. అలాగాక ధర్మాచరణ ఎప్పుడైతే వుందో అప్పుడు మాత్రమే సరియైన గుణాలు, సరియైన విధంగా, సరియైన స్థాయిలో పనిచేస్తాయి.

ఇలాగే ఆధ్యాత్మికతలో ఒక స్థాయికి ఎదిగినవారిలో గూడ ఇవన్నీ ఇలాగే వుంటాయి.

ఎంతోమంది ఆధ్యాత్మికోపన్యాసమిస్తారు. భగవంతుని పట్ల తమ భక్తిని ఎన్నో రకాలుగా వ్యక్తం చేస్తుంటారు. ఆధ్యాత్మికంగా ఒక స్థాయికి ఎదిగి వుంటారు గూడ కానీ కొందరు తాము గొప్ప భక్తులమని, సాధకులమనీ, గురువులమనీ తలుస్తుంటారుగూడ. కొంతమంది బహిరంగంగానే చెప్పుకుంటుంటారు. కానీ తమ పట్ల ఎవరైనా తేడాగా ప్రవర్తించినా, మాట్లాడినా సహించలేరు. పైగా వాళ్ళను ఎంతో క్షమించినట్లు, వాళ్ళ అన్నమాటలు పట్టించుకోనట్లు నటిస్తారు.
కాని వాళ్లను ఏదో విధంగా, ఇతరులు అది తప్పని గుర్తుపట్టలేని విధంగా దెబ్బకొట్టాలని, అణచివేయాలనీ చూస్తుంటారు. ఇంకా ఎంత పెద్ద స్థాయిలో వాళ్ళంటే, అణచివేత అంత పెద్ద స్థాయిలో వుంటుంది. తమను వ్యతిరేకించిన వారిని ఏమి చేయడానికైనా వెనుకాడరు. వ ం న లో అందరముగూడా పూజ్యశ్రీ మాస్టరుగారి పట్ల ఎంతో

భక్తి, ప్రేమ, అభిమానము చూపిస్తాము. నిజంగా వుంటాయిగూడ. ఆయన మన పట్ల కురిపించిన ప్రేమకు పులకించిపోతాము. ఆయన మనకు చేసిన మేలుకు భక్తితో ఉప్పొంగిపోతాము. ఆయన మన పొరపాట్లను పట్టించుకోనందుకు, ఆయన ఓర్పుకు, మంచి తనానికి మనకు కళ్ళవెంబడి నీళ్ళుగూడ వస్తాయి. ఇతరులతో ఆనందంతో పూజ్యశ్రీ మాస్టరుగారి గురించి చెప్పుకుంటాము. చేతనైతే రచనలద్వారా గూడ ఆ ప్రేమను, అభిమానాన్ని ఎంతో గొప్పగా వ్యక్తం చేసుకుంటాము. అయినా మనకు యితరులపట్ల కోపము, ఈర్ష్యా, ద్వేషాదులు లేకుండా వున్నాయా? ఎవరైనా మనలను తక్కువగా చూస్తే వాడి అభిప్రాయము వాడిది అని నిర్లిప్తంగా వుండగలుగుతున్నామా? మన పట్ల యితరులు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే సహించగలుగుతున్నామా? ఇవన్నీ ఎందుకు వస్తున్నాయని ఆలోచిస్తున్నామా? అసలిలాంటి భావాలు మనలో వున్నాయని గుర్తించగలుగుతున్నామా? ఇతరులు మనపట్ల అలా ఎందుకు ప్రవర్తించాలి అని మనకెందుకు అనిపిస్తున్నది? వీటికి పరిష్కారం పూజ్యశ్రీ మాస్టరుగారు ఏమి చెప్పారు? వీటిని తొలగించుకోవడమెలా అనుకుంటున్నామా? తొలగించుకోవడానికి ప్రయత్నం చేస్తున్నామా? ఎవరైనా ఏమైనా అనుకున్నా అవేవీ మనకు తగులుకోవుగదా అని, వాడు చేసినదానికి ఫలితం వాడే అనుభవిస్తాడు గదా అనీ అనుకుంటున్నామా?

> *“మన పెద్దవాళ్ళు అంతవాళ్ళు, ఇంతవాళ్ళు అని చెప్పుకుంటే సరిపోతుందా? వాళ్ళలాగా మనం వుండడానికి ప్రయత్నిస్తున్నామా? అని దాని అర్థం. మన పెద్దల గురించి గొప్పలు చెప్పుకోవడం సరియైనది గాదనిగాదు, వాళ్ళ గొప్పలు చెప్పుకుంటే సరిపోదు, మనమూ అలా వుండడానికి ప్రయత్నించాలి*

అవతలివాడు ఎత్తి చూపిన దుర్గుణాలు మనలో వున్నాయేమోనని వెదకి చూసుకుంటున్నామా?

ఎంతటి ఆధ్యాత్మకవేత్తలైనా ఋషులైనా పడిపోయేవి యిటువంటి విషయాలను ఆలోచించలేక పోవడం వల్లనేనని, వాటిని పోగొట్టుకోనిదే ఆధ్యాత్మికతలో సరియైన మార్గంలో ఒక్క అడుగు కూడా ముందుకు వేసినట్లు కాదనీ పూజ్యశ్రీ మాస్టరుగారు పదే పదే చెప్తూనేవున్నారుగదా?

కనుక మనం పూజ్యశ్రీ మాస్టరుగారికి ఎంత సన్నిహితులమైనా, ఎంతకాలం ఆయన చెంత వున్నా, ఎంతగా ఆయన ప్రేమకు పాత్రులమైనా, ఎంతగా ఆయన వల్ల సహాయం పొందినా, ఈ బలహీనతలను జాగ్రత్తగా గమనించుకోకపోతే, తొలగించుకోకపోతే ఆయన యొక్క సంపూర్ణ అనుగ్రహాన్ని పొందలేము. కారణం ఎన్నో కోట్ల మంది మహాత్ముల దగ్గరకు వెళ్ళి అనేక విధాలుగా వారి అనుగ్రహాన్ని పొంది, అనేక విధాలైన శ్రేయస్సును పొందినా వారి సంపూర్ణ అనుగ్రహాన్ని పొందే శిష్యుడు ఏ ఒక్కడో వుంటాడు. అలాగే బాబా దగ్గరకు వచ్చిన అసంఖ్యాకమైన వారిలో ఆయన సంపూర్ణంగా అనుగ్రహించినవారు ఏ కొద్దిమందో!

‘ఆయన సంపూర్ణంగా అనుగ్రహించకపోయినా ఫర్వాలేదు. ఈ మాత్రం అనుగ్రహం మాపై చూపితే చాలు. ఆయన సంపూర్ణంగా అనుగ్రహించే స్థాయికి మనం ఎదగలేదు గదా! మనవంటి వాళ్ళము ఎదగలేము గదా!’ అని కొందరు తలచవచ్చు. కానీ అంతస్థాయికి ఎదిగే ప్రయత్నం చేయకపోతే అంటే మనలోని బలహీనతలను తొలగంచుకోకపోతే మనం దిగజారే పరిస్థితి పొంచి వుంటుంది. ఇంతటి అదృష్టాన్నీగూడ చేజార్చుకున్నవాళ్ళమవుతాము. కనుకనే అన్ని విధాలుగా అన్నిసార్లు పూజ్యశ్రీ మాస్టరుగారు యీ విషయాన్నే నొక్కివక్కాణిస్తూ వచ్చారు.

దీనికే సమాధానంగా పూజ్యశ్రీ మాస్టరుగారు ఒక ఉపన్యాసంలో చెప్పారు, “మన పెద్దవాళ్ళు అంతవాళ్ళు, ఇంతవాళ్ళు అని చెప్పకుంటే సరిపోతుందా? వాళ్ళలాగా మనం వుండడానికి ప్రయత్నిస్తున్నామా? అని దాని అర్థం. మన పెద్దల గురించి గొప్పలు చెప్పకోవడం సరియైనది

గాదనిగాదు, వాళ్ల గొప్పలు చెప్పకుంటే సరిపోదు, మనమూ అలా వుండడానికి ప్రయత్నించాలి అని.

ఆయన యింకా యిలా చెప్పేవారు "ఎంతో వైభవంగా ఉత్సవాలు చేసుకోవడమూగాదు, ఎన్నో ఘనమైన కానుకలు భగవంతునికి సమర్పించడమూగాదు, అవన్నీ శక్తి వుంటే చేసుకోవచ్చు, శక్తి లేకపోతే చేసుకోకపోనూవచ్చు. కానీ ఎవరైనా చేసుకోవలసినది, చేసుకోగలిగినదీ వున్నది. అదే సుఖ దుఃఖాలకు, నిందాస్తుతులకు పొంగకుండా, కృంగకుండా వుండడం. ధనకాంక్ష, కీర్తికాంక్ష, స్త్రీకాంక్షలకు బానిసలైపోకుండా వుండడం. దీనిని ఎవరైనా ప్రయత్నంవల్ల సాధించవచ్చు. దీనికి ధనవంతులు, బీదవారనే తారతమ్యం లేదు. ఆస్థులు, అంతస్థులు అడ్డురావు. కనుక దీనిని అలవరచుకుని తీరాలి. లేకపోతే మిగతావన్నీ పసిపిల్లల బొమ్మలాటలాగా వుండి తగవులాటలు, పోటీలు, వంతులు, కక్షలు, కార్పణ్యాలకు దారితీస్తాయి. అందుకే మిగతావాటికి వేటికీ నేను ప్రాధాన్యతనివ్వను. ధర్మాచరణకే ప్రాధాన్యతనిస్తాను. ధర్మాచరణవల్లనే వీటిని జయించడం సాధ్యము. ఈ బలహీనతలను జయించడానికి నిజాయితీగా ఒక్కడు ప్రయత్నించినా నా కృషి సార్థకమైనట్లే. వాడు తప్పక కృతార్థుడవుతాడు. సాయికృపకు పాత్రుడవుతాడు."

అందుకే ఆయన ఏ విషయంలోనూ ధర్మం తప్పడం చూడము. అందుకే ఆయన "ధర్మం తప్పనపుడు ఏ ఆశ్రమమైన ఒక్కటేగదా!" అని నిష్కర్షగా చెప్పగలిగారు.

పూజ్యశ్రీ మాస్టరుగారి ధర్మనిరతి చాలా గొప్పది. అందుకనే ఆయన ధర్మ ప్రబోధాన్నే ఎక్కువగా చేసేవారు. అసలు ఆధ్యాత్మికత అంటేనే ధర్మమని, ధర్మం లేకపోతే ఎంత ఆధ్యాత్మిక సంస్థయైనా సరియైన విధంగా నడవదనీ, అధర్మం అక్కడగూడా ప్రబలమవుతుందనీ ఆయన చెప్పేవారు.

పూజ్యశ్రీ మాస్టరుగారు తమను తాము ఎప్పుడూ గొప్పగా చెప్పకోలేదు. వారు గొప్పగా సాధన చేసామని గానీ, తాము ఆధ్యాత్మికంగా ఎంతో ఉన్నత స్థితిలో వున్నామనిగానీ చెప్పకోలేదు. కనీసం తాము గొప్ప సాయిభక్తుడినని గూడ ఎక్కడా బయటపడలేదు. తమను గురువుగా ఎందరో తలచినప్పటికీ ఆయన తాము మాత్రం అలా ఏమీ కాదని, అందరికీ సాయినాథుడే గురువనీ చెప్పేవారు.

తల్లికి వుండవలసిన గుణాలన్నింటితోపాటు పూజ్యశ్రీ మాస్టరుగారితోగల అచంచల గురుభక్తి అకుంఠిత ధర్మాచరణయే ఆయనను సాయియొక్క ముద్దు బిడ్డగా చేసాయని ఖచ్చితంగా చెప్పవచ్చు.

అందుకే ఎందరో మహాత్ములు ఆయనను ప్రసంశించారు.

*"భరద్వాజ ఈజ్ భరద్వాజ" అని ఒక మహాత్ముడంటే,*

*"భరద్వాజ భగవాన్‌హై" అని మరొక మహాత్ముడన్నారు.*

*"ఆయన చల్లని కుండ" అని నాగమునీంద్రస్వామి అంటే,*

*"ఆయన ఆచార్య పదవికి అర్హులు" అని సుధీంద్రబాబుగారు అన్నారు.*

*అలాగే చివటం అమ్మ, పాకలపాటి గురువుగారు మొదలైన మహాత్ములెందరో ఆయనను శ్లాఘించారు. అందుకే ఆయన 'సాయిబాబా కా బేటా', 'మహాత్ముల ముద్ద బిడ్డడు', 'తల్లికి తగిన బిడ్డడు'.*

పూజ్యశ్రీ మాస్టరుగారు ఏమేమి చేసారో, ఏమేమి చెప్పారో, ఎంత ధర్మబద్ధంగా జీవించారో ఆయన గురించి తెలిసిన మనందరికీ తెలుసు. ఆయన కోరుకున్న విధంగా మన జీవితాలను మలచుకోవడమే మన కర్తవ్యము. కనుక మనలో ఆయన తొలగించుకోమన్న గుణాలు వున్నాయో లేదో నిష్కర్షగా గమనించుకోవాలి. ఆచరించడానికి ప్రయత్నించాలి. నిష్కర్షగా గమనించుకోకుండానే మనలో అటువంటి తొలగించుకోవలసిన గుణాలేవీ లేవని అనుకుంటే ఇతరులకు ఏమీ నష్టం లేదు. 'చెప్పేవాళ్ళు లేక చెడిపోయారు' అన్న సామెత లోకంలో వుంది. కానీ మనం చెప్పేవాళ్ళు వున్నా చెడిపోయిన వాళ్లమవుతాము. ఇంతటి అదృష్టాన్నీ చేజేతులా జారవిడచుకున్న వాళ్లమవుతాము. ఎన్నో జన్మలు నష్టపోతాము.

కనుక పూజ్యశ్రీ మాస్టరుగారి కృతజ్ఞతా మహోత్సవ సందర్భంగా మనం ఈ ప్రయత్నాన్ని నిష్కర్షగా చేసుకుందాము.

జై సాయిమాస్టర్ !!

"సాధకుని ప్రధాన కర్తవ్యం తన గురుని పూర్ణస్థితిని తన హృదయ ఫలకం మీద స్పష్టంగా ముద్రించుకోవడమే. అందుకు సాధనంగానే గురుపూర్ణిమనాడు సద్గురుని పూజించుకునే ఆచారం అనాదిగా వస్తున్నది. అందుకు ఉత్తమమైన సాధనం పూర్ణగురుని చరిత్ర పారాయణ చేయడమే".

**- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**



**ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

# యోగి - త్యాగి

***"దుఃఖేష్వనుద్విగ్న మనాః, సుఖేషు విగత స్పృహః" అన్నది యోగి యొక్క తత్త్వం. భగవద్గీతను చదివి లోకానికి చెప్పడమొక ఎత్తు. తానే ఆచరించడం మరొక ఎత్తు. దుఃఖ సమయంలో ఉద్వేగం చెంది పారిపోవడం, ఆ సన్నివేశాన్ని మరొక శిష్యరత్నం పైనుంచి తాను లోక కళ్యాణ కార్యమను పేర తన కీర్తికి, ప్రీతికీ పనికి వచ్చే కార్యక్రమాలలోనికి తప్పుకోవడం లోకంలో చూస్తాము.*** కాని దుఃఖాన్నీ, కష్టాన్నీ తన భుజాలమీద తీసుకొని అవతల వారికి శాంతి సుఖాలనివ్వడం నిజమైన కారుణ్యం. కీర్తి శేషులైన మా నాన్నగారి జీవితమంతా యిట్టి గాథ, ఆయన బహుముఖ ప్రజ్ఞను గుర్తించడంలో ఈ అంశాన్ని మరువడం, శివుని పరతత్త్వాన్ని గుర్తించడంలో తాను హాలహలాన్ని మ్రింగి లోకాలకు రక్షణ కల్పించడాన్ని విస్మరించడం లాగుంటుంది.

మా తల్లిగారు తీవ్రమైన హృద్రోగంతో బాధపడుతున్నా ఆమె సంరక్షణ భారాన్ని తామే నిర్వహించడం, ఆమె గతించిన వెనుక తనబిడ్డలనే బంధువులకూ అప్పచెప్పక తన భుజాలపై నుంచుకొని వారికి నిత్యక్రమ శిక్షణ, వంట, చదువు చెప్పడం, వైద్యం, రోజూ ఊరికెళ్ళి వైద్య వృత్తిని కొనసాగించడం, వీటికి తోడు వేద విజ్ఞాన పరిశోధన, గ్రంథ రచన కొనసాగించడం, చివరకు తమకే పక్షవాతమొచ్చిన సమయంలోగూడ డాక్టర్లు సైతం ఆశలొదులుకొంటే తమకు తామే చికిత్స చేయించుకోవడం, పిల్లల బాధ్యతను అట్టి సమయంలో గూడా మరొకరిపై వేయక తామే చూచుకోవడం – ఈ

ధైర్యమెందరికుంటుంది? అయితే తమ కుటుంబ సేవ తాను చేసుకోవడంలో గొప్పేముందనిపించవచ్చు. కాని బిడ్డలను కని, వారిని విద్యకు చదువే చెప్పని పాఠశాలలపై విడిచి, వారి శీల నిర్మాణాన్ని, సినిమాలకూ–సమాజానికీ విడిచి, వారి ఆరోగ్యాలను డాక్టర్లకు విడిచి–వేదాది విజ్ఞానానికై కష్టించడానికి కావలసిన మనోబలమే లేక అట్టి ప్రయత్నమే చేయక కూపస్థమండూకం వలె స్వార్థకూపంలో జీవించే తరానికి అర్థం కావడం కష్టమే.

అంతేకాదు. బంధువులలో ఎక్కువ మంది వారితో “అనంతం! నేను చనిపోతే నా వారందరూ నా నగలవరకే పట్టించుకొంటారుగాని నన్ను పట్టించుకోరు. అపుడు నాకు జరిపించవలసినవన్నీ నీవే చేయాలి” అనేవారు. ఆయన అభయమిచ్చి తన మాటను నిలబెట్టుకునేవారు. ఉదాహరణకు ఒక బంధువులామె భయంకరమైన మశూచికంతో మరణించింది. ఆమె కుటుంబీకులు గూడా “మాకు భయం” అంటూ సేవ కూడా చేయలేదు. అందుకీయన పూనుకుంటే ఎందరో సాటివారు “అనంతం! నీకు తల్లిలేని చిన్న బిడ్డలున్నారు. నీవీ రోగికి సేవ చేయడం వలన నీకేమైనా ప్రమాదం జరిగితే వారికి దిక్కెవరు? సాహసం చేయవద్దు, తన్ను మాలిన ధర్మం కూడదు” అన్నారు.“ అని చెప్పి, సకల పరిచర్యలూ – మలమూత్రక్షాళనం దగ్గర్నుంచీ ఆ రోగికాయనే చేశారు. ఆమె మరణిస్తే ఇంట్లోనివారు ఆ శవాన్ని బయటకు పట్టను నిరాకరించారు. ఆయనే శవాన్ని మంచానిక్కట్టి తన వ్యాయామ సౌష్టవంతో బలిష్టమైన బాహువుల మీద బయటకు పట్టారు. ఆయన సాధించిన కండబలానికి అదే సార్థకమని వారి భావం. తను మన ధనాలను నిష్కామ భగవత్సేవ కంకితం చేయడమంటే, ఆర్తులైన వారిలో దైవాన్ని చూచివారి సేవకు తమ శారీరక బలాన్నర్పించడమంటే యిదే కాబోలు!

ఆమె తాలూకు వారు ఆమె వంటినున్న నగలు మాత్రం తీసిమ్మని మా తండ్రిగార్ని కోరారు! మొదట ఆయన కొన్ని మాత్రం తీసిచ్చారు. కాని వారి ఆశకంతు లేకపోవడం, వారి అమానుషత్వం చూచి జగుప్సతో కొన్ని నగలు ఆ దేహానికే వుంచి దహనం చేశారు. నాడు అమావాస్య. మశూచికంతో ఆ సాయంత్రం మరణించిన ఆమె దేహాన్ని రాత్రి గ్రామంలో తెల్లవారే వరకూ వుండానికి వీలు కాదన్నారు. బంధువులు స్మశానానికి శవాన్ని మోయడం భయమన్నారు. ఆయనొక్కరే శవాన్ని మోసుకెళ్ళి దహనం చేసి వచ్చారు. ఆ సంగతి తెలిసి “నాన్నా! మీ మనస్సప్పు డెలావున్నది?” అనడిగితే, “కాలోZస్మిలోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః” అన్న గీతావాక్యం మెదిలింది అన్నారు!

> *“నేను పోతే నా నలుగురు బిడ్డల భారం మీమీద పడుతుందన్న భయమవసరం లేదు. నాకేమీ జరగదు. ముందు నిస్సహాయమురాలైన ఆ రోగికిచ్చిన మాట ప్రకారం సేవ చేయడం ధర్మం, ధర్మాన్ని మాలిన తనం పనికిరాదు”*

“సమలోష్టాశ్మ కాంచనః” – మట్టి గడ్డను, బంగారాన్ని సమంగా చూడగలగడం యోగి యొక్క లక్షణం, పిత్రార్జితమైన ఆస్తినంతా మా తల్లిగారి ఆరోగ్యం కోసం, మా నలుగురి చదువుల కోసం, సంతోషం కోసం కర్పూరంలాగ ఖర్చు చేసేశారు గాని వార్ధక్యంలో తమకోసమని కించిత్తు కూడా దాచుకోలేదు. తల్లి పోయిన బాధ మమ్మల్ని కృంగదీయకుండా వుండాలని మేమేది కోరితే అది కొనిచ్చారు. ఎక్కడికి కోరితే అక్కడికి నలుగురినీ తీసికెళ్ళారు. మాకు జీవితంలో ఉత్తమాశయా లేర్పడడానికి కాశీవంటి ప్రదేశాలలో మా విద్యను కొనసాగించడం – యిలా ఖర్చు చేశారు. ఆస్తిని మా నలుగురికీ రాసిచ్చి, మమ్మల్ని బంధువుల కప్పగించి వారిని మరొక వివాహం చేసుకుని తెరిపిగా జీవించమని ఎందరో సలహా యిచ్చారు. కాని ఆయన “ఆస్తినిస్తే వాళ్ళు పాడు చేసుకోవచ్చు. ఉత్తమ విద్యా సంస్కారాలనిస్తే వారు పాడుచేసుకోలేరు. కనుక ఈ బాధ్యతను నేను నిర్వహించాలి” అని చెప్పి యావదాస్థినీ అందుకు వ్యయం చేసి, అత్యంత శ్రమతో గూడిన వైద్య వృత్తి ద్వారానే జీవనోపాధిని గడిస్తూ, ఆ వృత్తిని ఆయుర్వేదానికీ, యోగ శాస్త్రానికీ, వేదాలకూ కల సమన్వయాన్ని పరిశోధించడానికి సాధనంగా చేపట్టారు. ఆయన సృష్టించిన ‘ఓజని’ అను ఔషధమును లక్షలిచ్చి కొనుక్కోవాలని సింగపూర్, బొంబాయిలలోని శేట్లు ఎంతో ప్రయత్నించారు. కాని ఆయన విద్య నమ్ముకోలేదు.

అతి స్వల్పంగా ఆధ్యాత్మ విద్యకల్గినా, యోగ శక్తి కల్గినా దాని సహాయంతో శిష్య సేకరణ చేయడం, తమ యోగ శక్తులను గురించి భక్తుల చేత ప్రచారం చేయించుకోడం, కీర్తికోసం పాకులాడడం లోకంలో చూస్తాము. కాని అట్టి కీర్తిని నిందతో తుల్యంగా తలచి పరిత్యజించడమే ఉత్తమ త్యాగం. "త్యాగేనై కేన అమృత తత్త్వమానశుః" – త్యాగమొక్క దాని వలననే అమృతత్త్వం కల్గుతుందని వేదం చెబుతుంది. వేదం చెప్పినది ఆయనకు రక్తంలో యిమిడి పోయింది. అన్ని త్యాగాల కంటే కీర్తి త్యాగం కఠినం. అది సన్యాసులనే వదలదని శంకరులు "జటిలో ముండీ లుంచిత కేశః కాషాయాంబర బహుకృత వేషః – తదపి సముంచ త్యాశాపాశః" అంటారు. అన్నింటినీ త్యజించినా ఆశ అనే దాన్ని వదలడం చాలా కష్టమంటారు. "వారి బిడ్డలపై ఎంత ఆశ మమకారాలుంటే జీవితాన్ని వారి కంకితం చేస్తారు?" అనిపిస్తుంది, మమకారాలను త్యజించడం పేరిట బాధ్యతలను తప్పుకోచూచే కపట విరాగి మనస్సుకు. కానీ, బాగా చూస్తే తెలుస్తుంది. బాధ్యతను నిర్వర్తించి మమకారాన్ని త్యజించడం నిజమైన వివేకమని. అదే అసలైన నిష్కామ కర్మాచరణ. ఆయన జీవితం వేద విజ్ఞాన శోధనకంకితం. యజ్ఞమయమైన జీవితాన్ని గడపడమే ఆయన లక్ష్యం. బిడ్డల బాధ్యత ఆ యజ్ఞకార్యంలో భాగం. అందుకే ఆయన తన బిడ్డలను తమతో కూడా తిప్పుకునే వారు కాదు. వృద్ధాప్యంలో సుమారు 80 సంవత్సరాల వరకూ కూడా ప్రయోజకులు, స్వతంత్రులు అయిన తమ బిడ్డలమైన మాతో నివసించలేదు. తమ సంరక్షణ భారం సాధ్యమైనంత వరకూ మాపై పడకూడదని వారి నిర్ణయం. అందుకే ఒక్కరే విజయవాడలో ఒక గదిలో ఉంటూ, తమ వంట తామే చేసుకొంటూ, తమ వేదశోధన సాగించుకున్నారు. బిడ్డలమైన మేము బాధపడకుండా అప్పుడప్పుడు ఆయనే వచ్చి నలుగుర్నీ చూచి వచ్చేవారు. మా కార్యక్రమాలలో నిమగ్నులమై ఆయనను తరచు చూడ సమయం లేని మమ్ములను తమ యిష్టానుసారం, తమ సానుకూలంకోసం మా జీవితాలను మలచుకోమని బలవంతం చేయలేదు. మా పోషణ, శిక్షణలకు జీవితాన్నంతా అంకితం చేసిన ఆయన మా సేవను తమ హక్కుగా కోరక మా జీవితాలను మా అభీష్టాలననుసరించి జీవించడానికి విడిచారు. తాను కష్టించి పండించిన పంటను లోకానికి విడచి తాను పక్కకుతొలగి తమరెక్కల మీద తామే 80వ సంవత్సరం వరకూ జీవించచడమనే దానికంటే త్యాగాన్నూహించడం కష్టం. తమ యోగ శక్తితో, అపూర్వ వైద్య విజ్ఞానంతో ఎంతో విషమమైన రోగాలను తగ్గించి కూడా ఆ కీర్తిని పత్రికలలోకీ, గ్రంథాలలోకీ ఎక్కించుకోలేదు. వార్ధక్యంలో తమ కాధారం కావడానికి ధనాన్ని నిలువ చేసుకోలేదు. అదీ "సమలోష్టాశ్మ కాంచనః" అంటే.

ఇట్టి మహత్తర జీవితానికి తగినట్లున్నది వారి చరమానుభూతి. లోకంలో సద్గురు కృపకోసం ముముక్షువులు పాటుబడటం కన్పిస్తుంది. కాని సద్గురువైన వాడు ఆయన పిలవకనే ఆయనపై కృప చూపి ఆయనలో లీనంకావడం విశేషమే. ఆయన ఏ సత్పురుషునీ పూజింపలేదు, ధ్యానించలేదు. అయినా యీ క్రింది వారి అనుభవం ఎంత విశేషం! ఆ అనుభవాన్ని వారి మాటలలో పొందుపరుస్తాను.

"1975వ సంవత్సరంలో విజయవాడలో ఒకనాటి మధ్యాహ్నం అప్పుడే నేను నిద్రలేచి మంచం మీద కూర్చున్నాను. కఫ్నీ, తెల్లటి తలగుడ్డ ధరించిన శ్రీసాయిబాబా గది తలుపు నెట్టుకొని ప్రవేశించారు. 'ఇది నిజమా, భ్రమా?' అని అర్థం కాక చూస్తూండగా ఆయన వచ్చి మంచంమీద నా ప్రక్కనే కూర్చుని, 'వచ్చాను' అన్నారు. 'ఇదేమిటి? నేను మిమ్మల్ని, పూజించనుగదా! అయినా వ్యాను, భరద్వాజ వుండగా నా దగ్గరకెందుకొచ్చారు?' అన్నాను. 'నాకటువంటి ప్రాముఖ్యతలు లేవు. నాకు రావాలన్పించి వచ్చాను. రావద్దంటావా? నేను వస్తే అభ్యంతరమా?' అన్నారు సాయి. 'నాకేమభ్యంతరం లేదు. మిమ్మల్ని రావద్దనెవరంటారు? మీరాక అందరూ కోరదగినదేగదా!' అన్నాను. ఆయనకు నాపై గల ప్రేమ కాశ్చర్యపోతూ, 'అయితే వచ్చి యేమి చేయాలనుకున్నారు?' అనడిగాను. ఆయనలేచి రెండు చేతులతో నా మెడను చుట్టి, తన రెండు కాళ్ళనూ నా నడుము చుట్టూ వేసి, నన్ను కౌగలించుకొని, 'చూస్తూండు, నేను నీలోకి వచ్చేస్తున్నాను. అక్కడే వుంటాను' అంటూ నాలోకి వెళ్ళిపోయారు. అట్లా 7, 8 రోజులు వరుసగా ప్రతిరోజూ మధ్యాహ్నమదే సమయానికి అదే అనుభవం కల్గింది. ఆ తర్వాత 10 రోజులకూ, 15 రోజులకూ సాయి దర్శన మిస్తుండేవారు. ప్రతిసారి యీ అనుభవమైన తర్వాత నాకెంతో ఆనందంగా వుండేది".



"అపరిమితమైన విశ్వచైతన్యంలో తాను పరిమితుడనన్న భ్రాంతిలో చిక్కడంవల్ల మానవునకు అశాంతి, దు:ఖము కలుగుతున్నాయి. తిరిగి ఆ పరిమితి తొలగి పోవడంతోటే శాంతి ఆనందాలు తనకు సహజమౌతాయి. సరైన ఈ మార్గాన్ని విడిచి ఇతర మార్గాల ద్వారా శాంతి ఆనందాలన్వేషించడమే సంసారం. ఇది కేవలం దు:ఖప్రదం".

**- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

పాదరేణువు

# భరద్వాజ అంటే సాక్షాత్తు పరమేశ్వరుడే!

*గురురూపాలైన గురుబంధువులందరికీ నమస్కరించి మీ మిత్రుడు ఒక సంఘటన గుర్తుకు తెచ్చుకుంటున్నాడు.*

పవిత్రమైన మాఘమాసంలో ఈ సన్నివేశం గుర్తుకురావడం నా పూర్వజన్మ సుకృతం. అందునా రేపు శివరాత్రి. ఆ పవిత్ర దినమున పూజ్య ఆచార్యులు శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్‌లు సాక్షాత్తూ ఆ పరమేశ్వరుని రూపంలో దర్శనమిచ్చిన ఈ లీల నా మదికి జ్ఞప్తికిరావడం ఎంతో ఆనందదాయకం.

అవి నేను డిగ్రీ చదివేరోజులు. పంచారామ క్షేత్రాలలో ఒకటైన సోమేశ్వరాలయం భీమవరంలో వుంది. అక్కడ ఈశ్వరుడు చంద్రుడిచే ప్రతిష్ఠింపబడి, చంద్రకళను అనుసరించి తన శోభను మారుస్తూ భక్తులను అలరిస్తున్న అద్భుతమైన మహాక్షేత్రం. నేను, మన గురుబంధువైన మరొక మిత్రుడు ఆ క్షేత్రం దర్శించడం పరిపాటి. ఒకసారి నా మిత్రునితో నేను యిట్లా అన్నాను - "ఈ శైవ క్షేత్రంలో కూడా భరద్వాజ గురుదేవులు లింగరూపులై అందరి పూజలు అందుకుంటున్నారు". అప్పుడు నా మిత్రుడు (అప్పటికింకా గురుదేవులు గురించి అతనికి గురువు అన్న అభిప్రాయం లేదు) "అదేమిటి! ఒక మనిషిని సాక్షాత్ పరమేశ్వరునితో పోల్చడమా!" అని ఆశ్చర్యచకితుడైయ్యాడు. తనలో తాను యీ విధంగా అనుకున్నాడు, "నా మిత్రుడు ఏమిటి, ఒక మనిషిని

శివరూపంగా భావిస్తున్నాడు?". అప్పుడు జరిగింది ఒక అనిర్వచనీయమైన సంఘటన. ఆ రోజు రాత్రి నా మిత్రుడికి కలలో గర్భగుడిలో గురుదేవుల పటం వున్నట్లు, ఆ పటానికి పూజలు జరుగుతున్నట్లు కనిపించింది.

ఆహా! ఏమి అదృష్టం నా మిత్రుడికి! అలనాడు శ్రీ గురుడు నరకేసరికి తాను, కల్లేశ్వరుడు ఒక్కటేనని నిరూపించిన సంఘటనలా వుంది యీ లీల. ఈ విశ్వమంతా తానైన పూజ్య గురుదేవులకు యీ లీలను ప్రదర్శించడం ఒక లెక్కా! ఈ విషయం గుర్తుకువచ్చినప్పుడు నా కన్నుల వెంట ఆనందాశ్రువులు జారుతూ వుంటాయి. అప్పుడు నాకు శ్రీ గురుచరిత్రలో 52వ అధ్యాయంలో 2వ పేరాలో నామధారకుని ప్రార్థన గుర్తుకు వచ్చింది. అది యీ విధంగా వుంది.

''స్వామీ! అచింత్యులైన మిమ్మెలా ధ్యానించేది? సర్వగతులైన మిమ్ము ఎక్కడికని ఆహ్వానించేది? ఈ విశ్వానికే ఆశ్రయమైన మీకు ఆసనం సమర్పించేదెలా? తీర్థక్షేత్రాలకే పవిత్రత చేకూర్చగల మీ పాద పద్మాలను దేనితో కడిగేది? విశ్వకర్తవు, సర్వకర్తవూ అయిన మీ చేతులకు అర్ఘ్యం సమర్పించేది ఎలా? సప్త సముద్రాలనేగాక యీ విశ్వమంతటినీ కడుపులో దాచుకొన్న మీకు ఆచమనం నేనెలా సమర్పించగలను? శుద్ధసత్త్వస్వరూపులైన మీ స్వరూపమే లోకాలను పావనం చేస్తుంటే, మీకేమని స్నానం చేయించేది? ఆకాశవే శరీరంగా గల మీకు నేను సమర్పించదగిన వస్త్రమేమున్నది? చతుర్ముఖుడైన బ్రహ్మదేవుణ్ణి సృష్టించిన మీకు యజ్ఞసూత్రం వలన కల్గే లాభవేమున్నది? సర్వ జీవుల తాపాన్ని హరించగల మీకు గంధలేపనమేమి చేయగలదు? ఇచ్ఛలే లేని మీకు ఏ పూవ్వు సమర్పించి ప్రీతినొనర్చగలను? స్వయం సంతుష్టులు, ఆత్మానంద స్వరూపులూయైన మీకు నేను సమర్పించదగిన ధూప మెక్కడున్నది? స్వయం ప్రకాశకులు, జ్ఞానజ్యోతి స్వరూపులైన మీకు నేను దీపం సమర్పించడమా? జగత్పోషకులైన మీకు యేమి నైవేద్యం యివ్వగలను? నిత్య సుముఖుడైన మీకు తాంబూలం వలన యేమి ప్రయోజనం? నక్షత్ర గ్రహగోళాదులే మీకు నిత్య నిరాజనాలిస్తూ సర్వజీవుల హృదయాలలోనూ, మరియు విశ్వమందంతటా ప్రణవోచ్ఛారణ కొనసాగిస్తూ మీ మహిమను కీర్తిస్తూంటే మీకు నీరాజనమెలా యివ్వాలో, మిమ్మెలా స్తుతించాలో నాకు తెలియడంలేదు. సర్వగతులైన మీకు ప్రదక్షిణమెలా చేయాలి? ఈ నామరూపాత్మకమైన విశ్వమంతా మీ పాదవే అయివుండగా నేనెక్కడని నమస్కరించేది? నా లోపల, వెలుపలానిండియున్న మీకు యెచ్చటికని ఉద్వాసన చెప్పేది? స్వామీ! దయామయా! విశ్వాధారా! యీ సంసార సముద్రాన్ని భద్రంగా దాటించగల నౌకవంటివారు మీరు. నా పాలిటి శ్రీగురుడు మీరే!"

***ఓం నమో: భరద్వాజాయ నమః***

***అచింత్యా వ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే,***

***సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణే నమః!!***

నామరూప గుణరహితుడగుట వలన చింతింపనలవికానివాడు, రూపము వ్యక్తముకానివాడు, నిర్గుణుడయ్యి గుణములన్నీ తానే అయినవాడు, త్రిగుణములు తానే అగుట వలన త్రిగుణముల చేత చేయబడిన సమస్త జగత్తునకు అధారమైనట్టి బ్రహ్మకు నమస్కారము (అనగా పరబ్రహ్మ స్వరూపుడైన గురువునకు సమస్కారము).

జై సాయి మాస్టర్!



"యావజ్జీవితమూ నాస్తికులుగా వున్నవారుగూడ, నిజమైన జిజ్ఞాసతో ఆయనవైపు దృష్టిసారిస్తే, సాయి సమాధానమిస్తున్నారు. ఇటువంటి నాస్తిక ప్రముఖులు, వెనుకటి తరాలలో గుడిపాటి వెంకటచలం, కె. సభా, త్రిపురనేని గోపిచంద్, గోరాగార్లు. వారిలో మొదటి ముగ్గురూ తమ దృష్టిని సరైన మహనీయులపై సారించి పరివర్తన చెందారు."

**- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

# శ్రీ సాయి దయను చవిచూసిన 'సభా'

*తెలుగు సాహిత్యంలో ప్రజాదరణ పొందిన రచయితలలో శ్రీ కె. సభా ఒకరు. మొదట్లో వీరు నాస్థికులుగా ఉండేవారు. కానీ ఆచార్య భరద్వాజ మహరాజ్ వ్రాసిన "శ్రీ సాయి లీలామృతం" గ్రంధపఠన, శ్రీ సాయీసుని దయ వలన వీరిలో ఆధ్యాత్మికతపై చెదరని ఆశక్తి యేర్పడింది. తమకు శ్రీ సాయి చూపిన లీలను, శ్రీ సాయి లీలామృతము మరియు మాస్టరుగారియొక్క ఇతర రచనలను ప్రశంసిస్తూ వారు రాసిన లేఖను మీతో పంచుకుంటున్నాము.*

ఆత్మీయులు భరద్వాజ గారికి నమస్సులు!

తమ గ్రంథం సాయిలీలామృతాన్ని చదివాను. ఆమూలాగ్రం చదివాను.

ఈ గ్రంథాన్ని పడకపైనుండి జబ్బుతో వుంటూ చదివాను.

ఆ జబ్బు లక్షణాలు అతి విచిత్రాలు. ఆపాదమస్తకం అగ్నిజ్వాలల్లో దహించబడుతున్నట్లు బాధ.. తపన.

మధ్యాహ్నం మెలకువ పూర్తిగాలేని దశలో శ్రీ సాయిబాబాను చూచాను.

వారు టీ అడిగారు.

సాయంకాలం **5** గంటలకు జబ్బు నయమవుతుందన్నారు. ఆ స్వప్నావస్థలో వర్షం వచ్చింది. ఒక పాము వచ్చింది. వారు శ్రీ రమణాశ్రమం వైపు వెడుతున్నారు.

నేను బాగా మేలుకొన్నాను. సాయివలే తలకు తుండుగుడ్డ చుట్టుకొని టీ తెప్పించి నేనే తాగాను.

ఇంతలో వర్షం వచ్చింది నిజంగానే. ఐదింటికి ఆ జబ్బు నయమైంది. **7** గంటలకు విశ్రాంతిగా తిన్నెపై కూర్చున్నప్పుడు పాము వచ్చింది. నేనే కర్రతో కొట్టాను.

ఇవన్నీ జరిగాయి. ఆ స్వప్నంలో ఖాళీగా వెళ్ళిన ఒక పేటిక వాస్తవజగత్తులో కన్పించలేదు.

బాబా వదలివెళ్ళిన తుండుబట్ట కూడా నాకు వాస్తవిక జగత్తులో కన్పించలేదు.అవి వస్తువులు కావటంవల్లనేమో. వీటినంతా నా డైరీలో వ్రాసి వుంచాను. ఒక వ్యాసంలో వివరించాను, కానీ అదియింకా ముద్రించబడలేదు. ఇవన్నీ మీకెప్పుడో వ్రాయాలనుకొన్నాను కానీ యిప్పుడు వ్రాస్తున్నాను.

ఎంతో వృద్ధాప్యంలో ఉన్న మా తల్లి యీ క్షణంలో జబ్బుతో వున్నారు. ఈ విషయాన్ని ఆలోచిస్తూ బాబాను స్మరిస్తూ వుండగా చిరంజీవి శ్రీనివాసులు వచ్చారు.

మీ గ్రంథ పఠనంలో జరిగిన ఈ మహాద్భుతమైన ఉదంతం కరుణామయుడైన సాయిబాబా విలాసం. భగవాన్ రమణుని అనుగ్రహామృతం.

మనం ఎక్కడున్నా ఒకరిలో ఒకరు వున్న కారణంగా ఉత్తర ప్రత్యుత్తరాలపట్ల నాకంత ఆసక్తి వుండటంలేదు.

*మీ మహోద్యమంలో ఈశ్వరుడు వున్నందున అది మహాద్భుత ఫలితాన్నిస్తుంది. విశ్వకళ్యాణదాయకాలైన మీ గ్రంథాలు పవిత్రాత్మలకంటే విలువైనవి. వాటిలోని ప్రత్యక్షరంలోనూ భగవంతుడు సాక్షాత్కరిస్తున్నారు.*


SARADA PEETAM

Bhagavan Street, Vinayakapuram, CHITTOOR, Pincode-517001

K. SABHA

సెలవు. ఈశ్వరోజయతి.
మీ
కె. సభా



"అందరూ ముక్తిపొందిన తరువాత నాకు ముక్తి రావాలని ప్రార్థిస్తున్నాను. అందరూ ముక్తి ధామానికి నడచి పోయే చెక్క వంతెనగా నేను ఉండిపోతే చాలు. చివరి వాడు నన్ను తీసుకుపోతే చాలు"

- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సేకరణ- అలహరి మురళీధర్

# సన్యాసి - సబూరి

***నైమిశారణ్యంలో శ్రీ అఖండానంద సరస్వతి కొందరు సాధువులతో సద్గోష్ఠి జరుపుతున్నారు. అమిత వృద్ధుడైన ఒక సన్యాసి తన గ్రామస్థులు తమ ఆశ్రమ జీవితానికి ఎన్నో కష్టాలు కల్గిస్తున్నారని చెప్పుకున్నాడు.***

శ్రీ అఖండానందులు నవ్వి, "అలా కష్టమనుభవించి క్రమంగా ఓరిమి నేర్చుకోవడానికే భగవంతుడు అలా జరగనిస్తాడని, సాధ్యమైనంత వరకు ఆ బాధలను ఓర్చుకుంటూ భగవంతుణ్ణి స్మరిస్తూ వుండాలి, ఇక చేతకానపుడు భక్తుడైనవాడు ఆ చోట విడిచి పోవాలేగాని దెబ్బకు దెబ్బ తీయకూడదని" చెప్పారు. అధర్మాన్ని ఎదుర్కొని నిగ్రహించడం సంసారుల ధర్మమని, సన్యాసికి తగదనీ చెప్పారు. ఆయన ఎంత చెప్పినా ఆ వృద్ధ సన్యాసి ఊరట చెందలేదు. చివరకు శ్రీ అఖండానంద సరస్వతి తాము మధుర బృందావనంలో సేవించిన 'ఒడియా బాబా' అనే మహాత్ముడి వృత్తాంతం క్లుప్తంగా చెప్పారు. "ఒడియా బాబా దగ్గరకు ఎందరెందరో భక్తులు, శిష్యులు వస్తుండేవారు. వారిలో ముఖ్య శిష్యుడు దర్శనానికి వచ్చే భక్తులను, చివరకు స్వామిని కూడా ఎన్నోరీతుల వేధిస్తుండేవాడు. భక్తులందరూ అతనిని తొలగించమని..... ఎంతో స్వామిని తమ స్వప్రయోజనాల కోసం బాధించసాగారు. మొదటి శిష్యుణ్ణి వారందరూ కలసి తొలగించి ఆయనకు శాంతిని కల్పించినందుకు ఆయన కృతజ్ఞతతో తమ ఇష్టాయిష్టాలకు విధేయులై వుండాలన్నట్లు ప్రవర్తించసాగారు. క్రమంగా స్వామి అసమర్థుడని, తామే వారి రక్షకులమనీ చెప్పుకొనసాగారు. మొదటి శిష్యుడు గూడ తనను వారందరూ కలసి తొలగిస్తుంటే చూస్తూ

వూరుకున్నందుకు స్వామిపై కక్షకట్టి, ఆయన తనకు క్షమాపణ చెప్పుకొని పిలిపించుకోకుంటే ఆయనను హతమారుస్తానని నలుగురితోనూ శపథం చేయసాగాడు. మొదట కొద్దిరోజులు అతడిపై కినుకతో భక్తులు ఆర్భాటంగా స్వామికి కాపలా వున్నారు. కాని క్రమంగా వారి భక్తి శ్రద్ధలు సన్నగిల్లి ఎవరి దారి వారు చూచుకోసాగారు. వారికి ఆశీస్సులు అవసరమైనపుడు తప్ప ఆయనను దర్శించేవారు కారు. అది అవకాశంగా తీసుకుని మొదటి శిష్యుడు స్వామి యొక్క ముఖ్య శిష్యుణ్ణి మంచి చేసుకొని తిరిగి ఆశ్రమానికి రాసాగాడు. అది గమనించిన కొందరు భక్తులు, 'స్వామీ – యీ దుష్టుణ్ణి మరలా దగ్గరకు చేరుస్తున్నారేమి?' అని అడిగారు. స్వామి 'సాధువులమైన ఎవరినీ రమ్మనము, పొమ్మనము. ఎవరెవరికి మాతో ఎలాటి ఋణానుబంధమున్నదో దానిని నెరవేర్చడానికి వచ్చి ఆ కాస్తా పూర్తి చేసుకుని పోతారు. అవన్నీ చూచుకోవలసింది మీరు. మాకీ దేహమున్నాపోయినా ఒక్కటే. దేహమున్నంతవరకూ భగవంతునికి, జీవులకూ చేతనైన మేరకు సేవ చేయడం ఒక్కటే మా విధి' అని మాత్రమే అన్నారు.

నేను అది కనిపెట్టి చాలారోజులు స్వామికి కాపలా వున్నాను. ఒక రోజు తీవ్రమైన జ్వరంతో నేను లేవలేకుండా పడివున్నాను. స్వామి సేవకులిద్దరూ నన్నేమీ పట్టించుకోలేదు. నేను కూడ స్వామి సన్నిధిలో ఒక స్థానమేర్పరచుకోవడం వారికి యిష్టం లేదు. కేవలం స్వామిని చూచి మాత్రమే నన్ను ఉపేక్షించారు. నాటి రాత్రి శ్రీ ఒడియా బాబా నాకు స్వయంగా జావకాచి యిచ్చారు. నేను కంటనీరు పెట్టి, 'స్వామీ! నేను మీకు సేవ చేయవల్సింది పోయి, మీ చేత సేవ చేయించుకోవలసి వచ్చింది. నేనెక్కడికైనా వెళ్ళిపోతాను' అన్నాను. స్వామి అనునయంగా నా కన్నీరు తుడిచి, నాకు రగ్గు కప్పి, తల, వీపు నిమిరి, 'నేను తల్లిని, నీవు బిడ్డవు. అవసరమొచ్చినప్పుడు నేను గూడ నీకు పరిచర్యలు చేయవచ్చు. ఇక నుండి నీకిలాంటి బాధలుండవులే. ఎప్పుడూ నా ప్రేమను యిలా చల్లగా అనుభవిస్తుండవచ్చులే. ఈ రోజుకు హాయిగా విశ్రాంతి తీసుకో. జరుగవలసినవన్నీ పరమదయాళువైన ఆ పరమేశ్వరుడే చూచుకుంటాడు' అని చెప్పి తమ మఠం లోపలి భాగంలో పడుకున్నారు. రోజూ తలుపులు మూసుకుని పడుకునేవారు. ఆ రోజు అవసరమైనప్పుడు నన్ను పరామర్శించడానికి కాబోలు, తలుపులు బోర్లా తెరుచుకుని పడుకున్నారు. నాకు ఆ రాత్రంతా ఒళ్ళు తెలియకుండా నిద్రపట్టింది. మెలుకువ

> *'సాధువులమైన ఎవరినీ రమ్మనము, పొమ్మనము. ఎవరెవరికి మాతో ఎలాటి ఋణానుబంధమున్నదో దానిని నెరవేర్చడానికి వచ్చి ఆ కాస్తా పూర్తి చేసుకుని పోతారు. అవన్నీ చూచుకోవలసింది మీరు. మాకీ దేహమున్నాపోయినా ఒక్కటే. దేహమున్నంతవరకూ భగవంతునికి, జీవులకూ చేతనైన మేరకు సేవ చేయడం ఒక్కటే మా విధి'*

వచ్చేసరికి బాగా ఎండెక్కి పోయింది. ఆశ్రమమంతా జనంతో కిటకిటలాడి పోతున్నది. లేచి చూద్దును కదా, నాటి అర్ధరాత్రి ఆ ప్రథమ శిష్యుడు స్వామిని హతమార్చి పరారయి పోయాడు. స్వామి అన్న మాటలకు అర్థం అప్పుడు గానీ నాకు తెలియలేదు. అంతకు ముందు ఆ దుష్టుడు ఒకటి రెండుసార్లు అలాంటి ప్రయత్నం చేశాడు. మొదటిసారి భక్తులే కనిపెట్టి అతడికి దేహశుద్ధి చేసి పంపించారు. పోలీసు ఫిర్యాదు చేస్తామని బెదిరించి విడిచిపెట్టారు. రెండవసారి కూడా అతనిని పట్టుకొని పోలీసులకు ఫిర్యాదు చేశారు గూడా. కాని ఎవరెంత చేసినా జరుగవలసింది జరిగిపోయింది. మహాత్ములకు, సాధువులకు, యుద్ధవీరులకూ ఒక్కటే ధర్మం. పట్టు విడవకుండా, వెనుతిరగకుండా స్వధర్మమాచరించడము ఒక్కటే కర్తవ్యం. ఎన్ని కష్టాలు వచ్చినా, చివరకు మృత్యువే ఎదురైనా పట్టువిడవని వారే సాధనలో సఫలులవుతారు. ఒడియా బాబా తమను రక్షించుకోవడానికి తమ శక్తిని కించిత్తు గూడ ఉపయోగించ లేదు. వారి దేహం వున్నంత వరకు సర్వజీవులకు నిర్విరామంగా హితం చేయడమొక్కటే వారికి సార్ధకత. అంతటి మహత్తరమైన వారి జీవితం యొక్క విలువను గుర్తించి మన యింటిలోని దీపంగా సంరక్షించు కోవలసింది వారి భక్తులే. దీనితో పోలిస్తే మీకు వచ్చిన కష్టము ఎంతటిది కనుక?'' అన్నారు శ్రీ అఖండానంద స్వామి. అంతటితో వృద్ధసన్యాసి ఎంతో ఊరట చెందాడు.



"సరియైన ఆధ్యాత్మికత సమాజంలో స్వార్థాన్నీ, డబ్బును, విలాసవస్తువులను కూడబెట్టుకునే గుణాన్ని ఎవరికివారు జయించేలా చేస్తుంది. అంటే మెదడులో ఆనందానుభూతి కేంద్రం మేల్కొననిదే ఇది సాధ్యం కాదని తేలుతుంది. ఆధ్యాత్మికత వినా స్వార్థాన్ని నిర్మూలించడం వీలుగాదని, సమాజాన్ని యదార్థంగా సంస్కరించ సాధ్యం కాదనీ మెదడుగూర్చి చేయబడిన శాస్త్రీయ పరిశోధనలు నిరూపిస్తాయి."

**- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

సమిత్పాణీ

# శాస్త్రానుసారిణే నమః

***మా*** *నవజీవితాన్ని సార్థకం చేసుకోవడానికి అవసరమైన మెలకువలను శాస్త్రాల ద్వారా తెలుసుకొని* ***సామాన్యులనుసరించాలని పెద్దలు విధించారు. సామాన్యులకు యిది తప్పనిసరి. కానీ శాస్త్రాలన్నీ కూడా మహనీయులను అనుసరిస్తున్నాయి.*** వారు చెప్పిన సత్య స్వరూపాలైన వేదాలకు అణిగిమణిగి సేవ చేస్తాయి. నా హృదయ సామ్రాజ్యానికి సామ్రాట్టు, యావత్ విశ్వానికీ సద్గురువు అయిన భరద్వాజ మహరాజ్ - అంతటి మహనీయులు. సాక్షాత్తు పరమాత్మ. అందుకే "శాస్త్రానుసారిణే నమః"- ఎవరినైతే శాస్త్రములు అనుసరించి తరిస్తాయో అట్టి పరబ్రహ్మ స్వరూపానికి నమస్కారము, అనే ఈ మంత్రము ఆయనకు చక్కగా సరిపోతుంది.

ఆయన నుండి వెలువడిన ప్రతీ మాటను, తమ ప్రతీ చేతను, ప్రతీ కదలికను సకల శాస్త్రాలూ అనుసరిస్తాయి. ఆయన శాస్త్ర బద్ధుడు కాదు. శాస్త్రాలే ఆయనయందు నిబద్ధమై తమ ఉనికిని నిలుపుకుంటాయి. ఆయనే ఒకసారి అన్నారు, "నేను చెప్పే ప్రతి మాటకు, చేసే ప్రతీ చేతకూ శాస్త్రాలలోను, ఉపనిషత్తులలోను, భగవద్గీతలోనూ ప్రమాణం వుంటుంది. కావాలంటే చూసుకో!" అని.

"శాస్త్రాలు చెప్పినవి మీరు అనుసరిస్తారా? భగవద్గీతలో చెప్పిన దాన్ని మీరు అనుసరిస్తారా?" అని ఒకరు ఆయన్ని అడిగితే ఆయన "ప్రతీ నిముషం అవన్నీ నాకు గుర్తుకురావు, ప్రతీ క్షణమూ సర్వత్రా

నిండి వున్న సాయినే చూస్తూ వుంటాను. ఆయన చెప్పినవి చేసుకుంటూ పోతాను. అంతే" అని. ఆయనే మరోసారి మరో భక్తునితో గంభీరంగా "నేనంటూ ధర్మం తప్పితే ఇటు సూర్యుడు అటు పొడుస్తాడు. గుర్తుపెట్టుకో" అన్నారు.

నిజానికి ఏ పరమాత్మ తత్త్వమైతే శ్రీ దత్త తత్త్వముగా ఎన్నో యుగాలనుండి ఎందరో మహనీయుల రూపంలో మానవజాతిని రక్షించి ఉద్ధరిస్తున్నదో, అట్టి దత్త తత్త్వమే ఆయన. ఆయనను వర్ణించ యత్నించి వేదాలే విఫలమవుతున్నాయి. ఆయనను అనుసరించి మానవాళిని ఆయన వద్దకు చేర్చే తమ ప్రయత్నంలో శాస్త్రాలు తమను తాము సత్కరించుకుంటున్నాయి.

అనాదిగా వస్తున్న సనాతన సాంప్రదాయ శాస్త్రాలే కాక, ఆధునిక విజ్ఞాన శాస్త్రం కుడా ఆయనను అనుసరించవలసినదే.

ఆయన అవతార కార్యంలో ఒక కీలక భాగం, సనాతన ఆధ్యాత్మిక విద్యకు, ఆధునిక విజ్ఞాన శాస్త్రానికీ సమన్వయాన్ని అందించడం. ఈ మహత్కార్యంలో తన వంతు సేవగా ఆధునిక విజ్ఞాన శాస్త్రం కూడా- పరిమితులైన శాస్త్రజ్ఞులు గుర్తించలేకున్నా - ఆయనను అనుసరించి సేవించుకుంటున్నదా అనిపిస్తుంది. దీనికి "ఆక్సిటోసిన్" (Oxytocin) ఉదంతం ఒక ఉదాహరణ.

పాల్ జాక్ (Paul Zak) అను శాస్త్రవేత్త ఎన్నో సంవత్సరాలు కష్టించి పరిశోధించి మానవుని నైతికతకూ, సహృదయతకూ మూల కారణం మొదడులోని ఆక్సిటోసిన్ అనే పదార్థ నిష్పత్తి అని కనుగొన్నాడు. తగినంత పాళ్ళలో మెదడులో ఆక్సిటోసిన్ ఉత్పన్నమైతే మానవుడు నీతిమంతుడుగాను, సహృదయుడిగాను ప్రవర్తిస్తాడని ఆయన వివరిస్తారు.

దీనికి నిరూపణగా చిన్న spray రూపంలో ఆక్సిటోసిన్ మందును ఎందరో వ్యక్తులకు (అనేక రంగాల వారికి, వయసుల వారికి) యిచ్చి వారిని పీల్చమన్నారు. అప్పుడు వారిపై అనేక పరిశోధనలు జరిపి వారి ప్రవర్తనలోని నైతికతను లెక్క కట్టారు. వారు కనుగొన్నదేమంటే అలా పీల్చిన వారిలో 95% శాతం మంది మామూలుకంటే ఎక్కువగా యితరుల పట్ల ( కొత్తవారి పట్ల సైతం) నమ్మకాన్ని ప్రదర్శించారని, 17-50% శాతం వరకు వ్యక్తులు యితరుల శ్రేయస్సు కొరకు గొప్ప త్యాగాలకు సిద్ధపడ్డారని, ఎంతో నమ్మకాన్ని, సహృదయతను కనబర్చారనీ కనుగొన్నాడు. అయితే "మానవులలో సహజంగా ఆక్సిటోసిన్ శాతం పెంచటం ఎలా?" అని తమ పరిశోధనలు కొనసాగించారు Paul Zak. ప్రార్థన, భజన, నిర్మాణాత్మకమైన క్రీడలు నిర్మాణాత్మకమైన సామూహిక కార్యక్రమాలు ఆక్సిటోసిన్‌ని మొదడులో మరింతగా ఉత్పన్నం అయ్యేలా చేస్తాయని కనుగొన్నారు.

1975 నుంచే పూజ్య గురుదేవులు భరద్వాజ మహరాజ్ శ్రీ సాయి తత్త్వ ప్రచారానికి సత్సంగాలను ప్రధాన సాధనంగా ఏర్పరిచారు. సత్సంగం అంటే ఎలా చేసుకోవాలో కూడా ఆయన వివరించారు. సామూహికంగా అందరం ఒకచోట చేరి శ్రీ సాయి లీలలను శ్రవణం చేయాలనీ, తర్వాత ఆయన గొప్పతనాన్ని స్మరిస్తూ భజన చేయాలనీ, ఆ భజన మనలో కలిగించే ప్రశాంతతను చెదరనివ్వకుండా అదే సాయి ధ్యాసలో అందరూ ఇళ్ళకు చేరాలనీ ఆయన ఆదేశించారు. అంతేకాక, సత్సంగ మందిరంలో అన్యమైన విషయాలను రానివ్వరాదనీ, ఎదుట పటం రూపంలో సాక్షాత్తు శ్రీ సాయియే కొలువై వున్నారని గుర్తించాలనీ, ఆ గుర్తింపును చెదరనివ్వకుండా గుర్తుంచుకోవాలని

> ***శాస్త్రాలే ఆయనయందు నిబద్ధమై తమ ఉనికిని నిలుపుకుంటాయి. ఆయనే ఒకసారి అన్నారు, "నేను చెప్పే ప్రతి మాటకు, చేసే ప్రతీ చేతకూ శాస్త్రాలలోను, ఉపనిషత్తులలోను, భగవద్గీతలోనూ ప్రమాణం వుంటుంది. కావాలంటే చూసుకో!"***

అన్నారు.

ఒక్కసారి ఆలోచించండి! "శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాధ మహరాజ్ కీ జై" అనే ప్రార్ధనతో సత్సంగం మొదలవుతుంది. ఆ ప్రార్ధనను మూడు సార్లు ఉచ్ఛరించమని చెప్పారు. రెండవ ఉచ్ఛారణకు మెదడులో ఆక్సిటోసిన్ ఉత్పన్నమవుతుంది. భయమూ, ఆందోళన, అనుమానమూ మొదలైన వికారాలతో మూసుకు పోయిన మనస్సు కొంతమేరకు ( ప్రార్ధనా బలాన్ని బట్టి) అద్భుతమైన శ్రీ సాయి మహిమను విశ్వసించడానికి సహృదయతతో సన్నద్ధమవుతుంది. అట్టి మనస్సుకు అన్యమైన వికారాలను తిరిగి అంటించక (ఇతర విషయాలు ప్రస్తావించక) వెంటనే శ్రీ సాయి చరిత్రను, ఇతర మహనీయుల చరిత్రలను, బోధలను అందించడం జరుగుతుంది. వాటి ద్వారా ఉత్తమ ధర్మ సూక్ష్మాలను, నైతిక విలువలనూ అలా సన్నద్ధంగా వున్న మనస్సు స్వీకరిస్తుంది. అభ్యాస దోషం వలన అట్టి బోధను సంపూర్ణంగా స్వీకరించలేక, అలాగని విడువలేక వున్న మనస్సును వెంటనే భజన ఆకట్టుకుంటుంది. మరింత ఆక్సిటోసిన్ ఉత్పన్నమవుతుంది. మనసున మరింత సహృదయత పాదుకుంటుంది. అప్పుడు ఈ ధర్మ సూక్ష్మాలు మనసున మరింత లోతుగా పాదుకుంటాయి.

దీనినే మరోలా చెప్పాలంటే ఒక మొక్కను మనం ఎలా నాటుతామో చూడండి. నేలను కొద్దిగా సవరించి, శుద్ధి చేస్తాము. అందులో ముందుగానే సిద్ధం చేసుకున్న (నీటితో తడిపిన నారు మొక్కను) చిన్న మొక్కను వుంచుతాము. చక్కగా దానిని నిలబెట్టి మంచి సారవంతమైన మట్టిని ఆ మొక్క వేరు చుట్టూరా వుంచి అప్పుడు మరోసారి, మరిన్ని నీళ్ళతో తడుపుతాము. అప్పుడు ఆ మొక్క చక్కగా ప్రతిష్టించబడుతుంది. అలానే మనస్సును మొదట సాయినామ జయకారంతోనూ, సాయినాధులు ఉన్నారన్న గుర్తింపుతోనూ పరిశుద్ధం చేసుకుంటాము. లీలల, బోధల రూపంలో చక్కగా ప్రస్ఫుటమైన ఆధ్యాత్మిక ధర్మ సూక్ష్మాలను అట్టి మనస్సులో నిలుపుతామన్న మాట. తరువాత భజన అన్న అమృతంతో ఆ మనస్సును తడిపి ఉత్తమమైన సూత్రాలను మనస్సులో ప్రతిష్ఠ చేసుకుంటామన్నమాట.

శ్రీ సాయినాధుని నామంతో భజన పూర్తయ్యేసరికి మెదడులో ఆక్సిటోసిన్ నిష్పత్తి తారాస్థాయికి చేరుకుంటుంది. అప్పటి దాకా విన్న

> *"ఇకపై సాయి నామం విన్నా, భజన విన్నా లేక మరేవిధంగానైనా సాయి స్ఫురణకు రాగానే ఈ నైతిక విలువలన్నీ జ్ఞాపకం వస్తాయి. మెదడు ఆక్సిటోసిన్‌ను అంతగానే విడుదల చేస్తుంది. భక్తుడు అప్రయత్నంగా ధర్మపరుడూ, సహృదయుడుగా ప్రవర్తిస్తాడు.*

శ్రీ సాయి బోధలను నిలుపుకుని అట్టి మనస్సు మామూలు ప్రపంచాన్ని ఎదుర్కుంటుంది. ఇతర విషయాలను రానివ్వక, అట్టి మనోస్థితిని నిలుపుకుని ఇళ్ళకు చేరాలని సూచించారు గురుదేవులు. తద్వారా శ్రీ సాయి బోధల దృష్ట్యా సహృదయతతో ఈ ప్రపంచాన్ని మనస్సు ఆకళింపు చేసుకుంటుంది. ప్రపంచంలో వుంటూనే శ్రీ సాయిని మరువకుండటం అలవాటు చేసుకుంటుంది.

తిరిగి తిరిగి ప్రతీ రోజు యిలాగే జరగడం మూలాన అట్టి ధర్మ ప్రవృత్తి మరింత బలంగా భక్తుని మనస్సులో స్థాపించబడుతుంది. Skinner అనే మనస్తత్వ శాస్త్రవేత్త కనుగొన్నట్లు, "ఇకపై సాయి నామం విన్నా, భజన విన్నా లేక మరేవిధంగానైనా సాయి స్ఫురణకు రాగానే ఈ నైతిక విలువలన్నీ జ్ఞాపకం వస్తాయి. మెదడు ఆక్సిటోసిన్‌ను అంతగానే విడుదల చేస్తుంది. భక్తుడు అప్రయత్నంగా ధర్మపరుడూ, సహృదయుడుగా ప్రవర్తిస్తాడు. ఎందరు ఇలాంటి సాధనను అభ్యసిస్తారో, అందరిలోనూ యిలాంటి మార్పు కలుగుతుంది. సమాజంలో ధర్మం నిలబడుతుంది. అంతమేరకు

సమాజంలో అవినీతి అంతరిస్తుంది.

“చూడండి! మాస్టర్ చెప్పిన విధానం ఎంత శాస్త్రీయమో!” అంటారేమో! కాదు. మాస్టర్ చెప్పింది సత్యము. దానిని ధృవపరచి ఆధునిక శాస్త్రము ఆయనకు సేవ చేసుకుంటుంది. అంతే.

పాల్ జాక్ తమ పరిశోధనలో ఒక విచిత్రమైన సన్నివేశాన్ని ఎదుర్కొన్నారు. ఆక్సిటోసిన్‌ను ఎంతగా పీల్చినా ఒక 5% శాతం మందిలో మాత్రం ఎట్టి మార్పు కనిపించలేదట. పరిశోధించగా తెలిసినదేమంటే అట్టివారు, చిన్నతనంలో హింసింపబడటమో, జీవితంలో దారుణంగా మోసపోవటమో, చిన్నతనంలో నిర్మాణాత్మకమైన ఆటలు ఆడక పొట్టకూటి చదువులలో మునిగిపోవటమో జరిగిన వారట.

ఆచార్యులు చిన్నతనం నుంచి చక్కటి వ్యాయామం, ఆటలు అవసరమని నొక్కి చెప్పారు. చక్కని పెంపకం, చిన్నతనం నుంచే ధర్మ ప్రబోధం జరగనిదే సమాజంలో, మానవ జాతిలోనూ మార్పు రాజాలదనీ, అలా చేయగలగాలంటే పెద్దలు ప్రత్యేక ప్రయత్నం చేయాలనీ, సత్సంగమూ, భజన, పారాయణ మొ॥న సాధనల ద్వారా తమలో నైతికతను, సహృదయతనూ పెంచుకోవాలనీ, అట్టివి పిల్లలకు చిన్నతనం నుంచే అలవర్చాలనీ చెప్పారు. ఎందరో మహనీయుల రూపంలో, ఎన్నో యుగాల నుండి దేశ కాల పరిస్థితులననుసరించి ఆయన ఈ విషయాలనే తిరిగి తిరిగి చెప్తూ వస్తున్నారు. దానిని పెడచెవిన పెట్టిన సమాజము తనను తాను వంచించుకుంటున్నది. భవితవ్యాన్ని తగలబెట్టుకుంటున్నది. అజ్ఞానంలో, అవినీతిలో నిండా మునుగుతున్నది.

1938 అక్టోబరు 30న, ఈ శరీరాన్ని ధరించి, ఆయన మానవజాతిని రక్షించి ఉద్ధరించే తమ కార్యక్రమాన్ని కొనసాగించారు. 1989 ఏప్రిల్ 12న, తమ దివ్య మంగళ విగ్రహాన్ని, భక్తులకు ప్రసాదించి నేటికీ తమ కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నారు. ఆయన బోధల రూపంలో మానవాళిని రక్షించి ఉద్ధరిస్తున్నారు. ఆశ, దు:ఖ వ్యామోహాలలో చిక్కుకుని చుక్కైనా ఆక్సిటోసిన్ లేని ఎడారి మైదానాల్లాంటి మనస్సులకు “ఆయన ఇక లేరు” అనిపించవచ్చేమో గాని శాస్త్ర పురుషునికి అట్టి అవివేకం లేదు.

*ఆధునిక విజ్ఞాన శాస్త్ర రూపంలో శాస్త్ర పురుషుడు ఆ పరమ పురుషుని పాదాలకు తన నిత్య సేవను కొనసాగిస్తున్నాడు. ఎప్పటికీ కొనసాగిస్తూనే ఉంటాడు. Paul Zak వంటి శాస్త్రవేత్తల రూపంలో ఇకనైనా కళ్ళు తెరవమని మానవజాతిని తిరిగి తిరిగి హెచ్చరిస్తున్నాడు.*

ఆధునిక విజ్ఞాన శాస్త్ర రూపంలో శాస్త్ర పురుషుడు ఆ పరమ పురుషుని పాదాలకు తన నిత్య సేవను కొనసాగిస్తున్నాడు. ఎప్పటికీ కొనసాగిస్తూనే ఉంటాడు. Paul Zak వంటి శాస్త్రవేత్తల రూపంలో ఇకనైనా కళ్ళు తెరవమని మానవజాతిని తిరిగి తిరిగి హెచ్చరిస్తున్నాడు.

ఇప్పటి మన కర్తవ్యం ఒక్కటే. పరాత్పరుడు, భక్త వత్సలుడు, దయా సముద్రుడు, దత్త స్వరూపుడూ అయిన భరద్వాజ్ మహరాజ్ చెప్పిన బోధలను త్రికరణ శుద్ధిగా అనుసరించి ఆచరించడం. మన మనస్సులకు తోచినట్లు సత్సంగాలను తలక్రిందులుగా జరుపుకోవడం మాని ఆయన ఆదేశించినట్లు అక్షరాలా అనుసరించడం మొదలు పెట్టాలి. అలానే ఆయన ఇతర బోధలను కూడా అనుసరించడానికి ప్రయత్నించాలి. మానవ జాతి సముద్ధరణకు అంతటి సూత్రాలను బోధించి ఆయన మనపై చూపిన కరుణకు మన మనస్సులు కృతజ్ఞతతో కరిగి పోవాలి. వారి దయ వలన, మన మెదడులలో తగినంత ఆక్సిటోసిన్ ఉత్పన్నమవ్వాలని, మనస్సులలో వివేకము, సహృదయతా, ధర్మమూ నిలబడాలని మనసారా ఆయనను ప్రార్థిస్తున్నాను.

జై సాయి మాస్టర్!



"ఇప్పటి వరకు నేను ఆధ్యాత్మిక సాధనకు ఉపయోగపడ్డాను, ఇకనుండి ఇహ, పర సాధనకు, శ్రేయస్సుకు ఉపయోగ పడ్తాను".

**- ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ** *(వారి వివాహ సందర్భంలో తమ విద్యార్థి శ్రీ ఎ. భక్తవత్సలంతో )*

# జగత్కళ్యాణ మహోత్సవము

**పి. వాట్సన్**

***దక్షిణభారతంలో శ్రీసాయినాధుని కొలువు వాడవాడలా వ్యాపించి, ఆచంద్రార్కము నిలిచిపోవటానికి నాందిపలికిన రోజు చరిత్రలో ఒకటివుంది. అదే మార్చి 6, పూజ్యశ్రీ భరద్వాజ 'మాస్టరు' గారికి, పూజ్యశ్రీ అలివేలు మంగమ్మగారికి కళ్యాణము జరిగినరోజు.*** అప్పటికే 1963లో శ్రీ సాయినాధుని మందిరంలో ఆధ్యాత్మికానుభూతిని పొందిన మాస్టరుగారు, మొదటనుంచీ తామనుకున్నట్లుగానే అరణ్యాలకో, హిమాలయాలకో వెళ్ళిపోయి తపస్సులో వుండిపోదామనుకున్నారట. ఇటు అలివేలు మంగమ్మగారు జిల్లెళ్ళమూడి అమ్మ సేవలో పూర్తిగా నిమగ్నమయివున్నారు. వారికి, వీరికీ వేరే ధ్యాసే లేదు. కానీ జనులపై భగవత్కృప ఎలావుందో చూడండి! శ్రీరామకృష్ణులు వివేకానందుని "నీ జీవితాశయము ఏమిటి?" అని అడుగుతారు. ఈయన "నిరంతరం సమాధి స్థితుడనవటమే" అన్నారు. శ్రీ రామకృష్ణులు బాధతో, "అంతేనా! నీవు దానికెప్పడో అతీతుడవు. జీవులను ఉద్ధరించేకార్యం గురించి ఆలోచించు. అది ఆలోచించుకొని రా!" అన్నారట. పూజ్య మాష్టరుగారు దర్శించిన విశిష్టమయిన మహాత్ములయిన శ్రీపాకాలపాటి గురువుగారు, శ్రీ చీరాలస్వామిగారు,

వారిని ఆదేశించి, పరిపరి విధముల నచ్చజెప్పి వివాహానికి ఒప్పించటం వెనుక లోకకళ్యాణ కార్యమే యిమిడి వున్నది. అలా మహాత్ముల కోరికలపై, శ్రీ సాయినాధుల నిదర్శన ఆశీస్సులతో 1975, మార్చి 6 గురువారం రోజున వారిరువురికీ కళ్యాణం జరిగింది. విశ్వామిత్రులవారు, తుంటరులైన ఒకరిద్దరు రాక్షసులను సంహరించిన శ్రీరాములవారికి అదే పర్యటనలో వివాహాన్ని నిశ్చయించి లోక కళ్యాణ కార్యానికే పునాది వేసారు. ఇంకా ఎందరో ముష్కరులు, వానరులు, నరులు ఉద్ధరింపబడవలసివున్నది. అదే శ్రీరామావతారకార్యము కదా!

జీవులనుద్ధరించడమే అవతారకార్యమైన దత్తావతారమే శ్రీ సాయినాధులు. వారి ప్రత్యక్ష సాన్నిధ్యాన్ని అనుభవించిన ఉపాసనీబాబా, మెహర్‌బాబా వంటి వారుకూడా చేపట్టని శ్రీసాయి లీలా స్వరూప ప్రచారాన్ని భుజానికెత్తుకుని, ఊరూరా తిరిగి వారిని జనుల హృదయాలలో నిలిపినవారు శ్రీ భరద్వాజ గురుదేవులు. వారి అవతార కార్యానికి అన్ని విధాలా సహకరించి ద్విగుణీకరింప జేసినవారు అలివేలు మంగమ్మ తల్లి. ఈనాడు యిన్ని సాయిమందిరాలు, సాయిచరిత్ర పారాయణలు, సత్సంగాలు జరుగుతూ ఎందరో శాంత మనస్కులై ఆరోగ్యము, సిరిసంపదలు, భక్తి, జ్ఞాన, వైరాగ్యాలనే ఇహపర శ్రేయస్సులను పొందటానికంతటికీ ఈ కళ్యాణ మహోత్సవమే మొదలు.

హైదరాబాద్‌లో అమ్మగారు నివసిస్తున్న నాగోలులోనూ, పూజ్య గురుదేవులు ఎంతోకాలం నివసించిన ఒంగోలు పట్టణంలో వారి గృహమునందు ఈ ఉత్సవానికి భక్తులు ఏర్పాట్లు చేసుకున్నారు. నాగోలులో దత్తాత్రేయులు, బాబా, మాస్టర్‌గార్ల పటాలను, ఒంగోలులో మాస్టర్ దివ్య జననిలు వున్న పెద్ద పటాన్ని పూలతో స్టేజీలపై అలంకరించి పూజించుకున్నారు. ఇంటర్నెట్ ద్వారా ప్రపంచమంతటా ఈ కార్యక్రమాన్ని చూడటానికి ఏర్పాటు చేశారు. ఒంగోలులో ప్రొజెక్టర్, స్క్రీన్‌లతో కనులవిందుగా చూసే ఏర్పాటు చేశారు. శ్రీసాయిమాస్టర్ భక్తులు, అనంత భరద్వాజ గురుకుల విద్యార్థులు అందరూ ఆశీనులైనారు.

శ్రీసాయినాధులు, వారి ప్రతిరూపమైన భరద్వాజుల నామాలతో భక్తులు 'ఓం సాయినాధజై!' 'గురుభరద్వాజ జై' అని భజన చేయసాగారు. ఇంతలో దివ్యజనని అలివేలు మంగమ్మ భక్తులు ఆహ్వానిస్తూ తోడ్కొనిరాగా వేంచేశారు. అందరు జయంకారాలతో నమస్కరించి, భజన చేయసాగారు.

బాబుగారు అందరికీ అభివాదం తెలిపి, ఈ రోజు యొుక్క విశిష్టతను, ఈ రోజును సద్వినియోగం చేసుకోవలసిన విధానాన్ని తెలుపుతూ ప్రసంగించారు.

అంతటా నిండి వున్న చైతన్యమే గురువు, అట్టి సత్యాన్ని దర్శించడానికి మనకు జన్మను, శరీరాన్ని, పోషణను అందించే ఈ ప్రకృతి స్వరూపమే గురుపత్ని. ఈ పర్వదినాన మనం గుర్తుంచుకోవలసిన సత్యాలు యివే. గురుపత్ని అంటే ఈ స్టేజీ మీద కూర్చున్న రూపమేకాదు. దివ్యజనని అయిన ప్రకృతి స్వరూపమే ఆమె. ఇది అర్థం చేసుకొని అనుష్ఠించకపోతే మనం వారి కరుణను, వారు మనకివ్వాలనుకున్న జ్ఞాన ఫలాన్ని పొందలేకపోతాము. ఈ పర్వదినము నుండి అలా అభ్యసించే తరిద్దాము అని తెలియజేసారు.

గురుభక్తులు మళ్ళీ భజన ప్రారంభించారు. శ్రావ్యంగా, భక్తితో జరుగుతున్న భజన హృదయాలను తన్మయత్వంతో నింపుతున్నది. గురుపత్ని అయిన అమ్మగారు ధ్యాన నిమగ్నులై తమ ప్రకృతి స్వరూపము వలె నిండైన రూపంతో కరుణ వెదజల్లుతున్నారు.

బాబుగారు చెప్పిన విషయాలు గుర్తుకు వస్తున్నాయి. దివ్య ప్రసంగము. గురువు, గురుపత్నిల పట్ల సరయైన అవగాహన. ఆ ధ్యాస నిలుపుకొనే సాధన. దాని ద్వారా నిష్ఠ, సచ్ఛీలత, తద్వారా సర్వుల శ్రేయస్సు, ఎంతగొప్ప అవకాశము! కావలసిందల్లా సరియైన దృక్పథము, ధ్యాస, అనవసరమైన విషయాలు వదిలివేసి, వారిపట్ల అటువంటి శరణాగతి చెందటమే. సుఖశాంతుల కోసం ఏ కష్టాలూ పడనవసరంలేదు, ఏ గడపలూ తొక్కనవసరం లేదు, లౌకికులవలె చిందులు వేయనవసరంలేదు. 'అడుసు తొక్కగ నేల? కాలు కడుగగనేల?' అని పెద్దల వాక్యం.

భాగవతంలో బలిచక్రవర్తి అంటారు, 'చుట్టాలు దొంగలు. సుతులు ఋణస్థులు... అందరూ ఏదో పనివుండే మనను సమీపిస్తారు. ఇంక ఎక్కడ శాంతి? ఇది తెలిసే మా తాతగారైన ప్రహ్లాదుడు తండ్రిని కాదని నిన్ను శరణు పొందాడు.

మా పూర్వీకులందరూ నిన్ను అది కావాలి, ఇది కావాలి అని అడిగారు. ఇన్నాళ్టికి నువ్వు నాకు మూడడుగులు కావాలని నన్నుడుగుతున్నావు. ఇది నా భాగ్యముగాక యింకేమిటి?' అని ఆయన కోరింది యిచ్చి చరితార్థుడయ్యాడు. మొదటి రెండు పాదాలతో వారు అంతటా నిండి పోయారు. మూడవ పాదానికి తల ఒగ్గడం ఆయన చెప్పిన సాధన చేయటమేనేమో! మనల్ని బాధిస్తున్నట్లు, లోనికి తొక్కుతున్నట్లు అనుకుంటే మన సంకుచిత దృష్టే. మన అహంకారాన్ని నిర్మూలిస్తున్నట్లు తెలుసుకుంటే ఆనందమే. జగత్ కళ్యాణమే.

ఇంతలో బాబుగారు వచ్చి లఘుపూజ నిర్వహించారు. అందరూ కలిసి ఉపచారనామాలతో దత్తస్వరూపాలయిన ఆ మహాత్ములను పూజించుకున్నారు. అందరి తరఫున గురువుగారికి, గురుపత్నికి బాబుగారు నూతన వస్త్రాలను సమర్పించారు. చైతన్య స్వరూపుడైన గురువుగారికి తెల్లని వస్త్రాలు, ప్రకృతి మాత అయిన గురుపత్నికి ఆకుపచ్చని వస్త్రాలు సమర్పించారు. నివేదనా ఉపచారాలతో పూజ భక్తిరసమయంగా జరిగింది. భక్తులు భక్తితో జయకారాలు చేయటంతో పూజపూర్తయింది.భక్తులందరూ గురుపత్నియైన అమ్మగారికి మనసారా నమస్కరించుకొని ఆమె నిజగృహానికి వీడ్కోలు పలికారు. ఎందరో ఈ మహోత్సవాన్ని తిలకించి లక్ష్యోన్ముఖులై తరించారు. గురుకుల విద్యార్థుల ఆనందం పట్టలేనిది. చిన్నవయస్సులోనే సత్యాన్వేషణ, భక్తి అలవడటం ఎంతగొప్ప విషయం! ఇంటర్నెట్‌లో ఈ ఉత్సవం చూసినవారు, ఎంతో ఆనందంతో కృతజ్ఞతలు తెలియజేసారు. భక్తుని ప్రార్థన-భగవంతుని కృప అనండి, న్యూటన్ థర్డ్‌లా ప్రకారం యాక్షన్-రియాక్షన్ అనండి మంచి హృదయంతో పనులు చేయ ప్రయత్నిస్తే ప్రకృతి, మంచి రిసల్ట్ యిచ్చి తీరుతుంది. ఆ ప్రకృతే గురుపత్ని అని కదా బాబుగారు చెప్పింది. వారి కృపకై మనందరి ఈ కృషి ఈ జగత్కళ్యాణ కార్యంలో పాల్గొన్న మనందర్ని, లోకాన్ని తరింపజేస్తుంది. జై సాయి మాస్టర్!!





"ఏ పాదద్వంద్వముయందు సకల క్షేత్రములు నిలచి పావనమగుచున్నవో అట్టి గురు భరద్వాజుని పాదపద్మములకు శత సహస్ర వందనములు" **- సంపాదకుడు**

# కృతజ్ఞతార్చనకు సిద్ధం కండి!

**ద్వారకనాథ్**

*సమర్ధ సద్గురు శ్రీ సాయినాధ మహరాజ్ కృప, వారి మహిమ వలన యావత్ ప్రపంచంలో కుల మత భేదాలు, ప్రాంతీయ భేదాలు అంతరించి సిసలైన మానవత, అట్టి మానవతకు సహజ లక్షణాలైన ప్రేమ, ధర్మము, సత్యాన్వేషణ, నైతికత మరియు క్రమశిక్షణలు మానవజాతిలో స్థిరపరచుకునే అవకాశం కలిగింది. అట్టి చక్కని పరిణతి సాధించాలంటే శ్రీ సాయినాధుని జీవిత చరిత్ర చక్కగా పారాయణ జరగాలి.* అందుకు గాను సాయి దయ వలన హేమాద్పంతుగారు రచించిన శ్రీ సాయి సచ్చరిత్ర, శ్రీ బీ.వి. నరసింహస్వామిగారు రచించిన శ్రీ సాయి చరిత్ర మొ॥న గ్రంధాలు మానవాళికి లభించాయి. శ్రీ సాయి తమ బోధలను, లీలలను మరింత లోతుగా, ఆచరణ యోగ్యంగా మానవజాతికి అందించదలచారు కాబోలు, ఎందరో మహనీయులచే "సాయిబాబా కా బేటా" అని ప్రశంసించబడిన మహనీయమూర్తి మన శ్రీ భరద్వాజ గురుదేవుల ద్వారా "శ్రీ సాయి లీలామృతము" అనే మహా గ్రంథంగా మనకు ప్రసాదించారు. ఇతర గ్రంధాల్లాగా కాక శ్రీ సాయి లీలలను, బోధలను ఆధ్యాత్మికోన్నతికి అవసరమైన పద్ధతిలో ఈ గ్రంథం మనకు అందిస్తుంది. శ్రీ సాయి యొక్క దివ్య లక్షణాలను, తత్వాన్ని అత్యంత

స్వచ్ఛమైన రీతిన పాఠకుల మనస్సులలో ముద్రింప చేస్తుంది.

మానవ జీవిత గమ్యం ఏమిటో, సాక్షాత్ భగవంతుడైన శ్రీ సాయినాధుని తత్త్వమెట్టిదో, అట్టి జీవిత లక్ష్యాన్ని సాధించడానికి మార్గమేమిటో, సద్గురువు ఆవశ్యకత, తత్త్వము ఎంతటివో మనకు తెలపడమేకాక నిత్య జీవితంలో మన మనస్థితి ఎలా ఉంచుకోవాలో, జీవితంలో ఎదురయ్యే సమస్యలను ఎలా ఎదుర్కొవాలో, మనం ఎలా నడుచుకోవాలో "శ్రీ సాయి లీలామృతం" మనకు బోధిస్తుంది. ఈ గ్రంధ పారాయణే ఉత్తమమైన ధ్యానం, ఉత్తమమైన శ్రవణం కుడా. చక్కని స్మరణ, మార్గ నిర్దేశకత్వం కూడా. సశరీరుడైన సద్గురువులో కనబడే లక్షణాలన్ని ఈ గ్రంధ రూపంలో దర్శనమిస్తాయి. అందుకే ఈ గ్రంధం సాక్షత్ గురు స్వరూపం. అక్షర సాయి స్వరూపం.

"సర్వత్ర నిండి యున్న సాయి మనపై దయతో ఈ గ్రంధం రూపంలో తనను తాను ఇముడ్చుకుని మనకు లభించారు" అంటారు మాస్టర్‌గారు.

శ్రీ సాయి లీలామృతాన్ని ఎందరు పారాయణ చేస్తున్నా, ఆ గ్రంధం ఎంత పవిత్రమైనదో, దానిపట్ల మనం ఎంతటి శ్రద్ధా-భక్తులను కలిగి ఉండాలో ప్రజలలో గుర్తింపుకు రావడం లేదు. సాయి తలపెట్టిన విశ్వమానవ కళ్యాణానికి, మాస్టర్ నిర్మిస్తున్న శాశ్వత సాయి ధర్మసేతువుకు ఈ జాడ్యం గొప్ప విఘాతం. ఈ గ్రంధ రాజాన్ని తగినంతగా గౌరవించడం నేర్చుకోకుంటే అసలైన ఆధ్యాత్మికతకు, శ్రీ సాయి దయకూ మానవజాతి అర్హతను కోల్పోతుంది.

ఈ గ్రంధ పారాయణ ఎందరికో శ్రీ సాయి దర్శనాన్ని ప్రసాదించింది. ***సాధకులెందరికో సాధన మెలకువలను తెలిపింది. ఎందరెందరికో ఆరోగ్యాన్ని ప్రసాదించింది, కష్టాలను తీర్చింది. జీవితంలో స్థిరత్వాన్ని ప్రసాదించింది. అంతటి ఈ గ్రంధం శ్రీ సాయి దయకు సాకార రూపంకాక మరేమిటి?*** దయాస్వరూపుడైన శ్రీ సాయి మరో రూపం కాక మరేమిటి? ఇంతటి గ్రంధం నిత్యం పారాయణ చేస్తూ, ఇంతటి లాభాన్ని పొందుతున్న మనం ఈ గ్రంధాన్ని శక్తి కొలది సత్కరించుకోనిదే, సేవించుకోనిదే కృతఘ్నులము, వంచకులమూ అవుతాము.

ఈ ఆలోచనా పరంపర శ్రీ సాయి మాస్టర్ దయ వలన మనస్సులో మెదిలినప్పుడు తీవ్ర ఆవేదన కలిగి, ఈ గ్రంధ రాజానికి చక్కటి పూజ నిత్యమూ జరగాలని, అట్టి సదాచారము సమాజంలో శాశ్వతంగా నెలకొనాలని అనిపించింది. ఈ భావాన్నే ఆత్మీయులతో పంచుకున్నాను. ఈ సదాచారం సమాజంలో స్థిరంగా నిలవటానికి ప్రతి సంవత్సరము ఒక రోజున విధిగా ఈ గ్రంధానికి వేడుకగా కృతజ్ఞతాపూర్వకమైన పూజ జరగాలనిపించింది. ప్రతిరోజూ ఎవరి ఇంట్లో వారము ఈ గ్రంధాన్ని పూజించుకుంటూ, సంవత్సరానికి ఒక రోజున విశేష సామూహిక పూజ జరగాలి అన్నది సంకల్పం. ఇదే విధంగా శ్రీ గురు చరిత్ర, శ్రీ అక్కల్కోట స్వామి చరిత్ర, శ్రీ సాయి సన్నిధి, శ్రీ సాయినాధ ప్రబోధామృతము గ్రంధాలకు కూడా ఒక్కొక్క గ్రంధానికి ఒక్కొక్క రోజు చొప్పున ప్రత్యేకంగా వేడుక నిర్వహించి ఇలానే సామూహిక పూజలు జరపాలన్నది సంకల్పం.

ఈ సంకల్పాన్ని పూజ్య గురుపత్ని శ్రీ అలివేలుమంగమ్మకు నివేదించి వారి అనుమతి, ఆశీస్సులు తీసుకొని, గత సంవత్సరం మే 2వ ఆదివారంనాడు "శ్రీ సాయి లీలామృత కృతజ్ఞతార్చన", సెప్టెంబరు మొదటి ఆదివారం ''శ్రీ గురు చరిత్ర కృతజ్ఞతార్చన'' జరుపుకుందామని నిర్ణయించి భక్తులందరితో ఆ విషయాన్ని పంచుకున్నాను. ప్రపంచమంతటా గత సంవత్సరం ఆ పూజలు ఎంతో వేడుకగా జరిగాయి.

ఈ సంవత్సరము కూడా మే 2వ ఆదివారము, అంటే "శ్రీ సాయిలీలామృత కృతజ్ఞతార్చన" పర్వదినం రానున్నది. భక్తులందరూ "శ్రీ సాయి లీలామృతము" మహాగ్రంధానికీ, అది మనకందించిన పూజ్య ఆచార్య భరద్వాజ మహరాజ్‌కు, పరాత్పరుడైన శ్రీ సాయి మహరాజ్‌కూ కృతజ్ఞత తెల్పుకోడానికి, వారిని పూజించుకోవడానికి సన్నద్ధం కావాలి.

ప్రపంచమంతటా, ప్రతి ఇంట్లోనూ, ప్రతీ ఊరులోనూ ఈ పూజలు వేడుకగా జరగాలి. శ్రీ సాయినాధుల కృపకు అందరి హృదయాలలో కృతజ్ఞత ఉప్పొంగాలి.

"శ్రీ సాయి లీలామృత కృతజ్ఞతార్చన" విధానము, మరిన్ని వివరములు వచ్చే సంచికలో విపులంగా మీకు అందిస్తాము. ఈ సందర్భంగా పాఠక మహాశయులందరికీ ఒక విజ్ఞప్తి. పై చెప్పిన పవిత్ర భావాలను మీకు తెలిసిన వారందరితోనూ పంచుకోండి. సాయి లీలామృతము తెలియని వారికి పరిచయం చేయండి. అందరూ కలిసి ఆనందంగా ఆ వేడుక జరుపుకొని శ్రీ సాయి కృపకు పాత్రులుకండి.

జై సాయి మాస్టర్!

## Books on Sri Ramakrishna Paramhansa and Swami Vivekananda

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 |
| భారతం నా అమర భారతం | 20.00 |
| జ్ఞాన యోగం | 30.00 |
| బుద్ధి యోగం | 15.00 |
| కర్మ యోగం | 15.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 |
| స్వామి వివేకానంద (2 భాగాలు ) | 60.00 |
| మహాభారతం | 5.00 |
| నా అమర సందేశం | 30.00 |
| భక్తి యోగం | 10.00 |
| సందేశ తరంగిణి(కొలంబో-అల్మోరా) | 40.00 |
| వివేక సూర్యోదయము | 20.00 |
| దైవంతో సహజీవనం | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 |
| మువివేకానంద లేఖావళి | 25.00 |
| రామాయణం | 5.00 |
| My Idea of Education | 34.00 |
| Karma Yoga | 18.00 |
| God Lived with Them | 170.00 |
| The Lived with God | 140.00 |
| Raja Yoga | 36.00 |
| Bhakti Yoga | 16.00 |
| Jnana Yoga | 50.00 |
| Letters of Swami Vivekananda | 110.00 |
| Reminiscences of Swami Vivekananda | 100.00 |
| Talks with Swami Vivekananda | 58.00 |
| Complete Works of Swami Vivekananda-9 | 110.00 |
| Meditation and Its Methods | 18.00 |
| Vivekananda on Himself | 100.00 |
| Ramakrishna and Vivekananda | 7.00 |
| Tales and Parables of Sri Ramakrishna | 45.00 |
| Lectures from Colombo to Almora | 40.00 |
| Complete Works of Swami Vivekananda | 50.00 |
| Sayings of Sri Ramakrishna | 25.00 |

జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయిమాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయిమాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు-పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine Subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone :040-20063300
**OR, Sri Manga Bharadwaja Trust , Ongole Branch Office**
Kothapeta, Kondaiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.** **Magazine** మరియు **General Donations** ను **"Sri Manga Bharadwaja Trust"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Annadanam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Sai Master)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Ashramam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Peace Foundation)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల్వారా పంపగలరు

**Books order** ను **"Sri Manga Bharadwaja Trust (Publications)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు**

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్మ్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

**ఇతర ప్రచురణలు**

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

**BOOKS IN ENGLISH**

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

**BOOKS IN OTHER LANGUAGES**

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300

**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**

*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*



## నేటి మానవాళికి సంపూర్ణమైన ఆధ్యాత్మిక బోధను ప్రసాదించిన

## సద్గురు దిగ్గజానికి ప్రార్థన

శ్రీనిధిం నిధిరవ్యక్తం నిర్ద్వంద్వం నిశ్చలం విభుం  కేవలం విపులం సాక్షిం భరద్వాజమహం భజే

భయక్లేశహరం శాంతం వైరాగ్యాది సుభుషితం  సాయిశిష్యం మునిశ్రేష్ఠం భరద్వాజమహం భజే

రచనామృత దాతారం వచనామృత సాగరం  బోధనామృత రూపం తం భరద్వాజమహం భజే

ద్వాదశాక్షరి స్వరూపం తం విశ్వరూపవిరాజితం కాలరూపం విరూపాక్షం భరద్వాజమహం భజే

జగదీశ్వరం కవిందేవం ఆనసూయాత్రినందనం వేదగమ్యం పరమపురుషం భరద్వాజమహం భజే

# ఆచార్యుని ఆదేశాలు,

## వారి లేఖలలో .....

సాయి మందిరంలో సత్సంగం స్థిరంగా మన "సత్సంగము-భజన" అను bookletలో వ్రాసిన పద్ధతిలో వారానికొక సారైనా జరిగేలాగ, ప్రతి రోజు- ప్రత్యేకంగా గురువారం సాయంత్రం జనమెక్కువగా వచ్చేప్పుడూ గూడ - మందిరంలో 1/2 గంట సేపు సాయి చరిత్ర శ్రవణం చేయించేలా యత్నించగోర్తాను. అది కొన్ని ఆవర్తాలయ్యాక శ్రీ గురుచరిత్ర చేయిస్తే బాగుంటుంది.

ఎలాగైనా అవకాశాలు కల్పించుకొని అవసరమైతే మందిర కమిటీతో మాట్టాడియైనా మందిరంలో నిత్యమూ "సాయి లీలామృతము", "సాయి సచ్చరిత్ర", "శ్రీ గురుచరిత్ర", "అక్కల్కోటస్వామి చరిత్ర", "మాణిక్య ప్రభువు చరిత్ర" ఒక్కొక్కటీ 3 ఆవర్తాలు చొప్పున పారాయణ చేసి జనానికి శ్రవణం చేయించేలాగ చూడ గోర్తాను. ఇది సాయి ప్రచారానికి నానాటికీ మరింత ముఖ్యమవుతున్నది.

మన జీవితాలు గడిచిపోయేసరికి ప్రక్క దారులు పట్టని సాయి సాంప్రదాయం దేశంలో చక్కగా నెలకొల్పాలి. ఇదే మన ధ్యేయం. మన తరింపు.

edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust, ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.

జై సాయి మాస్టర్!



# అవధూత శ్రీ చివటం అమ్మగారి

## వార్షిక పుణ్య ఆరాధన మహోత్సవములు

**అవధూత శ్రీ చివటం అమ్మ 31వ వార్షిక పుణ్య ఆరాధన మహోత్సవములు 25, 26, 27 మే 2012 (జ్యేష్ఠ శుద్ధ సప్తమి - అమ్మ పుణ్య తిథి) తేదీలలో జరుగును కావున భక్తులందరూ ఈ కార్యక్రమములో పాల్గొని అమ్మ ఆశీస్సులు పొందగలరని ప్రార్థన.**

*శ్రీ అవధూత రామాలయ సాధు అమ్మ ఆశ్రమ సంఘం, చివటం - 53426, ఫోన్ : 08819-225126, 9441248209*

# సర్వజన, సద్ధర్మ రక్షక శ్రీ సాయిరామ బాణం

శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

పరమ పవిత్రమైన శ్రీరామ నవమి నాడు ప్రారంభింపబడిన మన "సాయిబాబా" పత్రిక నేటికి **29** సం॥లు పూర్తి చేసుకుని **30** సం॥లో అడుగు పెడుతున్న శుభ సమయంలో ఒక్కసారి పూజ్య గురుదేవులకు నమస్కరించి ఒక్క విషయాన్ని స్మరించుకుందాము.

జగత్కల్యాణానికై భువికి యేతెంచిన శ్రీ రాముడు సీతాదేవితో కలిసి దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేశారు. అలానే మనలో ఉన్న దుర్గుణాలు అనే రాక్షసులను ఎదుర్కొడానికి పూజ్య ఆచార్య శ్రీ అలివేలుమంగా సమేత భరద్వాజ మహరాజ్‌లు మనందరికి యిచ్చిన అద్భుతమైన రామబాణం "సాయిబాబా" పత్రిక. ఈ రామబాణం **1983** శ్రీ రామనవమి నాటి నుంచి తన ప్రచండ వేగంతో ఎన్నో అడ్డంకులు ఎదుర్కొని, ధర్మప్రచారం కొనసాగిస్తున్నది. ఈ బాణాన్ని వినియోగించుకున్న మనం సాటి మన మిత్రులకు కూడా ఈ అస్త్రమును అంది ద్దాము. సాటిలేని యీ అస్త్రాన్ని వినియోగించుకున్న మనందరి ప్రధాన కర్తవ్యం యిదే.

ఈ రామబాణ కార్యం మా ద్వారా (శ్రీ మంగ భరద్వాజ (ట్రస్ట్) జరగడం మా అదృష్టం. ఇంతటి మహద్భాగ్యాన్ని మాకు ఇచ్చిన గురుదంపతులకు మా సహస్రకోటి నమస్కారములు. కృతజ్ఞతా మహెూత్సవము జరుగుతున్న యీ సమయంలో పత్రిక చేస్తున్న యీ సేవకు మనం కృతజ్ఞత చేప్పుకోవాలి. పత్రికారూపంలో మనందరికీ సేవ చేస్తున్న గురుదంపతులకు పాదాభివందనం. ఈ సం॥ము శ్రీ రామనవమి, పత్రికా ప్రారంభోత్సవం రోజు మరియు శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్ ప్రారంభోత్సవ రోజు (April 1st 2012) ఒకేరోజు రావడం ఆనందదాయకం.

ఈ పత్రిక ద్వారా తమ అనుగ్రహాన్ని కురిపిస్తున్న గురుపుత్రులు ద్వారక బాబుగారికి, గురుపుత్రిక వేదమ్మగారికి మా కృతజ్ఞతలు. వారి సహకారం యిలాగే అన్ని వేళలు కొనసాగాలని మా ప్రార్ధన. ఈ పత్రికా నిర్వహణలో తమ వంతు సహకారాన్ని అందిస్తున్న సాయిమాస్టర్ వాలంటీర్లకు, సేవకులకు, రచనలద్వారా తమ అనుభవాలు పంపిస్తున్న భక్తులకు, పాఠకులకు, చందాదారులకు, అందరికీ మా కృతజ్ఞతలు.

మా యీ పత్రిక నిర్వహణలోని తప్పులను, మీకు కలిగించిన యిబ్బందులను క్షమించమని మనసారా ప్రార్ధిస్తున్నాము.

మూడు పదులు లోకి అడుగు పెడుతున్న మన "సాయిబాబా" పత్రిక, యీ కృతజ్ఞత మహోత్సవాన్ని పురస్కరించుకొని తన శాశ్వత ధర్మప్రచారాన్ని కొనసాగించి, తన వేగం మరింత పెంచుకొని, విశ్వవిఖ్యాతం కావాలని మా ఆకాంక్ష. ఈ ధర్మ ప్రచార యజ్ఞానికి తమ అనుగ్రహం కురిపించమని మాలో ఆ శక్తిని ప్రసరింపజేయమని, శ్రీ అలివేలుమంగా సమేత భరద్వాజ మహరాజ్‌ను ప్రార్ధిస్తున్నాము.

జై సాయి మాస్టర్!!

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

SRI MANGA BHARDWAJA TRUST

సంపుటి: 30 | మే-2012 | సంచిక: 01

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"

విషయసూచిక




చిరునామా

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**



చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి
ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ **ఆర్.ఎస్. శశిధర్,** పిహెచ్. డి


చందా వివరములు

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10-00 |
| సంవత్సర చందా | : రూ. 100-00 |
| రాజపోషకులు | : రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000-00 |

*అసలు మానవుడు వుండేదే దేవుడవటం కోసం – విత్తు వుండేది చెట్టవడం కోసమయినట్లు. కాబట్టి సాధనలో జీవితం ఒక భాగమవ్వాలి అని తెలుసుకొని తీరాలి. ఇది తెలుసుకొనకుండా, సాధించకుండా ఈ లోపల సాధన, ముక్తి అని మాట్లాడటం చిన్న పిల్లవాడి మాటలవలె అర్థరహితం. ఇది సాధస్తేనే సాధన మొదలైనట్లు.*

**- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ**

# అభయం

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

ఎందరు మహనీయుల జీవితాలు మనకు మరణంలో భయపడవలసినదేమీలేదని తెలిపినప్పటికి అటువంటి అనుభవం మనకు ప్రత్యక్షంగా లేకపోవడం వలన పామరులమైన మనకు మృత్యుభీతి ఉండడం సమంజసం. కానీ జీవితంలో ఎన్ని రకాల భయాలకు మనం గురియౌతుంటామో ఆలోచిస్తే చిత్రంగా ఉంటుంది.

ఉదాహరణకు: శారీరకమైన బాధ కలుగుతుందంటే ఉన్న పరిస్థితులలో మాత్రమే మనం భయపడుతాం. మనకంటే బలవంతులు, దొంగలు రౌడీలు మనలను కొడతారంటే భయం కల్గుతుంది. కానీ బాగా ఆలోచిస్తే ఈ భయానికి కూడా అట్టి పరిస్థితిలోనున్న నిస్సహాయతే కారణం. అలాగాక అంతటి శారీరకమైన బాధనే కల్గించే ఎన్నోరకాల ఆటలను చిన్న పిల్లలు కూడా ఇష్టపడుతారు. ఎన్ని దెబ్బలు తగిలినా ఆటలు మానరు. వయసు వచ్చిన కొద్దీ ఆ బాధను 'ఆటలో అరటిపండు' అనుకోవడం చేతనౌతుంది. కానీ చిన్నతనంలో పిల్లలను అలాంటి ఆటలు ఆడుకోనివ్వరు. పిల్లలకు దెబ్బతగులుతుందేమోనని భయమే కారణము. కానీ పెద్దలు అలాంటి ఆటలను ఆడుకోనివ్వకుండా పిల్లలను నిగ్రహించడం చాలా పెద్ద పొరపాటు. అలాంటి పెద్దలచాటున పెరిగిన పిల్లలు జీవితంలో చిన్న కష్టాన్ని బాధను గూడా సహించలేని బలహీనులుగా పిరికివారుగా ఔతారు. కానీ ప్రస్తుత విషయమేమిటంటే అలాంటి పెద్దలు అడ్డగిస్తే తప్ప ప్రకృతి సిద్ధంగా ప్రతివారూ బాల్యం నుండీ అలాంటి బాధను కల్గించే ఆటను ఇష్టపడడమే గమనార్హము. కానీ అలాటి వారు కూడా పెరిగి పెద్ద వారయ్యాక తమకంటె బలవంతులు తమను కొడతారంటే భయపడుతారు. కారణం? అటలలో వాళ్ళకు స్వేచ్ఛ, నిర్ణయం ఉన్నాయి. కానీ తమకంటే బలవంతులు తమను కొట్టే విషయంలో ప్రతి వారు నిస్సహాయతకు గురియౌతారు. ఆ నిస్సహాయతే భయానికి కారణం. అంతవరకూ ప్రతి వ్యక్తీ కొట్లాటకుకూడా సంసిద్ధుడేకాక దానిని ఇష్టపడతాడు కూడా. తన శత్రువును నిస్సహాయతకు గురిచేయడమే అట్టి వ్యక్తి యొక్క లక్ష్యమవుతుంది. కనుక నిస్సహాయతే భయానికి కారణం.

కానీ, ఈ పరిస్థితికూడా అన్ని పరిస్థితులలోను వర్తిస్తుందని చెప్పలేము. దేశస్వాతంత్ర్యముకోసమో, లేక తాము నమ్మిన ఆశయంకోసమో పోరాడే ఆదర్శవాదులకు, యోధులకు నిస్సహాయత అన్న భావమేరాదు. గెల్పు ఓటములు, వాటివల్లగల్గే బాధలు అప్రస్తుతమనిపించి తమ ఆశయంకోసం పోరాడి సర్వభయాలను అణగద్రొక్కగల ఉత్తేజాన్ని, ఉత్సాహాన్నిస్తుంది. గనుక మనిషి తనను జీవశ్చవంలాగ మార్చగల భయాన్ని అతిక్రమించాలంటే ఒక ఆశయాన్ని కల్గియుండాలి. తన ఆశయం నెరవేరితే మానవాళి యంతటికీ ఎంత మేలు చేకూరగలదో అన్న భావమే అతడి ఉత్సాహానికి, ధైర్యానికీ కారణం. అంటే సాటి మానవులపట్ల ప్రేమే ఆశయానికి మూలము. అందుకే ధైర్యం సత్వగుణంగాను, దైవీసంపదలోని అంశంగాను శాస్త్రాలలో చెప్పబడింది. అట్టి ప్రేమే యుద్ధమువంటి విషమపరిస్థితులు తారసిల్లినపుడు సాటి మనవులపట్ల ధర్మంగా, ప్రేమగా ప్రవర్తించడంగా వ్యక్తమవుతుంది. ఇట్టి సుగుణాలరాసినే దైవీసంపద, సత్త్వగుణము అని భగవద్గీతాది ఆధ్యాత్మిక గ్రంథాలన్నీ వర్ణించాయని మనం గమనించాలి. అందుకే ఆధ్యాత్మికతంటే ఏమో సరిగా అవగాహనచేసుకున్న ప్రతి వారూ ఏదో ఒక దశలో తమకు తెలిసిన ధర్మాన్ని సాటివారితో పంచుకోవడానికి పూనుకుంటారు. ఇది ఆరోగ్యవంతమైన మనస్సు, వక్తిత్వముగలవారికుండవలసిన లక్షణం. ఒక మంచి సినిమాచూస్తేనో, మంచికథ చదివితేనో సామాన్యమైన మిత్రులు, అలాంటి సంతోషాన్ని సాటివారు కూడా పొందాలన్న ప్రీతితో ప్రక్కవారిని ప్రోత్సహిస్తారు గదా!

# "భగవంతునికి చెడు అంటేను, చెడుకు భగవంతుడంటేనూ భయం"

దివ్యజనని అలివేలు మంగమ్మ

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

"భగవంతునికి చెడు అంటేను, చెడుకు భగవంతుడంటేనూ భయం" అని బాబా సూక్తి. దీనిని గురించి కొద్దిగా వివరించుకుందాము.

ఇందులో మూడు అంశాలు ముఖ్యంగా యిమిడి వున్నాయి.

**1)** అసలు భగవంతుడంటే ఎవరు?

**2)** మంచి–చెడు అంటే ఏమిటి?

**3)** చెడు అంటే భగవంతునికి భయమేమిటి?

భగవంతుడంటే సకల సృష్టికీ మూలమైనవాడు–సకలాన్నీ సృష్టించినవాడు. ద్వంద్వాతీతుడు. కానీ ద్వంద్వాలను సృష్టించాడు. అంటే భగవంతుడు ద్వంద్వాతీతుడైనప్పటికీ ద్వంద్వాలను సృష్టించాడు. వగలు–రాత్రి, వెలుగు–చీకటి, చలములు–అచలములు–ఇలా అన్నీ ద్వంద్వాలే అన్నీ వైవిధ్య భరితమైనవే. అలా ఆయనే సృష్టించాడు. మరి వీటిలో మంచి–చెడు ఏమిటి? ఆయన సృష్టిలో కొన్ని మంచివి, కొన్ని మంచివి కానివీ వున్నాయా? ఆయన సృష్టిలో వుంటే వుండవచ్చుగాక, ఆయన దృష్టిలో గూడ వున్నాయా? ఉంటే అవి ఏమిటి? అసలు 'చెడు' అంటే ఏమిటి? 'మంచి' అంటే ఏమిటి?



సృష్టిలో అన్నీ వైవిధ్యభరితమైనవే అయినప్పటికీ దేనికీ ఏదీ అడ్డురాదు. సృష్టిలో ప్రతిప్రాణీ గూడ భేదాలతో కూడి వుంటుంది. అయినా వేటికవి వాటి వాటి స్వభావాలను బట్టీ ప్రవర్తిస్తుంటాయి. అందుకని వీటికీ వేటిమీదా ప్రత్యేక ప్రభావముండదు. సృష్టి వాటికి విధించిన ధర్మాన్ననుసరించి అవి జన్మించడము, వృద్ధిచెందడము, నశించడము జరుగుతూ వుంటుంది.

అయితే మానవుడు గూడ అలాగే జన్మించినప్పటికీ ఆలోచించగల మనస్సుగల అతడు వూరికే వుండలేడు. కనుక సృష్టిలోని ప్రతిదానిని గూర్చి తన శక్తి మేరకు ఆలోచిస్తాడు. తన పరిధిలో తెలుసుకుంటాడు. అయితే అంతటితో ఆగక కొన్నింటిమీద ఇష్టము, కొన్నింటి మీద అయిష్టము ఏర్పరచుకుంటాడు. అంతటితో ఆగక తనకు ఇష్టమైన దానిని కావాలనుకోవడము, ఇష్టంలేని దానిని వద్దనుకోవడమూ చేస్తాడు. దానితో కావాలనుకున్న దాని కోసం తపన, ఆందోళన పడతాడు. కావాలనుకున్నది లభిస్తే సంతోషము, లభించకపోతే దు:ఖము. ఒకవేళ కావాలనుకున్నది లభించినా ఆ సంతోషం ఎక్కువకాలముండదు. మరొకటి కావాలనిపిస్తుంది. కనుక మళ్ళీ మొదటికే వస్తుంది. అతడు కావాలనుకున్న దానిని పొందే ప్రయత్నంలో పడే ఆరాటము ఆందోళన అతనికి

మనశ్శాంతి లేకుండా చేస్తాయి. అంతేగాక తాను కోరుకున్నది మరొకరికి లభిస్తే వారిపట్ల కోపము, అసూయ, ద్వేషము కలుగుతాయి. దానివలన తనకు, ఇతరులకూ అశాంతి కలుగుతుంది. దీనినే 'చెడు' అంటారు.

భగవంతుడు పరమానంద స్వరూపుడు. నిత్యతృప్తుడు. ఇతర ప్రాణులకు వలెనే మానవుని గూడ భగవంతుడు తానెలా సృష్టించాడో అలా వుండాలనే సృష్టించాడు. మానవుడు దానికి భిన్నంగా ప్రవర్తించడమే చెడు. తనకు ప్రాప్తించిన దానిని తృప్తిగా అనుభవించక లేనిదేనికోసమో వెంపరలాడడమే చెడు. సృష్టిలో ఏ ఇతర ప్రాణీ అలా వెంపరలాడదు. తనకున్న పరిధిలో తాను ఎదగడానికి ప్రయత్నిస్తుంది. కానీ మానవుడు తాను పుట్టినప్పటి నుండీ ఎదిగే ప్రయత్నంలో అనేక విధాలైన మానసిక భావాలను పొందుతాడు. అట్టి భావాలననుసరించి అనేక కర్మలు చేస్తాడు. వాటిలో మంచి కర్మలు, చెడు కర్మలు వుంటాయి. మంచి కర్మలు చేయడం వల్ల తనకు, ఇతరులకూ శ్రేయస్సు, శాంతీ చేకూరుతాయి. చెడు కర్మలు చేసినపుడు తనకు ఇతరులకూ నష్టము, అశాంతి కలుగుతాయి. ఉదాహరణకు ఒకడు మరి ఒకరికి ఉపకారము చేసాడని అనుకుందాము. అందువలన ఆ చేసినవాడికీ, పొందినవాడికీ సుఖశాంతులు కలుగుతాయి. అలాగాక అపకారము చేస్తే ఇరువురికీ దు:ఖము, అశాంతి తప్పవు. అదే భగవంతుని దృష్టిలో 'చెడు'.

అంటే తనకు శ్రేయస్సును. ఇతర జీవులకు శ్రేయస్సునూ కలుగజేసుకుని సుఖశాంతులలో జీవించమని మానవునకు మేధస్సును ప్రసాదిస్తే, తాను సృష్టించిన మానవుడు తనకు, ఇతరులకూ అశాంతిని కల్పించుకోవడమే భగవంతుని దృష్టిలో 'చెడు'. ఆ విధంగా చెడు చేస్తున్నవాడికి మంచి చేయడం సాధ్యం కాదు.

భగవంతుని సృష్టిలో స్వచ్ఛమైన నీరూ వుంటుంది, బురదగూడ వుంటుంది. నిప్పు, నీరూ వుంటుంది. విషతుల్యమైన చెట్లూ వుంటాయి. అమృతతుల్యమైన వృక్షములూ వుంటాయి. అలా ప్రతిదీ పనికి వచ్చేదిగాను, పనికి రానిదిగానూ గూడ వుంటుంది. అసలు సృష్టిలో పనికి రానిదంటూ ఏదీ లేదు. ఒకటి ఒక దానికి పనికిరాకపోవచ్చు. మరొకదానికి పనికి రావచ్చు. ఇలా అన్నీ వైవిధ్యమైనవే అయినా అన్నీ పనికి వచ్చేవే.

విచిత్రమేమంటే ఏ జీవీ తనకు పనికిరాని వాటి, అవసరం లేనివాటి జోలికి పోదు, ఉపయోగించుకోదు గూడ. కానీ మానవుడు తనకు అవసరమైనవే గాకుండా అనవసరమైన వాటికోసం గూడ పరుగెత్తుతాడు. బురదే బాగుందని తలచి అందులో దిగుతాడు. ఎండమావులను నీరని భ్రమించి వాటి వెంట పరుగెత్తుతాడు.

అంతేగాక స్వార్థంతో ప్రతిదానినీ సరియైన పద్ధతిలో ఉపయోగించుకోక ఇతర జీవులకు, సాటి మానవులకూ కష్టము, నష్టము కలుగజేస్తాడు. అంతటితో ఆగక ప్రకృతిని సైతం స్వార్థంతో కలుషితం చేస్తాడు. ఛిన్నాభిన్నం చేస్తాడు. పర్యవసానంగా తన వినాశనానికి, తక్కిన ప్రపంచ వినాశనానికి కారణభూతుడవుతాడు. అదే భగవంతుని దృష్టిలో 'చెడు' అంటే.

ఇవిగాక మనలోని కుసంస్కారాలు, చెడ్డ ఆలోచనలు గూడ 'చేడు' అని చెప్పవచ్చు. అందువలన మనం చేసే చెడ్డ కర్మలుగూడ 'చెడు' అని చెప్పవచ్చు. ఇతరులకు చెడు బోధించడము, చెడు ప్రవర్తనకు అలవాటు చేయడము, చెడు వ్యసనాలకు బానిసలుగా చేయడము గూడ చెడు లక్షణాలే.

ఇక మూడవది – భగవంతునికి చెడు అంటే భయమేమిటి? అన్నది. అసలు భగవంతుడు భయపడతాడా? అన్నది ప్రశ్న. అసలు ఇక్కడ భయపడడము అంటే అర్థమది కాదు. వెలుగుకు చీకటి అంటేను, చీకటికి వెలుగు అంటేనూ భయం అన్నట్లు. వెలుగు చీకటిని చూసి భయపడడమంటూ వుండదు. అయితే చీకటి వున్నచోట వెలుగు వుండదు. అలాగే చెడు వున్నచోట భగవంతుడు వుండడు, భగవంతుడు వున్నచోట చెడు వుండడానికి అవకాశం లేదు" అని అర్థం.

భగవంతుడు సద్గుణ సంపన్నుడు. సుగుణాలే ఆయన స్వరూపం. మరి ఆయన దగ్గర దుర్గుణాలు ఎలా వుండగలుగుతాయి? కనుక దుర్గుణాలు వున్న చోట సుగుణాలుగల ఆయన వుండడం సాధ్యపడదు.

అంటే మానవునిలోని దుర్గుణాలు, వాటివల్ల వచ్చే దురాలోచనలు, వాటివల్ల చేసే దుష్కర్మలు, వాటివల్ల కలిగే దుష్ఫలితాలే భగవంతుని దృష్టిలో 'చెడు'. అవి మనలో వుంటే మన చెంత ఆయన వుండడు. కనుక మనలో పైన చెప్పుకున్న దుర్గుణాలు వుంటే వాటిని సరిదిద్దుకునే ప్రయత్నం చేయాలి. అట్టి ప్రయత్నం నిరంతరం చేస్తూ భగవంతుని చెంత మనము, మన చెంత భగవంతుడు వుండేలా ప్రవర్తిద్దాము.

ఈ కృతజ్ఞతా మహోత్సవ సందర్భంగా మనలోని దుర్గుణాలను పారద్రోలుకోవడమే గాక, సుగుణాలను అలవరచుకునేలా, సత్కర్మలు చేసేలా అనుగ్రహించమని, శ్రీ సాయిబాబాను, పూజ్యశ్రీ మాస్టరుగారినీ మనసారా ప్రార్థిద్దాము.

# శ్రీ సాయినాథుడే శ్రీ విద్య

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

అవిద్య అంటే మనిషిని జనన మరణ రూపమైన సంసార చక్రంలో బంధించే అజ్ఞానం. అది తొలగి, ఆత్మానుభూతినంది శాశ్వతమైన దుఃఖవిముక్తిని సాధించడమే 'విద్య' లేక 'జ్ఞానము'. సాధక జీవితమంతా అవిద్యనుండి 'విద్య'ను చేరుకొనే ప్రయాణమే. గమ్యంలేని ప్రయాణం. అమరత్వం. సామాన్యంగా విద్యను చేరుకొనే ప్రయాణం ఎన్నో జన్మలు పడుతుందని శాస్త్రం చెబుతుంది. ఒక ఊరినుండి బయలుదేరిన రైలు గమ్యం చేరేలోపల మధ్యలో ఎన్నో ఊళ్లలో, పొలాలను, కొండలను, కాలువలనూ దాటి పోవాలి. వీటిలో ప్రతి ఒక్కటి అంతవరకు సాగించిన ప్రయాణానికి దాని భరతవాక్యము, తరువాతి ప్రయాణానికి నాంది. అలానే సాధకజీవితంలో ప్రతి అనుభూతీ ఏదోరీతిన మనకు గురువై ఏదో ఒక సత్యాన్ని బోధిస్తూనే ఉంటుంది. అంతేగాక సాధకులెందరో సాధువులను, సత్పురుషులను కలవడం జరుగుతుంది. కొందరినుండి విధిపూర్వకంగా ఉపదేశాన్ని పొందటంకూడా జరుగవచ్చు. వీటిలో ప్రతి ఒక్కటీ తర్వాత స్థాయికి చేరుస్తుంది. వీటన్నింటిలో చివరి సోపానము సద్గురు ప్రత్యక్ష దర్శనము. వారి దర్శనమయ్యాక అంతకుముందు తారసపడిన సాధు, సత్పురుషులందరూ నిజానికి తమరూపమేనని, జన్మ జన్మలూ మనను వీరే ఆయా రూపాలలో వుండి నడిపిస్తూవచ్చారనీ నిరూపిస్తారు. అందుకే కబీరు, సద్గురువుకూ ఆయన శిష్యులకూ గల సంబంధం సృష్టి ఆదిలోనే నిర్ణయమవుతుందని అంటారు. శ్రీసాయినాథుడు సకల జీవులు, దేవతలు, సాధు, సత్పురుషులు తమ రూపమేనని నిరూపించడంలోని ఆంతర్యమిదే.

సద్గురువును కలవకముందటి జీవిత సంఘటనలు మనలో ఒక విధమైన ప్రబోధాన్ని కల్గిస్తాయి. అంతకు ముందు తారసిల్లిన సాధువులు మన చెవిలో ఏదో ఒకటి ఉపదేశిస్తారు. కాని సద్గురువు ఆ రీతిన ఏమీ ఉపదేశించరు. జన్మజన్మలుగా మనకు తోడుంటూ ఆయారూపాలలో బోధిస్తూ వచ్చింది తామేనని, యిక ముందుగూడా తామే మనల్ని చివరికంటా గమ్యం చేరుస్తామనీ అభయమివ్వటమే సద్గురువుచేసే ఉపదేశం. సాయినాథుని గురువుగాని, సాయి మనకుగానీ, యిచ్చిన అభయమిదే.

పూర్ణుడైన సద్గురువు చేసే ఉపదేశంలో జపము, యోగాభ్యాసము వంటి ప్రక్రియలేమీ ఉండవు. నానాటికీ అలవడే శ్రద్ధ, విశ్వాసమ, ప్రేమలతో వారి నంతనంతకు ఎక్కువగా గుర్తు పెట్టుకుంటూండడమే వారుసూచించే మార్గం. సాయి సూక్తులన్నింటిలో తెల్పబడిన విధానమిదే. వారి గురు సేవా వృత్తాంతం గూడా దీనినే తెల్పుతుంది. వారి నాశ్రయించాక గూడా ప్రాణాయామము మొదలైన సాధనలు అనుష్ఠింప జూచిన భక్తులను సాయి వారించడం చరిత్రలో చూడవచ్చు. అనన్యమైన సద్గురు ధ్యానము, సన్నిధి లభించకముందు అట్టి సాధనలుపకరించవచ్చు. కాని సద్గురువు యెడల భక్తి కలిగిన వారికి వారి

బోధనల ననుసరించి మన జీవన విధానాన్ని, భావాలనూ సంస్కరించుకొంటూ ఋణానుబంధాలను గుర్తుంచుకొని ఆదరంతో నిర్వర్తించుకోవటమొక్కటే కర్తవ్యం. అందుకే ఎవరికో తప్ప జనబాహుళ్యానికి ఎన్నడూ సాయి సర్వసంగ పరిత్యాగాన్ని విధించలేదు. ఇల్లు విడచి రామేశ్వరం బయలుదేరిన భక్తుని వారించారు గూడాను. సాయి వద్ద ఉపదేశం పొందాలని వచ్చిన భక్తుని, స్థానికుడైన వేరొక భక్తుని యింటికి భోజనానికి పంపించి, వెనుకనే సాయి అతడికి కబురు పంపారు: "ఈ సదాశివుడు ఉపదేశం గురించి అనవసరంగా ఆరాటపడుతున్నాడు. అతడొచ్చిన పని ఎప్పుడో పూర్తిచేయబడింది". అంటే సాయి వంటి సద్గురువుయొక్క దర్శనవే చరమోపదేశమన్నమాట. వారినుండి ఉపదేశాన్ని ఆశించిన రాధాభాయికి సాయి తమ గురుసేవా వృత్తాంతాన్ని చెప్పి, చెవిలో ఎట్టి మంత్రోపదేశమూ చేయడం తమ సాంప్రదాయం కాదని స్పష్టంగా చెప్పారు. అలానే వారి నుండి ఉపదేశం ఆశించిన హేమాద్పంతును శ్యామాయింటికి పంపి, తమ దివ్యప్రేరణ చేత అతనిచేత తమ గురుసేవా వృత్తాంతాన్ని చెప్పించి, తరువాత అతడు మశీదు చేరగానే, అతడితో తమ విధాన మత్యద్భుతమైనదని, అతడు జెప్పిన ఆ ఒక్క కథనూ గుర్తించుకుని మననం జేస్తే చాలునని, అతడి జీవితం కలకండవలె సుమధురమవుతుందని చెప్పి, అతడికి ప్రసాదమిచ్చారు. సాయి తమ భక్తులకెట్టి ఉపదేశమివ్వరని తెలిసిన యితర గురువులు కొందరు తాముపదేశమిస్తామని కొందరు సాయి భక్తుల నాహ్వానించారు. అప్పడా భక్తులు వారి అనుమతి కోరితే సాయి సుతరమూ అంగీకరించలేదు సరికదా, "ఉపదేశాలకు పోవద్దు" అని స్పష్టంగా చెప్పారు.

సాయి రూపం నిరాకారమైన ఆత్మజ్ఞానానికి సింహద్వారమని చెప్పవచ్చు - క్రీస్తు "నేనే మార్గమును" అని చెప్పినట్లు, సాయియొక్క తత్వమే అగమ్యమైన ఆత్మస్వరూపం - క్రీస్తు, "నేనే గమ్యమును" అన్నట్లు. భక్తులు నిర్వికల్ప సమాధిలో ఆత్మసాక్షాత్కారాన్ననుభవిస్తారు. నిశ్చలము, పరిపూర్ణమూ అయిన హృదయ స్థితే సమాధి. ఇందుకు శ్రీమతి మేనేజర్ వంటి ప్రత్యక్ష భక్తులు మన కందించిన స్మృతులే ఆధారం.

సాయి సందర్శనమే చరమోపదేశం. అందుకే సప్తశృంగిదేవి తన పూజారితో సాయిబాబాని ఆశ్రయించమని చెప్పినది. చిన్న కిస్నా రాజా సాహెబ్ అను భక్తుని అతడి యిష్టదైవమైన శ్రీమన్నారాయణుడు గూడ అలానే ఆదేశించారు. అందుకే దర్వేష్షా వంటి సాధువు ఇమాంభాయి చోటే ఖాన్ అనే భక్తునితో శ్రీసాయిని దర్శించమని చెప్పారు. అబ్దుల్లాను అమీరుద్దీన్ అనే సాధువు సాయి వద్దకందుకే పంపారు. ఖేడ్గాఁవ్ నివాసియైన నారాయణ్ మహరాజ్ అనే సిద్ధ పురుషుడు ఎందరినో సాయి వద్దకు పంపిన సంఘటనలను "శ్రీసాయిలీలామృతం"లో చూడవచ్చు.

కనుక శ్రీ సాయిని ప్రత్యక్షంగా గాని, వారి ఛాయా చిత్రం రూపంలో గాని ఆశ్రయించి, వారి అక్షరస్వరూపమైన లీలామృతాన్ని పానం చేయడము మన పూర్వపుణ్యం వలన మనకు లభించిన చరమోపదేశం. ఇక మనం గుర్తించుకొనవలసిన ఆదేశమిదే. "తల్లికి తగిన బిడ్డలుకండి, మీ ఆధ్యాత్మిక ధనాగారాలు నింపుకోండి" అన్న సాయివాక్యమే, నేనెవ్వరినీ మధ్యలోవిడువను; చివరంటా గమ్యం చేరుస్తాను. ''భగవంతుడు నాకప్పజెప్పిన ప్రతిపైసానూ నేనుతిరిగి వారి లెక్కచెప్పవలసి ఉంటుంది" అన్నవే వారి ప్రతిజ్ఞలు.

# శ్రీ సాయిబాబా చిత్రపటం (10)

# కాలకృత్యాలు

శ్రీమతి వేదవతి

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

నిద్రలేవగానే భూదేవిని తాకగానే చెప్పుకోవలసిన ప్రార్థన చెప్పుకున్న తరువాత మనం కాలకృత్యాలకు ఉపక్రమిస్తాము. మనం తీసుకున్న ఆహారం ఆధారంగా బలాన్ని గ్రహించి నిస్సారమైన వ్యర్థ పదార్థాలను మలమూత్రాదుల రూపంలో బయటకు విసర్జిస్తుంది మన శరీరం. నిశ్వాసద్వారా బొగ్గుపులుసు వాయువును (carbon dioxide), చెమట ద్వారా శరీరగత లవణాలను (excess salts), వేడిని, వ్యర్థ పదార్థాలను మూత్రం ద్వారాను, వ్యర్థ ఘనపదార్థాలను మలం ద్వారాను విసర్జిస్తుంది శరీరం. ఆరోగ్యవంతుడికి ఆరోగ్యము, అనారోగ్యవంతుడికి అనారోగ్యము వీటిలో వ్యక్తమవుతుంది. అందుకే వాటిని పరీక్షించినప్పుడు మన దేహ ఆరోగ్య పరిస్థితి వైద్యులకు అర్థమవుతుందన్నమాట.

అలాగే మన భావాలు, ఆలోచనలు, సంస్కారాలు మన ప్రవర్తన ద్వారా వ్యక్తమవుతాయి. అటువంటి మన ప్రవర్తనను ప్రతిక్షణము శ్రీ సాయినాధుడు చెప్పిన ధర్మ ప్రవర్తనతో పోల్చి చూసుకుంటూ వుండాలి. దానినే ఆత్మ విమర్శ చేసుకోవడం అని చెప్పారు పూజ్యశ్రీ మాస్టరుగారు. అలా ఆలోచించినప్పుడు మనలో ఎన్నో విసర్జించవలసిన దుర్గుణాలు మనకే తెలుస్తాయి. కాలకృత్యాలు తీర్చుకుంటునప్పుడు వాటిలో ఒక్కొక్కదానిని భావించుకుని దానిని మనలోంచి విసర్జించినట్లు (తొలగించుకున్నట్లు) భావన చేసుకోవాలి. ఆ తరువాత కాళ్ళు చేతులు



కడుక్కుంటూ వాటి నుండి విముక్తులమై స్వచ్ఛులమైన వారిగా మనలను మనం భావించుకోవాలి.

దీనినే యింకొకరకంగా కూడ భావన చేసుకోవచ్చు. నిరంతరమూ బాబా భావనలో గడపడానికి ప్రయత్నిస్తూ వుండడం కోసం బాబా చిత్రపటాన్ని ఇంట్లో పెట్టుకున్నాము కదా! ఆయన సర్వజ్ఞత్వాన్ని, సర్వవ్యాపకత్వాన్ని, సాక్షిత్వ తత్త్వాన్నీ గుర్తుపెట్టుకున్నంతసేపూ మనం చెడుగా ప్రవర్తించలేము. మనం ఆ సత్యాన్ని విస్మరించిన

సందర్భాలలోనే సామాన్యంగా తప్పులు చేస్తావుంటాము. కాబట్టి కాలకృత్యాలు తీర్చుకునేటప్పుడు అలా ఆయనను మరిచిన

ఆయన సేవలో నిరంతరం నిలిచి ఉండేందుకు ఎన్ని దుష్టసంస్కారాలు విసర్జించుకోవాలో, ఎంత స్వచ్ఛతను పొందాలో భావన చేసుకొని అందుకు ఉత్సాహంగా ఆరోజు ప్రయత్నించాలని దృఢంగా తీర్మానించుకోవాలి.

సమయాన్ని తొలగించుకుంటున్నట్లు, వదిలేస్తున్నట్లు భావన చేసుకోవచ్చు. అందుకు ఆధారమైన మన భావాలను సందర్భాలను, వ్యాపకాలను, పరిచయాల ప్రభావాన్ని తొలగించుకుంటున్నట్లు భావన చేయవచ్చు. ఆ తరువాత కాళ్ళూ, చేతులూ, ముఖమూ కడుక్కుంటూ వాటన్నింటిని తొలగించుకొని స్వచ్ఛులమై శ్రీ సాయి నిలయమైన శిరిడీ క్షేత్రమైన - మన ఇంట్లో అడుగు పెడుతున్నట్లు భావన చేసుకోవచ్చు. తద్వారా సంపూర్ణ శారీరిక, మానసిక ఆరోగ్యం కలవారిగా మనలను మనం భావించుకుంటూ తిరిగి ఆయన సేవను ఉత్సాహంగా చేసుకునేందుకు ఉన్ముఖులం కావాలి. ఆయన సేవలో నిరంతరం నిలిచి ఉండేందుకు ఎన్ని దుష్టసంస్కారాలు విసర్జించుకోవాలో, ఎంత స్వచ్ఛతను పొందాలో భావన చేసుకొని అందుకు ఉత్సాహంగా ఆరోజు ప్రయత్నించాలని దృఢంగా తీర్మానించుకోవాలి.

జాగ్రత్తగా అలోచిస్తే శ్వాసక్రియలాగే విసర్జనక్రియ కూడా మన ప్రమేయం లేకుండా మన శరీరమే జరుపుతుంది. అది సరిగ్గా జరగాలంటే శరీరంలోని ఎన్నో అవయవాలు, వాటి కాధారమైన కణజాలమూ ఎంత సమన్వయంగా పనిచేయాలో కదా! అలా చేయగలగాలంటే వాటన్నింటిని మన ఇష్టాఇష్టాలతోనూ, మన వ్యక్తిత్వంతోనూ మన మనస్సుతోనూ సంబంధం లేకుండా జరిపించగలిగే మరో వ్యవస్థ మనలోనే మనకు తెలియకుండా పనిచేస్తూ వుండాలి. వీటన్నింటినీ సమన్వయపరుస్తూ నిత్యం వాటిని చేస్తూ, పర్యవేక్షిస్తూ అవన్నీ సరిగా జరిగేటట్లు చేసే ఒకానొక ప్రజ్ఞ పనిచేస్తూ వుండాలి. ఆ ప్రజ్ఞలో కొంతభాగం ఆ వ్యవస్థలో మమేకమై పనిచేస్తూ మరికొంత భాగం దానిని పర్యవేక్షిస్తూ వుంటేనే యిది సాధ్యం. దీనినే పరమాత్మలోని సృష్టి తత్వమనీ, సాక్షి తత్వమనీ విభజించారు మన పెద్దలు. మనింట్లోని సాయిపటం సృష్టి అయితే, అందులోని శ్రీ సాయి సాక్షి. ఆ తత్వం మన కాలకృత్యాలలో ఎలా పనిచేస్తున్నదో భావన చేసుకుంటే అవి కూడా మన సాధనలో భాగాలై పోతాయి. ఈ భావనను మనస్సులో నిలుపుకుని ఉదయం దంతధావనానికి (పళ్ళు తోముకోవడానికి) ఉపక్రమిద్దామా?

# శాశ్వత సత్యరూపం

*ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ*

మే 2012

*సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక*

మనభౌతిక దేహానికీ లౌకిక ప్రజ్ఞకూ అనుభవగోచరమయ్యే సాపేక్షిక సత్యానికతీతంగానూ, విరుద్ధంగానూ ఉన్న సత్యాన్ని తరచి, దానిని ప్రఖ్యాత ఆధునిక శాస్త్ర సిద్ధాంతాల దృష్ట్యా చూచాము. ఈ వ్యాసంలో సమగ్రంగా సత్యానికి ఆధ్యాత్మిక తత్త్వం ఏ రూపమిస్తుందో చూద్దాము. ఒక విషయాన్ని స్మరించాలి. ప్రాచీన ఆధ్యాత్మిక వేత్తలు ఒక దృక్పథంతో తదనుశ్రుతక్రమంలో వాస్తవాన్ని చెప్పారు. మన ఆధునిక దృక్పథం దానికి విపర్యంలో ఉంటుంది. అందుకని మనం అవే విషయాలను తరచినా మనకు క్రమం మాత్రం విపర్యయంగా ఉంటుంది. చిన్న దృష్టాంతము - ఇంటినించి ఆఫీసుకు బయలుదేరామనుకోండి. ఇంట్లో బయలుదేరిన మనకు దారి ఈ క్రమంలో కనబడుతుంది. ముందు మనింటితలుపు, దానిముందు వీథి; మనం గుమ్మంలోకి వచ్చాక మనవీథిలోని పొరుగు గడపలు; మెయిన్‌రోడ్ మీదికి నడుస్తూంటే దూరంగా వున్నవి, తారసిల్లుతాయి. కాని ఆఫీసునుండి తిరిగివచ్చేటప్పుడు కూడా అవే గడపలు, వీథులు తారసల్లుతాయిగాని క్రమం మాత్రం ముందుదానికి విపర్యయం: ముందు మెయిన్‌రోడ్ దాటుతాం. తరువాత మనింటికి అన్నింటికంటే దూరంగా ఆ వీథిలోవున్న గడప తారసిల్లుతుంది. చివరకుమన గడప. అలాగే పరమసత్యాన్ననుభవించి ఆ పరిపూర్ణ జ్ఞానస్థితినే ఎప్పుడూ మనస్సులో ధరించి దాన్ని సహజం చేసుకున్న తత్త్వవేత్త సృష్టి అనే మన నివాసం వైపు చూస్తే అతనికి ముందు మన కన్నింటికంటే దూరంగా వున్న ఆధ్యాత్మిక స్థితులు ప్రధానంగా కనపడుతాయి. చివరకు మనం తిరిగితిరిగి ప్రశ్నిస్తే సమాధానంచెప్పేయత్నంలో మాత్రమే క్రమంగా మన గడపలోని సమస్యలమీద దృష్టి పడుతుంది. వారి ఉపదేశాలను ఆచరింపచూసే మనకు వారి మాటలు అందుకే పూర్తిగా అర్థంకావు. వారి దృక్పథాన్ని అనుసరించి వారు చెప్పిన శాస్త్రకారుల అనుభవాలను విపర్యయక్రమంలో చూస్తేకాని మనకు వాటిలోని సత్యం గోచరంకాదు.

ఉదాహరణకు పతంజలి మహర్షి వ్రాసిన యోగసూత్రాలలో మొదటి సూత్రంలో యోగమంటే చిత్తముయొక్క వృత్తుల నిరోధం అని చెప్పారు. నిజానికి సాధకునిదృష్ట్యా చూచినట్లైతే-అంతకంటె

> ***యోగసూత్రాలలో మొదటి సూత్రంలో యోగమంటే చిత్తముయొక్క వృత్తుల నిరోధం అని చెప్పారు. నిజానికి సాధకునిదృష్ట్యా చూచినట్లైతే-అంతకంటె కూడా మనబోటి సామాన్యులదృష్ట్యా ఆ స్థితి సాధన చివరిదశలోకాని అనుభవంలో రాదని తేలుతుంది. "ఐతే పతంజలి మహర్షికి యోగ విజ్ఞానం ఉన్నది గదా, దాన్ని చెప్పే క్రమం తెలియదా?"***

కూడా మనబోటి సామాన్యులదృష్ట్యా ఆ స్థితి సాధన చివరిదశలోకాని అనుభవంలో రాదని తేలుతుంది. "ఐతే పతంజలి మహర్షికి యోగ విజ్ఞానం ఉన్నది గదా, దాన్ని చెప్పే క్రమం తెలియదా?" అనవచ్చు. వాస్తవం అది కాదు. ఆచరించడానికి నిజమైన జిజ్ఞాస, పట్టుదల కలిగి, గురువుమాటమీద, ఆయన జ్ఞాన పదవిమీద సంపూర్ణవిశ్వాసం ఆకాంక్షతో సలిపేవారికే ఆ శాస్త్రాన్ని వారుబోధించేరోజులవి ఈ రోజుల్లోలా అచ్చైందిగదా పుస్తకం అని కొనుక్కొని చదివో చదవకనో, మొదటి రెండు పేజీలు మాత్రమే చదివో, వెంటనే యోగులమవలేదన్న నిరాశా నిస్పృహలతో ఆ పుస్తకంకోసం రెండు రూపాయలు దండుగ చేశామని, బాధపడి, తన అసమర్ధతనంగీకరించడానికి ఆత్మా (దురా)భిమానము అడ్డు రావడంచేత ఆధ్యాత్మికత, దేవుడు, యోగం మొదలైనవన్నీ మూఢవిశ్వాసాలని కబుర్లు చెప్పి తమ ఓటమిని అందమైన ఆధునికతలాగ చిత్రించుకొని తృప్తి పడే రోజులు కావవి. అటువంటివారున్నా వారికి విజ్ఞానాన్ని అందనిచ్చేవారు కారు- ఈ కారణంగానే, సామాన్యమైన మానవుడిలో ఈ తత్వాన్ని విమర్శిస్తూనే గాబోలు అసమాన మానవ తత్వవేత్త, కవి పోప్ "Fools rush where angels fear to tread" ("దేవతలు సహితం అడుగిడను జంకేచోట బుద్ధిహీనులు మాత్రమే దుముకను సాహసిస్తారు") అని.

యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పిన అసమాన తత్వోపదేశమైన శ్రీమద్భగవద్గీతను యధాతథంగా వ్రాయక శ్రీవేదవ్యాసుడు సామాన్యులకు అర్థమయ్యే రీతిన గ్రంథస్థముచేసి, తాను గ్రంథస్థము మాత్రమే చేశానని చెప్పకొన్నారు. అంటే ధర్మాచరణ జనసామాన్యానికి ఉగ్గుపాలతో పెట్టిన విద్యయైన రోజుల్లోనే ప్రజలకు కూడా నిత్యపారాయణకు ఆచరణకూ యోగ్యమైనరీతిలో వ్రాశారు. ధర్మవిశిష్టత, ధర్మతత్వాన్ని గూర్చి అజ్ఞానము, అంతేగాక స్వాభావికంగానే దాని నాచరించడానికి, అర్థం చేసుకోడానికి అవసరమైన సత్యాన్వేషణ జిజ్ఞాసలపట్ల కూడా చులకన భావమూ ఉగ్గుపాలతో పెట్టబడే మన కాలానికి ఆ గ్రంథం ఎంతో జటిలమనిపిస్తుంది. అందుకే ప్రాచీన తత్వశాస్త్రజ్ఞులు చెప్పిన సత్యాన్ని పరిశీలించబోయేముందు క్రమాన్ని మనకర్థమయ్యేలా దిద్దుకోడానికి ముందు స్మరించవలసిన సత్యాన్ని క్లుప్తంగా జ్ఞాపకం చేసుకొందాం.




*శ్రీ రామకృష్ణపరమహంస మహాత్ములలో ఎంతో విశిష్టమైన వారని పూజ్యశ్రీ మాస్టరుగారు తెలియజేసారు. ఆధ్యాత్మిక శ్రేయస్సును కలిగించే శ్రీ రామకృష్ణుల జీవిత చరిత్ర, సంబంధిత గ్రంధాలను పూజ్య బాబుగారు ఎందరి చేతనో పారాయణ చేయించారు. చదువరుల సౌలభ్యం కోసం Sri Manga BharadwajaTrust వారు ఈ పుస్తకాలనుకూడా విక్రయిస్తున్నారు. ఇతర గ్రంధాలలాగానే భక్తులు ఈ పుస్తకాలను ట్రస్టువారి నుండి కొనుక్కొని, ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు.*

# కళ్యాణ దాస చరిత్రము

శ్రీమతి వేదవతి

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

హరిద్వార్‌లో కళ్యాణదాసు అనే ఒక బ్రాహ్మణుడు ఎల్లప్పుడూ భగవంతుడిని ధ్యానిస్తూ వుండేవాడు. అతడు ఒకసారి సముద్రయాత్రకు బయలుదేరాడు. మార్గమధ్యములో వున్న క్షేత్రాలన్నింటినీ దర్శిస్తూ, నదులను సేవిస్తూ చివరకు సముద్రతీరానికి చేరాడు.

అక్కడ ఒక గౌడ బ్రాహ్మణుడు అతనికి తారసపడ్డాడు. అతడు విరాగి, బ్రహ్మచారి, మహా భక్తుడు. అతడు కూడా అన్ని పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ తీర్థయాత్రలు చేసి సముద్ర స్నానానికి వచ్చివున్నాడు. కళ్యాణదాసు ఆ బ్రహ్మచారి యొక్క భక్తి జ్ఞాన వైరాగ్యాలకు ముగ్ధుడై అతడితో స్నేహం చేశాడు. వారిద్దరూ సముద్ర స్నానం చేసి భగవన్నామ సంకీర్తన చేస్తూ తీర్థయాత్ర చేస్తూ మధురకు చేరి అక్కడ కొన్నాళ్ళు నివసించారు. శ్రీ మధురానగరము మహా పుణ్యక్షేత్రము. అది మొదటి శ్రీ మహావిష్ణు అవతారమైన వామనుడి ఆశ్రమము. ఆ తరువాత శ్రీరాముని సోదరుడైన శతృఘ్నుని రాజధాని. అంతేకాదు. ఆ తరువాత అక్కడ శ్రీకృష్ణుడు కూడా జన్మించాడు. అక్కడ వుండగా కళ్యాణదాసు అనారోగ్యముతో ఆరు నెలలు ఎంతో బాధపడ్డాడు. అటువంటి కష్టసమయంలో ఆ బ్రహ్మచారి ఎంతో శ్రద్ధగా కళ్యాణదాసుకు ఉపచారములు చేశాడు. భగవంతుని దయవలన కళ్యాణదాసుకు వ్యాధి నివారణైంది.

అప్పుడు కళ్యాణదాసు బ్రహ్మచారిని చూసి, "నీవెంతో పుణ్యాత్ముడివి. భూత దయ కలవాడవు. ఇటువంటి కష్టసమయంలో నాకెంతో ఉపకారము చేశావు. నేను నీ ఋణము ఎలా తీర్చుకొనగలను? నేనెన్ని జన్మలెత్తినా నీ ఋణము తీర్చుకోలేను. సాక్షాత్తూ ఆ భగవంతుడే నీ రూపంలో నన్ను ఆదుకున్నాడు. ఇందులో సందేహము లేదు. అందరిలోనూ వుండి సాక్షీభూతుడై కర్మలకు ఫలితములను యిచ్చేవాడు ఆయనే కదా! నేను ఒంటరిగా తీర్థయాత్రకు వచ్చినప్పటినుంచి నాకటువంటి రోగం వస్తుందని సర్వజ్ఞుడు, లోకనాధుడు నా సర్వస్వము అయిన ఆ శ్రీమహావిష్ణువే నీ రూపంలో వచ్చి నాకు సహాయం చేశాడు. సాక్షాత్తూ భగవంతుడి స్వరూపమైన నీకు నా కుమార్తెనిచ్చి వివాహం చేయాలని భావిస్తున్నాను. ఇందుకు నీవు తప్పకుండా అంగీకరించవలసినది", అన్నాడు. అది విని ఆ బ్రహ్మచారి, "ఓ మహాత్మా! నేను ఆజన్మాంతమూ బ్రహ్మచర్యము అనుష్ఠించి ఉత్తమ గతిని పొందాలని నిశ్చయించుకున్నాను. అటువంటి నా మీద కొంచెమైనా దయలేకుండా సంసారసముద్రంలో బడదోయాలని ఎందుకు ప్రయత్నిస్తున్నావు? గృహస్థాశ్రమము ఎన్నో మాలిన్యాలకు కారణము. మనస్సును భగవంతుడి మీద నిలువనివ్వదు. సంసారమనే సముద్రము ఆశ అనే నీటితోటి, కోరికలనే వాయువుచేత తీవ్రరూపం దాల్చిన మోహమనే అలలతోను, భార్యయనే సుడిగుండముతోను, పుత్రులు, సహోదరులనే మొసళ్ళతోనూ కూడి ఎంతో భయంకరమై దాటనలనిగానిది. అటువంటి క్రూరమైన సంసార సాగరంలో చిక్కుకోకుండా తప్పించుకొని

జీవించాలనుకున్న నన్ను నీవెందుకు కొంచెమైనా దయలేకుండా అందులోనే పడవేయాలని చూస్తావు? నేను నీకు ఏమి అపకారము చేశాను?" అంటూ వున్న ఆ బ్రహ్మచారిని చూసి కళ్యాణదాసు యిలా అన్నాడు.

"నాయనా! బాధపడకు. ఒకడు భార్యాపిల్లలతో కలిసి ఒక ఇంటిలో నివసిస్తూ వున్నంతమాత్రాన సంసారి అని, అది లేకపోయినంత మాత్రాన విరాగి అని భావించకు. విరక్తులై సంసారాన్ని త్యజించి ఆకులు, అలములు తింటూ, ఆకలిబాధతో అలమటిస్తూ నిర్జనప్రదేశాలలో నివసించిన సౌభరి, కండు, భరతుడు మొదలైనవాళ్ళు పడిన పాట్లు నీకు తెలుసుకదా! సంసారంలో వుంటూకూడా జలగలాగ దేనికీ అంటకుండా వైరాగ్యము మొదలైన సద్గుణ సంపత్తితో లోకంలో పూజ్యులై ఉత్తమ సిద్ధిని పొందిన జనకమహారాజు, విదురుడు మొదలైనవారి జీవిత చరిత్రలు పురాణాలలోను, ఇతిహాసాలలోనూ సుప్రసిద్ధమయ్యాయి కదా! నాకు తెలిసినంతలో నీకు శ్రేయస్కరమైనది చెబుతాను. ఈ సకల చరాచర జగత్తు తత్త్వతః భగవంతుడి స్వరూపమే. ఆయనే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల రూపం ధరించి త్రిగుణాత్మకమైన ఈ జగత్తును సృష్టించాడు. అందులో చిత్తు, అచిత్తు అనేవి ఆ భగవంతునికి అధీనమై ఆయన వినియోగం కోసం వుంటాయి.

*నిష్ఠ కలిగినవాడు సంసారంలో వున్నా పరిశుద్ధుడిగానే వుంటాడు. సంతానము, భార్య, ఇల్లు, మొదలైనవే మమకారాన్ని పెంపొందించేవని భావించకు. వీనిని త్యజించినవాడికి కాషాయవస్త్రము, కమండలము, ఆసనము మొదలైనవి మమకారం కలిగించవని నమ్మకమేమిటి? ఇవి కూడా వదిలివేసినవాడికి శరీరము మమకారం కలిగించదా?*

చిత్తు అనేదే ఆత్మ. అది ఆ పరమాత్మకు నివాస స్థానం. కానీ ఆత్మ అహంకార మమకారాలనే వికారాలతో నిండి వుండటంవలన జీవుల హృదయం భగవంతుడు నివసించడానికి యోగ్యము కాకుండా పోతోంది. బుద్ధిమంతుడు ఈ రెండు వికారాలను దూరముగా తరిమివేసి తన హృదయాన్ని భగవంతుని ఆలయంగా మార్చి శమము, దమము అనే నీటి చేత ఎప్పుడూ దానిని శుభ్రపరచుకుని అందులో భగవంతుణ్ణి ప్రతిష్ఠించుకోవాలి. అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యము అనే ఎనిమిది రకాలైన పూవులతో ఆయనకు నిత్యము పూజ చేస్తూ వుండాలి. మనకు ఆ భగవంతుడు అమూల్యమైన మానవ జన్మను ప్రసాదించినదిందుకే! దీనికి వ్యతిరేకంగా ఇంద్రియలోలత్వంతో వ్యర్థంగా కాలము గడిపే వారికి అంతులేని దుఃఖము తప్పదు. ఈ నిష్ఠ కలిగినవాడు సంసారంలో వున్నా పరిశుద్ధుడిగానే వుంటాడు. సంతానము, భార్య, ఇల్లు, మొదలైనవే మమకారాన్ని పెంపొందించేవని భావించకు. వీనిని త్యజించినవాడికి కాషాయవస్త్రము, కమండలము, ఆసనము మొదలైనవి మమకారం కలిగించవని నమ్మకమేమిటి? ఇవి కూడా వదిలివేసినవాడికి శరీరము మమకారం కలిగించదా? విషము కొంచమైనా, ఎక్కువైనా ప్రాణం తీయకలిగే సామర్థ్యం కలిగివుంటుంది. అలా మమకారం కలిగించేవి, కొన్నే అయినా, లేదా అనేకములైనా (చాలా అయినా) మానవుడి దీక్షను భగ్నం చేసి భగవంతుణ్ణి విస్మరించేలా చేస్తాయి. కాబట్టి అడవులలో నివసిస్తూ మనస్సును నిగ్రహించుకోవడానికి సామర్థ్యము లేకుండా శరీరము పట్ల, దానికి సంబంధించిన వేటిపట్లయినా మమకారం కలిగివుండడము కంటే ఇంట్లోనే నివసిస్తూ సంతానాన్ని, భార్యను, ఇంటిని, పొలమును భగవంతునికి చెందినవని భావిస్తూ తనకు వేటితోనూ నిజానికి ఎట్టి సంబంధమూ లేదని గుర్తించి మమకారం లేకుండా వుండేవాడికి మోక్షము సిద్ధిస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఎవరైతే తాను చేసే కర్మలను భగవంతునికి సమర్పించి వాటిపట్ల నిర్లిప్తుడై వుంటాడో

అటువంటివాడు తామరాకుమీద నీటి బొట్టులాగా ఏ పాపమూ అంటనివాడైవుంటాడు. ఈ విషయాన్ని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పాడు కదా! కాబట్టి నేను చెప్పిన విషయాన్ని విని నా కుమార్తెను వివాహం చేసుకుని భగవంతుని యందే మనస్సు నిలిపి అహంకార మమకారాలకు లోబడకుండా నీ ఇల్లు అనే తపోవనంలో విరాగిగా నిరంతరమూ భగవంతుణ్ణి ధ్యానించు. నీ భారాన్నంతా ఆ భగవంతుడే వహించి నీ యోగక్షేమాలను ఆయనే వహిస్తూ వుంటాడు. నీలోని అంతర్యామిగా నీ రూపంలో ప్రకాశిస్తూవున్న శ్రీమన్నారాయణునికి మానసికంగా నా కుమార్తెనిచ్చి వివాహం చేశాను. కాబట్టి శ్రీ వాసుదేవుడి సాక్షిగా నా కుమార్తె నీకే భార్య అయింది. ఇది ఇలా వుండగా గృహస్థాశ్రమము త్యజించదగినదని చెప్పావు. గృహస్థాశ్రమ ధర్మాన్ని చెబుతాను, విను:-

'బుద్ధిమంతుడైనవాడు బ్రహ్మచర్యాన్ని పాటించిన తరువాత విధిగా ఒక కన్యను వివాహం చేసుకోవాలి. తనకు తగిన వృత్తిని చేస్తూ సంపాదించి గృహస్థ ధర్మాన్ని తన శక్తిమేరకు నిర్వర్తించాలి. ఎల్లప్పడూ పిండ ప్రదానము చేత, నువ్వుల (తిల)తో కూడిన నీటితోను పితృదేవతలను, యజ్ఞయాగాదులు చేస్తూ దేవతలను, భోజనము చేత అతిథులను, వేదాధ్యయనము చేస్తూ ఋషులను, సంతానం ద్వారా బ్రహ్మను, భూతబలి ద్వారా సకల భూతాలను, పాడి (పశుపోషణ) ద్వారా సకలలోకాలను తృప్తిపరచాలి.

ఇలా చేస్తూ వుండే గృహస్థు పుణ్యలోకాలను పొందుతాడు. సన్యాసులు, బ్రహ్మచారులు గృహస్థుమీదే ఆధారపడి జీవిస్తూ వుంటారు. కాబట్టి గృహస్థ ధర్మము ఎంతో గొప్పది. అంతేగాక వేదాభ్యాసం కోసము, తీర్థయాత్రలకోసము, పుణ్యక్షేత్రాలను దర్శించడం కోసము బ్రాహ్మణులు తమ ఊరిని విడిచి వెళ్ళవలసి వస్తూ వుంటుంది. కొంతమంది ఏ ఒక్క ప్రదేశములోనూ నివసించకుండా సూర్యాస్తమయ సమయానికి ఏ ప్రదేశంలో వుంటారో అదే తమ స్వగృహంగా భావిస్తూ ఆరాత్రికి అక్కడ విశ్రమిస్తూ సంచరిస్తూ వుంటారు. ఇటువంటి వారందరికీ గృహస్థుడే పోషకుడు. అటువంటి సంచారులు వచ్చినపుడు కుశల ప్రశ్నలు వేస్తూ తీయని మాటలతో సాదరంగా ఆహ్వానించి ఆసనాన్ని, భోజనాన్ని, నిదురించేందుకు ఏర్పాట్లూ చేసి వారిని సంతోషింపజేయాలి. అతిథి అయినవాడు ఏ గృహస్థు ఇంటికి వచ్చి ఆదరణలేక మరలిపోతాడో ఆ అతిథి ఆ గృహస్థుకు తన పాపాన్నిచ్చి అతడి పుణ్యాన్ని తీసుకుని పోతాడు. గృహస్థుకు యితరులను అవమానించే స్వభావము, అహంకారము, దర్పము, ఒకడికి ఒక వస్తువునిచ్చి బాధపడడము, కొట్టడము, తిట్టడము మొదలైనవన్నీ శ్రేయస్కరములు కావు. ఇటువంటి ఏ దుర్గుణాలు లేకుండా సద్గుణవంతుడై ఏ గృహస్థు స్వధర్మాన్ని చక్కగా పాటిస్తాడో వాడికి అన్ని అనర్థాలు తొలగి ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి. ఇలా గృహస్థ ధర్మాన్ని చక్కగా పాటించి వృద్ధాప్యములో భార్యను కుమారుడికప్పగించి లేదా భార్యతో కలిసి అడవికి వెళ్ళవచ్చు. కాబట్టి నీవు నా కుమార్తెను వివాహమాడి ఉత్తమమైన గృహస్థాశ్రమములో వుండి అహంకార మమకారాలను జయించి అన్నీ చేసేవాడు చేయించేవాడు ఆ పరమేశ్వరుడే అని, కనిపించేవన్నీ ఆయన రూపాలేనని, ఇతరులకు మనవలన జరిగే ఉపకారాలన్నీ శరీరధారి అయిన భగవంతుడికే చెందుతాయనీ దృఢముగా గుర్తుపెట్టుకొని ఇంతకుముందు నేను చెప్పినట్లు ఎల్లప్పడూ మనస్సులో భగవంతుడినే స్మరిస్తూ జీవితం గడుపు. భగవంతుడు ఎల్లప్పడూ నీ వెంటే వుంటాడు" అని చెప్పాడు. అప్పడా బ్రహ్మచారి కళ్యాణదాసుని చూసి, "ఓ మహానుభావా! సాక్షాత్తూ భగవంతుడే నీ రూపంలో సాక్షాత్కరించి నాకు జ్ఞానోపదేశం చేశాడు. నా జన్మ ధన్యమైంది. నీ ఉపదేశమనే సూర్యోదయము వలన నా అజ్ఞానమనే కారుచీకటి తొలగిపోయింది. నీవు నన్ను అజ్ఞానాంధకారంలో పడిపోకుండా రక్షించావు. ఓ మహానుభావా! నీ అనుగ్రహం వలన నా అవివేకము తొలగి జ్ఞానం లభించింది. సందేహాలన్నీ తొలగిపోయి స్థిరత్వమొచ్చింది. ఇక నీ ఆజ్ఞానుసారం ప్రవర్తిస్తాను" అని విన్నవించాడు. అప్పడు ఆ బ్రహ్మచారిని తీసుకుని కళ్యాణదాసు మధురానగరిలో వున్న భగవంతుడి సన్నిధికి వెళ్ళి

శ్రీకృష్ణుని ఎదురుగా నిలబడి అతనితో, "సాక్షాత్తూ భగవంతుడి యొక్క స్వరూపమైన నిన్ను అల్లుడిగా భావించి నా కుమార్తెను యిస్తున్నాను" అని చెప్పి అతని చేతిలో నీరు విడిచి ఆమెను ధారాదత్తం చేశాడు.

తరువాత కళ్యాణదాసు ఆ బ్రహ్మచారితో కలిసి హరిద్వార్ చేరి ఇంటికి వెళ్ళి తన బంధువులను పిలిపించి విషయాన్ని వారికి వివరించాడు. అది విని వారందరూ ఏక కంఠంతో కళ్యాణదాసునుద్దేశించి, "నీకేమైనా మతిపోయినదా? పంచద్రావిడులకు, పంచగౌడులకు ఇదివరకు ఎక్కడైనా సంబంధం కలిసినదా? అటువంటప్పుడు మన అమ్మాయిని ఈ గౌడ బ్రాహ్మణ బ్రహ్మచారికిచ్చి ఎలా వివాహం చేయదలచావు?" అని ఆక్షేపించారు.

అది విని కళ్యాణదాసు కలతచెంది, "బంధుజనులారా! ఈ బ్రహ్మచారి సద్గుణాలను చూసి నేను శ్రీకృష్ణుని సన్నిధి అయిన మధురలో ఇతనికి నా కుమార్తెనిచ్చి వివాహం చేస్తానని వాగ్దానం చేశాను. ఇచ్చినమాట తప్పితే నరకము ప్రాప్తిస్తుందని ఉపనిషతులు (స్మృతులలో) చెప్పాయి కదా! ఇతడు బ్రాహ్మణుడేకాని ఇతర కులం వాడుకాదు. గౌడుడైనంతమాత్రాన ఇతను బ్రాహ్మణుడు కాదా? పైగా గుణవంతుడే కన్యాదానానికి అర్హుడని పెద్దలు చెప్పివున్నారు కదా! కాబట్టి బంధువులైన మీరందరూ నా మీద దయతో నా వాగ్దానమును నెరవేర్చి నాకు నరకప్రాప్తి లేకుండా రక్షించవలసినది" అని ప్రార్థించాడు. కళ్యాణదాసుడెంతగా బతిమాలినా ఆ బంధువులు ఆ సంబంధానికి అంగీకరించలేదు.

అప్పుడు కళ్యాణదాసుడు ఆ దేశపు రాజు దగ్గరకు వెళ్ళి జరిగిన వృత్తాంతమంతా ఆయనకు తెలిపి తనకు న్యాయము చేయవలసినదిగా ప్రార్థించాడు. ఆ రాజు రెండు వైపులవారి అభిప్రాయాలను తెలుసుకొని కళ్యాణదాసుతో, "ఓ మహానుభావా! నీ బంధువులు చెప్పినది న్యాయమే. ఈ దేశంలో నీ బంధువులు చాలామందే వున్నారు. వీరందరూ నిన్ను ద్వేషించి నిన్ను వెలివేసే పరిస్థితి నీకు మంచిదికాదు. ఇక నీ విషయం ఆలోచిస్తే యిచ్చిన మాట తప్పడం వల్ల నరకము ప్రాప్తిస్తుందనడంలో సందేహము లేదు. నీవు నిజంగానే ఈ బ్రహ్మచారికి వాగ్దానము చేశావనే నిరూపణగా ఎవరైనా సాక్షులున్నారా? "భగవంతుడైన శ్రీకృష్ణుని సన్నిధిలో వాగ్దానము చేశాను" అని చెబుతున్నావు. నీవు వైరాగ్యము మొదలైన సద్గుణాలు కలవాడివి గనుక నీవు నిజమే పలుకుతున్నావని నాకు తెలుసు. అయినా లోకులు అంగీకరించరు. నీవు ఆ మధురానగరిలో వెలసివున్న శ్రీకృష్ణుని ఇక్కడకు తీసుకొనివచ్చి సాక్ష్యము చెప్పించినట్లయితే అందరూ నీమాటను అంగీకరిస్తారు. నీవలా చేయలేకపోయినట్లయితే ఈ శుభకార్యము జరిపించడం చాలా కష్టము" అని చెప్పాడు. అది విని కళ్యాణదాసు ఆ రాజును చూసి, "ధర్మానికి ప్రభువు ఆ శ్రీకృష్ణుడే కదా! నేను ఆయననే స్మరించడం వలన నా యోగక్షేమాలు ఆయనే వహిస్తున్నాడు. ఈ విషయం నిజమే అయితే నా ప్రార్థన విని ఆ భక్తవత్సలుడే యిక్కడికి వచ్చి సాక్ష్యము చెబుతాడనడంలో ఏ సందేహమూ లేదు. ధ్రువుడి భక్తికి మెచ్చి అతనికి ఉన్నతమైన పదవిని యిచ్చి అనుగ్రహించినది, గజేంద్రుడిని రక్షించినది, ప్రహ్లాదుడికోసం, సభా స్థంభమునుండి అవతరించినది, శరణుపొందిన ద్రౌపదికి ఆపద సమయంలో వస్త్రములు ప్రసాదించినది, యింకా అనేకమంది భక్తుల బాధలను తొలగించి తానే వారి రక్షణ భారాన్ని వహించినది నిజమే అయితే అటువంటి ఆపద్బాంధవుడు నాకోసం ఇక్కడికి వచ్చి సాక్ష్యము చెప్పకుండా వుంటాడా? మీరు కొంచెం వేచివుండండి. నేనిప్పుడే వెళ్ళి ఆ దీనబాంధవుణ్ణి ఇక్కడకు తీసుకునివస్తాను" అని చెప్పి వెంటనే మధురానగరానికి బయలుదేరాడు. అతడక్కడికి చేరి దేవాలయంలో ప్రవేశించి భగవంతుడికి శతకోటి నమస్కారాలు సమర్పించి, "దేవాధిదేవా! నేను నీ సన్నిధిలో గౌడ బ్రాహ్మణ బ్రహ్మచారికి చేసిన వాగ్దానాన్ని నా బంధువులు, రాజు నమ్మకుండా నీ సాక్ష్యాన్ని కోరుతున్నారు. నిన్ను శరణన్న వారిని ఎల్లప్పుడూ రక్షించే ఆపద్బాంధవా! ఈ విషయం మరొక్కసారి ప్రపంచానికి చాటి చెప్పడానికి మంచి సమయమాసన్నమైంది. ధృవుణ్ణి, గజేంద్రుని,

ప్రహ్లాదుని వారి వారి ప్రదేశాలకు వెళ్ళి రక్షించినట్లు, నీవు ధర్మాన్ని స్థాపించడానికి నాతో హరిద్వారానికి వచ్చి సాక్ష్యము చెప్పవలసినది. "ఎప్పుడెప్పుడు ధర్మానికి హాని కలుగుతుందో అధర్మానికి అభివృద్ధి కలుగుతుందో అప్పుడప్పుడు నేనవతరిస్తాను" అని భగవద్గీతలో నీవే చెప్పావు కదా! ఆ వాక్యము సత్యమైతే నా వెంట వచ్చి ధర్మరక్షణ చేయి" అని విన్నవించాడు.

అప్పుడు భగవంతుడు కళ్యాణదాసుని చూసి, "నాయనా! నీవు చెప్పినది నిజమే. కానీ విగ్రహరూపంలో వుండే నేను నడిచి రావడం సాధ్యము కాదు. అయినా నేను నా భక్తులకోసమే వున్నాను గనుక నాకు అంతరంగ భక్తుడవైన నీకోసం నేను నడిచివచ్చి నా వాత్సల్యాన్ని నిరూపిస్తాను. నీవు తిరిగి చూడకుండా ముందుకు నడు. నేను నీ వెనుకే వస్తాను" అని చెప్పాడు. కళ్యాణదాసు ముందు నడుస్తూ వుండగా శ్రీకృష్ణుడు అన్ని ఆభరణాలు ధరించి దివ్య పరిమళ సుగంధములు వెదజల్లుతూ కాళ్ళ గజ్జలు మ్రోగుతూవుంటే కళ్యాణదాసు వెనుక నడచాడు. ఇలా వీరిద్దరూ రేయింబవళ్ళూ నడిచి హరిద్వార్‌కు కొద్ది దూరంలో వుండగా ఇంతలో గజ్జల శబ్దము వినపడడం ఆగిపోయింది. కళ్యాణదాసు వెనుకకు తిరిగి చూశాడు. శ్రీకృష్ణుడు అక్కడే నిలబడి కళ్యాణదాసుని చూసి, "నన్ను వెనుదిరిగి చూడవద్దని నీతో చెప్పాను కదా! నీవు నా ఆజ్ఞను పాటించేవరకూ నీవెంటే వచ్చాను. ఇక ఈ చోటు వదిలి కదలను. నేనిక్కడ వున్నానని రాజుకు, నీ బంధువులకు తెలియపరచి అందరినీ ఇక్కడకు తీసుకుని రా" అని ఆజ్ఞాపించాడు. కళ్యాణదాసు త్వరత్వరగా హరిద్వార్‌కు వెళ్ళి రాజుకు, తన బంధువులకు విషయము తెలియజేశాడు. అది విని వారందరూ ఆశ్చర్యచకితులై కళ్యాణదాసు వెంట వచ్చి శ్రీకృష్ణుని దర్శించి ప్రదక్షిణలు, నమస్కారాలు చేసి ఆ భగవంతుణ్ణి పరిపరివిధముల కీర్తించారు. భగవంతుడు రాజును, కళ్యాణదాసు బంధువులను చూసి, "ఈ కళ్యాణదాసుడు నాకెంతో సన్నిహితుడు. వైరాగ్యము మొదలైన గుణవిశేషాలతో పరిపూర్ణులైనవారికి నేను సేవకుడను. నేనెల్లప్పుడూ వారి అధీనంలో వుంటాను. వారి మనస్సుననుసరించి ప్రవర్తిస్తాను. అటువంటి వారి కోసమే జన్మరహితుడనై కూడా అనేక అవతారములెత్తుతూవుంటాను. అవ్యక్తుడను, అచింత్యుడనై కూడా నేను నా అంతరంగిక భక్తులకోసం నామరూపాలు ధరించాను. నా హృదయాన్ని సాధువులు, వారి హృదయాన్ని నేను తెలిసికొని వుంటాము గాని, మా ఇరువురి హృదయ పరిపాకము జగములో ఇంకెవ్వరికీ తెలియదు. ఇతడు తన కుమార్తెను ఈ బ్రహ్మచారికిస్తానని నా సన్నిధిలో మాట యిచ్చాడు. అలా జరగడం నాకు చాలా సమ్మతము. కాబట్టి అతడు గౌడ బ్రాహ్మణుడని భావించకుండా యితని కుమార్తెను ఆ బ్రహ్మచారికిచ్చి వివాహం జరిపించండి" అని ఆజ్ఞాపించాడు. వారందరూ ఎంతో ఆనందించి మహాభాగ్యమని ఆయన ఆజ్ఞను శిరసావహించి, "ఆశ్రిత భక్తవత్సలా! నీ భక్తుని మహాకార్యాన్ని నీవే నిర్వర్తించవలసినది" అని విన్నవించారు.

భగవంతుడు స్మరించగానే విశ్వకర్మ వచ్చి వివాహమంటపాన్ని నిర్మించాడు. కామధేనువు, కల్పవృక్షము కూడా ప్రత్యక్షమై అవసరమైన అన్ని పదార్థాలను నిరంతరాయముగా యిస్తూ వున్నాయి. దేవతలందరూ వచ్చి మిగిలిన పెండ్లి పనులను నిర్వహించారు. ఆకాశంలో దేవదుందుభులు మ్రోగాయి. దేవతలు పూలవర్షము కురిపించారు. అందరూకలిసి వధూవరులను అలంకరించి వివాహము జరిపించారు. బంధుమిత్రులు అతిథి మర్యాదలతోను భోజన, వస్త్ర, ఆభరణాలతోను తృప్తిచెంది తమ తమ స్వస్థానములను చేరారు. శ్రీరుక్మిణీ కాంతుడైన శ్రీకృష్ణభగవానుడు ఆశ్రితవత్సలుడై నేటికీ అక్కడే వెలిసి వున్నాడు.

# శ్రీ దత్తలీలామృతము

శ్రీమతి శ్రీదేవి

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

## మార్చి సంచిక తరువాయి

"అయ్యా! మీరెవరు?" అని చిత్రకేతుడు భగవానుని అడిగే సందర్భంలో ''రోమశ, శ్చవనో, దత్త, ఆసురిస్సపతంజలి:....'' – అంటే "రోమశుడు, చ్యవనుడు, ఆసురి. పతంజలి అనేటటువంటి మహానుభావులలో మీరు ఎవరైవున్నారు?" అని ప్రశ్నించినట్లు చెప్పబడి వున్నది.

హరివంశములో వైశంపాయనుడు "భూయో భూతాత్మకో విష్ణు: ప్రాదుర్భావో మహాత్మన: దత్తాత్రేయ యతిభ్యాత:....'' అని తెలియపరచే సందర్భంలో విష్ణుమూర్తి దత్తాత్రేయుడై అవతరించెనని చెప్పటమే కాక యింకా యిట్లా చెప్పాడు– "వేదములు, యజ్ఞక్రియలు, నాలుగు వర్ణములు, వాటి వాటి ధర్మములు చెడిపోగా దత్తుడు మరలా వాటినన్నింటినీ పునరుద్ధరించాడు. కార్తవీర్యునికి ఎన్నెన్నో వరములనిచ్చాడు". ఈ విధంగా వైశంపాయనుడు దత్తాత్రేయ స్వామిని ప్రశంసించాడని వేదధర్ముడు దీపకునికి తెలియజేశాడు.

అపుడు దీపకుడు "గురుదేవా! దత్తయోగీంద్రులు సాధ్యులకు నీతులు చెప్పారని విన్నాను. వాటిని నాకు కూడా తెలియజేయమని ప్రార్థిస్తున్నాను", అని వేడుకొనగా వేదధర్ముడు యీ విధంగా చెప్పసాగాడు–

"వత్సా! పరమేశ్వరుడు ప్రజ్ఞానఘనుడు. అటువంటి సర్వోన్నతుడైన స్వామి శ్రీ దత్తాత్రేయునిగా మనకోసం యీ భూమిపై అవతరించారు కనుక, నర, సుర, సిద్ధ, సాధ్యాదులందరూ కూడా వారి వారి అభీష్టములననుసరించి భక్తి, జ్ఞాన యోగములను గురించి మాత్రమే కాదు, తమకు కావలసిన విషయములనన్నింటినీ ఆ స్వామినడిగి తెలుసుకొంటూ వుంటారు. అలా స్వామి అనుగ్రహానికి పాత్రులై కృతార్థులౌతుంటారు.

దీపకా! ఒకసారి విదురుడు ధృతరాష్ట్రుని వద్దకు వెళ్లాడు. అప్పుడతడు దుర్యోధనుని గురించి హెచ్చరికగా



ధృతరాష్ట్రునితో యీ విధంగా అన్నాడు– "అయ్యా! మీ పెద్దకొడుకు దుర్యోధనుడు నీతి విహీనుడై చెడు ప్రవర్తనకు లోనై అధర్మపరుడుగా మెలుగుతూ వుంటే నువ్వు యేమీ మాట్లాడకుండా, అతడిని వారించకుండా చూస్తూ వూరుకుంటున్నావు. ఈ విధంగా అతడిని నీవు చెడు ప్రవర్తనకు ప్రోత్సహిస్తున్నవాడవవుతున్నావు. అతనికి తగు రీతిన బుద్ధులు గరపి సరిదిద్దవలసిన బాధ్యత తండ్రివైన నీపై వున్నదని తెలియదా? ఈ విధంగా ఉపేక్షించటం నీకు తగునా? ఈ పరిస్థితిని యిలాగే కొనసాగిస్తే మీకు కీడు వాటిల్లుతుంది సుమా!'' విదురుని మాటలు విన్న ధృతరాష్ట్రుడు "విదురా! దుర్యోధనుని దుష్ప్రవర్తనకు నేను కూడ చింతిస్తున్నాను. అతనిలో మార్పు తీసుకురావాలంటే ఆయా ధర్మములనన్నింటినీ వివరంగా చెప్పు" అని అడిగాడు. అప్పుడు విదురుడు "పూర్వము ఒకప్పుడు సాధ్యులు దత్తయోగీంద్రుని కడకు వచ్చి నీతిసంబంధమైన ధర్మములను తెలుపమని ప్రార్థించగా స్వామి, వారికి చెప్పిన నీతులు

నీకు యిప్పుడు చెబుతాను" అంటూ యిలా చెప్పాడు– "ఎల్లప్పుడూ మంచి విషయాలను శ్రవణము చేస్తూ వుండాలి. శ్రవణము వలన శాంతి, సత్యనిరత, ధృఢత్వము పెంపొందుతాయి. ఆ సద్గుణములవల్లనేకదా, హృదయగ్రంథి విచ్ఛేదము సంభవిస్తుంది. క్రోధము అనే గుణాన్ని క్రోధముచే అణచటం సాధ్యపడదు. ఓర్పు చేత దానిని నియంత్రించ వచ్చును. ఎవరి కోపము వారినే దహించివేస్తుంది. అంతేకాదు. అటువంటి కోపము అనే గుణము పూర్వజన్మ సుకృతమునుగూడ హరించి వేస్తుంది. పరులను దు:ఖపెట్టరాదు. అవమానింపరాదు. మిత్రులకు ద్రోహము చేయకూడదు. నీచులను సేవింపరాదు. దురభిమానము కూడదు. నీచవృత్తిని అవలంబింపకూడదు. కఠినముగా మాట్లాడరాదు. వాక్పరుష్యము ఎదుటివారి హృదయములను ఎంతగానో క్షోభింపజేస్తుంది. కఠినముగా మాటలాడి ఎదుటివారిని నొప్పించుట వలన మహాపాపము సంక్రమిస్తుంది. కనుక పుణ్యాత్ముడైనవాడు పరుషవాగ్రూప పాపమునకు ఒడిగట్టరాదు. మర్మములను తెలుపునట్లుగా పరుషముగా మాట్లాడువాని ముఖమున పెద్దమ్మ (దరిద్రదేవత) కాపురముంటుంది. ఇక అటువంటి పాపాత్ముడైన మనుష్యుని చూచి వాణి (సరస్వతి) భయపడి పారిపోతుంది. ఎంతో తీక్షణములై నిప్పువలె హృదయాన్ని దహించునట్లుగా వుండే వాగ్బాణములు గుచ్చుకొని ఎంతగానో బాధిస్తున్నప్పటికీ ఎవడైతే చలింపక నవ్వుతూ వుంటాడో అటువంటి వాడే ఉత్తముడైన పుణ్యాత్ముడు. వాడే కదా, పుణ్యముల పంట పండించుకొన్నవాడు! తనను తిట్టినవానిని తాను తిట్టక, తిట్టింపక, తనను కొట్టినవానిని తాను కొట్టక, కొట్టింపక, తనకు ద్రోహము చేసిన వానికి తాను ద్రోహము చేయక, చేయింపక శాంతమనస్కుడై, సహనశీలియై జీవించువానిని వేల్పులు ఎదురువచ్చి తోడ్కొని పోతారు.

సభలలో మాట్లాడటం కంటే మౌనంగా వుండటం మంచిది. ఒకవేళ మాట్లాడినప్పటికీ అది సత్యమైనది అయినట్లయితే రెండు రెట్లు మంచిది. ఆ సత్యము ప్రియమైనది అయినట్లయితే – అంటే అది ఆనందదాయకము, శ్రేయోదాయకము అయినట్టి సత్యమైతే మూడు రెట్లు మంచిది. ఆ మాట సత్యమైనది, ప్రియమైనదేకాక ధర్మబద్ధమైనది అయినట్లయితే నాలుగురెట్లు మంచిది.

అంతేకాదు, సజ్జనుని, దుర్జనుని, తపస్విని, దొంగను – యిలా రకరకములయిన జనులను కూడి, వారి సాంగత్యంలో మెలగుతున్నప్పుడు వారి వారి గుణములే అలవడుతాయి. తాను ఎట్టివారిని చెంత చేర్చుకొనునో, తానెట్టివారి కడనుండునో, తానెట్టివాడు కాగోరునో తానట్టివాడు అవుతాడనటంలో సందేహమేముంటుంది? దేని దేనినుండీ తాను తొలగుచుండునో దానిదాని నుండీ వాడు విముక్తుడు అవుతుంటాడు. ఈ విధంగా క్రమక్రమంగా సకల విషయాలనుండీ విముక్తుడైన వాడిని ఏవిధములయిన పరిస్థితులు బాధింపవు. ఎటువంటి స్థితిలోనైనా చలింపక నిశ్చల నిర్వికార స్థితిని అతడు అందుకొనగలుగుతాడు. అదే దు:ఖరహిత స్థితి. అదే నిత్యానందస్థితి. అటువంటి వాడు నిందను, ప్రశంసను సమానముగానే స్వీకరిస్తాడు. అతడు పరులను జయించి తాను ఆధిక్యస్థితిని అందుకొనాలనుకొనడు. అదే విధంగా ఎటువంటి స్థితినీ ఓటమిగా భావించి కించపడడు. ఎవరిపైనను పగ, ద్వేషము పెట్టుకొనడు. ఎవరికీ కూడా అతడు పగవాడుగా వుండడు, అటువంటి వాడికి దు:ఖము లేదు. సంతోషము లేదు. అటువంటి పుణ్యాత్ముడు అందరి మేలునే కాంక్షిస్తూ వుంటాడు. ఎల్లప్పుడు సత్యమునే పలుకుతూ వుంటాడు. ఇంద్రియ నిగ్రహము కలవాడై వుంటాడు. అటువంటి సాధువే కదా ఉత్తమ పురుషుడు! తన యింటికి వచ్చే యాచకులను ఆదరిస్తుంటాడు. ఇతరులకు 'యిస్తాను' అన్న వస్తువును గాని, దేనినైనాగానీ ఎట్టి పరిస్థితులలోనైనా యిచ్చి మాట నెరవేర్చుకొంటాడుగానీ మాట తప్పటము అనేది చేయనే చేయడు. అంతేకాదు. అతడు గొప్పక్షమాగుణము కలవాడై వుంటాడు. అందువల్లనే అతడు యితరులలోని లోపములను వెదకి ఎత్తిచూపే గుణములేనివాడై స్వచ్ఛమైన హృదయంతో తప్పుచేసిన వారిని క్షమిస్తూ వుంటాడు. అంతేకాదు, వారిని కూడా ప్రేమిస్తూ వారి మేలు కోరేవాడైవుంటాడు. ఇటువంటి వాడు కదా! ఉత్తమ పురుషుడు!

మరి దుష్టుడో, ఎల్లపుడు చెడ్డ పనులనే చేస్తూవుంటాడు. అతనిని సరిదిద్దగోరే పెద్దలమాట పెడచెవిన పెడుతూ వుంటాడు. కామాది అరిషడ్వర్గములకు వశుడై ప్రవర్తిస్తూవుంటాడు. ఎప్పుడూ కోపము ముక్కుమీదే వుంటుంది. ఇతరులు తనకు చేసిన మేలును పూర్తిగా మరచిన వాడై కృతఘ్నుడై ప్రవర్తిస్తుంటాడు. అతడు పరులు తనకు చేసిన ఉపకారము పూర్తిగా మరచిపోతాడు. అందరినీ ద్వేషిస్తూ వుంటాడు. అందరినీ దుర్మార్గులుగా భావిస్తూ వుంటాడు. ఇటువంటి వాడే అధమ పురుషుడు. కనుక తనకు మేలు జరగాలనుకున్నవాడు ఎప్పుడూ ఉత్తముడైన వానినే సేవించాలి. అవసరాన్ని బట్టి, పరిస్థితిని బట్టి మధ్యముని సేవించవచ్చు. కానీ అధముని ఎట్టి పరిస్థితిలోనూ సేవింపరాదు. అంతేకాదు అధముడైనవారు తన యొక్క సామర్థ్యాన్ని బట్టి ఒక్కొక్కపుడు ధనమును సంపాదించి సంఘములో కొంత విలువను పొందుతూ జీవిస్తూవుంటే

వుండవచ్చు. అంతమాత్రాన అతడు గొప్పవాడు అని భావించనే కూడదు. అతనిని గౌరవించి, అతనిని ఆశ్రయించకూడదు. కనుక సజ్జన సాంగత్యంలో మెలుగుతూ సద్గుణాలతో జీవించే వాడే ధన్యుడు". ఈ విధంగా శ్రీ దత్తాత్రేయ స్వామి ఎన్నో విధములయిన జనులకు మేలు చేకూర్చే నీతులనెన్నింటినో బోధించారు. స్వామి వాగమృతాన్ని త్రాగి సాధ్యులు మహానందభరితులై స్వామికి ప్రణామంచేసి తిరిగి వెళ్ళారు– అని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పాడని వేధధర్ముడు దీపకునికి బోధించాడు.

దీపకుడు వేదధర్మునితో "గురుదేవా! దత్తాత్రేయ స్వామి ఏవైనా వ్రతములు, ఆచరణలు, ధర్మములు ఎవరికైనా బోధించి యున్నారా?" అని అడుగగా వేదధర్ముడు "వత్సా! దత్తస్వామి వర్ణాశ్రమ ధర్మాదులను తన శిష్యులకు బోధించియున్నారు. వానిని కూడా నీకు తెలియజేస్తాను" – అంటూ యిలా వివరించారు.

పూర్వము ఒకప్పుడు మేరు పర్వతముపై ఋషులందరు సభ తీర్చివుండగా సనత్కుమారుడు నారదమహర్షిని యిదే ప్రశ్నవేయగా నారదుడు కొన్ని వ్రతములు గూర్చి తెలియజేస్తూ యిలా అన్నాడు. "మహర్షులారా! వ్రతములన్నింటిలో గొప్పవ్రతము ఒకటి వున్నది. అదే ఏకాదశీ వ్రతము. అది సర్వపాపములను పోగొట్టునది. సకల పుణ్యములను ప్రసాదించునది. ముల్లోకములలోను వుత్తమమయినది యిదే. అంతేకాదు. అన్ని వర్ణముల వారికి ఆచరణ సాధ్యమైనది. మంగళ ప్రదమయినది. విష్ణుదేవునికి అత్యంత ప్రియమైన వ్రతము యీ ఏకాదశీ వ్రతము. ఒక మాసములో కృష్ణ పక్షమున, శుక్ల పక్షమున రెండు ఏకాదశులు వస్తూ వుంటాయి. ఆ రెండు ఏకాదశులలోను భోజనముచేయకూడదు. దశమి, ద్వాదశులలో రోజునకు ఒక్క పర్యాయమే భుజించాలి. రాత్రులలో భుజింపకూడదు. ఏకాదశినాడు రెండుపూటలలోను భుజింపక ఉపవశించాలి. విష్ణుదేవునికి అత్యంత ప్రియమైన ఏకాదశినాడు భోజనము చేసినవాని పాపమునకు నిష్కృతి లేదు. ఎందుకంటే ఆ రోజు అన్ని పాపములు 'అన్నమును' ఆశ్రయించి వుంటాయి.

ఇక ఏకాదశ వ్రత విధానము చెపుతాను.

ఏకాదశికి ముందు రోజయిన దశమీ దినమున ప్రాత: కాలమందే నిద్రలేచి, దంతధావనము, కాలకృత్యముల అనంతరం విధిప్రకారముగా స్నానము చేయాలి. గాయత్రిని జపించి విష్ణుదేవుని అర్చించాలి. ఆ రోజు ఒక్క పూట మాత్రమే భుజించాలి. ఆ రాత్రి స్వామి సన్నిధిలోనే హరిధ్యానమగ్నుడై నిద్రించాలి. ఇక, ఏకాదశినాడు కూడ అదేవిధంగా ప్రాత: కాలాన్నే నిద్రలేచి స్నానాదికముల తర్వాత పుండరీకాక్షుని యధావిధిగా షోడశోపచారములతో పూజించాలి.

"ఏకాదశ్యాం నిరాహార: స్థిత్వాహని పరేహ్యహామే
భోక్ష్యామి పుండరీకాక్ష శరణంమే భవాచ్యుత"

"ఏకాదశినాడు నిరాహరుడనై వుండి ద్వాదశినాడు మధ్యాహ్నము మాత్రమే భుజించెదను. నన్ను రక్షింపుము స్వామీ!" అని యీ మంత్రమును చెప్పుకొని భక్తితో ఉపవాసము చేసి స్వామికి అర్పించాలి. రాత్రి స్వామి ఎదుట గీత, వాద్య, నృత్య, పురాణశ్రవణాదులు చేస్తూ జాగారము వుండాలి. అంతేకాదు. రాత్రి జాము ఝామునకూ స్వామికి అర్ఘ్య, పాద్య, పుష్ప, గంధములతో, ధూప, దీప, నైవేద్యములతో కర్పూర హారతి, ఆత్మప్రదక్షిణ, నమస్కారములతో భక్తి శ్రద్ధలతో పూజిస్తూ వుండాలి. తన శక్తి సామర్ధ్యములననుసరించి స్వామిని సేవించాలి. అలా చేయక సంకుచిత తత్త్వముతో తనకు శక్తి వున్నను, ధనమును వెచ్చింపక, లోభ బుద్ధితో స్వామిని సేవిస్తే ఫలితం వుండదు.

మరొక్క విషయం. జూదము, మొదలయిన వినోదకార్యక్రమములతో జాగారము వుండటంవలన ఏమాత్రం ప్రయోజనం వుండదు. ఏకాదశీ రోజున ఉపవాసము ఎంతముఖ్యమో, జాగరణగూడ అంతముఖ్యం. అందువలన స్వామిని భక్తితో భజిస్తూ, పూజిస్తూ జాగరణ చేయటం వలన అతడే కాదు, అతని పితృదేవతలు కూడా పుణ్యలోకములను పొందుతారు. ఈ ఏకాదశీ రోజున పురాణశ్రవణము చేయటం కూడ అనివార్యము. పురాణము వినక పోయినట్లయిన కనీసం తనకు తానైన చదువుకొనుచు జాగరణ చేయాలి. అంతేకాదు. జనార్ధనుడు ఏకాదశినాడు పంచామృత స్నానముచేత, ద్వాదశినాడు క్షీరస్నానము(పాలాభిషేకం)చేత సంతృప్తుడౌతాడు.

"అజ్ఞాన తిమిరాంధస్య వ్రతేనానేనకేశవ
ప్రసాదసుముఖో భూత్వా జ్ఞానదృష్టి ప్రదోభవ"

ద్వాదశినాడు స్వామినర్చించి, "దేవా! శక్తి కొలది వ్రతమునాచరించాను. అజ్ఞానమనెడి చీకటిచేత గ్రుడ్డివాడనైన నాకు దయతో జ్ఞానదృష్టిని ప్రసాదించండి" అని ప్రార్ధించాలి. అటు తర్వాత, బ్రాహ్మణ సంతర్పణ చేసి శక్తి కొలది దక్షిణతో తాంబూలమునీయాలి. తర్వాత పంచయజ్ఞములు చేసి బంధువులతో, కుటుంబ సభ్యులతో కలసి కూర్చొని, మౌనముతో నారాయణ స్మరణము చేస్తూ భుజించాలి.

ఈ విధంగా భక్తితో ఏకాదశీ వ్రతమును చేసేవారు వైకుంఠాన్ని చేరుతారు. ___________ **సశేషం**

# వార్తాలాపము

మార్చి సంచిక తరువాయి



## జనక యాజ్ఞవల్క్యుల కథ

అనంతరము యీ విషయముపై స్వామివారు నిత్యానందులవారిని చెప్పుమని కోరిరి.

స్వా.ని. :- బృహదారణ్యకమునందలి నాల్గవ అధ్యాయము, మూడవ బ్రాహ్మణమునందు యీ కథ కలదు.

ఒకప్పుడు జనకునివద్దకు యాజ్ఞవల్క్యుడు వెళ్లెను. వారు ఆ సమయమున అగ్నిహోత్రమును గురించి చర్చించిరి. జనకుడు అగ్నిహోత్రమునకు సంబంధించిన అపూర్వజ్ఞానమును యాజ్ఞవల్క్యుని యెదుట వెల్లడించెను. ఆయన చాలాసంతోషించి జనకుని వరము కోరుకొనమని చెప్పెను. "నా యిష్టము వచ్చిన ప్రశ్నలు అడుగుటకు వరము యివ్వ"మని జనకుడు కోరెను. యాజ్ఞవల్క్యుడు సంతోషముతో అంగీకరించెను. అంతట జనకమహారాజు యాజ్ఞవల్క్యుని యిట్లు ప్రశ్నించెను.

యాజ్ఞవల్క్యకింజ్యోతిరయం పురుష యితి ।
ఆదిత్యజ్యోతిః సమ్రాడితి హోవాచాదిత్యే వాయం జ్యోతిషాస్తే
పల్యయతే కర్మ కురుతే విపర్యేతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య ॥

యాజ్ఞవల్క్య! ఈ పురుషుడు అనగా శరీరము దేనిచే ప్రకాశితమగుచున్నది. శరీరము జడమే అయినను కూర్చొనుచున్నది. లేచుచున్నది. పనులను చేయుచున్నది. వెనుకకు మరలుచున్నది. ఇవన్నియు యెట్లు జరుగుచున్నవి?

## స్వయంజ్యోతిస్వరూపమగు ఆత్మయే ప్రేరకము

అంతట యాజ్ఞవల్క్యుడు "ఆదిత్యజ్యోతిః" అని సమాధానము చెప్పెను. సూర్యునినుండియే చైతన్యమును పొంది పురుషుడు సకలకర్మలను ఆచరించును. జనకుడు "సరే" అని మరల ప్రశ్నించెను. "ఓ యాజ్ఞవల్క్య! సూర్యాస్తమయము అయిన తరువాత కూడ పురుషుడు సమస్తకర్మలను ఆచరించును. అప్పుడు అతనికి చైతన్యము యెచ్చటనుండి వచ్చును?" యాజ్ఞవల్క్యుడు "చంద్రునినుండి వచ్చును" అని చెప్పెను.

జన :- "చంద్రుడు అస్తమించిన తరువాత"

యాజ్ఞ :- "అగ్నినుండి"

"సూర్యచంద్రులు అస్తమించి అగ్ని కూడ శాంతించిన తదుపరి ఈ పురుషుడు దేనిచే ప్రకాశమును పొందును? అనగా దేనిచే చైతన్యమును పొందును?" అని జనకుడు మరల ప్రశ్నించెను.

యాజ్ఞవల్క్యుడు "వాణ్యేవాస్య జ్యోతిర్భవతి" అని సమాధానము చెప్పెను.

శబ్దమే పురుషునికి జ్యోతి అనగా ప్రకాశము. దానిచేతనే ప్రేరణను పొంది పురుషుడు ప్రవర్తించును. వర్షాకాలపు చీకటిరాత్రులలో తన చేయియే తనకు కన్పించని సమయములో బాటసారులు కుక్కలు, గాడిదలు మొదలగు జంతువుల శబ్దములను విని వానిచే ప్రకాశమును పొందియే తమ గమ్యమును చేరుకొనెదరు. శబ్దశ్రవణముచే శ్రోత్రేంద్రియము

ప్రకాశమును పొందును. తద్వారా మనస్సున వివేకాదులు ఉద్భవించి శబ్దము వచ్చువైపునకు వెళ్ళుట మొదలగు ప్రవృత్తులు జరుగును. ఈ విధముగ అచ్చట శబ్దమే ప్రకాశము.

రాజు చెప్పెను :- "బాగుగనే వున్నది. కాని సూర్య, చంద్రులు, అగ్ని, వాణి అన్నియు శాంతించిన పిమ్మట స్వప్నావస్థయందు పురుషుడు ప్రకాశము ఎచ్చటనుండి పొందును? ఏలనన స్వప్నావస్థయందు ఈ బాహ్యేంద్రియములు వ్యవహారశూన్యములగును. అయినను మనుష్యుడు స్వప్నావస్థయందుకూడ ప్రవృత్తులను కలిగియుండును. ఆ స్వప్నావస్థయందు ప్రకాశమును కలుగజేయునది ఏది?

యాజ్ఞ :- ఆత్మయే పురుషుని ప్రకాశింపజేయును. ఆత్మ ప్రకాశముచేతనే ఈ పురుషుడు అన్ని కర్మలను ఆచరించును.

"కతమ ఆత్మేతి" అని జనకుడు అడిగెను. ఆత్మత ఎట్టిది?

అంత యాజ్ఞ్యవల్క్య మహర్షి చెప్పెను.

"యోZయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః ॥

ఆత్మ సక్రమముగా ఇంద్రియవృత్తులను ప్రేరేపించును. హృదయమునందుండు అంతర్జ్యోతియగు విజ్ఞానమయస్వరూపము.

"చక్షురాది ఇంద్రియములకు ప్రేరణను యిచ్చు బహిర్గతమగు సూర్యచంద్రాదుల జ్యోతి అంతయు స్వాభావికమగు జ్యోతికాదు. స్వయంజ్యోతి స్వరూపునివద్దనుండి జ్యోతినిపొంది ఇంద్రియములకు ప్రేరణనిచ్చును" అని తాత్పర్యము.

చీకటికొట్టులోనికి సూర్యునికాంతి వెళ్ళనిచో బయట సూర్యుని వెత్తురునకు ఎదుట ఒక అద్దమును వుంచి ఆ అద్దముద్వారా సూర్యకాంతి చీకటికొట్టులోనికి వచ్చునట్లు చేయుదురు. కానీ ఆ వెత్తురు అద్దముయొక్క వెత్తురు కాదుకదా! అది సూర్యునిదే. అటులనే సూర్యచంద్రాదులు, ప్రకాశముద్వారా ఇంద్రియవృత్తులకు అనుగ్రాహకములు. కానీ ఆ ప్రకాశము సూర్యచంద్రాదుల స్వాభావిక ప్రకాశముకాదు. సూర్యచంద్రాదులు దర్పణస్థానీయులు. పరప్రకాశ్యులు. ఆ సూర్యచంద్రాదులుకూడ ఎవరి ప్రకాశముచే ప్రకాశితులగుదురో ఆ ఆత్మమాత్రమే స్వయంప్రకాశము.

## స్వప్నావస్థయందుకూడ ఆత్మ జ్యోతిరూపమున ప్రేరేపించును

పైన ప్రత్యగ్జ్యోతి జాగ్రదవస్థయందు ఇంద్రియానుగ్రాహకమని చెప్పబడినది. ఆ విషయమును యింకను స్పష్టీకరించుటకు శ్రుతిస్వప్నావస్థయందు కూడ ఆ పదార్థపు అస్తిత్వమును తెలుపుచున్నది.

స సమానః సన్నుభౌ ।

ఆ ఆత్మ సమానరూపమున రెండులోకములయందును (జాగ్రదవస్థయందును, స్వప్నావస్థయందును) ప్రకాశించును. బుద్ధి తన వృత్తులద్వారా విషయజ్ఞానమును పొందును. ఆ సమయమున ఆత్మ కూడ విషయజ్ఞానమును సంపాదించుచున్నట్లు భాసించును. (ధ్యాయతిఇవ). ఆత్మ విజ్ఞానస్వరూపము. నిత్యమును జ్ఞానస్వరూపమును అయిన ఆత్మను క్షణికవిజ్ఞానరూపముగా తలచుట తప్పు. కాని బుద్ధి వృత్తిమాత్రము క్షణికమగుటచే బుద్ధి క్షణిక విజ్ఞానము కలది. అందుచే ఆత్మకూడ క్షణికవిజ్ఞానము కలదిగా తోచును. బుద్ధి తనవృత్తుల ద్వారా చలనాదిక్రియలను చేయించునప్పుడు ఆత్మకూడ ఆ క్రియలకు కర్తగా ప్రతీతమగును. (లేలాయతి ఇవ). వాస్తవమునకు అది కర్తకాదు.

ఆ ఆత్మయే స్వప్న రూపమున యీ లోకమును, అనగా జాగ్రదవస్థను, మృత్యురూపమగు అవిద్యాకర్మలను అతిక్రమించును. అనగా స్వప్నావస్థను పొందుటతోడనే జాగ్రదవస్థాబోధములగు విషయములు, కర్మలు అన్నియును నశించును. ఏలనన స్వయంజ్యోతియగు ఆత్మత స్వప్న సంబంధములగు పదార్థములను సృష్టించుకొనును. ఒకే శరీరమునందు వున్న ఆత్మ స్వప్న రూపమును పొంది మృత్యు రూపములగు కార్యకారణాదులను త్యజించి స్వప్నమునందు స్వకీయమగు ఆత్మజ్యోతిస్వరూపమును పొందును.

## ఈ లోకమునందు పరలోకమునందును కూడ

## ఆత్మ స్వయంజ్యోతియగు ప్రేరకము

స వా అయ పురుషో జాయమానః శరీరమ్

ఈ ఆత్మయే శరీరము అను ఉపాధి ఉద్భవించుటలో ఉద్భవించుచున్నట్లు భాసించును. ధర్మాధర్మాశ్రయమగు శరీరమును యింద్రియములకు సంబంధింపజేయును. ఇది శరీరమును త్యజించి ఉత్క్రమణమునకు సిద్ధమయినప్పుడు శరీరము మృతిని పొందును. అంత శరీరమునకు సంబంధించిన పాపపుణ్యాదికర్మలు, వాని సాధనములగు ఇంద్రియాదులును ఆ సంబంధమును త్యజించును.

స్వప్న జాగ్రదవస్థలయందు రెండింటియందును ఆత్మ ఒకే శరీరమునందు వుండికూడ జాగ్రదవస్థయందు శరీరముయొక్క ఇంద్రియాదుల కార్యాచరణమును గ్రహించియు, స్వప్నావస్థయందు త్యజించియు బుద్ధితో నిరంతరము సంచరించుచుండును. అటులనే ("ఉభౌలోకౌ") రెండులోకములనగా ఇహలోక, పరలోకములు-స్వర్గ పాతాళములు, రెంటియందు జన్మ, మరణములద్వారా కార్యకారణ సంతమును కలిగి (శరీరేంద్రియములను పొంది) నిరంతరము సంచరించుచుండును. సంసారము నుండి ముక్తిని పొందువరకు యిటులనే జరుగుచుండును.

దీనినిబట్టి కార్యకారణసంఘాతముకంటె (శరీర, ఇంద్రియాదులకంటె) ఆత్మ భిన్నమయినదని ఋజువయినది. శరీరేంద్రియరూపముననే ఆత్మ వున్నచో ఆత్మకు వానినుండి విడువడుట అసంభవము. అగ్నిజ్వాల ప్రకాశరూపము. ఆ అగ్నినుండి జ్వాలయు, ప్రకాశమును విడివడలేవు. కాని ఆత్మనుండి కార్యకారణసంఘాతము వేరువడును. కావుననే ఆత్మ కార్యకారణసంఘాతముకంటే వేరు.

ఆ పురుషుని వాసస్థానములు రెండు 1. ప్రత్యక్షానుభూయమానమగు యీ శరీరము. 2. శరీరవియోగానంతరము అనుభూయమానమగు పరలోకము. మూడవది లేదు. స్వప్నము యీ రెంటికిని సంధి. రెండుగ్రామములు సరిహద్దు రెండుగ్రామములకంటెను వేరు కాదు. అచ్చట నిలబడినచో రెండు గ్రామములను చూడవచ్చును. అటులనే స్వప్నస్థానమునందు వుండి ఆత్మ యీ లోకమును, పరలోకమును రెంటిని అనుభవించును. పరలోకమునందు పాపములను, ఆనందమును రెంటిని అనుభవించును. ఈ లోకమునందు అనుభావ్యములగు పదార్థములను కూడ అనుభవించును. ఏలనన స్వప్నము పూర్వము చూడని వానిని చూపించదు. పూర్వదృష్టపదార్థముల స్మరణమే స్వప్నము. పురుషుడు స్వప్నావస్థకు జేరినప్పుడు భూత, భౌతిక మాత్రములను (అంశములను) కూడ తీసికొని వెళ్ళును. అనగా జాగ్రదవస్థయందు చూచిన పదార్థముల వాసనలతో స్వప్నావస్థను పొందును. అనంతరము తానే తనకు లభించిన జాగ్రత్ శరీరమును త్యజించి వాసనామయమగు స్వప్నశరీరమును నిర్మించి తనదీప్తిచే ప్రకాశించుచున్న స్వప్న పదార్థములను అనుభవించును.

అత్రాంయం పురుషః స్వయంజ్యోతిర్భవతి.

"ఈ స్వప్నావస్థయందు పురుషుడు స్వయంజ్యోతి"

స్వప్నదర్శనమునందు జాగృతికంటే వైలక్షణ్యము కలదు. జాగృతియందు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, సూర్యప్రకాశములు, మొదలగువానిచే సంకీర్ణమగుటచే ఆత్మజ్యోతి నిశ్చయించబడజాలదు. ఈ ప్రకాశము ఎవరిది? ఇంద్రియములదియా? మనస్సుదియా? బుద్ధిదియా? సూర్యునిదియా? ఆత్మదియా? అనునది నిశ్చయించుట జరుగదు. స్వప్నమునందు యివి ఏమియు వుండవు, ఆత్మయే వుండును. కావున స్వప్నావస్థయందలి ప్రకాశము ఆత్మదియే అనియు, ఆత్మత స్వయంజ్యోతి అనియు అంగీకరించవలెను. జాగృతియందలి విషయములే స్వప్నమునందును కలవు. స్వప్నమునందు జాగృతికంటె ఏమి వైలక్షణ్యము కలదు? ఆత్మ స్వప్నావస్థయందు స్వయంజ్యోతి అనుటకు తగిన ఆధారమేమి అను ప్రశ్నకు శ్రుతిప్రమాణము కలదు.

# పూజ ఎందుకు? ఎలా చేయాలి?

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సాయి పూజా విధానం శ్రీ సాయిపట్ల మనకు గల ప్రేమ, గౌరవాలను వ్యక్తం చేయడమే. అంటే మనలో నిజమైన ప్రేమ, గౌరవం, శ్రద్ధా ఆయనపై ఎంతగా వుంటాయో అంతగా మన పూజ సార్థకం అవుతుంది. కనుక సాయి లీలలను పారాయణచేసి మన హృదయంలో సాయి యొక్క అద్భుత శక్తి పట్ల భక్తి శ్రద్ధలను పొందితే మనం సరిగా ఆయనను పూజించగలుగుతాము. అలా చేసేవారికి ధ్యానశ్లోకాలలో గాని, నామాలలోగాని బాబాలీలలు స్ఫురించి నిరంతరం వాటి స్మరణే జరుగుతుంది.

ఇక సంకల్పంతో ఆరంభించి వివిధ ఉపచారాలలో వ్యక్తం కావలసిన భావాన్ని, అన్ని ఉపచారాలతో కూడిన పూజ చేస్తున్నందసేపూ నేపథ్య సంగీతంలాగ హృదయంలో వుండవలసిన భావాన్ని వివరిస్తాను.

సాధనలోని రహస్యం సర్వకాల సర్వావస్థల యందు మనస్సు ధ్యేయరూపమై వుండడమే. అదే మొదట సగుణ సాక్షాత్కారానికి తర్వాత నిర్గుణ నిరాకార ఆత్మానుభూతికీ దారి తీయగలదని శ్రీ రామకృష్ణ పరమహంస చరిత్ర ఋజువు చేస్తుంది.సాయికూడా తమ సాధన గురించి అదే చెప్పారు. మొదటనే నిర్గుణసాధన చాలా కష్టతరమనీ, భక్తి చాలా సులభమనీ గీత కూడా చెబుతుంది. సాయిబాబాను సదా మనస్సునందుంచుకొని, ఆయన సాన్నిధ్యాన్ని భావన చేయడమే సాధన. ఇది సర్వకాల సర్వావస్థలయందు జరిగేలా ముముక్షువులు చూచుకోవాలి. (ముముక్షువంటే మోక్షం కోరేవాడు. మోక్షమంటే అజ్ఞానమైన, దు:ఖదాయకములైన బంధాల నుండి ముక్తి, "నేను దేహపరిమితుడైన మానవుణ్ణి" అన్న భావననుండి ముక్తి; "నేను, ఆ పరమాత్మ ఒక్కటే" అనే జ్ఞానాన్ని పొందడమే.)

శ్రీ సాయి తన భక్తులు తనను భక్తి శ్రద్ధలతో స్మరించిన క్షణంలో వారి చెంతనే వుంటానని వాగ్దానం చేసారు. అది నిజం. కారణం వారు సర్వవ్యాపియై, సర్వరూపాలలోనూ సర్వదా వున్నారని వారి లీలలు నిరూపిస్తున్నాయి. ఈ విషయం వారి సమాధి అనంతరంగూడా యదార్థమని నిరూపించే లీలలు అసంఖ్యాకంగా వున్నాయి. అయితే తన భక్తులు సాధన సౌలభ్యం కోసం తనకూ, తన చిత్రానికీ బేధం లేదని బాబా నిరూపించారు. కనుక ఆయన చిత్రపటాన్నింట్లో వుంచడం, ఈ సత్యాలు హృదయగతం కావడం కోసం ''శ్రీ సాయి లీలామృతము'' పారాయణ చేయడమూ మొదటిమెట్టు. తర్వాత ఆ రూపంలో ఆయనే వున్నారన్న గుర్తింపుతో సదా వర్తించుకోడం ముఖ్యం.

*సాధనలోని రహస్యం సర్వకాల సర్వావస్థల యందు మనస్సు ధ్యేయరూపమై వుండడమే. అదే మొదట సగుణ సాక్షాత్కారానికి తర్వాత నిర్గుణ నిరాకార ఆత్మానుభూతికీ దారి తీయగలదని శ్రీ రామకృష్ణ పరమహంస చరిత్ర ఋజువు చేస్తుంది.సాయికూడా తమ సాధన గురించి అదే చెప్పారు.*

మనం జీవితంలో దేనిని పొంద నిశ్చయించుకున్నామో ఆ లక్ష్యం ఆయనేనని హృదయానికి అనుక్షణము గుర్తుచేసేందుకది ఉపకరిస్తుంది. ఆయన ఉనికిని మనమిలా గుర్తిస్తుంటే ఆ యిల్లు ఆయన సాన్నిధ్యంవల్ల ఆధ్యాత్మిక శక్తిని పుంజుకుంటుంది.

ఇక ఈ భావన సదా మనస్సులో నిలవడానికి, లౌకిక క్రియా కలాపాలలో, భావనలో యిది మరుగుపడకుండా వుండడానికీ నిత్యం నిద్రలేవగానే ప్రాత:స్మరణ చేయడం ఆవశ్యకం. అది ఆనాడు మన మనస్సునెలా వుంచుకోవాలోనన్న విషయాన్ని గుర్తుచేసి మన పట్టుదలను పెంచుతుంది. అందుకే ముందర 'ప్రాత:స్మరణ' లేక ఉదయ ప్రార్థన పొందుపరచడం జరిగింది.

తర్వాత కాలకృత్యాలు తీర్చుకునేప్పుడు కూడా - ఉదాహరణకు స్నానం చేసేప్పుడు ఈ నీటిరూపంలో కూడా సర్వగతమైన బాబా శక్తియే వున్నదన్న గుర్తును వహించి దానితో మన అశ్రద్ధను, ఏమరుపాటును తొలగించుకోడానికి స్నానం సంకేతం కావాలి - బాబా చింతనకు దోహదమైన భావాలను అభ్యసించాలి.

స్నానానంతరం పూజకు కూర్చునప్పుడు మొదట సంకల్పం చెబుతాము. ఎటూ పూజ చేయబోతూ 'పూజ చేయబోతున్నాను' అని మంత్రరూపంలో చెప్పడం ఎందుకు? అనిపించవచ్చు. కాని యోచిస్తే తప్ప ఋషులు దానినెందుకు వ్యవస్థీకరించారో తెలియదు. ఒకటి రెండు ఉదాహరణలు:

మనం శ్రద్ధగా ధ్యానించుకోవాలని కూర్చుంటే కొన్ని నిముషాల్లో మనం ఇతర ఆలోచనల్లో మునిగి కూర్చున్న లక్ష్యాన్నే మరుస్తాము. కొద్ది సేపటిగ్గాని 'ఏమిటి! ధ్యానం చేద్దామని కూర్చొని యిలా ఆలోచిస్తూ కూర్చుంటానేమిటి?' అని ఆశ్చర్యపోతాము. అలానే జీవితంలో జీవ శాస్త్రాధ్యయనం చేసి గొప్పగా ఉత్తీర్ణులమై డాక్టరవుదామన్న ఆశతో కళాశాలలో ఇంటర్మీడియట్‌లో చేరామనుకోండి, క్రమంగా పరిచయాలు ఇతర విషయాలపై ఆసక్తి పెరిగి, మన పట్టుదల సడలి చివరికి ప్యాసైతేచాలు అనే స్థితికి వస్తాము. అలా గాకుండా ఆ లక్ష్యాన్ని నిలుపుకొనేవారంత స్వల్పసంఖ్యలో వుంటారో చూస్తే తెలుస్తుంది.

కనుక మొదట సంకల్పం బలంగా వుంటే ఇతర వ్యామోహాలు ప్రబలకుండా ముందు జాగ్రత్తలు మనమే తీసుకుంటాము. లేకుంటే ప్రక్కదారి పట్టి అసలు లక్ష్యం మరుగైపోతుంది. అంతేగాక, మొదట గట్టి సంకల్పమున్నా మరుగుపడకుండా వుంటాలంటే తరచూ మన మనస్సును మన పరమలక్ష్యము వైపుకు మనమే తరచుగా మరలా మరలా ప్రోత్సాహించుకోవాలి. అలా నిత్యమూ బలంగా మన మొదటి లక్ష్యమైన ముముక్షుత్వాన్ని బలపరచుకోడానికే నిత్యపూజలో సంకల్పమొకభాగం కావలసి వుంటుంది.

ఇంకొక విషయం. మనస్సు లక్ష్యముమీదనుంచి ప్రక్కకు పరుగెత్తడానికి గల కారణం ఏ విషయాల మీదకది పరుగెడుతుందో వాటిపై మనకు గల ఇష్టాయిష్టాలే. వాటిపై మనకుండే భావాన్ని మనకున్న లక్ష్యపరంగా మలచుకుంటే అవి మనకు లక్ష్యాన్ని గుర్తుచేసేవిగా రూపొంది నిత్యజీవితంలో తారసిల్లే విషయాలు కూడా మనలను అనుక్షణము మన లక్ష్యంవైపుకు ఉన్ముఖం చేసేవిగా మారుతాయి. అందుకే వస్తువులు, వ్యక్తులు, ప్రాణులు వేరువేరుగా, మననుండి వేరుగా మనకెలా అనుభవమవుతాయో అవి అలానే వున్నాయనుకోవడమే వాటిపై లౌకికమైన ఇష్టాయిష్టాలకు కారణం. అవే మనలను లక్ష్యం నుండి వాటివైపుకు మళ్ళించేది. అందుకే సంకల్పం చెప్పే మంత్రంలో ఈ చరాచరవిశ్వమంతా సర్వవ్యాపక చైతన్యశక్తియైన విష్ణువుయొక్క ఆజ్ఞానుసారం ఆ చైతన్యంలో మనస్సులో భావంలా ఏర్పడతాయని, కల్పాలు, మన్వంతరాలు, యుగాల దగ్గర నుండి ధ్యానించే క్షణం వరకూ వున్న కాలము, ద్వీపాంతాల నుండి మన స్వగృహం వరకూ వున్న ప్రదేశాలూ ఆయన సంకల్పాలని, వీటన్నింటి రూపంలో ఆ చైతన్యమే వున్నదనీ మనలోనూ ఆ కారణంగా వ్యాపించియున్న ఆ చైతన్యం మనకు ప్రసన్నమై సాక్షాత్కరించడానికై మనం ధ్యానించి

పూజిస్తున్నామనీ గుర్తుచేసేదిగా వుంటుంది. అన్ని దిక్కులా బాహ్యంగా వ్యాపించి, మన శరీరం రూపంలోనూ అదే వున్నదన్న భావం కలిగేందుకు అంగన్యాస కరన్యాసాలు పూజావిధానంలో వుంటాయి. నిత్యపూజతో ఈ భావం బలపడ్డాక ఇక 'నేను' అంటూ ఈ విశ్వచైతన్యం నుండి వేరే ఏముందీ అన్న వివేకం వేల్కొని, 'నేనుగా ఇప్పుడనుభవమయ్యే చైతన్యమదే' అన్న స్థితి క్రమంగా అభ్యాసవశాత్తు కలుగుతుంది. ఇలా అన్నిదిక్కులా అదే వున్నదన్న భావం దృఢపడి, ఏ దిక్కునున్న ఏ విషయాలు మనస్సున ప్రవేశించకుండా చేసిన భావబంధమే 'దిగ్బంధము'.

ఆధునిక విజ్ఞానాన్నార్జించినవారికి భౌతిక శాస్త్రరీత్యా సృష్టిలోని నానాత్వానికాధారంగా ఏకత్వమున్నదన్న నిశ్చయం కలిగిన పామరదృష్టిని అతిక్రమించడానికుపకరించే లాగ 'ఏది నిజం?' వ్రాసి ప్రచురించవలసి వచ్చింది. భౌతిక, నాస్తిక వాదాలెలా నిరాధారాలో, ఈ విషయాన్నే విదేశాలలోని అత్యాధునిక పరిశోధనలు ఎలా నిరూపిస్తున్నాయో తెలుపడంకోసం 'విజ్ఞాన వీచికలు' వ్రాయడం జరిగినది. ఆ పుస్తకాలనప్పుడప్పుడు పరిశీలిస్తుంటే సాధన బలపడుతుంది. దీనినే మన పూర్వీకులు తత్త్వచింతనన్నారు. తత్త్వ చింతన, భక్తి కలిసే కొనసాగాలని శాస్త్రం.

ఈ సంకల్పంలోని ఆధ్యాత్మిక సత్యమే మూర్తీభవించి మన కొరకు శ్రీ సాయిగా వెలసి చిత్రరూపంలో వున్నదని ఆయన చరిత్ర గుర్తించేలాగ చేస్తుంది. ఇక 16 ఉపచారాలు చేస్తున్నంత సేపూ మన హృదయంలో అంతటి సర్వజ్ఞుడు, సర్వవ్యాపి అయిన మహనీయుడు మన ఎదుట ఈ రూపంలో వున్నారు అన్న భావన మణిమాలలోని సూత్రంలా చెదరకుండావుండాలి. అభ్యాసంతో ఇది కుదురుతుంది. ఆ చెదరని భావనే ధ్యానం. పూజానంతరం ఉపచారాలు మాని ఆ భావాన్నే హృదయమంతటితోనూ పొందివుండడమే ధ్యానం. పూజాంతరంలో ధ్యానం కొనసాగించకపోవడం, అన్నం వండుకొన్నాక తినక పోవడం లాంటిది.

సంకల్పం భావయుక్తంగా చెప్పుకొన్నాక 'అపవిత్ర: పవిత్రోవా' అన్న శ్లోకంలో తానుకూడా విశ్వరూపం ధరించిన భగవశ్శక్తిమయుడన్న గుర్తింపుతో బాహ్యాభ్యంతరాలలో పవిత్రుడనని గుర్తించాలి. తర్వాత ధ్యాన శ్లోకం భావచింతనతో పఠించి మనస్సున ఆ భావాన్ని నిలుపుకోవాలి. అదే హృదయంలోకి ధ్యానరూపంలో గురుమూర్తిని ప్రేమ, గౌరవాలతో ఆహ్వానించడం. ఆహ్వానించడమే ఆవాహనంటే. మనకు ప్రేమపాత్రులైనవారు గుర్తుకొచ్చినప్పుడు ఆ స్మృతులను ప్రేమతో హృదయంలో ఎలా స్వీకరిస్తామో అలానే సాయి సాన్నిధ్యాన్ని హృదయంలోకి తీసుకొంటాము. అదే ఆవాహనం. ఆ గుర్తింపునే మనం ఆహ్వానించేది. కారణం గురువు సర్వగతుడు. ఆయనను ఎక్కడికని ఆహ్వానించగలం? ఆ భావాన్ని మనం పూజంతటికీ నేపథ్యంలో నిలుపుకోడానికి సంకేతమే ఆయనకు ఆసనం సమర్పించడమనే బాహ్యక్రియ. ఇంటికొచ్చిన పెద్దలకు వున్నతాసనమేసి సత్కరించినట్లు సాయి రూపాన్ని మన శ్రద్ధాపూర్వకమైన దృష్టిలోకి తీసుకోడం కోసం ఆసన సమర్పణప్పుడు వున్నతాసనం పై వారిని కూర్చోపెట్టినట్లు భావిస్తాము. ఉన్నతాసన సమర్పణం అంటే శ్రీ సాయి మనకంటే వున్నతమైన జ్ఞానస్థితిలో వున్నారన్న గుర్తింపు మనలో వుండానికి సంకేతం. ఇలా ప్రతి ఉపచారమూ మనకాయన పట్ల వున్న భక్తి, శ్రద్ధలకూ, ఆయన వున్నతస్థితికి సంబంధించినది కనుక ప్రతి ఉపచారానికి ముందు ఆయన స్థితిని, మన భావాన్నీ వర్ణించే

*పామరదృష్టిని అతిక్రమించడానికుపకరించే లాగ 'ఏది నిజం?' వ్రాసి ప్రచురించవలసి వచ్చింది. భౌతిక, నాస్తిక వాదాలెలా నిరాధారాలో, ఈ విషయాన్నే విదేశాలలోని అత్యాధునిక పరిశోధనలు ఎలా నిరూపిస్తున్నాయో తెలుపడంకోసం 'విజ్ఞాన వీచికలు' వ్రాయడం జరిగినది. ఆ పుస్తకాలనప్పుడప్పుడు పరిశీలిస్తుంటే సాధన బలపడుతుంది. దీనినే మన పూర్వీకులు తత్త్వచింతనన్నారు. తత్త్వ చింతన, భక్తి కలిసే కొనసాగాలని శాస్త్రం.*

శ్లోకముంటుంది. ఆ శ్లోకాన్ని భావయుక్తంగా స్మరించినప్పుడు పూజ యాంత్రికంగాగాక సజీవంగా జరుగుతుంది. మన యెదుట ఆయన వున్నారన్న భావాన్ని పొందగలుగుతాము.

హస్తములకు అర్ఘ్యమివ్వడమంటే-చేతులు కడగటంగా భావించవచ్చు. తరువాత ఆచమనం. నైవేద్యం యిస్తాము గనుక దానికి ముందు చేతులు, శరీరం కడుగుకోటం శ్రమను తగ్గించి శక్తి ఉత్సాహాలను కల్గిస్తుంది. మనస్తోత్రాలు, పూజలూ సాయిని ప్రసన్నులను చేస్తాయి అని భావం. దానిక్కారణం ఈ ఉపచారాల ద్వారా మనకున్న శ్రద్ధ ప్రకటం కావడమే. మంచి విద్యార్థియందు ఉపాధ్యాయుడెలా ప్రత్యేక శ్రద్ధాసక్తులను పొందుతాడో, అలానే శ్రద్ధాళువైన ముముక్షువు పట్ల సద్గురువు కూడ. ఉపచారాలలోని శ్రద్ధ, భక్తునిలో జ్ఞానం పట్లకల ఆకాంక్షను తెల్పుతుంది. దాని విలువ అతడికి తెలియడమే ఆ శ్రద్ధకు కారణం. పాదాలకు పాద్యము, స్నానము అని ఉపచారాల భావం ఇక్కడే వివరించడమైనది. స్నానోపచారం పూజలో ఎంతో విపులంగా చేసి రూప, గుణ చింతనెంతో బలపరచుకొనే అవకాశమున్నది.

అంగపూజలో సద్గురువు తన అవయవాలనన్నింటిని భక్తుల శ్రేయస్సుకు వినియోగించే సద్గుణాలకు సంకేతాలుగా భావించి పూజిస్తాము. తర్వాత నామావళితో పూజ, లేక స్తోత్ర పఠన చేస్తాము.

ఈ స్తోత్రపఠన ఎందుకు? అన్నది సరిగా అర్థం చేసుకోవాలి. లేకుంటే ఇష్టదైవం ముఖస్తుతితో తృప్తిచెందే క్షుద్ర గుణవంతుడుగా గోచరించగలడు. తన ఎదుట ప్రత్యక్షంగా వున్న స్థూల రూపమే గురువు అన్న భ్రాంతి కలుగకుండా ఆ రూపంద్వారా మనకు వ్యక్తమయ్యే గురువుయొక్క అంతరంగికస్థితిని గుర్తించడమే దాని ప్రయోజనం. మనస్సు తను చింతించే విషయాలలో మార్పును కోరేదిగా వుంటుంది. దానినొకవంక తృప్తిపరచేందుకు వివిధ నామాలను భావయుక్తంగా పఠిస్తాము. కాని అన్ని నామాలు ఒక దైవస్వరూపానివే అయ్యుండడంవల్ల మనస్సుకు అనేక విషయాలనిస్తున్నట్లు భ్రమింపచేస్తూ ఒక్కదాని పైననే నిలిపేలాగ చేయడమే నామావళి ప్రయోజనం.

మనస్సుకొక లక్షణముంది. అది దేనిని భావిస్తే ఆ రూపాన్ని అల్పంగానో, అధికంగానో అభ్యాసాన్ని బట్టి పొందుతుంది. సద్గురుగుణ చింతనాత్మకమైన నామపఠన సద్గురుని తత్త్వంతో మన మనస్సును తాదాత్మ్యాన్ని చెందేలా చేస్తుంది.

ఈ విధంగా నామ స్తోత్రం చేసిన భక్తుడి మనస్సు ఆ నామాల చేత పేర్కొనబడిన దివ్యగుణచింతనవల్ల తద్భావంపొంది, కేవల ప్రకృత అజ్ఞానపూరిత చింతనలనుండి పరిశుద్ధమయ్యాక మనస్సు సహజంగా ధ్యానానికి ఉన్ముఖమవుతుంది. అలా అయి ధ్యానం జరుగడాన్ని ఆత్మస్వరుపుడుగా హృదయంలో దాగియున్న తన ఇష్టదైవం యొక్క కృప ప్రసాదితమైనదని రూపకాలంకారంగా చెప్పబడుతుంది. కారణం భక్తుడి అనుభవం సరిగ అలానే వుంటుంది. ఇట్టి భావం వల్ల తన ధ్యేయవస్తువుపై భక్తి శ్రద్ధలు వృద్ధి అయి పూజ పటిష్ఠమవుతుంది. ఆ కారణంగా ధ్యానం బలపడుతుంది. కనుక స్తోత్ర పఠనతో దైవం సంప్రీతుడవడమంటే ఏమిటో సరిగ అర్థం చేసుకోవాలి.

ఇక హారతి. ఆరతి సంగతి ఒక్క మాట చెప్పాలి. ఉత్తమ గుణ సంపన్నులైన వారికి దృష్టిదోషం తగులుతుందన్నది అనుభవం. దృష్టిదోషమంటే చూచేవారి మనస్సులోని కలుషిత సంస్కార ప్రభావం వారి దృష్టితో చేరి ఇతర వస్తు, వ్యక్తి, ప్రాణుల మీదకు సోకుతుంది. ఇది మన స్థూలదృష్టికి ప్రత్యక్షగోచరంకాదు. దాని ప్రభావం గోచరమవుతుంది. అట్టి దోషం సోకిన మనిషి నిర్హేతుకంగా మత్తుగా అలసటచెందినట్లు బలహీనంగా కనిపించి ఒళ్ళునొప్పి, ఒళ్ళు విరుచుకోడం, అమితంగా ఆవులించడం, ముఖం కాంతిహీనం కావడం, అస్వస్థులు కావడం జరుగుతుంది. అప్పుడు ఆ దోషాన్ని హరించడానికి వుత్తమపద్ధతి హారతి. అందుకే వివాహాదులలో వధూవరులకు కూడా హారతిస్తారు. ఇలా దోషమెలా సోకుతుందో ఒక్క వుదాహరణ: బెంగాలులోని శ్రీ బాలకృష్ణస్వామి అని పేరుగల యోగి యొకరుండేవారు. ఆయన భక్తుడు ఒకనాడు

నాణ్యమైన ఒకరకమైన పండును ఆ యోగికర్పించాడు. ఆ సమయంలో అక్కడున్న మరొక భక్తుని మనస్సులో దాన్ని తినాలనే కోరిక కల్గుతుంది. తక్షణమే ఆ పండు నా యోగి ఆ భక్తునికే యిచ్చారు. అందరిలో తనకే ఎలా ఇచ్చారో అని అతడాశ్చర్యాన్ని వెలిబుచ్చితే ఆయనన్నారట- ఏ వస్తువుకేసైనా అట్టి ఆశతో ఏవరైనా చూస్తే దానిమీద అతీంద్రియావగాహనకు గోచరమయ్యే రీతిన దానినలా కోరికతో చూచిన వారి రూపముతోపాటు, అతడి మానసిక సంస్కారాలు కూడ సోకుతాయని, ఎంతో శ్రమతో అటువంటి చపల సంస్కారాలను క్షాళన చేసుకున్న యోగుల కట్టి వస్తువులను సేవించడం వల్ల అట్టి మలిన సంస్కారాలు సోకి సాధనకంతరాయమవుతాయి. గనుక వారు వీటిని సేవించరని చెబుతారు. రామకృష్ణపరమహంస కూడా ఇలానే చెప్పేవారు. అట్టి దోషాలను తొలగించగలదు కర్పూరహారతి. అది దాని కొరకేర్పడినదని తలచవచ్చు- అలా తన ఇష్టమూర్తికి ఎట్టి సూక్ష్మమాలిన్యం సోకకుండా చూచుకోవడంలోని ప్రేమలాగ. కాకుంటే మానవులమీద చూపితే దానినే ప్రేమంటాము. దైవం పట్ల, గురువుల పట్ల అయితే భక్తి అంటాము. 'పరమ ప్రేమరూపా' అంటే భక్తి పరమ ప్రేమస్వరూపమని భక్తి సూత్రం. మానవ ప్రేమలు అసంపూర్తిగా వుంటాయి. ఒక్కొక్కరి మీద కొంత కొంత. దైవం మీదదిపూర్ణమై దైవానికి ప్రేమలో సాటిని కల్పించనిదై వుంటుంది. అందుకని పరమ ప్రేమరూపం భక్తి. ఇది పూజ, ధ్యానం, సత్సాంగత్యం, వివేకము, ధర్మాచరణవల్ల, సద్గురు సేవవల్ల క్రమంగా పక్వావస్థకు వస్తుంది. ఆ ప్రేమ చరమరూపమే ధ్యానసమాధి. అదే బ్రహ్మ సాక్షాత్కారం. అది సర్వకాల సర్వావస్థలయందు నిలిస్తే ముక్తి, జ్ఞానం, కైవల్యం. అందుకే పూజ విధించబడింది భక్తులకు.

ఇక బాబా పూజలోని విశిష్టత. బాబా పటానికి తార్కాడ్ అనే భక్తుడు బాంద్రాలో నివేదన సమర్పించడం మరచినప్పుడు శిరిడీలో సాయి ఆ సమయంలోనే ఆ విషయాన్నే తన ఎదుటనున్న శ్రీమతి తార్కాడ్, తార్కాడ్ కుమారులతో చెప్పారు. ఇంకొక భక్తుడు బొంబాయిలో సాయి పటానికి నమస్కరించిన కొన్ని సంవత్సరాలకు ప్రథమంగా దర్శించగానే, "నాకితడు యిన్ని సంవత్సరాలుగా తెలుసునని" బాబా అదే సత్యాన్ని వెల్లడిచేశారు కనుక సాయికీ-పటానికీ భేధంలేదని గుర్తించి సదా సాయిని పూజించి సాటిలేని ఆయన కృపను మనమందరం చవిచూతముగాక!

ఈ పూజా విధానంలో పొందుపరచబడిన నామావళి గురించి కొద్ది మాటలు చెప్పాలి. అది 9-4-75న సాయంత్రం. ధ్యానానికి కూర్చొనగా చాలాగాఢంగాను, చాలా సేపు ధ్యానం కొనసాగింది. చివరిలో ధ్యానాన్ని విరమించబోయేప్పుడు మనస్సు తిరిగి సాయి రూపము, లీలలు మీదకు వచ్చింది. ఆ స్థితిలో వర్ణనాతీతమైన పారవశ్యంతో సాయి గుణాలను మనస్సు స్మరించనారంభించి ఈ నామాలు మనస్సులో దొర్లనారంభించాయి. ఒక్కొక్కనామం మనస్సులో మెదుల్తుంటే మనస్సు మరలా తీవ్రంగా ధ్యానోన్ముఖమౌతుంది. ధ్యానానికంత తీవ్రంగా ఉన్ముఖం చేసే నామావళిని వ్రాసుకుంటే పూజకుపకరిస్తాయని తోచి చాలా వేగంతో వ్రాయడం జరిగినది. మధ్యలో ఒక్కొక్కనామం వ్రాసేటంత విరామంకూడ లేక వదిలి వ్రాసుకుంటూ రావలసి వచ్చింది. వచ్చినవన్నీ వ్రాశాక జ్ఞాపకం చేసుకొనగా కొన్ని గుర్తుకొచ్చి వాటిని ఆ స్థానంలో చేర్చడం జరిగింది.

అయితే నామావళిని తిరిగి నేను చూచుకొన్నప్పుడు కొన్ని కేవలం అంతా బాబాయే(లేక దైవమే) అన్న అర్థం రావడం కోసం అతి అల్పమైన విషయాలు దొర్లి హాస్యాస్పదంగా ఉన్నవేమోనన్పించింది. కాని పారవశ్యంతో వచ్చాయి గనుక అట్లానే వుంచాను. తర్వాత ఇతర గ్రంథాలు చదివేప్పుడు ఆ నామాలు నేను తలచినట్లు అల్పాలు కావని శృతులవంటి వాటిల్లో చెప్పబడ్డవే అలా వచ్చాయనీ తెలిసి తప్పక నామావళి ప్రేరితమనితోచి, వాటిని వుంచడం జరిగింది.

తిరిగి ఆలోచించగా 'విశ్వరూపాయనమ:' అనీ, 'సర్వస్మైనమ:' అన్న నామాలలో 'వృక్షనాధాయ', 'ఓషధీనాధాయ', 'జలాశయస్వరూపాయ', 'సస్యాయ', 'ఆహారాయ', 'గుహాయ' మొదలైనవి యిమిడియున్నాయిగదా, ఇక యివి వేరే

చెప్పనవసరమేమిటి? అన్న ప్రశ్నకు సమాధానం స్ఫురించింది. 'సర్వస్మై', 'విశ్వరూపాయ' అన్న నామాలను స్మరించే సమయంలో మన మనస్సు నిత్య జీవితంలో మాంద్యాన్ని చెందియుండడం చేత, చాలా స్వల్పసంఖ్యలోని వస్తువులే మనస్సున మెదుల్తాయి. కాని తక్కిన వస్తువుల స్మృతులు మరుపుచాటున హృదయంలో దాగియుండి, వాటి స్మరణ విశ్వశక్తిలో సమన్వయపడి జరుగునందువల్ల వాటి పట్ల మనకుండే లౌకికమూ, పామరమూ అయిన భావాలు అలానే వుండిపోతాయి. కనుక వాటిని కూడా ప్రత్యేకించి ప్రస్తావించి, అవీ దైవశక్తి స్వరూపాలని భావించి వాటిపట్ల దైవీభావాన్ని వహించనుపకరిస్తాయి. మనకు గోచరించే సర్వవస్తువులపట్ల ఆ భావం నిండడమే 'యోమాం పశ్యతి సర్వత్ర' అన్న గీత శ్లోకార్థం.

ఇంకో విషయం. నామాలక్రమం చాలా ఉపయోగకరమైన విధంగా వచ్చింది. కొన్ని నామాలు ఆరోహణ క్రమంగా వుంటే తర్వాత కొన్ని అవరోహణ క్రమంగా వచ్చాయి. అందుకే ఆరోహణలోని ప్రతి నామానికి విరుద్ధ గుణాన్ని సూచించేదిగా వుంటుంది - అవరోహణలోని మొదటి నామం. 'త్రికాలజ్ఞాయ నమ:' తర్వాత 'కాలరహితాయ' అని వస్తుంది. 'భేదాయ' తర్వాత 'భేదాభేదవివర్జితాయ' అన్నది వస్తుంది. అలానే 'విశ్వరూపాయ', 'మహారూపాయ' తర్వాత 'విరూపాయ', 'నిశ్చలాయ', 'చంచలాయ' వస్తుంది. అంటే విరుద్ధ ధర్మాలుగా గోచరించే వాటికాధారంగా వున్న ఒక్క సద్వస్తువు ఆ రెండుగా వ్యక్తమవుతుందని స్ఫురించడానికే అలాటి క్రమం ఏర్పడింది. అలానే 'సర్వస్మై' అన్నది సర్వానికాధారమైన ఏకత్వాన్ని లక్షిస్తే, 'సర్వరూపాయ' అన్నది. ఆ ఏకత్వం ఏ నానాత్వంగా వెల్లడి అవుతున్నదో ఆ నానాత్వాన్ని లక్షిస్తుంది.

7నుండి 13వరకు కల నామాలలో 'లింగాయ' అన్న పదం సమానం. సంస్కృతంలో లింగము అంటే రూపము, దేహము అన్న అర్థముంది. 'పార్థివలింగస్వరూపాయ' అనగా సృష్టిలోని పృథ్వీతత్త్వమయమైన పదార్థాలన్నీ తన దేహంగా, పార్థివరూపంగా కల్గిన-అని అర్థం. మన దేహాన్ని వుదాహరణగా చూస్తే బాగా అర్థమవుతుంది శరీరంలోని పృథ్వీతత్త్వంగల ధాతు సముదాయం పృథ్వీ నిర్మితమై వుండడమేగాక అవన్నీ ఒక దేహంగా కూర్పుకల్గియుంటాయి. ఎముకలు అస్థిపంజరంలా కూర్చబడి వుంటాయి. అలానే సృష్టి సర్వమూ విశ్వమూ దేని దేహమో దానికి సృష్టిలోని పార్థివ వస్తుజాలమంతా అలానే కూర్పు, ఏకత్వమూ కలిగియుంటాయన్న భావం యిందులో ప్రకటమవుతుంది.

*నామావళిని తిరిగి నేను చూచుకొన్నపుడు కొన్ని కేవలం అంతా బాబాయే(లేక దైవమే) అన్న అర్థం రావడం కోసం అతి అల్పమైన విషయాలు దొర్లి హాస్యాస్పదంగా ఉన్నవేమోనన్పించింది. కాని పారవశ్యంతో వచ్చాయి గనుక అట్లానే వుంచాను. తర్వాత ఇతర గ్రంథాలు చదివేప్పుడు ఆ నామాలు నేను తలచినట్లు అల్పాలు కావని శృతులవంటి వాటిల్లో చెప్పబడ్డవే అలా వచ్చాయనీ తెలిసి తప్పక నామావళి ప్రేరితమనితోచి, వాటిని వుంచడం జరిగింది.*

తక్కిన నామాలకు అర్థం తెలియనివారు నేను వ్రాసిన 'ఏది నిజం?', 'మతం ఎందుకు?' అన్న చిన్న పుస్తకాలు, 'విజ్ఞాన వీచికలు' చదివితే బాగా వివరంగా అర్థమవుతాయి.

ఇలాంటి భావంతో నిండియున్న నామావళికంతకూ సాయిలీలలలో ప్రకటమయ్యే ఆధ్యాత్మ తత్త్వమే వివరణ. శ్రీ సాయి సమాధిని 1963 ఫిబ్రవరి 9న దర్శించినప్పుడు నాకైన అనుభూతి అంతటికీ ఈ నామావళి వివరణ అని తిరిగి చూచుకుంటే అర్థమవుతుంది. ఈ చరాచర జగత్తంతా ఏ మహా చైతన్యంలో భావనామాత్రంగా వున్నదో ఆ చైతన్యమే బాబా అను నా అనుభవాన్ని గుర్తుంచుకొంటే నామావళి నాకు బాగా అర్థమవుతుంది.

# 'శ్రీ సాయి లీలామృతము కృతజ్ఞతార్చన మహోత్సవము'

'సాయిబాబా'

మే 2012

సాయిబాబా–ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

శ్రీ సాయినాధుని, శ్రీ అలివేలుమంగా సమేత భరద్వాజ గురుదేవుని కృపవలన, 'శ్రీ సాయి లీలామృతము కృతజ్ఞతార్చన' మహోత్సవం జరుపుకోవాలని సంకల్పం కలగడము, గత సంవత్సరం ప్రారంభించడము, దిగ్విజయంగా మనదేశంలో మాత్రమేకాక, ప్రపంచంలో ఎన్నో నగరాల్లో 'శ్రీ సాయి లీలామృతము కృతజ్ఞతార్చన' మహోత్సవం జరుపుకోవడం సంభవించింది. కృతజ్ఞతా మహోత్సవంలో భాగంగా, ఈ కార్యక్రమం ఆరంభమవడం గురుదేవుని కృపా కటాక్షానికి నిదర్శనం.

ఈ మే నెల 13వ తారీఖున 'శ్రీ సాయి లీలామృతము కృతజ్ఞతార్చన-2012' జరుగనున్నది. ఆ కార్యక్రమ వివరాలు, దాని యొక్క విశిష్టత మనమందరం గుర్తుంచుకోవడం ఎంతోశ్రేయోదాయకము.

శ్రీ సాయినాధుడు అద్వితీయ పూర్ణ దత్తావతారము, సకల దేవతా స్వరూపము. సకల సాధుస్వరూపము. ఆశ్రిత కల్పవృక్షము. సమర్ధ సద్గురువు. నిత్యసత్యుడు. సర్వమతాల, సాంప్రదాయాల, సాధనల పరాకాష్ఠ.

వారి చరిత్రగ్రంధమయిన శ్రీ సాయిలీలామృతం సాక్షాత్ సాయిస్వరూపము. ఎందరో మహనీయులచేత "సాయిబాబా కా బేటా" అనిపించుకున్న సాటిలేని మహనీయమూర్తి మన గురుదేవులు శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్ గారిచే రచింపబడిన "శ్రీ సాయిలీలామృతం" సాటిలేని గ్రంధం. ఈ గ్రంధ పారాయణ ఆర్తుల




కష్టాలు తీర్చి, అర్థార్థులకు వరములను ప్రసాదించి, జిజ్ఞాసువులకు జ్ఞానాన్ని ప్రసాదించి, భక్తులకు భగవద్దర్శనం చేయించి సాక్షాత్తు సాయియొక్క అక్షర స్వరూపంగా నిలచింది. రానున్న మానవజాతికి మార్గదర్శకమైన ఈ మహాగ్రంధం భగవంతుని కృపకు చిహ్నం. అంతటి ఈ గ్రంధాన్ని తగినట్టు పూజించటం, సత్కరించడం మన కర్తవ్యం. అట్టి అర్చన, ఆరాధన సమాజంలో చక్కని సాంప్రదాయంగా తరతరాలూ నిలవాలి. అందుకు శంఖారావమే ఈ "శ్రీ సాయిలీలామృత కృతజ్ఞతార్చన".

అవ్యాజంగా లభించిన భగవత్కృపకు చిహ్నమైన మహనీయులను, వారి బోధలను, సద్గ్రంధాలనూ తగినట్లు సత్కరించకపోవడం

వలననూ, వాటి విలువను తిరిగి తిరిగి గుర్తించి గుర్తుంచుకోవకపోవడం వలననూ మానవజాతి కాలక్రమేణా వాటిపట్ల తగు శ్రద్ధను కోల్పోయి, వాటి విలువను విస్మరించడం చరిత్రలో చూడవచ్చు. అలాకాక ఎక్కడైతే తగిన శ్రద్ధ నిలుపబడిందో అక్కడ అట్టి సద్గ్రంధాల, మహనీయుల బోధ తరతరాలూ గౌరవింపబడడం చూడ వచ్చు. శ్రీ "గురుగ్రంథ్ సాహిబ్" దీనికి చక్కని ఉదాహరణ. మాస్టర్ మనకందించిన మహిత వరమైన 'శ్రీ సాయి లీలామృతం' పట్ల, ఆ గ్రంధంలోని అమరబోధ పట్ల తగు శ్రద్ధ కలకాలం నిలవాలంటే మనం శ్రద్ధతో ఆ గ్రంధాన్ని పారాయణ చేయటం, ఆ గ్రంధరాజాన్ని తగినట్లు సత్కరించడం, తరచూ పూజించడం అనే సదాచారం మనం నిలబెట్టుకోవాలి.

సద్గ్రంధ పఠన కూడా చక్కని సత్సంగమేనని, సత్యమైన భగవత్స్వరూపాన్ని మనకందించే గ్రంధాలను చదవడం అట్టి సత్యం యొక్క సాంగత్యమేననీ భగవాన్ రమణులు తెలిపారు. సత్సంగమును చక్కని తోటవలే పెంపొందించుకోవాలన్నారు మాస్టర్‌గారు. శ్రీ సాయిలీలామృత పారాయణ మనకు అంతటి సత్సంగమే కనుక దానిని కలకాలం కాపాడుకునే యత్నంలో ఈ కృతజ్ఞతార్చన తప్పనిసరి అయిన విధి.

ఈ మహత్కార్యక్రమం చేయవలసిన నియమావళి ఈ క్రింది విధంగా ఉన్నది.

ఈ అమూల్యమైన సూచనను అమలు పరిచే విధంగా దేశ విదేశాలలో వున్న మన గురుబంధువులందరిని సంఘటితం చేస్తూ ఈ సంవత్సరం మే నెల రెండవ ఆదివారము, 13-05-2012, ***'శ్రీ సాయి లీలామృతము కృతజ్ఞతార్చన మహోత్సవము'*** గా జరుపుటకు సంకల్పించి పూజా విధానాన్ని యిలా తెలియజేస్తున్నాము.

కృతజ్ఞతా దినోత్సవమున విధించిన సేవ భారతదేశములోని వారందరూ ఉదయము 10 గంటలకు **(10 AM IST)** శ్రీ సాయిలీలామృతానికి పూజ చేసుకోవాలి. ఇతర దేశాలలోనివారు వారి సత్సంగ బృందాలకు కాని, వ్యక్తులకుగాని అనువైన సమయానికి పూజ చేసుకోవచ్చును. అది భారతదేశపు కాలమానం ప్రకారం **10 AM** అవ్వాల్సిన అవసరంలేదు. భారతదేశములోని వారు మాత్రము ఖచ్చితముగా ఉదయం 10గం॥లకు పూజను ప్రారభించవలసి వుంటుంది. శ్రీ సాయినాధ పూజతో యధావిధిగా సంపూర్ణంగా శ్రీ సాయిలీలామృత గ్రంథరాజాన్ని సేవించవలసివుంటుంది.

ద్వారకానాధ్ గారు విశదీకరిస్తూ ఇలా చెప్పారు. "ఈ గ్రంధానికి, సాయినాధునికి తేడాలేదు అన్నది హృదయంలో నిలవడం లేదు. పారాయణ చేసేటప్పుడు ఉపోద్ఘాతాన్ని వదిలి పారాయణ చేస్తాము. ఇది తప్పు. శ్రద్ధ లోపించడం వలన ఇలా ఎన్నో తప్పులు దొర్లుతున్నాయి". పూజ గురించి ఆయన ఇలా చెప్పారు - "పూజాదినోత్సవము రోజున ఒక ఎత్తైన పీటను అమర్చుకొని స్వచ్ఛమైన తెల్లటి వస్త్రం పరచుకుని, దానిపై గ్రంథం వుంచి, శ్రద్ధగా షోడశోపచార పూజ, శ్రీ సాయి అష్టోత్తరశతనామావళి చేయాలి. నైవేద్యము సమర్పించాలి. గ్రంధానికి నగర సంకీర్తనము చేసుకోవచ్చు. శ్రీ సాయిలీలామృతము శ్రీ గురుగ్రంథ సాహిబ్ లాంటిది. గురుగ్రంథ సాహిబ్‌ను శిక్కులు ప్రాణపదంగా సాక్షాత్ గురుస్వరూపంగా ఎలా కొలుస్తారో, శ్రీ సాయిలీలామృతమును అలా గౌరవించడం మనందరి విధి".

పూజ్య గురుదేవులు భరద్వాజ మాస్టరుగారు 'శ్రీ సాయిలీలామృతము నా శాశ్వతరూపము' అని ప్రకటించివున్నారు. అంతటి పవిత్రతకూ, శక్తికీ, దయకూ, భగవత్స్వరూపానికి మరోరూపమైన 'శ్రీ సాయి లీలామృతము' అనే ఈ గ్రంథరాజాన్ని పైరీతిన సేవించుకొని తరిద్దాము.

ఈ బృహత్ కార్యాన్ని వీలైనంతమందికి పరిచయంచేసి తమవంతు కృషి చేయమని ప్రార్థన.

**- 'సాయిమాస్టర్ సత్సంగబృందం'**

## Books on Sri Ramakrishna Paramhansa and Swami Vivekananda

| Title | Price |
|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 |
| భారతం నా అమర భారతం | 20.00 |
| జ్ఞాన యోగం | 30.00 |
| బుద్ధి యోగం | 15.00 |
| కర్మ యోగం | 15.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 |
| స్వామి వివేకానంద (2 భాగాలు ) | 60.00 |
| మహాభారతం | 5.00 |
| నా అమర సందేశం | 30.00 |
| భక్తి యోగం | 10.00 |
| సందేశ తరంగిణి(కొలంబో-అల్మోరా) | 40.00 |
| వివేక సూర్యోదయము | 20.00 |
| దైవంతో సహజీవనం | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 |
| మువివేకానంద లేఖావళి | 25.00 |
| My Idea of Education | 34.00 |
| Karma Yoga | 18.00 |
| God Lived with Them | 170.00 |
| The Lived with God | 140.00 |
| Raja Yoga | 36.00 |
| Bhakti Yoga | 16.00 |
| Jnana Yoga | 50.00 |
| Letters of Swami Vivekananda | 110.00 |
| Reminiscences of Swami Vivekananda | 100.00 |
| Talks with Swami Vivekananda | 58.00 |
| Complete Works of Swami Vivekananda-9 | 110.00 |
| Meditation and Its Methods | 18.00 |
| Vivekananda on Himself | 100.00 |
| Ramakrishna and Vivekananda | 7.00 |
| Tales and Parables of Sri Ramakrishna | 45.00 |
| Lectures from Colombo to Almora | 40.00 |
| Complete Works of Swami Vivekananda | 50.00 |
| Sayings of Sri Ramakrishna | 25.00 |

జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయిమాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయిమాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు-పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine Subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone :040-20063300
**OR, Sri Manga Bharadwaja Trust , Ongole Branch Office**
Kothapeta, Kondaiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.** **Magazine** మరియు **General Donations** ను **"Sri Manga Bharadwaja Trust"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Annadanam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Sai Master)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Ashramam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Peace Foundation)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల్వారా పంపగలరు

**Books order** ను **"Sri Manga Bharadwaja Trust (Publications)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు**

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్మ్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

**ఇతర ప్రచురణలు**

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300

**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**

*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*

# మీరు "శ్రీ సాయి లీలామృతము" చదివారా?

## శ్రీ సాయి లీలామృతము

## (శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర)

రచన : ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ




"నా చరిత్రగానమే నీకు శ్రేయస్కరం.
అది నా అవతారకార్యానికి పరిపూర్ణత"

- శ్రీ శిరిడీ సాయిబాబా

(మే 13, "శ్రీ సాయి లీలామృతము"మహా గ్రంథం కృతజ్ఞతార్చన)

edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust,
ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.



అవధూత శ్రీ నాగమునీంద్రస్వామి ఆరాధన
జూన్ 17, 2012 సందర్భంగా
వారి ఆశీస్సులు మనందరిపై ఉండాలని
ప్రార్ధన!

# దైవంపట్ల కృతజ్ఞతే ప్రాతస్మరణ ప్రయోజనం

**ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

నిత్యజీవితంలో పరిమితమైన పరిస్థితులచేత బందీగా చేయబడే మన మనస్సును విశాలమైన సృష్టితత్వాన్ని గుర్తుంచుకొనేలా చేయడం ప్రాతస్మరణయొక్క ఒక ప్రయోజనం.

ఈ నిత్యజీవిత సంఘటనలు మనలో 'నేను,నాది' అనే భావాన్ని బలిష్టం చేస్తాయి. నిజానికి యీ సృష్టిలో ఏదీ మనదంటూ లేదని, మనంకూడా 'మన' వారంకాదని, అంతా భగవదిచ్ఛచేత కొనసాగే దైవ ప్రక్రియయనీ ప్రాతస్మరణ, సంకల్పమూ గుర్తుచేస్తాయి.

సృష్ట్యాదిలో అద్వితీయుడుగా వున్న పరమాత్మ తన వినోదంకోసం అనేకమవదలచి తన మాయాశక్తిచేత యీ అనంత చరాచర విశ్వంగా ప్రకటమయ్యాడని శృతులు చెబుతున్నాయి. అంతా ఆయనదేనన్న భావం దృఢంగా రోజులో కొన్ని సార్లు ప్రతివారూ స్మరించడం నేర్చుకుంటే 'నేను, నాది' అనే అజ్ఞానం పలుచబడి జీవితంలో జయాపజయాలను, కష్టసుఖాలనూ ఆటలో అరటిపండులాగా తీసుకోగలగుతారు. అది స్థిరపడ్డప్పుడు 'సుఖదుఃఖాల యందు సముడవుగా' అన్న గీతాబోధ మనకలవడుతుంది. 'నేను, నాది' అన్న భావాలవలన ప్రేరేపించబడి బలపడే రాగ, ద్వేష, అసూయ, భయాది వికారాలు పలుచబడుతాయి. మనస్సు శాంతంగా వుండడం నేర్చుకొంటుంది.

ప్రాతస్మరణలో మొదటి శ్లోకం ముగ్గురు జగన్మాతలనూ స్మరిస్తుంది. 'నీవే తల్లివి'అన్న పద్యములోనైతేనేమి, 'తల్లి,తండ్రి, గురువు, దైవం' అన్న నానుడిలో నైతేనేమి, మయాశక్తియైన జగన్మాతయొక్క తోడులేక ఆ పరమాత్మగూడ సృష్టి చేయజాలడన్న శ్లోకంలోగాని, నానాత్వంతోగూడిన యీ విశ్వసృష్టికి మూలం జగన్మాతయైన మాయా శక్తేనని స్మరిస్తుంది. తర్వాత శ్లోకం జీవులన్నింటికీ నాల్గవ తల్లియైన భూదేవిని స్మరిస్తుంది.

నిత్యమూ భూమిమీద నివసించడంవలన, నడవడంవలన భూమి మన ఉనికికంతటికీ ఎంత ప్రధానమో పూర్తిగా విస్మరిస్తాము. ఎదురుదెబ్బ తగిలితేగాని భూమి మనకు గుర్తురాదు. మనభుక్తికీ, నివాసానికీ, సంచారానికీ ఆస్కారమైన భూమినే మరచే స్వభావం అభ్యాసంగా పరిణమించి, అతిపరిచయంవలన మన జీవితానికంతటికీ అతి విలువైన వాటినన్నింటినీ మనం విస్మరించే వైఖరిగా మన జీవితాన్నంతటినీ ప్రభావితం చేస్తుంది. అందుకనే మనకు పుట్టుకనిచ్చి, ఎన్నో కష్టాలకోర్చి పెంచిపెద్దచేసే తల్లిదండ్రుల ప్రేమను మానవులెందరో గుర్తించరు. అనాయాచితంగా దొరికిన అలాటి నిర్హేతుకమూ, అపారమూ అయిన ప్రేమను గుర్తించక, అలక్ష్యంచేసి, తక్కిన ప్రపంచంలోని వ్యక్తులనుండి జీవితాంతం అట్టి ప్రేమను యాచించుకుంటూ, లభించకుంటే ద్వేషిస్తూ బ్రతుకుతారు మానవులు. కనుక అనాయాచితంగా లభించిన భూమియొక్క ఆశ్రయమెంత విలువైనదో ప్రత్యేకంగా గుర్తించి కృతజ్ఞులమై వుండడం నేర్చుకుంటేగాని మనిషి జీవితంలో లభించిన ప్రేమను చులకనచేసి దౌర్భాగ్యుడవడం మానడు.

అంతేగాదు, అంతవిలువైన భూమిని కాళ్ళక్రింద అలక్ష్యంగా త్రొక్కడమంటే తాను జీవితంలో సహజంగా లభించిన ప్రేమను కాలరాచే దౌర్భాగ్య లక్షణానికి బాహ్యమైనరూపం. అది గుర్తించి ప్రేమ, గౌరవాలతో గూడిన కృతజ్ఞత నలవరచుకొంటే భూమాతనాధారంగా చేసుకొని ఉన్నతుడుగా తన కాళ్ళమీద తను లౌకికంగానూ, ఆధ్యాత్మికంగానూ నిలబడగల్గటమేగాక నడవగలగడమూ, పురోగమించడం నేర్చుకోగల్గుతాడు. అందుకే ప్రాతస్మరణలోని యీ శ్లోకంలో భూమాతను కాళ్ళతో త్రాకినందుకు క్షమాపణ కోరుతాడు; ఆమెపై ఆధారపడకుండా తాను జీవించలేక పోవడాన్ని కృతజ్ఞతతో అంగీకిరించి గుర్తుంచుకొని జీవించడం నేర్చుకుంటాడు మానవుడు. అలా స్మరించడంవలన సకల విశ్వముతోపాటు తనకాళ్ళక్రిందనున్న భూమిగూడ పరమ చైతన్యంయొక్క రూపమని గుర్తుంచుకోగల్గుతాడు.

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంపుటి: 30 జూన్-2012 సంచిక: 02

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"

## విషయసూచిక




చిరునామా

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**



చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి
ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ ఆర్.ఎస్. శశిధర్, పిహెచ్. డి


**చందా వివరములు**

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10-00 |
| సంవత్సర చందా | : రూ. 100-00 |
| రాజపోషకులు | : రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000-00 |

*కష్టాలు తీర్చమని దైవాన్ని కోరేవారు ఆర్తులు, కోరికలు తీర్చమని కోరేవారు అర్థార్థులు, దైవాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకోగోరే వారు జిజ్ఞాసువులు, శాశ్వతమైన ఆనందమే దైవమన్న అనుభవాన్ని పొందినవారు జ్ఞానులు. వీరందరూ దైవాన్ని ఆశ్రయించేవారే.*

*ఆర్తులు, అర్థార్థులు గూడ జిజ్ఞాసువులై, జ్ఞానులుగా పరివర్తన చెందడమే దు:ఖానికి అసలైన నివృత్తి మార్గం. వ్యక్తిగత సామాజిక శ్రేయస్సుకు పునాదియైన అసలైన ఆధ్యాత్మికత అదే!*

**- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ**

# సాధకునికి తత్త్వజ్ఞానం ఎంతో అవసరం

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

వ్యవసాయం చేయాలంటే ముందు నేలను ఎంతో సంస్కరించాలి. అలానే ధ్యానం సరిగా అభ్యసించగల్గాలంటే మనస్సునెంతగానో సంస్కరించాలి. అన్నిటికంటే ముఖ్యం భావశుద్ధి. మనకు అజ్ఞానజనితాలైన ఎన్నో పొరపాటు భావాలుంటాయి. సృష్టి, మానవుడు, జీవితతత్త్వాల గురించి, సరిగా వాటి తత్త్వాన్ని తెలుసుకుంటే గాని భ్రాంతులు, వ్యామోహాలు తొలగవు. మనస్సు వాటిచేత చంచలమవుతుంది. ఆ చాంచల్యం తొలగాలంటే వ్యామోహాలు తొలగాలి. అందుకు వస్తువుల యొక్క, జీవితం యొక్క తత్త్వం చక్కగా అర్థంగావాలి. అందుకే భక్తి, జ్ఞాన, అష్టాంగ యోగాలన్నింటిలో తత్త్వజ్ఞానం చాలా ఆవశ్యకం. భక్తిమార్గంలో మనకు గోచరించే యీ స్థూల ప్రపంచమొక్కటే వాస్తవంగాదని, మన ప్రాకృతిక జీవితం దు:ఖమయమని, దానినుండి విడివడగల్గితే ఆనందమయమైన భగవత్స్వరూపం అనుభవమవుతుందని దృఢంగా తెలుసుకోవాలి. గుడ్డిగా నమ్మడంకాదు. ఎంతయత్నించినా మనకు స్పష్టంగా తెలియని దానిని దృఢంగా నమ్మసాధ్యంకాదు. శంక ఏదో ఒక మూలదాగివుండి, మన యత్నాన్ని బలహీనపరిచి భగ్నంచేస్తుంది. క్షుణ్ణంగా తెలిస్తే దృఢమైన నిశ్చయంగల్గి లక్ష్యంపై అపారమైన కోరిక కల్గుతుంది. స్థూలజగత్తులో గోచరించే వస్తువులు, జీవితానుభవాలే పరమ సత్యంగాదని తెలియబట్టి వాటికి మనపై ప్రాబల్యం తగ్గుతుంది. జగత్తుపట్ల వ్యామోహం తగ్గి, ఆనందరూపుడైన పరమాత్మపట్ల నిశ్చయాత్మకమైన ప్రీతికల్గి కృతార్థత చేకూరేవరకూ మన యత్నాన్ని సడలనివ్వదు. జ్ఞానమార్గంలో గూడ శ్రవణ, మనన, నిదిధ్యాసలనందుకే చెప్పారు.

కొందరు అటు జ్ఞానంగాని, ఇటు భక్తిగాని అష్టాంగయోగానికవసరంలేదని తలుస్తారు. కానీ సరికాదు. యమ, నియమాలు, ఆసన ప్రాణాయామాలు అష్టాంగయోగానికి ప్రధాన సోపానాలుగా చెప్పబడ్డాయి. యమనియమాలంటే యింద్రియ మనోనిగ్రహం, మనస్సును నిగ్రహించకుండా యింద్రియాలను మాత్రమే నిగ్రహించడం మిథ్యాచారమని, నిష్ప్రయోజనమని గీత స్పష్టంగాచెబుతోంది. కనుక మనస్సును మొదట జయించాలి. అంటే అజ్ఞానంచేత వస్తువుపట్ల, జీవితానుభవముపట్ల మనకు సామాన్యంగా వుండే భ్రాంతి తొలగాలి. అందుకు వస్తువుల, జీవితానుభవాల వాస్తవత్త్వం అర్థంకావాలి. అలా భ్రాంతులుతొలగిన యింద్రియాలు చాలావరకు వాటంతటవే అదుపులో వుంటాయి. దీనికితోడు యోగసిద్ధి ఫలమైన శాశ్వతానందంపట్లగల తీవ్రమైన ప్రీతి ధ్యేయంపైన మనసు నిలిచేలాగ చేస్తుంది. ఈవిషయాన్నే గీత యిలా చెబుతుంది.

"నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
నచా భావయుత: శాన్తి: అశాన్తస్య కుతస్సుఖమ్ ॥"

తా॥ ''మనస్సమాధానములేని అయుక్తునకు ఆత్మధ్యానమను భావనలేదు. (అనగా ఆత్మస్వరూప జ్ఞానమను బుద్ధిలేదు) భావనలేని వానికి శాంతిలేదు. శాంతిలేని వానికి సుఖములేదు". అందుకే యాజ్ఞవల్క్యుడు ఆధ్యాత్మవిద్యను ఉపదేశింపదగినివారి గూర్చి యిలా అన్నాడు:

విద్యుక్తకర్మ సంయుక్తం కామ సంకల్ప వర్జిత: ।
యస్య తస్యాధికారోస్మిన్ యోగీ నాన్యస్య కస్యచిత్ ॥

తా॥ "ఋషులచేత విధించబడిన సత్కర్మలను శ్రద్ధగా ఆచరించేవాడు, కామ సంకల్పాలను విడిచినవాడు, యమనియమాలు కలవాడు, సర్వ వ్యామోహములను విడిచినవాడు".

వాయుసంహిత గూడ యిలా చెబుతోంది.

"దృష్టే తధాను శ్రవికే విరక్తం విషయే ।"

తా॥ "ఇహలోక పరలోక విషయములందు విరక్తిగల చిత్తముగలవాడికే యోగమునందు అధికారము గలదు. తదితరులకు లేదు. అలానే వేదాంతోపదేశాలను వింటూ యోగాన్నభ్యసించాలని శాండిల్యోపనిషత్తు, శివయోగ దీపిక చెబుతాయి".

"హఠయోగ ప్రదీపిక" గూడ యిలా చెబుతున్నది.

"ఉత్సాహాత్సాహసాద్ధైర్యా । తత్త్వజ్ఞానాశ్చ నిశ్చయాత్ ।
జ్ఞానసజ్ఞ పరిత్యాగాత్ షడ్భిర్యోగ: ప్రసిద్ధ్యతి ॥"

తా॥ "ఉత్సాహ, సాహస, ధైర్య, తత్త్వజ్ఞానమువలన, దానివలన గల్గిన నిశ్చయంవలన యోగసిద్ధి కల్గుతుంది. 'నిశ్చయాత్' అన్నమాటకు బ్రహ్మానందస్వామి విషయములన్నియు మృగతృష్ణవలె అసత్యములని, బ్రహ్మమొక్కటే సత్యమని, తత్త్వజ్ఞానము, శాస్త్రము, గురువాక్యములందుగల విశ్వాసము అనీ వివరించారు.

అంటే **సృష్టితత్త్వము, జీవితానుభవతత్త్వమూ తెలుసుకోవడం సాధనామార్గాలన్నింటికీ పునాది.** పునాది దృఢముగాలేని యిల్లు నిలువదుగదా! అందుకే "మతం ఎందుకు?", "విజ్ఞానవీచికలు" ముముక్షువులందరూ తప్పకచదవాలి. రెండవ గ్రంథంలో ఆర్ష తత్త్వజ్ఞానాన్ని ఆధునిక విజ్ఞానంతో సమన్వయించడం జరిగిందిగనుక నేటివారికెంతో అది ఉపకరిస్తుంది. నేటి విజ్ఞానశాస్త్రాలను విద్యాలయాలలో అధ్యయనంచేసిన, చేస్తున్నవారికి యిలా సమన్వయించి చెప్పకుంటే ఆధ్యాత్మికత, వైజ్ఞానిక యోచనకు నిలుజాలని భ్రమ అన్న శంక మిగిలిపోతుంది. కనుక యీనాటి ధర్మప్రచారకులందరూగూడ పై గ్రంథాన్ని పరిశీలించనిదే వారిప్రచారం నూనెరాసిన శరీరంమీద నీటిలాగ మనస్సులకు అంటదు.

ఇట్టి వైజ్ఞానిక-తాత్త్విక దృష్టిని వహించే, సృష్టిపట్ల అట్టి లోచూపుతోనే పూజాదికాలు నిర్వర్తించాలని తెల్పడానికే సామాన్యమైన షోడశోపచార పూజలో పురుషసూక్తాన్ని వినియోగిస్తారు. పురుషసూక్తమంతా సృష్టినంతటినీ యిట్టి వైజ్ఞానిక-తాత్త్వికదృష్టితో చూపేదేనని పై గ్రంథాలు చదివాక 'పురుషసూక్తరహస్యం" అన్న చిన్న గ్రంథం చదివితే తెలుస్తుంది. ఇది చదివి సరియైన అవగాహనపొందనిదే సాధన నిర్దుష్టం కాజాలదు.

పై గ్రంథాలు చదవడం శ్రమ అని చాలామంది వాటినుపేక్షిస్తున్నారంటే అర్థం నేటి సాధకులు, ముముక్షువులు, ధర్మప్రచారకులలో ఎక్కువమంది నిజమైన సాధకులు మొ॥నవారు కారన్నమాట. సాధ్యంమీద ప్రీతియున్నపుడు ఎంత శ్రమించైనా మనిషి సాధనాలను సేకరిస్తాడు. డబ్బు, సంసారలంపటమూ గలవారు వాటికోసమెంతైనా ఎలా శ్రమించి వాటిని నెరవేర్చుకునే మార్గాలను తెలుసుకుంటున్నారో చూడండి. అటువంటప్పుడు సర్వదు:ఖాలకూ అతీతమైన శాశ్వతానందాన్ని పొందగోరేవారు రెండుమూడు ముఖ్యమైన గ్రంథాలను చదవడానికి బాధపడతారా?

చివరికి ఒక్కమాట. సద్గురువునాశ్రయించినవాడికి నిజంగా "శ్రీసాయినాథ ప్రబోధామృతము"లో వివరించినట్లు ఆశ్రయిస్తే – అష్టాంగయోగాదులు వాటికై అవే సిద్ధిస్తాయని శాస్త్రవాక్యం. రాజయోగమనే గ్రంథమిలా చెబుతోంది:

శ్లో॥ "వేదాన్తతర్కోక్తిభిరాగమైశ్చ, నానావిధై: శాస్త్రకదంబకైశ్చ ।
ధ్యానాదిభి: సత్కరణైగమ్యశ్చిన్తామణిహ్యేక గురుం వినా ॥"

తా॥ "చింతామణియైన గురువొక్కడు లేక, తక్కిన వేదాంత తర్కవచనములచేతను, నానావిధ శాస్త్రసమూహములచేతను, ధ్యానాది సత్కర్మములచేతను యోగము తెలియదగినదిగాదు. సురేశ్వరాచార్యుడు "గురుప్రసాదము వలన అష్టాంగసహిత యోగమును పొందుచున్నానని" చెప్పాడు. "ఆచార్యవాన్ పురుషోవేద" అని ఛాన్దోగ్యము – గురువును ఆశ్రయించినవాడే పురుషుని (దైవాన్ని) చేరుకుంటాడని చెప్పింది.

ఇలా అనడానికి "హఠయోగప్రదీపిక" లోని యమనియమాదులనుదహరిస్తూ శ్రీ బ్రహ్మానంద సరస్వతి వ్రాసిన యీ వాక్యాలు ప్రమాణం. "దేహేంద్రియముల వలన కల్గు వైరాగ్యము యమము, పరతత్త్వమునందెడదెగక కల్గు అభిలాష నియమం. సర్వవస్తువులయందు ఉదాసీనత ఉత్తమమైన ఆసనం. సకల జగత్తూ మిధ్యగాదోచుట ప్రాణాయామము. చిత్తముయొక్క నిశ్చయస్థితి ధారణ. చిన్మాత్రమే నేనని చింతించుట ధ్యానము. ధ్యానానికతీతమైన స్థితిలో ధ్యానాన్ని మరవడం సమాధి".

ఇలాంటి నిశ్చయాన్ని 'విజ్ఞానవీచికలు', 'మతంఎందుకు?', 'శ్రీసాయినాథ ప్రబోధామృతము' ఎంతో చక్కగా చేకూరుస్తాయని కొంచెం జాగ్రత్తగా ఆ గ్రంథాలను పరిశీలిస్తే ఎవరికైనా తెలుస్తుంది.

---

# అభయప్రదాత

## దివ్యజనని అలివేలు మంగమ్మ

'భయము' అన్నది చాలా భయంకరమైన విషయము. అసలు భయమంటే ఏమిటో అది మనందరికీ చాలా సందర్భాలలో అనుభవమవుతుంది గనుక తెలుసు.

భయము అనేక రకాలు. సాధారణంగా క్రూర జంతువులను చూస్తే ఎవరికైనా భయమేస్తుంది. ఉదాహరణకు పులి, సింహము, పాము మొ॥నవి మనలను కరుస్తాయి, ప్రాణాలు తీస్తాయి గనుక భయపడడం సహజమే. కానీ కొంతమందికి మనకేమీ హాని చేయని జీవులను చూస్తేగూడ భయమేస్తుంది. పిల్లిని చూసి కొందరు భయపడితే, బల్లిని చూసి భయపడేవారు కొందరు. కొందరు పురుగులను చూసి, ఎలుకలను చూసి, బొద్దింకలను చూసిగూడ భయపడతారు. అవి మనకు పెద్దగా హాని చేయవు, కానీ భయపడడమెందుకు? అంటే ఇక్కడ భయానికి కారణం వాటి ఆకారాలను చూస్తే మనకు గల అసహ్యమే.

ఇవి గాక జీవితంలో యింకా చాలా భయాలుంటాయి. చదువుకోకపోతే జీవితం గడిచేదెలా? అన్న భయం. చదువుకున్న తర్వాత ఉద్యోగం రాదేమోనన్న భయం. ఉద్యోగం వస్తే పోతుందేమోనన్న భయం. సంపాదించిన డబ్బును ఎవరైనా కాజేస్తారేమోనన్న భయం. దొంగలు దోచేస్తారేమోనన్న భయం. ఖర్చు పెట్టుకుంటే భవిష్యత్తు ఎలా అన్న భయం. డబ్బు ఆశతో ఎవరైనా ఏదైనా చేస్తారేమోనన్న భయం.

అలాగే దారిద్ర్యమంటే భయం. అనారోగ్యమంటే చాలా భయం.

అన్నింటికంటే గొప్పది మృత్యువు గూర్చిన భయం. ప్రతి మనిషికీ మృత్యువంటే ఎంతో భయం. కారణం 'తన' అనుకున్న వాటిని అన్నింటినీ విడిచి



వెళ్ళిపోవలసి వస్తుందని. తన వాటి మీద వున్న మమకారం అందుకు కారణం. అందుకని మృత్యువునుంచి తప్పించుకోవాలని ప్రతి మనిషీ కోరుకుంటాడు. వయసు పెరిగిన కొద్దీ ఏ క్షణాన మృత్యువు కబళిస్తుందోనన్న భయం పీడిస్తుంది. నడి వయసులో వున్న వారికి అభద్రతాభావం వల్ల భయం. యువకులకు మరణభీతి వుండకపోవచ్చుగానీ ఎదుర్కొంటున్న పరిస్థితుల వల్ల ఆందోళన, భయము వుంటున్నాయి. కనుక ఏ మానవుడూ పూర్తి నిర్భయంగా వుండలేకపోతున్నాడు.

కలిప్రభావం వలన నేడు స్వార్థం పెచ్చుపెరగడం వల్ల నేడు భయం విలయతాండవం చేస్తున్నది. ఏదో జరుగుతుందేమోనన్న భయంతో నేటి మానవుడు కొట్టుమిట్టాడుతున్నాడు. ఏదో పైకి

కొంత ధైర్యంగా వున్నట్లు కనిపించినప్పటికీ అది అంతంతమాత్రమే.

నేడు మనిషికి సాటి మనిషంటేనే ఎక్కువ భయమని అనిపిస్తున్నది. పేదవారి దగ్గరనుంచీ గొప్ప ధనవంతులదాకా, సామాన్యుల దగ్గరనుంచీ రాజ్యమేలుతున్నవారి దాకా ఈ భయం సహజమైపోయింది. ఈ రోజులలో ఎవరు ఎవరిని ఏమైనా చేయవచ్చు. అనేక కారణాలుగా ఎవరు ఏ విధంగానైనా కక్ష తీర్చుకోవచ్చు. ధనం కాజేయవచ్చు, ప్రాణాలనే తోసేయవచ్చు. కొందరు మనుషులు జంతువుకంటే హీనంగా ప్రవర్తిస్తున్నారనడంలో సందేహంలేదు. జంతువులకంటే అని ఎందుకు అనుకోవలసివస్తున్నదంటే జంతువులు ఆహారం కోసమో లేక ప్రాణభీతి వల్లనో మాత్రమే ఇతర జీవులపై దాడి చేస్తాయి. మనుషులు అలాంటి కారణాలేవీ లేకుండా గూడ అనేక విధాలుగా పీడిస్తున్నారు.

అసలు మనిషికి వుండవలసినది సాటి మనిషి మనకు తోడు వున్నాడన్న ధైర్యం. అందుకే మానవుడు సాటి మానవులకు తోడుగా కోరుకుంటాడు. సమాజం ఏర్పడినది అలానే. కానీ తోడుగా వుండవలసిన సాటి మానవుడు పీడగా మారుతుంటే చేయగలిగినదేమున్నది? కంచే చేను మేస్తే కాపాడేదెవరు?

ఇదివరకు మనిషికి మనిషి తోడుగా వుండేవాడు. తనకు తల్లిదండ్రుల అండగా వున్నారన్న ధైర్యం తోబుట్టువులు వున్నారనే ధైర్యం, పిల్లలు వున్నారనే ధైర్యం, మేనమామలు, పినతండ్రులు, బంధువులు-యిలా ఎందరో అండగా వున్నారనే ధైర్యం వుండేది. ఏ శుభకార్యమొచ్చినా, ఆపద వచ్చినా అందరూ లేక ఏ కొందరైనా ఏదో ఒక విధంగా అండగా నిలిచేవారు. ఉదాహరణకు ఒక ఇంట్లో పెండ్లి వస్తే సంబంధాలు చూడడం దగ్గరనుంచీ అందరూ పూనుకునేవారు. అలాగే ఎవరైనా మరణించినా అంతే. ఒకరింట్లో తల్లి చనిపోతే పసిపిల్లలుంటే వారిని బంధువులలో తలా ఒకరూ తీసుకెళ్ళి వారిని పెంచేవారు. వారు సరిగా చూసారా, లేదా, అన్నది ప్రశ్నగాదు. మేమున్నామనేదే అక్కడ ముఖ్యము. తల్లికి పాలు లేకపోతే ఇంట్లో పసిపిల్లలున్న తల్లులు పాలిచ్చేవారు. లేక దాదులు వుండేవారు. అలాగే మిగతా విషయాల్లోనూ, ఇంట్లో వాళ్ళు, బంధువులు, స్నేహితులు, ఊరి పెద్దలూ వారి శ్రేయస్సుకై పాటుపడేవారు. అలాగే వీరు గూడా వారికి సహకరించేవారు.

నేటి పరిస్థితి పూర్తి వేరుగా వున్నది. క్రిందటి తరం వరకూ అరకొరగా వున్న అనుబంధాలు ఈ రోజు కలతేమో అనిపిస్తున్నాయి. ఇప్పుడు ప్రతివారూ, "మాకు ఎవరు అవసరం లేదు, ఎవరికీ మేము అవసరం వుండనక్కరలేదు" అనే విధంగా వుంటున్నారు. ఇట్టి స్వార్థపరమైన ఆలోచనలు, ప్రవర్తనల వల్లనే భయం కలుగుతున్నది.

అందుకని ఈ భయాలను నివారించుకోవడానికి చాలామంది దైవాన్నీ, మహాత్ములనూ ఆశ్రయిస్తున్నారు. వారి అతీత శక్తుల వలన వారు మన భయాలను తొలగిస్తారేమోననే ఆశ. అందువలన కొన్ని సమస్యల భయం తొలగినా పూర్తిగా నిర్భయులుగా వుండలేకపోతున్నారు.

*భయాలను నివారించుకోవడానికి చాలామంది దైవాన్నీ, మహాత్ములనూ ఆశ్రయిస్తున్నారు. వారి అతీత శక్తుల వలన వారు మన భయాలను తొలగిస్తారేమోననే ఆశ. అందువలన కొన్ని సమస్యల భయం తొలగినా పూర్తిగా నిర్భయులుగా వుండలేకపోతున్నారు. అందుకు కారణం అధర్మం పెచ్చు పెరగడమే. ఈనాడు అధర్మం ప్రపంచ మంతటా అనేక విధాలుగా విలయతాండవం చస్తున్నది. దాని పర్యవసానమే అంతులేని భయం.*

అందుకు కారణం అధర్మంపెచ్చు పెరగడమే. ఈనాడు అధర్మం ప్రపంచ మంతటా అనేక విధాలుగా విలయతాండవం చస్తున్నది. దాని పర్యవసానమే అంతులేని భయం.

కొందరు భగవంతుని, మహాత్ములను ఆశ్రయించి గూడ అధర్మ ప్రవర్తకులై వుంటున్నారు. కొంతమంది ధర్మం ప్రకారం నడుద్దామనుకున్నప్పటికీ సమాజానికి ఎదురీతకు భయపడి తల

ఒగ్గవలసివస్తుంది. ఇతరులు అధర్మ ప్రవర్తకులయినప్పుడు భయం కలగడం సహజమే గానీ, ధర్మం ప్రకారం నిలబడే ధైర్యం కలిగివుండాలి. మన ధర్మం మనలను కాపాడుతుంది. "ధర్మో రక్షతి రక్షిత:" "ధర్మాన్ని రక్షిస్తే, ధర్మం రక్షించిన వాడిని రక్షిస్తుంది" అని పెద్దల వాక్యం. కనుక ధర్మాలు అంటిపెట్టుకున్న వాడికి ధర్మం వుంటుంది, వుండాలి. మనం ధర్మంగా వున్నా అవతలివాడు అధర్మంలో మనలను మోసం చేస్తున్నాడు, అన్యాయం చేస్తున్నాడు, ఇంకా ఏమైనా చేయడానికి వెనుకాడడం లేదు కదా! మరి మనకు ధైర్యం ఎలా వుంటుంది? అని కొందరనవచ్చు.

సమాజంలో ధర్మాన్ని నిలబెట్టడానికి ఎంతో మంది కృషి చేసారు. ఎన్నో సమస్యలను ఎదుర్కొన్నారు. కానీ వాళ్ళు ధైర్యాన్ని సడలుకోలేదు. ఉదాహరణకు గాంధీ మహాత్ముడినే తీసుకుంటే స్వతంత్రానికై జీవితాంతం కృషి చేసారు. ఆనాడు ఆయన అలా అనుకుని వుంటే స్వాతంత్ర్యాన్ని సాధించగలిగేవాడా? ఆయన చేసేది తప్పుగాదని, ధర్మమనీ ఆయనకు తెలును! అంతేగాదు, ఆయననుసరించి కొన్ని కోట్లమంది ధర్మయుతమైన పోరాటం సాగించారు. ఆ పోరాటంలో ఎందరో ప్రాణాలను సైతం కోల్పోయారు. అయితే ఆనాడు అంతమంది ఎలా ప్రతిస్పందిచారు? మనిషికి అన్నింటికంటే ఎక్కువదైన ప్రాణభీతిని సైతం వారెలా అధిగమించగలిగారు! దానికి కారణం అలా చేయడమే శ్రేయస్కరమని వారికి తెలుసు గనుక.

ఆనాడు పూజ్యశ్రీ మాస్టరుగారు ఒక ముస్లిము ఫకీరుయైన శ్రీ శిరిడీ సాయినాధుని తత్త్వాన్ని గూర్చి ప్రచారం చేయడంలో ఎన్నో ఇబ్బందులను, ఎంతో వ్యతిరేకతను ఎదుర్కొన్నారు. ఆనాడు ఆయన భయపడి వుంటే ఈనాడు మనం సాయిని యింతగా సేవించి శ్రేయస్సుకు పొందగలిగేవాళ్ళమేనా? ఒక్క విషయం ఆలోచిస్తే చాలు, ధర్మం యొక్క ఫలితం ఎలా వుంటుందో అవగతమవుతుంది.

అయితే ఈ కాలంలో అధర్మాన్ని ఎదుర్కోగల అంతటి గుండె ధైర్యం మనకున్నదా? అన్నది ప్రశ్న. దానికి సమాధానం 'లేదు' అనే. అయితే మనమేమి చేయాలి? దీనికి పరిష్కారమేమిటి? మనం అధర్మం చేయకపోయినా అధర్మానికి దోహదం చేస్తూవుండవలసినదేనా?

దీనికి పరిష్కారాలు రెండు. (1) సద్గురువును ఆశ్రయించడం.

ఈ మొదటి దానిని మనం చేసాము. అంటే సమర్ధ సద్గురువైన సాయినాధుని ఆశ్రయించాము.

***ఆనాడు పూజ్యశ్రీ మాస్టరుగారు ఒక ముస్లిము ఫకీరుయైన శ్రీ శిరిడీ సాయినాధుని తత్త్వాన్ని గూర్చి ప్రచారం చేయడంలో ఎన్నో ఇబ్బందులను, ఎంతో వ్యతిరేకతను ఎదుర్కొన్నారు. ఆనాడు ఆయన భయపడి వుంటే ఈనాడు మనం సాయిని యింతగా సేవించి శ్రేయస్సుకు పొందగలిగేవాళ్ళమేనా? ఒక్క విషయం ఆలోచిస్తే చాలు, ధర్మం యొక్క ఫలితం ఎలా వుంటుందో అవగతమవుతుంది.***

అయినా అధర్మంలో పాలుపంచుకుంటూనే వున్నాము. అంటే అధర్మాన్ని పరోక్షంగా ప్రోత్సహించిన వాళ్లమవుతున్నాము. దోహదం చేస్తున్నవాళమవుతున్నాము. అభయప్రధాత అయిన సాయిని ఆశ్రయించిగూడ సాటి మానవుల పట్ల భయంతో అధర్మానికి దోహదం చేయడంలో అర్ధమేముంటుంది? "అయితే అట్లా వుంటే ప్రపంచంలో బ్రతకలేముకదా! శ్రీ సాయి అన్ని సమస్యలను తీర్చడం లేదు గదా!" అని అనిపించవచ్చు. నిజమే. ధర్మం కోసం నిలబడడంలో కొన్ని ఇబ్బందులు పడవలసిరావచ్చు. కానీ ధర్మంలో ధైర్యం వుంది. సంతృప్తి వుంది. ఆనందం వుంది. అందుకే ఆనాడు ధర్మవర్తనులైన పాండవులు అడవులపాలై కష్టాలు పడినా సంతృప్తిగా, ఆనందంగా వుండగలిగారు. అధర్మపరులైన దుర్యోధనాదులు రాజ్యభోగాలు అనుభవిస్తున్నప్పటికీ ఆశాంతితో కుతకుతలాడిపోయారు. ధర్మరాజాదులు అడవులలో ఆకులలములు తింటూ అలమటించిపోయారని మనమనుకుంటాము. కానీ ధర్మం ముందు తినేది ఆకులలములే అయినా సంతృప్తినిచ్చాయి. వారి

దురవస్థకు వారు కుమిలి పోలేదు. క్రోధంతో ఉడికి పోలేదు. కర్తవ్య నిర్వహణకు ఎప్పుడు సంసిద్ధులై వున్నారు. వారే గాదు, సంఘసంస్కర్తలందరూ సమాజంలో ప్రతిఘటనను ఎదుర్కొన్నారు. అలాగే నిజమైన భక్తులు గూడ అంతే. లక్ష్యం కోసం, ధర్మం కోసం ప్రాకులాడడంలో వారు ఏమి తిన్నామనిగాని, ఏమి కట్టుకున్నామనిగానీ, ఎక్కడ వున్నామని గానీ అనుకోరు. ఆహారం తీసుకున్నామని, వస్త్రాలు ధరించామని, ఆచ్ఛాదనక్రింద వున్నామనీ అనుకుంటారు. అందుకే సంతృప్తిగా వుంటారు.

అట్లా అని ఎవరితోనూ తగవుపెట్టుకోమని గాదు. మనకున్న పరిధిలో, మనకున్న శక్తితో, మనకున్న అవకాధాలలో ధర్మం కోసం పాటుపడాలి. అప్పుడు బాబా మనకు అండగా వుంటారు. 'నా భక్తుల సత్సంకల్పాలు నేను నెరవేరుస్తాను' అని బాబా అభయమిచ్చివున్నారు. ఇంతటి సత్సంకల్పం మనకు కలిగి ప్రయత్నిస్తున్నప్పుడు ఆయన ఎందుకు? రక్షించరు? ఆనాడు పాండవులకు శ్రీ కృష్ణుడు అండగా నిలవలేదా? వారు అత్యవసర పరిస్థితులలో, అవసరమైన విధంగా మన వెంట వుండి రక్షిస్తూ నడిపిస్తూవుంటారు. దీనిని గుర్తుపెట్టుకుని మనం ధర్మాచరణకు ప్రయత్నం చేయాలి.

దీనికి రెండవ పరిష్కార మార్గం. సమైక్యత. అధర్మాన్ని పోషించకుండా వుండాలంటే సమైక్యత కావాలి. అయితే ఎవరికి వారే అన్నట్లు వుండే ఈ రోజుల్లో సమైక్యత సాధించేదెలా? ఈ సృష్టిలో దేనికైనా పరిష్కారమార్గముంటుంది. మనసుంటే మార్గముంటుంది అన్నది సామెత. మనం హృదయపూర్వకంగా ధర్మబద్ధంగా జీవించాలని సంకల్పించి ఆచరణ ప్రారంభిస్తే మనలాంటి వాళ్ళు మనకు తోడుగా తప్పక నిలుస్తారు. సన్నని దారాలే పేనినప్పుడు పెద్ద త్రాడుగా అయినట్లు సమైక్యత వల్ల సాధించలేనిదేదీ వుండదు. ఆనాడు స్వతంత్రోద్యమంలో పోరాడినపుడు ఆ సమైక్యతే పనిచేసింది. ఆంగ్లేయులను వెళ్ళగొట్టింది. అదే సూత్రం ఇక్కడ మనం పాటించాలి.

ఉదాహరణకు పాలలో కల్తీ జరుగుతున్నది మనకు తెలుసు. కల్తీ చేయడం అధర్మమనీ తెలుసు. గేదెలకు హార్మోను ఇంజక్షన్లు యివ్వడం వల్ల ఆ పాలు త్రాగినందువలన హార్మోన్లలో సమతుల్యత లోపించి నేడు పసిపిల్లలకు సైతం ఎన్నోరకాల ఆరోగ్య సమస్యలు తలెత్తుతున్నాయని పరిశోధకులు చెబుతున్నారు. కనుక అధర్మాన్ని అధిగమించాలనుకున్న కొందరం కలిస్తే మనలో పాడి చేయడం తెలిసినవారి దగ్గరనుంచి, స్వచ్ఛమైన పాలను పొందవచ్చు. అలాగే కూరగాయలు మొదలైనవి. అనారోగ్యకరమైన సింథటిక్ దుస్తులకు బదులు చేనేత దుస్తులను ధరించవచ్చు. అందువలన చేనేత కార్మికులకు కొందరికైనా ఉపాధి కల్పించినవారముగూడ అవుతాము. కలుషితమైన, నిల్వవుండడానికి ఉపయోగించే రసాయన పదార్థాలు కలిసిన తినుబండారాలను కొనుక్కోకుండా ఇంట్లోనే మంచి తినుబండారాలని తయారుచేసుకోవచ్చు. లేక అట్లా తయారు చేసేవారి వద్ద కొనుక్కోవచ్చు. అలానే హోమియో వైద్యం నేర్చుకోవచ్చు.ఆయుర్వేదంలోని యెన్నో చిట్కాలతో చిన్నచిన్న వ్యాధులను నివారించుకోవచ్చు. దాని వలన ప్రతిచిన్నదానికీ ఆస్పత్రులకు పరుగెత్తవలసిన అవసరం వుండదు. అందువలన డబ్బు ఖర్చు గూడ తగ్గించుకోవచ్చు. మన పెరట్లోనే మనకు

*ముందుగా అధర్మప్రవర్తన ఎందుకు సరియైనది కాదో తెలుసుకోవాలి. అధర్మం పట్ల స్పష్టమైన అవగాహన కలిగివుండాలి. ఖచ్చితమైన వ్యతిరేకత ఏర్పరచుకోవాలి. ధర్మం కోసం నిలబడే మానసిక స్థైర్యాన్ని, ధైర్యాన్నీ అలవరచుకోవాలి. అధర్మప్రవర్తకులు తాము చేసేపని ఎంత నీచమైనదైనా, దాని పర్యవసానాలు ఎలా వుంటాయోనన్న భయము, లజ్జ లేకుండా చేయగలుగుతున్నప్పుడు ధర్మం కోసం మనమెందుకు భయపడుతున్నాము! ఇది ఆలోచించాలి.*

అవసరమైన చిన్న చిన్న మొక్కలను పెంచుకోవచ్చు.

మన పిల్లలకు మనమే పాఠాలను చెప్పుకుని సరైన విద్యను అందించవచ్చు. నేటి సమాజంలో పెచ్చు పెరుగుతున్న అశ్లీల సాహిత్యము, వెర్రితలలు వేస్తున్న ఫ్యాషన్లు, నైతికంగా ప్రక్కదారి పట్టిస్తున్న

సినిమాలు, నేడు సమాజంలో జరుగుతున్న అన్యాయలు - వీటి పర్యవసానాల గురించి వివరించి చెప్పి మన పిల్లలను ఉత్తమ వ్యక్తిత్వంగలవారిగా తీర్చిదిద్దుకోవచ్చు. మన పిల్లలకేగాక సాటి వారిని గూడ అధర్మం వలన వచ్చే పర్యవసానలేమిటో తెలియజెప్పి ధర్మప్రవర్తకులుగా మలచడానికి ప్రయత్నించవచ్చు. ఇలా చిన్నవాటితో ప్రారంభించి మనతో సహకరించేవారి సంఖ్య పెరిగిన కొద్దీ క్రమంగా బృహత్తర కార్యక్రమాలను గూడ చేపట్టి విజయం సాధించవచ్చు.

కనుక ముందుగా అధర్మప్రవర్తన ఎందుకు సరియైనది కాదో తెలుసుకోవాలి. అధర్మం పట్ల స్పష్టమైన అవగాహన కలిగివుండాలి. ఖచ్చితమైన వ్యతిరేకత ఏర్పరచుకోవాలి. ధర్మం కోసం నిలబడే మానసిక స్థైర్యాన్ని, ధైర్యాన్నీ అలవరచుకోవాలి. అధర్మప్రవర్తకులు తాము చేసేవని ఎంత నీచమైనదైనా, దాని పర్యవసానాలు ఎలా వుంటాయోనన్న భయము, లజ్జ లేకుండా చేయగలుగుతున్నప్పుడు ధర్మం కోసం మనమెందుకు భయపడుతున్నాము! ఇది ఆలోచించాలి.

అందుకు మనం చేయవలసినదల్లా పైన చెప్పుకున్న విధంగా సమైక్యత కలిగి వుండడము. ధర్మ రక్షకుడు అయిన సాయి మన వెంటవుండి నడిపిస్తాడన్న ధైర్యం కలిగి వుండడం, ధర్మం కోసం ప్రయత్నిస్తున్నప్పుడు సాయి అవసరమైన సమయంలో అవసరమైన విధంగా కాపాడుతాడు అన్న విశ్వాసం కలిగివుండడం వీటినన్నింటిని సాటి వారికి తెలియజెప్పి వారిని గూడ ధర్మ ప్రవర్తకులుగా చేయడానికి ప్రయత్నించడం.

అభయప్రధాత అయిన సాయి వుండగా మనకు భయమెందుకు!

ఈ కృతజ్ఞతా మహోత్సవ సందర్భంగా వీటిని మనం అలవరచుకుని ముందుకు సాగడమే దీక్షగా పెట్టుకుందాము. మనలను ఈ మార్గంలో చేయిపట్టి నడిపించమని శ్రీ సాయినాధుని, పూజ్యశ్రీ మాస్టరుగారినీ మనసారా ప్రార్థిద్దాము.

జై సాయి మాస్టర్!




*శ్రీ రామకృష్ణపరమహంస మహాత్ములలో ఎంతో విశిష్టమైన వారని పూజ్యశ్రీ మాస్టరుగారు తెలియజేసారు. ఆధ్యాత్మిక శ్రేయస్సును కలిగించే శ్రీ రామకృష్ణుల జీవిత చరిత్ర, సంబంధిత గ్రంధాలను పూజ్య బాబుగారు ఎందరి చేతనో పారాయణ చేయించారు. చదువరుల సౌలభ్యం కోసం Sri Manga BharadwajaTrust వారు ఈ పుస్తకాలనుకూడా విక్రయిస్తున్నారు. ఇతర గ్రంధాలలాగానే భక్తులు ఈ పుస్తకాలను ట్రస్టువారి నుండి కొనుక్కొని, ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు.*

# శ్రీ సాయిబాబా చిత్రపటం కాలకృత్యాలు - 2

శ్రీమతి వేదవతి

సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడు, సర్వసమర్ధుడు అయిన భగవంతుడు మనలను ఉద్ధరించడానికి మనమధ్య శ్రీ శిరిడీ సాయినాధుని రూపంలో అవతరించారు. ఆయన యొక్క వ్యక్తరూపమే ఆయన దేహము. ఆయన దేహం వదిలివేసిన తరువాత కూడా నిత్యసత్యులై నేటికీ మన ఇంట్లో ఆయన చిత్రపటం రూపంలో ఎల్లవేళలా మన మధ్యనే వుంటారు. అటువంటి సాక్షి స్వరూపమైన సాయినాధుని వ్యక్తరూపమే ఆయన చిత్రపటం.

జాగ్రత్తగా ఆలోచిస్తే ఆయన యొక్క వ్యక్తరూపమే ఈ సృష్టి అంతా 'నేననేకమగుదునుగాక!' అని సంకల్పించిన భగవంతుని సంకల్పం యొక్క వ్యక్త రూపమే ఈ సృష్టి-ఈ సకల చరాచర జగత్తు. సంకల్పం ఎప్పుడైతే పుట్టిందో అప్పుడే కాలము కూడా పుట్టింది. అంటే జగత్తు ఎప్పుడైతే వుద్భవించిందో దానిని అనుభవించే మనస్సు కూడా పుట్టింది. మనస్సు ఎప్పుడైతే పుట్టిందో కాలము అప్పుడే ఉద్భవించింది. ఇక సృష్టి అంతా కాలాధీనమైనది. కాలాతీతుడైన భగవంతుని నుంచి కాలాధీనమైన సృష్టి ఉద్భవించింది. అటువంటి కాలానికి నాధుడు భగవంతుడే. కనుక భగవంతుడిని కాలాతీతుడని మాత్రమే గాక కాలాధీశుడని కూడా అంటారు. కాలస్వరూపుడైన భగవంతుని అంశకు అనుగుణంగా ఉద్భవించినదే సృష్టి.

కాలం ఈ సృష్టిలోని ప్రతి అంశాన్నీ నిర్దేశిస్తూ వుంటుంది. కాలానుగుణంగా ఈ సకల చరాచర సృష్టిలోని ప్రతి అంశమూ జన్మిస్తూ, జీవిస్తూ, నశిస్తూ వుంటుంది. కాబట్టే 'కాలాతీతుడైన భగవంతుని క్రింద కాలాధీనులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఈ సృష్టికార్యాన్ని నెరవేరుస్తూవుంటారు' అని శాస్త్రాలు



చెబుతాయి. కాబట్టి ఈ సృష్టిలోని ప్రతి అంశమూ తన కాలపరిమితిని అనుసరించి ప్రవర్తిస్తూ వుండవలసినదే! నిజానికి సృష్టిలోని ఇతర అంశాలన్నీ (ఈ సకల చరాచర సృష్టి జాలమంతా) కాలధర్మాన్ననుసరించి కాలానుగుణంగా తమ క్రియలన్నీ నిర్వర్తించుకుంటూ వుంటాయి - ఒక్క మనిషి తప్ప. ఎందుకంటే అవి ప్రకృతిమాత అధీనంలో వుండి ప్రవర్తిస్తూ వుంటాయి. అంటే ప్రకృతితో సామరస్యంగా జీవిస్తూ వుంటాయన్నమాట. అంటే వాటి జీవితము, జీవనము ప్రకృతికి అధీనము. కాబట్టి అవి అధర్మంగా ప్రవర్తించలేవు.

మానవుడు కూడా ఈ సృష్టిలో భాగమే కనుక అతని ధర్మం కూడా ప్రకృతితో సామరస్యంగా

జీవించడమే. అతడి సహజమైన ఆరోగ్యకరమైన స్థితి అదే. అలా ప్రవర్తించునప్పుడు మాత్రమే అతడు నిత్యనూతనమైన మనస్సుతో ఆరోగ్యకరమైన శరీరంతో సుఖించగలడు.

కానీ మానవుని మనస్సు ప్రత్యేకమైనది. దానికి ఇతర జీవులకు భిన్నంగా భావస్వాతంత్ర్యం ఇవ్వబడినది. అంతేకాదు, వ్యక్తమైనా కాకపోయినా మోక్షేచ్ఛ మానవుని సహజ లక్షణం. అంటే తన నిజమైన స్థితిని తెలుసుకోవాలనే జిజ్ఞాస (భగవంతుని తనలో దర్శించాలనే జిజ్ఞాస) అతనికి సహజంగానే వుంటూ అతడిని నిలువనీయదు. అదే అంతులేని తృప్తి, శాంతులకోసం అన్వేషణగా వ్యక్తమౌతుంది. అందుకే అతడు ఆత్మజ్ఞానం పొందేవరకూ 'ఉన్నదానితో అసంతృప్తి, లేని దేనికోసమో తపన' అనే సమస్య అతని జీవితాన్ని వెన్నంటే వుంటుంది. ఈ తపన తగ్గనిదే మనిషి ఎన్ని ఇతర ప్రయత్నాలు చేసినా అతనికి తనకు కావలసిన తృప్తి, శాంతులు లభించవు. కాబట్టి వాటిని సాధించడమే మనిషి జీవితానికి లక్ష్యము, సార్థకత. అప్పుడే మానవజీవితము సంపూర్ణమవుతుంది. అది సాధించే మార్గమే ఆధ్యాత్మికత.

> *కాలం ఈ సృష్టిలోని ప్రతి అంశాన్నీ నిర్దేశిస్తూ వుంటుంది. కాలానుగుణంగా ఈ సకల చరాచర సృష్టిలోని ప్రతి అంశమూ జన్మిస్తూ, జీవిస్తూ, నశిస్తూ వుంటుంది. కాబట్టే 'కాలాతీతుడైన భగవంతుని క్రింద కాలాధీనులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఈ సృష్టికార్యాన్ని నెరవేరుస్తూవుంటారు' అని శాస్త్రాలు చెబుతాయి*

దీనిని సాధించేందుకు అవకాశమున్నది ఒక మానవజన్మలో మాత్రమే గనుక మానజన్మ లభించడం దుర్లభమనీ దానిని సద్వినియోగ పరచుకొని ఆత్మజ్ఞానం సాధించడానికి శాయశక్తులా కృషి చేయాలనీ పెద్దలు చెబుతారు. అందుకు ముఖ్యమైన సాధనము మన శరీరమే. అయితే ఈ శరీరము యొక్క పుట్టుక, దాని జీవితకాలము, మరణము కాలానుగుణంగా జరిగిపోయేవే. అంటే శరీరము కూడా కాలాధీనమైనది. దానిని ఆధ్యాత్మిక మార్గంలో సద్వినియోగపరచుకుంటామా, విషయసుఖాలలో పడి దుర్వినియోగపరచుకుంటామా అనే భావ స్వాతంత్ర్యం మనిషికి ప్రకృతి ప్రసాదించింది. అంటే మన చేతులలో వున్న కాలాన్ని (జీవిత కాలాన్ని) సద్వినియోగ పరచుకుంటామా లేదా అనేది మన చేతులలోనే వుంటుంది. దానికి ఆరోగ్యంగా జీవించగలము.

కాలానుగుణంగా చేయవలసిన పనులను కాలకృత్యాలు అంటారు. అంటే మనం ఏ ఏ సమయంలో ఏ ఏ పనులు చేయాలో పెద్దలు చెప్పారు. అవన్నీ కాలకృత్యాలే. కానీ వాడుకలో కాలకృత్యాలు అంటే మనం నిద్రలేచిన తరువాత తెల్లవారురఝామున మనలను మనం శుభ్రపరచుకునే పనులను 'కాలకృత్యాలు' అనడం పరిపాటి. కాలకృత్యాలను విసర్జన క్రియలతో పర్యాయపదంగా వాడడం పరిపాటి. అవి కాలానుగుణంగా జరిగినప్పుడు శరీరం ఆరోగ్యంగా వుంటుంది.

మనం సాయి చిత్రపటం ఇంట్లో వుంచుకొని సాయిసేవగా జీవితాన్ని మలచుకోవాలని నిర్ణయించుకున్నాం. అందుకు ముఖ్యమైన సాధనం మన శరీరం. మన శరీరాన్ని శుభ్రంగాను, ఆరోగ్యంగానూ వుంచుకోవడమంటే బాబా సేవకు ఉపయోగపడే ఒక పూజా వస్తువును శ్రద్ధతో శుభ్రంగానూ, భద్రంగానూ ఉంచుకోవడమన్నమాట. ఈ భావన చేయగానే మన శరీరం పట్ల మనకెంతో పూజ్య భావం కలుగుతుంది. దానిని ఆరోగ్యంగానూ, శుభ్రంగానూ వుంచుకోవడం బాబా సేవలో ఒక ముఖ్యమైన అంశం. నిజానికి ఈ జన్మకు ప్రసాదించినది, ఈ శరీరాన్ని నిలుపుతున్నదీ, దానితో తన సేవను చేసుకునే మహత్తరమైన అవకాశాన్ని మనకు కల్పించినదీ మన ఎదురుగా తన చిత్రపటంలోనుంచి మనలను, మనలోంచి మనలను చూస్తూ వున్న సాయియే. ఈ శరీరం

భగవమతుని ప్రసాదం. అటువంటి ప్రసాదాన్ని భక్తితోను, శ్రద్ధతోనూ కాపాడుకుంటూ దానిని మరలా భగవంతుని సేవకు వినియోగించడమే సార్థకత.

మన శరీరాన్ని ఆరోగ్యంగా వుంచుకోవాలంటే దాని ప్రకృతి ధర్మాలను మనం గౌరవించాలి. సరైన ఆహారపు అలవాట్లు, సరైన నిద్ర, సరైన శ్రమ, సమమైన విశ్రాంతి శరీరానికి అవసరం. కాబట్టి వీటన్నింటిలో ఒక క్రమశిక్షణ మనమందరమూ అలవరచుకోవాలి. మన శరీరాన్ని భగవంతుని సేవకు ఉపకరణముగా మనం భావించినప్పుడు దానిని జాగ్రత్తగా సంరక్షించుకునే శ్రద్ధ మనకు కలుగుతుంది. మనకెంతగా శ్రద్ధ పెరుగుతుందో అంతగా శరీరానుభవాల పట్ల చపలత్వం తగ్గి క్రమశిక్షణతో జీవించగలుగుతాము. పూజా సామగ్రిని మనము ఎంతో పవిత్రంగా పూజకోసం ప్రత్యేకంగా వుంటుకుంటాము. వేరే పనులకు వాటిని వాడము. అలాగే మన శరీరాన్ని కూడా భగవంతుని సేవకు తప్ప దేనికీ వాడకుండా వుండేటట్లు జాగ్రత్త పడుతూనే మన బాధ్యతలను భగవంతుని ప్రసాదంగా భావించి వాటిని శాయశక్తులా నిర్వర్తించాలి. మన బాధ్యతలను నిర్వర్తించేటప్పుడు ఎలా భావించుకోవాలో మాస్టరుగారు తన గ్రంధాలలో వివరంగా చెప్పారు.

విసర్జన శారీరకము, మానసికమూ కూడ. నిశ్వాస, చెమట, మలమూత్రాదులు మొ॥వి శారీరిక విసర్జన అయితే, మన ప్రవర్తన మానసికమైన విసర్జన. శరీర ఆరోగ్యం మన శారీరిక విసర్జనలలో ప్రతిబింబిస్తుంది. అలాగే మన మానసిక ఆరోగ్యం మన ప్రవర్తనలో ప్రతిబింబిస్తుంది. మనస్సుయొక్క ప్రభావం శరీరం మీద చాలా ఎక్కువగా వుంటుంది. అందుకే మానసికంగా కృంగినప్పుడు శరీర ఆరోగ్యం దెబ్బతింటుంది. అందుకని శారీరికంగా ఆరోగ్యంగా వుండడమే కాదు, మానసికమైన ఆరోగ్యాన్ని మనం కాపాడుకోవాలి. మనస్సుకు కూడా క్రమశిక్షణ అలవరచాలి. అంటే తనకు ఇతరులకు శ్రేయస్కరమైన విషయాలనే అది గ్రహించేటట్లు, ఆలోచించేటట్లు మనస్సుకు అలవాటు చేయాలి. మనస్సుకు ఎటువంటి ఆహారాన్ని (విషయాలను) అందిస్తామో దాని విసర్జన (ప్రవర్తన) అంత ఆరోగ్యంగా వుంటుంది. కాబట్టి మనస్సుకు సత్కాలక్షేపాన్ని ఆస్వాదించే అలవాటుని మనం ప్రయత్నంతో చేయాలి. సద్గ్రంథాలు చదవడం, సత్సంగం చేయడం, జపధ్యానాదులలో గడపడం,

*తనకు ఇతరులకు శ్రేయస్కరమైన విషయాలనే అది గ్రహించేటట్లు, ఆలోచించేటట్లు మనస్సుకు అలవాటు చేయాలి. మనస్సుకు ఎటువంటి ఆహారాన్ని (విషయాలను) అందిస్తామో దాని విసర్జన (ప్రవర్తన) అంత ఆరోగ్యంగా వుంటుంది. కాబట్టి మనస్సుకు సత్కాలక్షేపాన్ని ఆస్వాదించే అలవాటుని మనం ప్రయత్నంతో చేయాలి. సద్గ్రంథాలు చదవడం, సత్సంగం చేయడం, జపధ్యానాదులలో గడపడం, ప్రతిపనినీ సేవగా భావించగలగడమే గాక, తద్విరుద్ధమైన అంశాలు మనస్సుకు రుచించకుండా జాగ్రత్త పడాలి.*

ప్రతిపనినీ సేవగా భావించగలగడమే గాక, తద్విరుద్ధమైన అంశాలు మనస్సుకు రుచించకుండా జాగ్రత్త పడాలి. అందుకు కావలసిన శిక్షణ మనకు బాబా బోధలలోనూ, మాస్టరుగారి గ్రంధాలలోనూ వివరంగా లభిస్తుంది. అలా చేయగలిగితే జీవితం మొత్తం ఆరోగ్యవంతంగా తయారవుతుంది. మన జన్మ సార్థకమౌతుంది.

# బుద్ధ ధ్యాన హృదయము-1

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

బుద్ధుని ఉపదేశము సార్వజనికము, నిత్యనూతనము ప్రతి మానవునికీ అతిసమీపమైన మనస్సును లక్ష్యంగా తీసుకుంటుంది. పామర మనస్సుతో ఆరంభించి పరిపూర్ణమైన మనస్సుతో ముగుస్తుంది.

మనసు ద్వారానే మనకు బాహ్య జగత్తు, శరీరంకూడా అనుభవమౌతాయి. కనుక "మనస్సర్థమైతే అన్నీ అర్థమౌతాయి" అని బుద్ధుడు రత్నమేఘసూత్రంలో చెప్పారు. బాహ్యాభ్యంతరాలలోని మంచికీ చెడుకీ మనస్సే కారణం! అంటుంది అంగుత్తరని కాయసూత్రం కనుక ప్రపంచం చెడు గురించి వెనుతిరగడం అంటే మనసు పరివర్తన చెందడమే. దృఢమైన ఆంతరంగిక సంస్కారం వల్లనే లౌకిక వ్యవహారాలను నలిపే మనస్సు యొక్క పరిధిలోని క్రియలు సంస్కరింపబడగలవు. అయితే యిలా ప్రతి వ్యక్తిలోనూ పరివర్తన రావడం సాధ్యమా? అలా వచ్చేదాకా సమాజం అన్యాయాలతో మగ్గిపోవలసినదేనా? చరిత్రలో చూస్తే పట్టుదల, లోచూపుగల కొద్ది వ్యక్తులు యేర్పడినా చాలు; వారి అడుగుజాడలలో తక్కినవారు నడవడం జరుగుతుందని తెలుస్తుంది. మంచికైనా చెడుకైనా జరిగేది మాత్రం యిదే!

బుద్ధుడు మనస్సును సంస్కరించే విధానాన్ని కనిపెట్టాడు కనుకనే ఆధునిక శాస్త్రీయ ప్రగతివల్ల ఆయన సిద్ధాంతం పాతబడిపోలేదు. నేటికీ నిత్యసత్యంగా వుండిపోయింది. మనస్సు గురించి బుద్ధుడు మూడు ప్రధానసూత్రాలు చెప్పాడు.

1) మనకు అతిసమీపమైగూడ అతిదురవగాహమైన మనస్సుయొక్క అసలు తత్త్వాన్ని తెలుసుకోవడం.

2) ఏరీతినైనా చక్కగా సంస్కరించడానికి అనువుగా మెత్తగా అనిపిస్తూనే ఒక పట్టాన లొంగని మనస్సును సరియైన పద్ధతిలో రూపొందించడం

3) ఎన్నో బంధాలలో చిక్కుబడి వున్నప్పటికీ ఏ క్షణాన్నైనా విముక్తి చెందగల మనస్సును ముక్తి చెందించడం

ఇలా మనస్సును సంస్కరించడానికి బుద్ధుడు చెప్పిన ప్రధాన సూత్రాన్ని 'శ్రద్ధ కలిగివుండు' అనే ఒక్క వాక్యంలో పొందుపరచవచ్చు. దీనినే 'స్మృత్యుపస్థానము' అన్నారు (సతిపఠ్ఠాన). అయితే శ్రద్ధ దేనిపట్ల కలిగి వుండాలి? ఎలాగ? అనే ప్రశ్నలకు సమాధానమే ఆయన బోధంతా! సరియైన స్మృతిని కలిగి యుండడమే పై చెప్పిన మూడు లక్ష్యాలను సాధించడానికి ఏకైక మార్గమని బుద్ధుడు బోధించాడు.

## స్మృతి లేక శ్రద్ధ

స్మృతి సామాన్య మానవునకు యెంతో దూరంగా వున్న ఒకానొక ఆధ్యాత్మిక స్థితి అని తలచనక్కరలేదు. అది నిత్య జీవితంలో అందరికీ సుపరిచితమైనదే. అది లేకుంటే ఏ వస్తువులను గుర్తించడం సాధ్యంకాదు. ఏ వస్తువైన మనపై చాలినంత ప్రభావం కలిగి ఉంటే దానిపట్ల మన శ్రద్ధ మేల్కొని మన శ్రద్ధ దానివైపుకు మళ్ళి దాన్ని గుర్తించటం జరుగుతుంది. అది శ్రద్ధ యొక్క ప్రాథమికమైన రూపం, దీనివల్ల మన ఎరుక మేల్కొంటుంది. క్షణానికి లెక్క పెట్టలేనన్నిసార్లు యీ క్రియ మనలో జరుగుతూ వుంటుందని (ఆది) ధర్మసూత్రాలలో బుద్ధుడు చెప్పాడు. ఇటువంటి ప్రాథమికమైన స్మృతివల్ల ఆ వస్తువును చాలా స్థూలంగాను, అస్ఫుటంగాను మాత్రమే గుర్తించడం జరుగుతుంది. ఆ వస్తువు మనకా శక్తిని కలిగించినట్లైతే యీ ప్రాథమిక అనుభవం మరింతగా స్మృతిని మేల్కొల్పుతుంది. అప్పుడు ఆ వస్తువు యొక్క వివిధ లక్షణాలపైనేగాక దానికి మనతోగల సంబంధం గూర్చి మన స్మృతి పనిచేస్తుంది. అప్పుడు వర్తమానంలోని అనుభవం గతంలోని సజాతీయమైన గతానుభూతుల స్మృతులను మేలుకొల్పి వాటితో సమన్వయపరుస్తుంది. దీనినే సైకాలజీలో (Associated thinking) అంటారు. ఈ ప్రక్రియలో మన జ్ఞాపకశక్తి పాల్గొంటుంది. గుర్తింపు పాల్గొంటుంది. అందుకే యీ అనుభవాన్ని యీ రెండర్థాలుగల స్మృతి అనే పదంతో సూచించడం జరిగింది. ఇక గుర్తింపులో రెండవ దశలో

వస్తువుల సామాన్య ధర్మాన్ని గురించి యోచన కలుగుతుంది(Abstract Thinking). ఉదాహరణకు తెల్లటి వస్తువులను అన్నిటికీ సామాన్యమైన తెలుపు అనే ధర్మాన్ని గురించి యోచిస్తుంది. ఈ రెండవ దశలో నాలుగంశాలున్నాయి. వస్తువు గూర్చిన వివరాలు గుర్తించడం. దాని గూర్చిన తన భావం (ఇష్టాయిష్టాలు). అది మేల్కొల్పిన స్మృతి సంచయం. ఈ స్మృతులన్నింటిలోనూ గల సామాన్య ధర్మాలను గురించిన యోచన. సామాన్య మానవుల మానసిక జీవితమంతా యీ రెండవ దశకు చెందినదే. నిత్య జీవితంలోని వస్తువులను గుర్తించడం దగ్గరనుండే శ్రద్ధగా ఒక పనిలో నిమగ్నమవడం నుండే శాస్త్రజ్ఞుల పరిశోధనలు, తత్త్వశాస్త్రజ్ఞుడి సూక్ష్మ యోచనల వరకూ అన్ని యిందులో చేరినవే! అయినప్పటికీ యీ రకమైన విషయపరిజ్ఞానం నిర్దుష్టమైనదని చెప్పలేము. వాటి విషయమైన మన యిష్టాయిష్టాలు గుడ్డిగా యేర్పరచుకున్న అభిప్రాయాలతో మిళితమయ్యే వుంటుంది. వీటన్నింటిలో ప్రబలమైనదీ ప్రధానమైనదీ ఆ వస్తువులకాధారంగా ఒక శాశ్వతమైన పదార్థం వున్నదని, ప్రాణులలో వ్యక్తిత్వమున్నదని తలచటమే. బుద్ధ ధర్మాన్ననుసరించి మనస్సును మరింత పటిష్టం చేయని వారందరూ యీ స్థితిలో వుండిపోవలసినదే.

ఆ విధంగా సంస్కరించుకుంటే వచ్చే మూడవ స్థితే బుద్ధుడు చెప్పిన సమ్యక్ స్మృతి లేక సరియైన స్థితియని చెప్పడానికి కారణాలు – మన మనసులో దాగి వున్న యిష్టాయిష్టాలు గుడ్డి అభిప్రాయాల వలయాన్నుంచి మనస్సును విముక్తం చేస్తుంది; యిది సమ్యక్ దృష్టి (Right Understanding) కి ఆధారం; సరియైన పనిని సరియైన విధంగా చేయడం నేర్పుతుంది! బుద్ధుడు చెప్పిన దు:ఖనాశము అనే లక్ష్యసాధనకు ఉపకరిస్తుంది. సమ్యక్ స్మృతికి గురియైన యింద్రియ మనో విషయాలు సరియైన విశ్లేషణకు (Analysis) గురియై నందువలన వాటి గూర్చి సరియైన సిద్ధాంతాలను నేర్పరుచుకొని వాటితో సరిగా వ్యవహరించి వాటి గూర్చిన సరియైన నైతిక నిర్ణమాలను చేయడంలో సహకరిస్తుంది. ఇలా లభించిన సరియైన అవగాహన బుద్ధుడు చెప్పిన సరియైన అవగాహనకు – సర్వ–ప్రకృతి క్రియలు అశాశ్వతములు, దు:ఖమయములు, నిస్సారములు, వ్యక్తిత్వ రహితములు అన్నదానికి – ఆధారమౌతుంది. సమ్యక్ స్మృతిని అభ్యసిస్తూ వున్నప్పుడు సమ్యక్ దృష్టిని చవిచూస్తాడు సాధకుడు. సమ్యక్ దృష్టియను తర్వాత దశకు చేరడంలో స్మృతి లేక శ్రద్ధయొక్క తీవ్రత, నిర్దుష్టతలను పెంచడమే యిమిడియున్నది.

మానవ మేధస్సు రెండవ దశను యిదివరకే చేరుకుంది. వస్తువుల గూర్చిన విస్తారమైన అవగాహనను సాధించినప్పటికీ అదంతా భ్రాంతిపూరితమైనదే. బుద్ధుడు చెప్పిన సమ్యక్ స్మృతి సాధన లోపించినపుడు కొత్త వివరాలతో మనసును నింపుకుంటాము. వాటిని మానవ ప్రయోజనానికి ఉపయోగించుకుంటామేగాని మన వ్యక్తిత్వంలో పరివర్తన కలుగదు. అలా విజ్ఞానాన్ని అతిగా వాడుకోవడం వల్ల వచ్చే అనర్థాలను మన నాగరికత అప్పుడే చవిచూస్తున్నది. పాక్షికమైన అభివృద్ధి వల్ల జాతి క్షీణం, నాశనము కాలాంతరంలో తప్పవని జీవశాస్త్రం నిరూపిస్తుంది. భౌతికమైన ప్రయోజనాలకు సంబంధించిన మేధాశక్తిని మాత్రమే సుఖాలను, అధికారాన్నీ సాధించుకోవడం కోసం పాక్షికంగా అభివృద్ధి చేసుకోవడమే నేటి మానవుడు చేస్తున్న ప్రమాదకరమైన పొరపాటు. ఒక వంక శరీరాన్ని చంపే విధానాలు, మనస్సును చంపే వినోదాలు దీని పర్యవసానం. బుద్ధుడు చెప్పిన మధ్యేమార్గమే ఈ ప్రమాదాలనుండి మనలను రక్షించగలదు. క్లుప్తంగా చెప్పాలంటే మానవ మేధస్సు రెండవ స్థాయిలోనే చలిస్తూ వున్నట్లైతే మానవ జాతికా నష్టం తప్పదు. కేవలం సమ్యక్ స్మృతివల్ల మాత్రమే నూతనమైన ప్రగతిని మానవ చైతన్యం పొందగలదు.

"మహాపురుషుడంటే ఎవరు?" అని ప్రశ్నించిన శరిపుత్రునితో బుద్ధుడిలా అన్నారు, "విముక్తి చెందిన మనస్సు కలవాడే మహాపురుషుడు". అయితే మనస్సును ముక్తి చెందించడం ఎలాగ? సాధకుడు శరీరము, భావాలు, వ్యక్తిగత చైతన్యము, మనో విషయాలు గురించి నిర్దుష్టంగా తత్త్వవగాహన చేసుకుంటాడు. అలా జీవించేవాని మనస్సు నిర్మలమై విముక్తిని పొందుతుంది. అలాంటి మనస్సు కలవాడే మహాపురుషుడు. (సంయుక్తనికాయము) బుద్ధుడు దు:ఖ నివృత్తికై చెప్పిన అష్టాంగ విధానంలో 7వ అంశము స్మృత్యుపస్థానము లేక సమ్యక్ స్మృతి. ఈ సమ్యక్ స్మృతిని నాలుగు లక్ష్యాల వైపు పని చేయించాలి. 1) శరీరము. 2) అనుభవాలు feeelings 3) మానసిక స్థితి లేక చైతన్య స్థితి 4) నిర్దుష్టమైన మానసిక అంశాలు లేక చైతన్య అంశాలు. సమ్యక్ స్మృతి వల్ల కలిగే సరియైన అవగాహనను సంప్రజ్ఞ అంటారు. సమ్యక్ స్మృతి అనేది సాధనలోని మానసిక వైఖరిని సృష్టిస్తుంది. ఒక పనిచేయవలసి వచ్చినపుడు దానిపై మనకుండవలసిన సరియైన అవగాహనను సూచిస్తుంది 'సంప్రజ్ఞ' అనే పదము.

# గోరాకుంభారు చరిత్ర

**శ్రీమతి వేదవతి**

తేరడి అనే ఊరిలో గోరాకుంభార్ అనే పేరుగల ఒక కుమ్మరి తన భార్యతో కలసి నివసిస్తూ వుండేవాడు. అతడు గొప్ప భక్తుడు. ఇంద్రియాల సహాయంతో వస్తువులను చూస్తూ, శబ్దాలను వింటూ, శ్వాసనిశ్వాసాలు చేస్తూ, వాసనలను అనుభవిస్తూ, నడుస్తూ, నిద్రిస్తూ, మాట్లాడుతూ, మలమూత్ర విసర్జన చేస్తూ, విషయాలను గ్రహిస్తూ, కన్నులు మూస్తూ, తెరుస్తూ ఇంద్రియవిషయాలలో ప్రవర్తిస్తూగూడ దేనిపట్లా ఆసక్తి లేక ఎల్లప్పుడూ భగవంతుని చింతనలో కాలం గడుపుతూ అతడు ఆనందంగా జీవిస్తూ వున్నాడు.

ఒకరోజు అతని భార్య తన బిడ్డను ఇంట్లో వదిలిపెట్టి నీరు తెచ్చుకోవడానికి చెరువుకు వెళ్ళింది. అప్పుడు మట్టిని అడుగుకు తొక్కుతూ వున్న గోరాకుంభారు మనస్సంతా భగవంతుని భక్తితో పరవశించి మరేమీ పట్టని స్థితిలో వున్నది. ఆ పారవశ్యంలో అతడు తన దగ్గరకు పారాడుకుంటూ వస్తూవున్న పిల్లవానిని గమనించలేదు. ఆ పిల్లవాడు పారాడుకుంటూ మట్టిలోకి వచ్చాడు. అదేమీ పట్టని గోరాకుంభారు ఆ పిల్లవాడిని కూడా మట్టితో కలిపి తొక్కివేసి భగవన్నామ సంకీర్తనతో భగవంతుడిని ధ్యానిస్తూ ఆనందపారవశ్యంలో వుండిపోయాడు. నీళ్ళు తీసుకుని రావడానికి వెళ్ళిన గోరాకుంభారు భార్య వచ్చి పాలివ్వడానికి బిడ్డకోసం వెదకింది. కానీ బిడ్డ ఎక్కడా కనపడలేదు. ఆ బిడ్డకోసం అన్ని చోట్లా గాలించి తన భర్త దగ్గరకు వచ్చింది. అక్కడ గోరాకుంభారు బిడ్డను మట్టితో కలిపి తొక్కుతూ వున్నాడు. అ మట్టి అంతా బిడ్డ రక్తమాంసాలతో కలిసిపోయివుంది. అది చూసి ఆమె గర్భశోకంతో గుండెలు బాదుకుని ఏడుస్తూ భర్తతో, "మీరెంత ఘోరమైన పని చేశారు?! నేను కూడా వెంటనే చనిపోతాను" అని పెద్దగా ఏడవసాగింది. ఆ ఏడుపు విని గోరాకుంభారు తన పారవశ్యంనుంచి బాహ్య స్మృతిలోకి వచ్చి, "కొంచెమైనా ఆలోచించకుండా నా ధ్యానాన్ని భంగపరచావు. నా మనస్సులో నివసిస్తూ వున్న శ్రీ పాండురంగడిని వెళ్ళగొట్టావు!!" అని కోపంతో ఆమెను దూషించాడు. ఎంతో సాధుమూర్తి అయిన గోరాకుంభారు కోపంతో వశంతప్పి కుమ్మరి చక్రాన్ని తిప్పే కర్రతో ఆమెను కొట్టబోయాడు. అప్పుడామె భయపడి "నన్ను మీరు ముట్టుకుంటే శ్రీ పాండురంగడి మీద ఆన" అని అరిచింది. ఆ మాట వినగానే ఆ కర్రను అవతలపారవేసి ఒక మూల కూర్చుని భగవంతుడిని ధ్యానించసాగాడు.

అప్పుడా ఊరివారందరూ అతని దగ్గరకు వచ్చారు. కొంతమంది అతడిని పిచ్చివాడని భావించారు. మరికొంతమంది సత్పురుషులు, "ఈ మహానుభావుడికి ప్రాపంచిక వ్యవహారాలు పట్టని ఆధ్యాత్మిక స్థితిలో వున్నాడు. భరతుడు మొ॥న యోగులు ఈ స్థితిలో వుండేవారు కదా! ఇంతటి భక్తులను భగవంతుడు తప్పక అనుగ్రహిస్తాడు. భక్త వత్సలుడు, సర్వశక్తి సంపన్నుడైన శ్రీ పాండురంగడు ఈ బిడ్డను తప్పక బ్రతికించి గోరాకుంభారు మీద వచ్చిన అపనిందను తొలగించి అతని భక్తిని తప్పకుండా ప్రజలకు నిరూపిస్తాడు" అని భావించారు. గోరాకుంభారు, అతని భార్య ఇరవై నాలుగు రోజులుపాటు ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. తరువాత గోరాకుంభారు భార్య "నేనిలావుంటే ఈ సంసార బాధ్యత నిర్వహించడం చాలా కష్టము" అని భావించి చెంబుతో నీళ్ళు తెచ్చి భర్త కాళ్ళు కడగడానికి వచ్చింది. గోరాకుంభారు తన భార్యను చూసి, "నిన్ను ముట్టుకోకూడదని శ్రీ పండరీనాధుడి మీద ఒట్టు పెట్టావు. కాబట్టి నన్ను తాకవద్దు!" అన్నాడు.

ఆమె ఎంతో బాధపడి తన పుట్టింటికి వెళ్ళింది. తన తల్లిదండ్రులకు జరిగిన విషయమంతా వివరించింది. ఆ తరువాత తన తల్లిదండ్రులతో, "ఇప్పుడు మాకు సంతానము లేదు కదా! గోరాకుంభారు యికపై నన్ను

త్రాకరు! కాని మా వంశం నిలబడేటట్లు ప్రవర్తించడం నా బాధ్యత. కాబట్టి నా ప్రార్థనను మన్నించి నా చెల్లెలిని నా భర్తకు యిచ్చి వివాహము చేయవలసినది!'' అని ప్రార్థించింది. ఆమె ప్రార్థనను వారు అంగీకరించి తన చిన్న కుమార్తెను గోరాకుంభారుకిచ్చి వివాహం చేశారు. వివాహం జరిగిన తరువాత తమ కుమార్తెను అప్పగిస్తూ వారు గోరాకుంభారుతో అందరి సమక్షంలో, "మా కూతురులిద్దరినీ నీవు సమానంగా చూసుకోవాలి. అలా చేయకపోతే శ్రీ పాండురంగడి మీద ఒట్టు!" అన్నారు. అది విని గోరాకుంభారు ఎంతో సంతోషించి, "భగవంతుడి కరుణవుంటే బంధాలన్నీ తమంతట తామే తొలగిపోతాయి. అందుకు సందేహమే లేదు!" అనుకున్నాడు. వెంటనే అతడు తన అత్తమామలతో, "మీ ఆజ్ఞ!" అన్నాడు. ఆ తరువాత అతడు తన భార్యలిద్దరికీ అన్నవస్త్రాలు సమానంగా సమకూర్చాడు. వారిని సమానమైన ప్రేమతో ఆదరించేవాడు, కానీ వారిని ముట్టుకునేవాడు కాదు.

ఇలా వుండగా పెద్దభార్య భర్తను చూసి, "నేను మీకు నచ్చినట్లు ప్రవర్తించలేదు. కాబట్టి పాపం చేశాను. కానీ నా చెల్లెలు ఏ తప్పు చేయలేదు కదా! మరి ఆమెనెందుకు తాకడం లేదు?" అని అడిగింది. అప్పుడు గోరాకుంభారు, "వివాహ సమయంలో మీ తల్లిదండ్రులు మిమ్మల్నిద్దరితోనూ ఒకే విధంగా ప్రవర్తించాలని పాండురంగడి మీద ఒట్టు పెట్టారు. కాబట్టే మిమల్నిద్దరినీ నేను ముట్టుకో కూడదు!" అని చెప్పాడు.

అది విని గోరాకుంభారు భార్యలిద్దరూ ఎంతో బాధ పడ్డారు. ఒకరోజు అతడు గాఢ నిద్రలో వున్నప్పుడు వారిద్దరూ అతనికి రెండువైపులా పడుకొని అతని చేతులను తమమీద వేసుకున్నారు. అతడికి వెంటనే మెలకువ వచ్చింది. అతడు "నా వ్రతం భంగమైంది. కాబట్టి నేను వెంటనే నా చేతులను ఖండించుకుంటాను" అని చెప్పి తన రెండు చేతులను నరుకుకున్నాడు.

అప్పుడు అతని భార్యలిద్దరూ పెద్దగా ఏడుస్తూ, భగవంతుడిని నిందిస్తూ తమ దురదృష్టానికి బాధపడ్డారు. అది విని గోరాకుంభారు, "మీరిలా దు:ఖించకూడదు. సాక్షాత్తూ శ్రీ పాండురంగడే మన అండనుండగా మనకేమీ కొరతలేదు. మీరు మీ సర్వస్వాన్ని ఆయనకే అర్పించండి!" అని చెప్పి తాను కూడా భగవంతుని స్మరణలో కాలం గడుపుతూ వున్నాడు.

కొంతకాలానికి ఆషాఢ శుద్ధ ఏకాదశి వచ్చింది. అప్పుడు గోరాకుంభారు తన భార్యలిద్దరినీ తీసుకుని పండరీపురానికి వెళ్ళి చంద్రభాగానదిలో స్నానం చేసి ఆలయానికి దర్శనానికి వెళ్ళాడు. ఆ తరువాత స్వామిని దర్శించుకుని ధ్వజస్తంభము దగ్గరకు వచ్చాడు. అక్కడ నామదేవుడు ఆనందంతో నృత్యం చేస్తూ వున్నాడు. శ్రీ పాండురంగడు నామదేవునికి మాత్రమే దర్శనమిస్తూ తాను కూడా నృత్యము చేస్తూ వున్నాడు. నివర్తి దేవుడు, జ్ఞానదేవుడు, సోపానదేవుడు మిగిలిన భక్తులూ అక్కడ కూర్చుని ఆ భగవంతుని కీర్తనను వింటూ వున్నారు. ఇంతలో నామదేవులు తన చేయి పైకెత్తి, "అందరూ లేచి నిలబడండి!" అని చెప్పాడు. అందరూ లేచి నిలబడ్డారు. అప్పుడు నామదేవుడు అందరికీ ఒక్కొక్క తాళాన్ని యిచ్చాడు. వారందరూ తాళాన్ని తడుతూ నామస్మరణ చేస్తూ ఆనందపారవశ్యంలో వున్నారు. గోరాకుంభారు "అందరిలాగే తాళము తడుతూ హరికీర్తన చేయడానికి నాకు చేతులు లేవు కదా!" అని బాధ పడ్డాడు. శ్రీ పాండురంగడి కటాక్షం వల్ల అతడికి వెంటనే యింతకుముందులాగే చేతులు వచ్చాయి. గోరాకుంభారు దీన దయాళువైన శ్రీ పాండురంగడి లీలకు సంతోషించి తానూ తాళము తడుతూ కీర్తించసాగాడు. అది చూసి అక్కడ వున్న భక్తులందరూ ఎంతో ఆశ్చర్యపోయారు. గోరాకుంభారు భార్యలు భక్తితో, ''స్వామీ! భక్తవత్సలా! మమ్ము కరుణించు!'' అని ప్రార్థించసాగారు. భగవంతుడు వారి ప్రార్థననంగీకరించి చనిపోయిన బిడ్డను ఎత్తుకుని రుక్మిణిదేవితో కలిసి వారికి ప్రత్యక్షమై ఆ బిడ్డను తల్లి చేతిలో వుంచాడు. రుక్మిణిదేవి పరమ విరాగి అయిన గోరాకుంభారును చూసి, "నీ భార్య, నీ అత్తమామలు భగవంతుని మీద పెట్టిన ఒట్టు ఈ క్షణంనుంచీ నీకు వుండదు. ఇక మీద నీవు సుఖంగా నీ భార్యలిద్దరితో కలిసి గృహస్థధర్మాన్ని పాటిస్తూ మమ్ము సేవించు!" అని అనుగ్రహించింది. అది విని అందరూ ఎంతో సంతోషించారు. గోరాకుంభారు, అతని భార్యలు శ్రీ పాండురంగడిని రుక్మిణీదేవిని కీర్తించారు. ఉత్సవం పూర్తయిన తరువాత స్వగ్రామానికి వెళ్ళి భక్తితో జీవితమంతా గడిపి ముక్తి పొందారు.

శ్రీ పాండురంగ విఠలాయ నమ: !

జై సాయి మాస్టర్!!

# సత్సంగము

## ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

మన జీవితానికి బాబా చెప్పిన సూక్తులను అర్థం చేసుకోవడానికి, అవగాహన పెంచుకోవడానికి, అమలులో పెట్టుకోవడానికి సత్సంగం మనకు దోహదం చేస్తుంది. తరచుగా సత్సంగాలు చేస్తూవుంటే నలుగురితో బాబా విషయాలు పంచుకోవడం వల్ల ఎవరిదగ్గరైనా సంకోచం లేకుండా మాట్లాడడం అలవాటవుతుంది. అందుకని సత్సంగంలోని అందరూ సత్సంగంలో పాల్గొనడమే గాకుండా సత్సంగం చేయడం కూడా నేర్చుకోవాలి. ఎందుకంటే బాబా గురించి ఏమీ తెలియని వాళ్ళు వచ్చి, "మాయింట్లో సత్సంగం పెట్టుకోవాలని వుందండి, ఎలా చేసుకోవాలో తెలియదు. మీరు వచ్చి సత్సంగం చేస్తారా?" అని అడిగినపుడు వెళ్ళి సత్సంగం చేసిరావడానికి అవకాశముంటుంది. అలాగాక ఎప్పుడూ ఒకడే సత్సంగం నిర్వహిస్తుంటే వాడొక్కడే ఎన్నిచోట్లకని వెళ్ళిచెప్పగలడు? వాడు లేకపోతే సత్సంగమే ఆగిపోయే పరిస్థితి రాకూడదు. మనింట్లో వున్న నలుగురూ అన్ని పనులూ చేయడం నేర్చుకుంటే ఎవరు వూరి కెళ్ళినా యింట్లో పనులు జరిగిపోతాయి. ఒకవేళ యిరుగుపొరుగు వాళ్ళకు యిబ్బంది వచ్చినా సహాయం చేయడానికిగూడా అవకాశముంటుంది. అందుకని సత్సంగంలోని ప్రతివాళ్ళూ చరిత్ర పఠనము చేయడము, భజన చెప్పడమూ, బాబా గురించి మాట్లాడడమూ చేస్తూ వుండాలి. అంటే ఒక్కొక్కసారి ఒక్కొక్కళ్ళు చొప్పున సత్సంగం చేయాలన్నమాట. అలా చేస్తే బాబా గురించి నలుగురితో మాట్లాడాలంటే సంకోచము, బిడియమూ లేకుండాపోతాయి. ఇవన్నీ ఎందుకంటే ఆత్మీయతను, బాబాపట్ల ప్రీతిని మనలో పెంచుకునే మార్గాలే. అలా చేస్తూవుంటే ఆ విధంగా చేయడంలో మనకు ప్రీతి యింకా పెరుగుతూ వుంటుంది.

మన ప్రాణమిత్రుడు వచ్చినప్పుడు వాడితో ఎంతసేపు కాలక్షేపంచేసినా యింకా చేయాలనే అనిపిస్తుంది. వాడిగురించి యితరులకు పరిచయం చేస్తాము, వాడి గురించి వాళ్ళకు చెప్తాము. విసుగనే అనిపించదు. మరెవరైనా వస్తే "వీడి దుంపతెగ, వీడు వచ్చాడే, మన టైమంతా తినేయడానికి" అనిపిస్తుంది. అందుకని మన గురువు గురించి – బాబా గురించి – యింకా యింకా తెలుసుకోవడం, నలుగురితో పంచుకోవడం మనలో ఆయనపట్ల ప్రీతిని పెంచుకోవాలి. అలా చేస్తుంటే మనలో ప్రీతి పెరిగి ఆయన గురించి యింకా యింకా తెలుసుకోవాలనే తపన పెరుగుతుంది. రాత్రింబవళ్ళూ ఆయన గురించి మాట్లాడినా విసుగనిపించదు. ఎట్లాగంటే ఇంట్లో అతి గారాబంగా పెరిగిన పిల్ల వున్నది. ఆ పిల్లకు ఎప్పుడూ ఏ కష్టమూ తెలియకుండా, ఏ పనీ చెప్పకుండా పెంచారు. ఎప్పుడూ నిద్రలేకుండా వుండి వుండదు. ఆ అమ్మాయికి వివాహమైతే భర్త ఎవరినైనా స్నేహితులను తెచ్చి వండిపెట్టమంటే విసుగనిపించవచ్చు, యిష్టంలేకపోవచ్చు. కాని ఆ అమ్మాయికే ఒక బిడ్డ పుడితే, ఆ బిడ్డ రాత్రిపూట నాలుగైదు సార్లు ఏడ్చినా ఏమీ విసుగనిపించదు. నిద్రా భంగం కలుగుతున్నట్లు అనిపించదు. పైగా ఆ బిడ్డలేచి ఏడుస్తుందేమోనని ఒక కంట కనిపెడుతూనే వుంటుంది. అట్లా ఎందుకనిపిస్తుందంటే ఆ బిడ్డ పట్ల అపారమైన ప్రీతివల్లనే.

అలాగే మనింటికి ఒక పెద్దమనిషి వచ్చారు. ఆయనంటే మనకెంతో గౌరవం. కాని గౌరవం దూరానికి సంకేతం. "వారు పెద్దవారు, కాసేపు మాట్లాడి పంపించకపోతే ఎట్లా? బాగుండదు" అనుకుంటాము. అదే ఆత్మీయుడైన స్నేహితుడొస్తే వాడితో ఎక్కువసేపు మాట్లాడకపోతే మనకు బాగుండదు. అలాగాక మనకు పెద్దగా పరిచయం లేకుండా, గౌరవనీయులైన పెద్దమనిషితో మనకు సాన్నిహిత్యము, చనువు ఏర్పడినకొద్దీ అది ప్రీతిక్రింద, ఆత్మీయత క్రింద మారుతుంది. అదే రీతిన ప్రతిరోజూ పూజ చేసేటప్పుడు ఆ సద్గురువు యొక్క గుణగణాలను స్మరిస్తాము గనుక అప్పుడు

మనకు వారి దయాదాక్షిణ్యాలవల్లనే యీ జగత్తు, మన జీవితమూ ఆధారపడివున్నాయని గుర్తింపు వచ్చి, "వారినిగాక యింకెవరిని గురించి ఆలోచిస్తాము?" అనిపిస్తుంది. ఈ గుర్తింపువల్ల రోజు రోజుకీ ఆయనపట్ల ఆత్మీయత పెరుగుతుంది. ఆయనకు, మనకు, ఈ సృష్టికీ వుండే సంబంధాన్ని గూర్చి ఆలోచించిన కొద్దీ అవగాహన పెరిగి ఆయనయే నిజమైన స్నేహితుడు, నిజమైన తండ్రి అనిపిస్తుంది. ఎందుకని? సృష్టి జరుగకముందు కేవలం పరబ్రహ్మమే వున్నదని, అప్పుడు దానికి 'నేననేక మగుదునుగాక' అని సంకల్పం కలిగిందని, అది సర్వశక్తివంతమైన ఆ పరబ్రహ్మ సంకల్పంగనుక అనేక రూపాలు ధరించిందనీ శాస్త్రం చెబుతుంది. ఇవన్నీ ఏర్పడకముందు – ఆ మొట్టమొదట వున్న దానిని పురుషుడు లేక చైతన్యము అంటున్నారు. అది మనలోనూ వుంది. ఎందుకని? ఆయనలో వుంది గనుక. అందుకని సర్వానికీ తండ్రి ఆయన, ఆయన సంకల్పంచేత ఏర్పడినటువంటి దేహమే మళ్ళీ మనకు ఆ రూపంలో గోచరిస్తుంది. అంతటా నిండివున్న ఆయనే మన శరీరంలో గూడా వున్నాడు. ఆ సంగతి గుర్తుండడం కోసం అంగన్యాస కరన్యాసములు చేయమని మన పెద్దలు చెప్పారు. "ఇది నా ఆహారము, నా పొట్ట కోసం నేను తింటున్నాను" అనే దౌర్భాగ్యపు భావంతోగాక, భగవంతుడు ఏర్పరచినటువంటి సృష్టిక్రమంలో ఆయన సంకల్పం నెరవేరడానికి ప్రకృతి శక్తులు కలిసి ఎలా పనిచేస్తున్నాయో గుర్తుపట్టి తినమని చెప్పడంకోసమే ప్రాణాహుతులు చేయమని చెప్పారు.

ఆ రీతిన వీటన్నింటినీ గుర్తుపెట్టుకుంటూ అన్నింటిమీద మనకున్న అవగాహనను, భావనను విస్తరింపజేసుకుంటూ వుండమని చెప్పారు. అట్లా విస్తరింపజేసుకోవాలంటే ఆయనతో సాన్నిహిత్యం ఏర్పడాలి. ఏ రీతిన? మన మిత్రుల పట్ల ఆత్మీయత ఏ రీతిన ఏర్పడింది? రోజూ కొంతసేపు వాళ్ళతో కాలక్షేపము చేసాము గనుక, ప్రీతి పెరిగిన కొద్దీ ఎక్కువ సమయం వాళ్ళతో గడుపుతాము. అలా ఎక్కువ సమయం వాళ్ళతో గడుపుతాము కనుక, వాళ్ళ పట్ల యింకా ప్రీతి కలుగుతుంది. ఇది కూడ అంతే. పూజ చేస్తున్నప్పుడు ఆ ప్రభావం వల్ల ఎక్కువసేపు పూజ చేసుకుంటే బాగుండుననే భావం కలుగుతుంది. అందుకని ఎక్కువసేపు చేస్తాము. అలా చేస్తాము గనుక ఆయన పట్ల భావం లోతుగా, గాఢంగా కలుగుతుంది. అప్పుడాయనపట్ల ప్రీతి పెరుగుతూపోతుంది. అప్పుడు 'త్వమేవ మాతాచ పితా త్వమేవ' అన్న శ్లోకం వాస్తవంగా అర్థమై, ఆయనే సర్వమూ అన్న భావం దృఢపడుతుంది. అలా ఏర్పడడం కోసమే మూడు పూటలా చేయమన్నారు. అటువంటి ఆత్మీయతా భావం హృదయంలో పెరుగుతుంటే, ఆత్మీయులైన స్నేహితులు వచ్చినపుడు వాళ్ళను సంతోషపెట్టడం కోసం ఏయే ఏర్పాట్లయితే చేస్తున్నామో, అవే భావాలతో యిక్కడా చేస్తున్నాము. అంతేకాక యిక్కడ బాబా నిజమైన ప్రాణస్నేహితుడు, నిజమైన తల్లి, నిజమైన తండ్రి, నిజమైన ఆత్మీయుడు అని తెలియడంచేత అట్టి గుర్తింపుతో చేస్తున్నాము. అప్పుడు అందరిపట్లా వుండే భావం ఒకేచోట కూడివుండడంచేత యిది సాటి లేనిదవుతుంది. అక్కడ మిత్రుడి మీద వుండే భావం మిత్రుడి మీద వుంటుంది. తండ్రి మీద వుండే భావం తండ్రి మీద వుంటుంది – అలాగే అందరిమీద వుంటుంది. కాని యిక్కడ అలాగాదు. ఇంతమందిమీద కలసివుండే భావం ఒక్కరిమీదే వుంటుంది గనుక సాటి లేనిదవుతుంది. సాటిలేకుండా ఎప్పుడైతే అయిందో అది అనన్య భక్తి అయింది. దానికి సాటి మరొకటి లేదు – హృదయంలో అప్పుడు మనం సమర్పించిన –

> *ఆయనతో సాన్నిహిత్యం ఏర్పడాలి. ఏ రీతిన? మన మిత్రుల పట్ల ఆత్మీయత ఏ రీతిన ఏర్పడింది? రోజూ కొంతసేపు వాళ్ళతో కాలక్షేపము చేసాము గనుక, ప్రీతి పెరిగిన కొద్దీ ఎక్కువ సమయం వాళ్ళతో గడుపుతాము. అలా ఎక్కువ సమయం వాళ్ళతో గడుపుతాము కనుక, వాళ్ళ పట్ల యింకా ప్రీతి కలుగుతుంది. ఇది కూడ అంతే.*

నిష్ఠ, సబూరీలనే మూడడుగుల నేలను ఆయన ఆక్రమించాడని అర్థం. అందుకని పూజా కార్యక్రమం యిందుకోసం పెట్టారు. సత్సంగ కార్యక్రమం మనం యింతకు ముందు చెప్పుకున్న విధంగా మనస్సు మలచుకునేందుకు పెట్టారు. ఈ విధంగా సాధ్యమైనంతమేరకు మన జీవితమంతా గూడ ఆయన గురించి ఆలోచించడము, ఆయన గురించి వినడము, ఆయన గురించి మాట్లాడడము, ఆయనను పూజించడము చేయడం

వల్ల, మొత్తం ఆయన సంకల్పానుసారం ఆయన రూపమే లీలగా ఈ జగత్తుగా ఆడుతున్నది అనే అవగాహనే మనకు కలగడం వల్ల, నిష్ఠ, సబూరిలనే మనము సమర్పించిన దక్షిణ ఆత్మ సమర్పణగా మారి, ఆ స్థితిలో మనము నిలబడగలుగుతాము. ఈ విషయాన్నే సాయి తన సూక్తులలో చెప్పారు. 'నా లీలలే గానం చేయి' అని. అలా చేస్తే పర్యవసానం ఏమిటి? అంటే 'వారే నేనుగా మారిపోతారు' అని చెప్పారు. దానికి ఋజువు ఏమిటి? అంటే తాము తమ గురువును ఆరాధించిన సంగతి చెప్పారు. "నా ప్రాణాలన్నీ కళ్ళల్లో కేంద్రీకరించుకుని, నా కళ్ళను గురువుమీద కేంద్రీకరించుకుని ఆయననే చూస్తూ వుండిపోయాను. నాకు యింక వేరే ఆలోచనే తట్టేది కాదు. క్షణకాలంగూడా ఎడబాటు లేకుండా ఆయన గురించే నా మనస్సు ఆలోచించేది. వేరే ఆలోచించడానికి తగిన విషయమే నాకు దొరకలేదు" అన్నారు. అట్లా అయినప్పుడు ఆయన గురువు ఏం చేసారు? ఏమన్నా యిచ్చారా? ఈయన ఏమన్నా చేయమని ఆయనను అడిగాడా? చేయడమూ లేదు, యిచ్చేందుకూ ఏమీ లేదు. ఆశీర్వదించారు అంతే! ఆయన అలా ఎలా అయ్యారో, ఈయనా అలాగే అయ్యారు.

శ్రీ సాయి యిలా అన్నారు : "నేను నా గురుకృప వల్ల యీ విధంగా అయ్యాను. నన్ను గూడా అలాగే పెట్టుకుని మీరుగూడా ఆ విధంగానే అవండి" అని. అవును, ఆయన సాంప్రదాయం వేరు. ఆయన చెవిలో ఉపదేశించరు. కానీ చెవులు హోరెత్తిపోయేటట్లు అన్ని వైపులనుంచి అరుస్తారు. అన్ని దిక్కులనుంచి, అనేక రూపాలలో నుంచి నిరంతరం బోధిస్తూనే వుంటారు. నీవు ఒకే ఉపదేశం, ఒకే దిక్కునుంచి, ఒకే సమయంలో కాసేపు కావాలన్నావు. కాని నేను 365 రోజులు, 24 గంటల చొప్పున, అన్ని రూపాలతోను ఉపదేశం యిస్తుంటాను, చేతనైతే తీసుకో'" అంటున్నారు. 'బోధలేదు బోధలేదు' అని ఎందుకు బాధ పడతావు? అని ఆయన బోధను అన్ని వైపులనుంచీ హర్షిస్తున్నారు. కనుక అటువంటి అవకాశాన్ని మనం పొందగలందులకు ఈ సత్సంగ కార్యక్రమం దోహదం చేస్తుంది. మనం నిత్యం స్మరించుకోవడానికి అది పనికి వస్తుంది. మనకు ఆత్మీయులైన వాళ్ళకు ఉత్తమమైన సంకల్పం ద్వారా మన చిత్తం శుద్ధమయ్యేందుకు, సాత్వికం కావడానికీ అది దోహదం చేస్తుంది. అప్పుడు వారు చెప్పిన సూక్తిలో వారిచ్చిన అభయాన్ని మనం పొందుతున్న వాళ్ళమవుతున్నాము. ఆయన తమ గురువు వద్దనుంచి పొందినటువంటి దానిని మనం గూడా పొందడానికి మన జీవితాన్ని ఆ విధంగా రూపకల్పన చేసుకుంటున్నాము.

ఇందాక మనం చెప్పుకున్నట్లు దాసగణు మహరాజ్‌గారికి కీర్తన చేయమని ఎందుకు చెప్పారంటే మనం యిప్పుడు సత్సంగం ఎందుకు పెట్టుకున్నామో అందుకు. ఎవరిమీద ఆయనకు అనుగ్రహం కలిగిందో వాళ్ళకంతా అట్టి కాలక్షేపమే. మహల్సాపతికి ఏముంది? అతనిది నిరుపేద కుటుంబం, ఖండోబా ఆలయంలో అర్చకత్వము చేసేవాడు. బంగారుపని చేసుకునే వాడు. శిరిడీ అతి చిన్న గ్రామమేమో ఎవరికీ పెద్దగా అవసరంగూడా వచ్చేది గాదు. ఆ వున్నంతలో ఆ బంగారు పనే చేసుకుని బ్రతికేవాడు. అలాంటివాణ్ణి బాబా ఆ పని మానేయమన్నారు. మరేమి చేయమంటారు? అంటే "భిక్ష చేసి జీవించు" అని అన్నారు. అతడు అందరికంటే ఆత్మీయుడు, అతనిని అలా బ్రతకమన్నారు. అలాగే దాసగణును కీర్తన చేసుకుని బ్రతకమన్నారు. ఈ విషయం భాగవతంలోగూడా వున్నది. "ఎవరిమీద అనుగ్రహం సంపూర్ణంగా వుంటుందో, భగవంతుడు వాడినుంచి ముందుగా సర్వం అపహరిస్తాడు" అని. సర్వం అపహరించడమంటే ఏమిటి?

ఉదాహరణకు : చిన్న పిల్లవాడు బయట ఆడుకుంటున్నాడు. చెత్తాచెదారమంతా రెండు చేతులతోనూ ప్రోగుచేసుకున్నాడు. రాళ్ళు, రప్పలు, రంగు కాగితాలు మొదలైనవన్నీ రెండు చేతులనిండా వున్నాయి. తల్లి వాడి చేతుల్లో ఎద్దైనా తినుబండారం పెట్టాలనుకున్నదానుకోండి. అప్పుడు ఆమే అవన్నీ వాడి చేతులలోంచి తీసి అవతల పారేసి శుభ్రంగా చేతులు కడిగి ఆ చేతుల నిండా తినుబండారాలు పెడుతుంది. అలాగే మనం గూడా సాయి అనుగ్రహాన్ని పొందగలందులకు సత్సంగం ఒక సాధనగా ఉపకరిస్తుంది. మనకు అనన్య చింతన కలగడానికోసం దాసగణును ఉదాహరణగా చూపించారు. మనము గూడా ఆయన సూచిస్తున్న దానిని ఆచరణలో పెట్టుకోవడానికి మనం చదివినవి, విన్నవీ కాస్త ఎక్కువ స్థాయిలో గుర్తుపెట్టుకోవడానికి మనం ప్రయత్నం చేస్తే చాలు. సత్సంగం గూడా దక్షిణలో భాగమే.

*'శ్రీ సాయి మాస్టర్ ప్రవచనాలు' సౌజన్యంతో*

# శ్రీ దత్తలీలామృతము

**శ్రీమతి శ్రీదేవి**

*మే సంచిక తరువాయి*

ఏకాదశీ ఉపవాసం చేసేవాడు వృషలులను, వేదనిందకులను, గుండాశులను, గొలకులను, దేవలకాశులను, అయాజ్యయాజకులను, దేవద్విజవిరోధులను, పరాన్నలోలువులను, పరస్త్రీ నిరతులను చూచి మాట్లాడరాదు. మర్యాదచేయరాదు.

"నాస్తి గంగా సమం తీర్థం, నాస్తి మాతృసమోగురు:
నాస్తి విష్ణు సమో దేవ: తపోనా నశనాత్పరం"

గంగతో సమానమయిన తీర్థము, తల్లితో సమానమైన గురువు, విష్ణువుతో సమానమయిన దేవుడు లేడు. ఏకాదశీ వ్రతముకంటే శ్రేష్టమయిన తపస్సు లేనే లేదు.

"నాస్తి వేదసమం శాస్త్రం, నాస్తి శాంతి సమమే సుఖం
నాస్తి సత్య సమం జ్యోతి: తపోనా నశనాత్పరమ్"

వేదముతో సమానమైన శాస్త్రము, శాంతితో సమమయిన సుఖము, సత్యముతో సమమయిన జ్యోతీలేదు. ఏకాదశీ వ్రతముకంటే శ్రేష్టమయిన తపము లేదు.

"నాస్తి క్షమా సమా మాతా, నాస్తి కీర్తి సమమే ధనమ్
నాస్తి జ్ఞాన సమో భావ: తపోనా నశనాత్పరమ్"

తల్లి వంటి ఓర్పుగలవారు లేరు. కీర్తితో సమానమయిన ధనము లేదు. జ్ఞాన సమమైన భావము లేదు. ఏకాదశీ వ్రతము కంటే శ్రేష్టమయిన తపము లేదు.

ఈ విషయమై పురాతనమయిన ఒక ఇతిహాసము వుంది. దానిని వివరిస్తాను. అంటూ నారదుడిలా చెప్పసాగాడు–

నర్మదా నదీ తీరంలో ఎందరో మునులతోను, తపోనిష్ఠాగరిష్టులతోనూ నిండివున్న పుణ్యప్రధానమైన, ప్రశాంతమైన ఒక ఆశ్రమం వున్నది. ఆ ఆశ్రమంలో గొప్ప తపస్వి, శాంత మనస్కుడు, దయాశీలుడు అయిన



'కాలవుడు' అనే పేరుగల ఒక మునీశ్వరుదున్నాడు. ఆయన కుమారుని పేరు భద్రశీలుడు. అతడు తప్పటడుగులు పెడుతూ నడవటం నేర్చినది మొదలుకొని యింటిలోని దేవతలున్న మందిరములోనికి వెళ్ళి కనులు మూసుకొని కూర్చునేవాడు. ధ్యానస్థితిలో ఎక్కువసేపు గడుపుతూ, కేశవ, నారాయణ, మాధవ, గోవింద అంటూ భజనలు చేస్తూ వుండేవాడు. ఆటలాడుకొను వయస్సులో మట్టితో విష్ణువు బొమ్మలను చేసి నమస్కరిస్తూ వుండేవాడు. తన తోడి యీడుగల పిల్లలతో గూడి ఆటపాటలలో గడిపేందుకు ఎంతమాత్రము ఉత్సాహము చూపక ఎప్పుడూ విష్ణువునే భజిస్తూ వుండేవాడు. ఏకాదశినాడు తల్లిదండ్రులతో "అమ్మా, నాన్నా! ఈ రోజు ఏకాదశి కదా! నాకు పాలు వద్దు. అన్నము వద్దు. ఈ రోజు నేను ఏమీ తినను" అనేవాడు. తల్లి బాధతో "నాయనా! నీవు పసివాడివి. పెద్దవాడవయిన తర్వాత ఏకాదశీ ఉపవాసము వుండవచ్చు. ఇప్పుడు ఏమీ తినకుంటే ఆకలితో అలమటిస్తావు. కనీసము పాలు అయినా త్రాగు" అంటూ ఎంతగా బ్రతిమిలాడినా

వినిపించుకొనక ఉపవాసముండేవాడు. ఆ రాత్రి నిద్రపోకుండా పూజా మందిరములో కూర్చుని.

"హరే రామ హరే రామ రామ రామ హరే హరే,
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే"
"ఇతి షోడశనామ్నాం కలి కల్మషనాశనం
నాత: పరతరోపాయో సర్వవేదేషుదృశ్యతే"

అని పాడుతూ వుండేవాడు. కొంతసేపు "రాధామోహన మదన మోహన బృందావన చిన్ని కృష్ణ. బృందావన చిన్ని కృష్ణ" అని పాడుతూ గంతులు వేస్తూ వుండేవాడు. ఇలా నిరంతరం భక్తి భావనలతో గడిపే కుమారుని చూచి తండ్రి అయిన కాలవ మహర్షి ఆశ్చర్యానందాలకు లోనవుతుండేవాడు. ఒకనాడు ఆయన కుమారుని దగ్గరకు తీసుకొని ముద్దాడి, తొడపై కూర్చుండ బెట్టుకొని, "చిట్టి నాన్నా! ఈ విధంగా ఎప్పుడూ దేముని భజించమని నీకెవరు చెప్పారురా? ఇంత చిన్న వయసులో నీకు ఏకాదశీ వ్రతము చేయాల్పించటానికి కారణమేమిటి? ఎప్పుడూ హరినామము తప్ప నీ నాలుక మరొక నామాన్ని పలుకదేమిరా?"

"ఆటపాటలతో, అల్లరి చేష్టలతో ప్రొద్దుపుచ్చవలసిన పసివాడవు. నీకు యింతటి దైవభక్తి ఏమిటయ్యా? ఈ ఏకాదశీ ఉపవాస దీక్షలు, యీ భజనలు యీవన్నీ ఎందుకు చేస్తున్నావు? గత జన్మలో నువ్వు ప్రహ్లాదుడివా ఏమిటి?" అని నవ్వుతూ అడిగాడు. వెంటనే భద్రశీలుడు చివాలున తలపైకెత్తి తండ్రిని చూస్తూ "నేను ప్రహ్లాదుడను కాను. ధర్మకీర్తి అనే మహారాజును" అన్నాడు. ఆ మాటకు కాలవుడు నివ్వెరపోయి "ఏమిటీ? నువ్వు ధర్మకీర్తివా? మహారాజువా? గతజన్మలోని యీ విషయం యిప్పుడు నీకెట్లా తెలిసింది? నువ్వు చెపుతున్న యీ మాట నిజమేనా? లేక అబద్ధమాడుతున్నావా?" అన్నాడు. భద్రశీలుడు "తండ్రీ! అబద్ధమాటవలసిన అవసరమేముంది? నేను చెప్పేది నిజం. గతజన్మలో నేను ధర్మకీర్తి అనే పేరుగల ఒక మహారాజును. అయితే, యీ జన్మలో యిలా భక్తి తత్పరుడనై వుండటానికి కారణం యమధర్మరాజు చేసిన తత్త్వోపదేశమే. ఆయన చెప్పిన దానిననుసరించి నేనీ విధంగా నడుచుకుంటున్నాను" అన్నాడు.

కుమారుని మాటలకు నిశ్చేష్టుడైనాడు కాలవుడు. అతనికి నోటమాటరాలేదు. కొంతసేపటికి తేరుకొని, ఏమిటి యీ పిల్లవాని యీ వింతమాటలు? అనుకొంటూ, "చిన్నతండ్రీ! నువ్వు చెపుతున్న విషయాలు చాలా చిత్రంగా అనిపిస్తున్నాయి. యమధర్మరాజు నీతో మాట్లాడాడా? నువ్వు గతజన్మలో మహారాజువా? ధర్మకీర్తివా? నాకేమీ అర్థం కావటంలేదు. నేను వింటున్నదంతా ఒక నాటకంలాగా ఒక యింద్ర జాలముగా అనిపిస్తున్నది. ఎంతో విస్మయం కలిగిస్తున్నది'' అన్నాడు. ''తండ్రీ! ఇందులో ఆశ్చర్యమేమున్నది? నా గత జన్మ సుకృతము వలన నాకు జన్మాంతర జ్ఞానం లభించింది. నా అపార పుణ్యం వలన సమవర్తి యమధర్మరాజు వలన హరిభక్తి విశిష్టత, ఏకాదశీ వ్రత ప్రాముఖ్యత నాకు బాగా అర్థమయినాయి. అందువలన యీ జన్మలో యీ విధంగా హరిభక్తి పరాయణుడనైనాను. మన జీవితాలు ఎప్పుడు ఏ విధంగా వుంటాయో మనకు సామాన్యముగా తెలియదు. కాని సకల జీవుల ప్రారబ్ధ కర్మలే ఆయా జీవులను నడిపిస్తూ వుంటాయి. అన్నింటికీ మూల కారణం మనము చేసే పుణ్య, పాప కర్మలే. గతజన్మ జ్ఞానం నాకు కలగటానికి కారణం నేను చేసిన పుణ్యకర్మలే. నేను చెప్పేదంతా నిజం. ఇందులో వింత ఏమున్నది తండ్రీ?" అన్నాడు భద్రశీలుడు. కుమారుని మాటలు విన్న కాలవుని ఆశ్చర్యానందాలకు మేరలేదు. తన కుమారుడు అందరి వలె సాధారణ మానవుడు కాడనీ, అతడొక మహనీయుడనీ గుర్తించిన అతని మనసులో భద్రశీలునిపై భక్తి భావం పెల్లుబికింది. అతడు కుమారునికి చేతులు జోడించి నమస్కరించి, "ఓ యోగిపుంగవా! ఓ సిద్ధపురుషా! ఇన్నాళ్లూ నిన్నొక సామాన్యునిగా తలచాను నిన్ను నా కుమారునిగా మాత్రమే భావించి పితృ వాత్సల్యముతో ముద్దులాడుచూ ఆనందిస్తున్నానేగాని నమస్కరించదగిన మహాత్ముడవని తెలుసుకొనలేకపోయాను. ఓ ఋషీశ్వరా! పుత్రభావంతో నీపట్ల నేనేమయినా అపరాధములు, అపచారములు చేసివుంటే నన్ను మన్నించు. ఓ చిట్టి తండ్రీ! నీకు నేను తండ్రిని కాను. నువ్వే నాకు తండ్రివై నన్ను దయతో ఉద్ధరించు. నాయనా! నీవు చెప్పిన విషయాలు నన్ను ఉత్సాహపరుస్తున్నాయి. యమధర్మరాజు నీకు ఏమి చెప్పాడు? ఆ స్వామికి, నీకూ మధ్య జరిగిన సంభాషణ, నీ గతజన్మలవృత్తాంతాలు అన్నీ వినాలని నా మనస్సు ఆతృత పడుతున్నది. నన్ను కరుణించి ఆ విషయాలన్నీ నాకు తెలియజేయి" అన్నాడు.

భద్రశీలుడు యిలా చెప్పనారంభించాడు–

"తండ్రీ! నేను పూర్వజన్మలో సోమ వంశములో ధర్మకీర్తి అనే పేరుగల ఒక మహారాజుగా పుట్టి ఎంతో కాలం రాజ్యమేలాను. త్రిమూర్తి స్వరూపుడు, సాక్షాత్తు ఆది

దేవుడైన శ్రీ దత్తాత్రేయ స్వామిని ఆశ్రయించాను. ఆ స్వామికి శిష్యుడనై ఆ స్వామినుండి ఎన్నో జ్ఞాన సంబంధమైన విషయాలు, వ్రతములు, ధర్మములు, శాస్త్రముల గురించి విన్నాను. ఆ స్వామిని ఆరాధించాను. పూజించాను. నేను చదువని వేద, యితిహాస, పూరాణము లేదు. నేను వినని శాస్త్రమే లేదు. శ్రీ దత్తానుగ్రహముతో తొమ్మిదివేల సంవత్సరాలు రాజ్యమేలాను. కానీ ఏమిలాభము?'' అంటూ నిట్టూర్చాడు, భద్రశీలుడు. కాలవుడు ఆతృతతో "ఏమి కుమారా? ఏమి జరిగింది?" అని అడిగాడు.

"ఏమని చెప్పను తండ్రీ! ఎంత చదివినా, ఎన్ని విన్నా ప్రయోజనమేముంది? ఎంతటివారు గురువులైవున్నా ఏమి లాభం? ప్రారబ్ధమనుభవింపక తప్పదు కదా! ఏ జన్మలో ఏ పాపము చేశానో, నా మనసును మాయ కమ్మేసింది. విజ్ఞత నశించింది. యుక్తాయుక్తములు మరచి రాజ్యమదము తలకెక్కి విపరీత ప్రవర్తనతో సంచరించసాగాను. దుష్టజనుల సహవాసమే నాకు ఎంతో ప్రియముగా తోచి వారి సాంగత్యంలో ఎన్నో పాపాలు చేశాను. వేద మార్గం విడిచి పెట్టాను. యజ్ఞయాగాదులు, దానధర్మాలవంటి పుణ్యకార్యాలు పూర్తిగా వదలి వేశాను. వేదాలను నిందించటం, సజ్జనులను దూషించటం ఎన్నో అధర్మములు, ఎన్నో అన్యాయపు పనులు, అసత్యములు వలుకటము యిలా నా జీవితమంతా పాపాల మయమైపోయింది. ఇది యిలా వుండగా నేను చేసికొనే పాపకర్మలుకాక రాష్ట్ర పాపముకూడ నా పై వచ్చి పడింది. నేను అధర్మములు చేయటం చూచి నా రాజ్యంలోని ప్రజలందరూ నన్ను అనుసరిస్తూ నిర్భయంగా పాపకార్యాలు చేయసాగారు. "రాజారాష్ట్రకృతంపాపం" అన్న నానుడి వినేవుంటావు. దేశప్రజలు చేసే పాపం, వారిని నిరోధించక పోవటంవలన ఆ దేశపు రాజుకే సంక్రమిస్తుంది. ఇలా పాపాల పుట్టనై సప్తవ్యసనాలలో దగులుకొని బ్రతుకుతున్న నేను ఒకసారి వేటకు వెళ్లినపుడు జరిగిన సంఘటనలు ఒక్కసారిగా నా జన్మ జన్మల విధి వ్రాతలను మార్చివేశాయి. తండ్రీ! ఇది కరుణామయులయిన నా గురుదేవులు శ్రీ దత్తాత్రేయ స్వామి దయకాక మరేమిటి?" అంటూ యింకా యిలా చెప్పసాగాడు–

"తండ్రీ! అలా నేను మృగములను వేటాడుతూ అడవిలో చాలా దూరం వెళ్లిపోయాను. నా వెంట వచ్చిన సైన్యం అశ్వముపై అతివేగంగా వెళ్తున్న నన్ను అనుసరించలేక పోవటంతో ఒంటరి వాడనై తిరిగి తిరిగి అలసిపోయాను. నా సైన్యము కోసం ఎంత వెతికినా వారొకవైపు నేనొకవైపు వెళ్లటంవలన ఏ ఒక్కరి జాడ నాకు కన్పించలేదు. ఆకలి దప్పులు నన్ను విపరీతంగా పీడింపసాగాయి. అయితే, ఆ కారడవిలో అన్నము, నీరు ఎలా దొరుకుతాయి? అలా అసహాయుడనై తిరిగి తిరిగి చివరకు నా పూర్వపుణ్యం వలన శ్రీ దత్తస్వామి అనుగ్రహంవలన ఎలాగో రేవానదీ తీరం చేరాను. అప్పటికి సాయంత్రం అయింది. ఆ రేవా నదిని చూడగానే నాకు పోతున్న ప్రాణం తిరిగి వచ్చినట్లుయింది. నదీ జలాలతో దప్పిక తీర్చుకొని స్నానం చేసి కొంతసేద తీరాను. నది ఒడ్డున కొన్ని యిండ్లు కన్పించగా ఆ యిళ్లకు వెళ్లి ఆ యిళ్లలోని వారిని 'ఆకలిగా వున్నది అన్నంపెట్టమని' అడిగాను. అయితే నా అదృష్టమో, దురదృష్టమో తెలియదుగాని ఆ యిళ్లలోని వారంతా పూజలు, భజనలు, పూరాణ శ్రవణములలో నిమగ్నులైవున్నారు. వారు "అయ్యా! నేడు ఏకాదశి. మేమంతా ఉపవాస దీక్షలో వున్నందువలన వంటలు చేసుకొనలేదు. ఈ రాత్రంతా మేము భగవచ్చింతనలో వుంటూ జాగరణ చేస్తాము. రేపు ఉదయమే వంటలు చేసుకొని భుజిస్తాము. నీవు కూడ యీ రాత్రి జాగరణలో గడిపి రేపు ఉదయం మాతో కలిసి భుజించవచ్చు" అన్నారు. చేసేది లేక నేను కూడ వారి మధ్యలో ఆ రాత్రంతా హరికథలు విన్నాను, ఆకలి బాధిస్తుంటే నిద్ర ఎలా వస్తుంది? పైగా రోజంతా గుఱ్ఱపు స్వారీ వలన ఒళ్లంతా హూనమయింది. ఒకవైపు తీవ్రమయిన ఆకలి. మరొక వైపు భరింపరాని ఒళ్లునొప్పులతో బడలికతో అలసిన శరీరబాధలు. మొత్తంమీద ఆ ఏకాదశి నాడు రోజంతా అన్నములేదు. ఆ రాత్రి నిద్రలేదు. ఆ తీవ్రమయిన బాధలను తట్టుకొనలేక కాబోలు బొంది నుండి ప్రాణములు లేచిపోయాయి. భయంకరాకారులయిన యమ భటులు వచ్చి పాశములతో నన్ను బంధించి భయంకరమైన దారులవెంట యీడ్చుకొంటూ తీసుకొనిపోయి నన్ను యమధర్మరాజు ముందు నిలబెట్టారు. ఆయన చిత్రగుప్తునితో ''వీడు చేసిన పాపపుణ్యములన్నీ వివరించు''మని అడుగగా చిత్రగుప్తుడు "స్వామీ! వీడు చేసిన పాపములకు అంతేలేదు. కానీ యిక్కడ ఒక ధర్మసూక్ష్మమున్నది. ఏకాదశినాడు జంతుహింస చేసినప్పటికీ ఉపవాసం వున్నాడు. రేవానదిలో స్నానము చేశాడు. ఏకాదశీ వ్రత దీక్షా పరాయణుల మధ్య కూర్చుని వారితో కలసి దైవసంకీర్తన చేశాడు. హరికథలను శ్రవణము చేశాడు. ఆ రాత్రంతా జాగరణ చేశాడు.

సశేషం

# వార్తాలాపము

మే సంచిక తరువాయి

"న తత్ర రథా న రథయోగా వ పన్థానో భవన్త థ రథాన్ రథయోగాన్ పథః సృజతే"

స్వప్నమునందు రథములు, గుర్రములు, నడచుమార్గములు ఏమియును వుండవు. కాని స్వప్నమునందలి ఏకాగ్రతచిత్తతచే తానే అన్నిటిని సృజించుకొనును. ఒరనుండి వెలికి తీయబడిన కత్తివలే బుద్ధ్యాది ఉపాధిరహితమగు ఆత్మ స్వయముగా స్వకీయమగు జ్యోతిచే ప్రకాశమానమగుచు స్వప్నావస్థయందు ప్రతీతమగును.

"తత్రాZనన్దా ముదః ప్రముదో భవన్తి"

స్వప్నావస్థయందు ఆనందాదులు ఏమియును వుండవు. వానిని అన్నిటిని ఆత్మ తానే సృష్టించుకొనును.

"తదేతే శ్లోకా భవన్తి । స్వప్నేన శరీరమభిప్రహత్యాసు ప్తః సుప్తానభిచాకశీతి । వుక్రమాదాయ శునరైతి స్థానమ్"

స్వప్నభావముద్వారా జాగ్రత్ శరీరమును నిశ్చేష్టమొనరించి ఆత్మ తాను సుప్తావస్థను పొందకుండవుండి, సుప్తావస్థను పొంది– తన ఆక్రమణతో నశించిన బాహ్య, ఆధ్యాత్మిక భావములను అన్నిటిని శరీర, అంతఃకరణాదులనూ భావింపజేయును. అనంతరము శుద్ధజ్యోతి రూపమును పొంది కర్మలను ఆచరించుటకు జాగృతిలోనికి వచ్చును.

హిరణ్యయః పురుష ఏకహంసః ।

పురుషుడు చైతన్యజ్యోతియే స్వభావముగా కలవాడు. ఆ ఒకడే జాగృతి, స్వప్న, ఇహలోక, పరలోకములన్నిటిలోనికి వెళ్ళును.

అటులనే పంచేంద్రియవృత్తికల ప్రాణముద్వారా అత్యంత అశుద్ధమగు శరీరమును రక్షించును. శరీరమునకు బయటనే వుండును, అనగా శరీరముతో సంబంధము లేకుండ శుద్ధముగనే వుండి కోరిన చోటికి వెళ్ళును.

స్వప్నావస్థయందు ఒకప్పుడు దేహాదిభావములను పొందును. మరియొకప్పుడు పక్ష్యాది భావములను పొందును. ఇట్లు వాసనానుసారము అనేక భావములను పొందును. ఒకప్పుడు స్త్రీలను కూడి ఆనందించును. మరియొకప్పుడు మిత్రులతో ఆనందించును. భుజించుచు, తిరుగుచు వుండును. మరియొకప్పుడు సింహాది ప్రాణుల భయమును కూడ అనుభవించును.

మానవులందరును యీ ఆత్మ సృజించిన వాసనాయుతమగు క్రీడ, ఆనందము మొదలగువానినే చూడగలరు. కాని ఎవరును వానిని సృజించిన ఆత్మను చూడలేరు. "స్వప్నావస్థయందు అత్యంత వివిక్తమును స్వయంజ్యోతి స్వరూపమును అగు ఆత్మ దృగ్గోచరమగుచున్నను జనులు దానిని చూడలేరు. ఇది ప్రపంచపు దురదృష్టము మాత్రమే" అని శ్రుతి స్పష్టముగా ఖేదమును ప్రకటించుచున్నది.

స్వప్నావస్థయందలి – నిద్రించిన – మనుష్యుని లేపరాదని వైద్యులు చెప్పిరి. ఏలనన, యింద్రియములను త్యజించి ఆత్మ స్వప్నావస్థయందు విహరించుటకు వెళ్లినది. లేపు తొందరలో నేత్రములు, కర్ణములు మొదలగు ఇంద్రియములను పొందలేకపోయినచో ఔషధ సేవచే చికిత్సచేయుటకు వీలుపడదు. నిత్యాంధత్వము, బధిరత్వము మొదలగుదోషములు కలుగును. దీనినిబట్టికూడ ఇంద్రియేతరమగు ఆత్మ ఏకైకమగు స్వయంజ్యోతియని ఋజువు అగుచున్నది.

స్వప్న లోకము వేరొకటియా? కాదా? అను ప్రశ్నకూడ విచారించదగినదే. జాగృతియందలి లోకమే స్వప్నలోకమగుటకు వీలుపడదు. ఏలనన, స్వప్నమున ఇంద్రియములు అన్నియును ఉపరతిని పొందును. ఇక చూచుట, వినుట దేనిచే సంభవించును? ఇంద్రియములు ఉపరతిని పొందిన తరువాతనే స్వప్నములు చూచుట జరుగును. ఇందువలననే శ్రుతి చెప్పుచున్నది, "న తత్ర రథా నరథ యోగాః".

ఇట్టి స్వయంజ్యోతియగు ఆత్మను యాజ్ఞవల్క్యుడు జనక మహారాజుకు తెలిపెను.

కాని జనకుడు మరల ప్రశ్నించెను. ఇంకను విమోక్షమునకు సంబంధించిన ప్రశ్న నేను అడుగవలసియున్నది. విమోక్షముయొక్క ఏకదేశిత్వము, విమోక్షముయొక్క ఉపయోగము ఆత్మయొక్క స్వయంజ్యోతిత్త్వము – వీనిని గురించి తమరే సెలవిచ్చిరి. ఇక సంసారమునుండి ముక్తికలుగు మార్గమును నాకు తెలుపుడు.

## విమోక్షము యెట్లు కలుగును

ఇంతవరకు ఆత్మ స్వయంజ్యోతిస్వరూపము అనునది రుజువు చేయబడినది. కాని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"స్వప్నో భత్వేమం లోకమతిక్రామతి మృత్యో రూపాణి"

స్వప్నరూపమును పొంది యీ ఆత్మ, యీ లోకమున మృత్యురూపమగు అవిద్యాకర్మాదులను అతిక్రమించును. అందు యింకనూ సందేహమునకు చోటు కలదు. "మృత్యురూపమును అతిక్రమించును కానీ, మృత్యువును మాత్రము అతిక్రమించదుకదా" అని అడుగవచ్చును. అంతియేకాదు. స్వప్నమునందుకూడ భయంకరమగు ప్రాణులు మొదలగువానిని చూచిన భయత్రానాదులు ప్రత్యక్షమగును. అందుచే మృత్యువును అతిక్రమించలేదు అను విషయము నిశ్చయమగుచున్నదికదా! ఇక విమోక్షము ఎట్లు కలుగును? ఈ సందేహమునకు సమాధానము యాజ్ఞవల్క్యుడు యెట్లుచెప్పుచున్నదియు విచారించుదము.

"మృత్యువు ఆత్మయొక్క స్వభావముకాదు. ధర్మముకాదు."

అనునదిరుజువు అయినచో విమోక్షవిషయము ఋజువగును.

## ఆత్మ నిత్య శుద్ధ, బుద్ధ, ముక్తము

"సవా ఏష ఏతస్మిన్ సంప్రసాదే రత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి స్వప్నాయైవ న యత్తత్ర కించిత్పశ్యత్యనన్వాగతస్తేన భవిత్యసంగో హ్యయం పురుష ఇత్యేవమేవం తద్యాజ్ఞ్యవల్క్య సోహం భగవతే సహ స్రందదామ్యత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి॥"

ఆ ఆత్మయే సుషుప్తియందు సంచరించి, ఆనందమును మాత్రమే అనుభవించి, పుణ్య పాపములను చూచి (అనుభవించి కాదు) వెళ్లిన క్రమమునకు విపరీతక్రమమున స్వప్నమునందే తిరిగి వచ్చును. (మెట్లు ఎక్కి మేడలోనికి వెళ్లినవాడు తిరిగి వెనుకకు వచ్చునప్పుడు మొదట ఎక్కిన మెట్టుపై, అన్నిటికంటె చివరను కాలుంచును. అటులనే జాగృతినుండి స్వప్నములోనికిని, స్వప్నము నుండి సుషుప్తిలోనికిని వెళ్లును. కావున సుషుప్తినుండి స్వప్నములోనికి స్వప్నమునుండి జాగృతిలోనికిని వెనుకకు మరలును. సుషుప్తినుండి తిన్నగా జాగృతిలోనికి రాదు. ('ప్రతిన్యాయం' అనగా విపరీతక్రమము అని అర్థము).

ఈ స్వప్నమున ఏమిచూచినను, చెప్పినను, వానితో ఆత్మలిప్తమవదు. ఎట్లనిన, స్వప్నమునందు ఏదైన హత్యచేసిన సంగతి మిత్రమండలియందు చెప్పినను ఆ వ్యక్తిని పాపాత్మునిగా మిత్రులు తలచరు. అటులనే దానిని ఏదియును స్పృశించలేదు. ఏలనన, ఆత్మ నిర్లిప్తము.

ఈ విషయమున ఒక దృష్టాంతము కలదు.

ఒక బ్రాహ్మణునకు స్వప్నము వచ్చెను. స్వప్నమున అతడు ఒక జలాశయమువద్దకు జలమును త్రాగుటకు వెళ్లెను. ఆ సరోవర తీరమున ఒక పెద్ద నేరేడుచెట్టు వుండెను. దానియొక్క ఒకలావైన కొమ్మపై ఒక కిరాతకుడు కూర్చుని నేరేడిపండ్లు తిని దాని గింజలు సరోవరములోనికి విసురుచుండెను. ఈ సంగతి బ్రాహ్మణునకు తెలియదు. అతడు తొందరతొందరగా దోసిలితో నీరు త్రాగుచుండెను. ఒకమారు దోసిలిలోనికి నీటితోపాటు నేరేడుగింజ వచ్చి నోటిలోనికి పోయెను. పైకి చూచుసరికి బ్రాహ్మణునకు ఆ కిరాతకుడు కన్పించెను. తాను కిరాతకుని ఉచ్ఛిష్టమును తిని అపవిత్రుడనైతిని అను విచారము అతనికి కలిగెను. దానితో అతడు మేల్కాంచెను. మేల్కొనిన తరువాత కూడ అతనికి చాలా పశ్చాత్తాపము కలిగెను. తాను జాతి భ్రష్టుడనైతినని తలచి ప్రాయశ్చిత్తమును తెలిసికొనుటకు పురోహితునిచెంతకు వెళ్లెను. పురోహితుడు తెలివైనవాడు. ఆ కారణముచే అతడు యిట్లు చెప్పెను, "నీవు స్వప్నమునందు ఉచ్ఛిష్టము తింటివి. కావున దాని ప్రాయశ్చిత్తముకూడ స్వప్నమునందలి పురోహితుడే చెప్పును."

స్వప్నము మిథ్య. అందుచే సత్ స్వరూపమగు ఆత్మకు ఏవిధమగు దోషమును కలుగదు. కావుననే ఆత్మ నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావము కలదని చెప్పెదరు.

## ఆత్మనిర్లిప్తము

ఈవిషయము విని జనకమహారాజు చెప్పెను. "ఓ యాజ్ఞవల్క్యా! తమరు చెప్పినది యథార్థము. ఆత్మ కర్మలకు సంబంధించదు అని మోక్షపదార్థముయొక్క ఏక దేశకర్మప్రవివేకమును తెలిసితిరి. ఇక మోక్షమును గురించి తిరిగి తెలుపుడు.

అంత యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

సుషుప్తి నుండి స్వప్నములోనికి వచ్చినట్లుగనే, స్వప్నమునందు ఆనందించి మరల జాగృతిలోనికి వచ్చును. స్వప్నమునందు కర్మాదులచే ఆత్మ కొంచెమైనను లిప్తముకాదు. ఏలనన, అది నిస్సంగము. నిస్సంగత్వముచే కర్తృత్వముకూడ లేదు. స్వప్నమునందు కామములును, సాంగత్యమును ఆత్మకు ఉన్నచో వానితో అసాంగత్యదోషములతో జాగృతిలోనికి రావలసియున్నది. కాని అట్లు జరుగుట లేదు.

ఈవిధముగనే ఈ ఆత్మ జాగృతియందు ఆనందించి, మరల పుణ్యపాపములను చూచియే, క్రమముగా జాగృతినుండి స్వప్నమునకు చేరును. కావున జాగృతియందుకూడ ఆత్మ నిస్సంగమే. ఏరకపు కార్యములచేతను ఆ ఆత్మ బద్ధమగుటలేదు. ఆత్మజ్యోతిమాత్రముచే అవభాసితమగుచున్న కార్య (శరీరము) కరణ (ఇంద్రియములు) సంఘాతము మాత్రమే కర్మాదులను ఆచరించుచున్నది. ఆత్మ స్వయం జ్యోతి స్వభావము కలిగినది అగుటచే దానిని ఏ కర్మయును బంధించుటలేదు. బుద్ధ్యాది ఉపాధులచే ఆత్మయందు పరిలక్షితమగు కర్తృత్వము ఔపచారికము. కావుననే శ్రుతి "ధ్యాయతి ఇవ, లేలాయతి ఇవ" అని 'ఇవ' శబ్దముతోనే వివరించినది. వాస్తవమునకు ఆత్మ ఏమియును చేయుట లేదు.

ఈ విధముగా జాగృతి, స్వప్న, సుషుప్తి అవస్థలయందు ఆత్మ నిర్లిప్తము, కర్తృత్వరహితము, స్వయంజ్యోతిస్వరూపము అనునవి ఋజువు అయిన తరువాత చెప్పవలసినది ఇక ఏమియు లేదు. కావున దృష్టాంతమునుమాత్రమే శ్రుతి తెలుప ప్రయత్నించుచున్నది.

"తద్యథా మహామత్స్య ఉభే కూలే అనుసంచరతి పూర్వం చాపరం చైవమేవాయం పురుష ఏతావుభావన్తావనుసంచరతి స్వప్నాన్తంచ బుద్ధాన్తంచ ॥"

పెద్దతిమింగిలము నదీతీరములను రెంటిని ఆనుకొని సంచరించునట్లు – నదీప్రవాహముపై ఆధారపడక, ఇష్టమువచ్చినట్లు సంచరించునట్లు – ఆత్మకూడ స్వప్న, జాగృతులయందు స్వేచ్ఛగా సంచరించును.

భౌతికాకాశమున శ్యేనము ఇష్టమువచ్చినట్లు ఎగిరి అలసిపోయిన తరువాత తనగూటిలో రెక్కలను ముడుచుకొని కూర్చొనినట్లు ఈ ఆత్మకూడ జాగృతి, స్వప్నములయందు ఇష్టమువచ్చినట్లు విహరించి శాంతికొరకు సుషుప్తిస్థానమునకు వచ్చును. అచ్చట ఏ కామమును ఉండదు. ఏ స్వప్నమును ఉండదు.

ఆత్మయొక్క స్వభావము సర్వసంసారధర్మశూన్యత్వమును, పరోపాధినిమిత్తము మాత్రమే అగు సంసారధర్మత్వము అయినచో పరోపాధిరూపమగు అవిద్య స్వాభావకమా? ఆగంతుకమా? ఆగంతుకమయినచో వియోగమును పొందుటకు వీలుపడును. కాని ఆగంతుకమనుటకు ప్రమాణము ఏది? అవిద్య ఆత్మ యొక్క ధర్మము ఏలకాదు? ఇట్టి సందేహములను పోగొట్టుకొరకు సకల అనర్థములకును బీజమగు అవిద్యయొక్క తత్త్వమును బోధపరచుటకు క్రింది శ్రుతితెలుపబడినది.

"తా వా అస్యైతా హితా నామ నాడ్యో యథా కేశః సహస్రధాభిన్నః తావతాzణిమ్నా తిష్ఠన్తి వుక్లస్య నీలస్య పిఙ్గలస్య హరిత్య లోహితస్య పూర్ణా అథ యత్రైనంఘ్నన్తీవ జినన్తీవహస్తీవ విచ్ఛాయయతి గర్తమివ పతతి యదేవ జాగ్రద్భయం పశ్యతి తదత్రావిద్యయా మన్యతేzథ యత్ర దేవ ఇవ రాజేవాహమేవేదం సర్వోzస్మీతి మన్యతే సోzస్య పరమో లోకః ॥"

ఈ పురుషునియందు (శిరము, చేతులు, కాళ్ళు మొదలగునవి కలవానియందు) "హిత" అను పేరుకల నాడులు కలవు. ఇవి కేశమును వేయిభాగములుగా చీల్చినను ఏర్పడు స్వరూపముకంటె సూక్ష్మముగా నుండును. అవి వాత, పిత్త, కఫ మిశ్రమమున తెలుపు, నలుపు, పసుపు, ఎరుపు మొదలగు రంగులను కలిగియుండును. పంచప్రాణములు, దశేంద్రియములు, మనస్సు, బుద్ధియును కలిసి లింగ దేహము అగును. అది సూక్ష్మముగను, స్వచ్ఛముగను వుండి నాడులయందలి రసముల ఉపాధిచే స్త్రీ, ఏనుగ, గుఱ్ఱము, రథము మొదలగు ఆకారవిశేషములుకల వాసనలను పొందును. అట్టి స్థితిలో (స్వప్నమునందు) శత్రువులుకాని, దొంగలుకాని వచ్చినచో నన్ను శత్రువులు కొట్టిరి, దొంగలు నా సొత్తు ఎత్తుకొనిపోయిరి, మొదలగు వాసనానిమిత్తమగు అసత్యప్రీతి కలుగును. అంతట అతడు దుఃఖించును. కాని ఇదంతయును అవిద్యాకృతము.

## సర్వాత్మభావము ఆత్మయొక్క పరమలోకము

ఆ అవిద్యనశించి దేవతావిషయకమగు విద్య జనించినప్పుడు (జాగ్రత్ కాలమున) ఆ వాసనలద్వారా తాను దేవుడనని

తలచును. అవిద్య ఉద్భవించినప్పుడు స్వప్నమునందుకూడ నేనే ఈ రూపములను అన్నిటిని పొందుచున్నాను అను భావము కలుగును. ఈ విధమగు జ్ఞానము ఆత్మయొక్క సర్వాత్మభావము. ఇదియే పరమలోకము.

సర్వాత్మభావము, లేక విద్యాఫలస్వరూపమగు, మోక్షమునుగురించి శ్రుతులు చెప్పుచున్నవి. అది మొదటి ప్రస్తావించబడినది.

"యత్ర సుప్తోనకంచన కామం కామయతే" (ఈ విధముగా సుషుప్తిరూపమున) అదియే ఈ పురుషుని వాస్తవికరూపము. సర్వాత్మ భావమును గురించి వెనుకటి శ్రుతియందే "సోఽస్య పరమోలోకః" అని చెప్పబడినది.

తద్వా అస్యైతదతీచ్ఛన్దా అపహతపాప్మాభయగ్ం రూపమ్ । తద్యథా ప్రియయా స్త్రియా ।

ఆ ఆత్మయొక్క స్వరూపమే అతీచ్ఛందము. అనగా కామనా రహితము, పాపరహితము, అభయస్వరూపము. ఆ పరమాత్మ స్వరూపమే తన ఆత్మతో పరిష్వక్తమగును. అది బాహ్యవస్తువుయో, అంతరంగికవస్తువుయో ఎవరును తెలిసికొనలేరు. ఇదియే ఈ పురుషుని స్వరూపము.

ఈ పురుషుడు 'ఆప్తకాముడు', అనగా అన్నికోరికలును యితనిని పొందియుండును. ఇతడు ఆత్మకాముడు. ఆత్మను మాత్రమే కోరుచుండును. అకాముడు. ఏవిధమగు కోరికయు యితనియందు వుండదు.

ఈ సమయమున తండ్రికొడుకులు తల్లికొడుకులు మొదలగు సంబంధములు విడిపోవును. మానవదేవాది భావములు నివృత్తిని చెందును. చోరుడు, పాపాత్ముడు, భ్రూణహత్యచేసివాడు, చండాలుడు (శూద్రునిచే బ్రాహ్మణస్త్రీయందు జనించినవాడు) పౌలుసుడు శూద్రునిచే క్షత్రియస్త్రీయందు జనించిన వాడు) శ్రవణుడు (సన్యాసి) తపస్వి (వానప్రస్థుడు) మొదలగు భావములు అన్నియును నివృత్తిని పొందును. పురుషుడు పుణ్యాపాపరహితుడగును. అన్నిరకములగు హృదయశోకములకును అతీతుడగును.

మరియొక సందేహము కలుగవచ్చును. స్వయంజ్యోతిష్ట్వము అనగా చైతన్యాత్మస్వభావము. చైతన్యాత్మస్వభావము ఆత్మది కదా! ఆస్వభావమును ఆత్మ త్యజించినా? అగ్ని ఉష్ణత్వ, ప్రకాశత్వములను త్యజించదు. కాని సుషుప్తియందు తన చైతన్యాత్మస్వభావము చూడనగుటలేదే అని అడుగవచ్చును. ఈ సందేహమునకు ఈ శ్రుతి సమాధానము చెప్పుచున్నది.

యద్వైతన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి న హి ద్రష్టు ర్ధష్టేరిపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్ ।

నతు తద్ ద్వితీయ మస్తి తతోఽన్యద్విభక్త యత్పశ్యేత్ ॥

సుషుప్తియందు అది చూచుటలేదు. అది దృష్టికలిగియున్నను చూచుటలేదు. అవినాశియగుటచే ద్రష్టయొక్క స్వరూపమగు దృష్టి నశించదు. అగ్ని యొక్క ఉష్ణము నశించనివిధముగా దానిదృష్టికూడ నశించదు. అదితప్ప మరియొకటి లేదు. ఇక దేనిని చూచును? సుషుప్తి యందు ఆత్మ దేనిని చూచుటలేదు. ఇంద్రియవృత్తులన్నియు శాంతించుటచే ఏమియును అనుభవించుట లేదు అనితోచును. అదిసరికాదు. ఏలనన, సుషుప్తి యందుకూడ జ్ఞానము వుండును. ద్రష్టయగు ఆత్మ యొక్క దృష్టి విజ్ఞానశక్తి. అది ఎప్పుడును నశించదు. అది నశ్వరము కాదు. అయినను కొంచెము భేదముమాత్రము కలదు. ఆ స్థితియందు ద్రష్ట వ్యతిరిక్తమగు జీవుడు వేరొండు ఉండదు. ఇక చూచువాడు ఎవరు? చూచునది ఏమి? ఆ సమయమున స్వరూపజ్ఞానము మాత్రమే కలుగును.

ఇదేవిధముగ సుషుప్తి యందు ఆత్మకు ఘ్రాణము, జిహ్వ, ఉచ్ఛారణము, శ్రవణము, విచారణము, స్పర్శ, విజ్ఞానము మొదలగు శక్తులు అన్నియును వున్నను ఆత్మభిన్నమగు వేరొకటి లేనందున వేరుగా వాసనచూచుట, రుచిచూచుట మొదలగు క్రియలు తెలిసికొనబడవు. ఇతరవస్తువు ఏదైన వున్నను చూచువాడు ఎవడైన వున్నను ఈ క్రియలు అన్నియును జరుగును. కాని సుషుప్తియందు వేర్వేరు వస్తువులను నిర్మించు అవిద్యయే శాంతించినప్పుడు ఎవరు ఎవరిని చూచుదురు?

బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్యఋషి జనకునకు చెప్పెను.

సలిల ఏకో ద్రష్టాఽద్వైతోభవత్యేష బ్రహ్మలోకః సమ్రాడితి హైనమనుశశాస యాజ్ఞవల్క్య ఏషాస్య పరమాగతిరేషాఽస్య పరమా సంపదేషోఽస్య పరమో లోకేషోఽస్యపరమ ఆనన్దఏతస్యైవాఽనన్ద స్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి ॥

ఓ జనకమహారాజా! ఆత్మ జలమువలె పరిశుద్ధమైనది, ఏకము, ద్రష్ట, అద్వితీయము. ఈ ఆత్మయే బ్రహ్మలోకము. బ్రహ్మ ప్రాప్తియే జీవాత్మయొక్క పరమగతి. అదియే శ్రేష్ఠమగు సంపద. అదియే జీవాత్మయొక్క పరమలోకము. అదియే దానికి పరమానందము. ఆ బ్రహ్మానందలేశముచేమాత్రమే - అంశముచేమాత్రమే ప్రాణులన్నియును జీవించును. ఆనందించును.

సశేషం

---

# ఆధ్యాత్మిక అనుభూతి

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

ఆధ్యాత్మికానుభవాలు ఒకానొక అతీతము, వాస్తవము అయిన సత్యాన్ని నిర్దేశిస్తాయని చెప్పవచ్చు. కారణం అట్టివారి అనుభవాలన్నీ సారూప్యం కలిగి వుంటాయి. ప్రాట్ [24] తన గ్రంథంలో పెక్కుమందికి కలిగిన యిట్టి అనుభవాలను పొందుపరుస్తారు. అలానే విలియమ్ జేమ్స్[25], ఆల్డస్ హాక్స్‌లీ[26] తమ గ్రంథాలలో మరికొందరి అనుభవాలను పొందుపరచారు. అంతేకాక అట్టి ఆధ్యాత్మికానుభూతులను పొందడానికి వివిధ మతాలకు చెందిన ఆత్మవేత్తలందరూ నిర్దేశించిన సాధనా విధానాలు కూడా ఒకే రీతిన వుండడం గమనార్హం.

వాస్తవమిలా వున్నప్పటికీ కొందరు మనస్తత్వ శాస్త్రవేత్తలు ఆధ్యాత్మికానుభూతులన్నీ నరాల దౌర్భల్యం వలన, మానసిక దౌర్భల్యంవలన కలుగుతాయని సిద్ధాంతీకరిస్తారు. కారణాలు అట్టి దౌర్భల్యాలుగల వారికి కల్గే భ్రాంతులను అట్టి అనుభవాలు పోలి వుండడం;

మరి కొందరిలో ఈ రెండంశాలూ కలిసి వుండటం; కాని విలియమ్ జేమ్స్ వ్రాసిన ఈ వాక్యం గమనార్హం; "కొన్ని మానసిక స్థితులు తక్కిన వాటికంటే శ్రేష్ఠతరమని మనం తలచడానికి కారణం వాటికాధారమైన దైహిక పరిస్థితుల గూర్చి మనకు తెలియడమా? కాదు! అందుకు కారణం వేరు. వాటి వలన మనకు ప్రత్యక్ష సంతోషం కల్గటం కానీ లేక వాటి వలన మనకు మేలు కల్గుతున్నదన్న విశ్వాసం వలనగాని అలా తలుస్తాము. "ఉదాహరణకు ఒక చిత్రకారుడి చిత్రకళా ప్రావీణ్యంగానీ, ఒక శాస్త్రజ్ఞుడి మేధాసంపత్తిగాని విలువైనవని మనం తలచడానికి కారణం వాటిని కల్గించే వారి నరాల వ్యవస్థలోని మార్పులు మనకర్థమవడం కాదు. ఆ కళాఖండం ఆ కళాకారుడికి, మనకు యిచ్చే సంతోషం కారణం. అలానే ఆ శాస్త్రజ్ఞుడు కనుగొన్న ప్రకృతి రహస్యం మనకు మనోవికాసం కల్గించడం కాని, లేక అది మానవాళికి ప్రయోజనకారి కావడముగాని కారణం. అలానే కళ వలన మనకు కలిగే రసానుభూతికి మనం విలువివ్వడానికి కారణం దానికి కారణమైన మన నరాల వ్యవస్థలలో కలిగే మార్పులు శాస్త్రీయంగా అర్థమవడం కాదు. నూతన శాస్త్ర సిద్ధాంతం వలన ప్రకృతి పట్ల మనకు కలిగే అవగాహన విషయంలోనూ అంతే. కనుక ఆధ్యాత్మికానుభూతికి కారణమైన నరాల వ్యవస్థలోని పరిణామాన్నిబట్టి దాని విలువను అంచనా వేయడం సరికాదు. ఆ కారణంగా అట్టి అనుభూతులను నిరసించిన మనస్తత్వ శాస్త్రజ్ఞులందరూ పొరపడ్డారనే చెప్పాలి.

అలానే ఆధ్యాత్మికానుభూతిలో అవాంఛనీయమైన కొన్ని అంశాలున్నంత మాత్రాన అకారణంగా వాటిని నిరసించటమూ సరికాదు. ఉదాహరణకు మతమంతా వాస్తవాన్నుండి పారిపోయి తండ్రివంటి రక్షకుని అన్వేషించటమేనంటారు ఫ్రాయిడ్. అట్టి అంశం మతాలలో కనిపించినప్పటికీ అదే వాటి సంపూర్ణతత్త్వం కాదని ఎందరికో కలిగిన ఆధ్యాత్మికానుభూతులు నిరూపిస్తాయి. కొన్ని రుగ్మతల వలన దైవ దర్శనాలను పోలిన చిత్తభ్రాంతులు కలిగే మాట వాస్తవమైనప్పటికీ దైవదర్శనాలన్నీ అట్టివని తీర్మానించడం సరికాదని పరిశోధిస్తే తెలియగలదు. జీవితానికి, సృష్టికీ ఒక అర్థము, లక్ష్యము వున్నాయని గుర్తించడమే మతం యొక్క ముఖ్యతత్త్వం. బ్రేడన్

[27] అను ఉపాధ్యాయుడు 2 వేల మందిని వారు మతాన్నెందుకు అనుసరిస్తున్నారని అడిగినప్పడు మతం తమ జీవితాలను అర్థవంతం చేస్తుందని పెక్కుమంది సమాధానమిచ్చారు.

నిజానికి ప్రతివాడు జీవితాన్నర్థవంతం చేసుకోజూస్తాడు. అట్టి అర్థమే లేకపోతే అతడి శక్తి, సంతోషము సడలి ఆత్మహత్యను గూర్చిన తలంపులు కలుగుతాయి.

అంతేగాక ఒకసారి ఆధ్యాత్మికానుభవం పొందిన వారందరూ దానికంత విలువనిచ్చి, దానికోసమంతగా ఎందుకు తపిస్తారు? వారికందువలన కలిగిన తృప్తి, శాంతులు ఒక కారణం. అట్టి అనుభవం వారి జీవితాలకు ఒకానొక విశ్వాత్మకమైన విలువను ప్రసాదిస్తుంది. అందువలన యావజ్జీవితమూ వారి నడవడి తదనుసారంగా మలచడటం గమనార్హం. అంటే అది మరువరాని అనుభవమన్నమాట.

జీవితాన్ని అర్థవంతం చేయడానికి ఎన్నో మార్గాలుండవచ్చు. ఉదాహరణకు తత్త్వశాస్త్రం, సృష్టిరహస్యాన్ని వివరింపజూడవచ్చు.

కానీ యిది బుద్ధిని మాత్రమే రంజింపచేయగలదు. అలానే సాటివారి శ్రేయస్సుకై పాటుపడడం కూడా విశేషమైన తృప్తినివ్వగలదు. కానీ అలా ఎందుకు చేయాలన్న హేతువు మాత్రం సమాధానం లేని ప్రశ్నగానే మిగిలిపోతుంది. మతమలాగాక అట్టి అనుభూతితో కూడిన సమాధానాన్ని కూడా ప్రసాదిస్తుంది. బుద్ధిస్థాయిలో తత్త్వశాస్త్రమిచ్చే ఆనందాన్ని, తృప్తిని ఆచరణలో సాటిజీవుల శ్రేయస్సు కొరకు చేసే కృషి యిచ్చే తృప్తినీ, కళ ప్రసాదించే నిర్హేతుకమైన తృప్తినీ ఆధ్యాత్మికానుభూతి ఒక్కటే ప్రసాదిస్తుంది. అట్టి విశాలమైన దాని పర్యవసానమే ఆధ్యాత్మికానుభూతికి అట్టి విలువను కల్పిస్తుంది.

మనిషిలో వ్యత్యృవు, శూన్యత, అర్థరాహిత్యము, మరణానంతరం ప్రాప్తించగల నరకాన్ని గూర్చిన ఆందోళనల వంటివి ఒక విధమైనవి (Existential anxiety), నరాల బలహీనతల వలన కలిగే ఆందోళన (Neurotic anxiety) ఒక విధమైనదనీ, ఈ రెండు రకాల ఆందోళన నుంచీ మతానుభూతి మానవునికి విముక్తి నివ్వగలదనీ, అదే దాని పరమ ప్రయోజనమనీ పాల్‌టిల్లిచ్ [28] అంటారు.

మతాన్ని విశ్వసించేవారిలో ఎక్కువ మంది స్వతంత్రమైన యోచన కలిగి యుండకపోవడం వలన మతమే ఒక గుడ్డినమ్మకమన్న దురభిప్రాయం కొందరికి కలుగుతుంది. ఈ అపోహను తొలగించడానికి ఉత్తమ పరిణతి చెందిన మతవిశ్వాసానికి, అపరిపక్వ మతవిశ్వాసానికీ గల బేధాన్ని గుర్తించాలి. ఈ విషయమై క్లార్క్ [29] యిలా అంటారు : పరిణతి చెందిన వ్యక్తుల ఆధ్యాత్మిక జీవితంలో యోచన, స్వాతంత్ర్యము కనిపిస్తాయి. గుడ్డిగా నమ్మి మతం పేరిట వంచించబడాలని సంసిద్ధులుగా వుండడం, భగవంతుడు ఆగ్రహం వంటి భావాలుగల వ్యక్తి వంటివాడని తలచడం అపరిపక్వతకు చిహ్నం.

చాపల్యానికి లక్షణమైన స్వార్థపూరితమైన మతవైఖరి అపరిపక్వతకు లక్షణం. వేరొక

> ***జీవితానికి, సృష్టికీ ఒక అర్థము, లక్ష్యము వున్నాయని గుర్తించడమే మతం యొక్క ముఖ్యతత్త్వం. బ్రేడన్ అను ఉపాధ్యాయుడు 2 వేల మందిని వారు మతాన్నెందుకు అనుసరిస్తున్నారని అడిగినప్పుడు మతం తమ జీవితాలను అర్థవంతం చేస్తుందని పెక్కుమంది సమాధానమిచ్చారు.***

యోచనలేక ఎంతసేపూ తన కోరికలను మాత్రం తీర్చేవాడు భగవంతుడని అట్టి వ్యక్తులు తలుస్తారు. ఉత్తమ మత వైఖరి కేవలం ఆత్మ వికాసం కొరకు మాత్రమే భగవంతుని ఆశ్రయిస్తుంది. గుడ్డిగా ఆచారాలను పాటించడంతో తృప్తిపడడం,

తనకర్థంగాని మత సూత్రాలను వల్లించడం అపరిపక్వతకు చిహ్నం. మనస్తత్వవేత్త ఆల్‌పోర్ట్ [30] యిలా అంటారు : ''సామాన్యమైన భక్తులు మతాచరణ విషయంలో గాని, విశ్వాసం విషయంలో గాని యితరులు విమర్శించినప్పుడు సమర్థించుకోచూస్తారు. కానీ పరిణతి చెందిన ఆస్తికుడు చక్కటి ఆత్మవిమర్శ, లోచూపులతో వెనుకాడడు. నిర్దుష్టమైన మతవిశ్వాసం భక్తుల జీవితమంతటినీ చక్కగా సంస్కరిస్తుంది. అతడు ప్రాపంచిక జీవితంలో కూడా మత ధర్మాలనుల్లంఘించడు. అంటే అతడి తత్త్వదృష్టి జీవితంలోని అన్ని అంశాలనూ దైవంతో సమన్వయ పరుస్తుంది. అంతేకాక అట్టివ్యక్తి తనకు తెలియనిదెంతో వున్నదని గుర్తించి విభిన్న దృక్పథాలపట్ల, యితరత్రాలపట్ల సహనము కలిగివుంటాడు. దేవుడున్నాడన్న దృఢవిశ్వాసం కల్గి వుంటాడు గానీ 'అతడు నేను విశ్వసించిన రీతిన మాత్రమే వుంటాడు' అని మూర్ఖించడు. అతడి విశ్వాసంతో అతడికి గల ఆధునిక శాస్త్రపరిజ్ఞానమంతా సమన్వయంపడి వుంటుంది."

సంపూర్ణ వికాసం చెందిన ఆత్మవేత్త యొక్క లక్షణాలను జేవ్స్ యిలా వర్ణిస్తారు : ''ఆదర్శప్రాయమైన ఆధ్యాత్మికత, ఆచరణలో చూపుతాడు మహాత్ముడు; అల్పమైన ప్రాపంచిక కోరికలకతీతమైన, విశాలమైన జీవితమే తనదన్న భావం కలిగి వుంటాడు. దైవశక్తిలో తన వ్యక్తిత్వం ఒక అంతర్భాగమని గుర్తించి దానికి (దైవానికి) తన స్వార్థాదిభావాలను పరిత్యజించి జీవిస్తాడు. అలా స్వార్థాన్ని త్యజించడం వలన ఉత్తమమైన స్వేచ్ఛ, సాటిలేని సంతోషాన్ని పొందుతాడు. అతడి భావావేశాలు ప్రేమ, సామరస్యాలలో కరిగిపోతాయి.

నాస్తికులు తలచినట్లు ఆధ్యాత్మికానుభూతి, మత విశ్వాసము, మానసిక శారీరక దౌర్బల్యాలకు, రుగ్మతలకు కారణంగానీ, పర్యవసానం కానీ కావు సరికదా తద్విరుద్ధము, శ్రేష్ఠము అయిన పర్యవసానాలను కలిగి యుంటాయని చెప్పవచ్చు. మానసిక ఆరోగ్యము, జీవితంలో సంతోషము, తమ సమస్యలను పరిష్కరించుకొనే సామర్థ్యమూ పెరుగుతాయని అట్టి వారి జీవితాలను గూర్చి పరిశీలించిన క్లార్క్ (Clark) అంటారు. అంతేకాక యూంగ్ అను మనస్తత్వ శాస్త్రవేత్త యిలా అంటాడు : "35 సం॥ల పైబడి, నరాల బలహీనతకు గురియైన వ్యక్తులందరిలో మతసంబంధమైన చిక్కులు మౌలికంగా లేని వారిని నేనెన్నడూ చూడలేదు". అంటే మతం యొక్క ఆవశ్యకతను, నిజమైన మతత్త్వాన్ని అర్థం చేసుకోని వారికి జీవితంలో సమస్యలెదురైనప్పుడు ఏదో ఒక స్థాయికి చెందిన నరాల రుగ్మత తప్పదంటారు. చికాకు, భయము, అసూయలాంటి భావాలన్నీ అట్టి రుగ్మత యొక్క చిహ్నాలు. ఇట్టి వారు మతం యొక్క తత్త్వాన్ని సరిగా అర్థం చేసుకొని అలవరచుకుంటే అట్టి రుగ్మతలు అదృశ్యమై స్వస్థత, సంతోషము కల్గుతాయి. ఇది గుర్తించని నాస్తికులు కష్టాలెదుర్కోలేని పిరికివాడు మాత్రమే దైవాన్నాశ్రయిస్తారని పొరబడతారు. అట్టి బలహీనులు కూడా వాస్తవానికలానే చేయవచ్చును. కానీ అంత మాత్రాన అందరూ అట్టివారేననడం అసత్యం. గాంధీజీ, అరవిందఘోష్, బాలగంగాధర్ తిలక్, మార్టిన్ లూథర్ కింగ్‌ల దగ్గర నుండీ మతప్రచారం కోసం సంతోషంగా జీవితాలను అర్పించినవారిని తలచుకుంటే అలా చెప్పడం సాధ్యం కాదు.

---

24. J.B. Pratt, The Religious Consciousness : A Psychological study, Chapter 16.
25. William James, The varieties of Relgious experiences.
26. Aldous Huxley, The Perennial Philosphy.
27. C.S. Barden, Why People are Religious - A Study in Religious Motivation.
28. Paul Tillich, The Courage to Be.
29. Walter Houston Clark, The Psychogy of Religion.
30. G.W. Allort, Personality.

---

*('విజ్ఞాన వీచికలు' గ్రంథం సౌజన్యంతో)*

# శ్రీ సాయిలీలామృత కృతజ్ఞతార్చన -2012

మహనీయులలో కోహినూర్‌వంటివారు, పూర్ణదత్తావతారము అయిన శ్రీ శిరిడీ సాయినాధుని దివ్యచరిత్ర గ్రంధము 'శ్రీ సాయిలీలామృతము'ను ప్రతి సంవత్సరము మే నెల రెండవ ఆదివారము భక్తితో పూజించుకుంటున్నాము కదా. ఈ ఉత్సవము ప్రారంభమయి రెండవసంవత్సరమయిన ఈ 2012లో భక్తి శ్రద్ధలతో ఈ అర్చనామహోత్సవాన్ని జరుపుకున్నాము. నాగోలులో జరిగిన ఈ దివ్యోత్సవానికి మండపము చక్కగా సిద్ధం చేయబడింది. 'శ్రీ సాయిలీలామృతము' గ్రంధాన్ని పోలిన పెద్ద ఫోటో రూపంలో శ్రీ సాయినాధులు ఆశీనులైనారు. ఆర్తులకు, భక్తులకు దత్తమైన వారు కదా మహాత్ములు, మీకు అండగా మేమెప్పుడూ వున్నామంటూ వారందరూ ఆశీనులై మండపాన్ని పరమపవిత్ర స్థలంగా మార్చివేశారు.

శ్రద్ధ, సబూరీలు పెంపొందించుకుంటూ ఆనందమయమైన సమాజనిర్మాణానికి దోహదం చేస్తూ జీవితాలను ధన్యం చేసుకుంటున్న భక్తులెందరో ఆశీనులైనారు. ప్రతివారూ ఒక పీటమీద తెల్లని వస్త్రము ఆసనంగా వుంచి, 'శ్రీ సాయి లీలామృత' గ్రంధాన్ని దానిపైన వుంచి పూజించుకోవటానికి సిద్ధమైనారు. జయకారములతో భజన ముగిసినంతనే బాబుగారు పూజ ప్రారంభించారు. షోడశోపచార పూజ, అష్టోత్తర శతనామావళితో దిగ్విజయంగా జరిగింది. కల్పవృక్షము, కామధేనువు, చింతామణి అని కొనియాడబడిన శ్రీ సాయినాధుని దివ్యచరిత్రమును హృదయ పూర్వకంగా సేవించుకోవడము ఎంతటి మహద్భాగ్యము!! ఈ గ్రంధాన్ని పారాయణ చేసి, అందులోని సూక్తులను ఆచరించి కోరిన విధంగా లబ్ధి పొందుతున్న వారుగదా ధన్యులు. ఒక సైంటిస్టు experiment చేసి result చూసుకొని పొందే ఆనందము లాగా పారాయణ చేసి సుఖాన్ని, శాంతిని పొంది ఆనందించే భక్తుని తన్మయత్వముకంటే ఏమి కావాలి! పుణ్యము, పురుషార్ధము అన్నారు పెద్దలు. ధర్మ సమాజ నిర్మాణానికి కృషి చేస్తూ పుష్కలంగా పుణ్యము, న్యాయబద్ధమైన కోరికలన్నీ తీర్చుకుంటూ పురుషార్ధమూ పొందే 'శ్రీ సాయి లీలామృత' పారాయణ, అర్చన కంటే ఉత్తమమైన కార్యక్రమము ఏముంటుంది!!

పూజనంతరము బాబుగారు ప్రసంగిస్తూ, "ఎంతో గొప్పది, ఆత్మీయమైనది ఆయిన 'శ్రీ సాయి లీలామృతము' అంటే ఎంతో ఇష్టం కలగడం సహజమే. అయితే ఒక విషయం జాగ్రత్తగా చూచుకోవాలి. ఇలాంటి కార్యక్రమాలు ఎప్పుడు జరిగినా ఒక సంకుచిత మత తత్త్వభావం ఏర్పడే అవకాశంవుంది.

మన గ్రంధమే గొప్పది, ఇంకొకటి కాదు. దీనిని ఆశ్రయించినవారే లబ్ధి పొందుతారు, వేరేవాళ్ళు తరించరు వంటి భావాలు బలీయమవుతాయి. కానీ అది సరికాదు. ప్రపంచంలో ఎవరు ఎక్కడ భగవంతుని ప్రార్ధించినా, రాముని సేవించినా, శివుని పూజించినా, ఖురాను, బైబులు పఠించినా అందరూ ఆ భగవంతునికి చేరువయ్యేవారే. అయితే వాటిలోని విషయాలు సరిగా అర్ధంకావటానికి లీలామృతము చదువవలసి రావచ్చు. ఇది కదా అందులో చెప్పిన విషయానికి అర్ధం అని తెలుసుకోవచ్చు. అంతేగానీ లీలామృతము ఒక్కటే గొప్పదని, సాధనమని తలచరాదు. భక్తి ప్రపత్తులతో దానిని సేవించడము ఆచరించడమూ ముఖ్యము అంతేగాని వేరే సంకుచిత భావాలు రాకుండా చూసుకోవాలి", అని చెప్పారు.

శ్రీ సాయిలీలామృతము రచించి, దాతలకు దాత అభయప్రదాత అయిన శ్రీ భరద్వాజ మహరాజ్‌ని, దివ్యజనని అలివేలుమంగమ్మను మనసా, వాచా నమస్కరిస్తూ ఈ కృతజ్ఞతార్చనా మహోత్సవాన్ని భక్తులందరూ దివ్యముగా పూర్తిచేశారు.

## Books on Sri Ramakrishna Paramhansa and Swami Vivekananda

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 |
| భారతం నా అమర భారతం | 20.00 |
| జ్ఞాన యోగం | 30.00 |
| బుద్ధి యోగం | 15.00 |
| కర్మ యోగం | 15.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 |
| స్వామి వివేకానంద (2 భాగాలు ) | 60.00 |
| మహాభారతం | 5.00 |
| నా అమర సందేశం | 30.00 |
| భక్తి యోగం | 10.00 |
| సందేశ తరంగిణి(కొలంబో-అల్మోరా) | 40.00 |
| వివేక సూర్యోదయము | 20.00 |
| దైవంతో సహజీవనం | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 |
| మువివేకానంద లేఖావళి | 25.00 |
| My Idea of Education | 34.00 |
| Karma Yoga | 18.00 |
| God Lived with Them | 170.00 |
| The Lived with God | 140.00 |
| Raja Yoga | 36.00 |
| Bhakti Yoga | 16.00 |
| Jnana Yoga | 50.00 |
| Letters of Swami Vivekananda | 110.00 |
| Reminiscences of Swami Vivekananda | 100.00 |
| Talks with Swami Vivekananda | 58.00 |
| Complete Works of Swami Vivekananda-9 | 110.00 |
| Meditation and Its Methods | 18.00 |
| Vivekananda on Himself | 100.00 |
| Ramakrishna and Vivekananda | 7.00 |
| Tales and Parables of Sri Ramakrishna | 45.00 |
| Lectures from Colombo to Almora | 40.00 |
| Complete Works of Swami Vivekananda | 50.00 |
| Sayings of Sri Ramakrishna | 25.00 |

జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయిమాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయిమాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు-పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine Subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone :040-20063300
**OR, Sri Manga Bharadwaja Trust , Ongole Branch Office**
Kothapeta, Kondaiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.** **Magazine** మరియు **General Donations** ను **"Sri Manga Bharadwaja Trust"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Annadanam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Sai Master)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Ashramam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Peace Foundation)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల్వారా పంపగలరు

**Books order** ను **"Sri Manga Bharadwaja Trust (Publications)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్మ్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

## ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

## BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

## BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |


SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300


**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**

*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*

నేను దర్శించిన మహాత్ములు

# శ్రీ పాకలపాటి గురువుగారు



పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

**జూన్ 4, 2012 శ్రీశ్రీశ్రీ పాకలపాటి గురువుగారి జన్మదిన మహోత్సవ సందర్భంగా ఆచార్యులు రచించిన వారి దివ్య చరిత్రను పారాయణ చేసి తరిద్దాం!!!**

**ప్రతులకు : -**


**Sri Manga Bharadwaja Trust**
**Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068**
**Phone: 040 65741550**






ఈ నలుగురు మహనీయులు మనకు చెప్పే నీతి ఏమిటి?

.......వచ్చే సంచికలో

edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust, ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.

POSTAL REGD.NO.PRAKASAM/16/2012-2014
REGD.NO. 37926/83

ESTABLISHED : 1983

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

# సాయిబాబా

JULY 2012 సంచిక : 03 సంపుటి : 30 వెల - ₹ 10/-



శ్రీ గురుపూర్ణిమ ప్రత్యేక సంచిక

గురుమధ్యే స్థితం విశ్వం విశ్వమధ్యే స్థితో గురు: ।
గురుర్విశ్వం నచాన్యోస్తి తస్మై శ్రీ గురవే నమ: ॥



# ప్రథమ దర్శనంలోనే అంతటి అనుభవం ఎలా కలిగింది?

*(భక్తురాలి ప్రశ్నకు మాస్టరుగారి సమాధానం)*

**ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

**ప్ర :-** అన్ని సంస్కారాలలాగే హృదయపూర్వకమైన భక్తిగూడా పూర్వజన్మ సుకృతమేమో, లేకుంటే మీవంటివారికి మొదటి దర్శనంలోనే అంతటి అనుభవము, ప్రశాంతత కల్గడము, నావంటివారు నిత్యదర్శనము చేస్తున్నా భక్తిగూడ మిగిలిన భావాలలాగే తాత్కాలికము మాత్రమే అవడమేమి? అలా అయితే సాయికోరిన నిష్ఠ సబూరీలను అర్పించడం మన చేతులలో ఏమున్నది?

- ఒక పాఠకురాలు. ఎర్రమంజిల్, హైదరాబాదు.

**జ :-** అన్ని సంస్కారాలవలె భక్తికూడ పూర్వ జన్మ సుకృతమే. పూర్వజన్మ సుకృతమంటే వెనుకటిజన్మలలో మనం చేసుకొన్న మంచియొక్క ఫలితమే. కనుక మనము ఈ జన్మలో శక్తినంతా వినియోగించి కృషిచేసి అట్టి ఫలితాల్ని పొందగల్గడం మన చేతుల్లోనే వుంది. అందుకే "ఉద్ధరేదాత్మ దాత్మానాం" - "తనను తానే ఉద్ధరించుకోవాలి" అని భగవద్గీత చెప్పింది. కానీ సాయి చెప్పినట్లు, "ఈ మార్గంలో పయనించటం దున్నపోతు నెక్కి నాన్స్టాపుట్ దాటటంకంటే కష్టం. మనం శక్తినంతా వినియోగించి కష్టపడితేగాని ఫలితముండదు. మన యత్నం చాలినంత తీవ్రంగా జరిగితే ఫలితం ఈ జన్మలోనేకన్పించవచ్చుగూడ. ఇది స్వానుభవము. సంవత్సరం 1955 లో నా ఉపనయనానికి దైవజ్ఞులు పెట్టిన ముహూర్తబలం, ఆ క్రతువులోని వేదమంత్రాలు, మాపెద్దన్నగారి పూజలు, ఉపవాసాలు వారి అబ్బాయిని రక్షించలేకపోవటం చూచి తీవ్రమైన నాస్తికభావం, అంతకంటేగూడ అన్వేషణ నాలో మేల్కొన్నాయి. నిరంతరము జీవితము, పరమావధి, చావుపుట్టుకల తత్వము, ఆత్మ- అనాత్మలగురించి తీవ్రంగా, ధృఢంగా 1961 వరకు ఆలోచన కొనసాగింది. రాత్రిళ్లు 3,4 గంటలకంటే నిద్రయెరుగను. వ్యక్తిగతమైన అభిమానంతో ఏ గురువుకూ తల తాకట్టు పెట్టుకోలేదు. గుడ్డిగా ఎవరు చెప్పినదీ అనుసరించలేదు. ఆధునిక విజ్ఞానం అధ్యయనంచేసి చివరకు ఆస్తికభావంకల్గినా సాధనమార్గంగూడా ఎవరు చెప్పినా అనుసరించలేదు. తెలిసో తెలియకో చేసిన ఆ కృషి ఫలితమే శిరిడీలో సాయి నుండి నిరంతరము వర్షిస్తున్న అనుగ్రహానికి ప్రాతుణ్ణి చేసింది. అట్టి జిజ్ఞాసలో ఏ ఉద్యోగమూ నన్ను ఆకట్టుకోలేకపోయింది. అయితే అన్నగారి అబ్బాయి చనిపోయినప్పడు అందరివలె శోకించి కొంతకాలానికి బాధ మరచిపోకుండా చేసింది సుకృతమే కావచ్చు. సద్గురువుయొక్క అనుగ్రహము ఎప్పడూ మన సుకృతమువలన-అంటే తీవ్రమయిన కృషివలన-సార్ధకమవుతుంది. అట్టి కృషి ఫలితంగానే తర్వాత గూడ ఎవరో శ్రమించి వ్రాసిన గ్రంధాలలోని విషయాలను అపహరించి సొంతం చేసుకోనివ్వలేదు. ఏ చిన్న విషయం ఎక్కడ నేర్చుకొన్న ఆ విషయం రచనలో ప్రకటించనిదే మనశ్శాంతి ఉండదు.

**అన్నగారి అబ్బాయి చనిపోయినప్పడు అందరివలె శోకించి కొంతకాలానికి బాధ మరచిపోకుండా చేసింది సుకృతమే కావచ్చు. సద్గురువుయొక్క అనుగ్రహము ఎప్పడూ మన సుకృతమువలన-అంటే తీవ్రమయిన కృషివలన-సార్ధకమవుతుంది. అట్టి కృషి ఫలితంగానే తర్వాత గూడ ఎవరో శ్రమించి వ్రాసిన గ్రంధాలలోని విషయాలను అపహరించి సొంతం చేసుకోనివ్వలేదు.**

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

SRI MANGA BHARDWAJA TRUST

సంపుటి: 30 జూలై-2012 సంచిక: 03

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


## పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"

### విషయసూచిక




చిరునామా

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**



చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి

ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ ఆర్.ఎస్. శశిధర్, పిహెచ్. డి

**చందా వివరములు**

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10-00 |
| సంవత్సర చందా | : రూ. 100-00 |
| రాజపోషకులు | : రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000-00 |


*సద్గురువును గుర్తించి ఆశ్రయించడం ఎంతో కష్టం. ద్వాపర యుగంలోనే శ్రీకృష్ణుడు "ఎన్నో వేలమందిలో ఆత్మజ్ఞానం కోసం ప్రయత్నించేవాడు-ముముక్షువు ఏ ఒక్కడో వుంటాడు" అని చెప్పారు. ఇక ఆత్మజ్ఞానియైన సద్గురువు ఆ యుగంలోనే అంత అరుదైతే ఈ కలికాలంలో ఊరికి ఒక్కరు, వీధికొక్కరు, సద్గురువులుగా వెలవడం ఎంత విడ్డూరం! ఇందరు నకిలీ గురువుల మధ్య సిసలైన సద్గురువును గుర్తు పట్టేదెలా?*

**- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ**

# గురుతత్త్వం

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

"నీ జీవిత పరమావధి ఏమిటి?" అనడిగితే ''ముక్తి'', ''తరింపు'', ''ఆత్మసాక్షాత్కారం'', ''భగవత్సాక్షాత్కారం'' అని చెప్పని ఆస్తికులు మనదేశంలో అరుదనడం అతిశయోక్తికాదు. ఈ కోరికతోనే వీరిలో ఎక్కువమంది పూజలు, యాత్రలు, భజనలు చేస్తారు. ఇతర కోర్కెలతో పూజించేవారి సంఖ్యగూడ అధికమనే చెప్పాలి. ''అదెలా పొసగుతుంది? కోరికలను త్యజించి ఆత్మసమర్పణ చేస్తేగదా అది లభించేది!" అనడిగితే, "ఎంతైనా మనం మానవమాత్రులంగదా! మనమింకా కోరికలను జయించే స్థితికి రాలేదు. ఆస్థితిని ఆయనే ప్రసాదించాలి. అంతవరకూ మనకిది తప్పదు'' అంటారు ఎక్కువమంది. అంటే ప్రతివారిలో యీ అంతస్సంఘర్షణ వుంటుందనే చెప్పాలి: ఒక వంక కోరికలు వీడలేరు; మరొక వంక ఏమీ కోరనిస్థితిని, అందుకు తగిన ఆధ్యాత్మికానుభూతిని పొందాలనే తపన. ఈ స్థితిని తమ యత్నంతో దాటలేని వారు 'సత్పురుషుల'ను, 'గురువు'లనూ వెతుక్కునేలా చేస్తుంది. అందుకే అంతు లేకుండా మనదేశంలో పెరుగుతున్న జనాభా సంఖ్యకు తగురీతిన పెరిగేది మనదేశంలో స్వాముల, గురువుల సంఖ్య!

భక్తులు యీ 'సాధువులను' దర్శించడంతో, ఉపదేశాల వ్యాపారం బాగా పెరుగుతుంది. 'మా సాంప్రదాయం గొప్ప' అంటే 'మా సాంప్రదాయం గొప్ప' అన్న పోటీలు కన్పిస్తాయి - వివిధ 'శిష్య' కూటములలో. ఒక గురువుగారి శిష్యులు మరొక గురువుగారి శిష్యులను 'అపహరించి' తమ సాంప్రదాయానికి మళ్ళించాలన్న యత్నాలు, తత్ఫలితంగా ప్రతి గురువూ తమ శిష్యులు మరోగురువుగారిని గానీ, వారి శిష్యులను గానీ కలవకూడదన్న ఆంక్ష పెడతారు. అలా కలవడం గురుధిక్కారమనీ, గురుద్రోహమనీ, దానిపర్యవసానం పారలౌకికమైనా-మహా విపత్తుతో కూడియుంటుందనీ భయపెడతారు. ఒకవంక ఆ గురువును అనుసరించలేక, భయంతో విడువలేక సతమతమవుతారు అమాయక శిష్యబృందాలు. బాహాటంగానో, వ్యంగ్యంగానో ఒక 'గురువు', వారి 'శిష్యులూ' మరొక 'గురువు'నో, వారి 'శిష్యుల'నో విమర్శించడం జరుగుతుంది. అంటే ఆధ్యాత్మికరంగంలో గూడ రాజకీయాలు, వ్యాపారమూ చోటుచేసుకున్నాయి. ఇదంతా చూచి వెగటుపుట్టి అసలు ఆధ్యాత్మికత, గురుతత్వాలే మోసమనే నిర్ణయానికి పలువురు రావడానికిది కారణమవుతుంది.

'గురు'కులాల మధ్య పోటీ తీవ్రంగా సాగుతుండడంతో భక్తులను చేజారిపోకుండా చూచుకొనేందుకు కొన్ని సదుపాయాలు రూపొందాయి. "ఈ ఆధ్యాత్మిక సాధన అతిరహస్యం. ఇది మావద్ద వ్యక్తిగతంగా నేర్చుకోవాలి!" అని ఎఱవేస్తారు. ఆ తర్వాత ''ఇది యితరులకు చెప్పకూడదు" అని కట్టుదిట్టం చేస్తారు. నాటినుంచి గురుశిష్యులమధ్య ''అగ్రిమెంటు'' (ఒప్పందం) ఏర్పడుతుంది. ఆ గురువేది ఆజ్ఞాపిస్తే అది తిరిగి ప్రశ్నించకుండా వినాలి. లేకుంటే 'నరకం' ప్రాప్తిస్తుంది. అంతవరకూ చేసిన పుణ్యం బుగ్గి అయిపోయి, దోషం తగులుతుంది! అనతి కాలంలో భక్తుడి ఆంతర్యం సత్యాన్ని గుర్తించేస్తుంది. కాని ఆ అసత్యాన్ని విడువడానికి నిజమైన ఆధ్యాత్మికత ఏమిటో, ఎందుకో, ఎలానో తెలియక పోవడంవలన 'గురువు'ను వీడడానికి భయపడతాడు. అటువంటి భయాన్ని, ఆశ్చర్యకరమైన కల్పనలనూ ప్రచారంచేసి యిలా అమాయకులను ప్రత్యక్ష నరకంలో పడవేసే 'గురువు'లు ('గురువు' అంటే బరువని ఒక అర్థం!) నేడెందరో!

ఇట్టి కలికాలంలో గురుతత్వాన్ని లోకానికి తెల్పడానికా అన్నట్లు శ్రీ శిరిడీసాయిబాబా, శ్రీ అక్కల్‌కోట స్వామి, శ్రీతాజుద్దీన్ బాబా, శ్రీగజానన్ మహరాజ్, శ్రీరమణ మహర్షి వంటి నిజమైన



గురువులెందరో అవతరించారు. వీరిలో ఏ ఒక్కరూ పైన చూపిన అంశాలలో ఒక్క దానినీ కలిగియుండలేదు. ఇది గమనార్హం. ముముక్షువులు, ఆస్తికులూ వీరిచరిత్రలు, బోధలు బాగా శ్రద్ధగా చదివితే ఆధ్యాత్మిక తత్త్వమేమో కొంత తెలుస్తుంది. పై చిహ్నాలు కన్పించగానే తగుజాగ్రత్తలో వుండడానికి వీలవుతుంది. ఈ విషయంలో కొండగుర్తులు రెండున్నాయి. నిజమైన గురువెన్నడు తాను గురువని, యితరులు శిష్యులనీ తలచడు. జ్ఞానియైనవారికి సకలజగత్తూ అందరికీ అందుబాటులోనున్న మంచినీటి చెరువుల్లావుంటారు. ఎవరి శ్రద్ధ, బుద్ధికుశలతనుబట్టి వారు వారికి తగిన బోధను పొందుతారు. ప్రత్యేకమైన ఉపదేశాలుండవు. వారి ఆచరణ, సామాన్యమైన పలుకు, దివ్యమైన లీల, మౌనము భక్తుల ప్రశ్నలకు వారిచ్చే సమాధానాలు -- వీటిలో ప్రతి ఒక్కటీ శ్రీ కృష్ణుడు గోవర్ధనగిరిని కొనగోట వహించినట్లు సకల ఆధ్యాత్మికత యొక్క సారాన్ని వహిస్తాయి, వారి సాన్నిధ్యమే ఉపదేశం. శ్రీసాయి తమ గురువును సేవించిన కథ చదివినా, సాయిచరిత్ర చదివినా యిది బాగా అర్థమవుతుంది.

ఇలాటి సద్గురువులు తమ 'శిష్యులను' 'గురుద్రోహం' వంటి భయంకర పదజాలంతో కట్టిపెట్టుకోరు. అవధులులేని వారి నిర్హేతుకమైన ప్రేమ సహజంగానే భక్తులను ఆకట్టుకుంటుంది. అన్యమైన భయాలతో అంటి పెట్టుకోవలసిన దుస్థితి గుప్తమైన తిరుగుబాటే, ద్వేషమే! ఏనాడో అంతర్యంలో అట్టి భక్తులు వారి కుత్సితగురువులకు దూరమయ్యారనే చెప్పాలి, భక్తి ప్రేమరూపం, ప్రేమలేనిదే ఆధ్యాత్మికతలేదు. ఆజ్ఞలతో అదుపులో పెట్టేది ప్రేమకాదు.

నిజమైన గురువులు వారినాశ్రయించిన స్వేచ్ఛను ఆటంకపరచరు - ఎట్టి ఆంక్షలతోనూ, వారిభక్తులు ఏమహనీయులనైనా, సాధువులనైనా యదేచ్ఛగా దర్శించవచ్చు. వారికి నచ్చినదానినెన్నుకోవచ్చు. "నేను చెప్పింది నమ్మితీరాలి"

**'మా సాంప్రదాయం గొప్ప' అంటే 'మా సాంప్రదాయం గొప్ప' అన్న పోటీలు కన్పిస్తాయి - వివిధ 'శిష్య' కూటములలో. ఒక గురువుగారి శిష్యులు మరొక గురువుగారి శిష్యులను 'అపహరించి' తమ సాంప్రదాయానికి మళ్లించాలన్న యత్నాలు, తత్ఫలితంగా ప్రతి గురువూ తమ శిష్యులు మరోగురువుగారిని గానీ, వారి శిష్యులను గానీ కలవకూడదన్న ఆంక్ష పెడతారు. అలా కలవడం గురుధిక్కారమనీ, గురుద్రోహమనీ, దానిపర్యవసానం పారలౌకికమైనా-మహా విపత్తుతో కూడియుంటుందనీ భయపెడతారు.**

భగవత్స్వరూపంగా గోచరిస్తుంది. ఆ దైవరూపాలుగనే కన్పిస్తారు. కనుక వారిని శిష్యులని తలచేదెలా? కనుకనే తమ 'శిష్యుల'ను ఎట్టి నిబంధనలతోనూ వారు కట్టివేయరు. వారి వద్ద మరుగుపరచుకోవలసిన 'యోగరహస్యాలు'ండవు. అనరు. అనుభవంలో మనకే అట్టినమ్మిక కల్గుతుంది. ఎక్కడ తిరిగినా చివరికి ఆత్మ నిజమైన శాంతిస్థానాన్ని చేరుతుంది, శాస్త్రం గూడ "తేనె మీద ప్రీతిగల తేనెటీగ వివిధ వర్ణాలు, రూపాలుగల పువ్వులన్నింటినీ దర్శించి, తేనెను గ్రహిస్తుందో అలానే ముముక్షువు వివిధ

గురువులను దర్శించి, జ్ఞానాన్ని ఆర్జించాలని -గురుగీత". జీవితాంతం కలసి జీవించవలసిన భార్యనో, భర్తనో పొందాలనుకున్నప్పడే ఎన్నో సంబంధాలు చూస్తాముగదా! అలానే దీనికోసం సద్గురువుల చరిత్రలనుచదివి వారి లక్షణాలనాకలింపు చేసుకుని, కొంతైనా బోధనర్థంచేసుకున్నాక వివిధ సత్పురుషులను దర్శించాలి. మనస్సు తన సంస్కారానికి తగిన గురువును స్వయంవరం చేసుకొని స్థిరపడుతుంది. లేకుంటే ముందు చెప్పిన నరకం తప్పదు.

ఏ గురువును దర్శించినా క్షుణ్ణంగా వారిని పరిప్రశ్న చేసి సందేహనివృత్తి చేసుకొనే అవకాశాన్నిస్తారు సద్గురువులు. 'భగవద్గీత' కూడ అలానే చేయమని చెబుతుంది. అర్జునుడు వేసిన ప్రశ్నల పరంపరకు ఓర్పుగా సమాధానమిచ్చాడు కృష్ణుడు. "గురువుతో చర్చ తగదు!" అని బెదరగొట్టలేదు. అలానే నిజమైన గురువు తనను భక్తులు పరీక్షించడానికంగీకరిస్తాడు. రామకృష్ణపరమహంస వివేకానందుడితో "నీకు తృప్తి కలిగేదాకా పరీక్షించుకో!" అన్నారే గాని, వారించలేదు. శ్రీసాయి సర్వజ్ఞులవునోకాదో పరీక్షించాలని శ్యామా, సాయికి భక్తులు సమర్పించిన రెండు రూపాయలు దాచాడు. తర్వాత అతడింట దొంగతనం జరిగింది. సాయితో బాధను చెప్పుకోగా "నీ యింట దొంగతనం జరిగితే చెప్పుకోడానికి నేనైనా వున్నాను, నావి రెండు రూపాయలు పోయి ఆరు నెలలైంది. నేనెవరితో చెప్పుకోనూ?" అన్నారు గాని, "పుండాకోరా! నన్ను పరీక్షిస్తావటరా!" అనలేదు. భక్తులచేత పూజించబడుతున్న సాయిని ఆసనం మీదనుంచి లెమ్మని గద్దించాడు నానావల్లి. సాయి వినమ్రులై లేచారు. క్షణం కూడా ఏమారకుండా తమ నమ్రతను కాపాడుకొంటున్న సాయి యొక్క నిరహంకారానికీ, నిర్మోహానికీ జోహారులని నానావల్లీ ఆత్మ సమర్పణ చేసుకున్నాడు.

**శ్రీసాయి సర్వజ్ఞులవునోకాదో పరీక్షించాలని శ్యామా, సాయికి భక్తులు సమర్పించిన రెండు రూపాయలు దాచాడు. తర్వాత అతడింట దొంగతనం జరిగింది. సాయితో బాధను చెప్పుకోగా "నీ యింట దొంగతనం జరిగితే చెప్పుకోడానికి నేనైనా వున్నాను, నావి రెండు రూపాయలు పోయి ఆరు నెలలైంది. నేనెవరితో చెప్పుకోనూ?" అన్నారు గాని, "పుండాకోరా! నన్ను పరీక్షిస్తావటరా!" అనలేదు.**



వ్యాసపూర్ణిమ అనబడు 'గురుపూర్ణిమ' నాడు ఈ సత్సాంప్రదాయాన్ని తెలుసుకొని త్వరగా 'గురు అమావాస్య'ను తొలగించుకొని గురుచంద్రుల అనుగ్రహ వెన్నెలలను పొందుదుము గాక!

# సద్గురు మహిమ

దివ్యజనని అలివేలు మంగమ్మ

సద్గురు మహిమగూర్చి వర్ణించనెవరితరమూ గాదని పెద్దలు చెబుతారు. అంటే గురు మహిమ మన ఊహకు అందనంతటి గొప్పది అని అర్థం.

అసలు 'గొప్పది' అంటే ఏమిటి? కరుణ వర్షించడంలోనా? కఠినంగా శిక్షించడంలోనా? మామూలుగా మనం గురుమహిమ గూర్చి చెప్పుకునేటప్పుడు కరుణ వర్షించడంలోనేనని అనుకుంటాము.

'గురుమహిమ' అంటే గురువు యొక్క చర్యలు అంతటి మహిమగలవి అని అర్థం. సద్గురువు సకల చరాచర సృష్టినీ సృష్టించి నిలిపి, లయమొనరుస్తాడు. అందుకని ఈ సృష్టి మొత్తం ఆయన మహిమా స్వరూపమే. ఒక కవి హృదయం పులకించినా, ఒక గాయకుని హృదయం పరవశించినా, ఒక తాత్వికుని హృదయం చింతన చేసినా, ఎందరు ఋషులు, మునులు, యోగులు తమ తపస్సుల ద్వారా ధ్యానించినా, ఎందరు వైజ్ఞానికులు పరిశోధనలు జరిపినా- వారు తెలుసుకునేది ఆయన మహిమాన్విత సృష్టిలో అణువంతమాత్రమే.

అలాగే స్థితి, లయములుగూడ ఆయన యొక్క మహిమా స్వరూపమే.

గురు మహిమ అతి చిత్రమైనది. పసి పిల్లవాడికి తాయిలం పెట్టినట్లు మనకు తాయిలాలుగా చిన్న చిన్న కోరికలు వెంటనే తీర్చి మనలను మురిపిస్తుంది. కొద్దిగా ఎదిగాక ఒక చెంపను ముద్దు పెట్టుకుంటూ మరొక చెంపను పగులకొడుతున్నట్లు కొన్ని కోరికలు తీరుస్తూ, కొన్నింటిని తీర్చక ఏడిపిస్తూ వుంటుంది. ఒక చెంప వాయిస్తున్నట్లు కొన్ని కష్టాలను తీర్చక, నేను లేననుకోవడానికి వీలులేనట్లు కొన్ని కోరికలు తీరుస్తూ, కాసేపు ఏడిపిస్తూ, కాసేపు నవ్విస్తూ తను తప్ప గతిలేనట్లు ప్రవర్తిస్తుంది. సాధనలో ఎదిగిన వాడికి అంటే యింకా బాగా తనను నమ్ముకున్నవాడికి వట్టి చెంపదెబ్బలు మాత్రమే గాదు, కొరడా ఝుళిపించడం గూడ చేస్తుంది. ముద్దులు, మిఠాయిలు ఏ మాత్రం వుండవు.

సద్గురువు మహిమ వెన్న వలె అతి మృదువైనది. అంతేగాదు. వజ్రం వలె అతి కఠినమైనది గూడ. అయితే ఎవరెవరి స్థాయినిబట్టీ వారి వారి పట్ల అట్లా ప్రవర్తించడము, ప్రసాదించడము చేస్తుంది. అయితే ఎంత కఠినంగా వుంటుందో అంత శ్రేయస్సును చేకూరుస్తుంది.

అంతటి మహిమ గల సద్గురువు చేసిన కొన్ని లీలలను యిప్పుడు చెప్పుకుందాము.

సద్గురుని లీలలు చిత్రవిచిత్రములుగా వుంటాయి. ఆయన ఒక నిరుపేదవాడిని గొప్ప ధనవంతుడుగా చేస్తాడు. మరొకనిని నిష్ఠదరిద్రునిగా చేసి చూస్తూ వూరుకుంటాడు. ఒకరికి ప్రాణం పోస్తే, మరొకరిని(మన దృష్టిలో) నిర్దాక్షిణ్యంగా ప్రాణం తీస్తాడు.



చాకలివానికి సామ్రాజ్యమిస్తాడు. మూగవానిని వేదవేదాంగ పారంగతుని చేస్తాడు. గొడ్రాలికి సంతానం ప్రసాదిస్తాడు. ఇలా ఎందరికో ఎన్నో కోరికలు తీరుస్తాడు.

ఎదుర్కోవలసి వచ్చింది. ఇలా సత్యాన్ని బోధించిన ప్రతి విషయంలోనూ ఎదురుదాడులను ఎదుర్కొంటూ, ఎదురు బాటలోని ముళ్ళను ఏరివేసుకుంటూ ముందుకు సాగిపోయారాయన.

**ఆయనను నమ్ముకుంటే కష్టాలను ఎదుర్కోవలసిందేనా? అన్నది ప్రశ్న. కానీ ఆయనను నమ్ముకోకపోతే కష్టాలను తొలగించుకోగలమా? అన్నది ఎదురు ప్రశ్న. అసలు తమను నమ్ముకున్నవారిని కష్టాలపాలు చేస్తారనడం లోకంలో పరిపాటి. అయితే వారిని నమ్ముకోవడమెందుకు?**

అయితే గురు మహిమకు మరోకోణం గూడ వున్నది. అది రెండువైపులా పదునువున్న కత్తిలాగా పనిచేస్తుంది. గురువు ఒక ప్రక్క మధురమైన పండ్ల ముక్కలు కోసిపెట్టినట్లు మధురానుభవాలను ప్రసాదిస్తూనే మరొకవంక ఆపరేషన్ చేసినట్లు కష్టాలను గూడా ప్రసాదిస్తాడు. అయితే వైద్యుడు మన శరీరానికి పనికిరాని, హాని కలిగించేవాటిని తొలగించడానికి, సవరించడానికి ఆపరేషన్ చేసినట్లే సద్గురువు గూడ కష్టాలను అనుభవించేటట్లు చేసి, వెనుక తానుండి శ్రేయస్సును చేకూరుస్తాడు. వైద్యుడు మనకు ఆరోగ్యాన్ని ప్రసాదించినట్లే సద్గురువు పరమార్థాన్ని ప్రసాదిస్తాడు.

సమర్ధ సద్గురువైన శ్రీ శిరిడీ సాయిబాబా పూజ్యశ్రీ మాస్టరుగారిని ప్రధమదర్శనంలోనే అంతగా అనుగ్రహించి ఆయన ద్వారా తాము చేయదలుచుకున్న లోకకళ్యాణ కార్యక్రమాన్ని చేయించుకుంటున్నప్పటికీ మరొకవైపు లౌకిక జీవితంలో ఆయనకు అనేక ఒడిదుడుకులను ప్రసాదించారు. నల్లేరు మీద నడకగాకుండా పల్లేరు కాయల మీద నడకగా సాగింది ఆయన జీవితం. అన్ని వైపులనుంచీ ఆయనకు ఎదురుగాలులే వీచాయి. తమను అడిగినవారికి, అడగనివారికీ గూడ వారి అవసరాలు గుర్తించి ఆర్ధిక సహాయం అందించిన ఆయన ఆర్ధికంగా ఎంతో యిబ్బందిపడవలసి వచ్చింది. సరియైన ఆధ్యాత్మికతను బోధించినందుకుగాను ఆధ్యాత్మికత అంటే సరిగా తెలియని వారందరి యొక్క ఎదురుదాడులను

అయితే ఆయనను నమ్ముకుంటే కష్టాలను ఎదుర్కోవలసిందేనా? అన్నది ప్రశ్న. కానీ ఆయనను నమ్ముకోకపోతే కష్టాలను తొలగించుకోగలమా? అన్నది ఎదురు ప్రశ్న. అసలు తమను నమ్ముకున్నవారిని కష్టాలపాలు చేస్తారనడం లోకంలో పరిపాటి. అయితే వారిని నమ్ముకోవడమెందుకు? అందుకనే, “అంతగా వారిని నమ్ముకోకుండా కష్టాలు వచ్చినప్పుడు మాత్రమే వారిని ఆశ్రయిస్తే వాటిని వారు తొలగిస్తారు, లేకపోతే లేదు. అంతమాత్రం భక్తి మనకు చాలు, అంతకుమించి మనకు వద్దు, అవసరంలేదు గూడ. కారణం ఎంత ఎక్కువగా భక్తి వుంటే అంతగా కష్టాలు పడవలసివస్తుంది” అని చాలా మంది పరిమితమైన భక్తితో సద్గురువులను ఆశ్రయిస్తూ వుంటారు.

అయితే నిజంగా సద్గురువు అలా ఎందుకు చేస్తాడు? దానిలో వున్న అంతరార్థమేమిటి? అంతగా కష్టాలు పెట్టినా భక్తులు వారిని వదులుకోకపోవడానికి కారణమేమిటి?

సద్గురుభక్తివలన తలకుమించిన కష్టాలు రాక తప్పవా?

జీవితంలో కష్టసుఖాలు రెండూ అనుభవించడం అన్ని జీవులకూ సమానమే. కానీ మానవుడు మాత్రం ఈ రెంటినీ పోల్చి చూచుకుని కష్టాలలోంచి బయటపడే ప్రయత్నం చేస్తాడు. అంటే మానవుని అభివృద్ధికి కష్టాలు ఒక కారణమనీ చెప్పవచ్చు. అట్టి కష్టాలే లేకుంటే మానవులు అభివృద్ధి చెందటానికి కావలసిన ప్రయత్నం చేయడు. అంటే ఇటు లౌకికంగానూ, అటు పారమార్థికంగానూ కూడా

జడుడుగా, స్థబ్ధుడుగా మిగిలి పోతాడు.

అంతేకాదు. శక్తికి మించి సద్గురువెన్నడూ ఆధ్యాత్మికతలోకి లాగజూడడని పూజ్యశ్రీ మాస్టరుగారు చెప్పేవారు. అంటే భక్తునికి వివేక వైరాగ్యాలు కలుగజేయడానికి, కర్మక్షాళన చేయడానికి అవసరమైన కష్టాలు ప్రసాదిస్తాడు సద్గురువు. అలా కాక పూర్వకర్మ వలన భరించలేనంతటి కష్టాలు వచ్చినపుడు తోడుండి రక్షిస్తాడు. అవసరమైతే అట్టి కర్మను తొలగిస్తాడు కూడా.

మనసుకు వివేకాన్ని, వైరాగ్యాన్ని, ధర్మంగా నడవడానికి కావలసిన మానసిక ధారుఢ్యాన్ని, సాధనకు కావలసిన పట్టుదలను క్రమంగా మనకు కష్టాలు అలవరుస్తుంటాయి. అలానే జీవితానికి కావలసిన స్ఫూర్తిని, ఉత్సాహాన్నీ సుఖాలు, సంతోషాలు మనకు కలిగిస్తాయి. సద్గురువు తన భక్తునికి క్రమపద్ధతిన, తగురీతిన ఆ భక్తుని కర్మశేషాన్ని అనుసరించి, యిట్టివి ప్రసాదిస్తాడు.

ఈ విషయం సద్భక్తునికి మరువలేని సత్యంగా నిలుస్తుంది కనుక కష్టాలకు బెదరక, తన గురువు రక్షణను గుర్తుంచుకుని ధైర్యంతో, ఓర్పుతో, పట్టుదలతో వాటిని ఎదుర్కొంటాడు. తన కర్మ క్షాళనమవుతున్నందుకు సంతోషిస్తాడు. నేర్వవలసిన పాఠాలను నేర్చుకుంటాడు. తన జీవితంలోని కష్టసుఖాలు అన్నీ ఆ సద్గురు మహిమే అని గుర్తుంచుకుని పులకరిస్తుంటాడు. కష్టాలకు కృంగక, సుఖాలకు పొంగక సమత్వాన్ని సాధిస్తాడు.

కష్టాలు భక్తులకు, భక్తులు కానివారికీ గూడ వస్తాయి. అయితే వారు అనుభవించే తీరులోనే తేడా వుంటుంది. భక్తులు వాటిని అంతగా పట్టించుకోరు. జీవితంలో కష్టసుఖాలు వస్తుంటాయి పోతుంటాయి, అవి సహజమేనని భావిస్తారు. చేయవలసినది భగవంతుని స్మరణ, శరణాగతి మాత్రమేనని, ఆయనకు నచ్చినట్లు కర్తవ్యాన్ని నిర్వర్తించడమేననీ తలుస్తారు, లేక అవి సద్గురువు తమకు పెట్టే పరీక్షలని తలుస్తారు, లేక వాటిని ప్రసాదాలని గూడ తలచవచ్చు. అందుకే వాటికి వారు కృంగరు. శాంతితో వుంటారు.

భక్తులు గాని వారు, అంటే సామాన్యులు, కష్టాలు వచ్చినప్పుడు బాధపడుతూ వాటికి కారణమైన పరిస్థితులను, వ్యక్తులను తిట్టుకుంటూ ఇతరులకు, తమకూ అశాంతిని కలుగజేసుకుంటారు. ఇటువంటి భావాలవలన అవి యింకా యింకా పెరిగి సంస్కారాలు బలపడి నిరంతరం ఏదో ఒక అశాంతిపూరకమైన ఆలోచనలలో సతమతమవుతుంటారు.

ఉదాహరణకు ఆర్థిక ఇబ్బందులు, ఆరోగ్య పరిస్థితులు, చదువు, ఉద్యోగ సమస్యలు మాత్రమే గాక ఉదయం లేచింది మొదలు వారిట్లా వున్నారనో, వీరిట్లా అన్నారనో, లేక వారిట్లా చేసారనో అనుకుంటూ శాంతిని కోల్పోతుంటారు. ఇవి మాత్రమేగాక హోదా, అంతస్థు, పరువు ప్రతిష్ఠలు, మర్యాదలు-వీటన్నిటినీ ఆధారం చేసుకుని వాటిని నిలుపుకోవడానికి శతవిధాలుగా ప్రయత్నించడంలో అశాంతిని కొనితెచ్చుకుంటారు. అతి చిన్న విషయాలు గూడ అతి పెద్ద విషయాలుగా వాళ్ళను బాధపెడుతుంటాయి. ఉదాహరణకు ఒకరు తమను పలుకరించలేదనో, నమస్కరించలేదనో, కూర్చోమనలేదనో, తినడానికీ, త్రాగడానికీ ఏమీ అడుగలేదనో-ఇలాంటి వాటిని భూతద్దంలోంచి చూస్తూ శాంతిని కోల్పోతారు. జీవితాంతము వాటిని తలచుకుని వాపోతుంటారు గూడ.

కానీ నిజమైన భక్తులకు యివేవీ పట్టవు, పట్టకూడదు గూడ. వారు ఇటువంటి వాటిని చాలా

**ఆయనకు ఆత్మానుభూతిని ప్రసాదించి తనంతటివారుగా చేసారు బాబా. తద్వారా కొన్ని కోట్లమందికి ఈనాడు శ్రేయస్సు చేకూరుస్తున్నారు. పూజ్యశ్రీ మాస్టరుగారు అనేక విధాలుగా చేసిన సద్గురు సాయి తత్త్వ ప్రచారం వలన కొందరు చిన్న, పెద్ద కోరికలు తీర్చుకుంటుంటే కొందరు ఇహపర శ్రేయస్సును పొందుతున్నారు. కొందరు పరమైన తత్త్వాన్నే పొందుతున్నారు. అట్టి అద్భుతమైనది గురుమహిమ.**

అల్పవిషయాలుగా తలుస్తారు. వారు మర్యాదల కోసము, పొగడ్తల కోసమూ వెంపర్లాడరు. ఇవన్నీ వున్నా లేకపోయినా ఒకటిగానే భావిస్తారు. వాళ్ళకసలవి పట్టవు గూడ. అలాగని వాళ్ళు తమ కర్తవ్యాన్ని నిర్లక్ష్యం చేయరు. నిస్వార్థంగా, తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తిస్తారు.

నిజమైన భక్తులు ఎల్లప్పుడూ తృప్తితో వుంటారు. వారు పస్తులుండవలసి వచ్చినా బాధపడరు. దీనికి ఉదాహరణ బాబా చరిత్రలోని మహల్సాపతి, శ్రీ గురుచరిత్రలోని యాయవారవృత్తిలో జీవించే నిరుపేద బ్రాహ్మణుడు. అలాగే సాఠేకు శిరిడీ గ్రామంలో వచ్చిన వ్యతిరేకత వల్ల బాబాను దర్శించడానికి వీలుపడక పోయినా అతడు బాధపడలేదు. బాబా తన శ్రేయస్సుకే అలా చేసారని భావించి తాను వున్నచోటనే బాబా సేవ చేసుకున్నాడు. అలాగే దీపకుడు మొ॥న శిష్యులను గురువు ఎలా బాధలు పెట్టారో గురు చరిత్రలో చూడవచ్చు.

అంటే నిజంగా సద్గురువును విడువక ఆశ్రయిస్తే, మనకు కనిపించే కష్టాలు వాళ్ళకా కష్టాలుగా అనిపించవన్నమాట. అంటే ఆయన ప్రసాదించే శాంతి ముందు యివి అత్యల్పాలన్నమాట. ఎంత వున్నా యింకా లేదనే కొరత, ఎన్నిసార్లు మనకిష్టమైనవి తిన్నా యింకా యింకా తినాలనే కోరిక, ఎంతగా సుఖాలను అనుభవిస్తున్నా యింకా యింకా అనుభవించాలన్న తపన-ఇవేవీ వారికి వుండవన్నమాట.

అంటే మనకు ఎంతో యిష్టమైన పదార్థం కడుపునిండా తిన్నప్పుడు కలిగే తాత్కాలికమైన తృప్తి, మనం కోరుకున్న సుఖాలను అనుభవిస్తున్నప్పుడు వుండే తాత్కాలిక సంతోషము-వారికి ఎప్పుడూ వుంటాయన్నమాట. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రపంచంలోని మానవజాతి అంతా దేనికోసమైతే ప్రాకులాడుతూ దానిని పొందలేకపోతున్నదో అట్టిదానిని భక్తునికి ప్రసాదిస్తాడు సద్గురువు. అట్టి అపారమైన, అంతులేని తృప్తి శాంతులను ప్రసాదిస్తాడు గనుకనే సద్గురువును సద్భక్తులు విడువరు, విడువలేరు గూడ.

అంతేగాదు, అట్టి సద్భక్తుని సద్గురువు తనంతటివానిగా గూడా చేస్తాడు. అట్టి వారిని ఆశ్రయించి మరెందరో ఐహిక, ఆముష్మిక సుఖాలను పొందుతారు. ఇక్కడ విచిత్రమేమిటంటే అట్టివారినే మనము గూడ కోరికలు తీర్చుకోవడానికి ఆశ్రయిస్తాము. మరి ఆయన అంతగా కష్టాలనే ప్రసాదించేవాడే అయితే అట్లా అనుభవించేవారినే మనము ఎందుకు ఆశ్రయిస్తున్నాము? వాళ్ళ దగ్గర శాంతి సౌఖ్యాలను ఎందుకు పొందగలుగుతున్నాము? మన కోరికలను ఎలా తీర్చుకోగలుగుతున్నాము?

ఇందుకు ఉదాహరణ పూజ్యశ్రీ మాస్టరుగారు. ఆయనకు ఆత్మానుభూతిని ప్రసాదించి తనంతటివారుగా చేసారు బాబా. తద్వారా కొన్ని కోట్లమందికి ఈనాడు శ్రేయస్సు చేకూరుస్తున్నారు. పూజ్యశ్రీ మాస్టరుగారు అనేక విధాలుగా చేసిన సద్గురు సాయి తత్త్వ ప్రచారం వలన కొందరు చిన్న, పెద్ద కోరికలు తీర్చుకుంటుంటే కొందరు ఇహపర శ్రేయస్సును పొందుతున్నారు. కొందరు పరమైన తత్త్వాన్నే పొందుతున్నారు. అట్టి అద్భుతమైనది గురుమహిమ.

నిజంగానే అట్టి గురుమహిమను కొనియాడడం ఎవరి తరము? ఇప్పుడు ఆలోచిస్తే తెలుస్తుంది- గురుమహిమ కష్టాలను ప్రసాదిస్తుందా? జన్మనెత్తిన తర్వాత కష్టసుఖాలు ఎలాగూ తప్పవు. నిజభక్తునికి అవన్నీ నీటిమీద వ్రాసిన గీతలలాగా జీవితంలో వచ్చి వెళ్ళిపోతుంటాయి. కానీ అంతులేని తృప్తి శాంతులతో అతడు ఆనందాన్ని అనుభవిస్తుంటాడు. అంతకంటే ఎవరికైనా కావలసినది ఏమున్నది?

ఈ కృతజ్ఞతా మహోత్సవ సందర్భంగా అట్టి అచంచలమైన గురుభక్తిని ప్రసాదించమని, ఈ గురు పూర్ణిమ నుంచి అయినా అట్టి గురుభక్తిని అలవరచుకునే శక్తిని అనుగ్రహించమనీ సద్గురు శ్రీ సాయినాధుని స్వరూపమైన పూజ్యశ్రీ మాస్టరుగారిని మనసారా ప్రార్థిద్దాము.

జై సాయి మాస్టర్!

# గురువు అనుగ్రహంలేక ఆధ్యాత్మిక సాధన సిద్ధిస్తుందా?

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

*టి*బెట్‌లోని యాంగ్‌సా అనే ప్రాంతంలో జన్మించిన (1052 AD) మహాయోగి మిలారేపా. మిలారేపా పసితనంలోనే సంపన్నుడైన అతడి తండ్రి చనిపోతాడు. అమాయకురాలైన అతని తల్లినీ, చెల్లెలునూ, మిలారేపానూ దాయాదులు అష్టకష్టాలు పెట్టి, ఆస్థి కాజేసి యింటి నుంచి వెళ్లగొడతారు. పగబట్టిన అతని తల్లి ప్రోద్బలంతో, మిలారేపా ఒక గురువు వద్దకు వెళ్లి క్షుద్రవిద్యలెన్నో నేర్చుకొని వచ్చి తన శతృవులందరినీ దారుణంగా హతమారుస్తాడు. ఫలితంగా మిలారేపా మానసికంగా ఎంతో అశాంతికి గురియౌతాడు. క్షుద్రవిద్యలు నేర్పిన గురువు సలహాపై అతడు హీనాతిహీనమయిన జన్మల వలయంలో పడవేసే చెడ్డకర్మ నుంచి బైటపడడానికి శుభ్రమార్గం చూపగల ఆధ్యాత్మిక గురువునన్వేషిస్తూ బయలుదేరుతాడు.

చివరకు మహా తపస్సంపన్నుడూ, ప్రఖ్యాత మహాత్ముడైన నరోపా గారి శిష్యుడూ అయిన మార్పాగారిని దర్శించి, ఆయనే తనకు జ్ఞానాన్నివ్వగల సమర్థుడని పూర్తిగా విశ్వసించి, తాను చేసిన ఘోరమైన తప్పిదాలను ఏకరువుపెట్టి, తననా అశాంతి



నుంచీ, పాపకర్మ నుంచీ విడుదల చేయమని ప్రార్థించి తన మనస్సునూ, శరీరాన్ని గురువుకర్పిస్తాడు.

మార్పాగారికి కూడా మిలారూపా తన వద్దకు వస్తాడనీ, అతన్ని తాను ఉద్ధరించి మహాయోగిగా చేయవలసి వుంటుందనీ దైవాదేశంవస్తుంది. అందుచే మార్పాగారు వెంటనే అతణ్ణి శిష్యుడిగా అంగీకరిస్తాడు.

మహాజ్ఞానియైన మార్పాగారు మిలారేపా యోగిగా పరిణతిచెందేందుకు తగిన తర్ఫీదునిస్తూ, పైకిమాత్రం అతని పట్ల కఠినంగా వ్యవహరించేవారు. అనేక అంతస్థుల భవనాలను కొండరాళ్లతో ఒక్కడినే నిర్మించమనేవారు. అలా చేశాక వాటిని పడగొట్టించి, ఎక్కడిరాళ్లనక్కడ పడవేయించేవారు. అయితే ఎన్నిసార్లు అడిగినా ఉపదేశం మాత్రం చేసేవారు కాదు. ఏమార్గమూ బోధించేవారూకారు. ప్రతిసారి ఒక్క ఇల్లు కట్టిచ్చావంటే ఈసారి కూలద్రోయించననీ, తప్పక ఈజన్మలోనే బుద్ధత్వాన్ని ప్రసాదించగల ఉపదేశం యిస్తాననీ ప్రోత్సహించేవాడు. ఇలా కాలయాపనతో విసిగిపోయిన మిలారేపా ఒకసారి మిగతా శిష్యులతోపాటు ఉపదేశం కోసం కూర్చొని గురువుచే తీవ్రంగా దండింపబడతాడు. "ఈయన హృదయాన్ని నా సేవతో ఎన్నటికీ కరిగించలేను. ఈయన ఉపదేశమివ్వక నేను తరించను" అని దుఃఖిస్తున్న మిలారేపాను గురుపత్ని, మార్పాగారి ప్రధానశిష్యుడూ, గురువంతటి జ్ఞానీయైన గోగ్‌డన్ వద్దకు పంపుతాననీ, దుఃఖించవద్దనీ ఓదారుస్తుంది.

సత్యాన్వేషణతో తపిస్తున్న మిలారేపాకు గురుపత్ని చెప్పిన మాటలు ఆశాజ్యోతులౌతాయి. ఎవరివద్ద నుంచైనా సరే ఆ ఉపదేశం పొంది బుద్ధత్వాన్ని పొందాలని అతని కోరిక. గురుపత్నియైన దావేమా ఒకరోజు భర్తను ఏమార్చి, పూజామందిరంలోని మార్పాగారి గురుదేవులైన నరోపాగారి జపమాలలు మిలారేపాకిచ్చి భర్త వ్రాసినట్లుగా,"నేను త్వరలో ఏకాంతవాసానికి

వెళ్తున్నాను. ఈ మంత్రగాడు ఉపదేశం పొందాలని ఆతృత పడుతూండటంవల్ల నీవద్దకు పంపుతున్నాను. నువ్వతనికి ఉపదేశమివ్వవలసినది. ఇది నా ఆజ్ఞ. అందుకు గుర్తుగా నీకు నరోపాగారి జపమాలలు పంపుతున్నాను" అని ఉత్తరం వ్రాసి, మార్పాగారి సీలువేసి అతిరహస్యంగా పంపింది.

**మహాజ్ఞానియైన మార్పాగారు మిలారేపా యోగిగా పరిణతిచెందేందుకు తగిన తర్ఫీదునిస్తూ, పైకిమాత్రం అతని పట్ల కఠినంగా వ్యవహరించేవారు. అనేక అంతస్థుల భవనాలను కొండరాళ్ళతో ఒక్కడినే నిర్మించమనేవారు. అలా చేశాక వాటిని పడగొట్టించి, ఎక్కడిరాళ్ళనక్కడ పడవేయించేవారు. అయితే ఎన్నిసార్లు అడిగినా ఉపదేశం మాత్రం చేసేవారు కాదు. ఏమార్గమూ బోధించేవారూకారు.**

మిలారేపా గోగ్‌డన్ వద్దకు చేరిన సమయానికి ఆయన శిష్యులకు ప్రవచనం చేస్తున్నారు. ఒక గ్రంథంలోంచి ఆయన "నేను సృష్టి స్థితి లయకారకుడను. నేను గురువును. నేనే శిష్యుడను. నేనే చైతన్య రూపుడను.'' అనే పవిత్రవాక్యాలు చదువుతున్న సమయంలో మిలారేపా ఆయన దృష్టిలో పడ్డాడు. మిలారేపా నమస్కరించిన పద్ధతిచూచి అతడు మార్పాగారి శిష్యుడనీ, అతను పవిత్రమైన పైవాక్యాలు చదువుతున్న సమయంలో రావటంవల్ల ఆ శకునం యితను మహాయోగి అవుతాడనడానికి సూచన అని గ్రహించాడు గోగ్‌డన్. మిలారేపాతెచ్చిన ఉత్తరమూ, జపమాలలూ స్వీకరించి తప్పక ఉపదేశమిస్తానని వాగ్దానం చేశాడు.

మరునాడు లామాగోగ్‌డన్ మిలారేపాను పిలిచి తనదర్శనానికి వస్తున్నభక్తులనూ, శిష్యులనూ దుష్టులైన గొఱ్ఱెలకాపరులు కొందరు బాధిస్తున్నారనీ, మంత్రాలతో వారికి బుద్ధిచెప్పి వస్తే తప్పక ఉపదేశమిస్తాననీ చెప్తాడు.

"నేను క్షుద్రవిద్యలు నేర్చుకున్న ఆ రోజు ఎంత పాపిష్టిరోజు! ఈ పాపకూపం నుంచి నేను బయటపడను కాబోలు" అని నిందించుకుంటూ చేసేదేమీలేక గోగ్‌డన్ చెప్పిన వారందరి పొలాలపై వడగళ్ళ వానలుకురిపించి, వారందరికీ అపారనష్టం కలిగించి, వస్తూవస్తూ తానుచేసిన బీభత్సం వల్ల చనిపోయిన పక్షులనూ, ఎలుకలనూ ఒకమూటలో వేసి తీసుకొచ్చి, లామా గోగ్‌డన్ ముందు కుప్పవేసి, "ఇంతవరకు చేసుకున్న గొప్ప పాపాలరాశికి తోడు యిప్పడు మరికొంత పాపాల్ని చేర్చాను. నా పాపానికి నిష్కృతిలేదు. నామీద దయతో నన్నీ వలయం నుంచి బైటపడవేయండ''ని ఆవేదనతో దుఃఖించాడు. అప్పడు లామాగోగ్‌డన్ ఓదార్చి, "నిరాశపడకు, నిజానికి నువ్వింత దుఃఖపడడానికి కారణమేమీలేదు. నిజానికి వీటిని నువ్వేమీ చేయలేదు. నామాట మీద విశ్వాసం లేకపోతే చూడు" అంటూ కాసేపు ధ్యానం చేసి, కళ్ళుతెరచి చప్పట్లు చరిచారు. ఎంత ఆశ్చర్యం! అప్పటిదాకా నిర్జీవంగా వున్న పక్షులు రెక్కలల్లాడిస్తూ పైకెగిరిపోయాయి. ఎలుకలు కలుగుల్లోదూరాయి! ఆ సమయంలో లామా గోగ్‌డన్‌లో బుద్ధత్వపు లక్షణాలను సంపూర్ణంగా చూచాడు మిలారేపా.

తర్వాత త్వరలోనే మిలారేపా ఎన్నాళ్ళుగానో కలలు కన్న ఉపదేశం లామాగోగ్‌డన్ మార్పాగారి ద్వారా పొందినదే మిలారేపాకిచ్చాడు. వెంటనే ఒక



**"అందుకే మామూలుగా సాధనలో అందరికీ వచ్చే అనుభవం నీకు రాలేదు. ఇంతకాలం నువ్వుచేసిన సాధన అంతా వ్యర్థం. గురువు యొక్క అనుమతిలేకుండా చేసే ఆధ్యాత్మిక సాధనలు ఫలించవని నీకు తెలియదా?"**

గుహను ఏర్పాటుచేసుకుని ఆహారం, నీరు అందించడానికి మాత్రం ఒక చిన్న కిటికీ వుంచి, లోపలవుండి మిగతా గుహాద్వారాన్నంతా మూసివేసుకొని గోగ్డన్ చెప్పిన పద్ధతుల ప్రకారం సాధన చేయనారంభించాడు మిలారేపా. అయితే ఎంత శ్రద్ధగా ధ్యానం చేసినా ఏమాత్రం పురోగతి కనిపించలేదు. ఒక రోజున గోర్డన్ వచ్చి, "నీకు 'ఫలానా' రకమైన అనుభవం వచ్చిందా?" అని అడిగాడు. అలాంటి అనుభవమేమీ రాలేదని చెప్పాడు మిలారేపా. "రాకపోవడమేమిటి? ఈ రకమైన సాధనలో పురోగతిలేకుండా వుండడం అసంభవమే! ఎక్కడో ఏదో లోపం వుండి వుండాలి! ఏమైవుంటుందబ్బా! గురుదేవులు మార్పాగారి అనుమతి లేదనుకుందామా అంటే జపమాలలూ, ఉత్తరం కూడా పంపారాయె! సరే! కొన్నాళ్ళు ధ్యానం కొనసాగించు - చూద్దాం" అన్నారు.

అప్పుడు మిలారేపాకు అర్థమైంది - లోపం ఎక్కడుందో, గోర్డన్ ముందు గురువు ఆజ్ఞలేదనే సత్యాన్ని బైటకు కక్కబోయి, అంత ధైర్యంలేక ఎలాగో అణచుకొన్నాడు మిలారేపా. ఇప్పుడిక గురుదేవులైన మార్పాగారిని శరణుపొందటం తప్ప మరో మార్గంలేదు. ఆ అవకాశం వచ్చేదాకా ఆ గుహలోనే ధ్యానం కొనసాగించాడు మిలారేపా.

ఇంతలో మార్పాగారు మిలారేపా పూర్తిచేయకుండా వదిలేసివెళ్ళిన యింటికి కప్ప వేయించడానికి కావలసిన కలపను సేకరించి పంపమని గోర్డన్‌కు ఉత్తరం వ్రాస్తూ చివర, "త్వరలో జరిగే నా కుమారుని ఉపనయానికి తప్పక హాజరు కావలసినది. నీతో గనుక ఆ మంత్రగాడు (మిలారేపా) వుంటే వాడిని తప్పక తీసుకురా" అని వ్రాశారు.

ఆ ఉత్తరం చూడగానే లామాగోర్డన్ నేరుగా మిలారేపా వద్దకు వచ్చి, ఉత్తరం చదివి వినిపించి, "దీనిని బట్టి ఉపదేశం పొందడానికి నీవు గురువు అనుమతి పొందకుండానే వచ్చినట్లున్నదే" అని అడిగాడు. తాను గురువుకు తెలియకుండానే వచ్చాననీ, తాను తెచ్చిన ఉత్తరం గురుపత్ని సృష్టించిన నకిలీ ఉత్తరమనీ, ఆ మాలలు కూడా భర్తకు తెలియకుండా ఆమే యిచ్చిందనీ చెప్పాడు మిలారేపా. "అందుకే మామూలుగా సాధనలో అందరికీ వచ్చే అనుభవం నీకు రాలేదు. ఇంతకాలం నువ్వుచేసిన సాధన అంతా వ్యర్థం. గురువు యొక్క అనుమతిలేకుండా చేసే ఆధ్యాత్మిక సాధనలు ఫలించవని నీకు తెలియదా?" అంటూ ప్రయాణానికి సిద్ధం కమ్మని చెప్పాడు. గురుపత్ని దామేమా, "నీ గురువు ఇప్పుడు నీకు ఉపదేశమివ్వడానికి సుముఖంగా వున్నారు. నువ్వు తప్పక రావలసినది." అని రహస్య వర్తమానం పంపడంతో తన చిన్న గుహలో ఆనందపు చిందులు వేశాడు మిలారేపా.

త్వరలోనే మిలారేపా తిరిగి గురువు సన్నిధికి చేరి ఆయన యిచ్చిన శిక్షణతో సాధన చేసి మహాయోగియైనాడు. గురుకృప ఎంత విలువైనది!

# జై సాయి మాస్టర్!

శ్రీమతి వేదవతి

"జై సాయి మాస్టర్" - శ్రీ మాస్టరుగారు మార్గదర్శకత్వంలో సద్గురుడైన శ్రీ సాయి సాంప్రదాయాన్ని అనుసరించదలచుకున్న వారందరూ ఒకరినొకరు పలుకరించుకునే (ఆప్యాయమైన) పలకరింపు అది. ఇంతమాత్రామేనా? కేవలం "గుడ్ మార్నింగ్" అని పలుకరించుకునే పలకరింపుగా మాత్రమే మనం దానిని వాడుకుంటూ వున్నట్లయితే దాని విలువ అంతకుమించి వుండదు- వెయ్యి రూపాయిలనోటుని పొయ్యి వెలిగించుకోవడానికి వాడుకున్నట్లు!! కానీ దానిని సరిగ్గా ఉపయోగించుకోదలచుకున్న వారికి సాధనలో ఏ స్థాయిలో వున్నవారికి ఆ స్థాయిలో మార్గదర్శిగా వుపయోగపడే మంచి సాధనం "జై సాయి మాస్టర్!"

ఒక మాటలు నేర్చే పిల్లవానికి "జై సాయి మాస్టర్'' అని నమస్కరించి పలుకరించడం నేర్పామనుకోండి. అది వాడికి ఒక మంచి అలవాటు. ఒక మంచి సంస్కారానికి తొలిమెట్టు. ఇంకొంచెం తెలిసినవారికి ఎవరినైనా "జై సాయి మాస్టర్" అని పలకరించునప్పుడు "ఇతడూ మన గురుబంధువే. కాబట్టి ఇతడు మన గురుకుటుంబ సభ్యుడు. కాబట్టి ఇతనితో గౌరవంగానూ, ఆప్యాయతతోనూ వ్యవహరించాలి!" అనే హెచ్చరిక. ఇంకా కొంచెం ఆలోచించగలిగితే "బాబా, మాస్టరుగారు అంతటా, అన్నింటిలోనూ ఎల్లప్పుడూ తామే వుంటామని భక్తులకు అనుభవాల ద్వారా నిదర్శనమిచ్చారు. కాబట్టి ఇతని రూపంలోనూ వారే వున్నారు. కాబట్టి ఆ విషయం గుర్తుంచుకుని ప్రవర్తించాలి!" అనే సూచన. మొత్తం మీద మనకు అర్థమయినా కాకపోయినా ''జై సాయి మాస్టర్'' అని మనం పరస్పరం పలకరించుకునే పలకరింపు మనం అనుసరిద్దామనుకున్న సద్గురు సాంప్రదాయానికి ప్రతీక. సద్గురువు యొక్క శబ్ద రూపమే - "జై సాయి మాస్టర్".

శ్రీ సాయి-మాస్టర్‌ల తత్వంలోని ముఖ్యమైన బోధ ఏమిటి? శ్రీ సాయి "నీవు, నీవు చూసేదంతా కలిపి నేను" అన్నారు. ఇంకా "నీవెక్కడ చూస్తే అక్కడ నేనున్నానని గుర్తుపెట్టుకో!" అన్నారు బాబా. అలా నిత్యం గుర్తుపెట్టుకుని ఎలా జీవించాలో, అలా జీవించగలిగిన సమర్థుడి జీవితం ఎంత పరిపూర్ణంగా వుంటుందో, అట్లా జీవించగలిగితే ఆధ్యాత్మికంగా ఎంతటి ఉన్నత సాధాలకైనా చేరవచ్చని తమ బోధలద్వారా, ఆచరణ ద్వారా, జీవితం ద్వారా నిరూపించారు పూజ్యశ్రీ మాస్టరుగారు, అమ్మగారు. అంటే సంపూర్ణబోధ రూపమైన శ్రీ సాయి, అలివేలుమంగ సహిత భరద్వాజుల సమగ్ర రూపమే "జై సాయి మాస్టర్" అనే తారక మంత్రం. అదే పంచాక్షరి. సచ్చిదానంద స్వరూపము. సమర్థ సద్గురు స్వరూపము.



సర్వవ్యాపకమైన సాయి తత్త్వాన్ని వస్తువులలో భావించడం కొంతవరకూ తేలిక. ఎందుకంటే వాటినుంచి మనకు ప్రతిక్రియలు వుండవు. కానీ సాటి

సన్మార్గవర్తనులమయ్యేందుకు అభ్యాసంకోసమే సమర్ధ సద్గురుడైన శ్రీ సాయి ఆ సంఘటనను ఈ సృష్టి విలాసంలో కల్పించారన్నమాట. ప్రతి సంఘటనలోనూ

**అభ్యాసం వలన క్రమంగా సంఘటన జరిగేముందు, సంఘటన జరిగేటప్పుడే మనకు సాయిబోధ గుర్తుకువస్తుంది. ప్రయత్నించగా, ప్రయత్నించగా అది ఆచరణలోకి వచ్చేస్తుంది. ఈ మొత్తం విషయాన్ని గుర్తుచేస్తుంది "జై సాయి మాస్టర్".**

మనుషులతో వ్యవహరించేటప్పుడు అవతలివాడిలో సాయిని దర్శించడం పామరుడికి అసాధ్యమైన విషయం. కనీసం భావించడం కూడా ఎంతో కష్టమైన పని. అయితే మనం ఈ ప్రయత్నం చేయాలని గుర్తుచేస్తుంది "జై సాయి మాస్టర్" అనే పలకరింపు. ఈ భావాన్ని నిలుపుకుని ప్రయత్నం చేయాలంటే మరొక విషయం గుర్తుపెట్టుకోవాలి. "సద్గురు భక్తునికి ఈ విశ్వమంతా గురుస్వరూపమే!" అనే సత్యం అవధూత 24 మంది గురువులనుండి విద్యను నేర్చుకున్న కధకు సారాంశం. అంటే ఏమిటన్నమాట? మనం నేర్చుకోదలుచుకోవాలేగానీ ఈ విశ్వంలోని ప్రతిదీ మనకు సన్మార్గం బోధిస్తూనే వుంటుంది. అలాగే మనం''జై సాయి మాస్టర్'' అని ఇతరులను పలకరించినప్పుడు ఆ సంఘటన మొత్తం మనకు

ఇతర వ్యక్తులతో మనం ప్రవర్తించేటప్పుడు సందర్భాన్ననుసరించి సాయి ఎటువంటి ప్రవర్తన సరైనదని చెప్పారో, ఆ సందర్భంలో మనలను ఎలా ఆలోచించమన్నారో గుర్తు తెచ్చుకోవాలి. అలా ఆచరించేందుకు ప్రయత్నించాలి. మొదట్లో సంఘటన జరిగిపోయిన తర్వాత తత్సంబంధ సాయిబోధ మనకు గుర్తుకురావచ్చు. ఎందుకంటే మనకు పూర్వపు అభ్యాసము ప్రభావం చేత అలవాటుగా మనం ప్రవర్తిస్తాము. అయినా కనీసం తరువాత అయినా మన ప్రవర్తనను సాయిబోధ ఆధారంగా విశ్లేషించుకోవడం అలవాటు చేసుకోవాలి. దీనికి శ్రీ సాయి లీలామృతము, శ్రీ గురు చరిత్ర, ఇతర మహాత్ముల చరిత్రల నిత్య పారాయణ ఎంతో ఉపకరిస్తుంది. అభ్యాసం వలన క్రమంగా సంఘటన

**మనం నేర్చుకోదలుచుకోవాలేగానీ ఈ విశ్వంలోని ప్రతిదీ మనకు సన్మార్గం బోధిస్తూనే వుంటుంది. అలాగే మనం"జై సాయి మాస్టర్" అని ఇతరులను పలకరించినప్పుడు ఆ సంఘటన మొత్తం మనకు సాయి బోధన అన్వయించుకుని ప్రవర్తించేందుకుగాని, ఆయన తత్త్వాన్ని భావన చేసుకునేందుకుగాని అవకాశంగా మనం అర్థం చేసుకోవచ్చు.**

సాయి బోధన అన్వయించుకుని ప్రవర్తించేందుకుగాని, ఆయన తత్త్వాన్ని భావన చేసుకునేందుకుగాని అవకాశంగా మనం అర్థం చేసుకోవచ్చు. ఒక విధంగా చెప్పాలంటే మనము

జరిగేముందు, సంఘటన జరిగేటప్పుడే మనకు సాయిబోధ గుర్తుకువస్తుంది. ప్రయత్నించగా, ప్రయత్నించగా అది ఆచరణలోకి వచ్చేస్తుంది. ఈ మొత్తం విషయాన్ని గుర్తుచేస్తుంది "జై సాయి మాస్టర్".

అంతులేని తృప్తి, శాంతులకోసం అన్వేషణే మానవజీవిత సారం. అది మానవుని మౌలికమైన జీవన సమస్య. మనిషికి విషయం తెలిసినా కార్యకారణ సంబంధము, పాపపుణ్యాలు, సుఖదు:ఖాలు, జన్మలు-వీటన్నింటి ముఖ్య ఉద్దేశము అదే. ఇవి అన్నీ సృష్టిలోని శిక్షణలోని భాగాలే కాబట్టి

**కర్మసిద్ధాంతము, కార్యకారణ సంబంధము, పాపపుణ్యాలు, సుఖదు:ఖాలు, జన్మలు-వీటన్నింటి ముఖ్య ఉద్దేశము అదే. ఇవి అన్నీ సృష్టిలోని శిక్షణలోని భాగాలే కాబట్టి ఈ సృష్టి ఎప్పుడూ గురుస్వరూపమే. ఆ విషయం మనం అర్థంచేసుకొని ప్రవర్తించడమే మనకు కావాలసినది.**

తెలియకపోయినా అతని ప్రయత్నాలన్నీ వీటిని సాధించడం కోసమే. అంతులేని తృప్తి శాంతులు పొందడమంటే ఆత్మజ్ఞానం పొందడమే. అంటే ఆత్మజ్ఞానం సాధించడమే మానవ జీవిత లక్ష్యమైనదన్నమాట. ఈ లక్ష్యం మౌలికమైన మానవ అవసరమే అయితే ఈ ప్రకృతి అందుకు అర్హులైన జీవులకే ఈ మానవశరీరాన్ని యిచ్చి వుండాలి. అయితే ఈ లక్ష్యాన్ని ఎరిగి సన్మార్గవర్తనులై ఈ లక్ష్యాన్ని సాధించే అవకాశము, విషయవాంఛలలో చిక్కి ఈ అవకాశాన్ని దుర్వినియోగం చేసుకునే అగత్యమూ భావ స్వాతంత్ర్యముగల మానవునికి అనుక్షణమూ వుంటుంది. ఈ లక్ష్యాన్ని మానవునిచే



సాధింపజేయడానికే సృష్టి అంతా ప్రవర్తిస్తూవుంటుంది. అందుకనే పరిణామ క్రమంలో భాగంగా మనిషి ఆత్మవికాసానికి దోహదపరచే సంఘటనలను, వ్యక్తులను వారి వారి బలహీనతలను అనుసరించి ఈ ప్రకృతి కల్పిస్తూవుంటుంది. ఆ సంఘటనలను ఆధారం చేసుకుని, ఆ బలహీనతలను అధిగమించి మనిషి ఆధ్యాత్మికంగా ముందుకు సాగి లక్ష్యాన్ని సాధించాలనే ఈ వ్యవస్థ ఉద్దేశ్యము. కర్మసిద్ధాంతము, ఈ సృష్టి ఎప్పుడూ గురుస్వరూపమే. ఆ విషయం మనం అర్థంచేసుకొని ప్రవర్తించడమే మనకు కావలసినది.

అది సుస్పష్టంగా తెలియజెప్పేందుకు, ఈ పరిణామ క్రమంలో మానవులను త్వరితగతిన ఉద్ధరించేందుకు అన్ని దేశ కాలాలలోనూ సద్గురుతత్వమైన దత్తాత్రేయతత్వము, ఈ సృష్టిలో వ్యక్తరూపంగా కూడా ఎల్లప్పుడూ వుంటుంది. ఆయా దేశకాలాలననుసరించి నిత్యమూ సద్గురువులను మానవులమధ్యకు పంపుతూ వీలైనంతమందిని ఉద్ధరించేందుకు ప్రయత్నిస్తూ వుంటుంది. అన్ని మతాలలోనూ, దేశాలలోనూ గ్రంధాలరూపంలోనూ, మహాత్ముల రూపంలోనూ, వారి బోధల రూపంలోనూ నిత్యమూ మనమధ్య వుండేది ఈ సద్గురు తత్వమే. మన దేశకాలాలననుసరించి ఈనాటి మన జీవితానికి, మన వ్యక్తిగత సామాజిక సమస్యలకు శాశ్వత పరిష్కారంగా శ్రీ సాయి అవతరించారు. ఆయన బోధలు మన నిత్యజీవితంలో వికాసం చెందడానికి మార్గదర్శకాలు. అటువంటి శ్రీ సాయి బోధలను నేటి మన గృహస్థ జీవితాలకు అన్వయించి, ఆచరించి చూపిన సద్గురు స్వరూపమే మాస్టరుగారు, అమ్మగారు. దీని వ్యక్తరూపమే "జై సాయి మాస్టర్".

# శ్రీ సాయిబాబా చిత్రపటం - 12
# దంతధావనం

**శ్రీమతి వేదవతి**

మనం కాలకృత్యాలు తీర్చుకొనిన తరువాత పళ్ళు తోముకుంటాము. దానినే 'దంత ధావనము' అంటారు. అంటే నోరు శుభ్రంగా వుండేందుకే మనం ప్రతిరోజూ శుభ్రపరచుకుంటాము. ఎందుకంటే మనం నోటితో తినగూడనివాటిని తింటూవుంటాము. త్రాగకూడని వాటిని త్రాగుతూవుంటాము, మాట్లాడకూడనివి మాట్లాడుతూవుంటాము. అందుకనే మన నోరు ప్రతి రోజూ అపరిశుభ్రంగా తయారవుతూ వుంటుంది. దానిని ప్రతిరోజూ శుభ్రపరచుకోవలసిన అవసరం మానవులకుంటుంది. లేకపోతే అనారోగ్యానికి దారితీస్తుంది.

కానీ జంతువులకు అలాకాదు. వాటి నోరు నిత్యము శుద్ధిగా వుంటుంది. ఎందుకంటే మానవునిలాగా అవి తినగూడనివాటిని తినవు, త్రాగకూడని వాటిని త్రాగవు, వాటి అరుపుకు విరుద్ధంగా అరవవు, అంటే నోటిని దుర్వినియోగపరచుకోవు. వాటికి చేతనైన అరుపును చేతనైనట్లు అరుస్తాయి. అవి తమ అవసరానికి మాత్రమే నోటిని ఉపయోగిస్తాయి. అవి ఆకలివేసినప్పుడు మాత్రమే, ఆకలి వేసినంత మాత్రమే, తినతగినంత (వాటి ఆహారానికి హితకరమైనవి) తింటాయి. జిహ్వకున్న రుచి, వాసనను ఆస్వాదించగల శక్తి తమ ఆహారాన్ని గుర్తించి తినగలగడానికి ఉపకరణాలు మాత్రమే. అందుకే అవి నోటితో చేయగూడని పని చేయవు కాబట్టి వాటి నోరు నిత్యమూ శుభ్రంగా ఉంటుంది.

మరి వాటికంటే ఎక్కువ తెలివితేటలు, విచక్షణ, వివేకము, విజ్ఞానమూ కలిగిన మానవులమైన మనం ఏమి చేస్తూ వుంటాము? మనం రుచికోసం మన ఆరోగ్యానికి హానికరమైన వాటిని తింటూవుంటాము, త్రాగుతూవుంటాము. ఆకలివేయకపోయినా తింటూవుంటాము. హానికరమైన పానీయాలను త్రాగుతూవుంటాము. తద్వారా క్రమేపీ అనారోగ్యం పాలవుతాం. అందుకే మన నోరు ఆరోగ్యంగా, శుభ్రంగా వుండదు. నిరంతరమూ దానిని శుభ్రపరచుకుంటూ వుండవలసినదే. సంపూర్ణ ఆరోగ్యవంతులమైనప్పుడు మనకు కూడా నోరు శుభ్రంగా వుంటుంది, చెమట వాసన వుండదు, మలమూత్రాదులు దుర్వాసన కలిగి వుండవు. ఈ విషయం ఇంకా ఈ దురలవాట్లు లేని పసిపిల్లలలో చూడవచ్చు.

దీనిని బట్టి ప్రకృతితో మమేకమై ప్రకృతి సూత్రాలను అనుసరించి ప్రవర్తిస్తే ఆరోగ్యము లేక సుఖము, అలా ప్రవర్తించనప్పుడు అనారోగ్యము లేక దుఃఖము కలుగుతాయని మనం అర్థంచేసుకోవచ్చు. రుచిని సరిగ్గా ఉపయోగించుకొని సద్వినియోగపరచుకొని ఆరోగ్యకరమైన ఆహారపు అలవాట్లను పెంపొందించుకున్నప్పుడు మనకు ఆరోగ్యం వచ్చి శరీరం సుఖంగా వుంటుంది. అలాగే



వాక్కును (మాట్లాడే శక్తిని) సద్వినియోగపరచుకున్నప్పుడు మనకు, ఇతరులకూ శ్రేయస్సును కలిగిస్తుంది. శాంతిని, సుఖాన్ని కలిగించి ప్రతిష్ఠించుకున్నాం. అంటే మన ఇల్లే ద్వారకామాయి అన్నమాట. అక్కడ సేవకోసం మనం శుభ్రంగా, శుద్ధిగా అప్రమత్తంగా ఉండాలి. కనుక ఉదయమే

**రుచిని సరిగ్గా ఉపయోగించుకొని సద్వినియోగపరచుకొని ఆరోగ్యకరమైన ఆహారపు అలవాట్లను పెంపొందించుకున్నప్పుడు మనకు ఆరోగ్యం వచ్చి శరీరం సుఖంగా వుంటుంది. అలాగే వాక్కును (మాట్లాడే శక్తిని) సద్వినియోగపరచుకున్నప్పుడు మనకు, ఇతరులకూ శ్రేయస్సును కలిగిస్తుంది.**

మన పుణ్యాన్ని వృద్ధిచేసి మనం సన్మార్గంలో వుండి సద్గతి పొందేందుకు దోహదపడుతుంది. వాక్కును దుర్వినియోగపరచుకున్నప్పుడు అది మనకు, ఇతరులకూ హాని కల్గిస్తుంది. మన శాంతిని, సత్సంబంధాలనూ పాడుచేసి దుఃఖాన్ని పెంపొందిస్తుంది. మన పాపకర్మను పెంచి కష్టాలను అనుభవించేలా చేస్తుంది. సాటివాడిని, "పనికిమాలినవాడా!" అని తిట్టినా కూడా నరకమొస్తుందని మహాత్ములు చెప్పారు కదా! బాబాకూడా ఎవరి గురించైనా చెడుగా మాట్లాడినా, చులకన చేసినా ఒప్పకునేవారు కాదు. ఎందుకంటే అలా చేయడం వల్ల అన్నింటిలోనూ, అందరిలోనూ సాయి వున్నారన్న సత్యం మరుగున పడుతుంది. అది ఎంతగా మరుగున పడుతుందో అంతగా మన ప్రవర్తన శ్రేయస్కరంగా వుండదు.

మరి నోటిని శుభ్రపరచుకోవడమంటే ఏమిటి? దీనిలో రెండు భాగాలున్నాయి- ఒకటి, భౌతికంగా శుభ్రపరచుకోవడం (దంతధావనము, నాలుక శుభ్రపరచుకోవడం); రెండు, వాక్కును శుభ్రపరచుకోవడము (అంటే మనం మాట్లాడే శక్తిని సద్వినియోగపరచుకోవడం). మనం ప్రతిరోజూ దంతధావనం చేసుకొనేటప్పుడు ఈ రెండింటినీ శుభ్రపరచుకుంటాను, ఆ రోజు ఆ రెండింటినీ సద్వినియోగ పరచుకుంటానని నిర్ణయించుకోవాలి.

మనం సర్వాంతర్యామి అయిన సాయిని అనుక్షణం భావన చేసుకొని ప్రవర్తించడానికి ఆలంబనగా శ్రీ సాయి చిత్రపటాన్ని ఇంట్లో దంతధావనం చేసుకోవాలి. అది ఉత్తమమైన ఈ భావంతో చేసుకోవాలి. ఆ నోటితోనే సాయిస్వరూపులైన సాటి మానవులతో (కుటుంబ సభ్యులు, బంధువులు, స్నేహితులు, సహోద్యోగులు, ఎవ్వరైనా కావచ్చు వ్యవహరిస్తూ వుంటాము. ఈ భావంతోనే ఈ నోటితోనే పరమ పవిత్రమైన పంచాక్షరి అయిన 'జై సాయి మాస్టర్' అని పరస్పరం పలకరించుకుంటాము - పలుమార్లు స్మరిస్తాము. ఈ నోటితోనే పూజ చేస్తాము, హారతులు పాడతాము, సత్సంగము చేసి, భజన చేసుకుంటాము. ఈ నోటితోనే భగవంతుని ప్రసాదమైన ఆహారాన్ని భుజిస్తాము. ఇన్ని పవిత్రమైన కార్యాలను చేసేందుకు భగవంతుడైన శ్రీ సాయినాధుడు తమ ఉనికి తమ చిత్రపటం రూపంలో మనకు నిరంతరం గుర్తుచేస్తూనే వుంటారు. దానిని సద్వినియోగ పరచుకోవాలనే ఉద్దేశ్యంతో ఆయన సేవకుడైన మన నోటిని (అదీ ఆయన ప్రసాదమే) శుభ్రం చేసుకోవాలి.

నోటిని ఉదయమూ సాయంత్రము శుభ్రం చేసుకుంటే మాత్రమే చాలదు. దానిని నిరంతరమూ శుభ్రంగా ఉంచుకోగలగాలి. అందుకు సరైన ఆహారపు, పానీయపు అలవాట్లను అలవరచుకోవాలి. హానికరమైన వాటిని, అనవసరమైన వాటిని తొలగించుకొనేందుకు ప్రయత్నించాలి. ఆయన ప్రసాదము ఆరోగ్యకరమైన ఆహారాన్ని తినేందుకు ఆలంబనగా రుచిని గుర్తించాలి. ఎందుకంటే ఆకలి వేయడం, రుచి వుండడం, దానిని ఆస్వాదించడం ఇవన్నీ మనకు శ్రీ సాయి ప్రసాదించినవే. ఇవి

అపారకరుణతో భగవంతుడు ప్రసాదించి వుండకపోయినా మనం జీవించడానికి కష్టంగా అయినా ఆహారం తినక తప్పేది కాదు. అటువంటి కష్టం తమ బిడ్డలమైన మనకు భగవంతుడు కలగనివ్వలేదు. అందుకని ఆకలి, రుచి అనేవి కూడా శ్రీ సాయి ప్రసాదాలే. ప్రసాదాన్ని సద్వినియోగపరచడం భక్తుని కనీస బాధ్యత. వీటిని ఆరోగ్యం పెంపొందించుకునేందుకు ఆలంబనగా ఉపయోగించుకొని, మన దేహాన్ని దృఢంగా వుంచుకొని ఎటువంటి శారీరక అసౌకర్యం లేకుండా సంపూర్ణంగా సాయి సేవలో గడిపి తరించవచ్చు. అంతటి అదృష్టాన్ని, అవకాశాన్ని మానవదేహానికి మాత్రమే ప్రసాదించారు శ్రీసాయి.

నోటిని మాత్రమే శుభ్రపరచుకుంటే చాలదు. మన వాక్కును కూడా శుభ్రపరచుకోవాలి. ఆకలి, రుచి లాగే వాక్కు కూడా భగవంతుని ప్రసాదమే. వాక్కు సరిగ్గా వుండాలంటే దానికి తగిన శరీర నిర్మాణం (నోరు, స్వరపేటిక మొ॥వి) సరిగ్గా వుండాలి. దానికి మెదడు సహకరించాలి. ఇవి రెండూ సరిగ్గా పనిచేసేటట్లు భగవంతుడు అనుగ్రహించాల్సిందే! అంతే కాదు వ్యక్తీకరణకు ఆలంబనైన వాక్కుకు శబ్దం, నాదం, భావం, భాష ఇవన్నీ ఒక సహకారంతో పనిచేయాలి. భాషకు ఆలంబనైన శబ్ద, అర్థాలు, అక్షరాలు, పదాలు, వాక్యాలు వుండాలి. అవి మన నోరు పలకగలిగి వుండాలి. అవి అవతలివారికి అర్థమై మనకు, వారికీ ఉపకరించాలి. మనలోనే వున్న శక్తిని సద్వినియోగపరచుకోవాలి. ఈ విషయాలన్నీ ప్రతిరోజూ గుర్తుంచుకోవలసిన స్తోత్రాన్ని యిలా చెబుతారు. వాక్కుకు ఆలంబనైన సరస్వతీదేవి (ఆమె రూపంలో వుండే సకల దేవతల స్వరూపుడైన సాయినాధుని) పళ్ళుతోముకునేటప్పుడు యిలా స్తుతించుకోవాలి.

శ్లో॥ యా వర్ణ పద వాక్యార్థా గద్యపద్య స్వరూపిణీ ।
వాచినర్తయతుక్షిప్రం మేధా దేవీ సరస్వతీ ॥

అర్థం : వర్ణమాల (అక్షరాలు), పదాలు, వాక్యాలు, వాటి అర్థాలు, గద్యము, పద్యం మొదలైన వాటన్నింటి రూపంలో ఉన్నటువంటి మేధస్సుతను పరిపాలించేది సరస్వతీ! నా వాక్కులో ఉత్సాహంగా నర్తించెదవుగాక!

శ్లో॥ యా శ్రద్ధా ధారణా మేధా వాగ్దేవీ విధివల్లభా ।
భక్త జిహ్వాగ్ర సదనా శమాది గుణదాయినీ ॥

అర్థం : శ్రద్ధ, ధారణ (గుర్తుంచుకోగలిగే శక్తి), మేధస్సు, వాక్కు మొదలైన వాటిని పరిపాలించే సరస్వతీదేవీ, (నీవే) కర్మసూత్రానికి (విధికి) ప్రియురాలివి. అటువంటి నీవు శమ, దమాది శుభ గుణాలను ప్రసాదిస్తూ ఎల్లప్పుడూ భక్తుల నాలుకల చివర (వారి మాటల రూపంలో) నివసిస్తూవుండే ఓ సరస్వతీ! నీకు నమస్కారము.

---

**ఆకలి వేయడం, రుచి వుండడం, దానిని ఆస్వాదించడం ఇవన్నీ మనకు శ్రీ సాయి ప్రసాదించినవే. ఇవి అపారకరుణతో భగవంతుడు ప్రసాదించి వుండకపోయినా మనం జీవించడానికి కష్టంగా అయినా ఆహారం తినక తప్పేది కాదు. అటువంటి కష్టం తమ బిడ్డలమైన మనకు భగవంతుడు కలగనివ్వలేదు. అందుకని ఆకలి, రుచి అనేవి కూడా శ్రీ సాయి ప్రసాదాలే.**

---

సర్వాంతర్యామి అయిన సాయియే ఈ క్రియలన్నింటినీ మనలోపలా, బయటా నిర్వర్తిస్తూ వుంటారు. ఇన్నింటిని సాయి మనలో నిర్వర్తిస్తూ వుంటేనే మనం మాట్లాడగలిగేది. అందుకు మనమెంతో కృతజ్ఞతగా వుండాలి. అంతేకాదు ఈ

సకల దేవతా స్వరూపుడైన సాయిని మన వాక్కు రూపంలో దానికాధారమైన మేధస్సు, భాష రూపంలోనూ వున్న సరస్వతీదేవిగా భావిస్తూ దంతధావనం చేసుకోవాలి. ఈ భావాన్ని నిరంతరమూ రోజంతా నిలుపుకునేందుకు ప్రయత్నిస్తూ అందుకు

ఆలంబనైన సాయి సూక్తులను భావన చేయాలి. నిరంతరమూ సాయి స్మరణలో మనస్సును నిలుపుతూ మాటను నియంత్రించడం అలవాటు చేసుకోవాలి. ఇందుకు "పదిమాటలకు ఒక మాటతో సమాధానం చెప్పు!" అన్న సాయి సూక్తిని స్మరించుకోవాలి. మితంగాను, ప్రియంగాను సంభాషించడం

అంతేకాదు. వాక్కును సద్వినియోగపరచుకోవాలి కూడా. నిత్యమూ నోటితో సాయి స్మరణ, భజన చేస్తూ వుండాలి. ఇతరులతో వ్యవహరించేటప్పుడు ముందుగా 'జై సాయి మాస్టర్' అని పలుకరించుకునే వారిలో బాబాను భావించి మన వాక్కును నియంత్రించాలి. పూజ, నామం,

**అసభ్యకరమైన సంభాషణలు వేశ్య ప్రదర్శనలే. కాబట్టి వాటిని కూడా మానేయాలి. బాబా ఇతరులగురించి చెడుగా మాట్లాడడాన్ని 'పంది పెంట తినడం'తో పోల్చారు. మనకు తెలిసిన తెలియకపోయినా అది అంతటి అసహ్యకరమైనదన్నమాట. కాబట్టి దానినీ మానేయాలి.**

అలవరచుకోవాలి. అనవసరమైన సంభాషణలను, కబుర్లను మానివేయాలి. ఎందుకంటే అవి మన కాలాన్ని హరించి దుర్వినియోగపరుస్తాయి. అంతేకాదు బాబా సేవలోని మన శ్రద్ధను భంగపరుస్తాయి. "ఎవరెవరితోనైనా పోట్లాడితే నాకు చాలా అసహ్యం వేస్తుంది" అన్న బాబా మాటలు స్మరించి పోట్లాడుకోవడం మానివేయాలి. అలాగే బాబాకు ఎవరెవరిగురించైనా చులకనగా మాట్లాడితే చాలా కోపం వచ్చేదట. కాబట్టి చులకనగా మాట్లాడడం, మన మాటల ద్వారా ఇతరులను బాధపెట్టడం మానేయాలి. అలాగే అసభ్యకరమైన సంభాషణలు వేశ్య ప్రదర్శనలే. కాబట్టి వాటిని కూడా మానేయాలి. బాబా ఇతరుల గురించి చెడుగా మాట్లాడడాన్ని 'పంది పెంట తినడం'తో పోల్చారు. మనకు తెలిసిన తెలియకపోయినా అది అంతటి అసహ్యకరమైనదన్నమాట. కాబట్టి దానినీ మానేయాలి. అలానే మాస్టరుగారు అనవసరపు కబుర్లను చెప్పుకునే వారిని మున్సిపాలిటీ చెత్తకుండీతో పోల్చారు. కాబట్టి వాటిని కూడా మానేయాలి. ఇవన్నీ మానేయడం వల్ల మనం కోల్పోయేది ఏమీ వుండదు. ఇవి గోళ్ళు గిల్లుకోవడంలాటి నిరుపయోగమైన అలవాట్లు. కొన్ని ఎంతో హానికరం కూడా. కాబట్టి సాయి చిత్రపటాన్ని మనింట్లో పెట్టుకున్నాక యివన్నీ మానేయడం మన బాధ్యత. మనకు సాయి యిస్తున్న శిక్షణ. కనీసం వీటిని పోగొట్టుకోవడానికి తీవ్రమైన ప్రయత్నం చేయాలి.

హారతులు, సత్సంగాలు, భజన వీటితో మనమాటను అలంకరించుకుని బాబాను సేవించాలి. సత్కాలక్షేపం, సద్గ్రంథపఠన, మిత భాషిత్వం అలవాటు చేసుకోవాలి. ఈ విధంగా మనం మన వాక్కుతో సాయిని నిత్యమూ సేవించవచ్చు. ఇలా నోటినీ, వాక్కును శుభ్రపరచుకుంటే శ్రద్ధ నిలుపుకోవడానికి ఉపకరిస్తుంది. అలా దంతధావనాన్ని కూడా మన సాధనకు ఉపకరణంగా వాడుకోవచ్చని మాస్టరుగారు చెప్పారు. మన వాక్కు రూపంలోనూ, ఎదురుగా వున్న చిత్రపటంలోనూ సాయియే వుండి మన ప్రవర్తనకు సాక్షిరూపియై వున్నారు. జాగ్రత్త!

# ప్రాపంచికమా? ఆధ్యాత్మికమా? ఏది ముందు?

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

కొద్దో గొప్పో మతాచారాలు పాటించే వారిలో ఎక్కువమందికి ఎప్పుడూ ఒక ప్రశ్న ఎదురౌతూ వుంటుంది. ప్రాపంచిక జీవితానికెక్కువ ప్రాధాన్యమివ్వాలా, లేక ఆధ్యాత్మిక జీవితానికా? అని. ఇది ఒక్కసారిగా తేలే ప్రశ్న కూడా కాదు. విధిలేక లౌకిక జీవితానికే ప్రాధాన్యతనివ్వవలసి రావడం వలన, తాము మమకారాలలో, లౌకిక బంధాలలో చిక్కుకొంటున్నామన్న అసంతృప్తి కలుగుతుంటుంది. వీరిలో కొందరు వృద్ధాప్యం వరకూ లౌకికానికీ, అటు తర్వాత ఆధ్యాత్మికానికీ ప్రాధాన్యతనివ్వవచ్చని తలుస్తారు. సమాధానపడతారు. లౌకికమైన బాధ్యతలు, కోరికలూ నెరవేరాక అప్పుడు ఆధ్యాత్మికానికి అంకితం కావచ్చనుకుంటారు. కాని ఆలోగా మమకారాది భావాలు బలపడి వృద్ధాప్యంలో గూడా సడలవు. ఆధ్యాత్మ సాధనకు కూర్చున్నా లౌకిక వ్యవహారాలే మనసులో ముసురుతుంటాయి. అందుకే శ్రీ రామకృష్ణ పరమహంస అన్నారు - జీవితంలో బాధ్యతలు, కోరికలూ తీరాక తీవ్రసాధన ఆరంభించవచ్చునుకోవడం సముద్రంలో అలలు ఆగాక స్నానం చేస్తామనుకోవటం లాంటిది. కొందరు మొదటినుండి ఆధ్యాత్మ విద్యకు ప్రాధాన్యమివ్వజూస్తారు. అపుడు లౌకికమైన ప్రయత్నాలు నిర్దుష్టంగా చేయనందువలన వారి జీవితాంతం అమరణాంతమూ లౌకికమైన కొరతలతో బాధలు పడతారు. తమ బాధలన్నిటికీ పూర్వకర్మే కారణమని సమాధానపడజూస్తారు. కాని ప్రత్యక్షమైన బాధలు, బాధ్యతలు అలా భావించుకొన్నంత మాత్రాన వారి మనస్సులను వేధించక మానవు. అపుడు భార్యా బిడ్డలు తమ ఆశయాలకు ప్రతి బంధకాలన్న బాధ, అక్కసు లోలోపల పెరిగి, ఆధ్యాత్మికత, వైరాగ్యాల పేరిట వారి పట్ల సహజమైన ప్రేమను చంపుకుని వారి బాగోగులు అశ్రద్ధ చేయడమో, లేక క్రమశిక్షణ పేరిట అతికాఠిన్యం వహించటమో జరుగుతూంటుంది.

ఆధ్యాత్మికతన్నా, జీవితమన్నా సరియైన అవగాహన లేకపోవడం వల్లనే జీవితంలో మౌలికమైన యిట్టి వైరుధ్యం ఏర్పడుతుంది. నిజానికేజీవికైనా పుట్టినపుడు దానిలో దాగియున్న సామర్థ్యాలన్నీ సంపూర్ణంగా వికసించడము, అట్టి వికాసొన్నందిన తరువాత అటువంటి తరాన్ని ఉత్పన్నం చేయడము - ఇవే ప్రకృతి నిర్దేశించిన జీవిత లక్ష్యమని కొంత యోచిస్తే తెలుస్తుంది. అట్టి వికాసానికి ప్రతి జీవి స్వానుభవాలను, తెలివినీ వుపయోగించి అటు శ్రేయస్కరమైన బాహ్యపరిస్థితులను, సంస్కారాన్ని పొందజూస్తుంది. కాని మనిషి తాత్కాలికమైన యిష్టా యిష్టాల వలన ప్రకృతి సిద్ధమైన యీ ఆత్మ వికాసమనే లక్ష్యాన్ని అలక్ష్యం చేస్తాడు. అంటే వ్యక్తి ఆత్మపరిపాకం చెంది తన బాధ్యతను గుర్తించడం కంటె తాత్కాలికమైన తన యిష్టాయిష్టాలకే ప్రాధాన్యమివ్వ జూస్తాడు. సమాజం అతడు తన బాధ్యతలను నిర్వర్తించడానికే ప్రాధాన్యమిస్తుంది. అందుకే ఆ వ్యక్తి జీవితంలో యిట్టి ఘర్షణ ఏర్పడుతుంది.

వ్యక్తి, సమాజానికి శ్రేయస్కరమైన పనిచేసి, జీవిక నేర్పరచుకొనవలసిరావడం ప్రకృతి సిద్ధం. కాని అలా చేయగలగాలంటే వ్యక్తికి మనోవికాసమవసరం. అంతేగాదు ప్రతివారూ తమ యిష్టాయిష్టాలను మాత్రమే నెరవేర్చుకోవడంలో సమాజ శ్రేయస్సు పట్టించుకోకుంటే సమాజంలో అస్తవ్యస్తమేర్పడుతుంది. అవినీతికి, స్వార్థానికిదే మూలం. వాటివలన సమాజంలో ప్రతివారి జీవితమూ దుర్భరమౌతుంది. ఈనాటి పరిస్థితి యిదే. ఇందువలన సమాజ శ్రేయస్సుతో పాటు వ్యక్తి శ్రేయస్సు గూడ దెబ్బతింటుంది. ప్రతివారి జీవితావసరాలు, బాధ్యతలూ కోర్కెలు నెరవేరడం అంతకంతకూ కష్టతరమై అవినీతి, వంచనలు మాత్రమే అనివార్యాలవుతాయి.

దీనికంతటికీ మూలకారణం పై జెప్పిన ప్రకృతి ధర్మాలను మానవుడు గుర్తించకపోవడమే. ఇది తెలిసిన ఋషులు నిర్దుష్టమైన శ్రేయోమార్గాన్ని రూపొందించారు. ప్రతి తరానికీ ఏడెనిమిది 'గురువుని' లేక 'ఆచార్యుని' బాల్యంనుండి ఆశ్రయించి శిక్షణ పొందటం ప్రధాన సంప్రదాయంగా ఋషులేర్పరచారు. పాశ్చాత్య నాగరికతలోగూడ వెనుక అలానే వుండేది. అట్టివే వెనుకటి విద్యాలయాలు.

**మమకారాది భావాలు బలపడి వృద్ధాప్యంలో గూడా సడలవు. ఆధ్యాత్మ సాధనకు కూర్చున్నా లౌకిక వ్యవహారాలే మనసులో ముసురుతుంటాయి. అందుకే శ్రీ రామకృష్ణ పరమహంస అన్నారు - జీవితంలో బాధ్యతలు, కోరికలూ తీరాక తీవ్రసాధన ఆరంభించవచ్చనుకోవడం సముద్రంలో అలలు ఆగాక స్నానం చేస్తామనుకోవటం లాంటిది.**

సంవత్సరాల నుండే శారీరకము, మానసికమూ అయిన క్రమశిక్షణ, యింద్రియ మరియు మనస్సులను తమ ఆధీనంలోనుంచుకొని ఏది శ్రేయస్కరమో పెద్దలనుండి తెలుసుకొని అట్టి ధర్మాన్ని సంపూర్ణంగా ఆచరించడానికి అంకితమయ్యేలా చేయడమే బ్రహ్మచర్యము మొదలైన నాల్గు ఆశ్రమాల ధ్యేయం. అంటే అలా ప్రతివ్యక్తీ పై జెప్పిన ప్రకృతి ధర్మాలను మొదటి నుండే గుర్తించి అనుసరించగలిగేలా సంస్కరించడమొక్కటే వ్యక్తిగతము, సామాజికమూ అయిన జీవిత సమస్యకు పరిష్కారం. అందుకే ప్రపంచంలో ఏ మతధర్మం జూచినా యింద్రియ-మనోనిగ్రహంతో ధర్మాన్ని మనసా కర్మణా ఆచరించమనే చెప్పింది. అట్టి ధర్మంలో సమాజం పట్ల బాధ్యత, ప్రేమ యిమిడియుంటాయి. ఉదా:- పేదలకు దానము బాధితులకు సహాయము, వృద్ధులకు ప్రేమ పూర్వకమైన సేవ చేయమనే అన్ని మతాలూ చెబుతాయి. అట్టి ధర్మాన్ని అలక్ష్యంచేస్తే వినాశం తప్పదని హెచ్చరించాయి. అందుకే మనకీనాడెదురౌతున్న సంఘర్షణ వెనుకటివారి కెదురవలేదు. అప్పుడు సామాజికంగా ధర్మము, వ్యక్తిగత జీవితాలలో సుఖశాంతులు ఎక్కువగా వుండేవి.

ప్రాకృతికమైన జీవిత సూత్రాలను గుర్తించి యిహపర శ్రేయస్సుల సమన్వయమే జీవితంగా రూపొందించుకోగలగాలంటే చిన్నప్పటినుండీ అట్టి క్రమశిక్షణ అవసరం. అట్టి స్థితినందిన వారే మనకట్టి జ్ఞానము, క్రమశిక్షణ గూడ యివ్వగలరు. అందుకే వాటినిమాత్రమే 'కాన్వెంట్లు' అనేవారు. నేడు ప్రాచీన సంప్రదాయాలన్నింటితో పాటు యిదిగూడ నశించడమే అన్ని అనర్థాలకు కారణమౌతున్నది. ప్రతివారూ తమ యిష్టా యిష్టాలకు బానిసలై సామాజిక బాధ్యతలను చక్కగా నిర్వర్తించలేకున్నారు. ఆత్మ వికాసమనే ఒక్కగా నొక్క జీవితలక్ష్యము నెరవేరడం లేదు. ప్రపంచమంతా ఒకరితో ఒకరు వంచించుకొని పీక్కుతినే పురుగుల పుట్టగా మారుతున్నది. వెనుకటి ఋషులందించిన అంతరంగికమైన సంస్కారం నశించి, బాహ్యాచారాలు మాత్రం దురభిమానానికి ప్రతీకలుగా రూపొందాయి. అందుకే మధ్యయుగంలో మానవుణ్ణి దైవంగా రూపొందించవలసిన మతం, మత ద్వేషంగా మారి ఎన్నో ఘర్షణలకు, ఎంతో వినాశానికీ కారణమైంది. "ఏకంసత్" "నిజానికి దేముడొక్కడే" అన్న ఋషి వాక్యం మరచి వివిధ దేవతల నారాధించేవారు ఆ దేవతలందరూ ఒక్కడే అయిన దైవంయొక్క వివిధ శక్తులన్న సంగతి మరచి కలహించుకొన్నారు. ఇట్టి ఘర్షణలకు తావీయని అవగాహన సాధించి, ఆచరించి బోధించగల గురువులను సేవించడంమాని మానవులు తమ యిష్టాయిష్టాలనే ఆశ్రయించి దురహంకారంతో మూఢమైన తమ విశ్వాసాలను సాటివారిపై రుద్దజూడ్డమే నేటి మన దుస్థితికంతటికీ కారణం. రాజకీయ నాయకులు, అవగాహనలేని మత విశ్వాసాలు, నటీనటులపట్ల దురభిమానము, వీటివలన కలిగే ఘర్షణలు, కులమత ద్వేషాలు - యివన్నీ నేడు పెచ్చు

పెరగడానికదే కారణం. నిజమైన గురువులు, ఆచార్యులందరిలో యిలాంటి సంప్రదాయ సంబంధమైన ద్వేషాలుండవు. రామక్రిష్ణ పరమహంస, సాయిబాబా, రమణమహర్షి, వెంకయ్యస్వామి మొదలైనవారే యిందుకు తార్కాణము. అట్టి వారి(నే)ని అనేక మందిని ఆశ్రయించి, వారినుండి జ్ఞానాన్ని సాధించాలి గాని బాహ్యమైన నామరూపాల భేదం ప్రధానం కాదని ఋషులిలా చెప్పారు,

శ్లో: మధులుబ్ధో యథా భృంగః పుష్పాత్పుష్పాంతరం వ్రజేత్ ।
జ్ఞాన లుబ్ధస్తధా శిష్యో గురోర్గుర్వంతరం వ్రజేత్ ॥

అర్థం : తేనెయందు ప్రీతిగల తేనెటీగ (వేర్వేరు పువ్వుల రూప బేధాలు పట్టించుకొనక) పువ్వు నుండి పువ్వుకు వెళ్ళి తేనెను సేకరించినట్లే జ్ఞానంపట్ల నిజమైన ప్రీతిగల సిసలైన శిష్యుడు అనేకమంది గురువులను దర్శించి వారినుండి ఒక్కటియే అయిన జ్ఞానమార్జించాలి.

వ్యక్తులీధర్మాన్ని ఆచరించనంతకాలమూ వివిధ దేవతలను, గురువులనూ ఆశ్రయించి ఆరాధించే వారి మధ్య పరస్పరద్వేషము, అసహనాలు ఏర్పడతాయి. అలా కాకపోవడంవల్లనే మన ప్రాచీన సంస్కృతి యంతా ఐక్యతతోనిలచి ప్రజలకు సంతోషాలనిచ్చింది. అంతకాలమూ అన్ని రంగాలలో ప్రపంచంలో మరేదేశమూ లేక సంస్కృతీ సాధించలేని ఔన్నత్యాన్ని సాధించింది. ఇట్టి అవగాహన లోపించి ఋషులూ మరియు గురువుల పట్ల అవగాహనతో గూడిన భక్తి విశ్వాసాలకు బదులు, మూఢము సంకుచితమూ అయిన అభిమానం ఎప్పడు నెలకొన్నాయో నాటినుండీ మన దేశము, సంస్కృతీ గూడా అధోగతిపాలయ్యాయి. ధర్మాన్ని ఆచరించడం మాని రాజ్యాల కోసము, స్వమతాధిక్యతలతో కొట్లాడుకోవడం వలన మన సంస్కృతి కుక్కలు చింపిన విస్తరి అయింది. రాజకీయంగా కొన్ని శతాబ్దాల పాటు పరదాస్యానికి లోనైంది. హీనమైన విదేశీయ సంస్కృతికి బానిసయైంది. ఇట్టి సంకుచితత్వం రాకుండా చూచుకోడానికే అనేక గురువులను సేవించుకొమ్మని ఋషులాదేశించారు. పూర్ణులైన మహనీయుల వద్దకు గూడ పంపడం వారి చరిత్రలో చూడవచ్చు. దురభిమానంతో యితర గురువులను, సాధువులను నిందించేవారి ముఖం కూడ చూడరాదని హెచ్చరించేరు. కాని యీ రోజుల్లో గురువులుగా చలామణి అయ్యే అనేక మంది యిట్టి సంకుచితత్వాన్ని

**ప్రతి తరానికీ ఏడేనిమిది సంవత్సరాల నుండే శారీరకము, మానసికమూ అయిన క్రమశిక్షణ, యింద్రియ మరియు మనస్సులను తమ ఆధీనంలోనుంచుకొని ఏది శ్రేయస్కరమో పెద్దలనుండి తెలుసుకొని అట్టి ధర్మాన్ని సంపూర్ణంగా ఆచరించడానికి అంకితమయ్యేలా చేయడమే బ్రహ్మచర్యము మొదలైన నాల్గు ఆశ్రమాల ధ్యేయం.**

**ఋషులూ మరియు గురువుల పట్ల అవగాహనతో గూడిన భక్తి విశ్వాసాలకు బదులు, మూఢము సంకుచితమూ అయిన అభిమానం ఎప్పడు నెలకొన్నాయో, నాటినుండీ మన దేశము, సంస్కృతీ గూడా అధోగతిపాలయ్యాయి. ధర్మాన్ని ఆచరించడం మాని రాజ్యాల కోసము, స్వమతాధిక్యతలతో కొట్లాడుకోవడం వలన మన సంస్కృతి కుక్కలు చింపిన విస్తరి అయింది.**

తమ భక్తులలో పెంపొందించడం చూడవచ్చు. ఇంతటి విశాల దృష్టి తమనాశ్రయించిన వారికి కల్గాలని ఆశించనివారు గురువులెలా కాగలరా? అన్న సందేహంగూడ తమ అనుయాయులకు కలక్కుండా చూచుకుంటారు. తాము దప్ప ప్రపంచంలో వేరు మహనీయులు లేరన్నట్లు తమ పత్రికలలో గూడ మరొక మహనీయుని ప్రస్తావనైనా రానీయరు. అజ్ఞులైనవారి భక్తులు అట్టి మౌఢ్యమే, తమ భక్తియని భ్రమిస్తారు. ఈ లోటును మన సమాజం నుండి తొలగించుకొని మన సంస్కృతిని పునఃప్రతిష్ఠింప చేసుకొనడానికే అనేకమంది మహనీయుల చరిత్రలు సేకరించి వ్రాయడమవుతుంది. ఇట్టి చరిత్రలు అనేకము శ్రద్ధగా పారాయణ చేయడంవలన వారి అందరిలో ఒకే జ్ఞాన స్వరూపము, భగవస్వరూపము వెలుగొందుతుందన్న వివేకము మనలో మేల్కొంటుంది. అప్పడు దేశంలోవున్న మహనీయుల ఆశ్రమాలన్నీ, వారివారి భక్తుల మధ్య విబేధాలతో బలహీన పరిచేబదులు, సమైక్యం చేసి పటిష్టంచేయడం జరుగుతుంది. తమోగుణంతో గూడిన పరస్పర ద్వేషభావంతొలగి సాత్వికమైన సమైక్యత నెలకొనకపోతే అది ఆధ్యాత్మికత ఎలా అవుతుంది? "ఎందరో మహానుభావులు - అందరికీ వందనములు" అను ఆర్షవాణి మరల దేశమంతటా వినిపించనిదే మన ఆధ్యాత్మిక కార్యక్రమాలన్నీ మనకు, దేశానికి కూడా శ్రేయస్కరము ఎలా అవుతాయి? అందుకే పైశ్లోకములోనేగాక మరెన్నో రీతుల అట్టి గుర్తింపే ఆధ్యాత్మిక గ్రంధాలలో ఎన్నో రీతుల సూచించబడింది. ప్రతివారు ఉత్తముడైన గురువును ఆశ్రయించితీరాలని చెబుతూనే పూర్ణుడైన ప్రతి గురువు త్రిమూర్తులు మరియు పరబ్రహ్మ స్వరూపాలనే గురుధ్యాన శ్లోకం చెబుతుంది.

అంటే ఎందరు గురువులున్నా వారందరి రూపాలలో ఆ గురుతత్వమొక్కటే వెలుగొందుతుందని భక్తులు గమనించాలి. ఏ గురువును భేదభావముతో చూచినా తమ గురువును, అయిన ఇచ్చే శిక్షణను అపకీర్తిపాలు చేసుకొనడమేగదా అనే సంగతి వివేకము ఉదయించినప్పడే తెలుస్తుంది. అట్టి జ్ఞానులందరూ తన రూపమేనని, తనకు వారికి భేదమే లేదని శ్రీకృష్ణుడు చెప్పాడు. ఏ గురువుయందు దురభిమానముతోనో యితర గురువులను వేరనితలచి త్రుణీకరిస్తే ఆ భగవంతుని తృణీకరించినట్టే; జ్ఞానాన్ని త్రుణీకరించినట్లే. రాముడు కూడా తాను సేవించిన వశిష్ట, విశ్వామిత్రులనేగాక అరణ్యంలో నివసిస్తున్న తపస్వులందరిని సేవించినది మనబోటి అజ్ఞానాంధులను సంస్కరించడానికే. అయినా పట్టించుకొనకుండ ఆధ్యాత్మికత పేరిట తుచ్ఛమైన సంకుచితత్వానికే తలవొగ్గే 'భక్త' లోకానికి మరింత స్పష్టంగా పూర్ణులైన గురువులందరు ఒక్కటే అని తెలపడానికే పూర్ణదత్తావతారమయిన 'శ్రీ శిరిడీ సాయిబాబా' మహాత్ములందరు తమ రూపమేనని నిరూపించారు.




*శ్రీ రామకృష్ణపరమహంస మహాత్ములలో ఎంతో విశిష్టమైన వారని పూజ్యశ్రీ మాస్టరుగారు తెలియజేసారు. ఆధ్యాత్మిక శ్రేయస్సును కలిగించే శ్రీ రామకృష్ణుల జీవిత చరిత్ర, సంబంధిత గ్రంధాలను పూజ్య బాబుగారు ఎందరి చేతనో పారాయణ చేయించారు. చదువరుల సౌలభ్యం కోసం Sri Manga BharadwajaTrust వారు ఈ పుస్తకాలనుకూడా విక్రయిస్తున్నారు. ఇతర గ్రంధాలలాగానే భక్తులు ఈ పుస్తకాలను ట్రస్టువారి నుండి కొనుక్కొని, ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు.*

# జ్ఞానేశ్వర్ మహరాజ్ చరిత్ర

**శ్రీమతి వేదవతి**

గంగానదీ తీరంలో 'ఆపగావ్' అనే ఊరిలో గోవింద పండితుడు, ఆయన భార్య 'నీరుబాయి' నివసిస్తూ వుండేవారు. వీరిద్దరూ ఆదర్శమైన గృహస్థజీవితాన్ని గడుపుతూ ఎంతో భక్తి శ్రద్ధలతో 'గైనీనాథ్' అనే ఒక మహాత్ముని సేవిస్తూవుండేవారు. వారికి ఎంతకాలానికీ సంతానము కలుగలేదు. ఒకరోజు ఆ మహాత్ముడు వారింటికి వచ్చి వారి ఆతిథ్యాన్ని స్వీకరించి వారిని ఆశీర్వదించి వారితో, "పుణ్యాత్ములారా! మీకు సంతానం ప్రాప్తించే సమయం ఆసన్నమైనది. మీరు వెంటనే పండరీపురానికి వెళ్ళి శ్రీ పాండురంగడిని దర్శించండి. ఆయన అనుగ్రహంతో మీకు ఒక ఉత్తముడైన కుమారుడు జన్మిస్తాడు" అని చెప్పారు. వెంటనే వారు తమ గురువు ఆజ్ఞననుసరించి పండరీపురానికి వెళ్ళి స్వామిని సేవిస్తూ అక్కడే మూడు రోజులు నిద్ర చేశారు. మూడవ రోజు రాత్రి గోవిందపంతు కలలో శ్రీ పాండురంగడు దర్శనమిచ్చి, ఒక పండును ప్రసాదించి, తప్పక త్వరలో అతడికి ఒక కుమారుడు జన్మిస్తాడని ఆశీర్వదించి అదృశ్యమయ్యాడు. గోవిందపంతు దంపతులు ఎంతో సంతోషించి, ఆ పండును ప్రసాదంగా స్వీకరించి, పండరీపురంలో దానధర్మాలు చేసి తమ స్వగ్రామానికి చేరుకున్నారు.

కొంతకాలానికి వారికి ఒక కుమారుడు జన్మించాడు. ఆ దంపతులను ఎంతో సంతోషించి విరివిగా దానధర్మాలు చేసి ఆ పిల్లవాడికి జాతకర్మను జరిపించారు. శ్రీ పాండురంగని ప్రసాదంగా జన్మించిన తమ కుమారుడికి 'విఠోభా' అని నామకరణం చేశారు. విఠోభాకు సరియైన వయస్సు వచ్చిన తర్వాత అతడికి ఉపనయనం జరిపించి అతనికి వేద శాస్త్ర పురాణాలన్నీ నేర్పించారు. కొంతకాలానికి విఠోబాకు యుక్తవయస్సు వచ్చింది. గోవిందపంతు తన కుమారునికి వివాహప్రయత్నాలు చేయసాగారు. ఆ విషయము తెలుసుకొని విఠోబా ఒక రోజు తండ్రి వద్దకు వచ్చి, "తండ్రీ! మీరు నాకు వివాహము చేయాలని సంకల్పించారు కదా! కానీ నాకు చాలాకాలంగా తీర్థయాత్రకు వెళ్ళాలనే కోరిక వున్నది. కాబట్టి తీర్థయాత్రకు వెళ్ళి వచ్చి వివాహం చేసుకుంటాను" అని చెప్పాడు. తీవ్ర విరాగి అయిన తమ కుమారుని కోరికకు కలతచెంది గోవిందపంతు తన కుమారుని పట్ల వాత్సల్యంతో, "నాయనా! నీ కోరిక నన్ను కలవరపెడుతున్నది. కానీ నీ మనస్సును నొప్పించి వెంటనే వివాహము జరిపించడం ధర్మము కాదు. కాబట్టి నీవు ఒక సం॥ము లోపల తీర్థయాత్ర పూర్తి చేసుకుని తిరిగి అప్పుడే వివాహం జరిపిస్తాను" అని చెప్పాడు.

విఠోబా తల్లిదండ్రుల ఆశీస్సులు పొంది బయలుదేరి ఎన్నో తీర్థక్షేత్రాలను సందర్శిస్తూ,



పుణ్యనదులలో స్నానాలు చేస్తూ ఎందరో దేవతలను సేవిస్తూ నిరంతరము హరిస్మరణలో తీర్ధయాత్ర కొనసాగించాడు. మార్గ మధ్యంలో అతడు 'అలకాపురి' అనే ఊరికి వచ్చి అక్కడ ఒక అనుకూలమైన ప్రదేశంలో భగవంతుడిని అర్చిస్తూ కూర్చున్నాడు.

అలకాపురిలోనే కులకర్ణి సిద్ధోపంత్ అనే బ్రాహ్మణుడు నివసిస్తూ వుండేవారు. అతడు ప్రతిరోజూ అలకాపురంలోని చక్రతీర్ధంలో స్నానము చేయడానికి వచ్చే బ్రాహ్మణులను ఇంటికి తీసుకువెళ్ళి ఆతిధ్యమిచ్చేవాడు. అతడు ఒకరోజు అతిథికోసం అక్కడకు వచ్చి అక్కడే పరమ నిష్ఠగా భగవంతుని అర్చిస్తూ వున్న విఠోబాను చూసి ఆ రోజు తన ఇంటికి ఆతిథ్యానికి ఆహ్వానించాడు. విఠోబా అంగీకరించి సిద్ధోపంత్ ఇంటికి భోజనానికి వెళ్ళాడు. సిద్ధోపంత్ విఠోబాను దైవస్వరూపునిగా భావించి సకల ఉపచారాలతో పూజ చేసి పంచభక్ష్య పరమాన్నాలతో అతనికి ఆతిధ్యమిచ్చారు. ఆ తరువాత వారిద్దరూ ఆధ్యాత్మిక విషయాలు చర్చించుకున్నారు. విఠోబాయొక్క అఖండ పాండిత్యాన్ని, ప్రజ్ఞను, సత్ప్రవర్తనను, తీవ్రమైన భక్తి వైరాగ్యాలను చూసి అతడు మహాత్ముడని గ్రహించి సిద్ధోపంత్ అతనిని ఆ రాత్రికి తమ ఇంటిలోనే గడపమని ప్రార్ధించాడు. విఠోబా సిద్ధోపంత్ ప్రార్ధన మన్నించి ఆ రాత్రికి వారింటిలోనే నిద్రించాడు.

ఆ రోజు తెల్లవారురుఝామున సిద్ధోపంత్‌కు ఒక అద్భుతమైన స్వప్న దర్శనమైంది. సాక్షాత్తూ శ్రీ పాండురంగడు సిద్ధోపంత్‌కు స్వప్నంలో దర్శనమిచ్చి, విఠోబా మహాపురుషుడని, అతనికి తన కుమార్తె నిచ్చి వివాహం జరిపించమని, వారికి దైవాంశ సంభూతులైన నలుగురు సంతానముగా కలుగుతారని అభయమిచ్చి అదృశ్యుడయ్యాడు. అతడు వెంటనే నిద్రనుంచి మేలుకొని తనకొచ్చిన స్వప్నానికి ఆశ్చర్యచకితుడై, విఠోబాను నిద్రలేపి విషయమంతా వివరించి తన కుమార్తెను వివాహమాడమని ప్రార్ధించాడు. అది విని విఠోబా ఉలిక్కిపడి, "అయ్యా! చాలా మంచి మాట చెప్పావే! ఆహా! ఎంత సమర్ధుడవు!! ఇందుకేనా ఇంత వినయంగా నన్ను ఇక్కడకు తీసుకుని వచ్చావు? నీవింత పుణ్యాత్ముడివై వుండి కూడా నా కులగోత్రాలు కూడా తెలుసుకోకుండా వివాహం జరిపించాలనుకోవడం భావ్యమా? నీ వంటివారు ఇలా చేయవచ్చా? నేనెవరిని? నీవెవరు? నీకూ నాకూ సంబంధమేమిటి? ఈ ప్రస్తావన ఇక చాలు నేను వెళ్ళి వస్తాను" అని వెంటనే బయలుదేరాడు.

అది చూసి సిద్ధోపంత్, ''అయ్యా! తొందరపడవద్దు. నీవు నా కుమార్తెకు తగిన వరుడివి కాకపోతే భగవంతుడు ఆమెను నీకిమ్మని ఎందుకు ఆజ్ఞాపిస్తాడు? అయినా నీ గోత్రనామము చెప్పు. గోత్రము సరిపోయినట్లయితే నీవు తప్పక నా కుమార్తెను వెంటనే వివాహమాడాలి. లేకపోతే నీవు వెళ్ళిపోవచ్చు. మీ ఇంటిపేరు, గోత్రము, తల్లివైపు గోత్రము చెప్పు" అన్నాడు. విఠోబా ఆ వివరమంతా చెప్పాడు. సిద్ధోపంత్ వెంటనే తన భార్యను పిలిచి తమకు వారికి వున్న బంధుత్వాన్ని కలిపిచూసి అతడు వరుసకు తనకు మేనల్లుడేనని గుర్తించి ఆశ్చర్యపడి, "విఠోబా! ఇకనైనా సంశయము లేకుండా వివాహానికి అంగీకరించు'' అని ప్రాధేయపడ్డాడు. ఈ విషయమంతా తెలిసికొన్న పెద్దలుకూడా అతడిని బలవంతపెట్టసాగారు.

విఠోబా చాలా బాధపడి ఆ యింటినుంచి తప్పించుకోవాలని ప్రయత్నించి విఫలుడై సిద్ధోపంత్‌తో, "స్వామీ! నా మనవి వినండి. నేను బ్రహ్మచర్యం అవలంబించి యాత్ర చేస్తున్నాను. నాకు వ్రతభంగము చేయడం మీకు ధర్మము కాదు. మోయలేని భారాన్ని మోయమంటే నేను మోయగలనా? వివాహము చేసుకోవడానికి నాకు మనస్కరించడములేదు. ఒకవేళ మీరు నాకు బలవంతముగా వివాహము చేసినట్లయితే నా వలన మీకు తీరని దు:ఖం వాటిల్లుతుంది!" అని చెప్పాడు. అది విని సిద్ధోపంత్ నవ్వి, "నాయనా! నిన్ను మోసగించాలనే ఉద్దేశ్యము మాకు లేదు. ఇది భగవదాజ్ఞ. మా మాట విని వివాహము చేసుకుని తరువాత నీ ఇష్టప్రకారమే కొంతకాలము తీర్ధయాత్ర చేసి రావచ్చు. నీ తీర్ధయాత్ర భంగము కాదు" అని చెప్పాడు.

విఠోబా ఆ రాత్రి ఎలాగో గడిపి తెల్లవారగానే తప్పించుకు పోవాలని నిశ్చయించుకున్నాడు. ఆ మరునాడు తెల్లవారురుఝామున భగవంతుడు విఠోబాకు స్వప్నంలో దర్శనమిచ్చి, "నాయనా! నేను సిద్ధోపంత్‌ను వివాహ విషయమై ఆదేశించినమాట నిజమే! అతని కుమార్తె నీకు అన్ని విధాలా

యోగ్యురాలు. మీ వలన ఈ ప్రపంచానికి ఎంతో మేలు జరుగవలసి వున్నది. కనుక సిద్ధోపంత్ చెప్పినట్లు చేయి. దానివలన నీకు ఎంతో శ్రేయస్సు కలుగుతుంది" అని పలికి అంతర్ధానమయ్యాడు.

విఠోబాకు వెంటనే మెలకువ వచ్చింది. అతడు భగవంతుని ఆదేశానికి బాధపడి తన మనస్సులోని బాధను ఎవ్వరికీ తెలియకుండా జాగ్రత్తపడుతూ అక్కడనుంచి వెళ్ళడానికే నిశ్చయించుకొని వీధి తలుపు తెరచి నెమ్మదిగా బయటకు నడిచాడు. ఆ సమయంలో సిద్ధోపంత్ కుమార్తె రుక్మాబాయి మేలుకొనే వున్నది. ఆమె ఎంతో కాలంగా మంచి భర్త లభించాలనే ఆకాంక్షతో మహాలక్ష్మి వ్రతాన్ని ఎంతో శ్రద్ధగా చేస్తూవున్నది. భగవంతుని ఆదేశంగా తనకు విఠోబాతో వివాహం జరుగుతున్నదని ఎంతో సంతోషించి తన పూజలు ఫలించే క్షణంకోసం ఆత్రుతగా వుండడం వల్ల ఆమెకు ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఇంతలో రహస్యంగా ఆ ఇంటినుంచి వెళ్ళాలని ప్రయత్నిస్తూవున్న విఠోబాను చూసి వెంటనే అతని వద్దకు వెళ్ళి నమస్కరించి, "స్వామీ! ఇంత రాత్రి వేళ ఎవ్వరికీ చెప్పకుండా ఎక్కడికి వెళుతున్నారు? మీకు యిక్కడ ఉండడం యిష్టము లేకపోతే మా నాన్నగారితో మాట్లాడి ఆయన అనుమతితో నన్ను కూడా వెంటబెట్టుకుని మీ ఊరు వెళ్ళవచ్చు కదా!" అని పలికింది.

విఠోబా ఖిన్నుడై ఆ వెన్నెల కాంతిలో రుక్మాబాయిని చూసి, "నువ్వెవ్వరు? ఒంటరిగా ఇంత రాత్రి వేళ పరపురుషుడినైన నాతో మాట్లాడుతున్నావెందుకు?'' అని అడిగాడు. అందుకామె, "స్వామీ! నేనే సిద్ధోపంత్ కుమార్తెనైన రుక్మాబాయిని. భగవదాజ్ఞననుసరించి నన్నే మీకిచ్చి వివాహము చేయదలచారు. తప్పించుకుని పోవడానికి ప్రయత్నిస్తూవున్న మిమ్మల్ని మరలా ఇంటికి తీసుకువెళ్ళడానికి వచ్చాను. దయచేసి లోపలికి రండి." అని వినయంగా ప్రార్థించింది.

విఠోబా కొంత ఆలోచించి, "నీవు చాలా తప్పుగా ప్రవర్తిస్తున్నావు. ఇంత రాత్రి వేళ పరపురుషునితో మాట్లాడడము కులస్త్రీ లక్షణము కాదు. అటువంటి స్త్రీని వివాహము చేసుకోవడానికి ఎవ్వరూ ఇష్టపడరు. ఇంత తప్పు చేసిన నీ ముఖము చూడడమే మహాపాపము. తక్షణమే ఇక్కడనుంచి వెళ్ళిపో!" అని అరిచాడు. అయినా రుక్మాబాయి చలించలేదు. ఆమె విఠోబాతో, ''స్వామీ! నన్ను నిరాకరించవద్దు న్యాయమేమిటో తెలుసుకో! పెళ్ళి చేసుకోకూడదనే పట్టుదలతో నన్ను తప్పు పడుతున్నావు. కానీ న్యాయము తెలుసుకోవడానికి ప్రయత్నించడం లేదు. భగవంతుని ఆజ్ఞ ప్రకారము నా తల్లిదండ్రులు నన్ను నీకు యిచ్చి వివాగం చేయాలని నిర్ణయించిన క్షణంలో-నేను నీ భార్యనయ్యాను. అన్నింటికీ మనస్సే ప్రధానం కదా! మనస్ఫూర్తిగా చేసుకున్న వివాహమే వివాహము కదా! నా మనస్స నీకు అర్పించినప్పుడే నేను నీ భార్యనయ్యాను. ఇంకెవ్వరినీ కన్నెత్తైనా చూడను. నీవు నన్ను వివాహమాడకపోతే నీ పాదాల దగ్గరే ప్రాణం విడుస్తాను. ఇది తథ్యము" అని దృఢంగా పలికింది.

విఠోబా ఆమె ప్రవర్తనకు విసుగుచెంది, "నా మాట విని వెంటనే నీవింటికి వెళ్ళిపో. నేను తీర్థయాత్రకై బయలుదేరాను. సంసారంలో నాకు ఇచ్ఛలేదు. నీవు నన్నిలా పీడించి ప్రయోజనం లేదు, కాబట్టి వెంటనే వెళ్ళిపోవడం మంచిది" అన్నాడు. అందుకు రుక్మాబాయి, "స్వామీ! పతివ్రత అయిన స్త్రీ ఇతర పురుషుల గురించి ఆలోచించదు. అట్లా చేసిన స్త్రీ గాడిదతో సమానము. నీవే నా భర్తవని మనస్ఫూర్తిగా నిర్ణయించుకున్న తరువాత అందుకు వ్యతిరేకముగా నడుచుకోవడం ధర్మమా? నిన్ను వరించి ఇతరులను వివాహమాడే పాపాత్మురాలిని కాదు. కాబట్టి నా ప్రార్థన మన్నించి ఇంటికి రండి" అన్నది. అది విని విఠోబా కోపంగా, "వివేక హీనురాలా! నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావు. ఇక తిరిగి చూడకుండా వెంటనే వెళ్ళిపో!" అని పెద్దగా అరిచాడు.

"స్వామీ! నేనే సిద్ధోపంత్ కుమార్తెనైన రుక్మాబాయిని. భగవదాజ్ఞననుసరించి నన్నే మీకిచ్చి వివాహము చేయదలచారు. తప్పించుకుని పోవడానికి ప్రయత్నిస్తూవున్న మిమ్మల్ని మరలా ఇంటికి తీసుకువెళ్ళడానికి వచ్చాను. దయచేసి లోపలికి రండి."

రుక్మాబాయి, ''స్వామీ! భగవంతుని వాక్యంకంటే గొప్పదున్నదా? ఆయన ఆజ్ఞను అల్పులమైన మనము దాటవచ్చునా? నీవు నన్ను తిట్టినా, కొట్టినా సంతోషమే. నేను నీ దానిని" అన్నది. అందుకు విఠోబా విచారించి ఆమె బారినుండి తప్పించుకోవడం కష్టమని తలచి మంచి మాటలతో ఆమెను బుజ్జగించేందుకు ప్రయత్నిస్తూ, "సుందరీ! నీ అందాన్ని వర్ణించడం సాధ్యం కాదు. నీవు అపురూప సౌందర్య రాశివి. నిన్ను వివాహమాడాలంటే ఎవరైనా ఎంతో పుణ్యం చేసుకోవలసినదే. నీవంటి సౌభాగ్యవతికి నా వంటి సామాన్యుడు తగడు. కురూపినైన నన్ను వివాహమాడితే నిన్నందరూ అపహాస్యం చేస్తారు. నీకు తగిన వరుణ్ణి వివాహం చేసుకో నన్ను బలవంత పెట్టడం వల్ల ప్రయోజనం లేదు" అన్నాడు.

అయినా రుక్మాబాయి చలించలేదు. ఆమె చిరునవ్వుతో, "స్వామీ! పతివ్రతకు భర్తయొక్క అందముతో పనిఏమి? భర్తను దైవంగా భావించి ప్రవర్తించడమే ఆమె ధర్మము. ధర్మాన్ని అతిక్రమించి ఎవ్వరూ ప్రవర్తించకూడదు. నన్ను కనికరించి నన్ను వివాహం చేసుకో! లేకపోతే నా శరీరాన్ని అగ్నిలో దహించి వేస్తాను" అని దృఢంగా బదులిచ్చింది. అది విని విఠోబా నిస్సహాయుడై కోపంతోనూ, ఆవేశంతోనూ వివశుడై "ఓసీ! మూర్ఖురాలా! నన్నే ఎదిరిస్తావా? ఇప్పటికైనా నా మాటవిని ఇంటికి వెళ్ళు. లేకపోతే నిన్ను శపిస్తాను!" అని హూంకరించాడు. రుక్మాబాయి భయపడి గజగజ వణుకుతూ పెద్దగా ఏడవసాగింది.

ఆమె ఏడుపులు వినిపించి సిద్ధోపంతు, నీరూబాయి మేల్కొని పరుగున అక్కడికి వచ్చి విఠోబాతో, "అయ్యా! నీవంటి యోగ్యుడు ఇలా ప్రవర్తించవచ్చా? వివాహము జరిగే లోపల మా కుమార్తెను ఇంతటి రాత్రివేళ దొంగతనముగా తీసుకెళ్ళవలసిన పని ఏమిటి?" అని అడిగారు. విఠోబా సిద్ధోపంత్‌తో, "అయ్యా! నన్ను దూషించవద్దు. నేను మీ కుమార్తెను మోసగించి తీసుకుని వెళ్ళడానికి ప్రయత్నించలేదు. గ్రహచారము వల్ల మీ ఇంటికి అతిథిగా వచ్చినందుకు మంచి బుద్ధి చెప్పారు. ఇటువంటి ప్రదేశంలో ఒక్క క్షణమైనా వుండకూడదు. భగవంతుడే స్వయంగా వచ్చి చెప్పినా సరే నేనీ వివాహానికి అంగీకరించను. మీ దారి మీరు చూసుకోండి!!" అని చెప్పి వేగంగా నడవసాగాడు. అతనిని నివారించడానికి సిద్ధోపంత్ ఎంతగానో ప్రయత్నించాడు. అయినా అతడు వినలేదు.

చివరగా సిద్ధోపంత్ విఠోబాతో, "భగవంతుని ఆదేశంగా ఈ వివాహం నిశ్చయించాము. మా కుమార్తె నిన్ను మానసికంగా ఎప్పుడో వివాహమాడింది. నీవు కనుక వివాహం చేసుకోకపోతే ఆమె వెంటనే ప్రాణత్యాగం చేస్తుంది. కాబట్టి మాకు జీవితాంతం గర్భశోకం తప్పదు. క్రమంగా మేమూ ప్రాణాలు విడుస్తాము. కనుక నీకు స్త్రీహత్యా పాపాము, బ్రహ్మ హత్యా పాతకము చుట్టుకుంటాయి. తత్ఫలితంగా నీకు యాత్రా ఫలితము కూడా దక్కదు. నీ జపాలు, పూజలూ ఫలించవు. కాబట్టి మోక్షము సిద్ధించదు. కాబట్టి నీవు వివాహము చేసుకోవడమే మార్గము. జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయం తీసుకో!" అన్నారు. అది విని విఠోబా నిశ్చేష్టుడయ్యాడు. తనను అంతటి విపత్తు నుంచి కాపాడమని భక్తితో భగవంతుని ప్రార్థించసాగాడు. అప్పుడతనికి భగవంతుడు అదృశ్య వాణితో, "విఠోబా! నీవేమీ బాధపడకు. సిద్ధోపంతు కుమార్తెను వివాహం చేసుకో. నీకు అన్ని విధాలా మేలు కలుగుతుంది" అని ఉపదేశించాడు. ఇక తప్పక విఠోబా భగవంతుని ఆజ్ఞను శిరసావహించి సిద్ధోపంత్ కుమార్తె అయిన రుక్మాబాయిని వివాహం చేసుకున్నాడు. వివాహం జరిగిన మరునాడు విఠోభా సిద్ధోపంత్‌కు భక్తితో నమస్కరించి, "మీ ఇష్టానుసారం మీ కుమార్తెను వివాహమాడాను. ఇప్పుడైనా దయచేసి అనుమతిస్తే మిగిలిన తీర్థయాత్ర పూర్తిచేసుకుంటాను" అన్నాడు. సిద్ధోపంతు అందుకు అంగీకరించి తాను కూడా విఠోబాతో కలిసి తీర్థయాత్రకు బయలుదేరాడు. వారిద్దరూ దివ్య తీర్థాలన్నీ సేవిస్తూ అహోబిలము, శ్రీశైలము, పండరిపురము, శ్రీరంగము, గోకర్ణము, రామేశ్వరము మొదలైన పుణ్యక్షేత్రాలను సేవించి పుణ్య తీర్థాలలో స్నానం చేసి తిరుగుప్రయాణమై కొన్ని రోజులకు కలకావతి చేరారు.

# భారతీయ ఘనత

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

రష్యన్ మేధావులను, ప్రాచీన భారత సంస్కృతిని అధ్యయనంచేసి, రష్యన్ దేశకర్షకవర్గం వద్దకువెళ్ళి దాని గొప్పతనము వారికి వివరించమని రష్యన్ కమ్యూనిష్టు విప్లవ సారథియైన లెనిన్ ఉద్బోధించాడట. యస్.యఫ్. ఓల్డెన్ బర్గ్ (S.F. Olden Barg) అను పండితునితో సంభాషిస్తూ, "వారి విద్యారంగం మనకు సుదూరమనిపిస్తుంది గాని ఎంతో సన్నిహితమైంది. ప్రజల దగ్గరకు, కర్షకుల దగ్గరకు పోయి, భారతదేశం చరిత్ర గురించి చెప్పి... వారెలా ప్రతిస్పందిస్తారో చూడండి. నూత్నమైన పరిశోధనకు కావలసిన స్ఫూర్తి (దానినుండి) మీరు గూడ పొందండి. ఎంతోగొప్ప వైజ్ఞానికమైన ప్రాముఖ్యము గల అధ్యయనం కొనసాగించడానికి వలసిన స్ఫూర్తిని పొందండి" అన్నాడట.

లాప్లేన్ (Laplane) అను గణిత శాస్త్రజ్ఞుడు, "అర్కిమిడీస్ మరియు ఎపలోనియస్ వంటి ఎంతో గొప్ప గణిత శాస్త్రజ్ఞుల మనస్సులకు గూడ స్ఫురించనంతటి మహత్తరమైన ఈ దశాంశ (Decimal) పద్ధతిని కనుగొనిన హిందువులకు మనందరము ఎంతో కృతజ్ఞులము'' అన్నాడు. ''లెక్కించగలగడమనే ఏ ప్రక్రియలేకుంటే చెప్పకోదగిన వైజ్ఞానిక శాస్త్రీయ అభివృద్ధి సాధ్యముగాదో అట్టిది మన (జాతుల)కు నేర్పినందుకు మనము భారతీయులకెంతో ఋణపడి వున్నాము" అన్నాడు జగద్విఖ్యాత భౌతిక శాస్త్రజ్ఞుడు అల్బర్ట్ ఐన్‌స్టీన్.

"విజ్ఞానశాస్త్రంలో గూడ యూరపుఖండం భారతదేశానికి ఎంతగానో ఋణపడ్డది. మొట్టమొదట ప్రపంచమంతటా ఉపయోగించబడుతున్న అంకెలను భారతీయులే రూపొందించారన్నది మహత్తరమైన సత్యం. అట్టి అంకెలపై ఆధారపడిన దశాంశతగణనము గణితశాస్త్రానికే గాక నాగరికత యొక్క ప్రగతికి ఎంత ముఖ్యమైనదో ఎంత చెప్పినా చాలదు. 8 మరియు 9 శతాబ్దాలలో భారతీయులే సంఖ్యా గణితము, బీజగణితములలో అరబ్‌జాతి వారికి గురువులై, తర్వాత వారి ద్వారా పాశ్చాత్యదేశాలన్నిటికీ గురువులయ్యారు" అన్నాడు ప్రొఫెసర్ మాగ్డోనల్.

"ప్రపంచమంతటా వైజ్ఞానికరంగంలోనే నూత్న వికాసమనదగు అతి ప్రధానమైన గణితము మరియు జ్యోతిశాస్త్రాల వికాసము, 5వ శతాబ్దానికి చెందిన ఆర్యభట్టు మరియు వరాహమిహిరుడు, మరియు 7వ శతాబ్దానికి చెందిన బ్రహ్మగుప్తుల పేర్లతో ముడిపడి వున్నది. స్థానాన్నిబట్టి అంకెలకు విలువనిచ్చే పద్ధతి మరియు 'సున్న' (0) లను వీరు నిర్దుష్టంచేసారు. అరబ్‌జాతి వారు గూడ గణితంలో తెలియని విలువలను గురించి గూడ గణనం చేయగల బీజగణితాన్ని భారతీయ గణిత శాస్త్రజ్ఞుల పరంపర నుండి నేర్చుకొన్నారు." అని ప్రొఫెసర్ జె.డి. బెర్నాల్ అను



బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు మరియు చరిత్రకారుడు వ్రాశారు.

గ్రీకు జాతివారు అప్పడప్పడే తాత్త్వికచింతన చేయడమారంభించిన కాలంలో మిళిందుడను సైన్యంలో చేర్చుకొనబడి, ఒక యుద్ధంలో బాబిలోనియా దేశానికి యుద్ధఖైదీగా కొనిపోబడి అతి విచిత్రమైన రీతిని విడుదలయ్యాడు. బాల్డియా

**క్రీ.పూ. 580 లో సామోస్ నగరంలో జన్మించిన పైథాగరస్ తీవ్రమైన జిజ్ఞాసువుగా తన 18వ సంవత్సరంలో ఎందరో పండితులను, మహనీయులను దర్శించాడు. ఈజిప్టుదేశంలో థీల్స్ అను మహాత్ముని దర్శించి ఆత్మజ్ఞానం కోరాడు. ఆ గురువు అతనిని ఎంతో కఠినంగా పరీక్షించి, సాధన రహస్యాలు కొన్ని బోధించాడు.**

గ్రీకురాజు నాగసేనుడనే బౌద్ధ గురువువద్దకు జ్ఞానంకోసం వెళ్ళాడు. చివరకు బౌద్ధమతం గూడ స్వీకరించాడు. అంటే ఆ కాలంలో జ్ఞానవాహిని నేటి చరిత్రకారులు తలచినట్టు గ్రీసునుండి మనదేశానికి గాక మన దేశంనుండే గ్రీసుకు ప్రవహించిందన్నది స్పష్టం. అలెగ్జాండరు మనదేశంపై దండెత్తడానికి ముందే, క్రీస్తుపూర్వం 500 సంవత్సరాలనుండే పాశ్చాత్య దేశాలలోని మేధావులను భారతీయ విజ్ఞానం ప్రభావితం చేయనారంభించింది. ఆ కాలంలో మన దేశ కురువంశ రాజులు నేడు అఫ్గనిస్థాన్ మరియు ఇరాన్ అని పిలువబడుతున్న అలనాటి కాంభోజదేశంపై పరిపాలిస్తున్నారు. అల్గ్జాండ్రియాకు రాజైన క్లెమెంట్ (Clement) అను రాజు గ్రీకు తత్త్వ మరియు గణిత శాస్త్రజ్ఞుడు అయిన పైథాగరస్ (క్రీ.పూ. 570-495) ను 'బ్రాహ్మణుని శిష్యుడు' అని యెందుకు సంబోధించారో నేటివరకు పాశ్చాత్యచరిత్రకారులకు అర్థంగాలేదు. సుఖలోలత, మాంసాహారము హింసాప్రవృత్తుల సహజమైన ఆనాటి సమాజంలో అతడు ఆత్మ నిగ్రహంతో శాఖాహారిగా సాధు జీవితం ఎందుకు కొనసాగించాడో, వాటినే ఎందుకు ప్రచారం చేశాడో వివరించలేకపోయారు.

క్రీ.పూ. 580 లో సామోస్ నగరంలో జన్మించిన పైథాగరస్ తీవ్రమైన జిజ్ఞాసువుగా తన 18వ సంవత్సరంలో ఎందరో పండితులను, మహనీయులను దర్శించాడు. ఈజిప్టుదేశంలో థీల్స్ అను మహాత్ముని దర్శించి ఆత్మజ్ఞానం కోరాడు. ఆ గురువు అతనిని ఎంతో కఠినంగా పరీక్షించి, సాధన రహస్యాలు కొన్ని బోధించాడు. తర్వాత అతడు నిర్భయంగా ఈజిప్టు దేశంలోని మ్యాగీ (Magi) అను ఆధ్యాత్మ సంప్రదాయానికి చెందిన గురువులను భారత దేశంలోని గురువులను గూడ సేవించాడు. అందువల్లనే అతణ్ణి బ్రాహ్మణుని శిష్యుడు అని పిలిచేవారు. అతడు జ్ఞానధనుడుగా, గురువుగా స్వదేశం చేరాడు. ప్రజలతనని గౌరవించారేగాని ఆయన నుండి జ్ఞానం పొందడానికి సంసిద్ధం కాలేదు. అంతటితో అతడు అహింసయొక్క మహాత్మ్యాన్ని మహిమలతో ప్రదర్శించి ప్రజలను మేల్కొల్పజూచారు. సముద్రంలో చేపలు పట్టుకుంటున్న మత్స్యకారులు ఏ రకం చేపలు ఎన్ని వలలో పడతాయో ముందుగా చెప్పి వారినాశ్చర్యపరచేవాడు. అటు తర్వాత వాటిని డబ్బుతో కొని తిరిగి సముద్రంలో విడిచిపెట్టించేవాడు. "శాఖాహారం ఉచితమా లేక మాంసాహారమా? అన్నది ప్రధానంగాదు. తన ఆహారానికై చెట్లనుగాని, జంతువులను గాని చంపడానికి మానవుడు సంకోచిస్తాడా, లేదా అన్నదే ప్రశ్న. ఆధ్యాత్మ పథంలో నడిచేవారికి హింసాప్రవృత్తి తప్పక నశిస్తుంది. జంతువులవలన పాలు, వెన్న, నెయ్యి; వృక్షశాకాలవలన పండ్లు, కూరగాయలు తిని సంతృప్తిపడడం వారికి సహజమౌతుంది." అని ఆయన చెప్పేవాడు. ఇట్టి ప్రవృత్తి మనలో బలపడినపుడు ప్రాణుల హింసా ప్రవృత్తి గూడా చాలావరకు మానవుడు నిగ్రహించగలుగుతాడని తెల్పే లీలలెన్నో చేసాడు. ఊరిపైబడి ప్రజలను కల్లోలపరుస్తున్న ఒక ఎలుగుబంటిని మధురమైన తన మాటలతో శాంతిపరచాడు. పొలాలు, తోటలు పాడుచేస్తున్న పోట్ల ఆబోతును తన స్పర్శామాత్రంచేత ప్రశాంత పరచాడు.

పెనుతుఫానులను, అంటువ్యాధులను మాటమాత్రంతో నిగ్రహించి. రక్షించాడు. కాని యిట్టివి ఎప్పుడో అత్యవసరమైనప్పుడు తప్ప చేయక రోగార్తులకు తన అపురూపమైన వైద్య జ్ఞానంతో ఉచిత చికిత్స చేసేవాడు. క్రమంగా ఈయనకు కొందరు శిష్యులేర్పడ్డారు. ఒక పర్వతారణ్యంలో అర్ధ చంద్రాకృతిలో 'స్టేడియం' అను ఒక ఆశ్రమము, క్రోటాన్ నగరంలో ఒక ఆశ్రమము స్థాపించారు. తనకు శిష్యులు కాగోరువారిని అతడు పరీక్షించే పద్ధతి చిత్రంగావుండేది. ఒకానొకతెరవెనుక కూర్చొని, వచ్చినవారిచేత ఒక పలక మీద త్రికోణాకృతి గీయించి దానినిబట్టి వారి మనస్సు, బుద్ధి, చిత్తము ఎలాంటివో నిర్ణయించి వారికి తగినశిక్షణ నిచ్చేవాడు. "మానవులు తమయిష్టాన్ననుసరిస్తే జ్ఞానమెన్నటికీ కలుగదు. అందుకవసరమైన ఎన్నో అంశాలపట్ల అజ్ఞానంవలన వారికి సరియైన ఆసక్తి కలుగదు" అని చెప్పి, తమ శిష్యులు కాగోరినవారికి గణితశాస్త్రం బోధించి, తర్వాత దానికి తాత్వికమైన అర్థం వివరించేవాడు. ఆశ్రమ వాసులకు శుద్ధమైన సాత్వికాహారము, గణితశాస్త్రము, నాట్యము, సంగీతము మొదలగునవి నేర్పించి, వాటి ద్వారా ఆత్మనిగ్రహము, తత్త్వజ్ఞానము బోధించేవాడు. కేవలం గ్రంధ పరిజ్ఞానము, వేదాంతచర్చల వలన అహంకారము వృద్ధి పొందుతుందన్న కారణంగా శిష్యులకు నిత్య జీవితంతో కలిపి మాత్రమే ఆత్మవిద్యను బోధించేవాడు. నిత్యజీవిత సంఘటనలలో మన భావము, ఆచరణ ఎలా వుండాలో తెల్పి ఆచరింపజేస్తుండేవాడు. ప్రతివారూ నిద్రబోయే ముందు నాటి దినచర్యను స్మరించి, ఆత్మవిమర్శ చేసుకోవాలని విధించాడు. ఇలా 80 సం॥లు జీవితకాలంలో దేశ రాజకీయాలలో పాల్గొనకుండానే తన దేశ రాజ్యాంగాన్ని ధర్మమార్గంలో ప్రభావితం చేసాడు. ఆయనలోని పరిపాకం చిత్రంగా వుండేది. వారి శిష్యులనిపించుకొనడం గొప్ప అని తలచి వచ్చినవారితో, "భగవంతుని సృష్టిలో గురువులు, శిష్యులు వుండరు. అంతా ఒక్కటే. నేను చెప్పే విధానం నీకు నచ్చితే ఆచరించుకో!" అని చెప్పేవాడు; జ్ఞానం మనలోనే దాగివున్నదనీ, సాటి జీవులను భగవంతుని సృష్టి వైచిత్రికి ప్రతీకలుగా మాత్రమే దర్శిస్తూ సాధనచేస్తే జ్ఞానం కలుగుతుందనీ, అంతవరకూ జీవులు తిరిగి తిరిగి జన్మించవలసి వస్తూంటుందని చెప్పేవాడు. అతని బోధలచేత ప్రభావితులైన వారిలో ప్లేటో, అరిస్టాటిల్, వార్కన్, అరిలియన్, సెంట్ అగస్టిన్‌వంటి వారెందరో చరిత్రలో ప్రసిద్ధికెక్కారు.

పైధాగరస్ పేరిట ఒక రేఖాగణిత సూత్రం జగద్విఖ్యాతి చెందింది. నేటికీ దానిని మన పాఠశాలలో అలాగే బోధిస్తున్నారు. నిజానికా సూత్రం అతడు చెప్పాడన్న మాట క్రీ.పూ.50 నుండి క్రీ.శ. 460 మధ్యకాలంలో వెలసిన శిశరో, డియోజనిస్ మరియు ప్రోక్లస్ వంటి ప్రఖ్యాత గ్రీకుమేధావులు ప్రచారం చేసారు. కాని యూంగే (Junge : A. concise History of Science in India). అను ప్రఖ్యాత పరిశోధకుడు అది అభూతకల్పన అని ఋజువు చేసాడు. పైధాగరస్ తర్వాత గడచిన 500 శతాబ్దాలకు చెందిన గ్రీకు సాహిత్యమంతటిలోనూ అతడే గణితసూత్రంగాని లేక మరే ముఖ్యమైన గణిత సూత్రంగాని కనుగొన్నట్లు ప్రస్తావనేలేదు. సరిగదా క్రీ.పూ. 8వ శతాబ్దానికి చెందిన బోధాయన మహర్షివ్రాసిన శుల్బ సూత్రాలలో పైధాగరస్ పేరిట ప్రఖ్యాతమైన ఈ సూత్రం స్పష్టంగా యిలా చెప్పబడ్డది.

"దీర్ఘ చతురస్రస్యాక్షయారజ్జుః పార్శ్వమణి తర్యాఙ్మణిచ ।

యత్పృథక్ భూతే-కురు తస్తదుభయం కరోతి ॥"

"దీర్ఘ చతురస్రంయొక్క మధ్యధరాంతరరేఖ (Diagonal) తో ఏర్పడే సమ చతురస్రం యొక్క వైశాల్యం మిగిలిన రెండు భుజములలో యేర్పడు సమ చతురస్రముల వైశాల్యములను కలిపినదానికి సమానమగును."

అంతేకాదు బోధాయనుడు గూడ యిటువంటి సూత్రాలు తన కంటే పూర్వకాలపు భారతీయ ప్రఖ్యాత గణిత శాస్త్రాలనుండి, అంతేకాదు ప్రత్యేకించి తైత్తరీయ సంహితనుండి సేకరించానని వ్రాసుకున్నాడు. శతపథ బ్రాహ్మణంలో గూడ ఈ సూత్రం స్పష్టంగా చెప్పబడింది.

ఇటువంటి విషయాలెన్నో ప్రఖ్యాత విజ్ఞానశాస్త్ర చరిత్రకారులు వ్రాశారుగూడ. అయినప్పటికీ పాశ్చాత్య విద్యావేత్తలు యిటువంటి వాస్తవాలెన్నింటినో మరుగుపరచి ఉత్తమమైన వైజ్ఞానిక విశేషాలన్నీ పాశ్చాత్యశాస్త్రజ్ఞులే మానవ చరిత్రలో మొదటిసారిగా కనుగొన్నారని పాఠ్య గ్రంథాలు రూపొందించి ఒక శతాబ్దం మన తలలపై రుద్దారు. అదే కథ నేటికీ కొనసాగుతుండడం మన అవివేకానికి గీటురాయి.



గురుపూర్ణిమ సందర్భంగా దత్తస్వరూపులైన పూజ్య గురుదేవులు
శ్రీ భరద్వాజ మహరాజ్, గురుపత్ని దివ్యజనని శ్రీమతి అలివేలు మంగమ్మల
విశేషమైన ఆశీస్సులు జనులందరిపై వర్షించాలని ప్రార్థిద్దాము



శ్రీ గురుపూర్ణిమ సందర్భంగా తమ బిడ్డలైన మనందరినీ వారికి నచ్చిన విధమున ఉత్తములుగా తీర్చిదిద్ది నడిపించమని సమర్థ సద్గురు శ్రీ సాయినాధునికి ప్రార్థన.

edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust, ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.





పూజ్య గురుపత్ని సమక్షంలో, శ్రీ సాయి మాస్టర్, దత్తప్రభువుల సన్నిధిలో
గురుపూర్ణిమ వేడుకలు 2012.

# శ్రీ దాసగణుకు ఉద్యోగంలో బహుమతి ప్రసాదించిన శ్రీ సాయి

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ



అవి శ్రీదాసగణు పోలీసు ఉద్యోగంలో వున్న రోజులు. ఒకసారి అతడు బాబా దర్శనార్థమై వచ్చాడు. బాబా దర్శనం చేసుకొని మర్నాడు అతడు డ్యూటీలో చేరాలనే వుద్దేశ్యంతో వచ్చాడు. దర్శనం చేసుకొని బాబాను సెలవు కోరగానే ఆయన, "ఎందుకు వెళ్ళడం? వెళ్ళనక్కరలేదు" అన్నారు. మర్నాడు ఠాణేలోని నెవాస్ జిల్లాలో పోలీసు అధికారులు తనిఖీకి వస్తున్నారు. పైగా అనుమతి తీసుకోకుండానే అతడు వచ్చాడు గనుక అతడు అక్కడకు తప్పక వెళ్ళి తీరాలి. బాబా అనుజ్ఞయివ్వక పోవడంతో ఏంచేయాలో తోచక వ్యాకులపడుతూనే ఆగిపోయాడు. అంతేగాక, బాబా అతనిని ఆ రాత్రి తమవద్దనే పడుకోమన్నారు! కాని ఈ వ్యాకులత కారణంగా అతనికి నిద్రపట్టక అటూ, యిటూ పొర్లుతూనేవున్నాడు. రాత్రి మూడుగంటల సమయంలో బాబా అకస్మాత్తుగా అతనిని కాలితో తన్ని, "బావమరిదీ! లే, లే, ఎందుకు నిద్రపోతున్నావు?" అన్నారు. ఆ మాట విని అతనికేం చేయాలో తోచలేదు. అర్థరాత్రి ఠాణే ఎందుకు వెళ్ళాలి? వెళ్ళినా ఏం ప్రయోజనం? అయినా బాబా ఆజ్ఞకు తిరుగులేదు. అందుకని అయిష్టంగానే అతడు బయల్దేరాడు. వెళ్తూ, వెళ్తూ దారిలోని ప్రవాళానది ఒడ్డుకుచేరాడు. నలువైపులా చూస్తున్న అతని దృష్టి నది ఒడ్డున ఇసుకలో ఏదోకార్య నిమగ్నులైవున్న నలుగురు వ్యక్తులపై పడింది. అర్థరాత్రి అక్కడవారిని చూచేసరికి గణూకు వారు దొంగలెందుకు కాగూడదని అనుమానం కల్గింది. ఒక్కడే వున్నప్పటికీ పోలీసు అయిన కారణంగాను, స్వధర్మ పాలనా నిరతుడవటం వల్లనూ అతడు ముందుకు సాగాడు. అతని అనుమానమే నిజమైంది. వారు దొంగలించిన సొమ్మును పంచుకుంటున్న దొంగలే! దాసగణు నిర్భయంగా వారి వద్దకు వెళ్ళి వారిని పోలీసుస్టేషనుకు



నడవమన్నాడు. బాబా ఆశీర్వాద ఫలితమో ఏమో, వారు అతనిని ఎదిరించి పారిపోకుండా తమకు తామే లొంగిపోయారు. అతడు వారిని అరెస్టు చేసి నెవాస్ పోలీసుస్టేషనుకు తీసుకు వెళ్ళాడు.

అక్కడికి వెళ్ళేసరికి తెలిసింది - పై అధికారి యితడు అనుమతి లేకుండా స్టేషను విడిచిపోయినందుకు కారణం తెలుపమంటూ వ్యతిరేకంగా రిపోర్టు వ్రాసి వెళ్ళాడని. కాని యితను ప్రఖ్యాత దొంగలను అరెస్టుచేసి తీసుకెళ్ళే సరికి పరిస్థితి పూర్తిగా తారుమారయింది. అతని సాహసోపేతమైన ఈ పనికి ప్రశంసించి ప్రభుత్వమతనికి బహుమతి కూడా యిచ్చింది. ఈ లీల అనుభవించిన దాసగణుకు బాబాయందు భక్తి తీవ్రమయింది.

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంపుటి: 30 | ఆగస్టు-2012 | సంచిక: 04

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


SRI MANGA BHARDWAJA TRUST

**పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"**

## విషయసూచిక




<u>చిరునామా</u>

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**




**<u>చందా వివరములు</u>**

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10-00 |
| సంవత్సర చందా | : రూ. 100-00 |
| రాజపోషకులు | : రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000-00 |

*పారాయణంటే భగవంతుని లీలలు, అవతార విశేషాలు చదువుకుంటూ, వింటూ అందులో పరాయణత చెందడమే. క్రమంగా మన తలంపులు, ఆచరణ. ఆశయాలు అన్నీ ఆయన పరంగా మారడమే – సంసారుల జీవితాలు తమ కుటుంబ శ్రేయస్సే లక్ష్యంగా కలిగినట్లు, ఏమి చేస్తున్నా, ఎక్కడున్నా మరపురానట్లు, మానవులందరూ తాము తమ శరీరాలు, పేర్లు అన్న భావంతో తాదాత్మ్యం చెందినట్లు – భగవంతుని ప్రీతిని, స్మరణనూ పెంచేవిగా మారేలాగున చదవడము, మననం చేయడము – యివే పారాయణ. ప్రేయసికి ప్రియమైనవన్నీ, ప్రియునికి ప్రీతికరములై, మిగిలినవన్నీ అయిష్టమైనట్లు క్రమంగా మన సద్గురువుకు ప్రీతికరమైన మాటలు, పనులు, నడవడులే మనకు ప్రీతికరములవడం పరాయణత. అది కల్గేలా సద్గ్రంథాలను చదవడం పారాయణ.*

**- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ**

# సాయిబాబా - బన్నేమియా

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ



శ్రీ సాయిబాబా మహాసమాధి చెందడానికి కొంత కాలం ముందు కాశిమ్, చోటేఖాన్, అమీర్ అను భక్తులను ఔరంగబాదు వెళ్ళి అక్కడ బన్నేమియా మరియు షంసుద్దీన్ మియా అను యిద్దరు మహాత్ములైన ఫకీరులకు, "తొమ్మిదవ నెలలో తొమ్మిదవ తేదీన అల్లా పెట్టిన దీపం అల్లాయే తీసుకుపోతారు" అని చెప్పి రమ్మన్నారు. ఆ భక్తులు అలానే చేసి వచ్చారే గాని ఆ మాటలకర్థమేమో వారికి తెలియలేదు. ఆ సంవత్సరానికి చెందిన ముస్లింల పంచాంగం ప్రకారం 9వ మాసంలో 9వ తారీఖునే సాయి మహాసమాధి చెందారు. ఆ తర్వాత గాని ఆ భక్తులకు బాబా మాటలకు అర్థం తెలియలేదు. ఇంతకూ సాయిబాబా అంత ప్రత్యేకంగా కబురు చేసిన ఆ ఫకీర్లు ఎవరు? ఎక్కడెక్కడి భక్తులకు వివిధ రూపాలలో దర్శనమియ్య గలిగిన సాయి ఆ ఫకీర్లకు అలానే దర్శనమిచ్చి ఆ మాటలు చెప్పవచ్చుగదా, ఆ భక్తుల ద్వారానే కబురెందుకు పెట్టారు?

భౌతికరూపంతో వుంటూనే షోలాపూర్ జిల్లాలోని అక్కల్‌కోట పట్టణంలో శ్రీ అక్కల్కోట స్వామిగా కూడా మరొక భౌతికరూపంతో తమ అవతార కార్యాన్ని కొనసాగించారు. ఈ లీల ఎంత అద్భుతమైనదో మనము ప్రచురించిన "శ్రీస్వామి సమర్థ" చూస్తేగాని తెలియదు. దత్తావతారమనే ఒకేనాణానికి 'బొమ్మ' సాయిబాబా జీవిత చరిత్ర అయితే, బొరుసు "శ్రీ స్వామి సమర్థ'' జీవిత చరిత్ర దాని ద్వారా సాయిబాబాకు హైందవ సాంప్రదాయంతో ఎంత సన్నిహిత సంబంధమున్నదో తెలుస్తుంది. అలానే ఆయనకు ఇస్లాం సాంప్రదాయంతోనే గాక ముస్లిం మహాత్ములతో గూడ సన్నిహిత సంబంధము వున్నదని ఈ ఔరంగబాదు ఫకీర్లకు సంబంధించిన లీల తెల్పుతున్నది. ఇప్పడు యిద్దరి మహాసమాధులు ఔరంగబాదులో వున్నాయి.

వీరిలో ఫకీరు హజరత్ బన్నేమియాగారి అసలు పేరు మహమ్మద్ హజరత్‌ఖాన్. ఈయన ముస్లిం మహాత్ములలో మహోన్నతులైన సయ్యద్ అబ్జిల్ బియాబానీగారి శిష్యుడు. ఆ గురువుగారు

> *సాయిబాబా అంత ప్రత్యేకంగా కబురు చేసిన ఆ ఫకీర్లు ఎవరు? ఎక్కడెక్కడి భక్తులకు వివిధ రూపాలలో దర్శనమియ్య గలిగిన సాయి ఆ ఫకీర్లకు అలానే దర్శనమిచ్చి ఆ మాటలు చెప్పవచ్చుగదా, ఆ భక్తుల ద్వారానే కబురెందుకు పెట్టారు?*

సాయి అవతారాకార్యాలలో ఒకటి మత సామరస్యం. ఆయనకు హిందూ-ముస్లిం ఆధ్యాత్మ సాంప్రదాయంతోను, వాటికి చెందిన మహాత్ములతోనూ సన్నిహిత సంబంధము వున్నది. ఒక వంక ఆయన శిరిడీలో

ప్రసాదించిన ప్రగాఢమైన యోగ దృష్టి వలన పరమాత్మ సాక్షాత్కారం లభించినప్పటినుండి బన్నేమియాగారు మానవసేవ చేస్తూ సంకుచిత మత దృష్టికి అతీతమైన భగవద్భక్తిని ప్రచారం చేస్తుండేవారు. వీరి భక్తులలో వెనుకటి నిజాం

సంస్థానంలోని మంత్రులు ఉన్నతోద్యోగులు, జాగీరుదార్లేగాక వేలాదిభక్తులున్నారు. హైదరాబాదు రాజ్యానికి ప్రధానమంత్రిగా వున్న మహారాజ కిషన్ ప్రసాద్‌గారు గూడ వీరి భక్తులే. దయా పూర్ణులయిన బన్నేమియాగారి దర్శనముచేత ఎందరో ఉత్తమ సాధువులుగాను, శిష్యులుగానూ రూపొందారు. వారి సమాధులు మనదేశంలోని వున్న ప్రాంతాలలోనే గాక పాకిస్తానులో గూడా వున్నాయి. వాటినన్నింటిని వేలాది భక్తులు దర్శించి శ్రేయస్సు పొందుతున్నారు. వీరి శిష్యులలో మహాత్ములుగా రూపొందినవారిలో నాగపూర్‌కు చెందిన హజరత్ తాజుద్దీన్ బాబా మరియు హైదరాబాదుకు చెందిన హజరత్ గోదార్షా. వీరి దర్గాల ప్రభావంద్వారా హజతర్ బన్నేమియాగారి దివ్య కార్యం నేటికీ కొనసాగుతూనేవున్నది. ఈ దర్గాలు దర్శించే వారిలో ముస్లింలేగాక హిందువులు, శిక్కులు, క్రైస్తవులు మరియు పార్శీలు గూడా వున్నారు. వారి జీవిత కాలంలో హజరత్ బన్నేమియాగారు, తమ శిష్యులను కులమత బేధాలు పట్టించుకొనకుండా మానవసేవ చేసి దేశసమైక్యత సాధించమని ఆదేశించారు. బన్నేమియాగారి సమాధి దగ్గర భక్తులు పొందిన కొన్ని దివ్యానుభవాలకు మచ్చుతునకలుగా ఈ క్రిందివి లభించాయి.

ఒకప్పుడు హైదరాబాదు రాజ్యానికి ప్రధాన మంత్రిగా వున్న మహారాజ కిషన్‌ప్రసాద్‌గారు ఏదో పొరపాటు చేయటంవలన అతనిని నిజాము సుల్తాను పదవి నుండి తొలగించాడు. అప్పుడు కిషన్‌ప్రసాదు ఔరంగబాదు వెళ్లి హజరత్ బన్నేమియాగారిని కలసి తన పరాభవాన్ని తొలగించమని ప్రార్థించాడు. ఉన్మత్తావస్థలో వున్న హజరత్ బన్నేమియాగారు అతనిని అకస్మాత్తుగా ఒక పెద్ద గోతిలోనికి తోసివేసారు. అందులో పడిపోయిన కిషన్‌ప్రసాదుకు బలమైన గాయాలు తగిలాయి. నివ్వెరపోయి చూస్తున్న అతనిని పైకి ఎగబ్రాకి బయటకు రమ్మని ఆదేశించారు. "ఈ కష్టంలోనుండి నాకై నేను బయటకు రాగలిగితే నేనిక



మిమ్మల్ని ఆశ్రయించడం దేనికీ?" అన్నాడతడు. హజతర్ బన్నేమియాగారు పెద్దగానవ్వి, అతని చేతిని పట్టుకొని అమాంతం లాగివేసి, "నీవు హైదరాబాదు వెళ్ళు, అంతా బాగుంటుంది" అన్నారు. ఆయన తిరిగి వెళ్లినకొద్ది రోజులలోనే నైజాం నవాబు అతనిని హైదరాబాదు రాజుగా నియమించాడు.

ఒకసారి సౌదీ అరేబియానుండి ఒక అరబ్బు జాతివాడు వచ్చి ఔరంగబాదులోని తాజ్ బజార్ అను ప్రాంతంలో తన స్నేహితులతో కలసి కొన్ని రోజులున్నాడు. అతడు ఆ అరబ్బును బన్నేమియా దర్శనానికి తీసుకువెళ్ళాడు. అప్పుడు అక్కడ వారిచుట్టూ, భక్తులు, పేదవాళ్ళు, శిష్యులూ వున్నారు. ఆయనను చూస్తూనే ఆ అరబ్బు, "అరే, హజరత్ బన్నేమియాగారంటే వీరా? వీరు హజ్

*ఉన్మత్తావస్థలో వున్న హజరత్ బన్నేమియాగారు అతనిని అకస్మాత్తుగా ఒక పెద్ద గోతిలోనికి తోసివేసారు. అందులో పడిపోయిన కిషన్ ప్రసాదుకు బలమైన గాయాలు తగిలాయి. నివ్వెరపోయి చూస్తున్న అతనిని పైకి ఎగబాకి బయటకు రమ్మని ఆదేశించారు. "ఈ కష్టంలోనుండి నాకై నేను బయటకు రాగలిగితే నేనిక మిమ్మల్ని ఆశ్రయించడం దేనికీ?" అన్నాడతడు.*

యాత్రకు ఈ సంవత్సరం మక్కా వచ్చినప్పడు దర్శించానే!" అన్నాడు. అప్పడు బన్నేమియా గారు "అవును, మేము హజ్‌యాత్రకు వచ్చాము. అయితే దివ్య రూపంలో వచ్చాముగాని, ఈ భౌతిక రూపంలోగాదు'' అన్నారు. అలాగే కాబోలు భౌతికంగా శిరిడీలో వుంటూనే సాయిబాబా, ''నేనిప్పడు కాశీ వెళ్ళి గంగలో స్నానంచేసి వస్తున్నాను మరల యిక్కడ స్నానమెందుకు?" అనేవారు. స్నానం చేయనివారల్లా అవధూతలు, మహాత్ములని మనము పొరబడుకుందుము గాక!

అవి మొదటి ప్రపంచయుద్ధం జరిగినరోజులు, మన ప్రభుత్వం భారతీయ సైనికులను యుద్ధం చేయడానికై విదేశాలకు పంపాలని నిశ్చయించింది. వారిలో ఒకడైన అబ్దుల్ రహమాన్ అనువాడు బన్నేమియాగారిని దర్శించి తాను విదేశాలలో యుద్ధానికి వెడుతున్నానని చెప్పి తనను కాపాడవలసినదని ఆయనను ప్రార్థించాడు. ఆయన ఆశ్వీదించి అతనిని పంపాడు. తర్వాత ఆ సైనికుడు పయనిస్తున్న నౌక సముద్రం మధ్యలో భయంకరంగా కంపించసాగింది. అది ఏక్షణానైనా సముద్రంలో మునిగిపోవచ్చునని ఓడ కెప్టెను అందరినీ హెచ్చరించాడు. అప్పడు ఆ నౌకలోని వారందరినీ రక్షించమని బన్నేమియాగారిని ప్రార్థించి నిశ్చింతగా నిద్దరపోయాడు అబ్దుల్ రహమాన్. అతనికి స్వప్నంలో ఆ మహనీయుడు కనిపించి నౌకను తమ చేతులతో నెడుతూ, "నీవేమీ భయపడకు, నేను నీతో గూడ వున్నాను మీ కెట్టి ప్రమాదమూ సంభవించదు" అని చెప్పారు. అతనికి మరుక్షణమే మెలుకువవచ్చి చూచేసరికి ''ప్రమాదం తప్పిపోయింది. ఇక మనకెట్టిభయమూలేదు" అని నౌక కెప్టను చెబుతున్న మాటలు అతని చెవినబడ్డాయి.

ఒకరోజు తాజుద్దీన్ అను ఒక సైనికుడు ఈయనను దర్శించి, ''నా మనస్సు నా స్వాధీనంలో వుండటంలేదు. నాకు పిచ్చి అని నిర్ణయించి నన్ను సైన్యంలోనుండి తొలగించారు." అని మనవి చేసాడు. బన్నేమియాగారు అతని మాటలు ఎంతో శ్రద్ధగా విని అతనివైపు తదేకంగా కొద్ది సేపుచూచి, "నీవు యుద్ధంలో జనులను చంపవలసిన వాడివి కావు. దుష్టులను సైతం సంస్కరించి ఉద్ధరించే వాడివి. నీ స్థానము నాగపూర్. అచ్చటికి వెళ్ళి పేదలను ఉద్ధరిస్తూ వుండు" అని చెప్పి ఆశీర్వదించారు. అతడు నాగపూర్‌చేరి హజరత్ తాజుద్దీన్‌బాబాగా ప్రసిద్ధిచెందాడు. హజరత్ బన్నేమియా గారు 1921 ప్రాంతంలో సమాధి చెందారు. ఈ వివరాలు మాకు సోదరుడు జి.వెంకటరావుగారు (హైదరాబాదు) అందచేసారు.

---




*"ఓ దేవా! వీరు చేసిన పాపాలన్నింటికీ సమాధానం వారినడుగకుండా నన్నే అడుగు, ఎందుకంటే వారందరూ నాకు చెందినవారే!"*

*"ఈ దృశ్యాదృశ్య ప్రపంచంలో రెప్పపాటులో సద్గురువు ప్రసాదించలేనిది ఏమీ లేదు"*

ఎందరికీ సద్ధర్మాచరణ, భక్తి విశ్వాసాలను ప్రసాదించి తరింపజేసిన గొప్ప మహాత్ములు

**"శ్రీ హజరత్ తాజుద్దీన బాబా"**

పూజ్యశ్రీ మాస్టరుగారు రాసిన చరిత్ర గ్రంధాన్ని చదివి తరించండి.

# మన సంస్కృతి - స్వాతంత్ర్యము

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సాయిబాబా:ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక ఆగస్టు 2012 03

మనదేశం సుమారు 11, 12వ శతాబ్దాలలో కోల్పోయిన స్వరాజ్యాన్ని తిరిగి 1947లో పొందింది. చరిత్రలో అంతకాలం విదేశీయుల కాళ్ళక్రింద మ్రగ్గిన దేశం ప్రపంచంలో మరొకటి లేదేమో! అయితే ప్రతి దేశచరిత్రకూ ఒక ప్రత్యేకమైన స్వభావమున్నట్లే, తక్కిన పరిస్థితులు ఎన్ని రీతుల మారినా జాతి లక్షణం మారదు. ఉదాహరణకు జర్మనీ దేశానికి స్వరాజ్యంవచ్చి దేశ సమైక్యత కల్గినపుడల్లా ఆ దేశం పెద్ద యుద్ధాలకు కారణమౌతూ వచ్చింది. అలానే ప్రతి దేశ చరిత్రలోనూ ఒక విశిష్టమైన లక్షణం స్వాభావికమై తొంగిచూస్తుంది. మన దేశ చరిత్రలో అలా తొంగిచూచిన వైఖరి ఆధ్యాత్మిక దృష్టి. దానితో మేళవింపబడిన ఉద్యమాలే యిక్కడ నెలకొంటాయనిపిస్తుంది. అలాగాక కృత్రిమంగా ప్రజల వైఖరిని మార్చజూస్తే జాతే నిర్వీర్యమై సాంస్కృతిక బానిసత్వానికి గురియవుతుందని నేటి మన సమాజంలోని వైఖరి చూస్తే తెలుస్తుంది.

ఈ ఆధ్యాత్మదృష్టి, మన దేశ చరిత్ర పొడుగునా కనిపిస్తుంది. చారిత్రకమైన కాలంలో ఒకవంక వేదాల, ఉపనిషత్తుల కాలంలో ఆధ్యాత్మికత అనంత విశ్వంయొక్క పరిధిని తాకుతున్నదా అనిపించిన కాలంలో మహోత్కృష్టమైన సంస్కృతి విలసిల్లింది. తరువాత బుద్ధుని కాలంనుండి మౌర్య సామ్రాజ్య అస్తమానం వరకు ఒక మహోన్నత దశ ఆధ్యాత్మికంగా, సాంస్కృతికంగానూ కూడా వెల్లివిరిసిందన్నది చరిత్ర. ఎప్పుడు బుద్ధధర్మంలో సహజ వైశిష్టం మరుగుపడిందో నాటితో ఆ సంస్కృతి అంతరించింది.

మనదేశంలో తురుష్కుల సామ్రాజ్యస్థాపనగూడ యుద్ధం వలనకంటే గూడ హాజరత్ ఖాజా మోహిద్దీన్ చిస్తీగారి ఆధ్యాత్మిక వైభవం వలన, ఆధ్యాత్మిక శిఖరాలనందిన వారి శిష్యప్రశిష్యుల వలన ఇస్లామును సాంస్కృతికంగా ప్రజల హృదయాలలో నాటుకునేటట్లు చేసింది. కేవలం యుద్ధంలో విజయమే ఆ రాజ్యస్థాపనకు కారణమైనట్లయితే ఆ రాజ్యమంతరించడంలో ఆ మత సంస్కృతిగూడ మనదేశంలో అంతరించియుండేది. ఈ మాటలలోని సత్యాన్ని ఈనాటికీ మనం చూడవచ్చు. ముస్లిం మహాత్ముల దర్గాల దగ్గర సేవచేసేవారిలో హిందువులే అధిక సంఖ్యలో వుండడం యిందుకు తార్కాణం.

అలానే హిందూధర్మాన్ని పునః ప్రతిష్ఠితం చేయడానికి ఏర్పడిన విజయనగర సామ్రాజ్యం గొప్ప వేదాంతియైన విద్యారణ్యుల ఆశీస్సులను పొందింది. మొగలుచక్రవర్తులకాలంలో మరలా శివాజీ హిందూ సామ్రాజ్యస్థాపన చేయగలిగాడంటే అతడికి శ్రీ సమర్థరామదాస స్వామి వంటి సిద్ధపురుషుని ఆశీస్సులే కారణం. అంతగాక ఆ సాధుపుంగవుడు ఎంతో లోజూపుతో ఆ ప్రాంతాన్ని సాంస్కృతికంగానూ, ఆధ్యాత్మికంగానూ సంసిద్ధంచేశారని వారు రచించిన 'దాసబోధ' చూస్తే తెలుస్తుంది.

మరలా మనదేశంలో బ్రిటీష్ సామ్రాజ్యాన్ని పారద్రోలే యత్నంలోగూడ ఈ చారిత్రకమైన మన జాతివైఖరి తొంగిచూచింది. స్వరాజ్యోద్యమ నాయకులలో మేటియైన బాలగంగాధర తిలక్

అలనాటి సిద్ధపురుషులైన శ్రీ గజానన్ మహరాజ్ (షేగాం), శ్రీ శిరిడీసాయిబాబాను భక్తి శ్రద్ధలతో దర్శించి సేవించారు. అంతేగాక ("గీతారహస్యం") అనే ఉత్తర భగవద్గీతా వ్యాఖ్యానం రచించి రాజకీయ ప్రయత్నాలకు ఆధ్యాత్మిక బలాన్నిగూడ చేకూర్చుకున్నాడు. ఆయన శ్రీ సాయినాథుని స్వరాజ్యం గురించి ప్రశ్నించినప్పుడు "నీవింతవరకు నిస్వార్థంగా దేశంకోసం పాటుపడ్డావు. యిక కొంతైనా నీకోసం చేసుకో... కొద్ది కాలంలో భగవంతుడే స్వరాజ్యాన్ని ప్రసాదిస్తాడు... నీవు హాయిగా నిద్రపో... స్వరాజ్య మవతరించడానికి నిమిత్తమాత్రుడు గావలసినవాడు రానున్నాడు" అన్నారు. నిజంగానే బాలగంగాధర తిలక్ శాశ్వతమైన నిద్రపోయాకనే మహాత్మాగాంధీ స్వరాజ్యోద్యమంలో ఉదయించారు. స్వాతంత్ర్యం రావడానికి ఆయనే నిమిత్తమాతృడయ్యారు.

అలానే శ్రీ సాయికి సమకాలికులైన సిద్ధపురుషులు శ్రీ అక్కల్‌కోట స్వామిని బల్వంత్‌ఫడ్కే దర్శించాడు. అతడు స్వరాజ్యపోరాటంలో ఉగ్రవాది. అతడు స్వామికి తన కత్తినిచ్చి, భవానీమాత తన అనుగ్రహంతో శివాజీకి ఖడ్గం ప్రసాదించినట్లు, సమర్థరామదాసస్వామి గూడ అతని యత్నాన్ని ఆశీర్వదించినట్లు, తన ఖడ్గాన్ని ఆశీర్వదించి, తనకిమ్మని కోరాడు. స్వామి అలాచేయక ఆ ఖడ్గాన్ని చెట్టుపైన కట్టించారు. అతడు త్వరపడుతూవుంటే, "అభీవక్త్ హై!" "ఇంకా సమయంవున్నది" అన్నారు. అతడావేశంతో ఆయన వారిస్తున్నా వినకుండా ఆ ఖడ్గాన్ని తీసుకొని తన ప్రయత్నానికుపక్రమించాడు. వెంటనే అతడు పట్టుబడి మరణశిక్షణకు గురియైనాడు.

స్వరాజోద్యమ వీరులలో అరవిందఘోష్ ఖైదులో శ్రీకృష్ణ సాక్షాత్కారాన్ని పొందారు. ఆయన ఆదేశంపై పాండిచేరిలో ఆశ్రమాన్ని నిర్మించుకొని తపస్వియైనాడు. వారి జన్మదినాన స్వరాజ్యము సంప్రాప్తించడంలాగే ఆధ్యాత్మ విద్య ప్రజల హృదయాలలో ఎప్పుడు సాక్షాత్కరిస్తుందో ఆనాడే మనకు సాంస్కృతికంగాగూడ పరదాస్యపరాయణత్వం తొలగి సంపూర్ణమైన స్వాతంత్ర్యం సమకూరుతుంది. నిర్దుష్టమైన ఆధ్యాత్మికచింతన మన స్వతంత్రయోధులలో తాండవించినంతకాలం మన రాజకీయ జీవితరంగం కూడ ప్రపంచాన్ని ఆశ్చర్యచకితులిని చేసింది. అదెప్పుడు సన్నగిల్లిందో నాటినుండి మన సమాజం కుక్కలు పీకిన విస్తరియయౌతున్నది. ఒక ప్రక్క నీచాతినీచమైన రాజకీయం ప్రతి జీవితరంగాన్ని దీర్ఘ రోగంవలె క్షీణింపజేస్తుంటే, రోగ తీవ్రతలాగ మతకలహాలు పెచ్చు పెరుగుతున్నాయి. దీనికి నివారణోపాయం మతాన్ని నిర్మూలించడమొక్కటే మార్గమని చెప్పే కొన్ని విదేశీయ రాజకీయ సిద్ధాంతాలు ప్రపంచంలో ఎక్కడా సఫలమవలేదు అని చరిత్ర నిరూపిస్తుంది. మనస్తత్వ శాస్త్రజ్ఞులు, ఆంత్రపాలజిష్టులు మతవిశ్వాసమన్నది మానవనైజంలోని మౌలికమైన అంశమని వేనోళ్ళ చెబుతున్నారు. మతాన్ని వ్యతిరేకించిన దేశాలుగూడ క్రమంగా మత స్వేచ్ఛనంగీకరించవలసివచ్చింది. మన దేశంలో విలసిల్లుతున్న వివిధ మతాలకు చెందిన వారికి యితర మతాలగూర్చిన సరియైన అవగాహననివ్వడమే మత సామరస్యానికి, సౌభ్రాతృత్వానికీ కారణంకాగలదని శ్రీసాయిబాబా జీవిత చరిత్ర నిరూపిస్తుంది. మౌలికమైన సకల మతసిద్ధాంతాలను ప్రతిఒక్కరూ చక్కగా తెలిసికొన్నప్పడే ఇట్టిది సాధ్యమవుతుంది. మత సిద్ధాంతం తెలియకుండ ప్రజలు గుడ్డిగా మతాచారాలను పట్టుకు ప్రాకులాడుతున్నంతకాలం ఈ కలహాలు పెరుగుతాయేగాని తరుగవు, మత కలహాలను చూచి మతాన్నే నిరసించడం మానవ సమాజంలోని వడిదుడుకులను చూచి మానవ జాతినే నిర్మూలింపజూడడంలాంటిది. పరస్పర అవగాహనలేని మతాభిమానం మత కలహాదులకు కారణమైనట్లే ఒకే సిద్ధాంతానికి చెందిన రాజకీయవాదుల మధ్య నానాటికీ పెరుగుతున్న ఛిద్రాలవలన గూడ ఎంతో అసహనము, ఉగ్రవైఖరి, హింసాకాండ జరుగుతున్నాయికదా! మానవులలో నైతిక విలువలను సార్థకంగా ప్రతిష్టించగల ఏకైకమైన మార్గం ఆధ్యాత్మికవిద్యయని 'మతం ఎందుకు?' 'శ్రీసాయి ప్రబోధామృతము' పరిశీలిస్తే తెలియగలదు.

---

*"మనము – మన సంస్కృతి" గ్రంథ సౌజన్యంతో*

# శ్రీ శ్రీ శ్రీ అవధూత వెంకయ్యస్వామి

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సాయిబాబా:ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక ఆగస్టు 2012 04

అదొక మారుమూల పల్లెటూరు. ఊరు చివరలో పాతకాలంనాటి ఆంజనేయస్వామి ఆలయం ప్రక్కన నేలపై వెలుగుతున్న అగ్నిహోత్రమున్నది. దాని ప్రక్కనే చిన్న ఈతాకు చాపమీద చూడ్డానికి 70 లేక 80 సం॥ల వయస్సుగల వృద్ధులులా వున్న ఒక స్వామి కూర్చుని వున్నారు. గుండు తల, ఎక్కడో లోతుగాచూస్తూ చిత్రంగా వెలిగే కళ్ళు, కదలాడే బోసినోరు, వుండి వుండి మూలుగుతున్నట్లు అస్పష్టంగా ఆ నోటినుండి వెలువడే మాటలు-అప్పుడప్పుడు ఆయన తన గుండును, మూతినీ చేతితో వ్రాసుకుంటున్నారు. ఎండనక, వాననక వెలిగే ధుని సెగకు కాబోలు, కాగి కాగి రాగికాగులా తయారయ్యింది ఆయన శరీరచ్ఛాయ. వారి మొలకొక గోచీమాత్రమున్నది. కొంచెం దూరాన ఒక కుటీరంలో ఒకరిద్దరు సేవకులు పని చేసుకుంటున్నారు. ఆయన ప్రక్కనే నేలబారుగా చిన్న చక్రాలుగల చెక్కతో చేసిన తోపుడుబండి వున్నది. వారు నీరు త్రాగడానికి కాబోలు ప్రక్కనే తాటియాకుతో చేసిన దొన్నెలాంటిది వున్నది. ఆయనతోపాటు ఎప్పుడూ నలుగురు వ్యక్తులు తీసుకువెళతారనీ కొందరు చెప్పారు. ఒక పాతచాప, ఒక పాతగుడ్డల మూట, రెండు మూడు పాత దిండ్లు, ఒకటి రెండు అల్యూమినియం పాత్రలూ తప్ప వారివద్ద యింకేమీలేవు. స్వామి అమిత నిరాడంబరులు. నేను మొదటిసారి స్వామిని దర్శించినపుడు చూచిన దృశ్యమిది.

ఆరోజులలో స్వామి దర్శనానికి ఎక్కువమంది వచ్చేవారుకాదు. చదువుకున్నవారసలే లేరని చెప్పవచ్చు. పశువులు కన్పించలేదని, జబ్బు పడ్డాయని-వాటిగురించి ప్రశ్న చెప్పించుకోడానికి కొందరుమాత్రం వచ్చిపోతుండేవారు.

నిజానికి స్వామిని తగురీతిన ఆశ్రయించినవారే లేరని స్వామి చెప్పారు: "కొండలు, కొండలుగా డబ్బులున్నా ఒక్కరుగూడ అడుగరేమయ్యా?'' ''ఏడుకొండలు వేలానికొచ్చాయి; పాటపాడి కొనే వాళ్ళుంటే కొనవచ్చునయ్యా!'' ''నల్లకొండలు వేలానికొచ్చాయి; కొనేవాడేలేడే!" అని అనేక

*అవధూతలందరిలోని ఆత్మజ్ఞానమే ఆయన. స్నాన ఘట్టాలెన్ని వున్నా గంగానది ఒక్కటే. ప్రపంచంలో ఎందరు తల్లులున్నా వారిలోని మాతృత్వమొక్కటే. అలానే దత్తస్వామి నిరాకారమని, జ్ఞానరూపమనీ చెబుతారు. మరొకచోట బ్రహ్మం సగుణము, సాకారము కాగలడని చెబుతారు.*

తోడుగా వుంటారని, వారు రాత్రంతా ఆయనతోపాటే మేల్కొనవలసిందేననీ, ఆయన తనను ఎప్పుడు ఎక్కడకు తీసుకువెళ్ళమంటే వాళ్ళాయనను అక్కడకు సందర్భాలలో స్వామి అన్నారు. అలా అయితే నిజానికి మనమెవ్వరమూ ఆయననుండి ఉత్తమ ఫలితం పొందలేదన్నమాట. దాని గురించి

భక్తుడు, "మాకేదైనా బోధించండి స్వామీ?" అని అడిగితే ఆయన, బోధించేందుకేముందయ్యా? (నన్ను) చూచి నేర్చుకుండేదేగదయ్యా!" అన్నారు. ఆయన, తమను చూచి నేర్చుకోమన్నదేమిటి? (1) వారిలోని ఉత్తమ గుణాలను, పనిలో త్రికరణశుద్ధి, సాటి జీవులపై కరుణ. (2) పూర్ణుడైన సద్గురువును ఆశ్రయించి సేవించడమెలాగో మహాత్ముల చరిత్రలనుండి తెలుసుకోవాలి (3) దివ్యమైన రీతిన మనకు భగవంతుడు ఆదేశించిన సద్గురువును అంటిపెట్టుకోవాలి. (4) వారి అనుగ్రహంతో అనేకమంది పూర్ణపురుషులను అహోబిలంలో స్వామి దర్శించినట్లే దర్శించాలి. వారందివద్దా సేకరించిన సత్యాలను మన సద్గురువు చెప్పినదానితో సమన్వయపరచుకొని, ఆయన ఆదేశించిన సాధన ఎక్కడవుండైనా చేసుకోవచ్చు.

మహాత్ములందరిలోనూ అవధూతలు



అగ్రశ్రేణికి చెందినవారు. వీరికి తాము దేహమన్న భ్రాంతి వుండదు. సర్వజీవులలోనూ వున్న ఆత్మ తామై వుంటారు. ఈ సాంప్రదాయానికి మూలపురుషుడు శ్రీ దత్తాత్రేయుడు. అవధూతలందరిలోని ఆత్మజ్ఞానమే ఆయన. స్నాన ఘట్టాలెన్ని వున్నా గంగానది ఒక్కటే. ప్రపంచంలో ఎందరు తల్లులున్నా వారిలోని మాతృత్వమొక్కటే. అలానే దత్తస్వామి నిరాకారమని, జ్ఞానరూపమనీ చెబుతారు. మరొకచోట బ్రహ్మం సగుణము, సాకారము కాగలడని చెబుతారు.

ఈ మూడంశాలవలన పరమసత్యం అవాఙ్మానస గోచరమన్నది, దానిని స్థూలంగానైనా సూచించడంలో పరస్పరవిరుద్ధమైన పదాలనుపయోగించడం, ఆధ్యాత్మికత విశ్వసించరానిదిగా తోస్తుంది చాలామందికి. కాని భౌతిక శాస్త్రంలో గూడా పరిస్థితంతేనని పరిశీలిస్తే తెలుస్తుంది.

వాస్తవానికి శబ్దాల కూర్పులుమాత్రమే అయినపదాలు, గీతలు మాత్రమే అయిన రచనా పరికరాలు, (లిపి, సంఖ్యలు, చిత్రాలు) వాటిచేత సూచించబడే వస్తువులెలా అవుతాయి? ఆ వస్తువులోని అన్ని అంశాలనూ సూచించగలవా? అందుకే ఐన్‌స్టీన్ (Einstein) "సత్యాన్ని సూచించగలిగినచోట గణితశాస్త్ర సమానాంతర కరణాలు ఆనిశ్చితాలు; అవి నిశ్చితాలైనచోట సత్యాన్ని సూచించవు" అంటారు.

ఈనాడు న్యూటన్ సిద్ధాంతాలు భారీ సంఖ్యలో పరమాణువులు కూడివున్న వస్తుజాలం విషయంలోనూ అవాస్తవమనీ, అలానే కాంతికంటే తక్కువ వేగాన్ని గలవాటి విషయంలోనూ అవాస్తవమనీ తెలుస్తున్నది. సూక్ష్మతరస్థాయిలో క్వాంటమ్ సాపేక్షిక సిద్ధాంతాలే వర్తిస్తాయని తెలుసుకున్నాము. అంటే న్యూటన్ సిద్ధాంతము తప్పనీ, క్వాంటమ్ సాపేక్షిక సిద్ధాంతాలు రైటనీ కాదు. ఒక్కొక్క స్థాయిలోని క్రియలకు ఒక్కొక్క సిద్ధాంతం సరిపోతుందనిమాత్రమే అర్థం. కాని అవి పరస్పర విరుద్ధాలు; రెండూ ఒక సృష్టిలోని అంశాలు. వాటిని వర్ణించే భౌతికశాస్త్ర గ్రంథాలు గూడ పరస్పర విరుద్ధ సిద్ధాంతాలను ఒకే విశ్వతత్వం గురించి చెప్పినవన్నమాట.

# బుద్ధ ధ్యాన హృదయము - 2

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సాయిబాబా:ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక ఆగస్టు 2012 05

ఈ రెంటిలో సాధనకుపకరించేది కేవలశ్రద్ధ (Bare attention). స్వచ్ఛము, ఏకాగ్రము అయిన ఎఱుకతో మనకూ, మనలోనూ అనుక్షణమూ జరుగుతూండే దానిని గుర్తిస్తుండడమే కేవలశ్రద్ధ. పంచేంద్రియాల ద్వారాగాని, మనస్సుద్వారాగాని వస్తుగ్రహణము జరుగుతూండేటప్పుడు గుర్తింపబడే అంశాలపై మాత్రమే లగ్నమైన దానిని "కేవలగుర్తింపు" అంటాము. అప్పుడా గుర్తింపుకు కాయక, మానసిక, వాచకములైన ప్రతిక్రియలేమీ లేక (యిష్టము, అయిష్టము వంటివి చేయక వస్తువు యొక్క మంచి చెడ్డలను గాని, ప్రియా అప్రియములను గాని, మరియే యితర విషయముల గురించిన తలంపులు లేకుండా ఒక్క గుర్తింపుమాత్రమే పనిచేయాలి) అటువంటి మానసిక ప్రతిక్రియలు జరిగినట్లైతే వాటిని కొట్టివేయడం గాని, కొనసాగించడం గాని చేయక కేవలశ్రద్ధకు గురిచేయడం, తరువాత వాటిని విడచి వేయడమే చేయవలసినది. కేవలశ్రద్ధా సాధనలో కృషి నిర్దుష్టంగా వుండాలి. లేకుంటే ఆ పేరే నిరర్థకమౌతుంది. ఈ సాధన వస్తువును ప్రథమంగా గుర్తించే ఆరంభ దశను గమనిస్తూ వుంటుంది. కాని నిత్యానుభవంలో ఈ క్రియ చాలా స్వల్పకాలంలో జరిగిపోతుంది. దీని ద్వారా అసంపూర్ణము, లోపభూయిష్టము అయిన పైపై విషయగ్రహణము మాత్రమే జరుగుతుంది. వస్తువును తిరిగి తిరిగి గమనించడం మొదటి గ్రహణాన్ని నిర్దుష్టము, సమగ్రము చేసుకోవలసి ఉంటుంది. కాని సామాన్య మానవుడిలా చేయడు. మొదటి గుర్తింపునే సరియైనదిగా భావించి దానినాధారంగా కొన్ని భావాలు అభిప్రాయాలు యేర్పరచుకుంటాడు. కేవలశ్రద్ధా సాధన యీ మొదటి యింద్రియ గ్రహణాన్ని



మరింత పటిష్టం చేస్తుంది. విషయగ్రాహక స్థితిలో మనస్సును మరింతసేపు నిలిపి గుర్తింపు సరిగా జరిగేలాగున చూస్తుంది. వస్తువుపై అనవసరపు భావాలు రాకుండా ముందే జాగ్రత్త పడుతుంది. కనుక జీవుల మనస్సులను పరిశుద్ధి చేయడానికి యిది గొప్ప సాధనం.

వస్తువు యొుక్క తత్వాన్ని యే మనోభావాలు కమ్మకుండా యథాతథంగా గుర్తించడమే కేవలశ్రద్ధ. ఇది అనుకున్నంత తేలిక కాదు. మనం మామూలుగా చేసే పనికాదు. నిర్లిప్తతతో కూడిన పరిశోధనలోనే యిది సాధ్యము. సామాన్యంగా మానవుడు వస్తువుల

యొుక్క తత్వంపై శ్రద్ధ చూపడు. తన యిష్టాయిష్టాలు, ప్రయోజనాల దృష్ట్యానే వాటిని చూస్తాడు. మానవుడు తన మానసిక భౌతిక జగత్తులోని వస్తువులకు, వాటిపట్ల తనకున్న యిష్టాయిష్టాలు విలువల తోటి వాటిని గుర్తిస్తాడు. అట్టి మనోభావాలలోనే తను జీవిస్తాడు. ఈ భావాలే అతని ప్రతిక్రియలను నిర్ణయిస్తాయి. ఇటువంటి మనోభావాలు లేని కేవల శ్రద్ధా సాధన సామాన్య మానవునికి వినూత్నమైన లోకంలోకి బాటలాగా తోస్తుంది.

ఇంద్రియాలతో వస్తువులను గ్రహించడమనేది ఒకే క్రియ అని, అది యింద్రియ గ్రహణకు గోచరమయ్యే వస్తువు లేక విషయం ఒక్కటేనని మామూలుగా మనిషి తలుస్తాడు- 'కాని కేవలశ్రద్ధ సాధన ఆరంభంలోనే గుర్తింపులో నిజానికి జరిగేది వివిధ యింద్రియాలు, మానసిక ప్రక్రియలు, ఒక దాని వెంట ఒకటి, అతి త్వరితంగా వరుసలో జరుగుతాయి' అని. అంతేగాక యే భావాలతోను చెందని కేవల వస్తు గ్రహణమెంత కష్టమో, యెంత అరుదో తెలుసుకుంటాడు సాధకుడు. ఉదాహరణకు సామాన్య నేత్రానుభవం కేవల వస్తువును మాత్రమే గుర్తించక, ఆ వస్తువు అందమైనదో, వికారమో, ప్రియమో, అప్రియమో, ఉపయోగమో, నిరుపయోగమో, ప్రమాదకరమో మొదలైన భావాలతో గూడి ఆ రంగుటద్దాలలోంచే గోచరిస్తుంది. ఈ దృశ్యానుభవం ఒక ప్రాణిని గూర్చినదేయైతే, యిది నావలెనే ఒక ప్రాణి, ఒక వ్యక్తిత్వం కలది అన్న భావాలతో కూడి ఉంటుంది.

ఇటువంటి దోషభూయిష్టమైన యింద్రియానుభూతి స్మృతి లేక జ్ఞాపకశక్తిలో ఆ వర్తమానంలో జరిగినది గుర్తింపును ఆ స్మృతులు ప్రభావితం చేసి సరియైన అవగాహన కలుగకుండా చేస్తాయి. ఆ దోషభూయిష్టమైన అవగాహనను ఆధారంగా చేసుకొనే మన నిర్ణయాలు, మనోభావాలు యేర్పడతాయి గనుక మనకు జీవితమే దోషభూయిష్టమౌతుంది.

ఇటువంటి రంగుటద్దాలు మన గుర్తింపుకు అడ్డురాకుండ చేయడమే కేవలశ్రద్ధ యొుక్క ఉపయోగము. యదార్థ వస్తు తత్వావగాహన కలగాలంటే కేవల శ్రద్ధాసాధనను పట్టుదలతో కొనసాగించాలి. అభ్యాసం కొనసాగిన కొద్దీ శ్రద్ధ మరింత సూక్ష్మమై నానాటికి సూక్ష్మతరములైన పూర్వస్మృతుల కాలుష్యాన్ని జల్లించి వేస్తుంది. చివరికి యదార్థమైన వస్తుతత్వం మాత్రమే మనకు గుర్తింపౌతుంది.

ఒక ఉదాహరణ - ఒక వ్యక్తి తన ముంజేతిమీద నున్న గాయాన్ని చూస్తున్నాడనుకుందాం. ఈ విషయంలో యదార్థమైన దృష్టి విషయం ఆ శరీరభాగము, దాని శిథిల పరిస్థితి మాత్రమే. దానిలోని మాంసము, రక్తము, చీము మొదలైనవి శరీర భాగాలకు సంబంధించిన 'శరీర స్మృతి సాధనయొుక్క విషయాలు'. ఆ గాయం వల్ల కలిగిన బాధ వేదనానుపశ్యనం యొుక్క విషయం. నేనొక వ్యక్తిని, గాయపడి బాధ ననుభవిస్తున్న వాడ్ని నేను అనే భావం మానసిక స్థితి గూర్చిన స్మృతి సాధన యొుక్క విషయము (భ్రాంతియుత మనస్సు). లేక దీనినే మానసిక అంశాలగూర్చిన స్మృతి సాధన విషయంగ తలచవచ్చు. అనగా శారీరక స్పర్శచేత కలిగిన మానసిక బంధము అని దీనిని తలచవచ్చు. తనను గాయపరచిన వ్యక్తిపైన కలిగిన కినుక

*వస్తువు యొుక్క తత్వాన్ని యే మనోభావాలు కమ్ముకుండా యధాతథంగా గుర్తించడమే కేవలశ్రద్ధ. ఇది అనుకున్నంత తేలిక కాదు. మనం మామూలుగా చేసే పనికాదు. నిర్లిప్తతతో కూడిన పరిశోధనలోనే యిది సాధ్యము. సామాన్యంగా మానవుడు వస్తువుల యొుక్క తత్వంపై శ్రద్ధ చూపడు. తన యిష్టాయిష్టాలు, ప్రయోజనాల దృష్ట్యానే వాటిని చూస్తాడు.*

భావాలతో సహా యిమిడిపోతుంది. తరువాత దానిని గుర్తు చేసే వేరొక అనుభూతి కలిగినప్పుడు యీ భావాలతో గూడిన స్మృతే మేల్కొంటుంది. మానసిక స్థితి గూర్చిన స్మృతి సాధనా విషయము (ద్వేషంతో కూడిన మనస్సు; లేక దీనిని గూడ మానసిక అంశముల గూర్చిన స్మృతి సాధనా

విషయంగా (కోపము అను అవరోధము) తలచవచ్చు. కేవలశ్రద్ధ పూర్వ స్మృతుల కాలుష్యం నుండి యదార్థ వస్తువును గూర్చిన గుర్తింపును కేవలశ్రద్ధ యెలా వేరు పరచగలదో గమనించవచ్చు.

వస్తువు యొక్క యదార్థ తత్వాన్ని వ్యాపిస్తుంది. కారణం అట్టి విజ్ఞానాన్ని అన్వేషించే సాధనాన్ని పరివర్తన చెందిస్తుంది. అన్వేషించే మనస్సే స్వచ్ఛతను, నైశిత్యాన్ని పొందుతుంది.

అలాంటి స్మృతితో గుర్తించబడిన విషయాలే జ్ఞానాన్ని వృద్ధి చేస్తాయి అని సూత్ర

*కేవల విషయగ్రహణ యొక్క ప్రాశస్త్యాన్ని బుద్ధుడిలా చెప్పారు. "చూడబడేదాంట్లో కేవలం చూడబడేది మాత్రమే వుండాలి. అలానే వినబడేదాంట్లో వినబడేది, ఇంద్రియగోచరమయ్యే దాంట్లో యింద్రియ గోచరమయ్యేదే వుండాలి, ఆలోచింపబడేదాంట్లో ఆలోచింపబడేదే వుండాలి"*

నిపాతంలో బుద్ధుడు చెప్పాడు. సూక్ష్మదర్శిని ద్వారా పరిశోధనపై పరిశీలించబడే వస్తువును శుద్ధం చేసి అన్యపదార్థం నుండి వేరుపరచి సంసిద్ధం చేసి కటకానికి క్రింద కదలకుండా ఉంచుతాము. అలానే జ్ఞానదృష్టితో పరిశీలించిదలచిన కేవల విషయాన్ని కేవలశ్రద్ధ తదనుగుణంగా సిద్ధం చేస్తుందని గుర్తించాలి. విషయాన్ని నిరాధారమైన మనోభావాలనుండి పరిశుద్ధం చేస్తుంది. జ్ఞానదృష్టిముందు నిశ్చలంగా వుంచుతుంది. అంటే విషయాన్ని గుర్తించే స్థితిలో మనమనస్సు నెక్కువ కాలం నిల్పుతుంది.

కేవలశ్రద్ధ చేసే యీ పని విషయాన్ని విడమరచి విశ్లేషించి దాని యంశాలను మనకెరుకపరచడమేగాక యితర విషయాలతో దానికి గల సంబంధాన్ని, వాటితో దానికిగల ప్రతిక్రియలను, దానినట్టి గుణాలలో నిలిపే కారణాలను, ఇతర విషయాలను, ఆయా రీతులలో పరమితం చేసే దాని యొక్క తత్వాన్ని మనకెరుకపరచటమనే సంశ్లేషణ లేక సమన్వయ క్రియలో గూడా ఉపకరిస్తుంది. కేవలశ్రద్ధ అనే స్థితిలో మనస్సు చాలినంత సేపు నిలువకపోతే యీ అంశాలన్నీ గుర్తింపుకురావు. వస్తువుల మధ్యగల సంబంధాన్ని సరిగా తెలుసుకోవాలంటే ఆ సంబంధాలను కలిగిన వివిధ వస్తువలయొక్క తత్వాన్ని ఒక్కొక్కటిగా స్పష్టంగా గుర్తిస్తే తప్ప వీలుకాదు (మనస్సు, కన్ను, లక్కపిడత, అందులోని వెన్నముద్ద, చుట్టూ ఉన్న ఉష్ణోగ్రత, వెలుగు, మెలకువనే స్థితి).

గుర్తించగలగడం యెంత ఆవశ్యకమో బుద్ధుడే నొక్కి చెప్పారు. ఒక గురువు తన శిష్యుని సాధనా సూత్రాన్నిలా చెప్పారు.

కనబడేదాంట్లో వాస్తవంగా కనబడేది మాత్రమే గుర్తింపు కావాలి. వినబడేదాంట్లో వినబడేది మాత్రమే గుర్తింపుకావాలి. ఇంద్రియానుభవంలో (వాసన, రుచి, స్పర్శ) యింద్రియానుభవమే వుండాలి. యోచించబడేదాంట్లో యోచించబడేదే వుండాలి.

(కేవల విషయగ్రహణ యొక్క ప్రాశస్త్యాన్ని బుద్ధుడిలా చెప్పారు. "చూడబడేదాంట్లో కేవలం చూడబడేది మాత్రమే వుండాలి. అలానే వినబడేదాంట్లో వినబడేది, ఇంద్రియగోచరమయ్యే దాంట్లో యింద్రియ గోచరమయ్యేదే వుండాలి, ఆలోచింపబడేదాంట్లో ఆలోచింపబడేదే వుండాలి").

మనస్సు నెరుగుటలో కేవల శ్రద్ధ యొక్క ప్రాశస్త్యము:

మనము మనస్సులోనే మనస్సు ద్వారానే జయిస్తాము. కాని అది అన్నింటికంటే దుర్గ్రాహ్యము. కేవలశ్రద్ధ ఓర్పుతో మనలో జరిగే మానసిక క్రియలోని ప్రాథమిక అంశాలను ప్రథమంగా గుర్తించడంద్వారా మనస్సు యొక్క నిగూఢతత్వాన్ని మనకెరుకపరచి దానియొక్క దుర్గ్రాహ్యమైన గతిమీద అజమాయిషీనిస్తుంది. కేవలశ్రద్ధతో ఆరంభించి నిర్దుష్టంగా కొనసాగించబడు స్మృతిసాధన మనస్సును స్వాధీనం చేసుకొని దానిని వికసింపజేసి ముక్తినొందిచటానికి కావలసిన పరిజ్ఞానాన్నిస్తుంది. ఒకసారి మానసికానుభూతిలో కొంతమేరకైనా స్వచ్ఛమైన గుర్తింపు అవగాహన నెలకొన్నప్పుడు అవి క్రమంగా మనస్సు యొక్క యితర భాగాలకు గూడా

మానవుడు తన అలవాటు ప్రకారం విషయాలను నిరాధారమైన విశేషణాలను పరిమితము, ఆచ్ఛాదితము చేయకుండా సహకరిస్తుంది. గనుక కేవల శ్రద్ధ ద్వారా వస్తువులను నిత్యనూతనంగా మొదటిసారిగా చూచినట్లే చూచేలాగా చేస్తుంది. కనుక విషయాలు అంతకంతకు నూతనమైన తనలోని విషయాలను వ్యక్తం చేస్తూంటాయి. కనుక కేవలశ్రద్ధా స్థితిలో మనస్సునెక్కువసేపు నిలిపినపుడు మానసిక అవగాహన అంతకంతకు విస్తరిస్తుంది. సామాన్య యింద్రియానుభూతి యివ్వలేని ఫలితాన్నిస్తుంది. ఈ విధంగా నిరాధారంగా మనమేర్పరచుకొన్న నిరాధారమైన భావాలు విజ్ఞానమనే జలము మూసివేయకుండ కేవలశ్రద్ధ కాపాడుతుంది.

ఇటువంటి కేవలశ్రద్ధ వల్ల కలిగే ఫలితాలను కొన్నింటిని యిక్కడ ఉదహరిద్దాము :

ఎ) విషయ గ్రహణము స్థూలంగా ఏకక్రియగా కనుపించినప్పటికి కేవలశ్రద్ధ ద్వారా వివిధములైన యింద్రియగ్రహణ క్రియలు అతి త్వరితంగా ఒకదాని వెంట ఒకటి కొనసాగుతూంటాయని తెలుస్తుంది. ఇవి సృష్టియొక్క యదార్థ తత్వాన్ని తెలిపేటందుకు యెంతయో ఉపకరిస్తుంది.

బి) సామాన్యమైన యింద్రియ గ్రహణంలో కేవల యింద్రియానుభూతి ఒక అంశమని, వాటిని గూర్చి మనము తలచకనే యేర్పరుచుకొనే మనోభావాలు లేక విశేషణాలు రెండవ అంశమని తేలుతుంది. ఈ రెండంశాలను వేరుగా గుర్తించడం చాలా ప్రయోజనకారి. కారణం ఆ విషయం పట్ల మన ప్రతిక్రియలు మన మనోభవాలపై యెంతో ఆధారపడి ఉంటాయి. ఈ విషయాన్ని గుర్తించడం మనస్సు యొక్క తత్వాన్ని నిర్దుష్టం చేయడంతో యెంతో ఉపకరిస్తుంది.

సి) కేవలశ్రద్ధ వలన పరిణామము అనే నిత్యసత్యాన్ని మనకు స్పష్టం చేస్తుంది. దీనివలన జీవితం యొక్క, వస్తువుల యొక్క 'అనిశ్చతత్వం' అనే బౌద్ధధర్మం యొక్క ప్రధాన సూత్రాన్ని తెలియబరుస్తుంది. కేవలశ్రద్ధ చేత గుర్తింపబడే సంఘటనలు నిరంతరం ఉద్భవిస్తూ లయిస్తూ ఉండడమనే సత్యమన్న ధ్యానక్రియను పటిష్టం చేస్తుంది. అనుక్షణమూ జరిగే యీ మార్పును మనం అనుభవపూర్వకంగా గుర్తించినపుడు దుఃఖము, అనాత్మ అనే బుద్ధధర్మంలోని తక్కిన రెండంశాలను ఎఱుక పరుస్తుంది.

డి) పరిణామమనేది కొంతవఱకు సామాన్య జీవితంలో మనకు తారసిల్లినప్పటికి సుఖరూపంలోను, దుఃఖరూపంలోను చాలినంత తీవ్రతతో తమకు తారసిల్లేతే తప్ప సామాన్యులు దానిని గుర్తించరు. ఈ మార్పు సర్వదా మనతోనే ఉండేదేనని, కేవల శ్రద్ధాభ్యాసము మనకు స్పష్టం చేస్తుంది. ప్రతినిముషము అసంఖ్యాకమైన పరిణామాలు మనం గుర్తించలేనంత వేగంగా జరుగుతున్నాయని మనకు తెలియబరుస్తుంది. మనమెటువంటి ప్రపంచంలో నివసిస్తున్నామనే విషయాన్ని కేవలం మానసికంగా కాక మన వ్యక్తిత్వం అంతటిలోను మనం ప్రత్యక్షంగా గుర్తిసాము. వచ్చే యీ మార్పులను గుర్తించనపుడు మనము వస్తువులను వున్నవి వున్నట్లు గుర్తించడమారంభించామన్న మాట. (అందులోను ప్రధానంగా మానసిక విషయం) నిరంతర పరిణామమే మనస్సని గుర్తింపొతుంది. ఈ విధంగా ఆ పరిణామమనే మానసిక క్రియను ఆ పరిణామము యొక్క తత్వాన్ని మనకెఱుక పరచటమే కేవలశ్రద్ధ మనకు ప్రసాదించే మనోవిజ్ఞానంలోని ప్రధానాంశము. మన మనస్సు యెప్పడూ ఒక్కటిగానే యుంటుందని దాని యొక్క లక్షనాలు, దానిచేత

*కేవల శ్రద్ధ ద్వారా వస్తువులను నిత్యనూతనంగా మొదటిసారిగా చూచినట్లే చూచేలాగా చేస్తుంది. కనుక విషయాలు అంతకంతకు నూతనమైన తనలోని విషయాలను వ్యక్తం చేస్తూంటాయి. కనుక కేవలశ్రద్ధా స్థితిలో మనస్సునెక్కువసేపు నిలిపినపుడు మానసిక అవగాహన అంతకంతకు విస్తరిస్తుంది. సామాన్య యింద్రియానుభూతి యివ్వలేని ఫలితాన్నిస్తుంది.*

గుర్తించబడే వస్తువుల యొక్క లక్షణాలు యెప్పుడు ఒక్కటిగానే ఉంటాయనే భ్రాంతిని తొలగించుటయే యీ జ్ఞానం యొక్క ప్రయోజనం.

ఇ) ఈ మార్పు యొక్క తత్త్వావగాహన మానసిక క్రియలు యొక్క తత్వాన్ని మనకెంతగానో తెలియబరుస్తుంది. ఇంద్రియ గ్రహణం మీద కేంద్రీకరింపబడిన కేవల శ్రద్ధ ద్వారా అందులోని మానసిక భౌతిక క్రియల యొక్క తత్వాన్ని, వాటి సంబంధాన్ని, అవి ఒకదాని తరువాత ఒకటి తటస్థించే స్వభావాన్ని, వీటన్నింటినీ క్రోడీకరించి మనస్సు ఒక వస్తువని భావించడాన్ని గూర్చిన అవగాహన కలుగుతుంది.

అయితే యీ వస్తు భావన (objectfying) భౌతిక, మానసిక క్రియలు అన్న పదాలను విశ్లేషణసౌలభ్యం కోసమే వాడడమైనదిగాని విషయము, వ్యక్తి, పదార్థము, మనస్సులాంటి ద్వైత భావాన్నిగాని, మనస్సు మాత్రమే నిజమనిగాని, పదార్థం మాత్రమే నిజమనిగాని చెప్పే అద్వైత భావాన్నిగాని బుద్ధుడు ప్రతిపాదించడం లేదని చెప్పాలి. బుద్ధుడి యొక్క 'ప్రతిత్యాసముత్పాదము' అను సిద్ధాంతము ద్వైత, అద్వైత భావాలకు అతీతము. సాపేక్షికత నిరంతర పరిణాములను తన తత్వంగా గల యీ ప్రపంచంలో కేవలశ్రద్ధ దృష్ట్యా, ద్వైత, అద్వైతాది భావాలు అనుచితాలని తెలియగలదు.

ఎఫ్) కేవల శ్రద్ధ సాధన ద్వారా మానసిక సంఘటనల విషయంలో మన అనుభవం విశాలము, గంభీరము అయినప్పడు సాధకునికి మనస్సు గుర్తించుట అనే క్రియ తప్ప వేరేమి కాదని ప్రత్యక్షానుభవమౌతుంది. దానిలోగాని, దాని వెనుకగాని ఎక్కడా స్థిరమూ, వాస్తవమూ అయిన వ్యక్తిత్వమే లేదని రూఢి అవుతుంది. ఈ విధంగా అనాత్మ అనే మహత్తర సత్యం అనుభవగతమౌతుంది. అంటే తత్వతః అనుభవించే వ్యక్తి అనుభవింపబడే వస్తువు అనేవేవీ లేవని తెలుస్తుంది.

జి) కేవలశ్రద్ధ మన మనస్సు పనిచేసే రీతుల గురించి గూడ యెంతో పరిజ్ఞానాన్ని మనకు లభింపజేస్తుంది. ఉద్రేకాలు, ఆవేశాలు యెలా పనిచేస్తాయో, మనలోని నిజమైన ఉద్దేశ్యాలు పైకి కనుపించే ఉద్దేశ్యాలకు గల భేదం, మన సామాన్య వివేచనా పద్ధతి యెంత అసమగ్రమో మనకు తెలుస్తుంది. మనలోని బలహీనతలు, సామర్థ్యాల యదార్థ స్థితి కూడా తెలుస్తుంది. మనకంతకు ముందు తెలియని సామర్థ్య, అసామర్థ్యాలు మనకవగత మౌతాయి.

*కేవలశ్రద్ధ మన మనస్సు పనిచేసే రీతుల గురించి గూడ యెంతో పరిజ్ఞానాన్ని మనకు లభింపజేస్తుంది. ఉదేకాలు, ఆవేశాలు యెలా పనిచేస్తాయో, మనలోని నిజమైన ఉద్దేశ్యాలు పైకి కనుపించే ఉద్దేశ్యాలకు గల భేదం, మన సామాన్య వివేచనా పద్ధతి యెంత అసమగ్రమో మనకు తెలుస్తుంది.*

ఈ విధంగా కేవలశ్రద్ధ మనోవిజ్ఞానానికి, ప్రపంచవిజ్ఞానానికి యెంతో తోడ్పడుతుంది. అంతే కాక వస్తుతత్వం యొక్క స్పష్టనిర్వచనంలోను, నిష్పాక్షికమైన గ్రహన శక్తిని పెంపొందిచడంలోను, వస్తు నిశ్చయ విషయమై వ్యక్తిగత (Subjective) అంశాలను తగ్గించడంలోను వస్తుతత్వం సరిగా అవగాహన అయ్యేదాక వస్తు నిర్ణయాన్ని నిలవడము మొదలగు అంశాలలో నిజమై శాస్త్రజ్ఞుడి వైఖరికి పోలివుంటుంది. కేవల శ్రద్ధలో వ్యక్తమయ్యే యీ నిజమైన పరిశోధనాదక్షత బౌద్ధధర్మాన్ని నిజమైన శాస్త్రీయ రీతులకు సన్నిహితం చేస్తుంది. అయితే ఐహికమైన శాస్త్రంలాగా నూత్న విషయాలను గుర్తించి వివరించడమే బుద్ధధర్మం యొక్క మనః సిద్ధాంతము కేవలం మానసికము, సిద్ధాంతపరము అయిన జ్ఞానానికి పరిమితమవక మనస్సును తద్వారా జీవితాన్ని నూత్నంగా రూపొందించటమే లక్ష్యంగా కల్గియుంటుంది. ఈ కల్గియుండడంలో ఆధునిక ఉపయోగాత్మకమైన మనశ్శాస్త్రాన్ని పోలి వుంటుంది.

---

*"బుద్ధ ధ్యాన హృదయం" గ్రంధ సౌజన్యంతో*

# శ్రీ దత్త లీలామృతము

శ్రీమతి శ్రీదేవి



*యానికానిచ పాపాని కృతాని సు బహూన్యపి*
*తాని సర్వాణి నష్టానిహ్యుపవాస ప్రభావత:*

యమధర్మరాజా! వీడొనర్చిన సర్వ పాపములు ఉపవాస పుణ్యము వలన నశించి పోయాయి. కనుక యితడికి ఎట్టి శిక్ష వింధించలేము. పాపములన్నీ నశించి పోగా యింకా యితనికి హరినామ సంకీర్తన, శ్రవణము, జాగరణ చేసిన పుణ్యములు మిగిలి వున్నాయి" అని అతని పుణ్య పాపకర్మములు వివరించాడు.

తండ్రీ! అప్పుడు ఒక విచిత్రం జరిగింది. చేత ఆయిధములతో భయంకరమయిన రూపముతో క్రోధము నిండిన ముఖముతో అగ్ని గోళముల వంటి ఎర్రని కన్నులతో భీతి గలుపుతూ వున్న యమధర్మరాజు చిత్రగుప్తుని మాటలు వినిన వెంటనే ప్రసన్నుడైనాడు. ఆ స్వామి ప్రశాంత వదనంతో చల్లని చూపులతో ప్రేమ పూర్వకంగా నావైపు చూస్తుండగానే భటులు గబగబావచ్చి నా పాశములను త్రెంచి వేసి నన్ను బంధ విముక్తుని చేశారు. యముడు నవ్వుతూ ఒక బంగారు సింహాసనాన్ని చూపిస్తూ నన్ను కూర్చుండ వలసిందిగా ఆదేశించారు. నేను కూర్చొనగానే ఆ స్వామి భటులతో యిలా అన్నారు -

"భటులారా! నేను చెప్పేది సావధానంగా వినండి ధర్మ పరాయణుల జోలికి పోకండి విజితేంద్రియులై వారిని స్మరించే వారిని, పూజించేవారిని, హరికథలను వినేవారిని, హరివాసరముండువారిని , హరి నామములను జపించే వారినీ. నా వద్దకు తీసుకుని రాకండి.

*నారాయణాచ్యుత జనార్దన కృష్ణవిష్ణో*
*పద్మేశ పద్మజపిత శ్శివ శంకరేతి*

*నిత్యం వదత్యఖిల లోక హితా: ప్రశాంతా:*
*దూరాద్భహి స్త్యజత తత్ర నమేస్తి శిక్షా*

శివకేశవుల నామములు నిరంతరం జపిస్తూ, ప్రశాంత చిత్తులై సకలలోక హితమును కోరే సజ్జనులను, భక్తులను చూచి దూరముగా తొలగిపొండు. అటువంటి వారిని నా వద్దకు తీసుకొని వచ్చినా నేను వారిని శిక్షించ లేను. హరియందు మనస్సు నిలిపిన, స్వకులాచారములందు ఆసక్తి కలవారిని, పాత్ర మెరిగిదానము చేసేవారిని, గురుసేవ చేసేవారినీ, చూచి భక్తితో నమస్కరించండి. పరోపకార పరాయణులను, సత్సాంగత్యము చేసేవారిని, శివకేశవులయందు సమ బుద్ధి కలవారిని చూచి వారిని సమీపించే సాహసం చేయకండి. మరొక విషయం. భక్తులనే కాదు, భక్తుల చుట్టూ వుంటూ భక్తులను గౌరవంతో, పూజ్య భావంతో చూచేవారిని, భక్తులయొక్క పవిత్రమైన చూపులు ఎవరిపై పడతాయో అటువంటి వారిని కూడ మీరు తాకవద్దు.

తల్లిదండ్రులకు అపచారం చేసేవారిని, లోకులకు అపకారం చేసేవారిని, దేవతల సొమ్మును ఆశించేవారిని, అపహరించేవారినీ జనకంటకులను కట్టి తీసుకొనిరండి. ఏకాదశీవ్రతము పట్ల విముఖులయిన వారిని, లోకులను దూషించేవారిని, పరులపై నిందలు మోపే వారిని గ్రామనాశనము చేసేవారిని, సజ్జనులను బాధించేవారిని, విప్రుల సొమ్ములను అపహరించేవారిని, ఎన్నడూ దేవాలయములకు వెళ్లని వారిని, ఎన్నడూ హరినామాన్ని నోటపలకని వారిని పట్టి కట్టి కొట్టి తీసుకొని రండి. దైవభక్తిని, దైవ భక్తులను కించపరచి

హేళన చేసేవారిని, స్వార్థ పరులను, నిరంతర కామోప భోగరతులను, అధర్మపరులను బంధించి యీడ్చుకొనిరండు".

యమధర్మరాజు మాటలు నాలో కలవరన్నిరేపాయి. నేను చేసిన పాపాలన్నీ గుర్తుకొచ్చాయి. బాధతో పశ్చాత్తాపంతో నా మనస్సు దహించుకు పోయింది. ఇకపై ఎన్నడూ పాపకర్మలు చేయనే చేయకూడదని నిశ్చయించుకొన్నాను. ఆ క్షణమే హరిస్మరణను ఆరంభించాను ఆ విష్ణుదేవుని ధ్యానించసాగాను.

యమధర్మరాజు నన్ను వైకుంఠానికి తీసుకొని వెళ్ల వలసిందిగా భటులను ఆజ్ఞాపించారు. భటులు నన్ను విమానములో వైకుంఠమునకు పంపారు. ఎంతో కాలం వైకుంఠ వాసినై పరమానందభరితుడనై కాలంగడిపాను. అక్కడినుండి నన్ను స్వర్గలోకమునకు పంపగా ఎన్నో పండ్లు స్వర్గసుఖములననుభవించాను. తర్వాత భూలోకములో, ఋషీశ్వరులు, మహా తపస్సంపన్నులు ఆయన మీ కుమారునిగా జన్మించాను.

తండ్రిగారూ! మరొక్క విషయం. నేను రాజుగా వున్నప్పుడు శ్రీ దత్తస్వామిని ఆశ్రయించానని చెప్పానుకదా! అపుడు దత్తస్వామి వద్ద నేర్చుకొన్న శాస్త్ర జ్ఞానమును కొందరికి దానము చేశాను. అందువలన ఆ పుణ్యఫలంవలన, శ్రీ దత్తానుగ్రహం వలన, ఏకాదశీ వ్రత ప్రభావం వలన నాకు జాతి స్మరత్వం కలిగింది. అందువలన యీ జన్మలో హరిని స్మరిస్తూ ఏకాదశీ వ్రతాన్ని ఆచరిస్తున్నాను.

అవశేనాపి యత్కర్మకృతం తస్యఫలం ద్విదం
ఏకాదశ్యాం వ్రతం భక్త్యాకుర్వతాంకిముత ప్రభో

ఏకాదశీ వ్రతమును తెలియకుండా చేస్తేనే యింతటి ఫలితం లభించింది కదా! ఇక తెలిసి భక్తితో చేస్తే దాని ఫలము ఎంతగా వుంటుందో వేయితలల శేషుడైనా చెప్పగలడా తండ్రీ? అందువలన నేనీ విధముగా ఏకాదశీ వ్రతమును ఆచరిస్తున్నాను".

కుమారుని మాటలు, అతడు చెప్పిన గతజన్మ వృత్తాంతము, యముని ఉపదేశము వినిన కాలవుడు ఎంతో ఆనందించాడు. తనకు అంతటి హరిభక్తుడు జన్మించినందుకు మనసులో ఎంతో పొంగిపోయాడు. అతడు మరింత ఉత్సాహంతో కుమారునితో "వత్సా! దత్తస్వామిని ఆశ్రయించానని చెప్పివున్నావు. ఆ స్వామి నీకేమి చెప్పారు? స్వామి వద్దనీవేమి నేర్చుకున్నావు? అవన్నీ వినాలని వున్నది." అన్నాడు.

భద్రశీలుడు "నాన్నగారూ! నేను గతజన్మలో రాజుగా ఎంతో ధర్మ బద్ధంగా రాజ్యమేలుతున్న రోజులలో నాకొకసారి శ్రీ దత్తాత్రేయ స్వామిని దర్శించాలన్న కోరిక కలిగింది. ఒకనాడు స్వామి దర్శనానికై బయలుదేరి సహ్యాద్రి చేరాను. కొండ ఎక్కి స్వామి ఆశ్రమునకు వెళ్లి దూరంనుండీ స్వామిని దర్శించాను. ఆ సమయంలో స్వామిని ఒక కామిని కౌగలించుకొని వున్నది. మధుపానం చేసి వున్న స్వామి మైకంలో వుండి ఏవో పాటలు పాడుతూ గంతులు వేస్తున్నారు. కన్నులు ఎర్రగా వున్నాయి. ఇంటినిండా యుగాలు ముసురుతున్నాయి. అలా వున్న స్వామిని దూరమునుండీ చూసి అక్కడే స్వామికి సాష్టాంగ నమస్కారం చేశాను. లేచినిలువబడి చేతులు జోడించి భక్తితో నమస్కరిస్తూ నిలుచున్నాను. నన్ను చూసిన స్వామి వంగి నేలపైనున్న మట్టి పెళ్లనుతీసి కోపంగా నాపైవిసిరారు. తర్వాత రాళ్ళు విసిరారు. దగ్గరకువచ్చి కర్రతో బాదసాగారు. నేను అవన్నీ స్వామి లీలలుగా భావించి నమస్కరిస్తూ నిలబడేవున్నాను. ఎంత కొట్టినా చలించక నమస్కరిస్తూ నిలబడివున్న నన్ను చూసి స్వామి చెడ్డగా తిట్టనారంభించారు. నేను 'స్వామి తిట్టిన తిట్లన్నీ నాకు ఆయన ప్రసాదించిన ఆశీస్సులే కదా! స్వామి నన్ను కొట్టిన దెబ్బలన్నీ నా పాపాలన్నీ పారద్రోలుటకాక మరొకటి కాదు కదా!' అని స్వామి దయకు సంతోషించసాగాను. ఇంతలో స్వామి మరింత దగ్గరకు వచ్చి కాళ్లతో గట్టిగా తన్నుతూ కళ్లెర్ర చేసి తక్షణం అక్కడి నుండి వెళ్లకపోతే చంపేస్తానని బెదిరించసాగారు. స్వామి దెబ్బలు, తిట్లు, బెదిరింపులన్నీ నాకొసగే దీవెనలుగా తెలిసికొన్నాను. స్వామి ఆ విధంగా నన్ను పవిత్రునిగా చేస్తున్నారని తలచి స్వామి ఏమి చేసినా చలించక చేతులు జోడించి స్వామి ఎదుట నిలిచి స్తోత్రము చేయసాగాను. "ఓ దేవా! సృష్టి స్థితిలయకారకా! దయానిధీ! ఏల నన్నీవిధముగా పరీక్షలకు గురి చేస్తున్నావు? నీవు సర్వాంతర్యామి వయిన పరమేశ్వరుడవని నేనెరుగుదును. నీవేమి చేసినను నీ పాదములను వీడను. నన్ను దయచూసి పాలింప జాగేల చేస్తున్నావు స్వామీ! పాహిమాం పాహి! కరుణా

నిధీ 'శరణు! శరణు!' అని వేడుకొనసాగాను. అలా తెల్లవారి లేచినది మొదలు స్వామి దయకోసం ఎదురు చూస్తూ స్వామి సన్నిధిలోనే గడుపసాగాలని వేడుకొనసాగాను. ఆ విధంగా కొన్ని రోజులు గడిచాయి. ఉన్నట్లుండి ఒకనాడు స్వామి నన్ను చేరపిలచి "ఏరా! ధర్మకీర్తీ! ఇంత మొండి వాడవైతివేమిరా? నన్ను వీడక వెంటాడుతున్నావు. ఏమి చేసినా నన్ను వదలకున్నావు. ఇంతకూ నీవు వచ్చిన పనేమిటి?" అని ఎంతో ప్రేమగా అడిగారు. స్వామి ఆప్యాయతకు కరిగిపోయాను. స్వామికి సాష్టాంగ పడి లేచి నిలబడి ''స్వామీ! ధన్యుడను! ఇన్నాళ్లకుదయ కలిగిన తండ్రీ!" అంటూ ఆనంద భాష్పాలు కారుస్తుంటే స్వామి నవ్వుతూ నా తలనిమిరి "నాయనా! నీ భక్తికి మెచ్చాను. నీకేమి కావాలో కోరుకో, ఇస్తాను" అన్నారు.

స్వామికి మరల నమస్కరించి "స్వామీ! తమ నుండి ధర్మములు వినవలెనని నా కోరిక. దయతో అనుగ్రహించండి." అని వేడుకొన్నాను. స్వామి నవ్వుతూ "ఇలా రానాయనా! నా చెంత కూర్చో" అంటూ నన్ను తన చెంత కూర్చుండ జేసి నా మేను నిమిరి యిలా అన్నారు - ''వత్సా! ధర్మములు వింటావా! వింటావు కానీ సరిగా ఆచరించ లేవే! అయినప్పటికీ ధర్మములు తెలిసికొనటము అవసరము. అలా తెలిసికొని వుండటం వలన ధర్మాచరణపై ఆసక్తి పెరిగి ఏదో ఒకనాటికి ధర్మాచరణ సులభసాధ్యమౌతుంది.

మనుష్య జాతిలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనే నాలుగు వర్ణములు వున్నాయి. ఇందులో బ్రాహ్మణులు శ్రేష్టులు. బ్రాహ్మణులు, క్షతియులు, వైశ్యులు తల్లి గర్భము నుండి జన్మించటమే కాక ఉపనయన సంస్కారము చేత జ్ఞాన సముపార్జనకు దోహదకారి అయిన మంత్రానుష్టాన సంపన్నులై మరొక జన్మను పొందిన వారవుతారు. ఈ విధముగా యీ మూడు వర్ణమాల వారు ద్విజులు (రెండు జన్మలెత్తినవారు) అనబడతారు. నాలుగు వర్ణముల వారికి ధర్మములు వేర్వేరుగా వుంటాయి. ఎవరి ధర్మములు వారే ఆచరించాలి కాని ఒకరి ధర్మములు మరొకరు అవలంబింపరాదు. సవర్ణ ధర్మ త్యాగిని పాషండుడు అని అంటారు. వాడే పతితుడు అలాకాక స్వధర్మములను చక్కగా పాటించువాడిని సుకృతి అని అంటారు. యుగధర్మములను పాటించాలి. స్మృతులలో చెప్పబడిన కర్తవ్యములను ఆచారములను పరిగ్రహించాలి. త్రికరణశుద్ధిగా ధర్మాచరణ చేయాలి. అటువంటి మానవుడే జ్ఞాన సముపార్జనకు, మోక్షసాధనకు అర్హుడవుతాడు."

ఇలా పలికి శ్రీదత్తాత్రేయస్వామి కవివర్జ్యములు, చాతుర్వర్ణ ధర్మములు, ఆశ్రమములు, షోడశ కర్మములు, సదాచారములు, శ్రాద్ధకర్మ విధులు, చాంద్రాయణాది విధానములు సవిస్తరముగా తెలియజెప్పి, చివరగా మహా పాతకముల ప్రాయశ్చిత్త విధానములు కూడా తెలియజేశారు. అటు తర్వాత స్వామి యిలా అన్నారు.

''కుమారా! నేను నీకు చెప్పిన యీ మహాపాతక ప్రాయశ్చిత్త విధానములన్నీ చాలా గోప్యమైనవి సుమా! మరొక ముఖ్య విషయం ఏమిటంటే యీ ప్రాయశ్చిత్తములన్నింటినీ యాంత్రికముగా చేసినందువలన ఏమీ ప్రయోజనముండదు. నారాయణ భక్తి పరాయణుడై, చేసిన పాపముల పట్ల పశ్చాత్తప్తుడై ప్రాయశ్చిత్తములను చేసికొన్నప్పుడు మాత్రమే పరిశుద్ధుడౌతాడు. పంచమహాపాతకములను గాని సకల మహా పాతకములనుగాని చేసిన వ్యక్తి పశ్చాత్తాపముతో నిండిన మనస్సుతో సర్వభూత దయార్ద్ర హృదయుడై విష్ణు తత్పరుడై చేసికొనిన ప్రాయశ్చిత్తములతో పాప విముక్తుడై పరిశుద్ధుడౌతాడు. ఆవిధంగా అతని పాపములన్నీ పటాపంచలౌతాయన్నది పరమసత్యం. ధర్మకీర్తి మహారాజా! మరల చెపుతున్నాను. ఈ ప్రాయశ్చిత్తములన్నీ ఎంతో సుగోప్యమయినవి సుమా! శ్రద్ధాహీనులకు, భక్తి హీనులకు వీనినెంత మాత్రము తెలియజేయరాదు. మూర్ఖులకు, నాస్తికులకు, దైవద్వేషులకు వీనిని తెలియజేసినందువలన దైవముపట్ల, ధర్మము పట్ల కూడా అపచారము చేసిన దోషము సంక్రమిస్తుందనటంలో సందేహము లేదు.

*"నారాయణ మనాద్యతం విశ్వాకార మనామయం*
*యస్తు సంస్మరమే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే"*

నిరంతరము నారాయణ స్మరణము చేయు వానిని పాపములు అంటవు. భక్తవత్సలుడు, ఆశ్రితజన

రక్షకుడు, దీనబంధు, ఆది దేవుడైన ఆ శ్రీమహావిష్ణువును స్మరించినా, పూజించినా, నిరంతరము ధ్యానించినా, నమస్కరించినా స్వామియే అటువంటి భక్తుని సకల పాపములు పారద్రోలి రక్షిస్తాడు. అటువంటి భక్తుని స్వామి ఎన్నడూ వీడక వెన్నంటి కాపాడుతూవుంటాడన్నది నిత్యసత్యం. ధర్మకీర్తి! నీవుకోరినట్లు ధర్మములు, విహితకర్మలు, ప్రాయశ్చిత్త విధి విధానములు అన్నింటినీ నీకు తెలియపరచాను. విష్ణుస్మరణ ప్రాముఖ్యతను, నిరంతర దైవచింతన వలన సకల పాపనిర్ముక్తులై ఏవిధముగా మానవులు దైవకృపకు పాత్రులు కాగలరో కూడా వివరించాను. నాయనా! నేను చెప్పిన విషయములు మరువక ధర్మబద్ధుడవై జీవించు." అని శ్రీ దత్తాత్రేయస్వామి నాకు ఉపదేశించారు- అని భద్రశీలుడు తన తండ్రి కాలవునకు చెప్పాడు. కుమారుని మాటలు విని కాలవుడు పరమానంద భరితుడైనాడు. "కుమారా! ఎన్ని జన్మల పుణ్యమో, నిన్ను కుమారునిగా పొందాను. అంతేకాదు, మహా మహిమాన్వితమయిన శ్రీ దత్తస్వామి బోధలు నీ ముఖతః వినటం నా అదృష్టం. ఏకాదశీ వ్రత మహాత్మ్యము మాత్రమే కాదు, సమవర్తి యమధర్మ రాజు బోధలు కూడా నీనుండి వినే భాగ్యాన్ని పొందాను. ఓ మహానుభావా! నీకివే నాకృతజ్ఞతాభివందనములు." అంటూ కుమారుని ప్రశంసించాడు, కాలవ మహర్షి.

ఈ గాథను సవివరంగా తెలియజెప్పి, నారదుడు సనత్కుమారాదిమునులతో యిలా అన్నాడు-

మానుష్యం దుర్లభం జన్మప్రాప్యతే యైర్మునీశ్వరాః

తత్రాపి హరిభక్తిస్తు దుర్లభాపరికీర్తితా

తస్మాత్ తటిల్లతా లోలం మానుష్యం ప్రాప్యదుర్లభం

హరిం సంపూజయత్ భక్త్యావశుపాశ విమోచనం.

ఓ మునులారా! శాస్త్రము లేమి చెప్పచున్నవో విన్నారా? అసలు మానవ జన్మ లభించటమే ఎంతో దుర్లభం, అపార పుణ్య ఫలమే జీవికి మానవజన్మను ప్రసాదిస్తుంది. అంతేకాదు, మానవజన్మ లభించగానే సరిపోతుందా? ఆ మానవుడికి హరిభక్తి కలగటం అనేది యింకా అరుదైన అదృష్టం. కాబట్టి సుదుర్లభమయిన మానవజన్మ రానే వచ్చినది. అదికూడా మెఱుపు తీగెలాగా క్షణములో నశించిపోతుంది.

మానవ జన్మ నూరేండ్లకే పరిమితం. ఆ ఆయువులో సగభాగం నిద్రలో పోగా బాల్యములో ఏమీ తెలియని అమాయక స్థితిలో కొంతకాలం గడిచిపోతుంది. వృద్ధాప్యంలో శరీరపటుత్వం తగ్గి శరీర అవసరాలు తీరటానికి కూడా యితరులపై ఆధారపడుతూ వ్యాధులతో, పరాధీనతతో కొంత కాలం గడిచిపోతుంది. వయస్సులో వ్యామోహాలు వెంటపడగా సుఖభోగలాలసులై కాలం గడపటమే కాక కుటుంబబాధ్యతలతో పుణ్యకాలం గడిచిపోతుంది. ఈ విధముగా మానవ జన్మ వచ్చినా కూడా జీవితమంతా యిటువంటి లంపటములతో చిక్కుకునే మానవుడికి హరిభక్తి పరాయణత లభించటము కూడా కష్టతరమే.

కనుక మనుష్యుడు నిరంతరము శాస్త్రవిహిత సత్కర్మలనాచరిస్తూ దైవభక్తుల సన్నిధిలో సత్సాంగత్యములో కాలాన్ని సద్వినియోగ పరచుకొనటం అనివార్యం.

*సత్సంగత్వే నిస్సంగత్వం*
*నిస్సంగత్వే నిర్మోహత్వం*
*నిర్మోహత్వే నిశ్చల తత్త్వం*
*నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః*

కనుక ఎల్లప్పుడూ సజ్జనసాంగత్యమెంతో ఆవశ్యకం. మనుష్యులు ఎటువంటి సాంగత్యములో వుంటే అటువంటి గుణాలను, అలవాట్లను పొందుతారు. అందువలన దుష్ట సహవాసము చేయకుండా దైవీగుణ సంపన్నులయిన మహాత్ముల సాంగత్యము, దైవభక్తుల సాంగత్యము మనుష్యులకెంతో అవసరము. అలాంటి సాంగత్యము వలన దైవభక్తి, ధర్మాచరణ వృద్ధిచెంది మోక్షసాధనవైపు మనస్సు ఆకర్షితమౌతుంది.

# అనన్యచింతన

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ



ఇంతకు ముందు మనం అనుకున్నట్లు, నిష్ఠ అనే కాసుకుగాను, ఆయన మన జీవితం మొత్తం ఆక్రమించేస్తాడు. ఆ నిష్ఠ అనేది జీవితంలో సర్వకాల సర్వావస్థలయందు చెదరడానికి వీలులేనటువంటి స్థితికి మన జీవితాన్ని మలచి వేస్తుంది. అంతవరకూ మనం తీసుకోవలసిన జాగ్రత్త ఏమిటింటే నిష్ఠను యింకా బలీయం చేసుకోవడమెలాగో, దాని విఘాతాల నుండి తొలగించు కోవడమెలాగో ఆలోచించి తెలుసుకోవాలి. నిరంతరం నామస్మరణ చేస్తే సరిపోతుందంటారు కొందరు. కాని వూరికే నామస్మరణ చేస్తే చాలదు. అనన్యచింతన వుండాలి. ఆ నామస్మరణ అనన్యచింతకు దోహదం చేసినట్లయితే అప్పుడు సరిపోతుంది. అంటే భగవద్గీతలో గూడ అనన్యచింతన చేయమనే చెప్పబడి వుంది. అంటే అనన్యచింత వేరు, నామస్మరణ వేరు. నామస్మరణ చేస్తున్నప్పుడు ఆ నామి అయినవాడి గుణగణాలను మనస్సుకు తెచ్చుకొని ఒకానొక పవిత్ర భావాన్ని పొందుతూ వుండడమన్నమాట. అంటే అనుక్షణం నామి అయినాడు గుర్తుకురావడమన్నమాట. ఈ నామస్మరణ ఆ అనన్యమైన చింతకు, ఈ అనన్యమైన చింత ఆ నామస్మరణకు ఒకదానికొకటి పెనువేసుకుపోతాయి. కాబట్టి నామస్మరణ లోపల జరుగుతూవుంటే, ఆ నామం అంటే ఏమిటో అది సమగ్రంగా అర్థం మనస్సులో నిలవాలి.

ఉదాహరణకు సర్వజ్ఞుడు బాబా అనుకున్నామనుకోండి. సర్వజ్ఞుడంటే ఆయన సర్వజ్ఞుడని నిరూపించే కొన్ని ఉదాహరణలున్నాయిగదా! అవి మొదట్లో ఉదాహరణలుగా మాత్రమే జ్ఞాపకం వస్తాయి. కాని కొన్ని రోజులు పోయేటప్పటికి అవి విడివిడిగా జ్ఞాపకం రావడం మానేసి ఆయన సర్వజ్ఞుడనే భావం కలగడం మొదలవుతుంది. మొదట అధ్యాయాలలోని లీలలు ఉదాహరణలు విడివిడిగా అనిపించినప్పటికీ కొన్ని రోజులు అవన్నీ చదివిన తర్వాత అవి జ్ఞాపకం రావడం మానేసి ఆయన సర్వజ్ఞుడనే భావం కలుగుతుంది. ఒక్కొక్క లీల చదువుతుంటే హృదయం ఒక్కొక్కరకంగా స్పందించి ఒక్కొక్క భావం వస్తూ వుంటుంది. హృదయం బాబాకు దగ్గరవడమంటే అదే, చివరకు ఆయన నామాన్ని స్మరిస్తూనే ఒళ్ళు పులకరించి మరచిపోయే స్థితికి వస్తుంది. ఒక్కసారి నామం తలచుకుంటే అందుకు దోహదం చేసే నామస్మరణే అనన్యచింతంటే. అట్లా దోహదం చెయ్యనిది అనన్యచింతనకాదు, నామస్మరణ మాత్రమే. ఇదీ రెండింటికీ తేడా! భగవద్గీతలో శ్రీకృష్ణుడు అనన్యచింతన చేస్తే రక్షిస్తానన్నాడు గాని నామస్మరణ చేస్తే రక్షిస్తాననలేదు. అందుకే సాయిగూడా అన్నారు: "ఎవడైతే ఎల్లప్పుడూ సాయి, సాయి అని భక్తి ప్రపత్తులతో అంటాడో వాడిని రక్షిస్తాను" అని. అంటే వట్టి నామస్మరణ గాకుండా అనన్యమైన చింతన వుండాలి. అది ఎట్లా? బాబా చెప్పారు, భక్తుల అనుభవాలు సేకరించి వ్రాయమని చెప్పారు. అలా వ్రాసుకుని లీలల గురించి చింతనచేస్తూ వుంటే అమూల్యమైన ఆధ్యాత్మిక నిధులు దొరుకుతాయి. అందులోని వజ్రాలు దొరుకుతాయి. లీలలు గురించి చింతన చేస్తూ వుంటే ఆ లీలలో ప్రకటమయ్యే ఆయన తత్త్వం హృదయంలో నిలుస్తూ వుంటే ఆ భావం నానాటికీ మనలో బలీయమవుతూంటే నామస్మరణ

కూడా నానాటికీ బలీయమవుతూ వుంటుంది. కాబట్టి వేదాంతంలో శ్రవణ, మనన, నిధిధ్యాసలు జ్ఞానానికి మార్గాలని ఏవిధంగా అయితే చెప్పారో, అవే భక్తికి గూడా మార్గాలని చెప్పారు. భాగవతాది కథలు గానం చేయమని చెప్పారు. అలా ఎందుకు చెప్పారంటే భగవంతుని లీలలుగానం చేయడంద్వారా అంతటి మహిమాన్వితుడైన భగవంతుని యొక్క గుణాలు మనస్సులో నిలుస్తాయి. ఉదాహరణకు మనకు పరిచయం లేని వ్యక్తిని ఒకరిని తీసుకు వచ్చి వీడు మంచి వాడని చెప్పారనుకోండి. కాని ఆ మంచివాడు అనే దానికి చాలా అర్థాలున్నాయి. తన ప్రాణం పోయినా, నీ ప్రాణంపోయినా 'రూల్' తప్పని వాడని ఒక అర్థం. ఇంకొకటి, యిది నీధర్మం అని ఒకరూల్ అతడికి చెపితే తన ప్రాణంపోయినా సరే తనవాళ్ల ప్రాణం పోయినా సరే ఆ ధర్మం తప్పడు హరిశ్చంద్రుడిలాగా. అది ఒక రకమైన మంచితనం, మరొకడు ఎంతటి కష్టాన్నైనా, త్యాగాన్నైనా తాను మాత్రం భరిస్తాడుగాని యింకొకణ్ణి మాత్రం క్షమించేస్తాడు. మొదటివాడు తనకేది రూలో ఎదుటివాడికీ అదే రూల్ అప్లై చేస్తాడు. వీడలా కాదు. కాఠిన్య మంతా తన విషయంలోనే. మాట అన్నాడంటే ఆ మాట నిలుపుకోవడానికి ప్రాణం పోవలసి వచ్చినా వెనుకాడడు. అదే యింకొకడు ఎన్నిసార్లు మాట తప్పినా 'పాపం వాడి సామర్థ్యం అంతే' నని అనుకుంటాడు. అలా అనుకుని అవతలివాడిని అనంతంగా క్షమిస్తాడు. తనను మాత్రం క్షమించుకోడు. ఇది మరొక రకమైన మంచితనం, ఇలాంటి మంచితనాలు చాలా రకాలున్నాయి. ఒకడు మంచివాడు అని అవతలి వాడు చెప్పినప్పడు చాలా రకాలున్నాయి. ఒకడు మంచివాడు అని అవతలివాడు చెప్పినప్పడు మన మనస్సుకొచ్చే ఆలోచన ఎలాంటిదంటే, వూరికే నామస్మరణ చేసేటపుడు మనస్సులో జరిగే నామస్మరణ వంటిది. అలాగాక వాడితో కలిసి కొన్నాళ్ళుండడంవల్ల వాడిలో ఎన్నిరకాల మంచితనముందో చూచినప్పడు వాడి మంచితనం మీద వుండే అభిప్రాయం వేరు. అంతకు ముందున్న అభిప్రాయం వేరుగా వుంటుంది. అవతలివాడు చెప్పినప్పడు మంచి వాడు కాబోలు అనిపిస్తుంది. అట్లాగాక వాడితో కొన్నాళ్ళు కలిసి వుండడంవల్ల వాడిలో ఎంతమంచితనం వుందో అన్నికోణాలలో చూచినపుడు వాడి మంచితనంపైనున్న అవగాహన వేరుగా వుంటుంది. అప్పడు వాడి గుణగణాలు మన హృదయంలో ముద్రించబడుతాయి.

అలాగే బాబా లీలలను నిరంతరం స్మరిస్తూండడంచేత ఆయన గుణగణాలు, అలాగే భాగవతం చదువుతుంటే భగవంతుని యొక్క గుణగణాలు హృదయంలో ముద్రించబడతాయి. ఆ తర్వాత చేసే నామస్మరణలో వాడి కుండే శ్రద్ధ వేరుగా వుటుంది. ఈ విధంగా భక్తికి గాని, జ్ఞానానికిగాని, శ్రవణ, మనన, నిధి, ధ్యాసలు మార్గాలు, "నా కథలనే ఎవడైతే గానం చేస్తూవుంటాడో, వింటూ వుంటాడో, చింతన చేస్తూ వుంటాడో వాడు నేనుగా మారిపోయి, వాడికి కర్మ రాహిత్యమవుతుంది" అని బాబా సూక్తులలో గూడ వుందిగదా! భగవంతుణ్ణి గురించి యిలాగే చేస్తూపోతే చివరకు భగవంతునితో తాదాత్మ్యం చెందుతారని భాగవతంలో గూడ స్పష్టంగా చెప్పబడివున్నది.

కాబట్టి చెప్పినదానిలో శ్రవణము చేయడమూ వున్నది. పారాయణ చేస్తున్నప్పడూ, వూరికే కూర్చున్నప్పడు గూడ క్షుద్రమైన తలంపుల వైపుకు మనస్సును పోనీయకుండా ఆ కథలనే చదువుతూ, భగవంతుని గుణాలనే చింతన చేస్తూ వుండడం వల్ల ఆ రసానందాన్ని గ్రోలుతూ వుండి ఆనందాన్ని పొందుతూండడం జరుగుతూ వున్నది. అందుకని మననము వున్నది, నిధి ధ్యాసమూ వున్నవి. అలా మననం చేయడంవల్ల దివ్యమైనటువంటి ఆ గుణాల వైపు ఆకర్షింపబడి అందులోనే నిమగ్నమైపోయి దానిదృష్ట్యానే లోకం గురించి ఆలోచిస్తూ వుంటుంది. కాబట్టి భక్తి మార్గంలోనూ శ్రవణ మనన నిధి ధ్యాసలున్నాయి.

అదేవిధంగా సాయి చరిత్రలోనూ వున్నది. సాయి చరిత్ర పఠన (అంటే పారాయణ) వున్నది. సాయి చరిత్ర శ్రవణమున్నది. సాయి చరిత్ర మననమున్నది. సాయిచరిత్ర నిధి ధ్యాసనమున్నది. అలాగే సాయి బోధ యొక్క పఠన, శ్రవణ, మనన నిధి ధ్యాసనాలున్నాయి. వీటిని సమన్వయం చేసుకుంటూపోతే, అనన్య చింతన అదే కుదురుతుంది.

---

*"శ్రీ సాయి మాస్టర్ ప్రవచనాలు" గ్రంధ సౌజన్యంతో*

*"అత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి"*

ఇటువపైనకూడ మోక్షమును పొందుటకు చెప్పమని యాజ్ఞవల్క్యుని జనకుడు కోరెను. ఈ ప్రశ్నవిని యాజ్ఞవల్క్యుడు ఆశ్చర్యమును పొందెను. భయమును పొందెను. ఆయన యిట్లనుకొనెను. "కామ్యమగు ప్రశ్నకు నేను విమోక్షసాధనమగు నిర్ణయమును తెలిపితిని. అనగా ప్రశ్నయొక్క ఏకదేశిత్వము మాత్రమే గ్రహించితిని. కావుననే ఈరాజు తిరిగితిరిగి నన్ను ప్రశ్నించుచున్నాడు. ఈయన మహామేధావి. ఈయన నన్ను నలువైపులనుండియు చుట్టు ముట్టెను. నేను స్వప్నజాగృతులయందలి సంచారముద్వారాను, సుషుప్తి వివరణము ద్వారాను, కారణరహితప్రపంచమును గురించియును, మోక్షమును గురించియును వివరించితిని. దానిని రాజు దృష్టాంతరూపమున గ్రహించెను. కావుననే మరల ప్రశ్నించుచున్నాడు. "ఈవిధముగా తలచి యాజ్ఞవల్క్యడు ఉత్తరగ్రంథమున సాధనయుత ప్రపంచమునుగురించియు, మోక్షసిద్ధాంతమును గురించియును తెలిపెను.

ఆత్మ స్వప్నావస్థయందు క్రీడించి సుఖదుఃఖములను అనుభవించి మరల జాగృతికి విపరీతగమనమున వచ్చును. కారణమగు జాగృతికి చేరును. రాజు వెళ్ళుచున్నప్పుడు ఉగ్రకర్మలను చేయుచున్నడు - మరణకాలమున - ప్రాణములు, వాగాది ఇంద్రియములు, ఒకచోటికిచేరి తృణజలూకాన్యాయమున వేరొకశరీరమును గ్రహించినతరువాత దీనిని త్యజించును.

సవా అయుమాత్మా బ్రహ్మ

ఆ ఆత్మయే బ్రహ్మరూపము. విజ్ఞానమయము, మనోమయము, ప్రాణమయము, చక్షుర్మయము (యజుర్వేదీయమహావాక్యమును) చెప్పి బ్రహ్మస్వరూపమగు ఆత్మయొక్క యథార్థమును ఉపదేశించి యాజ్ఞ వల్క్యుడు జనక మహారాజు అజ్ఞానమును పోగొట్టెను.

అనంతరము దర్బారునుండి భోజనమునకు కబురువచ్చుటచే అందరును భోజనమునకు లేచిరి.

## ఇరువది ఏడవ ప్రసంగము

అనంతరము స్వామి శ్రీనిత్యానందులవారివద్ద సాయంకాలము నాలుగుగంటలకు అందరును కూర్చొనిరి. ఆసమయమున పెద్ద విద్యార్థి ప్రశ్నించెను. "పరమాత్ముని స్వరూపము ఎట్టిది? సగుణమా? నిర్గుణమా?"

## దేవుని స్వరూపము

స్వా.ప్ర. :- పరమాత్ముడు ఒకడే. కాని ఉపాధిభేదమున శ్రుతులు సగుణ నిర్గుణ బ్రహ్మములను రెండుభేదములను తెలిపినవి. మాయావిశిష్టుడగు దేవుడు సగుణబ్రహ్మము. మాయారహితుడు నిర్గుణబ్రహ్మము.

## సగుణ బ్రహ్మము

సగుణ బ్రహ్మము అనగా గుణములతోకూడిన బ్రహ్మము. గుణశబ్దముచే సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వకాముడు, సత్యసంకల్పుడు-ఇత్యాదివిశేషణ విశిష్టుడయి, క్లేశ, కర్మ, విపాక, ఆశయాది దోశములచే రహితుడగు ఈశ్వరుని సగుణబ్రహ్మమని చెప్పదురు. అతనినే శ్రుతి "మాయి" అను శబ్దముచే ఉల్లేఖించినది. అతని విశేషమగు ఉపాధి మాయ. శ్వేతాశ్వతరోపనిషత్తునందు

చూడుడు.

*మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్ ।*
*తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్ ॥*

"జిజ్ఞాసువులు జగత్తుకు మూలకారణమగు ప్రకృతి మాయ అని తెలిసికొనెదరు. మాయాధిపతి మహేశ్వరుడని తెలిసికొనెదరు. మహేశ్వరుడు అనగా గొప్ప ప్రభువు. ఈ మాయచే కల్పించబడిన ఈ ఈశ్వరావయవములచే జగమంతయు నిండియున్నది అని తెలిసికొనవలెను."

*అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః ।*
*స వేత్తివేద్యం న చ తస్యాంస్తి వేత్తా తమాహుర గ్ర్యం పురుషం మహాన్తమ్ ॥*

"ఆ పరమేశ్వరునకు చేతులును కాళ్ళును లేవు. అయినను చాలదూరము సంచరించును. సమస్తమును గ్రహించును. అతనికి నేత్రములు లేవు. అయినను సమస్తమును చూచును. అతనికి చెవులు లేవు అయినను అన్నియును వినును. అతనికి మనస్సు లేక పోయినను తెలిసికొనదగిన వస్తువులను అన్నిటిని తెలిసికొనును. అతనిని తెలిసికొనినవాడు ఎవడును లేడు. అతడు మహాపురుషుడు, ప్రప్రథముడు అని బ్రహ్మవేత్తలు చెప్పదురు."

*ఏకైకం జాలం బహుధా ఎకుర్వన్నస్మిన్ క్షేత్రే సంహరత్యేష దేవః ।*
*భూయః సృష్ట్వా పతయస్తథేశః సర్వాధిపత్యం పరుతే మహాత్మా ॥*

"ఈ పరమాత్ముడు దేవమనుష్యాది అనేక జీవసముదాయములను అనేక విధములుగా సృజించును, వానిని అన్నిటిని అంతమునందు వానికారణమగు మాయయందు లయమును పొందించును. అంతేకాదు. మరల లోకములను, లోకపాలకులను అటులనే సృష్టించి తాను సర్వనియామకుడుగనుండి ఆ మహాత్ముడు వారిపై ఆధిపత్యమును నిర్వహించును."

*యచ్ఛ స్వభావం పచతి విశ్వయోనిః పాచ్యాంశ్చ సర్వాన్పరిణామయేద్యః*
*సర్వమేతద్విశ్వమధితిష్ఠత్యేకో గుణాంశ్చ సర్వాన్వినియోజవేద్యః ॥*

"జగత్కారణుడగు పరమాత్మయే ప్రతిపదార్థస్వభావమును స్థిరముగా నిశ్చయించును. పరిణామము పొందదగినవానిని పరిణామము పొందించును. తాను సమస్త విశ్వమునకును నియామకుడుగానుండి దానిని తన అదుపులో నుంచుకొనును. మాయయొక్క సత్త్వ, రజ, స్తమోగుణములను మూడింటిని సకార్యములయందు కలుపును."

*న తస్య కార్యం కరణంచ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే ।*
*పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ ॥*

"ఈ పరమాత్మునకు శరీరము లేదు. ఇంద్రియములు లేవు, ఇతనికంటె గొప్పవాడుకాని, ఇతనితో సమానమైనవాడుకాని లేడు. ఈ పరమాత్ముని దివ్యశక్తి శాస్త్రములయందు అనేక రకములగా వర్ణించబడినది. ఈ శక్తి అనాదినుండియు స్వతస్సిద్ధమగు జ్ఞానక్రియచేతను సర్వవిషయములజ్ఞానము లందును ప్రవర్తించుచున్నది; బలక్రియచేతను తన సాన్నిధ్యమున వున్న అన్నిటిని శాసించుచున్నది."

## నిర్గుణ బ్రహ్మము

పెద్ద విద్యార్థి :- సగుణబ్రహ్మస్వరూపమును ఇంతవరకును తాము తెలిపిరి. ఇక నిర్గుణబ్రహ్మస్వరూపమును తెలుపండి.

స్వా. ప్ర. :- శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పచున్నది.
"సాక్షిచ చేతా కేవలో నిర్గుణశ్చ." అని.

పరమాత్మ సాక్షి. చిత్ స్వరూపము. ఆకారాధిరహితము, నిర్గుణము. అనగా సత్త్వరజస్తమములను మూడు గుణములను లేనివాడు.

## నిర్గుణబ్రహ్మము సచ్చిదానందస్వరూపము

*"సత్యం జ్ఞాన మనన్తవం బ్రహ్మ"*

బ్రహ్మము సత్ స్వరూపము, జ్ఞానస్వరూపము, ఆనందస్వరూపము. ఈ బ్రహ్మమునే బ్రహ్మవేత్తలు తెలిసికొనెదరు. ఇచ్చటి

''సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ'' అనునది స్వరూపలక్షణము. ఈ లక్షణమునందలి బ్రహ్మపదము లక్ష్యపరముగా ప్రయోగించబడినది. సత్యము, జ్ఞానము, అనంతము అనునవి ఇతరవ్యావృత్తి పూర్వకములగు బ్రహ్మముయొక్క విశేషణములు, విశేష్యవిశేషణభావముతో ఈ శ్రుతియందు సామానాధికరణ్యమును బోధించు సత్యము, జ్ఞానము, అనంతము అను మూడు శబ్దములు వున్నవి. సత్యపదముచే బ్రహ్మ భిన్నములగు అనర్థ అనిత్య పదార్థములు వ్యావర్తితములు. జ్ఞానపదముచే జడములును, అప్రకాశములును అగు పదార్థములు వ్యావర్తితములు. అనంతపదముచే దేశ, కాల, వస్తు పరిచ్ఛేదహితమగు బ్రహ్మము బోధ్యము.

పదార్థలక్షణమునందలి ప్రతిపదమును ఏదియో ఒక పదార్థమును వ్యావృత్తి చేయుటద్వారా లక్ష్యమును చూపించును. ''నీలకమలము'' మొదలగుచోట్ల విశేషణముద్వారా నీలకమలమును ఎరుక పరచవలసినచో "రక్తకమలమునకు" వ్యావృత్తి కలుగవలెను. ఆవ్యావృత్తి నీలపదముతోనే జరుగగలదు. ఇట్లే అనేకవిశేషణముల ద్వారా అనేక విశేష్యములను దూరము చేసి లక్ష్యమును చూపవలెను. కాని ''నిర్గుణబ్రహ్మము ఒకటే'' అనుచోట అనేక విశేషణములను ఉపయోగించవలసిన అవసరము లేదు. సూర్యుడు ఒకడే అయినప్పుడు ఆ సూర్యునకు ఒకడే అను విశేషణము ఉపయోగించుట నిరర్థకము.

కావున పైమూడుపదములలోను ఏదియో ఒక ముఖ్యమైన అభీష్టపదమును ఉపయోగించి బ్రహ్మస్వరూపమును బోధించుట యుక్తము.

## "సత్" మొదలగు పదములు సార్థక్యము

పెద్దవి :- అద్వితీయమగు బ్రహ్మము ఒకడైనప్పుడు యిక మూడుపదములు వాడవలసిన అగత్యమేమి?

స్వా.ప్ర. :- అద్వితీయమగు బ్రహ్మము ఒక్కడే. ఆకారణముచే అతనిని నానాపదార్థేతరవ్యావృత్తి రూపమున తెలిసికొనవలసిన అవసరము లేదు. కాని ఒకసంగతి. ఆకాశమునందు సూర్యుడుకలడు. అదేవిధమగు సూర్యప్రతిబింబము అనేకజలాశయములందు కాననగును. ఆ పరిస్థితియందు కల్పనాప్రసూతులగు సూర్యులను వ్యావృత్తిని పొందించుటకై ఆకాశమునందలి సూర్యుడు సత్యము అని విశేషణము ప్రయాగించవలెను. ''సత్యము'' అనువిశేషణము అకాశమునందలి సూర్యునియందు ఎట్లు సార్థకమో అటులనే బ్రహ్మేతరమగు కల్పిత అవ్యాకృత భూతాకాశాదుల వ్యావృత్తికొరకును, బ్రహ్మపదబోధ్యమగు నిర్గుణబ్రహ్మము భూతాదిభిన్నమని తెలియజేయుటకును యుక్తము. ఏలనన అవ్యాకృతములగు ఆకాశాదిభూతములు అనిత్యములు, కల్పితములు. బ్రహ్మము సత్యము. తద్భిన్నము కల్పనాప్రసూతము కాదు.

కాలత్రయబాధారహితము సత్యము. క్వాచిత్కమగు పదార్థప్రతీతి కలది అసత్యము. ఎట్లనిన-

*"మృత్తికనుండి ఘటము ఉద్భవించును" అని చెప్పబడినది.*

మృత్తికనుండి సర్వకాలనిర్వావస్థలయందును ఒకేరకమగు ఘటాకృతులు ఉద్భవించవు. ఒకప్పడు ఘటములు ఉద్భవించినను మరియొకప్పడు ప్రమిదలు మొదలగునవి ఉద్భవించును. వికారములగు ఈ పదార్థములన్నియు అనిత్యము. శ్రుతికూడ చెప్పచున్నది.

*"వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్॥"*

పేరు పెట్టబడుటతో "నామధేయము" అను వికారమును పొందును. కాని యథార్థమునకు "మృత్తిక" అనునదియే సత్యము. అనగా మృత్తికచే జనించిన కుండలు, ప్రమిదెలు అన్నియును మృత్తికయే. కుండ, ప్రమిద మొదలగునవి పేర్లుమాత్రమే.

ఇట్లు సత్యవనముద్వారా బ్రహ్మవికారములగు ఇతర పదార్థములు వ్యాపర్తితములు. "చిత్" అనగా జ్ఞానము. ఈ పదముచే జడ పదార్థములు వ్యార్తితములు. లౌకికజీవుల జ్ఞానము అనిత్యము. కావున బ్రహ్మము అనిత్యజ్ఞానరూపము అను భావనివృత్తికొరకు "అనంత" పదము ప్రయోగించబడినది. అనంతము అనగా దేశ, కాల, వస్తు పరిచ్ఛేదరహితము.

ఇట్లు సత్యాదిపదములచే బోధించబడు అఖండ, ఏకరస బ్రహ్మము నిర్గుణ బ్రహ్మము. "జ్ఞానం బ్రహ్మ" అని చెప్పినను బ్రహ్మలక్షణము బోధ్యమే. ఈ నిర్గుణబ్రహ్మముతోనే విశ్వము అంతయు నిండియున్నది.

## ఇది అంతయు దేవునిచే నిండియున్నది

శ్రుతి చెప్పచున్నది -

"ఈశావాస్యమిదం సర్వ యత్కించ జగత్యాం జగత్"

పరోక్ష-అపరోక్షరూపమున చూడమగు ఇదంతయును దేవునిచే నిండియున్నది. ఆనిర్గుణబ్రహ్మమే ''వాయ్యాది'' రూపమున న్యవహృతుడగుచున్నాడు, ప్రత్యక్షమగుచున్నాడు. కాని యథార్థమునకు తాత్త్వికదృష్టిని పరిశీలించినచో బ్రహ్మము అప్రచలితము, ఏలనన, అది వ్యాపకము; అక్రియము.

## సృష్టికిపూర్వము "సత్" స్వరూపమగు నిర్గుణబ్రహ్మము

*తదేజతి తన్నైజతి తత్త దూరే తదన్తికే ।*
*తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥*
*(ఈశా)*

లేదనుకొనువారికి ఆబ్రహ్మము దూరముగానుండును. ఏలనన విద్వాంసులుకాని వారికి బ్రహ్మము అజ్ఞాతము, అప్రాప్యము. ఆబ్రహ్మమే సర్వవ్యాపకము; విద్వాంసులదృష్టికి చాలదగ్గరగ నుండును. ఆ బ్రహ్మమే సృష్టికి పూర్వము "సత్" రూపమున ఉండెను. అది ఒకటే అద్వితీయ రూపమున ఉండెను.

## నిర్గుణబ్రహ్మము పరబ్రాహ్మము

''సదేవ సౌమ్యేద మగ్ర అసీదేకమేవాద్వితీయమ్" (ఛాందో)

ఓసౌమ్యుడా! సృష్టి ఉత్పత్తికి పూర్వము ఈదృశ్యజాతమగు జగత్తునకు అధిష్ఠానమగు "సత్" రూపము ఒక్కటే అద్వితీయరూపమున ఉండెను ముండకోపనిషత్తు ఈ నిర్గుణబ్రహ్మమే పరబ్రహ్మము అని చెప్పినది. అది శరీరరహితమని చెప్పబడినది.

*"అథ పరా యయా తదక్షరమధిగమ్యతే*
*యత్తదదృశ్యమగ్రాహ్య*
*మగోత్రమవర్ణమచక్షుఃశ్రోత్రం తదపాణిపాదమ్ ।*
*నిత్యం విభుం సర్వం*
*గతం సుసూక్ష్మం తదవ్యయం యద్ భూతయోనిం*
*పరిపశ్యన్తి ధీరాః ॥*

నిర్గుణరూపముగా ప్రతిపాద్యమగు పరబ్రహ్మమే పరావిద్య అని చెప్పబడును. ఆ పరావిద్యచే అక్షరపరబ్రహ్మము తెలియనగును. ఆ నిర్గుణబ్రహ్మము అదృశ్యము. దృష్టికి విషయము కాదు. అగ్రాహ్యము. హస్తాదులకు విషయముకాదు. అగోత్రము- వామనాది శిష్టగోత్రరహితము. అశరీరి, వర్ణ, చక్షుః శ్రోత్రాదిరహితము; హస్తపాదాదిరహితము. నిత్యము కాలత్రయాబాధితము. అనగా కాలకృతపరిచ్ఛేదహితము. విభువు అనగా దేశకృత పరిచ్ఛేదరహితము. సర్వగతము. సర్వపదార్థములయందును అదృశ్యము. అవ్యయము. అనగా వికారరహితము. అబ్రహ్మము సర్వభూతయోని అనగా అది సర్వభూతములకును అధిష్ఠానకారణము. దానిని సమాహితచిత్తులు బాగుగా చూచుదురు. అబ్రహ్మమే నిష్కలాది రూపమునగూడ ప్రతిపాదింపబడినది.

*నిష్కలం నిష్క్రియంశాన్తం నిరవద్యం*
*నిరఞ్జనమ్ ॥*

కళలు అనగా అవయవములు, అవి బ్రహ్మమున లేవు. అంతేకాదు. మనస్సు, కర్మ మొదలగు 16 కళలును లేవు. నిష్క్రియం అనగా క్రియారహితము. శాంతము అనగా షడూర్మి రహితము. జరా, మృత్యు, శోక, మోహ, క్షుధా, తృష్ణాది షడూర్మిరహితము. నిరపంద్యము అనగా మాయారహితమగు పరబ్రహ్మము నానారూపములు కలదికాదు. నానారూపమున చూచిన వాడు జన్మ మృత్యువుల చక్రములో తిరుగును.

## మనోవాగ్విషయము కాని నార్గుణబ్రహ్మము

*యతో వాచో నిర్తన్తే అప్రాప్య మనసా సహ ।*
*అనన్దం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కదాచనేతి ॥*

మనస్సునకును, వాక్కునకును విషయముకాని బ్రహ్మము, అనగా ఎచ్చటనుండిన మనస్సుతో కూడిన వాక్కు నివృత్తినిచెందునో ఆ బ్రహ్మము 'తత్త్వమస్యాది' మహావాక్యములకు లక్ష్యము. దీనినే శ్రుతులు సాక్షి, చేతనము, కేవలము, నిర్గుణము అగు బ్రహ్మము అని చెప్పినవి.

# జ్ఞానేశ్వర్ మహరాజ్ చరిత్ర

శ్రీమతి వేదవతి



**విఠోబా తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళడం**

ఒకరోజు విఠోబా సిద్ధోపంత్‌తో, "నేను మా తల్లిదండ్రులను దర్శించాలనుకుంటున్నాను. వారిని చూసి చాలాకాలమైంది. వారు నా రాకకై ఎదురుచూస్తూవుంటారు. దయచేసి సెలవివ్వవలసినది" అని ప్రార్థించాడు. అందుకు సిద్ధోపంత్ సంతోషంగా ఒప్పుకొని సకుటుంబంగా అతనితోకలసి కాపగావ్ చేరాడు.

విఠోబా తన తల్లిదండ్రులను దర్శించి నమస్కరించాడు. సిద్ధోపంత్ వారికి నమస్కరించి జరిగిన వృత్తాంతమంతా వివరంగా చెప్పి తన కుమార్తెను వారికి నమస్కరింపజేసాడు. నీరూబాయి రుక్మాబాయిని చూసి ఎంతో సంతోషించి వారందరినీ ఆదరించింది. గోవిందపంతు సిద్ధోపంతుకు నమస్కరించి, "స్వామీ! మీ అనుగ్రహంవల్ల నా కుమారుణ్ణి మళ్ళీ కళ్ళారా చూడగలిగే భాగ్యం కలిగింది. ఇతని వైరాగ్యం చూస్తే ఎంతో ఆందోళనగా వుండేది. మీ దయవలన మాకు ఆ చింత తొలగిపోయింది" అన్నాడు. తన కుమార్తె అదృష్టానికి సిద్ధోపంతు ఎంతో సంతోషించి, వారితో కొన్నాళ్ళు గడిపి తిరిగి భార్యతో కలిసి స్వస్థానానికి చేరి భగవంతుడిని ఆరాధిస్తూ సుఖంగా కాలం గడుపసాగాడు.

కాలం గడుస్తున్నకొద్దీ విఠోబా వైరాగ్యం పెరగసాగింది. రుక్మాబాయి యౌవనవతియై అయిదారు సంవత్సరాలు గడిచినా అతడు ఒక్కసారి కూడా ఆమెను కన్నెత్తి చూడలేదు. అతని తల్లిదండ్రులు కూడా స్వర్గస్థులయ్యారు. అతడు తన భార్యతో, "నేను నా తల్లిదండ్రుల అస్థికలను గంగలో నిమజ్జనం చేయడానికి కాశీకి వెళ్ళవలసివున్నది. నేను తిరిగి వచ్చేవరకు నీవు నీ పుట్టింటిలో వుండు. మన ఇంట్లో నీకు అవసరమైన ధనము, సంపద, ఇతర వస్తువులు తీసుకొని మిగిలినది పేదసాదలకు పంచి పెట్టు" అని ఆజ్ఞాపించాడు. రుక్మాబాయి తన కోసం ఏమీ దాచుకోకుండా అంతా పేదవారికి దానం చేసింది.

ఇంతలో సిద్ధోపంతు తన వియ్యంకులు స్వర్గస్థులైనారని తెలుసుకొని అక్కడికి వచ్చాడు. తన కుమార్తె ద్వారా అల్లుని ప్రవర్తనను గురించి తెలుసుకొని ఆశ్చర్యచకితుడై కూతురు, అల్లుడిని తీసుకొని తన స్వగ్రామమైన కలకావతి చేరాడు. విఠోబా తాను కాశీకి వెళ్ళడానికి అనుమతి కోరాడు. సిద్ధోపంతు అందుకు అంగీకరించక కొన్నాళ్ళు బడలిక తీర్చుకొని వెళ్ళమని చెప్పి అల్లుడి ప్రయాణాన్ని ఆపాడు. రుక్మాబాయి రహస్యంగా తన తల్లిదండ్రులతో అతని వైరాగ్యమును గురించి వివరించి అతడు గనుక వెళ్ళినట్లయితే ఇక తిరిగిరాడని, ఎలాగైనా అతడు సంసారము చేసేటట్లు చేయమనీ వారిని ప్రార్థించింది. సిద్ధోపంతు చాలా జాగ్రత్తతో అల్లుడిని నీడలాగా అనుసరించి కంటికి రెప్పలాగా ఎల్లప్పుడూ కనిపెట్టుకుని వుండేవాడు.

ఒకరోజు తనను గంగాయాత్రకు అనుమతించమని విఠోబా సిద్ధోపంతును నిర్బంధించాడు. సిద్ధోపంతు అందుకు అంగీకరించి తాను కూడా అతనితో వస్తానని చెప్పాడు. అది విని విఠోబా తన స్వేచ్ఛకు భంగము కల్గినందుకు ఎంతగానో బాధపడి తన భార్యను పిలిచి, "ఈ సంసారంలో వుండడం నాకెంతో బాధగా వున్నది. కనుక సన్యాసం తీసుకుని స్వేచ్ఛగా వుండాలని నిర్ణయించుకున్నాను. నీకు చెప్పకుండా వెళ్ళడం అధర్మం గనుక నీకు నిజము తెలుపుతున్నాను. నీ తల్లిదండ్రులకు నా విషయం వివరించి నేను బయలుదేరడానికి సమ్మతించు" అని

కోరాడు. పిడుగుపాటులాంటి అతడి మాటలకు రుక్మాబాయి అదరిపడి తన తల్లిదండ్రులకు విషయాన్ని వివరించింది. సిద్ధోపంతు ఎంతో బాధపడి తన అల్లునితో, "నాయినా! నీవింకా చాలా చిన్నవాడివి. సంసార సుఖాలను కూడా నీవింకా అనుభవించనేలేదు. ఈ వయస్సులో ఇంద్రియ నిగ్రహం ఎంతో కష్టం. అడవులలో కందమూలాలు తింటూ తపస్సు చేసుకునే మునులకే ఇంద్రియ లోలత్వం వదలదు. అటువంటప్పుడు షడ్రసోపేతమైన భోజనం చేస్తూవుండే నీవంటి యువకుని ఇంద్రియాలు అధీనంలో వుండడం సాధ్యమా? కనుక ఇటు సంసారానికి, అటు సన్యాసానికి రెండిటికీ చెడి ఇహపరాలు రెండూ భ్రష్టత చెందుతాయి. ప్రస్తుతానికి సన్యాసము సుఖరముగా తోచినప్పటికీ ఇంద్రియ వికారాలు ఉదయించినప్పుడు అది ఎంతో కష్టముగా అనిపిస్తుంది. సన్యాసాశ్రమములోని కష్టము అనుభవిస్తేగాని తెలిసేదికాదు. ఏపనినైనా నిష్టతోనూ, అభ్యాసంతోనూ క్రమముగా సాధించాలి. అంతేగాని ఏ విషయంలోనైనా తొందరపాటు తగదు. కనుక ముందుగా తగిన అర్హత సంపాదించిన తర్వాతే దేనినైనా సాధించాలి, అనుష్టించాలి. కూర్చున్న తరువాత పడుకోవాలిగాని నిలబడి పడుకోవడానికి ప్రయత్నిస్తే తలపగలక తప్పదు. అందుకే పెద్దలు బ్రహ్మచర్యము, గృహస్థము, వానప్రస్తము, సన్యాసము అనే నాలుగు ఆశ్రమాలను ఒక క్రమంలో ఏర్పరచి మానవులందరూ ఆ క్రమాన్ని అనుసరించాలని విధించారు. సన్యాసము పట్ల అతిగా కుతూహలం కలిగివున్నావు. సన్యాసమంటే తలగొరిగించుకొని కాషాయ వస్త్రాలు ధరించడం కాదు. సంకల్ప వికల్పాలు లేకుండా మెలకువగా వున్నప్పుడే సుషుప్తిని పొంది ఆనందస్వరూపంగా వుండగలగడమే సన్యాసము. ఇది సామాన్యులకు సాధ్యమయ్యే విషయం కాదు. తల గొరిగించుకున్నంత మాత్రాన ఆలోచనలు, సంకల్పాలు తొలగిపోవు. నారదుడు, విశ్వామిత్రుడు, బృహస్పతి, శుక్రుడు, త్రిమూర్తులు - వీరెవ్వరూ సామాన్యులు కాదుకదా? అంతటివారే స్త్రీవ్యామోహానికి వశులైనారు. ఇక మానవుల సంగతి చెప్పాలా? కాలాన్ని జయించవచ్చునేమో గాని కామాన్ని జయించడం సాధ్యం కాదు. సంసారంలో ఉంటూ కూడా తామరాకు మీద నీటిబొట్టులాగా ప్రవర్తించేవాడే పండితుడు కానీ సన్యాసాన్ని స్వీకరించి దానిని అనుష్ఠించలేక పతనమయ్యేవాడు పండితుడు కాలేడు. ఇవన్నీ నీకు తెలియని విషయాలు కావు. తొందరపడి సన్యాసం తీసుకోకు నా మాటవిని గృహస్థాశ్రమము అనుష్ఠించు. అయినా నీకిష్టం లేకపోతే నిన్ను బలవంతపెట్టను. అయితే నాదొక ప్రార్థన. నీవు సన్యాసం స్వీకరించడానికే నిశ్చయించుకున్నట్లయితే కనీసం ఒక్క కుమారుడు కలిగేవరకైనా నీ భార్యతో కలిసి వుండవచ్చుకదా అని బోధించాడు.

విఠోభా తన మామగారికి నమస్కరించి, "స్వామీ! సింహమెంత ఆకలిగా వున్నా దగ్గరలో తిరుగుతూవున్న నక్కలమీద చేయివేయకుండా మదగజాల కుంభస్థలాల కోసమే వేచివుంటుంది కదా! అలాగే విరుక్తుడైనవాడు విషయవాంఛలు ఎంతగా బాధించినా లెక్కచేయకుండా పరమానందాన్నే కోరుకుంటాడు. యుక్తాయుక్త పరిజ్ఞానముగల వివేకవంతుడు ఎప్పడూ స్త్రీసుఖాన్ని కాంక్షించడు. అంతులేని దుఃఖాలకు మూలమైన సంతానము నాకు అవసరంలేదు. మీరేకాదు, భగవంతుడే వచ్చి నన్ను అడ్డగించినా నేనిక్కడ ఉండను. నేను వెళ్ళిపోతాను'' అని అంతగా బ్రతిమాలినప్పటికీ వినకుండా తన తల్లిదండ్రుల అస్తికలను తీసుకొని కాశీకి బయలుదేరాడు. రుక్మాబాయి ఏడుస్తూ అతని పాదాలను గట్టిగా పట్టుకుంది. విఠోబా ఏమీ చేయలేక ప్రయాణాన్ని అప్పటికి మానివేశాడు.

కొంతకాలానికి విఠోబా ఒకనాటి తెల్లవారు ఝామున తన భార్యవద్దకు వెళ్ళి, "స్నానానికి వెళ్తాను'' అని ద్వందార్థంగా (రెండు అర్థాలు వచ్చేటట్లు) అన్నాడు. రుక్మాబాయికి విఠోబా మనసులోని దురుద్దేశము తెలియక "సరేనని" అన్నది. వెంటనే విఠోబా తన భార్య అనుమతిచ్చినట్లుగా భావించి, ఎంతో సంతోషించి, పంజరంలోనుంచి బయటపడిన చిలుకలాగా సంసారం నుండి విముక్తుడై వాయువేగంతో పరుగెత్తి, నిద్రాహారాలు లేకుండా రేయింబవళ్ళు ప్రయాణించి కొంతకాలానికి కాశీ క్షేత్రం చేరాడు. అక్కడ అతడు గంగానదిలో స్నానం చేసి, తన తల్లిదండ్రుల అస్తికలను గంగలో కలిపి, పిండప్రదానం మొదలైన ఆచారాలన్నీ నిర్వహించి ప్రయాగకు వెళ్ళాడు. అక్కడినుంచి పుష్కరానికి వెళ్ళి ఒకచోట బసచేసి, సత్పురుషుల సాంగత్యంలో సుఖంగా జీవించసాగాడు.

తన భర్త ఎంతసేపటికీ స్నానం నుంచి

తిరిగిరాకపోవడం గమనించిన రుక్మాబాయి ఎంతో బాధపడి తన తల్లిదండ్రులకు జరిగిన విషయం వివరించింది. సిద్ధోపంత్ విఠోబా మాటలలోని గూడార్థం తెలుసుకొని అతడు మోసగించి వెళ్ళాడని అర్థం చేసుకొని కొంతమంది మనుషులతో వెతికించాడు. కానీ అతడి జాడ తెలియలేదు. రుక్మాబాయి నిద్రాహారాలు మాని బాధపడసాగింది. తన బాధను భరించలేక అగ్నిప్రవేశం చేయడానికి సిద్ధమైంది. అప్పుడు సిద్ధోపంతు ఆమెతో, "అమ్మా, కొద్దిరోజుల పాటు క్రమం తప్పకుండా గౌరీపూజ చేసుకో... ఆ దేవి అనుగ్రహం వల్ల తప్పక నీ భర్తతో కలిసి నీవు సంతానం పొందుతావు. మొదట పరమేశ్వరుని భర్తగా పొందటానికి పార్వతీదేవి, శ్రీకృష్ణుని భర్తగా పొందేందుకు రుక్మిణీదేవి కూడా గౌరీవ్రతము చేసి తమ కోరికలు సిద్ధింపజేసుకున్నారు" అని చెప్పి ఒప్పించాడు. రుక్మాబాయి తన తండ్రి ఆజ్ఞననుసరించి ఎంతో భక్తిశ్రద్ధలతో ఆ వ్రతం ఆచరించసాగింది.

**విఠోభా శ్రీపాదస్వామిని ఆశ్రయించి సన్యాసం తీసుకోవడం**

ఒకరోజు విఠోబా సాధువులతో కలిసి ఒక సత్పురుషుని వేదాంత వుపన్యాసాన్ని శ్రద్ధగా వింటున్నాడు. ఆయన, ''నాయకులారా! అన్ని ఆశ్రమధర్మాలలో సన్యాసాశ్రమము ఎంతో ఉత్తమమైనది. అన్ని ప్రాణులపట్ల సమబావంతో ఉండగలిగినవారికి అది చాలా సులభంగా భక్తిని కలిగిస్తుంది. భక్తి వలన పరమాత్మ సాక్షాత్కారము, తద్వారా బ్రహ్మానందం సిద్ధిస్తుంది. నిత్యమూ భగవంతుని ధ్యానించేవారికి ఎప్పుడూ దుఃఖం కలుగదు. అహంకార మమకారాదులకు బానిసైనవాడికి నిష్కృతి లేదు. సంసార బంధాల నుండి విముక్తి పొందడానికి రాగద్వేషాలను త్యజించాలి. విషయ సుఖాలద్వారా కలిగే ఆనందము తాత్కాలికమైనది. కనుక విషయ వాసనలను జయించాలి. పంచేంద్రియాల ద్వారా బుద్ధిలోకి ప్రవేశించే శబ్దము, రుచి, వాసన మొదలైన విషయాలను నిగ్రహించి దృష్టిని కనుబొమల మధ్య నిలిపి, ప్రాణాన్ని, అపానాన్ని రెండింటినీ సమానంగా ముక్కులోపల ఒక క్రమపద్ధతిలో శ్వాస ద్వారా చరింపజేసి, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలను వశపరచుకొని అరిషడ్వర్గాలను జయించి కేవలం ముముక్షువుగా జీవించేవాడు మాత్రమే బ్రహ్మానందాన్ని అనుభవించడానికి అర్హుడు. మిగిలినవారు అందుకు అర్హులు కారు" అని చెప్పాడు.

ఈ ప్రసంగాన్ని వినిన విఠోబాకు తాను సన్యసించాలనే కోరిక తీవ్రమైంది. అప్పటినుండి తనకు సన్యాసమివ్వగల సద్గురువును విఠోభా అన్వేషించసాగాడు. ఒకరోజు అతడి అన్వేషణ ఫలించి శ్రీపాదస్వామి అనే పరమహంస అతనికి దర్శనమిచ్చారు. ఆయన ఆ ఊరిలోనే నివసిస్తూవున్నారు. విఠోబా ఆయనను జాగ్రత్తగా పరీక్షించుకుని ఆయనే తనకు తగిన గురువని నిర్ణయించుకుని, ఆయనను భక్తితో దర్శించాడు.

శ్రీ పాదస్వామి విఠోబాతో, ''నాయనా! నీపేరేమిటి? నీవు నావద్దకు రావడానికి గల కారణమేమిటి?" అని ప్రశ్నించాడు. విఠోబా, "స్వామీ! నేను సంసార లంపటము నుంచి తప్పించుకుని సన్యసించడానికై మిమ్ములను ఆశ్రయించాను. కరుణతో నా కోరిక నెరవేర్చవలసినది" అని ఆయనను ప్రార్థించాడు. అందుకు శ్రీపాదస్వామి, "నాయనా! అందరికీ ఎంతో ఆనందాన్ని ప్రసాదించే సంసారము నీకెందుకు బాధ కలిగించింది?" అని ప్రశ్నించారు. అందుకు విఠోభా, "స్వామి! అందరూ ఏ సంతోషాన్ని ఆశించి సంసారబంధాలలో చిక్కుతున్నారో నాకు తెలియడం లేదు. కానీ నాకు మాత్రం సంసారం దాటనలవిగాని మహారణ్యముగా గోచరిస్తోంది. నేను ఈ సంసారంలో దారితప్పి ఎటువెళ్ళాలో తెలియని పరిస్థితిలో వున్నాను. నాపై దయతో నాకు దారిచూపి నన్ను అనుగ్రహించవలసినది" అని ప్రార్థించాడు.

శ్రీపాదస్వామి చిరునవ్వు నవ్వి, "నాయనా! నేను కూడా ఈ విషయాలనే కౄరమృగాలను సంహరించడానికి తగిన ఆయుధం కోసం ఎంతోకాలంగా అన్వేషిస్తూనే వున్నాను. నాకే యింకా అది దొరకలేదు. ఇక నీకు నేనేమి చెప్పగలను? కనుక ఆ ఒక్క విషయం తప్ప యింక ఏ కోరికైనా నెరవేర్చగలను" అని పలికాడు. అది విని విఠోబా, "స్వామీ! నన్నెందుకు పరీక్షిస్తారు? మీరు అపారకరుణతో నన్ను తమ శిష్యునిగా అంగీకరించి, నన్ను అనుగ్రహించి నా అహంకార మమకారాదులను తొలగించి అజ్ఞానాన్ని నశింపజేసి శాశ్వతానందాన్ని ప్రసాదించి రక్షించండి" అని పరిపరి విధాల ప్రార్థించాడు.

స్వామి అతడి పరిపాకానికి అబ్బురపడి, "నాయనా! నీ తీవ్ర వైరాగ్యము, దృఢనిశ్చయము చూసి

నాకెంతో ఆనందంగా వున్నది. నీవు బ్రహ్మచారివా? గృహస్థువా? తల్లిదండ్రులున్నారా? ఆ వివరాలు చెప్పు" అన్నారు. విఠోబా తనకు వివాహమైందని చెప్పినట్లయితే స్వామి తనను తిప్పిపంపివేస్తారని సందేహించాడు. కనుక ఒక్క క్షణం ఆలోచించి స్వామితో తానొక బ్రహ్మచారిననీ, తనకు బాధ్యతలేవీ లేవనీ, కొంతకాలం క్రితమే తన తల్లిదండ్రులు కూడా మరణించారనీ అబద్ధం చెప్పాడు. అది విని శ్రీపాదస్వామి సంతోషించి అతని తలపై తమ చేయి పెట్టి ఆశీర్వదించారు. ఆ తరువాత అతనిని శ్రద్ధతో వినమని చెప్పి ఓంకారమంత్రపూరితమైనది, సర్వసంపదలను సునాయసంగా ప్రసాదించేది, అద్వితీయమైన భావనను స్థాపించేది, వేదాంత సారమైనది, చంచలమైన మనస్సును నిగ్రహించేది, సచ్చిదానంద భావనను ప్రసాదించేది, నిత్యానంద ప్రదమైనది, పదార్థముయొక్క మూడు స్థాయిలను ఒకేసారి దర్శింపజేసేది, భగవంతుని సర్వవ్యాపకత్వాన్ని వ్యక్తపరచేది, మతభేధాలకు అతీతమైనది, సంశయాలన్నిటినీ నివృత్తిచేసేది, అహంకారమమకారాలను నశింపజేసేది, అంతులేని ఆనందాన్ని ప్రసాదించేది అయిన 'తత్వమసి' అనే మహావాక్యాన్ని బోధించారు.

విఠోబా పరమానంద భరితుడై స్వామికి నమస్కరించి, "స్వామీ! 'తత్వమసి' అనే మహావాక్యానికి గల గూఢార్థాన్ని దయచేసి వివరించవలసినది" అని ప్రార్థించాడు. అందుకు శ్రీపాదస్వామి ఎంతో సంతోషించి, "నాయనా! 'తత్వమసి' అనే మహావాక్యం ఎంతో గూఢమైనది. దాని అర్థం తెలుసుకోవడానికి నీవంటి తీవ్ర విరాగి మాత్రమే అర్హుడు. కనుక విను :

ఋగ్వేదంలో 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనే మహావాక్యం చెప్పబడినది. ఇది ఎంతో ఉన్నతమైనది, శ్రేష్ఠమైనది. 'ప్రజ్ఞానం' అంటే ఆత్మ. 'బ్రహ్మం' అంటే పరమాత్మ. 'ప్రజ్ఞానం బ్రహ్మ' అంటే అన్ని జీవులలో అనుభవమయ్యే సాక్షి తత్వమైన 'ఆత్మే పరమాత్మ'. శబ్దము, స్పర్శ, రూపము, రుచి, వాసనలను గుర్తించే ఇంద్రియాలు, ఇంద్రియాలద్వారా విషయాలను తెలుసుకొనే అంతఃకరణము, అంతఃకరణము ద్వారా తెలుసుకుంటూ వుండే మనస్సు, వీటన్నింటి ద్వారా ఉత్పన్నమైన అవిద్యను తెలుసుకుంటూ వుండే సాక్షి తత్వమే ప్రజ్ఞానము. ఇలా సృష్టిలోని సమస్త పదార్థాలలోనూ నివసిస్తూ వాటన్నింటినే తెలుసుకొంటూ వుండే సర్వసాక్షి అయిన పరమాత్మ బ్రహ్మమని వేదాలు చెబుతున్నాయి. అనేక రూపాలతోనూ, పేర్లతోనూ మనకనుభవమయ్యే సృష్టిని మన అంతరాలలో పరిమితమైన సాక్షిరూపంగా వుండేటటువంటి జ్ఞానాన్ని 'ఆత్మ' గాను, ఈ విశ్వంలోని అన్ని రూపాలకు, నామాలకు ఆధారమైన సర్వసాక్షిగా వుండేటటువంటి బ్రహ్మాన్ని 'పరమాత్మ'గాను వేదాంత శాస్త్రాలు వివరిస్తాయి" అని చెప్పాడు.

అందుకు విఠోబా, '' గురుదేవా! ఒక్కదేహానికి సాక్షిఅయిన ఆత్మ సర్వసాక్షి అయిన పరమాత్మ ఎలా కాగలదు?" అని ప్రశ్నించాడు. స్వామి, "నాయనా! దీపంలోనూ, దివిటీలోనూ ఉన్న ప్రకాశము యొక్క స్వభావము ఎలా అయితే వేరుకాదో అలాగే ఆత్మ, పరమాత్మ అనే పేర్లు వేర్వేరుగా తోచినా స్వభావసిద్ధంగా ఒక్కటిగానే వుంటాయి. పెద్దదిగా వున్నది కనుక చెరువని, చిన్నదిగా వున్నది గనుక మడుగనే, ఒక్కడే వుంటే మనిషని, చాలామంది కలిసివుంటే సంఘమని, ఎలా అయితే పిలుస్తామో, ఒక్క శరీరానికి సాక్షిగా వుండడం వల్ల 'ఆత్మ' అని, అన్ని దేహాలకూ సాక్షిగా వుండడం వల్ల 'పరమాత్మ' అని వాటి వాటి పరిమితిని అనుసరించి వివిధ పేర్లు ఏర్పడ్డాయి. కానీ నిజానికి ఆత్మకు, పరమాత్మకు భేదమేలేదు" అని చెప్పాడు.

విఠోబా, ''ఆత్మయొక్క సర్వరూపస్వభావాలెలా వుంటాయి?'' అని అడిగాడు. అప్పుడు శ్రీపాదస్వామి, "నాయినా! ఇంద్రియాలవలన మనస్సులో ఉద్భవించే వికారాలను నిగ్రహించుకొని, మానావమానాలు రెండింటికీ దూరంగా వుండి, మౌనంగా సంకల్ప వికల్పాలు లేకుండా చూసుకుని, నిర్వికల్ప సమాధిలో నిశ్చలంగా వుండి అనంతమైన ఆనందాన్ని అనుభవించడమే బ్రహ్మానుసంధానము (అంటే పరబ్రహ్మలో కలయిక). అదే ఆత్మయొక్క స్వరూపము" అని వివరంగా చెప్పారు. ఆ తరువాత అతనికి పూర్ణాభిషేకము చేసి 'చైతన్యస్వామి' అని దీక్షానామమిచ్చారు. గురుకృప వలన విఠోబా మనసులోని వికారాలన్నీ తొలగి దృఢమైన మనస్సులో బ్రహ్మాధ్యానానికి పూనుకొని బ్రహ్మానందాన్ని అనుభవించసాగాడు.

# శ్రీ గురు చరిత్ర కృతజ్ఞతార్చన రానున్నది.

శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్



జై సాయి మాస్టర్!

కలి యుగంలో మొదటి పూర్ణ ధత్తావతారమైన శ్రీ శ్రీపాద శ్రీ వల్లభ, శ్రీ నసింహ సరస్వతి అవతారముల జీవిత ఘట్టములను, లీలలను, బోధలను మనకు నేర్పే శ్రీ గురు చరిత్ర ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్ తెలుగు జాతికి, ఆంగ్ల భాషకు పెట్టిన భిక్ష. సద్గురు సాంప్రదాయాన్ని జన బాహుళ్యానికి తిరిగి పరిచయం చేసి ఆధ్యాత్మిక సాంప్రదాయాన్ని పునర్జీవింప చేసారు మాస్టర్. సద్గురువుని ఎలా తెలుసుకోవాలో ఎలా



సేవించాలో, నిజమైన సద్గురువులు ఎలా వుంటారో మనకు తెలిపే గురు కటాక్ష స్వరూపమే శ్రీ గురు చరిత్ర.

శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వామి శిష్యులైన శ్రీ గుళవణి మహరాజ్ పూనా నగరంలో మాస్టర్ గారికి శ్రీ గురు చరిత్రను (సమశ్లోకి), శ్రీ సంహితాయన శ్రీ గురుసాహస్రిని ప్రసాదించారు. శ్రీ గురు చరిత్ర పారాయణ చేసిన తరువాతనే శ్రీ సాయి, మాస్టర్ గారిని తమ వాడిగా అంగీకరించారని అంటారు మాస్టర్. మనందరము శ్రీ సాయి అనుగ్రహానికి పాత్రులమవ్వాలని, శ్రీ సాయి ఆదేశించినట్లు ఎవరికి వారము సద్గురువుని తెలుసుకోవాలని, నిర్దుష్టమైన ఈ ఆధ్యాత్మిక మార్గాన్ని మనందరమూ అనుసరించి తరించాలని ఆశించిన మాస్టర్‌గారు, శ్రీ గురు చరిత్రను తెలుగు భాషలో మనకు అందించారు. శ్రీ సాయి లీలామృతంతో పాటు శ్రీ గురు చరిత్రను కూడా నిత్యపారాయణ చేయాలని విధించారు.

ఇంతటి మేలుని మనకూ, యావత్ సమాజానికి చేకూర్చగల శ్రీ గురు చరిత్ర మహాగ్రంధము మనకు సద్గురువు ప్రసాదము, సద్గురు స్వరూపము కూడా. కనుక గ్రంధాన్ని అలానే సద్గురువు స్వరూపంగా సత్కరించి సేవించడం మన విధి కర్తవ్యము. సద్గురువు ప్రసాదాన్ని నల్గురిలో పంచుకోవడం మన బాధ్యత కనుక, శ్రీ గురుచరిత్ర గ్రంధాన్ని నలుగురికి పరిచయం చేయడం మన ధర్మం. ఈ రెండు అంశాలను దృష్టిలో వుంచుకొని గురుపత్ని, గురు ప్రతిరూపమూ అయిన దివ్యజనని శ్రీ అలివేలు

మంగమ్మ ఆశీస్సులతో గత సంవత్సరం సెప్టెంబరు మొదటి ఆదివారం "శ్రీ గురు చరిత్ర కృతజ్ఞతార్చన" అను పేరుతో భక్తులందరమూ వేడుకగా జరుపుకున్నాము.

మనకు, మన సమాజానికి, భావి తరాలకు




అంతులేని మేలు చేయగల్గిన శ్రీ గురుచరిత్ర మహా గ్రంథాన్ని భక్తి శ్రద్ధలతో సేవించుకునే పవిత్రమైన "శ్రీ గురు చరిత్ర కృతజ్ఞతార్చన 2012" త్వరలో రానున్నది. సెప్టెంబరు 2 (మొదటి ఆదివారం). భక్తులందరమూ యావత్ ప్రపంచమంతటా ఈ గ్రంథాన్ని క్రమపద్ధతిన సేవించుకోవలసి వున్నది. ఆ రోజు మనందరమూ చేయవలసిన కార్యక్రమము వచ్చే సంచికలో వివరంగా మీ ముందు వుంచుతాము.

ఇప్పటి నుంచి కృతజ్ఞతార్చన వరకు వున్న సమయాన్ని మనందరమూ చక్కగా సద్వినియోగం చేసుకోవాలి. ఒక నియమంగా శ్రీ గురుచరిత్రని, శ్రీ సాయి లీలామృతాన్ని పారాయణ చేయడమూ ఎంతో శ్రేయస్కరము. వీలైనంత మంది యిలా పారాయణ చేస్తే వ్యక్తి గతంగానే కాక సామాజికంగా కూడా ఎంతో మేలు జరుగుతుంది. అంతేకాక వీలైనంత మందికి శ్రీ గురుచరిత్రను పరిచయం చేసి కూడా కృతజ్ఞతార్చన లోపు పారాయణ చేసుకునేలా చూసుకుంటే మరింత భావంతో వారు కూడా కృతజ్ఞతార్చనలో పాల్గొనడానికి అవకాశమున్నది. శ్రీ సాయి మాస్టర్ భక్తులందరు ఈ విధంగా ఆలోచించి ఇప్పటి నుండి కృతజ్ఞతార్చన లోపు వున్న సమయాన్ని చక్కగా సద్వినియోగ పరుచుకోగలరని ఆశిస్తున్నాము. మొదటిగా ఈ కార్యక్రమములో మాస్టర్‌గారు వ్రాసిన "శ్రీ దత్తావతార మహత్మ్యం" గ్రంధాన్ని శ్రద్ధగా ఒకసారి పారాయణ చేస్తే భావ శుద్ధి కలిగి కార్యక్రమము మరింత శ్రద్ధగా జరుపుకోగలుగుతాము అని మనవి. దేశమంతటా ఈ కార్యక్రమాన్ని పురస్కరించుకుని మందిరాలన్నింటిలోనూ, సత్సంగాలన్నింటిలోనూ శ్రీ దత్తావతార మహత్మ్యము, శ్రీ గురు చరిత్ర, శ్రీ సాయి చరిత్రలు శ్రవణం చేయించటం ఎంతో ఉపకరిస్తుంది. అగస్టు నెల మొత్తము స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగాను, రానున్న శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతార్చన సందర్భంగాను, మందిరాలన్నిటిలోనూ, సత్సంగాలన్నింటిలోనూ, ప్రతీ ఇంటిలోనూ యిలా ఒకే క్రమంలో పారాయణలు చేయడం తరతరాలకు ఒక సంస్కృతిగా నిలిచిపోవాలి అన్నది ఆశయం.

భక్తులందరూ ఈ విధంగా పారాయణలు చేయడం ద్వారా, శ్రీ గురు చరిత్రను కొత్తవారికి పరిచయం చేయడం ద్వారా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటారని ఆశిస్తున్నాను.

జై సాయి మాస్టర్!

## Books on Sri Ramakrishna Paramhansa and Swami Vivekananda

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 |
| భారతం నా అమర భారతం | 20.00 |
| జ్ఞాన యోగం | 30.00 |
| బుద్ధి యోగం | 15.00 |
| కర్మ యోగం | 15.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 |
| స్వామి వివేకానంద (2 భాగాలు ) | 60.00 |
| మహాభారతం | 5.00 |
| నా అమర సందేశం | 30.00 |
| భక్తి యోగం | 10.00 |
| సందేశ తరంగిణి(కొలంబో-అల్మోరా) | 40.00 |
| వివేక సూర్యోదయము | 20.00 |
| దైవంతో సహజీవనం | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 |
| మువివేకానంద లేఖావళి | 25.00 |
| My Idea of Education | 34.00 |
| Karma Yoga | 18.00 |
| God Lived with Them | 170.00 |
| The Lived with God | 140.00 |
| Raja Yoga | 36.00 |
| Bhakti Yoga | 16.00 |
| Jnana Yoga | 50.00 |
| Letters of Swami Vivekananda | 110.00 |
| Reminiscences of Swami Vivekananda | 100.00 |
| Talks with Swami Vivekananda | 58.00 |
| Complete Works of Swami Vivekananda-9 | 110.00 |
| Meditation and Its Methods | 18.00 |
| Vivekananda on Himself | 100.00 |
| Ramakrishna and Vivekananda | 7.00 |
| Tales and Parables of Sri Ramakrishna | 45.00 |
| Lectures from Colombo to Almora | 40.00 |
| Complete Works of Swami Vivekananda | 50.00 |
| Sayings of Sri Ramakrishna | 25.00 |

జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయిమాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయిమాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు-పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine Subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone :040-20063300
**OR, Sri Manga Bharadwaja Trust , Ongole Branch Office**
Kothapeta, Kondaiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.** **Magazine** మరియు **General Donations** ను **"Sri Manga Bharadwaja Trust"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Annadanam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Sai Master)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Ashramam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Peace Foundation)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల్వారా పంపగలరు

**Books order** ను **"Sri Manga Bharadwaja Trust (Publications)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్మ్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

## ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

## BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

## BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |


SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300


**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**

*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*



శ్రీ శ్రీ శ్రీ వెంకయ్య స్వామివారి సన్నిధిలో పూజ్యశ్రీ గురుదేవులు. ( శ్రీ వెంకయ్య స్వామి ఆరాధన మహోత్సవం - ఆగస్టు 24, 2012 )



శ్రీ రామకృష్ణ పరమహంస ఆశీస్సులకు పాత్రులమయ్యేలా
మనందరినీ, సకల జీవకోటినీ నడిపింపమని వారికి ప్రార్థన.
(శ్రీ రామకృష్ణ పరమహంస ఆరాధనోత్సవం – ఆగస్టు 16)

**edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust, ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.**



శ్రీ చీరాల స్వామి ఆరాధన మహోత్సవ సందర్భంగా వారి దివ్య పాదపద్మములకు
శతకోటి వందనములు

# "ప్రశ్న"ల గోల

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సెప్టెంబరు 2012

మనకీ జీవితంలో జరిగే ప్రతీదీ పూర్వకర్మానుసారం జరుగుతుందని మన ప్రాచీన గ్రంథాలు చెబుతున్నాయి; దైవనిర్ణయం ప్రకారం జరుగుతాయని క్రైస్తవ, యిస్లాము గ్రంథాలు చెబుతాయి. అంటే వాటిని మనంగా మార్చుకోనే అవకాశమే లేదన్నమాట. ఇక ప్రశ్నలు చెప్పే వారిదగ్గరకు పరిగెత్తడమెందుకు? అటు దైవాన్ని, యిటు కర్మనూ గూడ విశ్వసించలేని బలహీనత మాత్రమే అట్టి వారిలో కన్పించేది. అంటే దైవంపట్ల దృఢవిశ్వాసం లేకపోవడమే జరిగేది. వాటిని మార్చగల సమర్థులు దైవము, లేక వారి ప్రతిరూపమైన సద్గురువులు. వారిని త్రికరణ శుద్ధిగా ఆశ్రయిస్తే సరిపోదూ? ఇది ఆలోచించాలి.

ఒకవేళ ప్రశ్నకు వెడితే వారు మనంకోరేది జరుగదని చెప్పినా, జరుగుతుందని చెప్పినా వారివద్దకెళ్ళినందువలన ఒరిగేదేముంది? అదెలాగూ జరుగడమో, జరుగకపోవడమో అన్నది మారదుగదా?

అలాగాదు, అదీ తెలిస్తే మనస్సుకు స్థిమితం కుదురుతుందంటారా? అది నిజంగాదు. వారు చెప్పిన గడువుతీరేదాకా వారు చెప్పేది నిజమయ్యేదీ లేనిదీ మనకెలాగూ తెలియదుగదా! ఒకరికి నిజమైనా యింకొకరికి జరుగకపోవడం చూడవచ్చు. అంటే ఒక విధంగా కొందరికి జూదం పట్ల వ్యామోహం ఉండడంలాంటిదే మరికొందరికి ప్రశ్న చెప్పించుకొనడంమీద ఉంటుందని గుర్తించాలి. జూదం వలెనే వీరికి గూడ అటు దైవంమీద, కర్మమీద విస్వాసం లేకపోవడమే మనకు తెలిసేది. ఒకవంక దైవ స్వరూపులైన సద్గురువును కొలుస్తూ మరొకవంక నిష్ఠ, ఓరిమి కలిగివుండాలని అందరు మహనీయులూ చెబుతున్నారు. దైవము, గురువులపట్ల నిష్ఠ-ఏకాగ్రమైన విశ్వాసము, ప్రేమ-మరొకవంక జరుగనున్న, జరుగుతున్న, జరిగిన వాటిగురించి ఓరిమీ కల్గియుండడమే ఆస్తికత అంటే. ప్రశ్నలకు పరిగెత్తడమొక ప్రచ్ఛన్నమైన నాస్తికత. అట్టి వారికి దైవభక్తి, విశ్వాసమూ సడలి బలహీనులయ్యారని అర్థం.

జ్యోతిషాది శాస్త్రాల సహాయంతో ప్రశ్న చెప్పేవారికి శాస్త్రంమీద తప్పుమోపి తప్పుకొనే అవకాశం వున్నది. ఉపాసన, అంజనము, కోడిగుడ్డు ప్రశ్నల్లాటివి చెప్పేవారిజోలికి అసలు పోవద్దు. అదొక విషవలయం. మొదట ప్రశ్న, తర్వాత కోరిక నెరవేరడానికో, కష్టం తీరడానికో జపాలు, పూజలు, గురుకట్నాలు, అవి జరుగకుంటే చేతబడియన్న మాటతో మనిషిని బానిసను చేసుకొంటారు. భగవంతుడు, సద్గురువూ మనకు శ్రేయస్కరమని, న్యాయమనీ తలస్తే తీరుస్తారని విశ్వసించి వారినే నిష్ఠ-ఓరిములతో సేవిస్తూ, అవి తీరకుంటే ఓరిమివహించి, వాటిని తీర్చుకునే ధర్మబద్ధమైన యత్నం మాత్రం విడవకుండా ఉండడమొక్కటే మార్గం. వాల్మీకి, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, వ్యాసుడు మొదలైన ఋషులెందరో కష్టాలపాలైన రాముణ్నిగాని, సీతనుగానీ యిలా ప్రక్కదారి పట్టించక ఓరిమి, నిష్ఠలతో గూడిన గురుసేవమాత్రమే ఆశ్రయించనివ్వడం చూచియైనా మనం సరైనదారిన పోవాలి. లేకుంటే ఒకవంక మన భక్తి విశ్వాసాలు పాడవుతాయి; మరొక వంక ప్రపంచంలో యింత చెడుకు మనంగూడ దోహదం చేసినట్లవుతుంది; చివరకు ఆధ్యాత్మికతకే నాస్తికులనుండి నిందలు తెచ్చిన వారమవుతాము. ఇంత చెప్పినా విడవకుండా వాటికై పరిగెత్తేవారి సాంగత్యం-జూదరి సాంగత్యంలా చెడ్డదని తెలిసి దూరంగా వుండండి. ఇది అనాదిగా ఋషులు, బుద్ధుడు మొ॥న వారంతా చెప్పినది; ఈ నాడు సాయి తెల్పుతున్నదీను!

SRI MANGA BHARDWAJA TRUST

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంపుటి: 30 సెప్టెంబర్లు-2012 సంచిక: 05

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST

పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"

## విషయసూచిక



చిరునామా

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**

చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి
ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ ఆర్.ఎస్. శశిధర్, పిహెచ్. డి

**చందా వివరములు**

| | |
|---|---|
| విడిప్రతి | : రూ. 10-00 |
| సంవత్సర చందా | : రూ. 100-00 |
| రాజపోషకులు | : రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. 5,000-00 |

*పరమాత్మ ఇంద్రియ మనస్సులకు గోచరించదు అందుకని సామాన్యంగా అనుభవం గాదు. అందుకని దృఢమైన విశ్వాసం కలగడం కష్టం. అనుభవముంటేగాని విశ్వాసం కుదరదు; దృఢమైన విశ్వాసముంటేగాని అనుభవం కలుగదు. అటువంటప్పుడు ఆస్తికులకు ఆధ్యాత్మిక జీవనము, తదితరులకు నైతిక జీవితము ఎలా సంభవము? ఇందుకు సమాధానం మహనీయులు, మత గ్రంథాల వలనన లభిస్తుంది!*

**- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ**

# సాధన సఫలం కావాలంటే...

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సెప్టెంబరు 2012

వ్యవసాయం చేయాలంటే ముందు నేలను ఎంతో సంస్కరించాలి, అలానే ధ్యానం సరిగా అభ్యసించగల్గాలంటే మనస్సునెంతగానో సంస్కరించాలి. అన్నింటికంటే ముఖ్యం భావశుద్ధి. మనకు అజ్ఞానజనితాలైన ఎన్నో పొరపాటు భావాలుంటాయి - సృష్టి, మానవుడు, జీవిత తత్త్వాల గురించి, సరిగా వాటి తత్త్వాన్ని తెలుసుకుంటే గాని యీ అపోహలు తొలగవు. వాటినాధారం చేసుకొన్న భ్రాంతులు, వ్యామోహాలూ తొలగవు. మనస్సు వాటిచేత చంచలమవుతుంది. ఆ చాంచల్యం తొలగాలంటే



వ్యామోహాలు తొలగాలి. అందుకు వస్తువులయొక్క, జీవితం యొక్క తత్వం చక్కగా అర్థంగావాలి. అందుకే భక్తి, జ్ఞానం అష్టాంగయోగాలన్నింటిలో తత్వజ్ఞానం చాలా ఆవశ్యకం. భక్తిమార్గంలో మనకు గోచరించే యీ స్థూల ప్రపంచమొక్కటే వాస్తవంగాదని, మన ప్రాకృతిక జీవితం దు:ఖమయమని, దానినుండి విడివడగల్గితే ఆనంద మయమైన భగవత్స్వరూపం అనుభవమవుతుందనీ దృఢంగా తెలుసుకోవాలి. గుడ్డిగా నమ్మడంకాదు. ఎంత యత్నించినా మనకు స్పష్టంగా తెలియనిదానిని దృఢంగా నమ్మ సాధ్యంకాదు. శంక ఏదో ఒకమూల దాగియుండి మన యత్నాన్ని బలహీనపరచి భగ్నం చేస్తుంది. క్షుణ్ణంగా తెలిస్తే దృఢమైన నిశ్చయం గల్గి లక్ష్యంపై అపారమైన కోరిక కల్గుతుంది. స్థూలజగత్తులో గోచరించే వస్తువులు, జీవితానుభవాలే పరమసత్యంగాదని తెలియబట్టి వాటికి మనపై ప్రాబల్యం తగ్గుతుంది. జగత్తు పట్ల వ్యామోహం తగ్గి, ఆనందరూపుడైన పరమాత్మ పట్ల నిశ్చయాత్మకమైన ప్రీతి కల్గి కృతార్థత చేకూరే వరకూ మన యత్నాన్ని సడలనివ్వదు. జ్ఞానమార్గంలోగూడ శ్రవణ, మనన, నిధిధ్యాసలనందుకే చెప్పారు.

కొందరు అటు జ్ఞానంగాని, ఇటు భక్తిగాని అష్టాంగ యోగానికివసరంలేదని తలుస్తారు. కాని సరికాదు. యమ, నియమాలు, ఆసనప్రాణాయామాలు అష్టాంగయోగానికి ప్రధాన సాధనాలుగా చెప్పబడ్డాయి. యమనియమాలంటే యింద్రియమనోనిగ్రహం. మనస్సును నిగ్రహించకుండా యింద్రియాలను మాత్రమే నిగ్రహించడం మిధ్యాచారమని, నిష్ప్రయోజనమని

గీత స్పష్టంగా చెబుతోంది. కనుక మనస్సును మొదట జయించాలి. అంటే అజ్ఞానంచేత వస్తువుపట్ల, జీవితానుభవముపట్ల మనకు సామాన్యంగా వుండే భ్రాంతి తొలగాలి. అందుకు వస్తువుల, జీవితానుభవాల వాస్తవతత్త్వం అర్ధంగావాలి. అలా భ్రాంతులు తొలగిన యింద్రియాలు చాలావరకు వాటంతటవే అదుపులో వుంటాయి. దీనికి తోడు యోగసిద్ధి ఫలమైన శాశ్వతానందం పట్ల గల తీవ్రమైన ప్రీతి ధ్యేయంపైన మనసునిలిచేలాగ చేస్తుంది. ఈ విషయాన్నే గీత యిలా చెబుతుంది.

*"నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।*
*నచా భావయుత: శాన్తి: అశాన్తస్య కుతస్సుఖమ్॥"*

తా॥ ''మనస్సమాధానములేని అయుక్తునకు ఆత్మధనమను భావనలేదు(అనగా ఆత్మస్వరూప జ్ఞానమను బుద్ధిలేదు) భావనలేని వానికి శాన్తిలేదు. శాన్తిలేని వానికి సుఖములేదు''. అందుకే యాజ్ఞవల్క్యుడు ఆధ్యాత్మ విద్యను ఉపదేశింపదగినవారి గూర్చి యిలా అన్నాడు :

*"విద్యుక్తకర్మ సంయుక్తం కామ సంకల్పవర్జిత: ।*
*యస్య తస్యాధికారోస్మిన్ యోగీ నాన్యస్య కస్యచిత్॥ "*

తా॥ "ఋషులచేత విధించబడిన సత్కర్మలను శ్రద్ధగా ఆచరించేవాడు, కామ సంకల్పాలను విడిచినవాడు, యమనియమాలు కలవాడు, వ్యామోహములను విడిచినవాడు".

వాయు సంహితగూడ యిలా చెబుతోంది.

*"దృష్టే తధాను శ్రవికే విరక్తం విషయే!*
*యస్య తస్యాధికారోస్మిన్ యోగీ నాన్యస్య కస్యచిత్॥"*

తా॥ ఇహలోక పరలోక విషయములందు విరక్తిగల చిత్తముగలవాడికే యోగమునందు అధికారము కలదు. తదితరులకులేదు. అలానే వేదాంతోపదేశాలను వింటూ యోగాన్నభ్యసించాలని శాండిల్యోపనిషత్తు, శివయోగ దీపిక చెబుతాయి.

''హఠయోగ ప్రదీపిక'' గూడా యిలా చెబుతున్నది:

*"ఉత్సాహోత్సాహసాధ్ధైర్యా, తత్త్వజ్ఞానాశ్చనిశ్చయాత్।*
*జ్ఞానసంగ పరిత్యాగాత్ షడ్భిర్యోగ: ప్రసిధ్యతి॥*

తా॥ ఉత్సాహ, సాహస, ధైర్య, తత్త్వజ్ఞానములవలన, దానివలన గల్గిన నిశ్చయంవలన, యోగసిద్ధి కల్గుతుంది. 'నిశ్చయాత్' అన్న మాటకు బ్రహ్మానందస్వామి విషయములన్నియు మృగతృష్ణవలె అసత్యములని, బ్రహ్మమొక్కటే సత్యమని, తత్త్వజ్ఞానము, శాస్త్రము, గురువాక్యములందుగల విశ్వాసము అనీ వివరించారు.

అంటే సృష్టి తత్త్వము, జీవితానుభవతత్త్వమూ తెలుసుకోవడం సాధనామార్గాలన్నింటికీ పునాది. పునాది దృఢముగాలేని యిల్లు నిలువదుగదా! అందుకే "మతం ఎందుకు?", "విజ్ఞాన వీచికలు" ముముక్షువులందరూ తప్పక చదవాలి. రెండవ గ్రంధంలో ఆర్షతత్త్వజ్ఞానాన్ని ఆధునిక విజ్ఞానంతో సమన్వయించడం జరిగింది గనుక నేటివారికెంతో అది ఉపకరిస్తుంది. నేటి విజ్ఞాన శాస్త్రాలను విద్యాలయాలలో అధ్యయనంచేసిన, చేస్తున్నవారికి యిలా సమన్వయించి చెప్పకుంటే ఆధ్యాత్మికత, వైజ్ఞానిక యోచనకు నిలువజాలని భ్రమ అన్న శంక మిగిలిపోతుంది. కనుక యీనాటి ధర్మ ప్రచారకులందరూ గూడ పై గ్రంధాన్ని పరిశీలించనిదే వారి ప్రచారం నూనెరాసిన శరీరం మీద నీటి లాగా మనస్సులకు అంటదు.

ఇట్టి వైజ్ఞానిక - తాత్త్వికదృష్టిని వహించే, సృష్టిపట్ల అట్టి లోచూపుతోనే పుజాదికాలు నిర్వర్తించాలని తెల్పడానికే సామాన్యమైన షోడశోపచారపూజలో పురుషసూక్తాన్ని వినియోగిస్తాను. పురుషసూక్తమంతా సృష్టినంతటినీ యిట్టి వైజ్ఞానిక తాత్త్విక దృష్టితో చూపేదేనని పై గ్రంధాలు చదివాక "పురుషసూక్త రహస్యము" అన్న చిన్న గ్రంధం చదువుతే తెలుస్తుంది. ఇవి చదివి సరియైన అవగాహన పొందనిదే సాధన నిర్దుష్టం కాజాలదు.

పై గ్రంధాలు చదవడం శ్రమ అని చాలామంది వాటినుపేక్షిస్తున్నారంటే అర్ధం నేటి సాధకులు, ముముక్షువులు, ధర్మ ప్రచారకులలో ఎక్కువమంది నిజమైన సాధకులు మొ॥వారు కారన్నమాట. సాధ్యంమీద ప్రీతి యున్నప్పుడు ఎంత శ్రమించైనా మనిషి సాధనాలను సేకరిస్తాడు. డబ్బు, సంసారలంపటమూ గలవారు వాటి కోసమెంతైనా ఎలా శ్రమించి వాటిని నెరవేర్చుకునే మార్గాలను తెలుసుకుంటున్నారో చూడండి, అటువంటప్పుడు సర్వదు:ఖాలకూ అతీతమైన శాశ్వతానందాన్ని పొందగోరేవారు రెండు మూడు ముఖ్యమైన

గ్రంధాలను చదవడానికి బాధపడతారా?

చివరికి ఒక్కమాట, సద్గురువు నాశ్రయించినవాడికి నిజంగా, ''శ్రీ సాయి ప్రబోధామృతము''లో వివరించినట్లు ఆశ్రయిస్తే-అష్టాంగయోగాదులు వాటికై అవే సిద్ధిస్తాయని శాస్త్రవాక్యం.

రాజయోగమనే గ్రంధమిలా చెబుతోంది :

*"వేదాన్తతర్కోక్తిభిరాహమైశ్చ, నానావిధై:*
*శాస్త్రకదంబకైశ్చ।*
*ధ్యానాదిభి: సత్కరణైర్నగమ్యశ్చిన్తామణిహ్యేక గురుం వినా॥*

తా॥ చింతామణియైన గురువొక్కడు లేక, తక్కిన వేదాంత తర్క, వచనములచేతను, నానావిధ శాస్త్రసమూహముల చేతను, ధ్యానాది సత్కర్మములచేతను యోగము తెలియదగినదిగాదు. సురేశ్వరాచార్యుడు "గురు ప్రసాదమువలన అష్టాంగ యోగసహితమును పొందుచున్నాన''ని చెప్పాడు. ''ఆచార్యవాన్ పురుషోవేద'' అని ఛాన్దోగ్యము-గురువును ఆశ్రయించినవాడే పురుషుని (దైవాన్ని) చేరుకుంటాడని చెప్పింది.

ఇలా అనడానికి "హఠయోగప్రదీపిక"లోని యమనియమాలనుదహరిస్తూ శ్రీ బ్రహ్మానంద సరస్వతీ వ్రాసిన యీ వాక్యాలు ప్రమాణం. ''దేహేంద్రియముల వలన కల్గు వైరాగ్యము యమము. పరతత్త్వమునందెడదెగక కల్గు అభిలాష నియమం. సర్వవస్తువులయందు ఉదాసీనత ఉత్తమమైన ఆసనం. సకల జగత్తూ మిధ్యగా దోచుట ప్రాణాయామము. చిత్తంయొక్క అంతర్ముఖత్వము ప్రత్యాహారము, చిత్తం యొక్క నిశ్చయస్థితి ధారణ. చిన్మాత్రమే నేనని చింతించుట ధ్యానము. ధ్యానానికతీతమైన స్థితిలో ధ్యానాన్ని మరవడం సమాధి".

ఇలాటి నిశ్చయాన్ని 'విజ్ఞాన వీచికలు', 'మతం ఎందుకు?', 'శ్రీ సాయినాధ ప్రబోధామృతము' ఎంతో చక్కగా చేకూరుస్తాయని కొంచెం జాగ్రత్తగా ఆ గ్రంధాలను పరిశీలిస్తే ఎవరికైనా తెలుస్తుంది.

(పరిప్రశ్న గ్రంధ సౌజన్యంతో)

---




# పరిప్రశ్న

## భక్తుల ఆధ్యాత్మిక సంశయాలకు ఆచార్యుల సమాధానాలు



# అవధూత
# శ్రీ చీరాల స్వామి

సెప్టెంబరు 2012

శ్రీ చీరాల స్వామివారు 1941 నుండి తెలుసు. 41, 42 ప్రాంతాలలో విజయవాడలో వుండేవారు. అప్పుడు స్వామికి బోదకాలులేదు. ఎక్కడికైనా తీసుకెళితే పసిపిల్లవానిలా వచ్చేవారు. విద్యాధరపురంలో ఒకసారి స్వామి కళ్ళు తెరుచుకొనే నిద్రపోతున్నారు. తట్టి లేపితే "ఆ" అన్నారు. మరలా 65, 66లలో చీరాలలో కన్పించారు. కాలు బోద వచ్చింది. తాను చిత్తూరు జిల్లావాసిని, కడపలో వున్నానని, రమణాశ్రమంలో గడపానని, రమణానంద అని పిలిస్తే చాలా సంతోషమనీ, అనే వారు చీరాలస్వామి. మనం చీరాలలో వుండాలయ్యా అనేవారు.

*(వారణాశి సాంబశివరావు)*

చీరాల బోదకాలు స్వామిని చూచావా భరద్వాజ. ఆయన చాలా గొప్పవారయ్యో; ఒకసారి రాత్రి ఆయన శరీరం ఖండఖండాలుగా పడివుండటం, స్వర్ణగేటువద్ద చూచానయ్యా. మర్నాడు రోడ్డుమీద యధావిధిగా తిరుగుతూ కన్పించారు. మనదేవూరు స్వామీ అని అడిగాను. మనందరిది ఒక ఊరేలే అన్నారు.

*(శ్రీ రంగన్న బాబుగారు)*

చీరాల స్వామిని ఎవరైనా పేరడిగితే, త్రివేణిస్వామి, షణ్ముఖస్వామి, నరసింహస్వామి, రామస్వామి అని చెప్పేవారు. *తమ సమాధి కడపజిల్లాలోని మూలపల్లి వద్ద గొల్లపల్లిలో వున్నదని అనేవారు. అదివిన్న మరియమ్మ అదెల్లాసాధ్యం స్వామి అంటే, అది అంతే. ఈ విషయం ఎర్రస్వామికి (భరద్వాజ గారికి) తప్ప ఎవరికీ చెప్పవద్దు అనేవారు. మాష్టారుగారి ఆదేశం ప్రకారం, బి. రామకృష్ణారెడ్డి విచారించి నిజంగా అలాంటి గ్రామము వున్నదని అక్కడ చాలాకాలం క్రితం జీవ సమాధి అయిన మహాత్ముని సమాధి వుందని, మంగళ శనివారాలలో పూజలు జరుగుతున్నాయని చెప్పారు.*

*(సాయిబాబా 1-9-83)*

ఒకసారి మాస్టరుగారు ఉదయం చీరాల స్వామిని దర్శించారు. శ్రీ స్వామివారు మాస్టరుగారికి ఒక వస్త్రం మూటగట్టి యిచ్చారు. మాస్టరుగారు తర్వాత డాక్టరుగారిని, వారి మిత్రులను కలిసినప్పుడు స్వామి అనుగ్రహించారు. నాకు దీక్షా వస్త్రం యిచ్చారు. ఇక నేను సన్యసించవచ్చు అన్నారు. మిత్రులు "ఏదీ చుద్దాము!" అని మూట విప్పగానే "ఒక నైలాను చీర వుంది". ఓహో ఇదేనా దీక్షావస్త్రం అని మిత్రులు నవ్వారు. కాలాంతరంలో శ్రీ సాయి, పాకలపాటి గురువుగారి ఆదేశం మేరకు, మాస్టరుగారు గృహస్థులయ్యారు. ("స్వామి నైలాన్ చీర యివ్వటంలోని ఆంతర్యం యిది," అని అనేవారు శ్రీ మాస్టరుగారు.)

*(మాస్టర్ సత్సంగం నుండి)*

శ్రీ స్వామి వారికి బోదకాలు. చీరాలలోని తెల్ల గాంధిబొమ్మ వద్దనున్న కృష్ణమూర్తి హోటల్ పంచలో కూర్చునివున్నారు. శరీరం గుడ్డలు, దుమ్ము కొట్టుకొని వున్నవి. జుట్టు జడలు కట్టి వున్నది. వయస్సు సుమారు 55 సం॥లు వుంటుంది. వారి చూపు నిర్వికారంగావుంది. తన చేతివేళ్ళ కణువులను రుద్దుకుంటూ పళ్ళు బిగిస్తున్నారు. వికృతంగా నోరు తెరచి ఆవలించారు. నోట్లో కూడా కొన్ని

పళ్ళు కదులుతూ, కొన్నివూడి కన్పించాయి. ఇతరులు తనను అసహ్యంగా చూస్తున్నారన్న తలంపేలేదు. ఏదో నిర్లిప్తత, ఆధ్యాత్మిక సంపన్నుల ముఖంలోవుండే బ్రహ్మతేజస్సేలేదు. ఆయనకు మొక్కితే అందరూ నన్ను చూచి ఏమనుకుంటారోననే ఆలోచన వచ్చింది. అసలు ఈయన మహాత్ముడా! పిచ్చివాడా! అనిపించింది. (పై సన్నివేశము శ్రీ మాస్టరుగారు, చీరాల స్వామి, ప్రథమ సమాగమమప్పుడు, మాస్టరుగారిలో కలిగిన భావపరంపర). అయితే 10, 15 నిమిషాలలో నా మానసికస్థితి మారింది. మనస్సు ప్రశాంతమయింది. నేనెవరినన్న విషయం గుర్తులేదు. నాకు జ్వరం అన్న సంగతి, పక్క మిత్రుని సంగతి గుర్తులేదు. మనస్సు ఒక అనిర్వచనీయమైన ఆనందానుభుతిలో నిశ్చలమైంది. నమస్కారం స్వామి అన్నాను. కాని అదే నిర్లిప్తత! ఇంతలో శ్రీ సాయి చెప్పినది, తనకు మహాత్ములకు బేధంలేదని, ఈ రూపంలో ఆయనే వున్నారుగదా! నేను వందసార్లు నామం స్మరించేలోపల ఈయన ప్రసాదమిస్తేనరి, లేకపోతే ఈయనను దర్శించవలసిన పనిలేదు, అని మనస్సులో నామం జపించటము మొదలు పెట్టాను (ఇది మాస్టరుగారులో స్వామివద్ద కల్గిన సంకల్పం). నామం జపించటం 30 సార్లు పూర్తయింది. ఇంతలో స్వామి చార్‌మినార్ సిగరెట్టు, అగ్గిపెట్టె యిచ్చి "సిగరెట్టు కాల్చుకో స్వామి" అన్నారు. నా కలవాటులేదు అని చెప్దామనుకున్నాను. కాని మహాత్ముని ప్రసాదం తీసుకోవాలని అన్పించింది. కాల్చాను, మరలా కాల్పించారు. ఇంతలో హోటల్ సర్వర్‌తో ఈ స్వామికి ఇడ్లి, కారప్పొడి, చెట్ని ఈవయ్యా అన్నారు. టైఫాయిడ్ జ్వరం, అయినా మహాత్ముని ప్రసాదం అని తిన్నాను. చిత్రం! నాటినుండి నాకు జ్వరమే లేదు!

*(ఇది స్వామి సన్నిధిలో మాస్టరుగారికి కలిగిన అనుభవం)*

స్వామి సాయంత్రము అయ్యేసరికి ఎవ్వరినీ దగ్గరకు రానిచ్చేవారు గాదు. చేతికణువులను బలంగా రుద్దుకునేవారు. బహిర్దేశానికి వెళ్ళినా, ఆహారం స్వీకరించినా దేహక్షాళనేలేదు. కానీ వారి వద్ద మల్లెలవాసన గుబాళించేది. అందరూ స్వామిని "వాసనస్వామి" అనేవారు. ఎక్కడంటే అక్కడ కూర్చొనేవారు. కండ్లుపుసులుకట్టి వుండేవి. తనలోతాను పకపకా నవ్వుకొనేవారు. ఎవరైనా ఏదైనాయిస్తే తీసుకునేవారు. స్వామి సిగిరెట్టు కాల్చే విధానం వింతగా వుండేది. ఒక్కో సిగరెట్టు మూడుదమ్ములలో కాల్చి వరసగా కాల్చి సిగరెట్లు లైనుగా పెట్టేవారు. సాంబ్రాణికడ్డీలు వెలిగించి చేతితో పట్టుకొని కూర్చునేవారు. స్వామి సన్నిధిలో చిత్తము చాలా ప్రశాంతముగా వుండేది. ధ్యానస్థితి అనూహ్యంగా స్థిమితమయ్యేది. ఆయన దగ్గరకు వెళ్తుంటే నా తండ్రి వద్దకు వెళుతున్నట్టుగా వుండేది. అఖిల జగత్తు ఒక ఎత్తు. ఆయన ఒక ఎత్తు. నేను వెళ్ళడం ఎప్పుడైనా వీలుపడకపోతే, "ఆ ఎర్రస్వామి రాలేదా అయ్యా" అని అడిగేవారుట. చిత్రంగా కొంత సేపటిలో నేను వారి సన్నిధిలో వుండేవాడిని.

*(ఇది మాస్టరుగారు వారి సన్నిధి ప్రభావాన్ని గూర్చి చెప్పిన విషయాలు)*

1-9-73వ తేది ఉదయం మాస్టరుగారు కాలేజి క్లాసురూములోకి ప్రవేశించారు. చిత్రంగా డయాస్‌మీద చీరాల స్వామి భౌతికంగా నిల్చునివున్నారు. వారి ముఖ భావము తనకోసము ఎదురు చూస్తున్నట్లుగా కన్పించింది. మాస్టరుగారు సంభ్రమాశ్చర్యాలకి లోనయి కాలుజారి క్రింద పడిపోయినారు. తిరిగిలేచేసరికి ఆ దృశ్యంతొలగిపోయింది. అది స్వామి తన్ను రమ్మనమని ఆదేశిస్తున్నట్టుగా భావించి ఆ రాత్రికిరాత్రే స్వామి పదసన్నిధికి చేరారు. అప్పటికే స్వామి ఎగశ్వాసతోవున్నారు. మాస్టరుగారు స్వామిచెంతనే వుండిపోయారు. 3-9-73 తెల్లవారుజాము 4 గంటలకు శ్రీ స్వామివారు భౌతికదేహము విడిచి, ఆత్మ స్వరూపులయ్యారు. స్వామి శరీరాన్ని పద్మాసనంలో కూర్చోబెట్టి వూరేగించి, స్వర్ణగేటు సమీపంలో భక్తులందరితోకలిసి మాస్టరుగారు స్వామివారి దేహాన్ని సమాధిచేశారు. ఆయనెవరో? తల్లిదండ్రులు ఎవరో? జాతి, కులమతాలేవో? తెలియని పరతత్వంగా, చీరాలస్వామిగా ఆర్తజనుల హృదయాలలో అభీష్టాలు నెరవేర్చే అవధూతగా నిత్య సత్యుడుగా నిలచిపోయినారు.

*(1-9-83 సాయిబాబా, దత్తాత్రేయ సావనీర్, మాస్టరుగారి సత్సంగం నుండి).*

# జ్ఞానేశ్వర్ మహారాజ్ చరిత్ర

శ్రీమతి వేదవతి

సెప్టెంబరు 2012

## శ్రీపాదస్వామి అలకావతికి రావడం

సిద్ధోపంతు తన కుమార్తె దురదృష్టానికి చాలా బాధపడి శ్రీ పాండురంగని నిరంతరము ప్రార్థించసాగాడు. అతని భార్య తన కుమార్తె, అల్లుడూ కలుసుకునేలా చేయమని రుక్మిణీ దేవిని ప్రార్థిస్తూ వుండేది. రుక్మాబాయి కూడా తండ్రి ఆజ్ఞననుసరించి గౌరీ పూజ చేయసాగింది. ఆమె వైరాగ్యంతో తన జుట్టు దువ్వుకోవడం మానివేసింది. అందువల్ల ఆమె జుట్టు జడలుకట్టింది. నిరంతర ప్రార్థన వలన ఆమె ముఖము దివ్య తేజస్సుతో వెలిగిపోసాగింది. ఆమెను చూసిన వారందరూ ఆమె పరాశక్తి అని భావించి నమస్కరించసాగారు. అలా ఒక సంవత్సరకాలము గడిచిపోయింది.

వారి ప్రార్థనాఫలితంగా శ్రీపాదస్వామి మనస్సు సంచార సమాధిలో వుండాలని ఉవ్విళ్ళూరసాగింది. సంచార సమాధి అంటే సమాధి స్థితిలో కొనసాగుతూనే దేశసంచారం చేసే స్థితి అన్నమాట. స్వామి కాశీనుండి బయలుదేరి అన్ని ప్రదేశాలలలోనూ సంచరిస్తూ చివరకు అలకావతి చేరారు. అక్కడ చక్రతీర్థం దగ్గర ఒక అశ్వద్ధ వృక్షపు నీడలో ధ్యానంలో కూర్చుని వున్నారు.

రుక్మాబాయి ఎప్పటిలాగే చక్రతీర్థంలో స్నానమాచరించి అశ్వద్ధవృక్షానికి ప్రదక్షిణ చేయడానికి అచటికి వచ్చింది. ఆ చెట్టు క్రింద ధ్యాననిమగ్నుడైవున్న శ్రీపాదస్వామిని చూసి ఆయన సామాన్యుడు కాడని వెంటనే గ్రహించింది. ఆమె స్వామికి నమస్కరించి వెంటనే ఇంటికి వెళ్ళి ఆయనకు భోజనము తీసుకుని వచ్చింది. ఆమె ఆయనకు నమస్కరించి, "స్వామి! మీరు చాలా అలసి పోయినట్లున్నారు. దయచేసి నేను సమర్పించే భిక్షను స్వీకరించి విశ్రాంతి తీసుకోండి" అని ప్రార్థించింది. శ్రీపాదస్వామి ఆమె మాటలు విని కళ్ళు తెరచి ఆమె ముఖాన్ని చూసి, ఆమె వినయ విధేయతలకు, భక్తికీ ఎంతో సంతోషించారు. ఆయన ఆమెను ఆశీర్వదించి, "అమ్మా! నీవు సౌభాగ్యవతివై ముగ్గురు కుమారులను, ఒక కుమార్తెను పొందుతావు" అన్నారు. ఆ మాటలు విని రుక్మాబాయి చిరునవ్వు నవ్వి మౌనంగా వున్నది. అది చూసి శ్రీపాదస్వామి, "అమ్మా, నీవెందుకు చిరునవ్వు నవ్వావు? నా ఆశీర్వచనము ఫలించదేమోనని అనుమానిస్తున్నావా? అలా ఎన్నటికీ జరుగదు. నా ఆశీర్వచనము ఎన్నటికీ వ్యర్థం కాదు" అని పలికారు. అప్పుడామె, "స్వామీ! చవిటి నేలలో నాటిన విత్తనము, అర్హత లేనివాని కిచ్చిన దానము, చెవిటివాడి ఎదుట పాడిన సంగీతము, నిరుపయోగమైనట్లు భర్త లేకుండా పిల్లలు పుట్టరు కదా! మీ ఆశీర్వచనము ఎలా ఫలిస్తుంది! అనే విచారం చేత నవ్వుతున్నాను" అన్నది. అది విని శ్రీపాదస్వామి, "అమ్మా నీ భర్తకు ఏమైంది?" అని అడిగాడు. రుక్మాబాయి, "స్వామీ! నా భర్త నన్ను వదిలివేసి సంవత్సరం గడిచిపోయింది. సన్యాసము తీసుకుని కాశీలో వున్నాడని ఈ మధ్యనే తెలిసింది. సంసారంలో వున్నప్పుడు కూడా అతడు నన్ను తాకనే లేదు. ఇక ముందు అతడు నన్నెలా ఏలుకుంటాడు?

అందుకని నాకు మీ వరం ఫలించడమెలా అని సందేహం కలుగుతున్నది. భగవంతుని సంకల్పం ఎలా వున్నదో తెలియడం లేదు'' అని జరిగిన వృత్తాంతమంతా వివరించి చెప్పి దు:ఖించింది. అది వినిన శ్రీపాదస్వామికి అనుమానం కలిగి ఆమెను భర్త పేరు చెప్పమని అడిగాడు. ఆమె తన భర్త పేరును నేలమీద వ్రాసి చూపించింది. వెంటనే అతడు ఆమె భర్త తాను తెలియక సన్యాసమిచ్చిన చైతన్యస్వామి అయిన విఠోబా అని గుర్తించాడు. వెంటనే ఆయన రుక్మాబాయితో, ''నీ భర్త గృహస్థ, పైగా సంతానహీనుడు. సంతానము కలుగక ముందే సన్యసించినవాడు, అటువంటి వాడికి సన్యాసమిచ్చినవాడు యిద్దరికీ నరకము ప్రాప్తిస్తుంది. ఇంతటి అపరాధము నా వలన జరిగిపోయింది. దీనిని నేనే క్షాళన చేసుకుంటాను. వెంటనే నీ తల్లిదండ్రులను నా వద్దకు తీసుకుని రా!" అని ఆజ్ఞాపించారు. వారంతా ఆయనను దర్శించి నమస్కరించారు. వారందరినీ తీసుకుని ఆయన కాశీకి బయలుదేరారు.

## విఠోబా గృహస్థాశ్రమము స్వీకరించడము

వారందరూ చాలారోజులు ప్రయాణం చేసి కాశీ నగరానికి చేరారు. వారంతా శ్రీపాదస్వామి నాకు ఏ శిక్షనైనా విధించవచ్చు. నీ ఆజ్ఞానుసారం నడుచుకుంటాను" అని కన్నీటితో ప్రార్థించాడు. శ్రీపాదస్వామి వాత్సల్యంతో, "నాయనా! భయపడకు. నీవు చేసిన తప్పు ఒప్పుకున్నావు. భగవంతుని ఆదేశానుసారమే నీవు ఈమెను వివాహమాడావు కదా! భగవంతుని ఆజ్ఞను ఉల్లంఘించి పతివ్రత అయిన నీ భార్యను విడిచి సన్యసించడం ధర్మం కాదు. నీ అధర్మంలో నన్ను కూడా భాగస్వామిని చేశావు. నేనే నా తప్పును సవరిస్తాను'' అని పలికి మఠంలోనేవున్న రుక్మాబాయిని పిలిచాడు. రుక్మాబాయి పరుగున వచ్చి భర్త పాదాలపై బడి ఏడ్వసాగింది. విఠోబా నిశ్చేష్టుడై మౌనం వహించాడు.

శ్రీపాదస్వామి చిరునవ్వు నవ్వి, "నాయనా, ఏమి ఆలోచిస్తున్నావు? మహాపతివ్రత అయిన భార్యను వదిలి సన్యాసివేషం వేసికోవడం వల్ల ప్రయోజనమేముంటుంది? ఈమె మనస్సు ఏమాత్రం బాధపడినా నీ ఉపాసన ఫలించదుకదా! వేయిమంది సన్యాసులుకూడా ఒక్క గృహస్థు అయిన జ్ఞానితో సమానం కాలేరు. ఇంతటి పతివ్రత ద్వారా కలిగిన సంతానం వల్ల సులభంగా మోక్షం సిద్ధిస్తుంది. ఈమె బాధపడితే నీవు ఆధ్యాత్మికంగా పురోగమించలేవు సరికదా నీ తపస్సు అంతా వ్యర్థమైపోతుంది. సృష్టి స్థితిలయ కారకులైన త్రిమూర్తులు కూడా మహాపతివ్రత అయిన అనసూయదేవి మహాత్మ్యానికి

*మహాపతివ్రత అయిన భార్యను వదిలి సన్యాసివేషం వేసికోవడం వల్ల ప్రయోజనమేముంటుంది? ఈమె మనస్సు ఏమాత్రం బాధపడినా నీ ఉపాసన ఫలించదుకదా! వేయిమంది సన్యాసులుకూడా ఒక్క గృహస్థు అయిన జ్ఞానితో సమానం కాలేరు. ఇంతటి పతివ్రత ద్వారా కలిగిన సంతానం వల్ల సులభంగా మోక్షం సిద్ధిస్తుంది.*

ఆశ్రమానికి చేరగానే స్వామి రుక్మాబాయిని, సిద్ధోపంతును మఠంలో దాచి వెంటనే విఠోబాను పిలిపించి, "ఓరీ! చైతన్యా! నీవు బ్రహ్మచారివా, గృహస్థువా? నిజం చెప్పు" అని గద్దించారు. విఠోబా గజగజ వణుకుచూ తన తప్పు ఒప్పుకుని క్షమించమని ఆయన పాదాలమీద పడ్డాడు. విఠోబా, "స్వామి! నా మనస్సనేధాన్ని మీకెప్పుడో సమర్పించాను. కనుక నీవు ఆశ్చర్యపడి ఆమెకే సంతానంగా జన్మించారు కదా! పతివ్రతల మనస్సుకు బాధకలిగిస్తే నరకం ప్రాప్తిస్తుంది. నీవు శ్రీ పాండురంగని అనుగ్రహంతో జన్మించినవాడివి. గురువే రక్షకుడని ఆశ్రయించినవాడివి. ధర్మము, ఆధ్యాత్మికత తెలిసినవాడివి. నీవు భార్యను విడిచిపెట్టడం సరికాదు. నామాటవిని ఈమెను భార్యగా స్వీకరించి గృహస్థు

ధర్మాన్ని నిర్వర్తించు. నాకు వచ్చిన అపవాదును తొలగించు. తద్వారా కృతార్థుడివై బ్రహ్మానందాన్ని అనుభవించు. మనస్సులో వైరాగ్యం కలిగి వుండడం ముఖ్యం. అంతేకాని బాహ్యంగా వైరాగ్యం కలిగివుండడం వల్ల లాభం లేదు. కనుక నా ఆజ్ఞను పాటించు. నీకెంతో శ్రేయస్సు కలుగుతుంది" అని ఆజ్ఞాపించారు. తరువాత అతనిని సమాధానపరచి, జడలను, కాషాయవస్త్రాలను తొలగింపజేసి తగిన వస్త్రాలను కట్టించాడు.

సిద్ధోపంతు స్వామి పాదాలకు కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించి, "స్వామి! మీ దయవలన నేను కృతార్థుడినయ్యాను. నా పూర్వీకులందరూ తరించారు" అన్నాడు. రుక్మాబాయి స్వామి ఆజ్ఞానుసారం సౌభాగ్యవతిలాగా చక్కగా అలంకరించుకుని వచ్చి భక్తి శ్రద్ధలతో భర్తకు, స్వామికి, తండ్రికి నమస్కరించింది. శ్రీ పాద స్వామి ఆమెకు బ్రహ్మోపదేశం చేసి దంపతులిద్దరికీ గృహస్థ ధర్మాలను బోధించి స్వదేశానికి వెళ్ళడానికి అనుమతినిచ్చారు.

విఠోబా గురువును విడిచి వెళ్ళలేక, "స్వామి! నన్ను మళ్ళీ సంసారసాగరంలో పడేస్తున్నారు. నేను చేసిన తప్పుకు యింతటి శిక్ష విధించారు కాబోలు! నన్ను రక్షించండి!" అని వేడుకున్నాడు. స్వామి, "నాయనా! బాధపడకు. నీ మీద వాత్సల్యంతో నా తపస్సునంతా నీకు ధారపోశాను. ఈ నిర్ణయం వల్ల నీ పూర్వీకులందరూ సద్గతి పొందారు. నీకు త్రిమూర్తుల అంశతో ముగ్గురు కుమారులు, పరాశక్తి అంశతో ఒక కుమార్తె జన్మిస్తారు. వారివల్ల నీకు అంతులేని సుఖసంతోషాలు కలుగుతాయి. నీ వంటి ఉత్తముడు శిష్యుడిగా లభించడం నా అదృష్టం. నీవు నా స్వదేశానికి వెళ్ళి నీ భార్యతో సుఖించు. ఇంతలో నేను కూడా సంచార సమాధిని పూర్తి చేసుకుని నీ వద్దకు వస్తాను" అని వాగ్దానం చేశారు.

విఠోబా స్వామికి నమస్కరించి, "స్వామీ! చంచలమైన మనస్సు వలన సంసారము అనే లంపటము ఒకవేళ సమాధి నిష్ఠను చెడగొడితే మాకు పరమాత్మపై విశ్వాసము సడలుతుంది. అప్పుడు అజ్ఞానాంధకారంలో చిక్కి ఎటువెళ్ళాలో తెలియని అయోమయస్థితిలో మేము పడవలసివస్తుంది కదా! అప్పుడు మా వంటివారు ఏమి చేయాలి?" అని అడిగాడు. స్వామి చిరునవ్వుతో, "నాయనా! ఆ విషయమై నీవు సందేహించనవసరం లేదు. నీ వంటి ఉత్తముడికి ఎటువంటి భంగమూ కలుగదు. సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్మను ఎల్లప్పుడూ హృదయంలో నిలుపుకో. ఆయనను నిరంతరము ప్రవహించే తైలధారలాగా భావించి అవిచ్ఛిన్నంగా నిశ్చలమైన ధ్యానంలో ఉపాసించు. ఆ పరబ్రహ్మము అఖండము, అవ్యయము, వాక్కుకు మనస్సుకు గోచరించనిది, ఆనందస్వరూపము, అద్వితీయము, సుగుణము, నిర్గుణము, అణుస్వరూపమేగాక మహావిశ్వరూపం కూడ. అంతేకాదు, ఆ పరబ్రహ్మమే ఎంతో మహిమ కలిగినది. అది స్వయంగా ప్రకాశిస్తూవుంటుంది. అంతటా వ్యాపించివుంటుంది. అన్నీ తానే అయివుంటుంది. మహావాక్యాలన్నింటికీ ఆ పరబ్రహ్మమే అర్థము, మూలము కూడా. అదే అనంతమైన బ్రహ్మానందాన్ని ప్రసాదిస్తుంది. పరమేశ్వరుడు సనకసనందనాదులకు, జనకమహారాజు, శుకుడు, నారదుడు మొ॥న వారికి, విష్ణువు శివుడు, ప్రహ్లాదుడు మొ॥న వారికి, బ్రహ్మ భృగుమహర్షి, పులస్త్యాదులకు, వశిష్టుడు శ్రీరామునికి ఉపదేశించిన విషయాన్ని నిరంతరమూ స్మరించు. జ్ఞానమే మౌనమని, మౌనమే జ్ఞానమని తెలుసుకో. సచ్చిదానందమనబడే ఆనంద సామ్రాజ్యాన్ని ప్రసాదించే మహావాక్యాల అర్థాన్ని నిరంతరము మననము చేస్తూవుండు. అప్పుడు భవబంధాలు ఎప్పుడూ తగులుకోవు" అని వివరించారు. ఆ తరువాత వారిని స్వదేశానికి సాగనంపి సంచారసమాధిని పూర్తి చేయడానికి సంతోషంగా బయలుదేరాడు.

విఠోబా తన భార్య అయిన రుక్మాబాయి, మామ అయిన సిద్ధోపంతుతో కూడా కలిసి పుణ్యక్షేత్రాలన్నీ దర్శిస్తూ, పుణ్యతీర్థాలలో స్నానం చేస్తూ, సత్పురుషులను సేవిస్తూ కొద్దిరోజులకు అలకావతి చేరాడు. రుక్మాబాయి గురూపదేశాన్ని స్మరిస్తూ భర్తను భక్తితో సేవిస్తూ వుండేది.

## విఠోబా రుక్మాబాయిని తీసుకుని అడవికి వెళ్ళడం

సిద్ధోపంతు తమ ఊరికి చేరి తన కుమార్తె, అల్లుడు కలుసుకొనిన సందర్భంగా బ్రాహ్మణ సంతర్పణ చేయాలని సంకల్పించాడు. ఒక శుభదినాన

ముహూర్తం నిర్ణయించి ఊరిలోవున్న వైదిక బ్రాహ్మణులను భోజనానికి ఆహ్వానించాడు. విఠోబా సన్యాసమునుండి గృహస్థయిన విషయం వారికి నచ్చలేదు. కనుక వారు అతనితో, "అయ్యా! నీ అల్లుడు సన్యాసమునుండి గృహస్థాశ్రమము స్వీకరించడం శాస్త్ర విరుద్ధము. అమృతంలో స్నానం చేసి మద్యము సేవించినట్లు, వేదాంతశాస్త్రాన్ని నేర్చుకొని కామ శాస్త్రాన్ని అభ్యసించినట్లు, బ్రాహ్మణత్వము పొంది చండాలుడైనట్లు, ఉత్తమోత్తమమైన సన్యాసాన్ని వదిలి నీ అల్లుడు సంసారి అయ్యాడు. అతనిని సమర్థించి మీరు కూడా అపవిత్రులయ్యారు. ఈ ఆచారము, శ్రుతులకు, సతులకు విరుద్ధమైనది. కనుక మేమిప్పుడు మీ ఇంట్లో భోజనం చేయకూడదు. మీ కూతురు, అల్లుళ్లను మీ ఇంటినుంచి పంపివేయి. ఆ తరువాత నీవు ప్రాయశ్చిత్తము చేసుకో, ఆ తరువాతనే మేము మీ ఇంట్లో భోజనం చేస్తాము. లేకపోతే నిన్ను, నీ కుటుంబాన్ని కూడా వెలివేయవలసి వస్తుంది. ఆలోచించుకో!" అని హెచ్చరించారు.

సిద్ధోపంతు వినయంతో "అయ్యలారా! నా అల్లుడు విషయవాంఛలవలన తిరిగి గృహస్థాశ్రమం స్వీకరించలేదు. అతడు తన గురువు ఆజ్ఞానుసారం నడుచుకొన్నాడు. కనుక అతనికి ఏ దోషమూ అంటదు. మీకు తెలియని ధర్మమేమున్నది! కనుక దయతో కొంచెం ఆలోచించండి" అని ప్రార్థించాడు. వారు అతనిపై కోపించి, "బాగున్నది. మీరు భ్రష్టులైనది గాక మమ్ము కూడా భ్రష్టులను చేసేందుకు ప్రయత్నిస్తున్నారే! ఇక ఎప్పటికీ మాతో ఈ విషయం చర్చించకు" అని విఠోబాను, అతని కుటుంబాన్ని వెలివేసినట్లు తీర్మానించి కోపంగా వెళ్ళిపోయారు.

విఠోబా ఈ విషయం విని కొంచెం కూడా చలించలేదు. ప్రళయకాలంలో వచ్చే భయంకరంగా కురిసే వర్షానికి కూడా చలించని పర్వతం లాగా అతడు ధైర్యంగా వున్నాడు. అతడు తన మామగారైన సిద్ధోపంతును చూసి, "నా వలన మీకు ఇన్ని ఇబ్బందులు కలుగుతున్నాయి. ఒక్క నిమిషమైనా ఈ ఊరిలో వుండడం నాకు ఇష్టం లేదు. దయచేసి అనుమతిస్తే నేను అడవులకు వెళ్ళి జీవిస్తాను. నేను లేకపోతే మీకు ఎటువంటి ఇబ్బందులూ కలుగవు" అన్నాడు. రుక్మాబాయి కూడా తన తల్లిదండ్రులతో, "మా వలన మీకు ఎన్నో కష్టాలు కలుగుతాయి. మేము ఈ ఊరికి దగ్గరలోవున్న అడవిలోనే జీవిస్తూ అప్పుడప్పుడూ వచ్చి మిమ్ములను దర్శించుకుంటాము. దయచేసి మేము అడవికి వెళ్ళడానికి అనుమతి యివ్వవలసినది" అని ప్రార్థించింది. వారు ఆమె ప్రార్థనను మన్నించారు. విఠోబా, రుక్మాబాయి ఆ ఊరికి పొలిమేరల్లో వున్న అడవికి చేరి అక్కడ ఒక కొండ గుహలో నివసిస్తూ వుండేవారు. విఠోబా అక్కడ నిశ్చింతగా నిరంతరమూ ధ్యాననిమగ్నుడై బ్రహ్మానందమనుభవిస్తూ వుండేవాడు. రుక్మాబాయి అప్పుడప్పుడూ అలకావతికి వచ్చి తన తల్లిదండ్రులను దర్శించి తమకు కావలసిన పదార్థాలను తీసుకుని వెళుతూ వుండేది.

*పరమేశ్వరుడు సనకసనందనాదులకు, జనకమహారాజు, శుకుడు, నారదుడు మొ॥న వారికి, విష్ణువు శివుడు, ప్రహ్లాదుడు మొ॥న వారికి, బ్రహ్మ, భృగుమహర్షి, పులస్త్యాదులకు, వశిష్టుడు శ్రీరామునికి ఉపదేశించిన విషయాన్ని నిరంతరమూ స్మరించు. జ్ఞానమే మౌనమని, మౌనమే జ్ఞానమని తెలుసుకో. సచ్చిదానందమనబడే ఆనంద సామ్రాజ్యాన్ని ప్రసాదించే మహావాక్యాల అర్థాన్ని నిరంతరము మననము చేస్తూవుండు. అప్పుడు భవబంధాలు ఎప్పుడూ తగులుకోవు"*



# శ్రీ దత్త లీలామృతము

*ఆగస్టు సంచిక తరువాయి*

**శ్రీమతి శ్రీదేవి**

సెప్టెంబరు 2012

కనుక ఎల్లప్పడూ సజ్జనసాంగత్యమెంతో ఆవశ్యకం. మనుష్యులు ఎటువంటి సాంగత్యములో వుంటే అటువంటి గుణాలను, అలవాట్లను పొందుతారు. అందువలన దుష్ట సహవాసము చేయకుండా దైవీగుణ సంపన్నులయిన మహాత్ముల సాంగత్యము, దైవభక్తుల సాంగత్యము మనుష్యులకెంతో అవసరము. అలాంటి సాంగత్యము వలన దైవభక్తి, ధర్మాచరణ వృద్ధిచెంది మోక్షసాధనవైపు మనస్సు ఆకర్షితమౌతుంది.

కనుక శరీరపటుత్వము సడలక ముందే జ్ఞానసాధన ప్రారంభించాలి. హరిని భక్తితో పూజించాలి. సత్సాంగత్యములో తరించాలి. ఆ విధంగా ఎంతో పుణ్యఫలముగా వచ్చిన మానవ జన్మ సార్ధకమొనరించుకొనాలి. ఈ జన్మలోనే సంసార పాశములను తప్పించుకొనే ప్రయత్నము చేయాలి. ఈ జన్మ పోయిన తర్వాత మరల మనకు తరించే అవకాశము రాదుకదా! కాబట్టి దీపమున్నపుడే యిల్లు చక్కబెట్టుకోవాలి. జనార్ధనుని పూజించుటవలన సకల అంతరాయాలు, మాలిన్యాలు తొలగి మనస్సు పరిశుద్ధమౌతుంది. మనసు పరిశుద్ధమైతే మోక్షమనే అందలము ఎక్కటానికి నిచ్చెన దొరకినట్లే. ఇందులో ఏమీ సందేహము లేదు.

ఈ విధముగా చెప్పి, సనకాది మహర్షులను ఉత్తేజపరుస్తూ నారదమునీంద్రుడు యింకా ఈ విధంగా చెప్పాడు.

"ఓ మహర్షులారా! సకల జనులారా! నేను చెప్పినదంతా శ్రద్ధగా విన్నారు కదా! ఇంక ఆలస్యమెందుకు? పొందండి! పొందండి! హరిని శరణు పొందండి. ఆయనయే మన భారమంతా నెత్తికెత్తుకొంటాడు. భార్యలు, బిడ్డలు, గృహములు, క్షేత్రములు, ధనములు, ధాన్యములు వున్నాయి కదా అని మురిసిపోకండి. ఇవి ఏవీ మిమ్ము ఉద్ధరింపలేవు. ఉద్ధరింపలేవు. జనులారా! వీనిని చూసి గర్వించకండి. కామింపకండి. ఈ కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము వదిలి పెట్టి శక్తికొలది హరిని సేవించండి. అవిగో! యమభటుల భయంకర ఆకారాలు. అవిగో! వారి కరాళ సింహగర్జనలు, అవి ఎంతో దూరములో లేవు. దాపు దాపునకు వచ్చినవి. ఈలోగా హరిని స్మరించుకొనండి అయ్యయ్యో! యిటు చూడండి. ముసలితనం ఎంత రివ్వున పరుగెత్తుకొని వస్తున్నదో! వృద్ధాప్యంలో మీకు యింద్రియబలం ఏముంటుంది? కనుక వృద్ధాప్యదశకు ముందే హరిని స్మరించుకోండి. పూజించండి. పరలోకానికి బాట ఏర్పరచుకొనండి. అశాశ్వతమయిన ఈ శరీరమును నమ్ముకొనకండి. సుఖభోగాలపై భ్రాంతి చెందకండి. ఈ భ్రాంతులు మిమ్ములను ఆనందింప జేయలేవన్నది సత్యం. ఈ ఆశలనన్నింటినీ అడియాసలు చేస్తూ ఈ పంచభూతాత్మక శరీరం మట్టిలో కలసి పోయిన తర్వాత జీవి పరిస్థితి ఏమిటి? తిరిగి మనుష్యజన్మ వస్తుందన్న నమ్మకమేమిటి?

ఎప్పడు ఆయువు తీరిపోతుందా, ఎప్పడెప్పడు మ్రింగివేద్దామా అని మృత్యువు కనిపెట్టివుంటుంది. ఇటువంటి స్థితిలో ఎందుకురా మీకు యీ దర్పము? ఏమి చూసుకొనిరా మీకీ గర్వము? సంపదలను చూసుకొని అహంకరిస్తున్నారా? ఓడలు బండ్లు అగుట, బండ్లు ఓడలు అగుట ఎరుగరా? ఏ క్షణమయిన యీ సంపదలు యిటు మొగము చూపి అటు పరుగెత్తి పారిపోతాయో తెలియదు కదా! ఇక ఆలుబిడ్డలను చూసుకొనియా మీ ధైర్యము? ఈ సంయోగము ఎంతసేపు? శరీరమున్నంత వరకే గదా యీ బాంధవ్యాలు? దీపమునకు నీడ వలె సంయోగము

నంటిపెట్టుకొని వియోగము ఎప్పడూ వుండనే వుంటుందాయె? ఈ బంధువులందరూ మనతో కాటి దాకానే వస్తారు. ఆపై మనలను వారు అనుసరిస్తారా? ఇటువంటి పరిస్థితులలో యుక్తాయుక్త విచక్షణ చేసి హరిని ఆశ్రయించి తరించటమొక్కటే మార్గం. ఆ భక్తియే మీకు పరలోకమునకు తోడుగా వస్తుంది. కనుక ఎవ్వరినీ నమ్ముకొనవద్దు. ఈ శరీరాన్ని అసలే నమ్ముకొనవద్దు. మోక్షసాధనకు ఉపకరించే విలువయిన ఆశ్రయముగ మాత్రమే దీనిని తెలుసుకొనండి. జ్ఞానసాధనకు ఉపయోగపడే ఉపాధిగా గుర్తించి యీ శరీరము ద్వారా ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ మోక్షాన్ని సాధించండి. హరిని స్మరించండి. ఆశాపాశములను త్యజించి ఆ స్వామిని సేవించండి. సకల పాపములనుండి విముక్తుని పొందండి.

*"సర్వతీర్థాని యజ్ఞాశ్చ సాంగా వేదాశ్చ సత్తయాః*
*నారాయణార్చనాస్యైతే కలాం నర్హాంతి షోడశమ్"*

సర్వతీర్థయాత్రలు యజ్ఞములు సాంగ వేదములు యిచ్చుఫలము నారాయణార్చన మొసగు ఫలములో పదునారవవంతుకు కూడా పోలదు. కనుక ఎందులకీ శాస్త్రములు, గీస్తములు? హరిభక్తిలేని తదితర సర్వక్రియలు నిష్ఫలములు నిష్ఫలములు.

కనుక నారాయణార్చనమే శ్రేయస్కరము.

ఓ జనులారా! మహర్షులారా! ఒక్క విషయం ఆలోచించండి. తాను సృష్టించిన యీ జగత్తులో అధర్మం పెరిగినపుడు, అధర్మపరులచే, పాపాత్ములచే సాధుజనులు పీడింపబడుతున్నప్పుడు స్వామి అవతరిస్తారు. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం. ధర్మ సంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే" అన్న ప్రతిజ్ఞ ననుసరించి పరమాత్ముడు భూమిపై అవతరించి ధర్మాన్ని నిలబెడుతారు.

మొసలి బారిన పడిన గజేంద్రుని దుష్టులు పరాభవిస్తున్న సమయంలో ఎలుగెత్తి పిలిచి తనను కాపాడమని ప్రార్థించిన ఆ పతివ్రతను అక్షయ వలువ లిచ్చి రక్షించిన ఆ గాథలు వినలేదా?

చిటికెన వ్రేలిపై గోవర్ధన గిరినెత్తి గోవులను, గోపగోపీ జనులను ఆ గిరి క్రింద నిలిపి ప్రళయ సమానమైన గాలివానను సృష్టించి గోపజనులను హతమార్చ యత్నించిన ఇంద్రుని గర్వమణచి వారిని కాపాడిన రక్షకుని లీలలను వినలేదా? అటువంటి భక్త జనరక్షకుడు, అపార దయాసముద్రుడయిన శ్రీహరిని స్మరిస్తే సకలపాపాలు తొలగి పోతాయి. ఆపదలు మన దరి చేరనే చేరవు.

ఆ స్వామి ఎక్కడో లేడు. అతడు మన హృదయంలోనే వున్నాడు. మనసారా స్మరించిన వారి వెన్నంటి వుండే స్వామి మన చేరువలోనే వున్నాడని ఎరుగక చంకలో బిడ్డను ఎత్తుకొని వుండి ఊరంతా వెతికినట్లు స్వామి దుర్లభుడని ఆయనను సాధించటం కష్టసాధ్యమనీ కొందరు తలుస్తారు. కానీ అది నిజం కాదు. స్వామి భక్త సులభుడు. స్వామికి కావలసినది భక్తుని ప్రేమ మాత్రమే. నిష్కళంక ప్రేమయే భక్తి అనబడుతుంది. మంత్ర తంత్రాలకు, యోగ యాగాలతో కూడ దొరకని ఆ శ్రీహరి ప్రేమతో, భక్తితో పిలిచిన ఒక్క పిలుపుకు వశుడౌతాడు. రుక్మిణీమాత సమర్పించిన ఒక్క తులసీదళానికి సరితూగిన ఆ కృష్ణపరమాత్మ, తాను ఏ ఆడంబరాలనూ కోరక, ఒక్క భక్తికి మాత్రమే వశుడనౌతానని నిరూపించు కొన్నారు.





కన్నతండ్రి మాటలు యింకా నేర్వని పసివాడయిన తన బిడ్డ ముద్దుమాటలతో ఎలా పిలిచినా తండ్రి ఏ విధంగా శ్రీహరి ప్రేమపూరితమయిన తన భక్తుని ఒక్క పిలుపుకే వశుడై అతనిని రక్షిస్తాడు. ఇందులో ఎంత మాత్రము సందేహములేదు.

మరొక్క విషయం. ఆపదలో వున్నప్పుడు మాత్రమే జనులు పరమాత్మను ఎక్కువగా స్మరిస్తారు. కనుక ఆపదలు జనులకు ఒక విధంగా మిత్రులేనని తలచండి. కనుక ఆపదలు వచ్చినపుడు భయపడక భగవంతుని శరణు వేడండి. ఆ స్వామి దయతో పెనుగాలికి మేఘాలన్నీ ఏ విధంగా దూదిపింజల్లా బెదరిపోతాయో అదేవిధంగా కష్టాలన్నీ తొలగిపోతాయి. అయితే కష్టాలు వచ్చినపుడు మాత్రమే తలవటం కంటే స్వామిని నిరంతరం స్మరిస్తూవుంటే అసలు కష్టాలేరావు కదా! ఒకవేళ వచ్చినా అవి ఏ విధంగాను భక్తుని బాధింపలేవు.

భగవంతుని స్మరణలో వున్న ఆ భక్తునికి అవి కష్టాలుగా తోచనే తోచవు. జీవితంలోని సుఖదు:ఖాలను అతడు భగవంతుని ప్రసాదాలుగా భావించి కష్టసమయంలోనూ అతడు సంతోషంగానే వుంటాడు.

భగవంతుని నిరంతర స్మరణ అనే అమృతాన్ని గ్రోలుతూ ఆ మాధుర్యపు మత్తులో తేలియాడుతున్న ఆ పరమభక్తుని ఎటువంటి ప్రాపంచిక చింతలూ వేధించవు. సమస్త భారములూ స్వామిపైనే మోపి నిశ్చింతగా అతడు జీవిస్తుంటాడు. ఓ మహర్షులారా! అతడేకదా జీవన్ముక్తుడు. అతడే కదా ధన్య చరితుడు!

క్షణముకూడా ఆలసింపక యిప్పుడే యీ క్షణము నుండే నిరంతర భగవత్ స్మరణను ఆరంభించండి. దుర్లభమయిన మానవజన్మను పొందికూడా చేతచిక్కిన రత్నాన్ని జారవిడుచుకున్న దురదృష్టవంతునిలాగా భగవంతుని స్మరణకు దూరమై జన్మను నిరర్థక మొనరించుకొనకండి. ఈ జన్మ పోయిన తర్వాత ఏమనుకొంటే ఏమిలాభం? గడచినకాలం తిరిగి వస్తుందా?

కనుక మానవ జన్మను సార్థకమొనరించుకొనండి. హరిని స్మరించండి. శ్రీ మహావిష్ణువు అనుగ్రహాన్ని పొందటానికి ఏ విధమయిన యజ్ఞ, యోగ, యాగాదులు అవసరంలేదు. అర్చనలు, జప, తపాదులతో పనిలేదు ప్రేమతో, భక్తితో చేసే నామస్మరణ అనే నావతో సంసార సాగరమును సులభముగా దాట వచ్చును."

-అని నారదుడు సనత్కుమారాది మునులతో చెప్పాడు- అని వేదధర్ముడు దీపకునితో చెప్పి యిలా అన్నాడు- "వత్సా! నీ కోరిక మేరకు శ్రీ దత్తాత్రేయ స్వామి చరిత్ర వినిపించాను. ఆ స్వామి మహాత్మ్యము విన్నావుకదా? నీ సందేహములన్నీ తీరాయా? నీవిప్పుడు సంతృప్తుడవైనావా?"

వేద ధర్ముని పాదాలకు సాష్టాంగ నమస్కారములు చేసి నిలబడిన దీపకుడు ఆనంద భాష్పాలు కారుస్తూ, "గురుదేవా! ధన్యుడను. ధన్యుడను. సాక్షాత్తు పరమేశ్వరులైన మీ నుండి శ్రీ దత్తాత్రేయ స్వామి చరిత్రము వినటము నా జన్మ జన్మల తప: ఫలముగా నమ్ముతున్నాను. ఓ తండ్రీ! నన్ను కన్న తండ్రి నాకు మోక్ష సాధనకు అర్హత కలిగిన యీ మానవదేహాన్నిచ్చారు. నా తండ్రి నన్ను మీకు సమర్పించుకొనిన తర్వాత నా తల్లి, తండ్రీ, దైవం అన్నీ మీరే అయి నన్నుద్ధరిస్తూ వున్నారు. ఓ గురుదేవా! మీరు నాకు సద్గురువులే కాదు, నా సర్వస్వము మీరే అని నమ్ముతున్నాను. నా పై మీకు గల దయను ఎలా వర్ణించగలను?

దయతో నన్ను కాశీ క్షేత్రమునకు చేర్చి, వ్యాధి నెపముతో తమరి సేవ చేసుకునే మహాద్భాగ్యమును ప్రసాదించారు. వారణాసీ మహాత్మ్యమును తెలియజేసారు. నేను కోరగానే శ్రీ దత్తాత్రేయ మహాత్మ్యమును వినిపించి నన్ను ధన్యుని చేసిన కరుణామృత హృదయులయిన మీకివే నా శత సహస్ర పాదాభివందనాలు. శ్రీ దత్తాత్రేయ స్వామి వివరించిన సకల ధర్మములు, కర్మాచరణ విశేషములు, స్వామి లీలలు తెలిసికొని సకల సందేహ నివృత్తుడనయినాను. ధన్యుడను ధన్యుడను" అంటూ తన గురుదేవునకు

మరల మరల నమస్కరించాడు దీపకుడు.

ఈ విధంగా వేదధర్ముడు, దీపకుడు అనే గురుశిష్యుల చరితము, వారి సంవాదము ద్వారా గురువు యొక్క ప్రాముఖ్యత, పరమగురుడైన దత్తాత్రేయస్వామి చరితము వినిపించి, బ్రహ్మ కలిపురుషునితో యిలా అన్నాడు. "ఓ కలీ! నీవు కోరినట్లుగా 'గురువు' యొక్క విశిష్టతను వివరించాను. గురుభక్తులు ఎంతటి మహిమాన్వితులో తెలియజెప్పాను. ఇప్పుడు నీవు గురుసేవలో గురుభక్తిలో ధన్యులయిన మహానుభావుల శక్తి ఎంతటిదో పూర్తిగా తెలుసుకొన్నావని భావిస్తున్నాను. ఓ కలీ! ఇక, పోరావో, నీ పని నువ్వు చేసుకో. నిన్ను మరల హెచ్చరిస్తున్నాను. గురుభక్తులవంక కన్నెత్తి కూడా చూడకు సుమా!"

ఇలా చెప్పి కలిపురుషుని అక్కడినుండి పంపి వేశాడు, బ్రహ్మదేముడు.

బ్రహ్మ కలి సంవాదమును వినిపించి, ఆ విధముగా శ్రీ దత్తాత్రేయ స్వామి చరిత్రను సవిస్తరముగా వివరించిన సూతమహాముని నైమిషేయమునులతో యిలా అన్నాడు-

"ఓ మునులారా! మీకు నాపై గల అనుగ్రహము కొనియాడ నా తరముగాదు. మీవలననే నాకు దత్తస్వామి స్మరణము అనే మధురామృతమును గ్రోలే భాగ్యం కల్గింది. ఈ దత్తపురాణము వినిన వారు, వినిపించినవారు ముక్తులౌతారు. మోక్షార్హులౌతారు. పురాణమంతయు విన్నా లేక యిందులోని ఒక అధ్యాయమైనా చదివినా విన్నా అటువంటివారు సర్వపాప విముక్తులవు తారనటంలో ఎంతమాత్రము సందేహము లేదు. స్వామి అత్యంత కరుణతో వారిని అనుగ్రహిస్తారు.

*"పురాణం శ్లోకమేకం వాప్యర్ధంవా పాదమేవవా*
*భక్త్యానిత్యం జపేద్ధీమాని సోపి తత్పదమశ్నుతే*
*దత్తప్రసాదత: కామాని ప్రాప్నోత్యే నీ సంశయ:"*

ఈ దత్తపురాణమంతయు చదివినసరే. వారి పుణ్యమును బండ్లకెత్తవచ్చును. లేకున్న ఒక్క శ్లోకమైనా, అందలి అర్థమయినా, చివరకు ఒక పాదమయినా భక్తితో నిత్యము ఎవరు చదువుతారో వారు శ్రీ దత్తాత్రేయ స్వామి అనుగ్రహము వలన సర్వశుభములు పొంది చివరకు పరమ పదమును పొందుతారనటంలో ఎటువంటి సందేహమూలేదు. దత్తస్వామి భక్తులకోరికలు తీర్చే కల్పవృక్షము. తనను నమ్మిన సద్భక్తులను సర్వవిధముల కాపాడుతూ, సంరక్షిస్తూ అనుగ్రహిస్తూ తుదకు వారిని మోక్షగాములుగా మార్చివారిని సంపూర్ణంగా అనుగ్రహించి తరింపజేసే సమర్థ సద్గురుడు, శ్రీ దత్తాత్రేయస్వామి. ఆ స్వామిని ఆశ్రయించి మనమందరము తరించవలెనని తరింప జేయమని ఆ స్వామిని ప్రార్థిస్తున్నాను."

సూతుడు మునులకీ విధంగా ఉపదేశించి, వారి పూజలందుకుని నిష్క్రమించాడు.

మునులు అత్యంత భక్తితో శ్రీ దత్తస్వామిని స్మరించి ప్రణమిల్లారు.

"శ్రీ దత్తాత్రేయ స్వామికి జయము. జయము." అంటూ మునులు చేసిన జయజయ ధ్వానాలతో నైమిషారణ్యం మారుమ్రోగింది. ప్రకృతి పులకించింది. దేవతలు దివి నుండె పుష్పవృష్టి కురిపించారు.

## శ్రీ దత్తాలీలామృత చరితము సంపూర్ణం.

**ఎన్నోజన్మల పుణ్యఫలంగా, శ్రీ భరద్వాజ గురుదేవుల దివ్య ఆశీస్సులతో, అనుగ్రహంతో పరమ పుణ్యప్రదమైన ఈ 'శ్రీ దత్తలీలామృతము' అనే దివ్యచరిత్రను వ్రాసే మహద్భాగ్యం నాకు లభించిందని భావిస్తున్నాను.**

**నాకు యీ అదృష్టాన్ని అందించిన శ్రీ భరద్వాజ గురుదేవులు, వారి ధర్మపత్ని శ్రీ అలివేలుమంగ తాయారు గారి దివ్యపాదపద్మములకు నా శతసహస్రవందనములను అర్పిస్తున్నాను.**

**శ్రీ దత్త స్వరూపులయిన గురుదంపతుల అనుగ్రహం నాపై ఎల్లప్పుడూ వర్షింపజేయుమని వారిని ప్రార్థిస్తూ - *రచయిత్రి.***

**నీరాజనం!**

**జయ మంగళం నిత్య శుభమంగళం**
**దేవులకు దేవుడై, దేవతారాధ్యుడై**
**లోక సంపూజ్యునకు శుభమంగళం**
**కోరిన వరాలిచ్చు కొంగు బంగారమై**
**వెలుగొందు దేవునకు జయమంగళం.**
**కోరికలు లేనట్టి కోరికను తీర్చేటి**
**శ్రీ దత్తవిభునకు నిత్యశుభమంగళం.**
**జై సాయి మాస్టర్!!**



# బుద్ధ ధ్యాన హృదయము - 3

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సెప్టెంబరు 2012

### మనస్సును నూతనంగా రూపొందించడంలో కేవలశ్రద్ధ యొక్క ప్రాశస్త్యము

ఈ ప్రపంచంలో మానవుల చేత సృష్టించుకోబడిన దుఃఖంలో యెక్కువ భాగం బుద్ధి పూర్వకమైన దౌష్ట్యము వలన కంటే అజ్ఞానము, నిర్లక్ష్యము, అజాగ్రత్త అనాలోచన, తొందరపాటు, ఆత్మనిగ్రహము లోపించుటవల్ల కలుగుతుంది సామాన్యంగా. క్షణమాత్రం వివేకంతో ప్రదర్శిస్తే నివారణయ్యే దుఃఖ పరంపరలు యెన్నో వుంటాయి. ఒకపని చేసే ముందు కేవల శ్రద్ధా స్థితిలో కొంచెం తమాయించినట్లయితే మన మనస్సు ఒక పని చేయబూనే క్షణం మన ఆధీనంలోకొస్తుంది. యోచన క్రియారూపం ధరించకుండా నిలిపి వివేక పూర్వమైన నిశ్చయానికి రావడానికి అవకాశం కల్పిస్తుంది. కేవల శ్రద్ధ, మానవుల్లో సంఘటనలకు, సందర్భాలకు త్వరపడి రాగద్వేషపూర్వకంగా ప్రతిక్రియ సలిపే స్వభావము ఉంటుంది. అట్టి సందర్భాలలో యిది యెంతో ఉపకరిస్తుంది. మాటలలోను, చేతలలోను తొందరపాటు లేకుండా చేస్తుంది. కేవల శ్రద్ధ ద్వారా యిలా నిలకడ సంపాదిస్తే మనస్సుకు సంసారం లభిస్తుంది. అవాంఛనీయమైన చేతలు నిలిచిపోతాయి. చాలా సందర్భాలలో మనో వాక్కాయాల ప్రతిక్రియ అవసరమే లేదని యీ నిలకడ దొరికినప్పుడు తెలియగలదు. కేవలశ్రద్ధ వలన లభించిన మానసిక శాంతి యితరుల విషయాలలో జోక్యం కలుగజేసుకోకుండా వుండేందుకు మనకు తోడ్పడగలదు. ఎట్టి చిక్కులు తలెత్తవు. మనస్సును సంస్కరించుకోవడం కూడా సులభమౌతుంది.

కేవలశ్రద్ధ వర్తమానం మీదికే దృష్టిని కేంద్రపరుస్తుంది. ప్రస్తుత పరిస్థితినుంచి తప్పించుకొని, గతాన్ని, భవిష్యత్తును గూర్చిన యోచనలలోకి పారిపోకుండడం నేర్పుతుంది. సామాన్యులు భూత భవిష్యత్తుల గురించి నిజమైన అవగాహన కలిగియుండే బదులు పగటికలలుగా పనిచేస్తూ సమ్యక్ స్మృతి (సరియైన అవగాహన) సమ్యక్ కర్మలకు ప్రబల శత్రువులౌతాయి. గతం గూర్చిన వ్యర్థమైన ఆలోచనలలో గతాన్ని నిరర్థకమైన పశ్చాత్తాపంలో నెమరు వేసుకోవడంలో యెంతో శక్తి వృధా అవుతుంది గదా! అలానే భవిష్యత్తును గూర్చిన యోచనలు, ఆశలు, కలలు, భయాలు, చింతల్లో కూడా చాలా సమయం, శక్తి వృధా అవుతూంటుంది. కేవలశ్రద్ధ వీటన్నింటిని తుడిచి వేస్తుంది.

సమ్యక్ స్మృతి మానవుని గతానుభూతి సంకెళ్ళలోంచి విడుదల చేసి వాటిని గూర్చి తలచుకోవటం ద్వారా ఆ బంధాలను దృఢతరం కాకుండా చూస్తుంది. అలానే భవిష్యత్తు విషయంలోనూ, వర్తమానంలో మాత్రమే లభ్యమయ్యే స్వేచ్ఛాను పూర్ణంగా వినియోగించుకొనే సామర్థ్యాన్నిస్తుంది.

అంతేగాదు భూత, భవిష్యత్తులను గూర్చిన ఊహాగానాలు, పగటికలలు ఏకాగ్రతకు విఘ్నాలు, ప్రత్యక్షమైన విషయం పైన మనస్సును కేవలం గ్రహణంలో నిమగ్నం చేయడం యీ విఘ్నాలను అంతమొందిస్తుంది. అయితే అభ్యాసంలో మనం గుర్తించేలాగా పగటికలలు ప్రవేశించినటులైతే వాటి నిజతత్వాన్ని కేవలశ్రద్ధకు గురిచేస్తే మనస్సును బలహీనపరచగల వాటి సామర్థ్యం నశించి అవి తొలగిపోతాయి. ఈ విధంగా సాధనకు ప్రతిబంధకాలైన

వాటిని ధ్యానానికి సోపానాలుగా మార్చుకోవచ్చు.

నిత్యజీవితంలో మనకు తెలియకనే మనలో పేరుకుపోయే అస్పష్టములు అసందర్భములు, పాక్షికములు అయిన యోచనలు, ఇంద్రియానుభూతులు, అణచివేయబడ్డ ఉద్రేకాలు యెన్నో గూడుకట్టుకొని మన మనోకార్యాన్ని ఆటంకపరుస్తాయి. ఇవన్నీ క్రమంగా మన మనస్తత్వాన్ని గుణాలను, వ్యక్తిత్వాన్ని వికారపరుస్తాయి. మన మనస్సును నూతనంగా, సంకీర్ణంగా రూపొందించడానికి విఘ్నాలౌతాయి. కేవలశ్రద్ధ వీటిని మనకు సుగోచరం చేసి మన మానసిక స్థితిపై మనకు తీవ్ర అసంతృప్తిని కలిగించి సమ్యక్ స్మృతి సాధనకు తీవ్రంగా ఉన్ముఖం చేస్తుంది. వ్యర్థంగా మానసిక శక్తి ఖర్చుకాకుండా చేస్తుంది. ఈ విధంగా కేవలశ్రద్ధ సంకీర్ణంగా రూపొందించడానికి దోహదం చేస్తుంది.

ఎప్పటికప్పుడు మనలో తలెత్తే భావాలపై కేవలశ్రద్ధను కేంద్రీకరించడం వలన మనలోని సామర్థ్యాసామర్థ్యాలు గోచరమై ఆత్మవంచన అంతమొందిస్తుంది. మన సామర్థ్యాసామర్థ్యాల గూర్చిన అజ్ఞానమైన మన మనస్సును మనం సంస్కరించుకోవడానికి ప్రతిబంధకమౌతుంది. కనుక కేవలశ్రద్ధ దీనిని తొలగిస్తుంది. మనలోని అవాంఛనీయమైన విషయాలెన్నో కేవలశ్రద్ధ ద్వారా తక్షణమే గుర్తించగలగడం వాటిని నిర్మూలించుకోడానికి మొదటి మెట్టు. ఇది ఒక కామపూరిత తలంపు అని గాని, యిప్పుడు నాలో చిత్త సంక్షోభము అను అవరోధమేర్పడిందను గుర్తింపు అంతకంతకు వాటిని మనలో ప్రతిఘటించే శక్తిని మేల్కొల్పుతుంది. అలాగే కేవలశ్రద్ధ మనలో దాగియున్న సామర్థ్యాలను సుగోచరం చేయడం ద్వారా ధైర్యోత్సాహాలను కల్పిస్తుంది.

## మానసిక విమోచనంలో కేవల శ్రద్ధ యొక్క ప్రాశస్త్యము

ఈ సాధనా విశిష్టత చవిచూపించడం కోసం కొద్ది రోజులపాటు వ్యక్తులు, పరిస్థితులు, పరిసరాల పట్ల కేవలశ్రద్ధావైఖరిని పూనమని చెబుతారు. అలా చేయగానే రోజులు తనకెంత సామరస్యంగా గడిచిపోతాయో తనకే తెలిసివస్తుంది. మనోవాక్కాయాలు స్వల్ప ప్రేరణలకు లొంగి అన్ని విషయాల్లో జోక్యం చేసుకోవడం మానేస్తాడు. ఎంతో శాంతంగా, తృప్తిగా, ఉత్సాహంగా, స్వేచ్ఛగా రోజులు గడుస్తాయి. అదృశ్యమైన రక్షణ తన చుట్టూ ఆవరించినట్లుంటుంది. జనసమ్మర్థం నుండి దూరంగా ఎత్తైన ప్రశాంత కొండ శిఖరానికి వెళ్ళి అక్కడనుంచి క్రిందికి చూస్తున్న వారిలాగ వుంటుంది అతని పరిస్థితి. అందువలన సాటి మానవుల పట్ల రాగద్వేషాదులు శమించి మైత్రి పెరుగుతుంది. జీవితం తెరిపిగా అవుతుంది. బాహ్యాభ్యంతర ప్రపంచం సువిశాలమౌతుంది. ప్రతి విషయంలోను మనం తల దూర్చకున్నా ప్రపంచ క్రియాకలాపం యెప్పటిలాగా కొనసాగుతుందని తెలియడమే గాక అలా నిగ్రహించుకోవడం వలన మన జీవితం మరింత మెరుగ్గా వుండగలదని గూడ తెలుస్తుంది. ఎన్నో చిక్కులు నివారణవడమే గాక సమస్యలు వాటంతటవే పరిష్కారమౌతాయి. లోకభ్రాంతిని పెంచేది దుఃఖకారణమైన కర్మల నుండి కేవలశ్రద్ధ ద్వారా విడివడడం యెంత అవసరమో తెలుస్తుంది. కేవలశ్రద్ధ ద్వారా వ్యక్తులు వస్తువులనుండి, మన నుండి మనము పాక్షికంగాను, తాత్కాలికంగాను దూరమైన మన అనుభూతి యేనాటికైనా శాశ్వతంగా అట్టి వైరాగ్యాన్ని సాధించి అట్టి సుఖశాంతులను శాశ్వతం చేసుకోగలమన్న విశ్వాసాన్ని కలిగిస్తుంది. జీవించియుండగానే బంధాలనుండి సంపూర్ణంగా విముక్తి పొందడం యెంత ఆవశ్యకమో అట్టి జీవన్ముక్తావస్థ యెలా వుంటుందో మనం స్వల్పంగా రుచి చూస్తాము. ప్రపంచంలో వుంటూ కూడా దానికి చెందని వారమై వుండడమంటే యేమిటో తెలుస్తుంది. ఉత్తమోత్తమము, శాశ్వతమూ అయిన ముక్తిని సాధించటానికి సాధనమైన లోచూపు (విపస్సన)ను కేవలశ్రద్ధ మనకు ప్రసాదిస్తుంది. ఇదే దానియొక్క పరమప్రయోజనం.

లోచూపంటే జగత్తు అశాశ్వతము, దుఃఖమయము, అనాత్మ అని, గాఢంగా ప్రత్యక్షంగా గుర్తించడమే. ఇది కేవలం మానసిక అవగాహన మాత్రమే గాని నిస్సంశయము, అచంచలము అయిన స్వానుభవంగా ధ్యానావస్థలో మనం గుర్తించిన అనుభవంగా తెలుస్తుంది. ఈ లోచూపు వైరాగ్యాన్ని పెంచి దుఃఖము యొక్క బానిసత్వము నుండి మనస్సుకు విముక్తిని కలిగిస్తుంది.



కేవలశ్రద్ధలో యీ స్థితిని రుచి చూడటం వలన గమ్యం వైపుకు యెంతో తీవ్రతతో ఆకర్షితుడౌతాడు. గమ్యాన్ని మనోనేత్రం ముందు నిలిపి ప్రక్కదారి పట్టినప్పడు తిరిగి దారికి రావడానికి దోహదం చేస్తుంది. గమ్యస్థానం కంటబడ్డప్పడు కాళ్ళు, మనస్సు, నూతనోత్సాహాన్ని, శక్తికి పొందినట్లు సాధకునికి బలాన్ని చేకూరుస్తుంది.

## 2. శుద్ధ అవగాహన

కేవలశ్రద్ధ సాధనేతర సమయాలలో నిత్యజీవితంలో పరిమిత కాలం మాత్రమే నిలుపుకోవటం సామాన్యులకు సాధ్యమౌతుంది. నిత్యజీవితంలో యెన్నో క్రియలు, మాటలు, తలంపులు చేయక తప్పదు. సాధనలోని ప్రశాంతస్థితిని విడచి యితరులతో సంపర్కం చెందడం మరలా మరలా ఆవశ్యకమౌతుంది. మనస్సుకు ఆలోచించడం నిర్ణయాలు చేసుకోవడం తప్పదు.

ఇట్టి నిత్య జీవితాన్ని తన క్రియారంగంగా కలిగియుంటుంది సమ్యక్ స్మృతిలోని రెండవ అంశమైన శుద్ధ అవగాహన (సంప్రజ్ఞాన). క్రమంగా దీని సహాయంతో మన మనోవాక్కాయాలను నియమించుకోవడానికి ఉపయోగించుకోవాలి. మనోవాక్కాయ కర్మలను సార్థకంగాను, సమర్థవంతంగాను, మన ఆశయాలకు, అవగాహనకు నూతనంగా కలిగియున్న అవగాహనకు అనుగుణంగాను మార్చుకోవాలి. సమ్యక్ స్మృతిని ఆధారంగా చేసుకొనిన జ్ఞానము, లేక ప్రజ్ఞయే సంప్రజ్ఞానము. ఇది నాలుగు విధాలు :

### 1) శుద్ధ లక్ష్యావగాహన (సార్థక సంప్రజ్ఞానము) :

మానవుడు తార్కికశక్తి కలవాడు కనుక అతడి క్రియలన్నీ సహేతుకంగా (అంటే సార్థకంగా) వుంటాయి అనుకొంటాము. కాని పరిశీలించిన మీదట మానవులెల్లప్పడు సహేతుకంగానే ప్రవర్తిస్తారని చెప్పలేము. స్వార్థపూరితమైన ప్రాపంచిక విషయాలలో గూడ మానవుడు తరచు తన లక్ష్యాన్ని పథకాన్ని, ప్రయోజనాలను గూడ మరచి క్షణికమైన రాగద్వేషాలకు, సోమరితనానికి గురియై నిరర్థకమైన క్రియా కలాపంలో చిక్కుకొని పెడదారిన పడతాడు.

బాహ్యాభ్యంతర విషయాల గూర్చిన తన భావాల తాకిడి వలన జీవితపంథా నుండి ప్రక్కకు తొలగడం అసమంజసము, తప్ప మరీను. అయితే యిలా ప్రక్కదారి పట్టే స్వభావాన్ని పరిమితం చేసుకొని వాటిని సంపూర్ణంగా నివారించుకోడానికి యత్నించుకోవడం అవసరము. మహనీయులకే యిది సంపూర్ణంగా సాధ్యం. ఈ బలహీనతలను అధికార పూర్వకమైన ఆదేశాలద్వారా గాని, శుష్కమైన హేతువాదం ద్వారాగాని, ధర్మపన్నాలను వల్లించడం ద్వారా గాని తగ్గించనూలేమూ, నిర్మూలించనూలేము. అలా చేస్తే యేదో ఒకనాటికి యీ బలహీనతకు ఆధారమైన భావోద్రేకాలు తిరుగుబాటు చేసి అసంబద్ధమైన ప్రవర్తన రూపంలో ప్రకటమౌతాయి. (కృత్రిమంగా శాంతిని నిలుపుకున్నవాడు ఒక్కసారిగ తీవ్రమైన చీకాకుకు, కోపానికి గురియైనట్లు) వీటిని అర్థం చేసుకొని మన లక్ష్యసాధనకు అనుగుణంగా మలుచుకోడానికి యత్నాన్ని కేవలశ్రద్ధ సాధన నుండి ఆరంభించాలి. అది మనలను ప్రతిఘటించే యీ శక్తులను కలిగించి లక్ష్యసాధన కనువైన రీతిగా మార్చుకుంటుంది. మనలోని వివిధ గుణాలను, కోరికలను, క్రియలను సమన్వయ పరచుకోవటం క్రమబద్ధము, సహజము అయిన ఆత్మనిగ్రహము ద్వారా మాత్రమే సాధ్యము. ఇట్టి యింద్రియ మనో నిగ్రహానికి కేవల శ్రద్ధే భద్రమైన ఉపాయము. విషయగ్రహణ క్రియకు దారితీసేలోగా విరామాన్ని కల్పించటం ద్వారా సార్థక సంప్రజ్ఞానికి పనిచేసి అవకాశం కల్పిస్తుంది. అంతేగాక శుద్ధ అవగాహనకు అవసరమైన శుద్ధ విషయజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. తద్వారా తన లక్ష్యమునుండి ప్రక్కకు తొలగి అసంతృప్తికి గురికానక్కర లేకుండా చేస్తుంది.

అలాకాక పాత అలవాటు ప్రకారం మనస్సే లక్ష్యం నుంచి ప్రక్కకు పోనిస్తే క్రమంగా శక్తి, ఓరిమి, ఏకాగ్రత బాగా క్షీణించి లక్ష్యం యొక్క విలువను గూడా

మరిచేలా చేస్తుంది. అలా అసలు లక్ష్యాన్ని మరిచి దాని సాధన కలాపాన్ని యాంత్రికంగా మాత్రమే అలవాటు చొప్పన నిర్వహిస్తూ ఉండే యెందరో వ్యక్తులను మనం చూడవచ్చు. సార్థక సంప్రజ్ఞానము ఈ ప్రమాదాన్ని నివారిస్తుంది. మనోవాక్కాయాలను వ్యర్థమైన క్రియా కలాపాలలో శక్తిని ఖర్చు చేయనివ్వక ఆత్మ నిగ్రహానికి దోహదం చేస్తుంది. అన్ని క్రియలను తన లక్ష్యాని కనుగుణంగా మలుచుకొనే శక్తికేంద్రాన్ని మనలో యేర్పరుస్తుంది. లక్ష్యసాధనకనువైన కర్మలనే యెన్నుకొనే నిశ్చయశక్తిని, అవగాహనను, సాధనలో పట్టుదలనూ యిస్తుంది. ఒక్కసారికి దుఃఖం యొక్క వాస్తవికతను సంపూర్ణంగా అర్థం చేసుకుంటే దానిని వృత్తి పదాన్ని అవలంబించటం జీవితము యొక్క యేకైక లక్ష్యమన్న నిశ్చయ దారుఢ్యం కలుగుతుంది.

### 2) సోపాయ సంప్రజ్ఞానము లేక ఉపాయాన్నెఱుగుట

అన్నిటికంటే ఉత్తమమైన పంథానెన్నుకోవడం సర్వదా సాధ్యం కాదని మన సామర్థ్యం పరిమితిని, పరిస్థితిని అనుసరించి గుర్తించటమే సోపాయ సంప్రజ్ఞానము. దేశకాల సామర్థ్యాలకనుగుణమైన పంథానెన్నుకొనే నైపుణ్యమే యిది. గుడ్డిగా, మొండిగా యెన్నుకొన్న పంథా ననుసరించి అపజయాన్ని, నిరుత్సాహాన్ని పొందే ప్రమాదాన్ని, అది తెలియక లక్ష్యాన్నే శంకించే ప్రమాదాన్ని నివారిస్తుంది.

### 3) గోచర సంప్రజ్ఞానము

నిత్య జీవితంలో మనస్సును లక్ష్యానుగుణంగా సంకీర్ణం చేసుకొనే ప్రజ్ఞ మనలో వ్యక్తిత్వము లేక "నేను" అనబడే వస్తువే తదను శ్రద్ధ, నిరంతర జ్ఞానమే అసమ్మోహ సంప్రజ్ఞానము అను నాలుగవ అంశము, ధ్యేయ విషయాన్ని యెప్పడూ అంటిపెట్టుకొని యుండడమే గోచర సంప్రజ్ఞానమని పెద్దలు వ్యాఖ్యానించారు. ఇందులో రెండంశాలున్నాయి,

1) ఒకే వస్తువును ధ్యానించేప్పుడు మన నిత్య జీవితంలోని క్రియలన్నింటితోను దానిని సమన్వయించుకోవాలి. అంటే మనం జేసే పనిని మనం ధ్యానించే సత్యానికి ఉదాహరణగా అన్వయించుకోవాలి. ఉదాహరణకు తినటమనే క్రియను శరీరం యొక్క అనిత్యత్వాన్ని అది నాలుగు భూతాలు చేత చేయబడి ఉండడాన్ని ధ్యానించడంతో సమన్వయపరచుకోవచ్చు. ధ్యానము నిత్యజీవితము సమన్వయపడి ఉభయతారక మౌతుంది. ఒక్కొక్కప్పుడు మనం చేయవలసిన పని ధ్యానంతో సమన్వయపడినదిగా వుండవచ్చు. అటువంటప్పుడు ఆ పని ఆరంభించే ముందు బుద్ధి పూర్వకంగా పక్కకు కునికి పని అవగానే తిరిగి ధ్యేయాన్ని మనస్సులో వహించాలి. ఇది కూడా ధ్యేయాన్ని మరువక పోవడమే అవుతుంది. 2) సర్వతోముఖమైన స్మృతిని నిలుపుకోవడమే సాధనగా పెట్టుకొన్నపుడు ధ్యానాన్ని నిలుపుకోవలసిన ఆవశ్యకతే వుండదు. క్రమంగా మానసిక, వాచక కార్యాలన్నీ స్మృతి సాధనలోకి యిముడ్చుకోవాలి. చివరకు ధ్యేయం నిరంతరం నిలచి ఉంటుంది. ఇందులో యెవరెంత సాఫల్యాన్ని పొందుతారో అన్నది వారి సమయస్ఫూర్తి మీద, అలవాటుమీద, అభ్యాస బలంమీద ఆధారపడుతుంది. జీవితము, సాధన ఒక్కటిగా చేయడమే సాధనకు లక్ష్యం అయి ఉండాలి. సాధనే సంపూర్ణ జీవితం కావాలి. ఈ సమ్యక్ స్మృతి సాధన యొక్క గోచరము సరిహద్దు నిరంతరమూ పెరుగుతూ నిరంతరం నూతన జీవితాంశాలను తనలో యిముడ్చుకుంటుంది.

ఈ సాధనచేసేవాడు యెల్లప్పడు "యీ పరిస్థితులలో స్మృతిసాధనను యెట్లా కొనసాగించుకోవచ్చు?" అని ప్రశ్నించుకుంటూనే వుండాలి.

ఈ సాధన అనుకొన్నంత తేలిక కాదు. అయితే సార్థక సోపాయ సంప్రజ్ఞ సాధనాల ద్వారా అవరోధాలను అతిక్రమించవచ్చు.

### 4) అసమ్మోహ సంప్రజ్ఞానము

వాస్తవాన్ని పరిశుద్ధంగా అవగాహన చేసుకున్నప్పడు భ్రమలన్నింటికీ మూలమైన 'నేనొక వ్యక్తిని' జీవిని అని, వస్తువులు యధార్థమైనవన్న భ్రాంతి తొలగుతుంది. ఈ భ్రాంతి రాగద్వేషాలకు కారణమై దుఃఖభూయిష్టమైన సంసార చక్రానికి జీవులను బంధించి తప్పతుంది. మొదటి మూడు విధములైన సంప్రజ్ఞాన క్రియలకు అన్యంగా వాటికాధారంగా నేను, జీవుడు మొదలైన తత్వమేమీ లేదన్న జ్ఞానాన్ని యెప్పడూ కలిగియుండడమే అసమ్మోహ సంప్రజ్ఞానము. ఆచరణలో అడుగడుగున అలవాటుగా తలెత్తే నేను, నావి అనే భావాలు యీ సాధనకు అతి తీవ్రమైన బంధకాలు. వీటిని జయించడంలో అసమ్మోహ

సంప్రజ్ఞానము ముఖ్యము. పై మూడురకాల సంప్రజ్ఞానము దీనికి విషయంలో సహకరిస్తాయి. అనుక్షణము తలెత్తే తలంపులు, భావాలు, వ్యక్తిత్వ రహిత క్రియలుగా గుర్తిండమే సాధన.

మహాత్ముల వల్ల తప్ప తక్కిన వారిలో వారివారి పరిపాకాన్ని, దృక్పథాన్ని అనుసరించి యీ సాధనలో వివిధమైన భావోద్రేకాలు తలెత్తుతాయి. ఈ జీవితము, సృష్టితత్వము ఒక నూతన విధానంగా దర్శనమిచ్చి,



వాటివల్ల సాధకుడి వైఖరి పూర్తిగా మారిపోతుంది. ప్రాచీనులు, ఆధునికులు అయిన సాధకులు యీ సాధనలో తమకు ఆనంద పారవశ్యం దగ్గర నుండి పరమశాంతి వరకు యెన్నో విధానాలైన అనుభవాలు తమకు కలిగాయని, నేను, నావి అనే ఉక్కు బంధనాలనుండి వాటి నాధారం చేసుకొన్న, యితర వికారాల భారం నుండి విడుదలైన స్వేచ్ఛ సాటిలేని ఆనందంగా అనుభవమౌతుంది.

మొదటి మూడు విధాలైన పరిశుద్ధావగాహన సాధనలో కేవలశ్రద్ధ అనేడి భద్రమైన 'ప్రశాంతస్థితి'ని వీడి నిత్య జీవితానికి సంబంధించిన క్రియాకలాపంతో తలపడతాడు సాధకుడు. ప్రతి పని తనను యితర క్రియ, ప్రతిక్రియల వలయంలోకి లాగే తత్వం గలవి అంటే ప్రపంచంలోకి లాగేది అని తెలుసుకుంటాడు. ప్రతి పని కొత్త పథకాలు, లక్ష్యాలు, కర్తవ్యాల వలయంలోకి లాగుతుందని మొదటి మూడు సంప్రజ్ఞాన సాధనలలోను గుర్తిస్తాడు. అంటే కేవలశ్రద్ధా సాధనలో తాను సాధించిన శాంతినంతటిని కోల్పోయే ప్రమాదానికి గురౌతాడు. అట్టి పరిస్థితిలో అసమ్మోహ సంప్రజ్ఞానం సహకరిస్తుంది. 'లోపల యీ కర్మలను, తలంపులనూ చేసే స్థిరమైన వ్యక్తిత్వమనేది లేదు. ఈ కర్మలకు గురియయ్యే సత్యమైన వస్తువు వెలుపలా లేదు' అన్న విషయాన్ని అన్ని కార్యాలలోనూ గుర్తించుకొంటే యివి నేను చేసే క్రియలు, యివి నేను అనుభవించే ప్రతిక్రియలు అనే భ్రమను దూరమైన వాటిల్లోని జయాపజయాలు, నిందాస్తుతులు అనేడి భ్రాంతి తొలగిపోతుంది. సార్థక సంప్రజ్ఞానాన్ని అనుసరించి, సోపాయసంప్రజ్ఞామననుసరించి చేయదగిన కర్మను నిర్ణయించుకున్నాక దాని ఫలితం కోసం కూడ, దాన్ని ఆ రీతిన చేయడమే లక్ష్యంగా పెట్టుకొని సాధకుడు ఆచరించగలుగుతాడు. 'తన', 'యితరుల' గురించి, కర్మ ఫలాన్ని గురించి ప్రక్క యోచన లేకుండా యేకాగ్రతతో చేయబడిన యీ కర్మ ఆ కారణంగా ఫలించే అవకాశం మరింత యెక్కువ వుంటుంది. కీర్తి, విజయము మొదలగు కర్మ ఫలాల యందుగల కోరికే ఆయా ఫలితాల కోసం మరింత కార్యకలాపంలో చిక్కుపడేలాగా చేస్తుంది. అంతేగాక ఆ కోరికే నేను కర్తను, నేను భోక్తను అనే భావాలను బలపరుస్తుంది. నాలుగు విధములయి సంప్రజ్ఞ వీటన్నింటికీ మూలమైన మోహాన్ని నశింపజేస్తుంది. కర్మ బంధాలతో నిండిన యీ ప్రపంచంలో వుండగానే ఆ బంధాలనుండి విముక్తినిస్తుంది సంప్రజ్ఞ. అంటే కర్మలో అకర్మనిస్తుంది అసమ్మోహ సంప్రజ్ఞ. అంటే కర్మలో అజ్ఞాన బంధం నుండి స్వేచ్ఛనిస్తుంది (అంటే) ఆ కర్మలో స్వేచ్ఛనిస్తుంది కేవలశ్రద్ధ. ఈ విధంగా అసమ్మో సంప్రజ్ఞ జీవితాన్నంతటినీ సాధనగా మారుస్తుంది. ఇటువంటి సంప్రజ్ఞతో నిండిన ప్రతి చిన్నపని గూడా ముక్తికి దోహదమౌతుంది. అందుకే పెద్దలు చెప్పారు. "దేని మీదనైనా మనస్సును కేంద్రీకరింపజేసే ధ్యాన పద్ధతి అవసరం. ప్రతి క్రియను ముక్తి పథం మీద ఉపకరణంగా మార్చుకొనే సామర్థ్యంగల జీవిత కళ అవసరం" అని. ఇటువంటి ధ్యాన పద్ధతి, జీవనకళ స్మృత్యుపస్థాన సాధనలో వున్నది. సమ్యక్ స్మృతి సాధన నిస్వార్థమూ, లోకహితమూ అయిన కర్మను జ్ఞాన దృష్టితో సోపాయంగా చేసే నైపుణ్యాన్నిస్తుంది.

# వార్తాలాపము

*ఆగస్టు సంచిక తరువాయి*

సెప్టెంబరు 2012

## నిర్గుణబ్రహ్మము ఉపాసనచే లభించును

పెద్దవిద్యార్థి :- నిర్గుణబ్రహ్మము మనస్సునకును, వాక్కునకును, తెలియు విషయము కాదని తమరు చెప్పిరి. ఇక అది ఎట్లు తెలిసికొనబడును?

స్వా. ప్ర.:- శ్రుతులు నిర్గుణబ్రహ్మోపాసనమునుకూడ వివరించినవి. ఈ విషయము పిప్పలాదుడు సత్యకామునకు తెలిపెను.

''ఏతద్వై సత్యకామ పరం చాపరం బ్రహ్మయదోజ్కారస్తస్మాదివ్వద్వానేతేన వాయతనే నైకతర మన్వేతి."

"ఓ సత్యకాముడా!" ఈ బ్రహ్మము, పర, అపర భేదముచే రెండు రకములుగా తెలియనగును. అది ప్రణవముయొక్క వాచ్యము. కావున విద్వాంసులు ఈ సాధనముచేతనే ఆ రెండు బ్రహ్మములలోను దేనినైన ఉపాసించవలెనని తలచెదరు." ఇట్లు ఉపాసన రెండు రకములు. భేదోపాసన, అభేదోపాసన.

## నిర్గుణ బ్రహ్మముయొక్క అభేదోపాసనము లే అహంగ్రహధ్యానము

నిర్గుణబ్రహ్మముయొక్క అభేదోపాసనము (అహంగ్రహధ్యానము) కూడ జ్ఞానమునకు సాధనము. కతిపయకారణములచే బ్రహ్మముయొక్క అపరోక్షజ్ఞానమును పొందని జనుడు అహంగ్రహధ్యానముద్వారా బ్రహ్మము యొక్క అపరోక్షజ్ఞానమును పొందవలెను.

"అహంబ్రహ్మాస్మి" - "నేను బ్రహ్మము" అను వృత్త్యాత్మకమగు ధ్యానము అహంగ్రహోధ్యానము. సగుణబ్రహ్మమునందుకూడ "అహంగ్రహధ్యానము" శాస్త్రములయందు పేర్కొనబడినది. "అకూంవిష్ణుః" మొదలగువాక్యములచే అనేక ప్రదేశములయందు ఈ విషయము ఉదహరించబడినది.

బ్రహ్మము "ఓం" కారాభిన్నముగా నెరిగి ప్రణవరూపమగు బ్రహ్మము నేను అని ప్రతిక్షణము నిరంతరము బ్రహ్మచింతనము చేయుట నిర్గుణబ్రహ్మము యొక్క అహంగ్రహధ్యానము. ప్రణవోపాసన అనేక ఉపనిషత్తులయందు ఉన్నది. కాని మాండూక్యోపనిషత్తునందును, దానిభాష్యమునందును విశేషముగ వివరించబడినది.

నిర్గుణబ్రహ్మము ప్రణవాభిన్నమని చింతనచేయువానికి జ్ఞానము ద్వారా మోక్షము కలుగును. సగుణబ్రహ్మమును ప్రణవముద్వారా ధ్యానించువానికి బ్రహ్మలోకము లభించును.

## ప్రణవముద్వారా అభేదోపాసనము

ఈ జగమునందలి కారణ, కార్యరూపముగల నామరూపాత్మక పదార్థములు అన్నియును "ఓం" కారస్వరూపము. పదార్థములు నామ రూపములను రెండుభాగములుగా నున్నను రూపము నామముకంటె వేరు కాదు. నామాత్మకమే. ఏలనన

నామము చేతనే పదార్థాకారము గ్రహించబడుచున్నది. నామములేనిదే పదార్థవ్యవహారము జరుగదనునది సర్వసాధారణ విషయము. కావున నామరూపముల రెండింటి యందును నామమవే సారముకలది. సాంసారికపదార్థముల ఆకార వినాశానంతరముకూడ నామము శేషించును. అంతమునందు నామముచే వ్యవహారములన్నియు జరుగును.

## ప్రణవాభేదముగా చేయబడు నిర్గుణబ్రహ్మచింతనము

ఇట్లు విచారించిన పదార్థములన్నియును సత్యమగు నామము కంటె భిన్నమైనవి కావనియును పదార్థములన్నిటి యొక్క నామధేయములును "ఓం" కారరూపమగు అక్షరముకంటె భిన్నమైనవి కావనియును తేలును. ఏలనన అతిప్రాచీననామము పరమేశ్వరునిదే. అది ''ఓం'' కారరూపము. జగమునందలి ఇతరనామధేయము లన్నియును ''ఓం'' కారమునుండియే ఉద్భవించినవి. "ఓం"కారము బ్రహ్మముయొక్క వాచకము. బ్రహ్మము "ఓంకార" వాచ్యము.

''తస్య వాచకః ప్రణవః'' అని పతంజలి భగవత్పాదులుగూడ నుడివిరి.

"ఓం"కారము సర్వపదార్థాభిన్నము. కావున ''ఓం''కారము, బ్రహ్మము వేరుకావు. ఏలనన సర్వపదార్థరూపము ''ఓం''కారము. అటులనే సర్వపదార్థ రూపము బ్రహ్మము. అందుచేతనే బ్రహ్మమునకును, "ఓం" కారమునకును భేదములేదు. ఆకారణముచే "ఓం" కారము వాచకము, బ్రహ్మము వాచ్యము. వాచర్యవాచకముల అభేదము స్వభావసిద్ధమే. ఆలాగుమునందు అధ్యస్తమని చెప్పవచ్చును. అధ్యస్తపదార్థము అధిష్ఠానభిన్నము కాదు. ఇటుల విచారించినను ''ఓం'' కారమునకును, బ్రహ్మమునకును భేదము లేదు. కావున ప్రణవాభేదరూపమగు నిర్గుణ బ్రహ్మమును చింతన చేయవలెను. ఈరీతిగా నిర్గుణబ్రహ్మోపాసనద్వారా ఈ అభేదచింతనము జ్ఞానమునను ఉపయోగించును.

## పంచాయతనోపాసన ప్రతీకోపాసన

పెద్ద. వి. :- ఈనాడు సాకార, నిరాకారములను రెండురకముల ఉపాసనాపద్ధతులు కానవచ్చు చున్నవి, సాకారము అనగా సగుణము; నిరాకారము అనగా నిర్గుణము. ఇక శాలిగ్రామాదులద్వారా చేయు పంచాయతనోపాసన సగుణోపాసన అనబడునా!

స్వా. ప్ర. :- ఈ అభిప్రాయము శాస్త్రపరిజ్ఞానము లేనిమూలమున కలిగినది. సగుణోపాసనయును నిర్గుణోపాసనయును నిరాకారునినే ఉపాసించుచున్నవి. మాయావిశిష్టుడగు దేవుడు సగుణుడు అనబడును. మాయారహితుడగు శుద్ధబ్రహ్మము నిర్గుణ బ్రహ్మము అని చెప్పబడును. శాలిగ్రామాది దేవపంచాయతనము సగుణమును కాదు, నిర్గుణమును కాదు. అది ప్రతీకము. ఆ ఉపాసన ప్రతీకోపాసన.

*యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్ ।*
*తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥*

అని కేనోపనిషత్తు చెప్పుచున్నది.

"దేనిని మనస్సుతో తెలిసికొనలేడో, దేనిద్వారా మనస్సు తెలియబడునో అదియే బ్రహ్మము అని తెలిసికొనుము. నీవు ఉపాసించు పరిచ్ఛన్నములగు పదార్థాములు బ్రహ్మము కాదు."

*యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి ।*
*తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥*

దేనిని కంటితో ఎవడును చూడలేడో, ఎవనిచే కన్నులన్నిటిని చూచుచున్నాడో అదియే బ్రహ్మము అని నీవు తెలిసికొనుము. ఈ పరిచ్ఛిన్నపదార్థములను ఉపాసించుట బ్రహ్మముకాదు."

ప్రతీకోపాసన వేదోక్తము, పురాణోక్తము అని రెండువిధములు. వేదోక్తమగు ప్రతీకోపాసన నాల్గువిధములు. 1. సంపదుపాసన, 2. ఆరోపోపాసన, 3. సంవర్గోపాసన, 4. అధ్యాసోపాసన. ఈనాడు ఆరోప, సంవర్గ, అధ్యాపోపాసనలు కానరావు. అల్పగుణవంతుడు అధికగుణశీలుని ఉపాసించుట సంపదుపాసన. ఇందుకూడ రెండు

విభాగములు కలవు. 1, అధ్యాత్మఉపాసన, 2. అధిదేవోపాసన.

వేదోక్తమగు అధ్యాత్మ, అధిదేవోపాసనలు

ఈ విషయమున ఛాందోగ్యము ఇట్లు చెప్పుచున్నది.

"మనో బ్రహ్మేత్యుపాసీత"

''మనస్సు బ్రహ్మము అని అనుకొని ఉపాసించుము."

ఇచట మనస్సు అల్పమైనది. దానియందు అధికత్వగుణమును చూచి - అనగా అది వ్యాపక బ్రహ్మము అని అనుకొని ఉపాసించుట ఆధ్యాత్మ సంపదుపాసన.

"ఆకాశో బ్రహ్మ"

"ఆకాశము బ్రహ్మము"

ఇచట ఆకాశము బ్రహ్మముకంటె అల్పమైనది. దానిని వ్యాపక బ్రహ్మముగా తలచి ఉపాసించుట అధిదేవసంపదుపాసన.

జనులబుద్ధి స్థూలమయిన కొలదియు సూక్ష్మ విషయములను ఆధారముగా తీసికొను సామర్థ్యము తగ్గినందున ఈనాడు వేదోక్తములగు ఆధ్యాత్మ, అధిదేవ సంపదుపాసనా పద్ధతులు పూర్తిగా నశించి పోయినవి.

## పురాణోక్తమగు ప్రతీకోపాసన

ఇక దానికిబదులు శాలిగ్రామాది పంచాయతనోపాసన వృద్ధి పొందినది. శాలిగ్రామము అల్పము. దానియందు అధికత్వబుద్ధితో అనగా వైకుంఠవాసియగు విష్ణువను బుద్ధితో ఉపాసించుటయును; నర్మదేశ్వరుడు అల్పము, అందు అధికత్వబుద్ధితో అనగా కైలాస వాసియగు శంకరుడను భావముతో నుపాసించుటయును; సూర్యుడు, జగదంబ, గణేశుడు, రాముడు, కృష్ణుడు మొదలగు విగ్రహములను ఉపాసించుటయును పురాణోక్తమగు ప్రతీకోపాసన.

జనులబుద్ధి స్థూలమగుటకు కారణముఏమి?

పెద్దవిద్యార్థి :- బుద్ధి వికసించుచున్నను ఆధునిక విజ్ఞానముచే ఆశ్చర్యకరములగు అనేక విషయములు కనిపెట్టబడుచున్నను, పూర్వముకంటె ఇప్పటిజనుల బుద్ధి అంతకంతకు స్థూలమగుచున్నదని తమరు చెప్పచున్నారు. ఇది ఎట్లు?

స్వా. ప్ర. :- మీ విజ్ఞానమునందుకూడ హిందూ దేశమునందలి ప్రాచీన శాస్త్రజ్ఞులు చేసిన పరిశోధనలు అపూర్వములు. గ్రహణాదులకు సంబంధించిన కఠిన గణితవిషయములు ఎప్పడో వారు చెప్పినవి ఇప్పటికిని నిజమగుచునే వున్నవి. ఈ విధముగనే వారు అనేకములగు పరిశోధనలు చేసిరి. కాని నేడు మనము వానిని కోల్పోతిమి.

## విజ్ఞానబుద్ధికిని అధ్యాత్మవిద్యాబుద్ధికిని భేదము కలదు

విజ్ఞానము, అధ్యాత్మవిద్య - ఈరెంటికిని వేరువేరుబుద్ధులు ఉపయోగించబడును. విజ్ఞానమునందు అత్యంతసూక్ష్మబుద్ధి కలవాడు ఆధ్యాత్మమునందుకూడ సూక్ష్మబుద్ధిని కలిగియుండునని చెప్పలేము. విజ్ఞానపరిశోధనకుసంబంధించిన బుద్ధి రాజసము. ఆధ్యాత్మ పరిశోధనలకు ఉపయోగించుబుద్ధి సాత్వికము. విజ్ఞానమునందు బుద్ధి సూక్ష్మ మగుచున్న కొలదియును ఆధాత్మవిద్య యందు స్థూలమగును. సత్త్వగుణప్రధానమగు బుద్ధి సూక్ష్మబుద్ధి అనబడును.

## జనులబుద్ధి స్థూలత్వమును పొందుటకు కారణము.

స్వా. ప్ర. :- పూర్వకాలమునందు సంతానమునకు వివాహము చేసికొనుచుండిరి. వారి జీవితము ద్రవ్యము లేకపోయినను గడిచెడిది. కాని రోజులు గడిచినకొలది ద్రవ్యము యొక్క అవసరము పెరిగిపోయినది. ఈ విధముగా ద్రవ్యాదిలోభముచేతను, దారాపుత్రాదులయందలి ప్రేమచేతను, బుద్ధి స్థూలమయిపోవుచున్నది. ఈ విషయమున యోగ వాశిష్ఠమున వశిష్ఠులవాక్యములు వినుడు.

*స్నేహేన ధనలోభేన లాభేన మణియోషితామ్ ।*
*అపాతరమణీయేన చేతో గచ్ఛతి పీనతామ్ ॥*

"కుటుంబాదులయందును ఇతరములను,

ఇతరములను అనేక భోగ్యపదార్థములయందును ప్రేమకలిగియుండుట చేతను, ధనలోభముచేతను, కాంతాదిస్థూలపదార్థములు లభించుటచేతను చిత్తము స్థూలత్వమును పొందును."

*అధివ్యాధివిలాసేన సమాశ్వాసేన సంస్థలౌ ।*
*హేయదేయప్రయత్నేన చేతో గచ్ఛతి పీనతామ్ ॥*

"అనేకరకములగు దుఃఖములచేతను, రోగాదులచేతను, సాంసారికపదార్థములయందు రమణీయబుద్ధియు, నిత్యత్వబుద్ధియు కలిగియుండుటచేతను దుఃఖదాయకములగు వానిని విడనాడవలెనను ప్రయత్నము ఉన్ననుకూడ చిత్తము స్థూలత్వమును పొందును."

*దురాశాక్షీరపానేన భోగానలబలేన చ ।*
*ఆస్థాదానేన చారేణ చిత్తాహిర్యాతి పీనతామ్ ॥*

"సర్పమునకు పాలుపోసి పెంచిన బాగుగా బలియును. విషము కూడ వృద్ధిని పొందును. అటులనే దురాశ అను పాలుద్రాగుట చేతను, భోగాగ్నియొుక్క బలముచేతను, సాంసారిక పదార్థముల యందు అస్తిత్వ బుద్ధి కలిగియుండుటచేతను, అనేక విధములను విషయభోగములను అనుభవించుటచేతను చిత్తము అను సర్పము స్థూలత్వమును పొందును."

ఈ విధముగా సామాన్యజనుల బుద్ధి స్థూలమగుచున్నది. కావున శాలిగ్రామ, నర్మదేశ్వరాదుల ఉపాసన వాడుకలోనిది వచ్చినది.

పెద్దవిద్యార్థి :- అందరకును ప్రతీకోపాసన కావలెనా?

స్వా. ప్ర. :- భగవానుడు మహాభారతమందలి ఉత్తరగీత యందు చెప్పెను.

*అగ్నిర్దేవో ద్విజాతీనాం, మునీనాం హృది దైవతమ్ ।*
*ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శినామ్ ॥*

"ద్విజులకు అగ్ని దైవము, మునులకు హృదయము దైవము. అల్పబుద్ధి కలవారలకు విగ్రహము దైవము. సమబుద్ధికలవారలకు దైవము ఎల్లడలను కలడు".

ఆ ఉత్తరగీతయందే మరియొుక చోట యిట్లున్నది.

*తీర్థాని తోయరూపాణి దేవాన్పాషాణమృణ్మయాన్ ।*
*యోగినో న ప్రపద్యన్తే ఆత్మధ్యాన పరాయణాః ॥*

"జలరూపమును పొందిన తీర్థములను, మృత్పాషాణాది విగ్రహ రూపములను పొందిన దేవతలను ఆత్మధ్యానపరాయణులగు యోగులు సేవించరు."

స్వా. వి. :- ఇతర శాస్త్రములుకూడ చెప్పచున్నవి.

పాషాణలోహమణిమృణ్మయ విగ్రహేషు
పూజా పునర్జన్మకరీ ముముక్షోః ।
తస్మాద్యతిః స్వహృదయార్చనమేవ కుర్యాత్
బాహ్యార్చనం పరిహరేత్ అపునర్భవాయః

"పాషాణము, ధాతువు, మణి (స్ఫటికాదులు) మృత్తిక మొదలగువానిచే తయారుచేయబడిన ప్రతిమలను పూజించుటచే ముముక్షువులకు పునర్జన్మమును, భోగములును కలుగును. కావున సన్యాసి తన హృదయమునందే దేవతార్చనము చేయవలెను. బహిరంగార్చనను త్యజించవలెను."

పెద్దవిద్యార్థి :- ఇంతకుముందు చెప్పిన శ్లోకము ప్రకారము బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యులకు అగ్ని దైవమనియును, మిగిలిన అల్పబుద్ధిశాలురకు- అనగా స్త్రీశూద్రాదులకు విగ్రహపూజనము విధివిహితమనియు తెలుచున్నది కదా! కాని నేడు ద్విజులే విగ్రహ పూజ చేయుచున్నారు. ఇది తగునా?

స్వా. ప్ర. :- పూర్వకాలమునందలి బ్రాహ్మణులు విద్యాతపస్సులచే ఒప్పచుండిరి. "పయోనిఖ్యాం బ్రాహ్మణః స్మృతః" అని శాస్త్రములు చెప్పచున్నవి. ఇట్టి తపశ్శాలురకు వారి యోగ క్షేమముల చింత ఉండెడిది కాదు.

*సశేషం*

# గణ్ గణ్ గణాత్ బోతే

ఎమ్. రాధాక్రిష్ణ

సెప్టెంబరు 2012

సహ్యాద్రి పర్వత శ్రేణులలోంచి మూకానా అనేనది ప్రవహిస్తుంది. ఆ నది ఒడ్డునే మనోహరమైన ప్రకృతిసౌందర్యంతో నిండిన "కపిలధార్" అనే క్షేత్రం వుంది. అక్కడకు ఎందరో సాధకులు వచ్చి రకరకాల యోగాభ్యాసాలు చేసుకుంటూ వుంటారు. రామచంద్ర గోవిందనిమోంకర్, యోగ రహస్యాలు తెలుసుకోటానికి, కపిలధార్ క్షేత్రానికి వెళ్ళాడు. ఎందరో సాధువులను విచారించి చూచాడు. తృప్తికరంగా ఎవ్వరూ యోగం గురించి అతనికి బోధించలేక పోయారు. నిరాశతో నిమోంకర్ తిరిగివెళ్ళిపోదామనుకుంటుండగా అతని దృష్టి ఋషిలాగా కన్పిస్తూ పద్మాసనంలో, ధ్యానస్థుడై కూర్చొనివున్న ఒక మహాత్మునిపై పడింది. నిమోంకర్ ఆయనముందే నమస్కరిస్తూ నాలుగు గంటలు నిల్చున్నాడు. చివరకు సూర్యాస్తమయమవుతూ నల్లని చీకట్లు అలుముకుంటుండగా, ఆయన కళ్ళుతెరచి లేచి వెళ్ళిపోబోయారు. నిమోంకర్ ఆయన పాదాలమీద పడ్డాడు. "ఓ మహానుభావా! నాకు యోగ రహస్యాలు తెలుసుకొని యోగినై పోవాలనివుంది. నాకున్న కొద్దిపాటి పరిజ్ఞానంతో నేనామార్గంలో పై మెట్టుకు వెళ్ళలేకుండావున్నాడు. దయవుంచి నాకు మార్గాన్ని బోధించండి" అని పవిత్రమైన హృదయంతో ప్రార్థించాడు. ఆయన ఆగి నిమోంకర్ వంక కొన్ని క్షణాలు చూచాడు. ఏమీ మాట్లాడకుండా క్రింద పడివున్న ఒక ఎర్రని రాతినొకదాన్ని తీసి నిమోంకర్ చేతుల్లో పెట్టి వెళ్ళిపోయాడు. ఆ రాయి గుండ్రంగా చాలా చిన్నదిగా వుంది. నిమోంకర్ దాన్ని తీసుకొని యింటికి వెళ్ళాడు. జాగ్రత్తగా పరీక్షించగా ఆ రాతిమీద ఏవో అక్షరాలు వ్రాయబడివున్నాయి. అలా కొన్ని నెలలు గడిచాయి. నిమోంకర్ నాసిక్ వెళ్ళాడు. అక్కడ అనుకోకుండా "కపిలధార్"లో కనిపించి రాయి యిచ్చిన యోగి మళ్ళీ కన్పించారు. నిమోంకర్ నమస్కరించి, మీరు ప్రసాదించిన ఆ రాయిని ఏమి చెయ్యాలో నాకు తెలియటంలేదు. దానిమీద ఏదో పదాలు వ్రాసియున్నాయి. వాటి అర్థం నాకు బోధించండి అని ప్రార్థించాడు. అప్పుడా యోగిమహారాజ్ "దానిమీద వ్రాసిన పదాలు యోగమార్గానికి ధృవతారలు, నిత్యం భక్తితో దానిని అర్చించు నీకు యోగం సిద్ధిస్తుంది" అని చెప్పారు. నిమోంకర్ ఆ మహాత్ముని పేరు, ఊరు అడిగాడు. అందుకాయన "ఆ మాత్రం తెలుసుకోలేవు? నేనిచ్చిన ఎర్రనిరాయి 'గణపతి' దేవుని సంకేతం. నేను నర్మదానది ఒడ్డున వుంటాను'', అంటూ అదృశ్యులయ్యారు. అక్కడినుంచి నిమోంకర్ ధూమాల్ అనే స్నేహితుని ఇంటికి వెళ్ళాడు. అక్కడ మళ్ళీ ప్రత్యక్షమయిన ఆ యోగి మహరాజ్‌ను చూచి ఆశ్చర్యపోయాడు. ధూమాల్‌ను ప్రక్కకు పిలిచి జరిగిన సంగతంతా అతనికి చెప్పాడు. ధూమాల్ నిమోంకర్‌తో యోగులకు అద్భుత శక్తులుంటాయి. వారు దేశకాలాలకతీతులు. వీరు సిద్ధపురుషులైన "శ్రీ గజానన్ మహరాజ్", అన్నాడు. నిమోంకర్ శ్రీ గజానన్ మహారాజ్‌కు నమస్కరించుకొని ఇంటికి వెళ్ళిపోయాడు. స్వామి యిచ్చిన రాతినర్చిస్తూ అతను యోగ సిద్ధులు పొందాడు.

అది 1878 సంవత్సరము ఫిబ్రవరి 23వ తేది. మహారాష్ట్రలోని షేగాం అనే గ్రామములో ఒక ధనవంతుని యింట బ్రాహ్మణ సమారాధన జరుగుతున్నది. ఎంగిలి విస్తళ్ళు దారి ప్రక్కన

పారేస్తున్నారు. వెంకట్, దామోదర్ అనేవారు, ఆ ఆకుల్లో మిగిలిన మెతుకులకోసం చేరిన కుక్కల మధ్య దిగంబరంగా కూర్చొని వాటితో పాటు మిగిలిన మెతుకులు తింటున్న 16 ఏళ్ళ యువకుణ్ని గమనించారు. ఆ వ్యక్తి ముఖవర్చస్సు చూడగానే వారికి దత్తాత్రేయులవారు గుర్తొచ్చారు. వారతనిని పిలిచి మంచి భోజనము పెట్టించారు. అతడు రుచినేమాత్రం పట్టించుకోక, అన్నింటిని ఒకటిగా కలిపి కొంచెము తిని ప్రక్కనేవున్న మురికి గుంటలోని నీటిలో తన దాహం తీర్చుకున్నాడు.

అనితికాలంలో ఆ యువకుడే "శ్రీ గజానన్ మహరాజ్"గా ప్రసిద్ధికెక్కారు. ఆయన ఎప్పుడూ "గణ్‌గణ్ గణాత్ బోతే, గణ్‌గణ్ గణాత్‌బోతె" అంటూవుండేవారు. అందుకనే ఆయనను ప్రజలు గజానన్ మహరాజ్ అని పిలిచేవారు. నిజానికి ఆయనెవరో, పేరేమిటో, ఊరేమిటో, ఎప్పుడు, ఎక్కడ, ఎవరికి పుట్టాడో తెలిసినవారెవరూ లేరు.

అది 1909 సంవత్సరము, శ్రీ గజానన్ ఆరోగ్యం క్షీణించసాగింది. ఆ రోజు వినాయక చవితి కావడం శ్రీ గజానన్ మహరాజ్ భక్తులందరిని పిలిచి, "భక్తితో పూజ చేయండి, తర్వాత విగ్రహాన్ని నీటిలో కలపండి" అని చెప్పారు. భక్తులంతా ఏక కంఠంతో "మీరే మా గణేశులు; మీకే పూజ చేస్తాం అని ఆయనను పూజించారు. మరుసటి ఉదయం తిరిగి అందరు భక్తులను సమావేశపరచి శ్రీ గజానన్ యిలా అన్నారు". ఈ దేహయాత్ర చాలించబోతున్నాము. మీతో వుంటాను" అని వారు పద్మాసనంలో కూర్చొన్నారు. కాసేపటికి శరీరం చల్లబడి బరువెక్కింది. సూర్యుడస్తమించాడు, తరువాత భక్తులు ఆయన దేహాన్ని వూరేగించి ఆశ్రమంలో వారు ముందుగా సూచించివున్న ప్రదేశంలో సమాధి చేశారు. తమ పేరేమిటో, ఎవరికి తెలియని, ఆయన నామ రూపరహితమైన తత్త్వంగా నిలిచారు.

# శ్రీ గురు చరిత్ర

## కృతజ్ఞతార్చన

శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్

సెప్టెంబరు 2012

గురుబంధువులందరికీ నమస్కారం. ''శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతార్చన'' రానున్నది. ఆపదలనుంచి, కష్టాలనుంచి ఎందరెందరినో రక్షించి, ఎందరికో దత్త దర్శనాన్ని ప్రసాదించి, ఎందరినో పరిపూర్ణులుగా మలచి, ఎందరికో మహనీయుల ఆశీస్సులు లభించేలా చేసి మానవజాతిని-మనందరినీ రక్షిస్తున్న "శ్రీ గురుచరిత్ర" గ్రంథం మనందరికీ పూజనీయం. శ్రీ దత్తానుగ్రహం వలన, శ్రీ సాయినాధుని అనుగ్రహం వలన, గురు దంపతులైన శ్రీ అలివేలుమంగా సమేత భరద్వాజ మహరాజ్ కృపవలన గతసంవత్సరం శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతార్చన మహోత్సవం శ్రద్ధా భక్తులతో దేశమంతటా జరుపుకోగలిగాము. అలానే ఈ సంవత్సరం కూడా సెప్టెంబరు మొదటి ఆదివారం, అంటే సెప్టెంబరు 2వ తారీఖున, ''శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతార్చన'' జరుగనున్నది. ఈ మహాగ్రంధం మనందరికీ ఎంతటి మేలు చేసిందో గుర్తుంచుకొని, శ్రీ దత్త స్వామికి, శ్రీ సాయినాధునికి, శ్రీ భరద్వాజ మహరాజ్‌కూ ఈ గ్రంధమంటేనూ, ఈ గ్రంధ పారాయణ అంటేనూ, అలా చేసేవారంటేనూ ఎంత ఇష్టమో గుర్తించి, భక్తి శ్రద్ధలతో మనందరమూ ఈ గ్రంధాన్ని కృతజ్ఞతతో అర్చించ వలసి ఉన్నది. ఏ ఇంట్లోవారు ఆ ఇంటిలోనూ, ఏ వీధివారు ఆ వీధిలోనూ, ఏ సత్సంగ బృందంవారు ఆ సత్సంగంలోనూ ఈ గ్రంధానికి సామూహిక పూజ నిర్వహించి, క్రొత్త వారికి ఈ గ్రంధాన్ని పరిచయం చేసి, వారుకూడా శ్రీ దత్తానుగ్రహాన్ని పొందే అవకాశం కల్పించడం మన విధి. దేశమంతట, ప్రపంచమంతట ప్రతి ఇంటిలోనూ ఈ కృతజ్ఞతార్చన చక్కని సాంప్రదాయంగా నెలకొని ప్రతీ సంవత్సరమూ ప్రతి ఇంటిలోనూ, ప్రతి వీధిలోనూ శ్రీ గురుచరిత్ర గ్రంధానికి కృతజ్ఞతార్చన జరగాలన్నది సంకల్పము. తదనుగుణంగా మనమందరమూ ఒకే సమయానికి "శ్రీ గురు చరిత్ర" మహాగ్రంధానికి ఒకే రీతిన అర్చించవలసి వుంటుంది. ఈ అర్చన వ్యక్తిగతంగానూ, ఏ కుటుంబం వారు ఆ కుటుంబంలోనూ, అర్చించి, తోటివారిని ఆ అర్చనకు ఆహ్వానించుకుని తీర్థ ప్రసాదాలు యిచ్చి, గ్రంధాన్ని పరిచయం చేసి



పంపగలిగితే ఎంతో మందికి ఎంతో మేలు జరుగుతుంది. అంతేగాక సత్సంగ సభ్యులందరమూ సామూహికంగా అర్చన చేయవలసి ఉంటుంది.

అందుకు అనుగుణంగా ఈ క్రింది కార్యక్రమ నియమావళి ఏర్పరచబడింది.

ఇలా సామూహికంగా ఉదయం "శ్రీ గురు చరిత్ర" మహాగ్రంథాన్ని అర్చించి, ఎవరి వసతిని బట్టి వారు సాయంత్రం తమ తమ గృహాలలో, ఇరుగుపొరుగు వారిని ఆహ్వానించి ఈ గ్రంథాన్ని తిరిగి పూజించి ఉపోద్ఘాతం చదివి వినిపించడం ఎంతో శ్రేయస్కరం. వీలున్నవారు ఈ గ్రంథ రాజానికి నగర సంకీర్తన మొదలైన కార్యక్రమాలు సాయంత్రం జరుపుకొనడం ఎంతో మంచిది. స్థానిక మందిరాలలో విరివిగా ఈ గ్రంథాన్ని పారాయణ చేయించడం, క్రొత్తవారికి ఈ గ్రంథాన్ని పరిచయం చేయడం, గ్రంథాలను పేదలకు ఉచితంగా పంచడం కూడా ఎంతో శ్రేయస్కరం.

## శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతా మహోత్సవము జరుపుకునే విధానము

- *ఈ సంవత్సరమునకు సెప్టెంబరు 2వ తారీఖున (సెప్టెంబరు లోని మొదటి ఆదివారము గనుక) శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతార్చన దినముగా ప్రకటించడమయినది.*
- *గురుబంధువులు, సత్సంగ సభ్యులు, భగవత్ భక్తులు సామూహికంగా, అలా కుదరని పక్షాన తమ తమ గృహములయందు ఈ వుత్సవాన్ని జరుపుకొనవచ్చును.*
- *ఉదయం సరిగ్గా 10 గం॥లకు పూజ ప్రారంభించుకోవాలి.*
- *ఇతర దేశములవారు తమ వీలునుబట్టి ఇదే రోజున ఈ విత్సవము జరుపుకొనగలరు.*
- *మొదట రంగవల్లుల పై చక్కని పీఠాన్ని అమర్చుకొని, దానిపై ఒక తెల్లటి వస్త్రాన్ని పరుచుకోవాలి.*
- *తరువాత అట్టి ఆసనంపై శ్రీగురు చరిత్ర గ్రంథరాజాన్ని ఆశీనం చేయాలి.*
- *భక్తులందరూ ఈ గ్రంథరూపంలో సాక్షాత్తు శ్రీగురుడే ఆశీనులై వున్నారని హృదయపూర్వకంగా భావన చేసుకోవాలి. ఈ భావన నిలబడేటట్లు తదనుగుణమైన కొన్ని లీలలను మననం చేసుకోవాలి.*
- *గ్రంథ, పుష్ప సహితంగా శ్రీ సాయినాథ పూజ గ్రంథములో వివరించినట్లు శాస్త్రోక్తముగా, భావయుక్తంగా అష్టోత్తర నామావళితో పూజించుకోవాలి.*
- *నైవేద్యముతోపాటు అన్ని ఉపచారములు శ్రద్ధగా చేసుకోవాలి.*
- *ఇంత అత్యుత్తమ మార్గాన్ని అందించిన పూజ్య గురుదేవులకు భక్తి శ్రద్ధలతో మంగళ హారతి చేసుకోవాలి.*

ఈ విధంగా మాస్టర్‌గారివలన, వారి రచనలవలన, శ్రీ గురుచరిత్ర గ్రంథం వలన, ఇహపర శ్రేయస్సును పొందుతున్న మనమందరం శ్రద్ధాభక్తులతో, కృతజ్ఞతతో ఈ 'శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతార్చన'లో పాల్గొని సద్గురు అనుగ్రహానికి పాత్రులం కాగలమని ప్రార్థన.



# ఇంద్రియానుభవం - దాని వాస్తవికత - 1

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సెప్టెంబరు 2012

మనకు నిత్యమూ గోచరమయ్యే వస్తువునుదాహరణగా తీసుకుందాము - ఒక బల్లగాని, రాయిగాని, అది కొన్ని ధర్మాలు కలదిగా తలుస్తాము - రంగు, బరువు, ఘనత, రుచి, వాసన, స్పర్శలాంటివి. అసలీ ధర్మాలు ఆ వస్తువుకు స్వతస్సిద్ధంగా ఉన్నాయా లేదా వాటికీ తక్కి వస్తువులకూ ఉండే సంబంధమేనా (Relation) అని బాగా యోచిస్తే ఆ ధర్మాల తత్త్వమే అదృశ్యమౌతుంది. 'ఇది బరువుగా ఉన్నది' అన్నప్పుడు దానికీ, ఇతర వస్తువులకూ వుండే సంబంధాన్ని చెప్తాము. ఇంకొక దానికంటె అది బరువైనది, మరోదానికంటె తేలికైనదిగా ఉంటుంది. అసలు బరువే దానికీ మన అవయవానికీ (చేతికీ లేక దేహానికీ) వున్న సంబంధము లేక నిష్పత్తి మాత్రమే. ఆ వస్తువునకు, దానిని తూచే యంత్రానికీ గల సంబంధమే బరువు. ఇంకోలా చెప్పాలంటే దానికీ భూమి అనబడే మరో వస్తువుకు గల సంబంధమే. ఆ రాయి పెద్దదో, చిన్నదోనన్నపుడు గూడా చిన్నవాటికంటె పెద్దది, అంతకంటె పెద్దవాటికంటె చిన్నదిగదా! కనుక బరువు, పెద్ద అన్నవి స్వతస్సిద్ధమైన ధర్మాలు కావు. దానిని మనం గమనించే తీరు మాత్రమే ఆ విశేషణాలకాధారం. వేడిమి, చల్లదనం, అందం, వికారం, అనే ధర్మాలూ అంతే. ప్రతి వస్తువు విరుద్ధ ధర్మాల మధ్య ఊగులాడుతోంది మన అవగాహనలో! ఒకే వస్తువు చిన్నవాటికంటె పెద్దది. పెద్దవాటికంటె చిన్నది! చిన్న-పెద్ద, గురు-లఘు, వేడి-చల్లన, అందం-వికారం అనే ధర్మాలసలు వస్తువుకు లేవు. అవి మన అవగాహనశక్తి పనిచేసే రీతులు మాత్రమే. యదార్థంగా వున్న ధర్మాలుగా మనం గమనించడం కాదు జరిగేది. యదార్థాన్ని మన ఇంద్రియ మనస్సులీరీతిగా గుర్తించి విభజిస్తాయి. అయితే ఆయా ధర్మాల ద్వారా తప్ప ఆ వస్తువు ఉనికి మనకవగతం కావడానికి వీలులేదు. ఇంతకూ ఆ వస్తువలా ఉన్నదని ఎలా చెబుతాం? 'ఆ వస్తువు' అంటేనే 'ఆయా ధర్మాలు గల...' అని అర్థం కదా! అపుడా వస్తువు ఉండడం మనం అనుభవమేనా లేక ఉన్నదా? మన అనుభవానికైనా 'ఉన్నది' అనడానికాధార మేమి చెప్పగలం? మన అనుభవమంతా ఇలాంటి అవాస్తవిక విశేషణాల సంపుటే గదా! ఒక్కొక్క ధర్మము 'మన ఇంద్రియ మనస్సుల అవగాహనా రీతిలో గల లక్షణమే గానీ వస్తువుది కాదు' అంటూ తొలగించిచూస్తే చివరికి ఆ వస్తువు ఉన్నదనడానికేమీ మిగలదు.

'ఈ గుణాలేవీ లేనిదీ, కానీ మన ఇంద్రియ మనస్సులకు ఇట్టి అనుభవాలను, కల్పించేది ఉన్నది' అందామా అంటే ఆ 'ఉన్నదాన్ని' గురించి మాటలలో చెప్పడం సాధ్యం కాదే! పోనీ 'రూపగుణాలు లేనిదది' అందామా అంటే అన్ని వస్తువులకూ అదేగతి పడుతుందే!

కనుకనే ప్లాటో (Plato) అనే ప్రఖ్యాత గ్రీకు తత్త్వవేత్త నిత్యజీవితంలో మనకనుభవమయ్యే వస్తువులేవీ పూర్తిగా వాస్తవాలు అనడానికి వీలులేదనీ, వాస్తవమంటే దేనిని గురించి మనకు నిశ్చయమైన జ్ఞానం కలదో అదేననీ చెప్పారు.

యోచిస్తే దేనిని గురించైనా సరే నిశ్చయించి చెప్పలేక పోతున్నామే!

'నిత్యజీవితంలో గోచరించే వస్తుజాలం గురించి సైన్సు ఎన్నో విషయాలను తెలుపుతుంది. గనుక అవి ఉన్నాయి అని అంగీకరించాలి' అనడం సరికాదు. ఉదాహరణకు భౌతిక, రసాయనిక శాస్త్రాలు మనకిచ్చే విజ్ఞానాన్నే తీసికొనండి. ఆ విజ్ఞానం దేనిని గురించి? దేనికి సంబంధించినది? - అని అడిగితే దాదాపు అందరు శాస్త్రజ్ఞులు 'వేము చెప్పే విజ్ఞానమంతా వస్తువులు, ప్రకృతి క్రియల (Phenomena) పరస్పర సంబంధాలను వర్ణించేదే' అంటారు. ఉదాహరణకు ఉదజనికీ - ప్రాణ వాయువుకూ; వాటికీ - ఇతర మూలకాలకూ, వాటి మిశ్రమాలకూ ఉన్న సంబంధాన్నే చెబుతుంది రసాయన శాస్త్రము. కాని అసలు 'ప్రాణవాయువు ఏమిటి?' అన్నది చెప్పలేదు. అలానే రెండు వస్తువుల మధ్య పరస్పరాకర్షణ తత్త్వాన్ని వర్ణిస్తుంది భౌతికశాస్త్రం. కాని 'ఆ వస్తువుల యొక్క వాస్తవ తత్త్వమేమిటి?' అంటే చెప్పలేదు.

వస్తువులు, పదార్థాలు పరమాణు సముదాయాలనీ, అణువులు శక్తివలయాలనీ చెబుతాయి గానీ అసలు ఆ శక్తి అంటే ఏమిటి? దాని నిజరూపం ఎలాంటిది? అంటే చెప్పలేవు. మొదట మనమొక బల్ల, రాయి వంటి వస్తువుల గురించి వేసిన ప్రశ్నలే ఈ శక్తి గురించి వస్తాయి; ఆ ప్రశ్నలూ అలానే సమాధానం చెప్పలేనివిగా మిగిలిపోతాయి! కారణం ఆ శక్తి గురించి చెప్పాలంటే కొన్ని విశేషణాలను వాడవలసివస్తుంది. కాని విశేషణాలెంత అర్థరహితాలో చూచాము కదా! ఆ విశేషణాలను త్రోసివేసి యదార్థతత్త్వాన్ని తెలుసుకోగలమా అంటే ఆ అవకాశమేమీ లేదే!

ఈ పరిశీలన యొక్క పర్యవసానమేమిటి? ఏ వస్తువైనా దాని లక్షణాల యొక్క సంపుటిగా తప్ప గోచరం కాదు; ఆ లక్షణాల తత్త్వాన్ని పరిశీలిస్తే అవి స్వతస్సిద్ధమైన పదార్థాలు కావనీ, మన అవగాహనా రీతిలోని ప్రత్యేకతలనీ తెలుతుంది.[1]

ఇంద్రియ గోచరమయ్యే ఆ సృష్టి నిజంగా అలాలేదనీ, అసలేమున్నదో ఎలా ఉన్నదో తెలియడానికి ఈ ఇంద్రియ మనస్సుల అవగాహన చాలదనీ ఋజువైంది. మన భౌతిక హేతు నాస్తికవాదులు కాధారమైనది నిరాధారమైనది. ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పి వారు వాదంలో ముందుకు సాగాలి. హేతువాదం తన తలకు తానే కొఱివి పెట్టుకొంది!

మనకూ, ఈ గోచరించే జగత్తుకూ ఆధారం ఏదో ఒకటి ఉండి తీరాలి. మన ఇంద్రియ మనస్సులమీద ఇట్లాంటి ప్రభావాన్ని కలిగించేది ఏదో ఉండి తీరాలి - దాని తత్త్వాన్ని మన ఇంద్రియ మనస్సులు గుర్తించలేక పోయినా, దానినే 'దైవం', 'ఆత్మ' అన్నారు ఋషులు, ఆధ్యాత్మవేత్తలు. అది అవాఙ్మానస గోచరము, అవిత్క్యము, అనిర్వచనీయమూ అన్నారిందుకే. అయితే ఇంద్రియ మనస్సులు తప్పిస్తే ఇక జ్ఞానానికి మార్గమేలేదని నిరాశావాదులలాగా వారు ముందే తలుపులు మూసుకోలేదు. ఈ సమస్యను గూర్చి నూతనమైన రీతిన పరిశోధన చేసి, వీటికన్యంగా జ్ఞానం కలుగవచ్చుననీ, అయితే ఇంద్రియ మనస్సుల ద్వారా మాత్రమే వచ్చే స్థూల (లేక మిథ్యా) జ్ఞాన పరిభాషలోని పదాలలో అది ఇమడదనీ చెప్పారు.

---

[1] *అయితే వస్తువులందరికీ ఒకేరీతిగా ఎందుకు కనిపిస్తాయి? – అనడుగుతారేమో! సుమారు ఒకే నిర్మాణం గల ఇంద్రియ దేహ మనస్సులు కలిగి ఉండడం వల్ల – అని చెప్పవలసిందే. నిజానికి అందరికీ అన్నీ ఒకే రీతిన గోచరించవనీ, స్వల్ప భేదాలు వారి ఇంద్రియ నిర్మాణ భేదాల వల్ల ఉంటాయనీ, ఈ భేదాలు మనం స్థూలంగా గుర్తించడానికి వీలులేని రీతిగా ఉంటాయనీ అంటారు ఆధునిక శాస్త్రవేత్తలు.*

## Books on Sri Ramakrishna Paramhansa and Swami Vivekananda

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 |
| భారతం నా అమర భారతం | 20.00 |
| జ్ఞాన యోగం | 30.00 |
| బుద్ధి యోగం | 15.00 |
| కర్మ యోగం | 15.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 |
| స్వామి వివేకానంద (2 భాగాలు ) | 60.00 |
| మహాభారతం | 5.00 |
| నా అమర సందేశం | 30.00 |
| భక్తి యోగం | 10.00 |
| సందేశ తరంగిణి(కొలంబో-అల్మోరా) | 40.00 |
| వివేక సూర్యోదయము | 20.00 |
| దైవంతో సహజీవనం | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 |
| మువివేకానంద లేఖావళి | 25.00 |

| | |
|---|---|
| My Idea of Education | 34.00 |
| Karma Yoga | 18.00 |
| God Lived with Them | 170.00 |
| The Lived with God | 140.00 |
| Raja Yoga | 36.00 |
| Bhakti Yoga | 16.00 |
| Jnana Yoga | 50.00 |
| Letters of Swami Vivekananda | 110.00 |
| Reminiscences of Swami Vivekananda | 100.00 |
| Talks with Swami Vivekananda | 58.00 |
| Complete Works of Swami Vivekananda-9 | 110.00 |
| Meditation and Its Methods | 18.00 |
| Vivekananda on Himself | 100.00 |
| Ramakrishna and Vivekananda | 7.00 |
| Tales and Parables of Sri Ramakrishna | 45.00 |
| Lectures from Colombo to Almora | 40.00 |
| Complete Works of Swami Vivekananda | 50.00 |
| Sayings of Sri Ramakrishna | 25.00 |

జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయిమాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయిమాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు-పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine Subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone :040-20063300
**OR, Sri Manga Bharadwaja Trust , Ongole Branch Office**
Kothapeta, Kondaiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.** **Magazine** మరియు **General Donations** ను **"Sri Manga Bharadwaja Trust"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Annadanam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Sai Master)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

**Ashramam Donations** ను **"Sri Manga Bharadwaja Trust (Peace Foundation)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల్వారా పంపగలరు

**Books order** ను **"Sri Manga Bharadwaja Trust (Publications)"**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D.ల ద్వారా పంపగలరు

పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్మ్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

## ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

## BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

## BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300

**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**

*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*



గురుపత్ని శ్రీమతి అలివేలు మంగమ్మ జన్మదిన మహోత్సవము

అక్టోబర్ 1, 2012



# అక్టోబర్ 30, 2012

## ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్

## 74వ జన్మదిన మహోత్సవం

రానున్నది! అందరూ సిద్ధం కండి!!

edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust,
ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.

POSTAL REGD.NO.PRAKASAM/16/2012-2014
REGD.NO. 37926/83
ESTABLISHED : 1983
OCTOBER 2012
సంచిక : 06 సంపుటి : 30

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక



## ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహారాజ్

75వ జయంతి మహోత్సవ ప్రత్యేక సంచిక


పూజ్య గురుపత్ని శ్రీమతి అలివేలుమంగమ్మ గారి జన్మదిన
సందర్భంగా యావత్ ప్రాణికోటికి సకల శుభాలు కలిగేలా
అనుగ్రహించమని ప్రార్థన.



శ్రీనిధిం నిధిరవ్యక్తం నిర్ద్వంద్వం నిశ్చలం విభుం
కేవలం విపులం సాక్షిం భరద్వాజమహం భజే ।
భయక్లేశహరం శాంతం వైరాగ్యాది సుభూషితం
సాయిశిష్యం మునిశ్రేష్ఠం భరద్వాజమహం భజే ।
రచనామృత దాతారం వచనామృత సాగరం
బోధనామృత రూపం తం భరద్వాజమహం భజే ।
ద్వాదశాక్షరి స్వరూపం తం విశ్వరూపవిరాజితం
కాలరూపం విరూపాక్షం భరద్వాజమహం భజే ।
జగదీశ్వరం కవీందేవం అనసూయాత్రినందనం
వేదగమ్యం పరమపురుషం భరద్వాజమహం భజే ॥

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంపుటి: 30 | అక్టోబర్-2012 | సంచిక: 06

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


SRI MANGA BHARDWAJA TRUST

*పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన "సాయిబాబా"*

## విషయసూచిక




<u>చిరునామా</u>

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**



చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి

ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ ఆర్.ఎస్. శశిధర్, పిహెచ్. డి


**<u>చందా వివరములు</u>**

| | | |
|---|---|---|
| విడిప్రతి | : రూ. | 10-00 |
| సంవత్సర చందా | : రూ. | 100-00 |
| రాజపోషకులు | : రూ. | 3,000-00 |
| మహారాజపోషకులు | : రూ. | 5,000-00 |

*"చిరకాలం నిలిచియుండాలంటే ఆధ్యాత్మికత కేవలం వ్యక్తిగతమైన భక్తిగా మాత్రముండక ఒక నిర్దుష్టమైన సిద్ధాంతంగా రూపొందాలి. ఇందులో ఎంతటి మహనీయులైన వారి వ్యక్తిగత్వాలకు ప్రాధాన్యముండరాదు."*

- ఆచార్య ఎక్కిరాల భరద్వాజ

# విజయదశమి సందేశం



*శ్రీ సాయిబాబాకు ఉత్తముడైన గురువు లభించడంతో మానవజాతియొక్క ఆధ్యాత్మిక చరిత్రలో ఒక నూతనమైన అధ్యాయం ఆరంభమయింది....*

**ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

# విజయదశమి సందేశం

వేదకాలంలో గురు-శిష్య సాంప్రదాయానికి ప్రతీకగా వేదధర్ముడు - దీపకుడు - ధౌమ్యులవారు - అరుణి, బైదుడు, ఉపమన్యువులు శాశ్వతమైన కీర్తి గడించారు. అలనాటి ఆ సాంప్రదాయం మరల సాయిబాబా-వారి గురువురూపాలలో పునరావృత్తమయింది. కేవలం గురుకృప వలన, వారిని హృదయ పూర్వకంగా సేవించిన శిష్యుడు సర్వజ్ఞుడవడం వీరిలో చూడవచ్చు. అంతేగాదు, దక్షిణామూర్తి కేవలం తన మౌనమనే వ్యాఖ్యద్వారా తమ శిష్యుల సర్వ సంశయాలను విచ్ఛినంచేసి జ్ఞానులుగా రూపొందించిన లీల మరలా ఈ గురు శిష్యుల విషయంలో తిరిగి ప్రాణంపోసింది. సూఫీ సాంప్రదాయంలో భారతదేశంలో విజయంచేసిన ముస్లిం మహాత్ములందరికీ తలమానికమనదగిన ఖాజా మొహిద్దీన్ చిస్తీ (అజ్మీర్) గారికి, వారి గురువుకు మధ్య నడిచిన గురులీలగాని, లేక ఖాజా మోహిద్దీన్ చిస్తీ మరియు వారి శిష్యులకు మధ్య నడిచిన లీలగూడ సాయిచరిత్రలో పునరావృత్తమయింది. అంటే

సాయి చేసిన గురుసేవ పరిపూర్ణమై, ఆయన శిరిడీలో వేపచెట్టుక్రింద ప్రకటమవడంతో మానవచరిత్రలో మరొక యుగం ఆరంభమైంది. తర్వాత 58 సం॥లు నడిచాక అక్టోబర్ 15, 1918న వారు మహాసమాధి చెందటంతో మరొక ఘట్టం ఆరంభమయింది. ఆ విషయమున 1916లో విజయదశమినాడు, "ఈరోజే నా సీమోల్లంఘనము!" అని ముందుగా చెప్పి సూచించారు. శిరిడీలో వున్న తమ ఐదున్నర అడుగుల శరీరమే తాముగామని, తామే అన్ని రూపాల్లోనూ సర్వత్రా సంచరిస్తున్నామనీ, "నీవుచూచేదంతా కలిసి నేను" అనీ, "ఈ విశ్వమంతా నాలోనేవున్నది" అనీ ఎంత చెప్పినా ఎన్ని లీలలద్వారా తెలియబరిచిచూచినా, మానవజాతి మాత్రం తన అజ్ఞానపు సీమలు ఉల్లంఘించలేకపోయింది. కనుక 1918లో విజయదశమినాడు మనందరి తరఫునా ఆయనయే సీమోల్లంఘనం చేశారు. శిరిడీ అనే భౌతిక కేంద్రంనుండి తమశక్తిని ప్రసరింపచేయడంమాని, భక్తులు ఎక్కడ తలిస్తే అక్కడే తమలీలలరూపంలో

*పరిపూర్ణమైన అర్హతగల సాయికి వారి గురువు ఒక్క లీల గూడ చూపలేదు. సరిగదా, బావిలో తలక్రిందులుగా వ్రేలాడదీయటం ఒక్కటే ఆయన చూపిన ప్రేమ. సాయి మనకు యిన్నిలీలలు చూపుతున్నా, లెక్కలేనంతమంది దీపపు పురుగులలా ఆయన చెంతకుచేరుతున్నా, యిందరిలోవారి శిష్యుడని చెప్పుకోదగిన వారు ఒక్కరుగూడాలేరు.*

సాయిబాబా చరిత్రలో మత సామరస్యమన్నది వారి శుశ్రూషతోనే ఆరంభమయింది. సాయివలె వారి గురువుగూడ ఏమతానికి చెందినవారో, వారి పుట్టుపూర్వోత్తరాలేమిటో ఎవరికీ తెలియదు. వారిపేరు రోషన్‌షా అనికొందరితోను, వెంకుసా అని మరికొందరితోనూ సాయి చెప్పారు.

సాయి ప్రకటమవసాగారు. భక్తుల హృదయాలలోనే వారి సీమోల్లంఘనం జరిగింది. అందుకే ఆయన,"నా సమాధి (అదృశ్యంగా) నా భక్తుని చెంతనుండి కాపాడుతుంటుంది" అని చెప్పారు. ఒక్కమాటలో చెప్పాలంటే-మానవాళిపై వారి ప్రేమ మహత్తరమైన వారి

దివ్యశక్తి సంభవాసంభవాలనే సీమలను ఉల్లంఘించి పరవళ్ళు తొక్కుతున్నాయి. ఈనాడు సాయంకాలపుటాకాశంలో ప్రకటమయ్యే నక్షత్రాల లాగా-సాయిమందిరాలు దేశమంతటా వెలుస్తున్నాయి.

ఆకాశంలోని ఆ నక్షత్రాలు అంతటా వెలగడానికి రాత్రి యొక్క చీకట్లే కారణం. శ్రీ సాయి లీలలు యింతగా ప్రకటమవడానికి కారణం మనలోని అనర్హతలే! పరిపూర్ణమైన అర్హతగల సాయికి వారి గురువు ఒక్క లీల గూడ చూపలేదు. సరిగదా, బావిలో తలక్రిందులుగా వ్రేలాడదీయటం ఒక్కటే ఆయన చూపిన ప్రేమ. సాయి మనకు యిన్నిలీలలు చూపుతున్నా, లెక్కలేనంతమంది దీపపు పురుగులలా ఆయన చెంతకుచేరుతున్నా, యిందరిలోవారి శిష్యుడని చెప్పుకోదగిన వారు ఒక్కరుగూడాలేరు.

"నావద్దకన్నీ చెల్లని నాణాలే వస్తున్నాయి!" అన్నారాయన. అందరూ తమ వారేయైనప్పటికీ వారిలో కొందరు దొంగలవుతున్నారనీ, కనుక వారికి తావేమీచేయలేకున్నామనీ ఆయనన్నారు. ఈ ప్రపంచం వెనుకటిలాగాలేదనీ, ప్రతివారికీ ఇతరుల గురించి చెడుగా తలచడవే స్వభావ సిద్ధమవుతున్నదనీ ఆయన చెప్పారు. "సాయిని ఆశ్రయించిన వారందరూ పరమార్థంపొందుతారా?" అని బాపూసాహెబ్ జోగ్‌కు కల్గిన సందేహానికి ఆయనిచ్చిన సమాధానం: ఎక్కువమంది మామిడి పూత వలె రాలిపోతారనీ, కొద్దిమంది మాత్రమే చెట్టునంటిపెట్టుకున్న కొద్ది మామడి కాయల వలె తమనంటి పెట్టుకుని కృతార్థులవుతారనీ ఆయన చెప్పారు. అయితే తాము మాత్రం తమనాశ్రయించిన వారినెవరినీ విడిచి పెట్టక ఏనాటికైనా గమ్యం చేరుస్తామని అభయమిచ్చారు. అందుకు అవసరమైన లీల తమ సమాధి నుండే చేస్తామని ఆయన ఎన్నోరీతుల చెప్పారు. అవసరమైనప్పుడు ఈనాటికీ ఆయన పాంచభౌతిక రూపంలో ఎందరెందరో భక్తులకు దర్శన మిస్తూనే వున్నారు. ఈ విషయం తమ సహజ నిగూఢరీతిన ఒకప్పుడు ఆయన చెప్పారు: ఆయన తమ కాలిపై చిన్న మచ్చను భక్తులకు చూపి, "నాకు నారికురుపులేచింది. నేను నారిని తీసివేయటానికి ప్రయత్నిస్తే అది తెగి, మరల నారి కురుపొచ్చింది. అది నేను స్వస్థానానికి వెళితేగాని తగ్గదని విన్నాను. అయితే ఆ విషయం అల్లాహ్‌కే విడచి పెట్టాను" అని చెప్పారు. "అందరినీ మంచి మార్గానికి మరల్చడమో, లేక నాశనం చేయడమో జరగాలని అల్లాహ్‌ను ప్రార్థిస్తున్నాను. కాని ఆయన నా ప్రార్థన ఆలకించడంలేదు. కానీ నేను చచ్చినా, బ్రతికినా అనుకున్నది సాధించి తీరుతాను" అన్నారని ఖాపర్డే తన డైరీలో వ్రాసాడు. అంటే శ్రీ సాయి మహాశక్తి స్వరూపమన్న మాట. మనలోని రాక్షసులతో ఆయన ప్రేమయుద్ధం అనేలీల కొనసాగిస్తున్నారన్నమాట. చివరకు విజయదశమిరాక తప్పదు; మహిషాసుర మర్ధన, శిష్టరక్షణతప్పదు. బంధు, మిత్రులపై మమకారంతోను, దురహంకారంతో గూడిన దౌష్ట్యంతోనూ అలనాడు మహిషాసురుడు, రావణ కుంభకర్ణాదులు, ధృతరాష్ట్రుడు, దుర్యోధనాదులు మొ॥న వారిలో వున్న రాక్షసగుణంమనలో గూడ విజృంభిస్తే చివరకు యీ సాయిలీలలో మనకు సర్వనాశనం తప్పదు. అలాగాక నిష్కామంగా ఎన్ని దౌష్ట్యాలకైనా ఓర్చి శ్రీ రాముడు-పాండవులవలె ధర్మంకోసంపోరాడితే అంతిమ విజయము, సశరీరంగా స్వర్గారోహణానికీ శ్రీ సాయి మనకిచ్చే అభయానికి పాత్రులమౌతాము. ఈ ధర్మ యుద్ధం మనజీవితాలలో నిరంతరమూ కొనసాగేదే. సాటివారిపట్ల మమకారానికీ, అహంకారానికీ లోనవుతామో లేక నిష్పాక్షికంగా ఎన్ని కష్టనిష్టూరాలకైనా ఓర్చి ధర్మంకోసం పోరాడుతామోనన్న దాన్ని బట్టి మన అడుగులు ఏ మార్గాన నడుస్తాయో మనమే నిర్ణయించుకోవాలి. ఒకటి రెండు సార్లు హెచ్చరిస్తామనీ వినకుంటే మన కర్మకు మనల్ని విడిచిపెడతామని సాయి హెచ్చరించారు. మనము ఏమిచేస్తున్నామన్నదే ఈ విజయదశమి- ఈ సాయిబాబాయొక్క 92వ మహాసమాధి ఉత్సవం మనల్ని నిలదీసివేస్తున్న ప్రశ్న. "సాథీ ఆఖిర్‌కా కియానకోయి" "సాయియే చివరితోడు- వేరెవ్వరూ లేరు" అని ఆరతి పాట మనకు హితబోధ చేస్తున్నది.



ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

# దు:ఖాన్ని రూపుమాపుకోడమే ఆధ్యాత్మికత!

ఈ అనంతమైన ప్రకృతి పశుపక్ష్యాదులన్నీ తమ జీవితావసరాలను సాధించుకుంటూ, జాతిని కొనసాగించుకుంటూ జీవించి నశిస్తాయి. ఇందుకవసరమైన కృషి చేయటానికి మాత్రమే తగిన ప్రజ్ఞ కలిగి వుంటాయి. గనుక ఆ ప్రాణులకు నిత్యజీవితావసరాలకన్యంగా తృప్తి - అసంతృప్తి అనే ద్వంద్వాలున్నట్టు తోచదు. అందువలన వాటి వ్యక్తిగత జీవితాలుగాని, సామూహిక జీవితాలుగాని ధర్మాధర్మాలు ప్రగతి, తిరోగతులు అనే ప్రశ్నలే లేకుండా గడిచిపోతాయి.

# దు:ఖాన్ని రూపుమాపుకోడమే ఆధ్యాత్మికత!

కానీ మనసుగలిగిన మనిషి జీవితమలా కాదు. నిత్యజీవితావసరాలు యెంతగా లభించినా మనిషికి తృప్తీ-శాంతీ ఉండదు. ఒక వంక జిజ్ఞాస రెండవవంక తమ జీవితాలను వ్యక్తిగతంగా, మరింత సుఖశాంతి సంయుతంగా చేసుకోవాలని మానవులందరూ తాపత్రయపడతారు. వ్యక్తులు వారివారి మానసిక పరిపాకాలననుసరించి ఈ లక్ష్యాలను సాధించుకోవడానికి వివిధ సాధనాలను యెన్నుకొని వాటిని సాధించుకోడానికి తాపత్రయపడతారు. సుఖము, కీర్తి, డబ్బు, యింద్రియలోలత, కళలు మొదలైనవి మానవులు సామాన్యంగా యెన్నుకునే సాధనాలు.

కాని ఈ లక్ష్యాలను యెందరు యెన్ని స్థాయిలలో సాధించుకో గలుగుతున్నా వీరిలో ఒక్కరికీ తృప్తి శాంతీ కలుగకపోవడమే ఆశ్చర్యం. అంతేకాదు వీరిలో ప్రతి ఒక్కరూ తామెన్నుకున్న లక్ష్యాలను సాధించుకోడంలో స్వార్ధమమకారాలకు లోనై, రాగద్వేషాలను పూని వివిధ స్థాయిలలో ధర్మానికి దూరమవడానికిగూడా వెనుకాడరు. అందువలన ప్రతి ఒక్కరి జీవితమూ ఆనేక రకాలైన ఆవరోధాలకు, ప్రతి ఘటనలకు, దోపిడీలకి గురౌతుంది. సుఖానికోసం పరుగెత్తించే మానవుల మనస్సే జాతిలో ప్రతి ఒక్కరినీ ప్రకృతిలో మరే జంతువులూ పొందలేని అశాంతికి, దు:ఖానికీ గురి చేస్తుంది. ఈ సత్యాన్ని గుర్తించిన కొద్దిమంది ప్రతిభావంతులు మానవ జీవితానుభవంలోని అంశాలైన మానవజీవితము, మనస్సుల తత్త్వాన్ని లోతుగా పరిశీలించి యిట్టి దు:ఖానికి అశాంతికీ కారణాలను గుర్తించారు. వాటిని సరిదిద్దుకొనడం ద్వారా మానవుడు తృప్తిని, శాంతినీ పొందగలడని గుర్తించారు. ఈ పద్ధతిని ఆత్మజ్ఞానము, ఆధ్యాత్మికత అన్నారు. ఇట్టి వారే మన ప్రాచీన ఋషులు, వివిధ దేశ కాలాలలో ఉద్భవించిన మహనీయులు. ఇట్టివారే మానవ చరిత్రలో ఉద్భవించకుంటే మన జాతంతా పశుప్రాయమైన జీవితాన్ని గడుపుతుండేవారు; అంతకంటే గూడా యెంతో హీనము, బాధాకరమూ అయిన విషయవలయంలో చిక్కి యుండేదే. వేదాలు, ఉపనిషత్తులు దగ్గర నుండి బైబిల్, ఖురానుల వరకు గల దివ్యజ్ఞాన సమన్వితమైన పవిత్ర గ్రంథాలన్నీ యిట్టి మహనీయుల వలన మనకు ప్రసాదించబడినవే. ప్రాకృతికము, పాశవికము అయిన జీవితం కంటే మహోత్కృష్టము, పరమ పవిత్రము, ఆనందకరము అయిన జీవతవిధానమొకటున్నదని వీటి వల్లనే మనకు తెలిసింది. అయితే ఈ పవిత్ర గ్రంథాలలోని గంభీరమైన భావాన్నీ, జీవిత కళను సామాన్యులు అర్థం చేసుకొని అనుసరించగలగడానికి కేవల గ్రంథ పరిజ్ఞానమే చాలదని ఈ గ్రంధాలన్నీ చెబుతున్నాయి. అవి చెప్పిన మార్గాన నడచి, వాటిలోని సత్యాన్ని అనుభవగతం చేసుకొన్న చరితార్థులైన వారి సాంగత్యము, బోధ అవసరమని ఈ గ్రంధాలు మరలా మరలా నొక్కి చెబుతున్నాయి. ఉదాహరణకు వేదాలను ఉత్తములైన వేదవిదుల నుండీ అర్ధయుక్తంగా అధ్యయనం చేయనిదే అవి నిరర్ధకమౌతాయని అటు శ్రుతులు, సాయనాచార్యునివంటి వేదవిదులు చెబుతున్నారు. అలానే ధర్మ శాస్త్రాలుగూడ పూర్ణులైన మహనీయులనుండి వాటి అర్థాన్నీ, ధర్మసూక్ష్మాన్ని గ్రహించి ఆచరిస్తే మాత్రమే ధర్మాలు ఫలవంతాలౌతాయని చెబుతున్నాయి. ఈ సూత్రమంతటినీ శ్రీ కృష్ణుడు భగవద్గీతలో (అధ్యాయం 4, శ్లో॥ 34) "త్వద్విద్ధి ప్రణిపాతేన... " అన్న శ్లోకంలో పొందుపరచాడు. కనుక ఆధ్యాత్మికము, ధార్మికము అయిన జీవితానికి నాంది పరిపూర్ణుడైన మహనీయుని ఆశ్రయించడంతో ఆరంభమవుతుందని చెప్పాలి. అంతవరకూ మనం పాటించే ధర్మాలన్నీ, సలిపే ధర్మకార్యాలన్నీ మన జీవితాలు, మనస్సులు మరింత హీనస్థితికి దిగజారకుండా మాత్రమే కొంతవరకైనా ఉపయోపడగలవు. అందుకే తెలియకపోయినా పూర్ణుడైన మహనీయుని ఆశ్రయం లభించేవరకూ ధర్మాన్ని యధాశక్తి ఆచరిస్తూ ఉండమన్నారు పెద్దలు. కాని అట్టి మహనీయులు లభించాక "సర్వ ధర్మాన్ పరిత్యజ్య..." అన్న శ్లోకంలో చెప్పినట్లు మనకు శాస్త్రాలతో పనిలేదు. సర్వ ధర్మజ్ఞుడు, పరమ శ్రేయోభిలాషి అయిన సద్గురువే మనకవసరమైన ధర్మాలను - శ్రీ కృష్ణుడు

# దు:ఖాన్ని రూపుమాపుకోడమే ఆధ్యాత్మికత!

అర్జునునికి తెలిపినట్లు చక్కగా తెలుపగలడు. ఆయన చెప్పే నిగూఢమైన సత్యాలను మనమర్థం చేసుకొని విశ్వసించలేకపోతే - శ్రీ కృష్ణుడు అర్జునునికి విశ్వరూప సాక్షాత్కారమిచ్చినట్లు తగిన ఆధ్యాత్మికానుభూతిని ప్రసాదించి, తగిన విశ్వాసాన్నీ, అవగాహననూ మనలో కలిగించగలరు. అందుకే సద్గురువును విశ్వసిస్తే చాలునని, వేరు శాస్త్రాలతో పనిలేదనీ శ్రీ శిరిడీ సాయిబాబా గంటాపథంగా చెప్పారు. ఉత్తముడైన వైద్యుడు లభించాక మన పరిమితమైన వైద్య పరిజ్ఞానంతోగాని అసంఖ్యాకమైన వైద్య గ్రంధాలతోగాని మనకేమి పని. అయినా వారినే పట్టుకుని ప్రాకులాడేవాడి పరిమిత జ్ఞానానికి ఉత్తమ వైద్యునివంటి సద్గురువు చెప్పే బోధ అర్థం గాక ఉత్తమ శ్రేయస్సును పొందే సదావకాశం జారిపోతుంది.

భగవంతుడి అనుగ్రహం వలన, మానవుల మహాద్భాగ్యం వలన అటువంటి పరిపూర్ణులైన మహనీయులు చరిత్రలో పొడుగునా ఉద్భవిస్తూనే ఉన్నారు. ఏ దేశకాలాలకు చెందిన ప్రజలు ఆయా దేశకాలాలలో ఉద్భవించిన మహనీయుల నాశ్రయించాలని "తద్విద్ధి ప్రణిపాతేన... " అన్న శ్లోకంలోని భావమని కొంచెమాలోచిస్తే తెలుస్తుంది. భగవద్గీతలో కృష్ణుడు వాచా చెప్పిన ప్రతి విషయాన్నీ శ్రీ సద్గురు సాయినాధుడు తన భక్తులకు దివ్యానుభూతులద్వారా తెలియచేశారని సమగ్రమైన వారి చరిత్రను చూస్తే తెలియగలదు. ఇటువంటి మహనీయులు ఆయాదేశకాల పరిస్థితులకు అనుగుణమైన రీతిన ఆధ్యాత్మిక విద్యను బోధిస్తుండడమే యిందుకు తార్కాణము, సౌలభ్యము గూడా. అంతటి మహనీయుడైన సాయినాధుని యందు మనకు కొంచెమైనా భక్తి విశ్వాసాలు కలగడం మన పూర్వ పుణ్యమే.

ఆధ్యాత్మిక సాధన సఫలమవ్వాలంటే మనలోసత్వ గుణము వృద్ధి పొంది తీరాలని భగవద్గీతలోని శ్రద్ధాత్రయ విభాగయోగం, గుణత్రయ విభాగయోగము అనే అధ్యాయాలు తెలుపుతాయి. మనలో సత్వగుణం వృద్ధిపొంది తక్కిన రెండు గుణాలూ తగ్గాలంటే, అసురీ సంపద తొలగి దైవీ సంపద స్థిరపడాలంటే యిటువంటి మహనీయులలో బాహ్యంగాను, అంతరంగికంగానూ నిరంతరం సేవించడం ఒక్కటే మార్గమని భాగవతంలోని నారదుని వృత్తాంతం తెలుపుతుంది. భక్తితో చేసిన జపము-పూజ, దానము-యజ్ఞము మొదలైన సత్కర్మలు మాత్రమే భక్తి కుదరగలదని నారద భక్తి సూత్రాలు చెబుతున్నాయి. ఈశ్వరానుగ్రహం వలన గూడా కలగవచ్చని చెప్పినప్పటికీ అట్టి అనుగ్రహాన్ని పొందాలనుకున్న మనలో భక్తితో గూడిన పూజ, భజనాదులే సాధనాలుగదా! కనుక సద్గురువును ప్రేమతో సేవించడమొక్కటే మార్గం కాని అలాచేయగలగాలంటే అట్టివారి ప్రత్యక్ష సాన్నిధ్యమైనా మనకు లభించాలి. లేకుంటే అట్టివారి సమగ్ర జీవిత చరిత్రలనైనా మనం పరిశీలించాలి. మనకపరిచితులైనవారిని ప్రేమించడమెలా సాధ్యం. అందుకని శ్రీ సాయిబాబా యొక్క సమగ్ర జీవిత చరిత్రను, బోధనూ అధ్యయనం చేయడమొక్కటే వారిపట్ల ప్రేమను పొందడానికిగాని, అట్టి ప్రేమతో వారిని సేవించడానికి గాని ముఖ్య సాధనం. మహనీయుల ప్రత్యక్ష సాన్నిధ్యం లభించడమెంతో కష్ట సాధ్యం. మనకు తారసిల్లినవారు అంతటి మహనీయులౌనో కాదో తెలియడమే సాధ్యంకాదు. తెలియకున్నా ప్రయత్నించి వారిని విశ్వసించాలని తలచటం భ్రాంతిమాత్రమేనని యెందరి అనుభవాలో నిరూపిస్తాయి. కనుక శ్రీ సాయి వంటి సద్గురువులను పై దెల్పిన రీతిన సేవిస్తుంటే వారి దర్శన ఆశీస్సులు ఈనాటికి ప్రత్యక్షంగా లభించగలవని యెందరి అనుభవాలో నిరూపిస్తున్నాయి. ఈ రహస్యం తెలుసుకోకుండానే భజన జపాదులు చేయటంతో సంతృప్తి పడడం పామరులు వైద్య గ్రంధాన్ని చూచి తమకు తాము మందు వేసుకున్నట్లే. ఈత రానివారు సమర్థుడైన యీతగాని సహాయం లేకుండానే నదిలో దూకి యీతనేర్వ సాహసించినట్లే. ఈనాడు మనమీ సత్యాన్ని గుర్తించడం లేదు కనుకనే దేశంలో యెన్ని భజన సమాజాలున్నా వాటిలో ఒక్కరూ ఆధ్యాత్మికంగా పై స్థాయికి పోవడం కన్పించడం లేదు. సమాజంలో భక్తి విశ్వాసాలు వెనుకబడుతూనే ఉన్నాయి. అలా వెనుకబడకుండా వుండడానికి ఆధ్యాత్మిక చక్రవర్తియైన సాయిని సేవించుకుందాం!

# “నా ప్రతిభ కంతటికీ కర్త నా గురువే!”

శ్రీ సాయిబాబా జీవిత చరిత్రను శ్రద్ధగా పారాయణ జేసి, వారి మూర్తిని పూజించి లౌకికమైన శ్రేయస్సును పొందినవారు క్రమంగా వారినేమీ కోరక అచంచలమైన భక్తి - విశ్వాసాలతో తమ, యిహపర శ్రేయస్సును సర్వజ్ఞుడు, సర్వ సమర్థుడు అయిన సాయి సంకల్పానికి విడచి, శాశ్వత దు:ఖనివృత్తి రూపమైన పరమార్థాన్ని లక్ష్యంగా గ్రహించి వారు సూచించిన సాధనా మార్గాన్ని శాయ శక్తులా అనుష్ఠించాలి. కాని సాయి సూచించిన సాధనా మార్గమేది?

బాబా మనకేమి చెప్పదలచినా దానిని తమ కాపాదించుకుని చెప్పడం పరిపాటి. మొదట ఆయన నిర్హేతుకమైన వాత్సల్యంతో తన ఆకలి దప్పులను తీర్చిన అడవివాని ప్రేమను కృతజ్ఞతతో అంగీకరించారు. అహంకారంతో ప్రేమను నిరాకరించిన వారి సహచరులు ఆకలి దప్పులతో అజ్ఞానారణ్యంలో పరిభ్రమిస్తుండి పోయారు. ఇది మనకు హెచ్చరిక. అటు తరువాత ఆ గురువు బాబాకు తమ నిజరూపంలో దర్శనమిచ్చి తమను విశ్వసించి అనుసరిస్తే గమ్యాన్ని చేరుస్తానని వాగ్దానం చేసారు - సాయి “నేనెవ్వరినీ మధ్యలో విడువను; చివరికంటా గమ్యం చేరుస్తాను” అని “నా చేతికొచ్చిన ప్రతి పైసాకి నేను భగవంతుడికి లెక్క చెప్పుకోవాలి” అని బాబా అన్నట్లు. సాయి యిహానికి, పరానికి సంపూర్ణంగా ఆ గురువుపైనే ఆధారపడి వారిననుసరించారు.

అలా అనుసరించిన బాబాను ఆ గురువు తలక్రిందులుగా చెట్టుకొమ్మనుండి ఒక తాడుతో ఒక బావిలోనికి వ్రేలాడదీశారు. అంటే లౌకికంగా దేహావసరాలు తమకై తావే స్వయంకృషితో సమకూర్చుకొనే అవకాశాన్ని ఆ గురువు తీసివేశారన్నమాట. బావిలోని నీరు సాయినోటికి అందకుండా మూడు అడుగులు క్రింద వున్నాయి. మన స్థూలదృష్టికి వారి ప్రాకృతికమైన అవసరం తీరడానికి అవకాశం లేని పరిస్థితిలో బాబా చిక్కుకున్నట్లు కన్పించవచ్చు. కాని వారు నీటిలోపడి మునిగిపోకుండా ఆ గురువు త్రాటితో వారిని చెట్టుకొమ్మకు కట్టి ఉంచారని గమనించాలి. యెదుట అడవిలో తిరుగుతున్నప్పుడు సాయి కోరకనే వారికి అన్న పానీయాలందించిన తమ గురువుయొక్క జాగరూకత, ప్రేమలపట్ల సాయికిగల దృఢ విశ్వాసమే ప్రస్తుత నిరాధారమైన స్థితిలోగూడ వారు సంతోషంగా ఎన్ని గంటలైనా తలక్రిందులుగా ఉండనిచ్చింది. ఆస్థితిలో అనుభవమేమైనా ఉంటే అది తమ శ్రేయస్సుకై గురువు విధించినదేనన్న నమ్మిక బాబాకు బలాన్నిచ్చింది. కాని సద్గురుని మహిమ ఎంతటిదో! సాయికెట్టి అవసరమూ కల్గలేదు. తమనట్టి నిస్సహాయస్థితిలో విడచి గురువెక్కడికో వెళ్లిపోయినట్లు స్థూలదృష్టికి కన్పించినా వారి నిర్హేతుకమైన వాత్సల్యం తన అవసరాల్ని ఏమార్చదన్న విశ్వాసాన్ని వీడలేదు. అంటే సాయికి ఆత్మ

*సాయి కోరకనే వారికి అన్న పానీయాలందించిన తమ గురువుయొక్క జాగరూకత, ప్రేమలపట్ల సాయికిగల దృఢ విశ్వాసమే ప్రస్తుత నిరాధారమైన స్థితిలోగూడ వారు సంతోషంగా ఎన్ని గంటలైనా తలక్రిందులుగా ఉండనిచ్చింది. ఆస్థితిలో అనుభవమేమైనా ఉంటే అది తమ శ్రేయస్సుకై గురువు విధించినదేనన్న నమ్మిక బాబాకు బలాన్నిచ్చింది.*

సమర్పణ, ఓరిమి, దృఢ విశ్వాసము(నిష్ఠ)లను ఆ గురువు అభ్యసింపజేసారు.

తర్వాత బాబాయొక్క అచంచలమైన విశ్వాసానికి మెచ్చి గురువొచ్చి వారిని బయటకు తీసారు. తననట్టి స్థితిలో విడిచిపోయినందుకు సాయి వారిపై కించిత్తుగూడా కినుక బూనలేదని, తానేదీ కోరనవసరములేదని, అవసరమైనవన్నింటినీ వారి అనుగ్రహమే సమకూర్చగలదన్న విశ్వాసాన్ని ఆయన వీడలేదు అని గమనించాలి. "గురువు యొక్క కృపాదృష్టే శిష్యునికి అన్నపానీయాలు" అన్న బాబా సూక్తికిదే అర్థం.

అట్టి బాబా విశ్వాసానికి మెచ్చి వారి గురువు తమ ఆశ్రమానికి తీసుకు వెళ్ళారు. అక్కడ తమ దారిన తాము ఆత్మనిష్ఠలో తమకొక దేహమున్నదన్న స్పృహయేలేని స్థితిలో కూర్చుండిపోయారు. సాయి పండ్రెండు సంవత్సరాలు నిత్యమూ ఎంతో శ్రమకోర్చి తమ గురువు దేహాన్ని ఆసనాన్ని శుభ్రంచేసి, భిక్ష తీసుకొచ్చి గురువుకుపెట్టి మిగిలిన దానిని తాను తిని, మిగిలిన సమయమంతా వేరొక తలంపులేక తమ గురుని చెంత కూర్చుని వారిపై తమ దృష్టిని నిలిపారు. ఆ గురువు తమకేదైనా మంత్రముపదేశిస్తే దానిని జపించి తరించాలని బాబా ఎంతగానో ఎదురు చూచారు. కాని తమకవసరమైనది తానడుగకనే సకాలములో వెనుక అందజేసిన తమ గురువుయొక్క వాత్సల్యాన్ని స్మరించి తానుగా ఎన్నడు గురువును ఉపదేశంకోసం కోరలేదు. ఇంత సేవజేస్తే యింకా నాకు ఉపదేశమివ్వలేదేమి? వీరిని సేవించి ప్రయోజనమేమి? అసలు ఎన్నడైన ఉపదేశం చేస్తానని గూడా మాటైనా అనలేదే అనిగూడా శంకించలేదు.

నిజమైన గురువు, శిష్యుడు అడిగినది యివ్వడు. తనకేమివ్వాలో తానే నిర్ణయించి గురువుకు చెప్పదలచినవాడు శిష్యుడు కాదు. తనరోగానికెలా చికిత్స చేయాలో వైద్యునికి చెప్పదలచిన రోగి ఎంతటి వివేకి? సాయి తనకుపదేశాల్నివ్వడానికి సంసిద్ధుడైన వేరొక గురువు నాశ్రయించాలని చాపల్యపడలేదు. తన కోరిక నెరవేరుతుందో లేదోనని ఏ జ్యోతిష్కులను, ఉపాసకులను ప్రశ్న అడగలేదు. ఒకరినొకసారి భర్తగా అంగీకరించిన పతివ్రత తన మనోభీష్టం నెరవేరడానికి మరొక పురుషుని ఎన్నడూ ఆశ్రయించదు. అలా ఆశ్రయిస్తే తనకు ప్రాప్తించేది ఉభయ భ్రష్టత్వమే. అట్టి (అలానే శిష్యుని) అంగీకరించిన మరొకడికి గూడా (అంటే గురువుకు గూడా) ఆమెపట్ల సదభిప్రాయముండదు. మన అవసరాన్ని మాత్రమే అతడు తీర్చుకోవచ్చు. అందుకే "శ్రీ దత్తావతారలీల" లోతున గురువును త్యజించిన శిష్యుడితో శ్రీగురుడు "గురు పరిత్యాగము చేసిన నీ ముఖమైనా చూడరాదు" అని మందలించి అతడు పశ్చాత్తాపము చెందినపుడు కరుణార్ద్ర హృదయుడై మొదట గురువును స్మరించమనిచెప్పి ఆ రూపంలోనే అతడిని కరుణించడం గమనార్హం. ఈ ధర్మ సూక్ష్మాన్ని పాటించక ఉపదేశాలు, ప్రశ్నలు చేప్పడంద్వారా మరొక గురుని విడచి వచ్చిన కుశిష్యులను సంతోషంగా అంగీకరించే వారు ఆధ్యాత్మికంగా నీతి, జాతి లేనివారే అని చెప్పాలి.

ఇలా 12 సం॥ల తర్వాత ఆ గురువు సాయికి మొదట గుండు చేయించారు. అంటే వారి మస్తిష్కంలో జనించిన ఉపదేశాభిలాషవంటి సొంత అభిప్రాయాలను విడువమని సంకేతంగా చెప్పారన్నమాట. అంతేగాక ఆ సుదీర్ఘకాలంలో సాయిచేత వారు అభ్యసింపజేసిన నిష్ఠ, ఓరిముల తత్త్వాన్ని దృఢపరచి వాటిని దక్షిణగా స్వీకరించి "నీవెక్కడున్నా నీవెంటనుండి నేనెప్పుడు కాపాడుతుంటాను" అన్న అభయాన్ని అనుగ్రహించారు. సాయి తమ భౌతిక జీవిత పర్యంతం ఆ అభయాన్నే గుర్తుగా నిలుపుకున్నారు. "ఇప్పటి నా యీ మహిమకంతటికీ కర్తలు వారే" అని ఎప్పుడూ అంటుండేవారు.

సాయి సంపూర్ణ దత్తాత్రేయ అవతారం. ఇప్పుడెట్టి స్థితిలో వారున్నారో అలానే రామాయణ కాలంలోను ఉండి ఆ వృత్తాంతాన్నంతా ప్రత్యక్షంగా చూచాననివారే చెప్పారు. అట్టి సాయికి నిజంగా ఒక గురువున్నారా? కాని ఆదర్శప్రాయుడైన సాధువువలె ఒక సద్గురునికి సేవచేసి తాము కృతజ్ఞులైనట్లు చెప్పడమే శ్రీ దత్తాత్రేయ తత్వం.



ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

# సాయి పట్ల భక్తివిశ్వాసాలే భక్తుని సిరిసంపదలు

*కొందరికి పూర్వపుణ్యం వలన ప్రయాస లేకుండానే సిరి సంపదలు, కీర్తి ప్రాప్తిస్తాయి. అలాంటి వారికి మహాత్ములతోను, భగవంతునితోనూ యేమి పని.....*

# సాయి పట్ల భక్తివిశ్వాసాలే భక్తుని సిరిసంపదలు

అసలలాంటి వారున్నారనే స్పృహ వారికి ఉండదు. అలాంటివారిలో మహారాష్ట్రలో గొప్ప నాటకుడిగా కీర్తి గడించిన గణపత్రావ్ బోడస్ ఒకడు. అతడికి ఏ మహాత్ములయందూ గౌరవం గాని, విశ్వాసం గాని లేదు సరిగదా, అలాంటి వారిని పరిహసించేవాడు గూడా.

ఒక సారి గణపత్రావ్ బోడస్ అహ్మద్‌నగర్‌లో పనిపడి కొద్దిరోజులు ఉన్నాడు. అక్కడ శ్రీ సాయిబాబా గురించి విన్నదగ్గరనుండి ఆయనను దర్శించాలని ఆకాంక్ష కలిగింది! ఆ సంకల్పమును మిత్రుడు మెరేకర్‌తో చెప్పాడు. ఆ రోజులలో బలరామ్ మాన్కర్ కోపర్‌గావ్‌లో మమల్తదారుగా వుండేవాడు. అందువలన వారిద్దరూ కోపర్‌గావ్‌కు చేరి రాత్రికి అక్కడ మెరేకర్ యింట నిద్ర చేశారు. మరురోజు బోడస్ శిరిడీ వెళ్ళాడు. మొట్టమొదట బోడస్ సాయిని ద్వారకామాయి లో దర్శించి ఆయనకొక కొబ్బరికాయ, ఎండు పొగాకు సమర్పించాడు. వెంటనే అతడిని ఆ పొగాకు తమ చిలింలో పెట్టి దాన్ని వెలిగించి ఇవ్వమన్నారు. తర్వాత తాపీగా దాని పొగ పీలుస్తూ ఆగంతకుడిని క్లుప్తంగా క్షేమ సమాచారాలు విచారించారు. మరుక్షణమే సాయి కంఠధ్వనిలోను, ముఖంలోనూ కొద్ది మార్పు వచ్చింది: "దక్షిణ యివ్వు!" అన్నారు విసురుగా. ఆయన వైఖరికి ఆశ్చర్యపోయి బోడస్ ఒక్క రూపాయి సమర్పించాడు. దానిని తీసుకొంటూ సాయి, "భోజనం చేయకుండా వెళ్ళవద్దు సుమ్మా" అని యింకేవో సామాన్యమైన మాటలు మాట్లాడుతూ అకస్మాత్తుగా కోపంతో "వెధవల్లారా మీలో మీరు పోట్లాడుకు ఛస్తారేమి? ఇంక బాబా మీకేమి చేయగలడు?'' అన్నారు. ఆ మాటలు ఇంకెవరికీ అర్థం కాలేదు. ఎక్కడో భక్తులకేదో సమస్య ఎదురై ఉంటుందని అందుకే బాబా అలా అన్నారని అందరూ తలచారు.

కానీ బోడస్‌కి తక్షణమే అర్థమైంది! కారణం సరిగ్గా రెండు రోజుల ముందే అతడు, తన చిరకాల స్నేహితుడైన జోగ్లేకర్ తగువులాడుకున్నారు! బాబా అంటే ఏమిటో బోడస్‌కు అర్థమైపోయింది.

అలా మధ్యాహ్న హారతి అయ్యాక ద్వారకామాయి వెనకప్రక్క వున్న ఒక ఇంటికి భోజనానికి వెళ్ళాడు బోడస్. అక్కడ సాయి అతణ్ని దక్షిణ కోరారన్న మాటవిని ఒక భక్తుడు అతడితో "నీవు వెంటనే నీవద్ద నున్న పైకమంతా ఆయన ముందు కుమ్మరించ వలసింది! ఎంతటి అవకాశాన్ని జారవిడుచుకున్నావు!'' అన్నాడు. ఆ మాట యదార్థమనిపించి యీసారి అవకాశము వస్తే తప్పక అలాగే చేస్తానన్నాడు బోడస్.

తర్వాత అతడు తిరుగు ప్రయాణమయి సాయి అనుమతి, ఆశీస్సులు కోరడానికై మసీదు చేరాడు. ఆ సమయంలో ఒక మంగలి సాయికి తల, గడ్డము మీసము క్షౌరం చేస్తున్నాడు. బోడస్ ఎంతో భక్తి ప్రపత్తులతో సాయికి పాదాభివందనం చేసాడు. "అయితే వెళుతున్నావన్నమాట!" అన్నారు బాబా.

ఎంతో వివేకంతో సమయస్ఫూర్తితో -"మీ అనుమతి కోసం వచ్చాను బాబా" అన్నాడు బోడస్.

''సరే వెళ్ళు! దక్షిణా కుక్షణా ఏమైనా యిస్తావా?'' అన్నారు బాబా-అతడి వైపు చేయి చాపుతూ.

బోడస్‌కు కొండెక్కినంత సంతోషం వేసింది. తానెప్పుడొస్తుందో అనుకున్న సదవకాశం అంత అకస్మాత్తుగా తనకు రావడంతో ఉక్కిరిబిక్కిరి అవుతూ తన పర్సులో ఉన్న పైకమంతా తీసి బాబా చేతిలో వుంచాడు. బాబా ఎంతో సంతోషంగా దానిని తీసుకొని, కొద్దిక్షణాలు తమ చేతిని అతని శిరస్సు మీద నుంచి ఆశీర్వదించి, నొసట విభూది పెట్టి, ''నువ్వు నాకు సంతోషంగా దక్షిణిచ్చావు. నారాయణుడు నీకు సర్వం పుష్కలంగా ప్రసాదిస్తాడు" అన్నారు. అతడు ఎంతో భారం తీరిన వాడిలా, ధన్యుడైనట్లు సంతోషంగా శిరిడీ విడిచి వెళ్ళాడు.

సాయిమాట ఎన్నడైనా అబద్ధమైతే గదా? ఎనలేని సిరిసంపదలు బోడసేకు అనతికాలంలోనే సంక్రమించాయి. అదే అచంచలమైన గురుభక్తి! సాయి దర్శించాక వేరొక మహాత్ముని దర్శించనని అతడు నిర్ణయించుకున్నాడు. అందరు మహాత్ముల రూపమే ఆయనని అతని హృదయం గ్రహించింది!! తన సమకాలీనుడయిన ఆ ఫకీరును అంతలా విశ్వసించగలగడంకంటే వేరే సిరిసంపద లేముంటాయి.



ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

# చెప్పింది అర్థం చేసుకోవాలి! ఆచరించాలి!

సర్వమానవులూ వారికి తెలిసినా తెలియకున్నా సహజంగానే కోరేవి నాలుగు - ధర్మము, అర్థము, కామము, మోక్షము. వీటినే మనవారు నాల్గు పురుషార్థాలన్నారు. కాని మన నిత్య జీవితాలు, అభీష్టాలూ గమనిస్తే అందరమూ అర్థకామాలను-అంటే ఒక వంక డబ్బు, ఆస్తి మొ॥నవి మరోవంక వాటి సహాయంతో సంపాదించుకోగల సుఖాలు మాత్రమే కోరుతామనిపిస్తుంది...

# చెప్పింది అర్థం చేసుకోవాలి! ఆచరించాలి!

ప్రత్యేకమైన యత్నంతో, ఈ రెంటికోసమూ పాటుపడుతున్నట్లు ధర్మమోక్షాలకోసం ప్రాకులాడమేమో నన్పిస్తుంది. ఎంత స్వల్పమైన ఆశ, అవసరమూ కన్పించినా అతి సులభంగా ధర్మాన్ని విడుస్తాము. ఎంత చిన్న అవసరము, కోరిక నెరవేర్చుకొనే యత్నంలోనైనా మోక్షాన్ని ప్రసాదించగల జప ధ్యానాది సాధనలను ప్రక్కకు పెట్టి, పైకి మాత్రం మనం దానిపై ఎంతో ప్రీతితో తపిస్తున్నట్లు కన్పిస్తూ, జీవితంలో సమయము, అవకాశమూలేనట్లు వాపోతాము. వార్తాపత్రిక, వారపత్రిక, సినిమా, టి.వి పిచ్చాపాటి కబుర్లు - వీటికున్న మాత్రం సమయం సాధనకు, సద్గ్రంధ పఠనకూ వుండదు. ఏకొద్ది కాలమైనా ఏకారణం చేతనో సత్త్వగుణం మనలో పలవరించి కొంచెం క్రమబద్ధంగా పారాయణ, పూజ, జపము, భజన చేయడం జరుగుతే మరుక్షణమే పండిపోయామన్పించి గురువులమవ చూస్తాము. మనకు కల్గిన "స్థితి"ని పెద్ద పెద్దవారితో పోల్చుకొని వారి వాక్యాలు, వేషభాషలూ అనుకరింపజూస్తాము. ఇతరులకు బోధింపజూస్తాము. కారణం మన సమాజంలో యిలా చేస్తే అర్థకామాలు తేలికగా నెరవేరుతాయి. కీర్తి, సుశ్రూష, అర్థమూగూడ తేలికగా సమకూడుతాయి. లోకాన్ని మరచి సాధనకంకితమైతేగాని లభ్యంగాని శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ సాయిబాబా, శ్రీ రమణమహర్షి పొందినస్థితులు మనకు పుట్టుకతోనే-ఏమీ చేయకనే-సిద్ధించాయని ఆత్మవంచన చేసుకొని పరవంచనకు సిద్ధమవుతాము. మనను సేవించడమొక్కటే మోక్షోపాయమని భావం స్ఫురించేలా వ్యవహరిస్తాము. ఎన్నో సంవత్సరాలు శ్రీ సాయిని ప్రత్యక్షంగా సేవించిన బాపూసాహెబ్ జోగుకు కల్గిన ప్రశ్న మనకూ ఏకాంతంలో ఎదురవుతుంటుంది. "ఇంతకాలం నేను యీయనను సేవిస్తున్నాను. సద్గురువును 12 సంవత్సరాలు సేవిస్తే తమంతటివారుగా చేస్తారంటారు. మరిమనకీయన అలా చేయలేదేమీ? అన్పిస్తుంది. అయితే ఆయన చెప్పిన సమాధానమో? అది గుర్తొచ్చినా గుర్తొచ్చినట్లుండము- ఆయన నవ్వి ప్రక్కవారితో, "వీడు నన్ను నా స్థానంలోంచి నెట్టివేసి తాను కూర్చుందామని చూస్తున్నాడు" అన్నారు. మరుక్షణమే, "ఆ తలంపు మంచిదే! కాని ఓరిమి, పట్టుదల కావాలి" అంటే ఏమిటి? ఠాకూరను భక్తునితో సాయి చెప్పారు - "ఆ సద్గ్రంధం వూరికే చదువుతే చాలదు. దానిని బాగా అర్థం చేసుకుని, మననం చేసి ఆచరిస్తేగాని ఫలితముండదు. ఈ ఆధ్యాత్మ విద్య ఎంతో కష్టము. మన శక్తినంతటినీ వినియోగించి శ్రమిస్తేగాని ఫలితముండదు" అని.

శ్రమ చేయడమంటే ఎలా? తక్షణమే బ్రహ్మజ్ఞానం కోరి వచ్చిన శ్రీమంతునితో ఆయన, "పంచప్రాణాలు, పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారము-యీ అయిదూ సద్గురువుకు సర్వసమర్పణ చేస్తేగాని ఆత్మ జ్ఞానం లభించదు" అన్నారు.

అవెలా సమర్పించాలి? సాయి తమ గురువును సేవించినట్లు సేవించాలి. రమణమహర్షి ఆత్మ నిష్ఠులై లోకాన్ని మరచినట్లు సద్గురు నిష్ఠలో లోకాన్ని మరవాలి. రామకృష్ణగారు జగన్మాతనుగ్రహానికై పరితపించి ప్రాణత్యాగానికి గూడ సిద్ధమైనట్లు సిద్ధమై తపించాలి. అపుడు కల్గుతుందట! ఈ విషయాన్నే క్రీస్తు చెబుతాడు - "(జీవితంలో) విశాలము, సుఖకరమూ అయిన బాట నరకానికీ, సన్నగా, క్లిష్టంగా వుండే బాట భగవంతుని రాజ్యానికీ దారితీస్తాయి". అందుకే సాయిగూడ హాజీసిద్దిక్ ఫాల్కేతో నిగూఢంగా "బార్వీ బావిదగ్గరకు యిరుకు కాలిబాటన వస్తాడేమో అడుగు" అని కబురు చేస్తారు. అందుకతడంగీకరించాక అతనిలో బలహీనతల పట్ల పట్టరాని అగ్రహంతో - శస్త్ర వైద్యుడు రాచకురుపు మీద దాడి చేసినట్లు దాడి చేస్తారు.

ఇంత శ్రమకు మనము సిద్ధమా? సాయి దయతో మన సంసారికమైన కోరికలు సమస్యలూ తీర్చుకోనేందుకు పడే యత్నము, వాటికోసం మనం మానవయత్నం చేసినంతగా పరమార్థంకోసం చేయడానికి సిద్ధమా? మనకది పరమార్థమేనా? సాయిని దర్శించిన లక్షలమందిలో ఆయన యివ్వదలచిన పరమార్థాన్ని కోరేవాడు గాని, తమ గురువును ఆయన సేవించినంతగా వారిని సేవించినవాడు గాని - అంటే శిష్యుడని చెప్పదగ్గవాడు - ఆయనకొక్కరు గూడ దొరకలేదట. వారి గురువుకు గూడ ఆయనొక్కడే దొరికాడట!

చివరికి ఉపాసనీ బాబా, మహల్సాపతి, తాత్యాలనుగూడ ఆయన ఆ లెక్కలో చేర్చలేదంటే కర్తవ్యమెంత తీవ్రమో ఆలోచించుకోవాలి.

---



శ్రీమతి వేదవతి

# సద్గురు జననము

*అసలీ సృష్టిలో ఏదీ కారణం లేకుండా జరుగదు. ఈ సృష్టి యిలా జరగడానికి కారణం భగవంతుని, తాననేకమవ్వాలనే సంకల్పం...*

www.saibharadwaja.org www.saimasterforums.org

ఆ సంకల్పానికి కారణం భగవంతుడి స్వభావం. సర్వశక్తిమంతుడు, సర్వసమర్థుడు అయిన ఆయనకు సృజనాత్మకత సహజసిద్ధం, స్వభావసిద్ధమూ. ఎందుకంటే ఆయన జడస్వరూపి కాదు. చైతన్యస్వరూపి. అటువంటి భగవంతుడు కూడా కారణం లేకుండా మరలా మరలా సృష్టి చేయలేదు. పూజ్యశ్రీ మాస్టరుగారు శ్రీ గురుచరిత్రలో 12వ పేజీలో ఇలా వ్రాస్తారు. "ప్రతి కల్పాంత ప్రళయానికి ముందు తరించకుండా వుండిపోయిన జీవులు మరలా జన్మించి, అనుభవం ద్వారా పూర్వకర్మను రహితం చేసుకుంటూ ఈ సారి ధర్మబద్ధంగా జీవించడం వలన మరలా కర్మకు బద్ధులుగాకుండా వుండే అవకాశమివ్వడానికే భగవంతుడు మళ్ళీ మళ్ళీ సృష్టి చేస్తుంటాడు. మరలా మరలా సృష్టి జరగడానికి ఇదే కారణమన్నమాట. జీవులన్నీ తరించడమే ఈ సృష్టికి లక్ష్యం. అందుకే ప్రకృతి ప్రతి జీవికి ఈ విషయాన్ని తన ధర్మాధర్మ ప్రతిఫల శిక్షణద్వారా నిరంతరం తెలుపుతూనే వుంటుంది. కర్మ సిద్ధాంతమంతా ఈ విషయాన్ని వివరించేదే. ఈ సిద్ధాంతానికి మూలం 'ధర్మోరక్షతి రక్షితః' అన్న మూలసూత్రమే. పై లక్ష్యాన్ని సాధించడానికి దోహదపరచేదే ధర్మం, అవరోధపరచేదే అధర్మం అన్నారు పెద్దలు.

ఈ విషయాన్ని చెప్పడం చాలా తేలిక. కానీ నిత్యజీవితంలో జరిగే వివిధ సంఘటనలకు, పై సూత్రాన్ని అన్వయించుకుని జీవించడం కష్టం. ఎందుకంటే మన ఇష్టాయిష్టాలకు, ధర్మాధర్మాలకు మధ్య సరైన అవగాహన సామాన్యులకుండదు. ఈ అవగాహన లేమినే అజ్ఞానం అన్నారు. అవగాహనకు మూలం వివేకం. వివేకం లేనిదే అవగాహనుండదు, అవగాహన లేనిదే ఆచరణ వుండదు. కాబట్టి మనమంతా అజ్ఞానం వలన అనివార్యంగా ఎన్నో తప్పులను - తెలిసి కొన్నీ, తెలియక కొన్నీ చేస్తూనే వుంటాం. మనమూ ఈ సృష్టిలో భాగమే గనుక ఈ సృష్టి ఈ విషయాన్ని విస్మరించదు. అందుకే శ్రీ గురుచరిత్రలో మాస్టరుగారు, "అజ్ఞానం వలన జీవులు అనివార్యముగా చేసే దోషాలు ఎక్కువగా పేరుకొని ఆ ప్రజలే ధర్మబద్ధంగా జీవించడానికి బాహ్యమైన ఆటంకంగా ఏర్పడినప్పుడు దానిని తొలగించడానికి రాముడు, కృష్ణుడు వంటి అవతారాలు ఆ భగవంతుడే ఎత్తుతుంటాడు. కానీ సృష్టి పొడుగునా అటువంటి అవరోధాలు సాధ్యమైనంతవరకూ రాకుండా చేయడానికి ఆ భగవంతుడే పరిపూర్ణులైన సద్గురువుగా అవతరించి, తన లీలల ద్వారా సాధ్యమైనంతమందికి మోక్షేచ్ఛ, ధర్మనిష్ఠ కలిగేలా చేస్తూ వుంటాడు" అని వ్రాశారు. సద్గురువు అవతరించడానికి కారణం యిదన్నమాట! అంటే సాధ్యమైనంతమంది అన్ని కాలాలలోనూ అన్ని దేశాలలోనూ తరించేలా ఎల్లప్పుడూ కృషిచేస్తూ వుండే తత్వం సృష్టిలోనే వున్నదన్నమాట! దానినే సద్గురు తత్వం అన్నారు. అదే దత్తాత్రేయ తత్వం. నేటి మన ప్రపంచపు పరిస్థితులననుసరించి మనలను తరింపజేయడానికి మనమధ్య అవతరించిన సంపూర్ణ దత్తావతారమే శ్రీ సాయి. పరస్పరం స్పర్ధలతో రగులుతున్న మానవజాతికి పరిష్కారంగా శాంతియుతమైన, ధర్మబద్ధమైన జీవితాన్ని సాగించేందుకు ఆలంబనగా ఆ సమర్థసద్గురువు సర్వవ్యాప్తమైన భగవంతుని తత్వాన్ని శాస్త్ర అవగాహనలేని పామరులైన సామాన్యులకు సైతం ఋజువు చేశారు. సద్గురువు ఎంత నిరాడంబరంగాను, ధర్మ బద్ధంగాను, వైరాగ్యమూర్తిగాను, సర్వసమర్థుడిగాను, కరుణామయుడిగాను, సర్వవ్యాపిగానూ వుంటారో ఆయన జీవితం చూసి తెలుసుకోవచ్చు. ఆయన తన భక్తులను పూర్వజన్మలనుంచీ సంస్కరించుకుంటూ తమ దగ్గరకు పిలిపించుకుని ఆధ్యాత్మిక వికాసాన్ని కలిగిస్తారో, వారిని ఎంతగా రక్షిస్తారో ఆయన చరిత్ర చూస్తే అర్థమవుతుంది. మతకలహాలలోను, కులభేదాలతోనూ, ఆర్థిక అసమానతలతో ప్రగ్గుతున్న మానవాళికి తన సర్వజ్ఞత్వాన్ని నిరూపించి తానే సకలదేవతా స్వరూపి అని, సకల సాధుస్వరూపియని, ఈ విశ్వమంతా తన రూపమేనని అనుభవమిచ్చి ఈ కలహాలకు

# సద్గురు జననము



అవతారమనవచ్చు".

అంటే సాయి నేటి మన జీవిత, ఆధ్యాత్మిక సమస్యలన్నింటికీ పరిష్కారంగా అవతరించిన పూర్ణావతారమన్నమాట. అదే ఆ సమర్ధ సద్గురువు మనమధ్య అవతరించడానికి కారణం కూడా. అయితే ఆయన జీవితాన్ని, బోధలను సరిగ్గా అర్ధం చేసుకుని మన నిత్యజీవితానికి అన్వయించుకుని జీవించడానికి ప్రయత్నించినప్పుడే మనం సంపూర్ణ ప్రయోజనం పొందగలం. అందుకే మాస్టరుగారు శ్రీ సాయి లీలామృతము పేజీ(xiii)లో ఇలా వ్రాస్తారు: "ప్రతిభావంతుడైన ఉపాధ్యాయుణ్ణి గౌరవిస్తూగూడ ఆయన చెప్పే పాఠాలు నేర్చుకోని విద్యార్థికి ఎంతలాభం చేకూరుతుందో, శ్రీ సాయి బోధలు తెలుసుకొనని సాయి భక్తులకు అంతే ప్రయోజనం చేకూరుతుంది" అని. అంటే సాయిని సేవించడమంటే సాయిపట్ల భక్తి విశ్వాసాలను పెంపొందించుకుంటూ ఆయన బోధలను మనం ఆచరించమన్నమాట. సాయి బోధలపట్ల శ్రద్ధ కలగాలంటే సాయి జీవితము, సాయి తత్వము ఎంతటి మహోన్నతమైనవో తెలియాలి. అలాగే ఆయన బోధలను ఏ సందర్భంలో ఎలా అన్వయించుకుని ప్రవర్తించాలో తెలియాలి. అవి ఆచరిస్తూ జీవిస్తే జీవితం ఎంతటి ధర్మబద్ధమౌతుందో దానివలన కలిగే ప్రయోజనమేమిటో స్పష్టంగా తెలియాలి. అంటే సాయి జీవితము, బోధల తత్వము, విలువ తెలియాలి. ఆ తరువాత అవి నిత్యజీవితంలో ఆచరించగలగాలంటే మనకు అడుగడుగునా మార్గదర్శకం కావాలి. అంటే సాయిని సేవించి, తరించడమంటే ఏమిటో, ఎలానో తెలియాలి. "ఈ విషయం శ్రీ సాయిబాబా జీవితం గురించి సచ్చరిత్ర మొ॥నవి చదివితే తెలియదా?" అని మనకనిపించవచ్చు. అది మాత్రమే చాలదని సూచిస్తూ మాస్టరుగారు శ్రీ గురుచరిత్రలో ఇలా వ్రాశారు: "శ్రీ సాయిబాబా మహాత్ములందరిలోకి

అర్థంలేదని నిరూపించారు. తమ జీవితము, బోధలద్వారా భక్తులలో ధర్మాధర్మ విచక్షణను మేల్కొల్పారు. అర్హులైన భక్తులను సకాలంలో అనుగ్రహించి, ఎందరినో మహాత్ములుగా రూపొందించి తమ అవతారకార్యంలో వారికి పాత్ర కల్పించారు. సమాధి అనంతరం కూడా తాము నిత్యసత్యులమై వుంటామని వాగ్దానం చేసి దానిని నిరూపిస్తూ అశేషమైన మానవాళిని నకిలీ గురువులనుండి, నకిలీ ఆధ్యాత్మికతనుంచి రక్షించారు. మనం మరెవ్వరినీ ఆశ్రయించనవసరంలేదు. సమర్ధ సద్గురువు సాయినాధుని, ఆయన సమాధినీ ఎప్పుడు ఎవ్వరు సేవించినా ఆయన మార్గదర్శకులై మనలను తరింపజేస్తారు. ఈ విషయం ఎందరో భక్తుల అనుభవాలద్వారా తెలుసుకోవచ్చు. లేదా మనమే ప్రయత్నించి ఇందులోని సత్యాసత్యాలను పరీక్షించుకోవచ్చు. అదే ఈ సంపూర్ణ దత్తావతారమైన శ్రీ సాయినాధుని విశిష్టత. అందుకే శ్రీ మాస్టరుగారు శ్రీ సాయి లీలామృతము, పేజీ (xi)లో ఇలా వ్రాస్తారు : " మనదేశంలో ఈనాడు నకిలీ గురువులెందరో అమాయక ప్రజలను భ్రమింపజేయడానికి సాధనాలైన మంత్రోపదేశాలు, చిల్లర మహిమలు, ప్రశ్నలు చెప్పడమూవంటి రీతులను శ్రీ సాయి నిషేధించారు. అందుకే ఆయన ఈ యుగానికి

# సద్గురు జననము

తలమానికము-కోహినూర్ వంటి వారైనప్పటికీ తాను సద్గురువునని చెప్పక అతి సామాన్యుడిలా జీవించారు. భక్తులు తమను గురువుగా ఎలా సేవించాలో ఎన్నడూ చెప్పలేదు. భగవద్గీతా శ్లోకాన్ని వివరించినప్పుడు ఆ విషయమై రత్నాల్లాంటి మాటలు ఒకటి రెండు మాత్రమే చెప్పారు. అందుకే ఆయనను ఆ రీతిన సేవించడానికి ఎవరూ ప్రయత్నించలేదు. ప్రయత్నించిన కొద్దిమందీ గూడ చేయలేకపోయారు. అలాగాక గురుచరిత్రలో శ్రీ గురుడు ఎన్నో పురాణోపాఖ్యానాల సహాయంతో ఈ విషయం వివరించారు. అంటే భక్తులు ఎలా శ్రీ సాయిని సేవించాలో శ్రీ గురుచరిత్ర నుండి నేర్చుకోమని శ్రీ సాయి సూచించారన్నమాట".

పై వాక్యాల ద్వారా సద్గురువైన శ్రీ మాస్టరుగారు శ్రీ సాయిని సేవించడమెలాగో సచ్ఛిష్యుడిగా మనకు మార్గదర్శకమయ్యేందుకు జన్మించివుండాలి. పురుషులకు తాను మార్గదర్శకమౌతూ, స్త్రీలకు మార్గదర్శకమయ్యేందుకు అమ్మగారిగా మరో రూపం ధరించివుండాలి. అప్పుడే

శ్రీ సాయినాధుని అవతారపు వైశిష్ట్యాన్ని, ఆయన జీవితపు ఔన్నత్యాన్ని ఆయన బోధలయొక్క ప్రయోజనాన్ని మనకు తమ బోధలు, రచనల ద్వారా వివరించడమే గాక, ఆచరించి చూపిన మార్గదర్శకులు అమ్మగారు, మాస్టరుగారు. శ్రీ సాయీశునికి సంపూర్ణంగా ఆత్మసమర్పణ చేసుకొని ఆయన చెప్పిన మార్గంలో జీవించి, శ్రీ సాయిని సేవించడమంటే ఏమిటో, నిజమైన భక్తుడు, శిష్యుడు ఎలా వుంటాడో మనకు తెలిపారు శ్రీ మాస్టర్. "నన్నే ధ్యానించి, నా లీలలు గానం చేసేవారు నేనుగా మారిపోతారు" అన్న సాయిసూక్తికి మాస్టరుగారి జీవితమే ఒక నిరూపణ. శ్రీ సాయి వద్ద జరిగిన లీలలన్నీ మాస్టరుగారి సన్నిధిలో జరిగాయి, జరుగుతున్నాయి. శ్రీ సాయి వలెనే తానే సర్వజ్ఞుడని సకలదేవతాస్వరూపియని, సకలసాధుస్వరూపియని, నిత్యసత్యుడని మాస్టరుగారు కూడా తమ భక్తులకు అనుభవమిస్తూ వున్నారు. అంతేకాదు తాను 'అమ్మగారి' రూపంలో భౌతికంగా వుండి మనందరికీ మార్గదర్శకం చేస్తున్నారు. గృహస్థులమైన మనందరికీ

> *శ్రీ మాస్టరుగారు శ్రీ సాయిని సేవించడమెలాగో సచ్ఛిష్యుడిగా మనకు మార్గదర్శకమయ్యేందుకు జన్మించివుండాలి. పురుషులకు తాను మార్గదర్శకమౌతూ, స్త్రీలకు మార్గదర్శకమయ్యేందుకు అమ్మగారిగా మరో రూపం ధరించివుండాలి. అప్పుడే సమాజంలోని స్త్రీ పురుషులిద్దరికీ శ్రీ సాయి తత్వాన్ని అన్వయించుకుని జీవించడానికి సంపూర్ణ మార్గదర్శకత్వం లభించినట్లు. అందుకే మాస్టరుగారు, అమ్మగారూ కలిసి ఒకే అవతారం. అర్ధనారీశ్వరం.*

సమాజంలోని స్త్రీ పురుషులిద్దరికీ శ్రీ సాయి తత్వాన్ని అన్వయించుకుని జీవించడానికి సంపూర్ణ మార్గదర్శకత్వం లభించినట్లు. అందుకే మాస్టరుగారు, అమ్మగారూ కలిసి ఒకే అవతారం. అర్ధనారీశ్వరం.

స్త్రీ పురుషులకు వారి వారి జీవితాలను శ్రీ సాయి మార్గంలో మలచుకొని జీవించడమెలాగో, అందువలన ఎంతటి ఉన్నతి కలుగుతుందో తమ జీవితాలద్వారా నిరూపించి చూపిన పూర్ణ సాయి

# సద్గురు జననము

అవతారమే శ్రీ అలివేలు మంగా సమేత శ్రీ సాయి మాస్టర్. అందుకే శ్రీ సాయి దత్తస్వామి పరిపూర్ణ అవతారమే అయినా ఆయనను సేవించడం తెలియకపోతే మనకుపయోగముండదు గనుక సద్గురువు, సచ్ఛిష్యుల అవతారమైన శ్రీ సాయి శ్రీ అలివేలుమంగా సమేత భరద్వాజ మహరాజ్‌లు కలిపి సంపూర్ణ దత్తావతారమని అనిపిస్తుంది. అప్పుడే శ్రీ సాయి అవతారకార్యం సంపూర్ణం కావడం సాధ్యం.

అయితే పామరులైన మనకు ఒక సందేహం కలగవచ్చు. అమ్మగారు, మాస్టరుగారు శ్రీ సాయి భక్తులకు మాత్రమే మార్గదర్శకులా? స్థూలంగా చూస్తే అలాగే అనిపించడం సహజం. కానీ జాగ్రత్తగా ఆలోచిస్తే శ్రీ సాయి బోధలను, లీలలను మనకు అవగతమయ్యేలా వివరించడం, ఆచరించి చూపించడం మాత్రమే వారి అవతారకార్యం కాదని అర్థమవుతుంది. శ్రీ సాయి భక్తులకే గాక సమాజంలోని ప్రతివారికీ వారే మార్గదర్శకం.

శ్రీ మాస్టరుగారు జీవితాన్ని పరిశీలిస్తే ఆయనలో ఒక ఉత్తముడైన పుత్రుడు, సోదరుడు, భర్త, తండ్రి, స్నేహితుడు, ఉపాధ్యాయుడూ మనకు కనిపిస్తారు. అంతేకాదు. సమాజంలో ఒక బాధ్యతగల పౌరుడు, ధర్మ విగ్రహుడైన గృహస్థ, సాంఘిక, సంస్కర్త, పరిపూర్ణ విరాగి, అపార విజ్ఞానవంతుడు దర్శనమిస్తారు. ఒక జిజ్ఞాసువు అంటే ఎలా వుంటాడో, ఉత్తముడైన జిజ్ఞాసువు ఎలా వుండాలో, అన్వేషకుడు ఎలా వుండాలో, ఉత్తముడైన నాస్తికుడు ఎలా వుంటాడో, ఆ తరువాత ఉత్తముడైన భక్తుడు, జ్ఞాని, యోగి ఎలా వుంటాడో ఆయన జీవితం చూసి తెలుసుకోవచ్చు. అలాగే శ్రీ గురుచరిత్ర గ్రంథ పారాయణ పద్ధతి గురించి మనకు తెలిపి దానిని పారాయణ చేసి ఎవరికి వారు నకిలీగురువుల బెడదనుంచి రక్షింపబడి తమ సద్గురువును తెలుసుకొని సేవించగలిగే సాంప్రదాయాన్ని ఈ లోకంలో ప్రతిష్ఠించారు. దాని ద్వారా భవిష్యత్తులో ఎవ్వరైనా, ఎప్పుడైనా శ్రీ గురుచరిత్ర సహాయంతో సద్గురువును గుర్తించి, సేవించి, తరించవచ్చు. తానూ అలాగే చేసిన తర్వాతే శ్రీ సాయి మాస్టరుగారిని తమ శిష్యుడిగా అంగీకరించారట! అదీ ఆత్మానుభూతిని ప్రసాదించిన తరువాత! అంటే ఆధ్యాత్మికానుభూతి అనంతరం కూడా శిష్యుడిగా సద్గురువు అంగీకరించడం ముఖ్యమన్నమాట. అందుకు శ్రీ గురుచరిత్ర సాధనమన్నమాట. ఆ తరువాత నిజమైన మహాత్ములు ఎలా వుంటారో, వారిని దర్శించి, సేవించడమెంత అవసరమో వివరించారు, ఆచరించి చూపించారు. ఇలా ఆధ్యాత్మికంగాను, లౌకికంగాను పరిపూర్ణమైన ధర్మబద్ధమైన జీవితం గడుపుతూ తానూ సాయి స్వరూపమై వెలిగారు. సశరీరంగా వున్నప్పుడూ, లేనప్పుడూ తమ భక్తులను అనుగ్రహిస్తూనే వున్నారు.

శ్రీ మాస్టరుగారి జీవితం పురుషులకు ఆదర్శప్రాయము, మార్గదర్శకమూ అయితే అమ్మగారి జీవితం స్త్రీలకు మార్గనిర్దేశకం. ఒక స్త్రీ ఉత్తమమైన కన్యగాను, తదనంతరం ఉత్తమమైన గృహిణిగాను ఎలా వుండాలో, ఆత్మజ్ఞాని అయిన భర్తకు సర్వసమర్పణ చేసుకొని వారి మార్గంలో ఎలా నడవాలో, ఒక తల్లిగా పిల్లలను ఎలా మలచాలో, అతిధులను గృహిణిగా ఎలా ఆదరించాలో - వీటన్నింటిలో ఆధ్యాత్మికతను మేళవించి జీవించడం ఎలాగో అమ్మగారి జీవితం చూస్తే తెలుస్తుంది. ఆమె జీవితమే ఒక దీక్ష. అంతేకాదు తన సద్గురువైన శ్రీ మాస్టరుగారిని కీర్తిస్తూ, శ్రీ సాయిని వారి మార్గంలో సేవిస్తూ, శ్రీ సాయి మాస్టర్ భౌతికరూపమై నేడు మనలను అనుగ్రహిస్తున్నారు. సంపూర్ణ వైరాగ్య స్వరూపులైన శ్రీ మాస్టరుగారు, అమ్మగార్ల జననము, లోకోద్ధరణ కోసమే గదా! మనకు తమను తాము దత్తం చేసుకున్న ఆదిగురువైన శ్రీ దత్తాత్రేయ తత్వమే! అదే సద్గురు జననం. సకలలోక వంద్యం.

# లేఖలలో కురిసిన అమృత వర్షం



*పూజ్య ఆచార్యులకు ఎందరెందరో భక్తులు ఉత్తరాలు వ్రాసేవారు. వారు తమ కష్టాలనూ, సమస్యలనూ, సాధనాపరమైన ప్రశ్నలనూ గురుదేవులకు ఉత్తరాల ద్వారా నివేదించేవారు. వారికి మాస్టర్‌గారు తమ అద్భుత ప్రేమమయ శైలిలో జవాబులిచ్చేవారు. వీటిలో కొన్నిటిని శ్రీ థామస్ రెడ్డిగారు సేకరించి "ఆచార్య అమృత లేఖావళి" అనే గ్రంథంగా సంకలనం చేశారు. అట్టి అద్భుతమైన పుస్తకంలోని లేఖలలో మనకు కనిపించే బోధ అమూల్యం. ఆ లేఖలలోని కొన్నిటిలో లభించిన బోధను ఆచార్య భరద్వాజ మహరాజ్ 75వ జన్మదిన సందర్భంగా మీ ముందుంచుతున్నాము....*

***"కష్టసుఖాలు జీవితానికి సహజం. రామునికి కృష్ణునికి గూడ ఆ రెండూ తప్పవు. ఆత్మజ్ఞానం కల్గితేగాని నిశ్చలమైన ఆనందం సాధ్యంకాదు.*** కష్టాలు తీరే వరకు ఇష్టమైన వంటకమొకటి బాబాకు విడచి పెట్టి ఆయన చరిత్ర నిత్యమూ పారాయణం చేసుకుంటూ అన్నంలో మొదటిముద్ద బాబాకని వాకిట్లో విడచి మిగిలినది ప్రసాదమని తలచి తింటూండు. సర్దుకుంటాయి. ప్రశ్నలు చెప్పే వెధవల వద్దకెప్పుడూ వెళ్ళవద్దు. వారివలన ఎన్నో కుటుంబాలు పాడవుతున్నాయి. ***అదేమి పట్టించుకోవద్దు. అన్నీ సకాలంలో ఆ సాయి చక్కదిద్దగలరు. బాబా అనుగ్రహించాలని ప్రార్థిస్తాను".***

***"శ్రీ గురుచరిత్ర చేతిలో వుంచుకొని, ప్రక్కనే మహోత్తరమైన మందిర ముంచుకొని మీరు ఇబ్బందులు పడుతుంటే అంతకంటే ఆశ్చర్యమేమున్నది? జీవితం యొక్క ఒకే ఒక లక్ష్యం మొదట ప్రశాంతంగా హాయిగా వుండడం.*** మానవ జీవితానికి సమస్యలు మామూలే. వాటి గురించి మనం చేయవలసినది చేసి ఆపై పట్టించు కోకుండా సాయిని స్మరిస్తుంటే అంతకంటే ఆనందమే లేదు".

"సాయి ప్రబోధామృతము జాగ్రత్తగా చదివితే యోచనను ఎలా పటిష్టం చేసుకోవాలో తెలుస్తుంది. ఇది ***'జగత్తు' అన్న భావం పోయి క్రమంగా అన్ని రూపాలలో వున్న ఒక సత్యం మీద మనస్సు నిలుస్తుంటే చాలు. ఇది క్రమంగానే కుదురుతుంది.*** ఓరిమి, నిష్ఠ, యీ యత్నములో వహించడమే, దక్షిణ. ప్రాకృతికమైన అవసరాలు గూర్చి మీరుగా నిగ్రహించవద్దు. మనస్సు పారాయణలోనూ, భావ పూర్వకమైన నామం జపం, పూజ, నామ లేఖనలలోనూ, కర్తవ్యనిర్వహణలోనూ, తెరిపి లేకుండా నిమగ్నమై, మిగిలిన సమయాన్ని సద్గ్రంథ పఠన వాటిలోని భావాన్ని మననం చేస్తూ వాటిలో చెప్పిన రీతిన ప్రపంచాన్ని దర్శించే పద్ధతి యత్నించడం కర్తవ్యం".

***"ఆసనాలు, లీలా స్మరణతో పాటు సాయి రూపాన్ని దర్శిస్తూ వారి సన్నిధిని భావన చేస్తుంటే చాలు. అన్నీ అవే సమకూరుతాయి.*** మనయత్నము సడలింపు చేయకూడదు. మనలో పరిణతి రాలేదని అతిగా ఆరాటపడడం గూడ ధ్యానంలో అంతరాయమే. పరిణతి కోసమున్న తపన కృషియొక్క తీవ్రత, సమర్ధతలలో మాత్రమే ప్రకటమవ్వాలి. 'నీవేది చేసినా క్షుణ్ణంగా చేయి' ".

*"సాధనంతా సచ్ఛిష్యుల మవ్వడం నేర్చుకోవడమే. మానావమానాలు రాగ ద్వేషాలు, జయాపజయాల వలయంలో తగుల్కొనని గురుభక్తి - ఇదే జీవిత పరమార్ధం. దాని నెంత మేరకు గుర్తించి అలవరచుకోలేమో అంతమేరకు జీవితములు వ్యర్ధమే".*

***"ఏ మహాత్ముడి దగ్గర కెళ్ళినా ఆ సాధువు రూపములో వున్న సాయిని అనుగ్రహించమని సాయిని ప్రార్థిస్తుంటాము. అప్పుడు వారిలోనున్న సాయి మనల్ని అనుగ్రహించడము జరుగుతుంది.*** చైతన్యము శాశ్వతమైనది సర్వ వ్యాపకమైనది. నిరంజనము దాని గుణము. తద్వారా నిత్యానందాన్నిస్తుంది. ఒకే సూర్యునిలోని రశ్మిపద్మాలను వికసింపజేసినట్లు, కలువలను ముకులింప జేసినట్లు, నీటిని ఆవిరి చేసినట్లు యింకా ఎన్నో.... ! ఒకే చైతన్య శక్తి వారి వాసనా త్రయాన్ని బట్టి వ్యక్తమౌతూ వుంటుంది".

*"నిజమైన ఆధ్యాత్మికత బలహీనులను చేయదు. అలా అయితే నేను బలహీనుడను కావాలసినది గదా?(మాష్టర్ గారు) సరిగ్గా అర్ధం చేసుకుంటే బలవంతుడౌతాడు."*

"అంత నమ్మిన సాయి తప్పక కరుణించి నీకత్యంత శ్రేయోదాయకమైనట్లు అన్నీ సమకూర్చగలడు. ప్రేమ, విశ్వాసాలను వుంచుకొని, ***కష్టసుఖాలను సాయి అను వైద్యుడు అజ్ఞానమనే రోగం నివారణకై యిచ్చే మందులన్న భావంతో కృతజ్ఞతతో, ప్రేమ గౌరవాలతో స్వీకరించు.*** ఏవైనా చిక్కులొచ్చినా వత్తిడివచ్చినా కర్మక్షాళన జరుగుతుందని గుర్తించి సబూరి, నిష్ఠలను మరింత నిలుపుకోయత్నించాలి. త్వరలో కృతార్థుడవుకాగలవు".

"ఎవరేమి చేస్తారోనని భయపడవద్దు. ఏదైన మన ప్రారబ్ధంలో లేక ఎవరూ ఏమీ చేయరు. ఉంటె ఎవరూ తప్పించలేరు. సాయి తప్పించగలరు. కాని అలా తప్పిస్తే మరు జన్మలో తప్పదు. ***ముక్తి కావాలసిన వాడు నిర్భయంగా, శాంతంగా తన కర్మఫలాన్ని సంతోషంగా అనుభవిస్తాడు. కారణం ప్రారభ్దం గడిచిపోతే గాని ముక్తి రాదు.*** ఈ లోపు కొత్త కర్మ ఏర్పరుచుకోకుండా ఉండాలి. అంతే, శాయశక్తులా, సద్గురువును హృదయంలో ఎప్పుడూ స్మరిస్తూ "ఆయన మనకి మంచి కానిది జరగనివ్వడు", అన్న విశ్వాసంతో సుఖ దు:ఖాలను సంతోషంగా అనుభవించాలి. దు:ఖాలు మందువంటివి. చేదుగా వున్నా వ్యాధినిర్మూలనకే అంటే కర్మవినాశానికే, భగవంతుడి దయ మీద మరింత ఆధారపడడానికి ప్రపంచం మీద వైరాగ్యం ధృడపడడానికి అవసరం. మహాత్ములోర్చిన బాధల ముందు మన భాధలెంతా? అందరిలో వున్న బాబా ఆయనను భక్తితో స్మరించేవారి కెవరివల్లా ఏ రూపంలోనైన ఎలా బాధ కల్గిస్తారు - ప్రయోజనం లేకుండా? వారిలో కూడా బాబానే ధ్యానించి నీకేది మంచో అలా చేయమని చెప్పు చాలు. అంతా ఆయనే అయితే, నీవు వేరే ఎక్కడున్నావు? బాధ భయపడడమెలా? ఎందుకు? ఎవర్ని చూచి! బాగా యోచించి అంతటా ఆయననే చూస్తూ ఏదొచ్చినా అనుభవించిన వాడు తప్పక ముక్తి పొందుతాడు. అయినా ***భయం తీరకపోతే ఆయననే శరణు పొందు. తగురీతిన ఆయన చేస్తారని, మనకంటే ఎక్కువగా మన మంచి, న్యాయం ఆయనకు తెలుసునని గుర్తుంచుకో.*** ప్రేమా, భక్తి కలిగివుండు. నీ శరీరంలోని పంచభూతాల రూపంలోను, వాటి రూపమైన చరాచర జగత్తులోను, నీ మనస్సులోనూ ఆయననే చూడు. అయనే వున్నాడని గుర్తుంచుకో. యోచనకొచ్చే వేరే వస్తువేమివ్వగలదు. ఇది నీవు కొంతైనా శ్రమించి ఆచరిస్తే, అద్భుతానుభవాలు, పురోగతి కలుగుతాయి".

**"ఆచార్య అమృత లేఖావళి" గ్రంథం నుండి.**

మహాత్ములలో తలమానికముగా, సామ్రాట్‌గా కొలవబడిన శ్రీ సాయినాథుని లోకానికి మరల పరిచయంచేసి, చర్చలు, గ్రంథాలు, సత్సంగాలవంటి ఎన్నో విధాలుగా నిజమైన ఆధ్యాత్మిక పథాన్ని పునరుజ్జీవింపజేసిన పూజ్య గురుదేవులు శ్రీ భరద్వాజ మహరాజ్ జీవితము అత్యంత విశిష్టమైనది. ఆయన గురించి ఎంతగా చెప్పుకున్నా అది ఆయన నిజతత్వంలో లవలేశమే. "ఈ భూమినంతటినీ కాగితంగా చేసుకొని, చెట్లన్నింటినీ కలంగా మలచి, సముద్రమంతటినీ సిరాలా వాడినా గురు గుణాలన్నింటినీ వర్ణించలేను" అంటారు కబీరు. అదీ వారి స్థితి. అయినా మనకు తెలిసినంతలో ఆయన గురించి చెప్పుకోడము ఎంతో ఆనందదాయకము, ఉపయోగకరము. "జ్ఞానిని జ్ఞానే గుర్తు పట్టగలరు" అంటారు శ్రీ రమణ మహర్షి. పూజ్యమాస్టరుగారు గురించి తెలుసుకోవాల్సిన విషయంలో ఇతర మహాత్ములు ఆయనను ఎలా



ప్రశంసించారో, ఆయన పట్ల ఎంతటిగౌరవమూ ప్రేమ కనబరచారోనన్నది ముఖ్యాతిముఖ్యము.

శ్రీ శిరిడీ సాయివద్ద ఉన్నతమైన సమాధి స్థితి పొందిన తర్వాత, 16 సంవత్సరాలపాటు నిరంతరంగా ఆయన గురించి తెలుసుకుంటూ శ్రీ సాయి లీలామృతము ద్వారా దశదిశలా ఆయన కీర్తిని వ్యాపింప జేయడమేకాక, తన జీవితాన్నంతటినీ త్రికరణశుద్ధిగా ఆయనకంకితం చేసి నడిపినవారు పూజ్య గురుదేవులు. అందుకేనేమో *శ్రీ పాకలపాటి గురువుగారు "నీవు నడుస్తున్న మార్గం కూడా రాచబాటే"* అనీ, *శ్రీ మాలిక్‌బాబా గారు "ఓ ఆంఖోమే దేఖో బాబా హై.... సాయిబాబా హై"* అన్నారు. *శ్రీ గుళవణీ మహరాజ్ గారు "ఓ సాయిబాబా కా బేటా"* అన్నారు.

సమాజంలో ఆధ్యాత్మిక ప్రచార పత్రికలు ప్రజలకు ఆకర్షణీయమైన విషయాలతో, వార ఫలాలు, సంఖ్యా శాస్త్ర జిమ్మిక్కులతో జనాలను ఆకర్షిస్తూ భక్తులను ప్రక్కదారి పట్టించే విధంగా ప్రవర్తిస్తూంటే పూజ్య గురుదేవులు కేవలము నిజమైన ఆధ్యాత్మికతను, వ్యక్తి ప్రాధాన్యతలేని బోధను జనుల ముందుంచారు. ఆయన స్థాపించి నడిపిన 'సాయిబాబా' పత్రిక నిష్కర్షగా సాధకుని పురోగతికి కావాల్సిన అంశాలను తెలుపుతూ, అవసరములేని, తప్పు మార్గాలను సమాజానికి ఎంత విరుద్ధమనిపించినా ప్రకటించి మకుటాయమానంగా నిలిచింది. అందుకేనేమో అవధూత *శ్రీ సుధీంద్ర బాబుగారు ''ఇప్పుడున్న కాలానికి ఎదురీదుతున్నారాయన! ఆచార్య పదివికి అర్హులు''* అన్నారు. ఎంతలోతయిన, గంభీరమైన కితాబు!!

"తక్కిన ప్రపంచం తల్లక్రిందులు కానివ్వు. దాన్ని లక్ష్యపెట్టక, ఋజుమార్గంలో వెళ్లు" అన్న సాయి వాక్యాన్ని పాటించి సాయి మాటను నిజంచేసిన మగతనమే ఆయన నిజమైన వ్యక్తిత్వము. సమాజంపై ఆయనకు కల తిరుగులేని, అవ్యాజమైన ప్రేమ పట్ల మెచ్చుకోలుగానే కాబోలు, సామాన్యంగా ఎవ్వరినీ కనీసం పటించుకోని ఉన్నత శ్రేణి అవధూతయైన *శ్రీ చీరాల స్వామీవారు, "ఆ ఎల్లిస్వామి ఎప్పుడొస్తాడయ్యా, ఎల్లిస్వామి ఎప్పుడొస్తాడయ్యా"* అని ఆయన దర్శనం కోసం తపించేవారు. *శ్రీ నారాయణ మహరాజ్‌గారు "అయ్యా (అందరితోపాటు) నీకు కూడా (తీర్థం) కావాలటయ్యా? సరే పట్టు!"* అని తలపై చల్లారు. *అవధూత శ్రీ రామిరెడ్డితాతగారు "ఆయన చాలా గొప్పవాడయ్యా. జ్ఞానం తెలిసినవాడు"* అంటారు.

ఆయన దగ్గరకి ఏరోజున ఎందరు వచ్చినా ఆదరణ లభించేది. ఎటువంటి జీవిత సమస్యకైనా తప్పక సహాయం లభించేది. లౌకికంగానూ, పారమార్థికంగా కూడా! వచ్చిన వాళ్ళలో డబ్బుకోసం వచ్చే దొంగలు, బాబా ప్రచారంకని డబ్బు తీసుకొని మాయమయ్యే మోసగాళ్ళ వంటి ఎవరైనా సరే, ఆయన దగ్గర తిరస్కరణే లేదు. కాకపోతే రెండవసారి అతని మేలు కోసం జాగ్రత్తపడే వారు. అంతే. ఎంతమంది ఎన్నిసార్లు, ఏసమయంలోనైనా ఆయన ప్రేమ ఆదరణ తప్పక పొందగలిగేవారు. చెప్పిన విషయాన్నే మళ్ళీ మొదటినుంచీ ఎన్నిసార్లయినా అడిగినవారికి అర్థమయ్యేదాకా చెప్పేవారు. కారణం ఆయన అందరిలో బాబాను మాత్రమే చూశారు. బాబా అడిగినట్లే భావించి ప్రవర్తించేవారు. అందుకేనేమో, *శ్రీ అవధూత రాఖాడీ బాబా గారు, పూజ్య మాస్టరుగారితో, "శివా! నీవెక్కడ నమస్కరిస్తే అక్కడ సాయినాథుని పాదాలుంటాయి... జయము"* అని వారిస్థితిని మనందరికీ తెలియపరచారు.

జీవులను ఆధ్యాత్మికంగా ఉద్ధరించడమే అవతారకార్యంగా కల భగవంతుని తత్త్వమే శ్రీ దత్తస్వామి అని, అన్ని ఆధ్యాత్మిక సాంప్రదాయాలకూ మూలము యోగనాథుడైన శ్రీ దత్తాత్రేయులేనని ఆయనను, ఆయన పూర్ణ అవతారాలనూ సేవించడమే నిజమైన ఆధ్యాత్మికతని తెలియపరచిన అమూల్యమైన బోధయే పూజ్య గురుదేవుల జీవితము. అందుకేనేమో అవధూత *శ్రీ రామిరెడ్డి తాతగారు* పూజ్యగురుదేవుల గృహానికి విచ్చేసి, తిరిగి వెళ్ళేటప్పుడు *"దత్తస్వామి ఎక్కడున్నారు?"* అని అడిగితే *"ఇప్పుడు మనం వచ్చిన ఇంట్లో వున్నారు'* అని చెప్పారు.

*అవధూత శ్రీ వేణుగోపాలస్వామి "భగవాన్ సమాన్ హై భరద్వాజ" అనగా శ్రీ నానామహరాజ్* గారు ***"Bharadwaja is Bharadwaja"*** అనటం ఆయన విశేషమైన అవతార కార్యానికి సరియైన కితాబు. అటువంటి భగవత్ స్వరూపియైన పూజ్య గురుదేవుల 75వ జయంతి సందర్భంగా ప్రతి ఒక్కరూ ఆయన విశదపరచిన జ్ఞానమార్గంలో పయనించి భగవత్కృపకు అర్హులమవడమే చేయవలసినది. ఈ మార్గాన్ని, వారి అవతారకార్యాన్ని అందరికీ పరిచయం చేస్తూ మనము, మనవారందరినీ



తరింపజేసుకోవడమే కర్తవ్యము. పూజ్య గురుదేవులు ఆదేశించినట్లు అలా "క్షణక్షణమూ ఆత్మవికాసానికి కృషి చేయటమే మానవ జీవిత లక్ష్యము" అన్న వారి ఉపదేశాన్ని ఆచరించడమే ఆయనకు, ఆయన స్వరూపమైన ఈ అనంత విశ్వానికీ మనం చూపవలసిన ఏకైక కృతజ్ఞత.

---

*"ఎవరిపట్లనైనా ముందుగా ఒక అభిప్రాయానికి రావటం మంచిది కాదు. ఎవరినైనా అనాలోచితంగా నిందించడం మన స్వభావంలోని దోషాన్ని సూచిస్తుంది. దానికి హోమియోలో మంచి మందు వుంది" అంటూ మలిన మనస్సు కలవారిని ఎలా అర్థం చేసుకోవాలో, వారికి సైతం ఎలా తరుణోపాయం చూపాలో ఆలోచించి ఆచరించిన ఆచార్యులు మన శ్రీ భరద్వాజ మాస్టర్!.....*



# గుణదోషనివారణకు ఔషధం ప్రేమ

కే. శ్యామ్ ప్రసాద్

ముందుగా అందరినీ వారి వారి లక్షణాలను వ్రాసి హోమియో డాక్టర్ దగ్గర యివ్వమనేవారు. దానిని పరిశీలించిన తరువాత మనకి తెలియకుండా మనలో దాగి వుండే కొన్ని లక్షణాలను డాక్టరుగారికి మాస్టరుగారు వివరించి ఫలానా మందు సరిపోతుందని సూచించేవారు. కొన్ని మందుల పొటెన్సీని మాస్టరుగారు సూచిస్తే డాక్టరుగారు సైతం "అంత పొటెన్సీ నేనెప్పుడూ వాడలేదు. మీ మీద భారం వేసి ఆ మందు ఇస్తాను సార్!" అనేవారు.
అనేక శారీరక దోషాలు మానసికమైన రుగ్మతలకు కారణమౌతాయని చెబుతూ చాలా మందిని హోమియో చికిత్స కొరకు పంపేవారు. ఎక్కువమందికి నిత్య జీవితంలో సుఖ సంతోషాలు కొరవడటానికి కారణం గృహస్థాశ్రమంలోని అస్తవ్యస్థ ధోరణులే. గృహస్థాశ్రమంలో సక్రమంగా వుంటూ పిల్లల్ని మంచి పౌరులుగా తీర్చిదిద్ది సమాజానికి, భావితరాల వారికి ఆదర్శంగా నిలవాలనేవారు.

ప్రతి మనిషిలోనూ మూడు రకాల దోషాలుంటాయి. 1.శారీరక దోషము 2. మానసిక దోషము 3.ఆధ్యాత్మిక దోషం. 1-శారీరిక దోషాన్ని ముందుగా గుర్తించి మంచి మందులతోను, మంచి వ్యాయామాలతోనూ తొలగించుకోమనేవారు. 2-మానసిక దోషాన్ని వివేక వైరాగ్యాలతోకూడిన అవగాహన ద్వారా, కొన్ని హోమియో మందుల ద్వారా తొలగించుకోమనేవారు. 3-ఆధ్యాత్మిక దోషాన్ని సద్గురు సేవ ద్వారా (శ్రీ సాయి చరిత్ర, శ్రీ గురు చరిత్ర పారాయణల ద్వారా) తొలగించుకోమని తెలిపేవారు.

"అన్ని దోషాలు తొలగాలంటే సాటి వ్యక్తులను ప్రేమించటం చేత కావాలి! మనం సాటి వ్యక్తులకు ప్రేమ ఆప్యాయతలు పంచితే అప్పుడు అర్థమవుతుంది నిజమైన తృప్తి, సంతోషం! అదే మనిషికి కావలసినది! అదే మనకేం కావాలో తెలియటమంటే!" అని సత్సంగాలలో చెప్పటం మాత్రమే కాదు, ఆచరించిన మహాత్ములు మన మాస్టరుగారు. అలా మాస్టరుగారు చూపించిన ఆప్యాయత మరువలేను.




*సెప్టెంబరు 2వ తేదిన 'శ్రీ గురు చరిత్ర కృతజ్ఞతార్చన' పర్వదినాన్ని శ్రీసాయిమాష్టరు భక్తులందరూ భక్తిప్రపత్తులతో జరుపుకున్నారు. తరతరాలుగా ఎందరో ముముక్షువులకు సద్గురు సేవను ప్రసాదించడమేకాక, కేవలం పారాయణే దివ్యసాధనంగా చేసుకొన్నవారినీ తరింపజేసిన పరమపవిత్రమైన ఆధ్యాత్మిక గ్రంధము 'శ్రీ గురు చరిత్ర'....*

# శ్రీ గురుచరిత్ర
# కృతజ్ఞతార్చన మహోత్సవము 2012

**కాళిదాస్**

దత్తావతారమైన శ్రీ గురుని అక్షరస్వరూపమైన 'శ్రీ గురు చరిత్ర' ను పూజించడము సాధకులందరికీ ఎంతగానో మేలు చేయగలదు. అటువంటి సంకల్పముతో జరుపుకునే ఈ అర్చనోత్సవము, దివ్యజనని అలివేలుమంగాపురియైన నాగోలులో యీ సంవత్సరము వైభవంగా జరిగింది. 'శ్రీ గురు చరిత్ర' ముఖచిత్రంతో నిండిన పెద్ద ఫోటో రూపంలో భక్తుల పూజలందుకోవటానికి 'శ్రీ గురు చరిత్ర' గ్రంధరాజము ఆశీనురాలయినది. దానికి రెండువైపులా పూజ్య మాస్టరుగారు రచించిన అపూర్వమైన ఆధ్యాత్మిక గ్రంధాలు, వాటి రూపంలో శాశ్వతరూపం ధరించి, తమ లీలా స్వరూపము భక్తులకొసంగిన ఎందరెందరో మహాత్ములు ఆశీనులయినారు. శ్రీ సాయి లీలామృతము, శ్రీ స్వామి సమర్ధ, శ్రీ పాకలపాటి గురువుగారి చరిత్ర, అవధూతలు శ్రీ చీరాల స్వామి, మిలారేపా, శ్రీ ఆనందమాయి అమ్మ, చివటం అమ్మ వంటి మహాత్ముల జీవిత విశేషాలు ఎంత తరిచితే అంత మధురమైన ఆధ్యాత్మిక ఫలాలనందించగలవు కదా. ప్రత్యేకమైన పీటలపై తమతమ 'శ్రీ గురు చరిత్ర' గ్రంధాన్ని వుంచి పూలతో అలంకరించి భక్తులు సిద్దంగా వున్నారు. ఇటువంటి ముక్తి మార్గాన్ని తెలిపి మార్గదర్శకులై అనుగ్రహించిన సద్గురువులు అలివేలుమంగా సమేత భరద్వాజ మాహరాజ్‌ల చిత్ర పటాన్ని 'శ్రీ గురు చరిత్ర' గ్రంధము ప్రక్కన పీటలపై వుంచారు. ఈ పర్వదినాన పీఠాన్నలంకరించిన మహాత్ములందరి చల్లని చూపులతో పూజా కార్యక్రమము ప్రారంభమయింది. పూజ్య శ్రీమతి వేదవతి గారు విచ్చేసి సాయినాధ పూజావిధానమైన షోడశోపచార పూజ భావరాగ సహితంగా చేస్తుంటే భక్తులందరూ శ్రద్ధగా తమ గ్రంధాలను

పూజించుకున్నారు. పూజానంతరము వేదమ్మగారు అందరిచేతా భజన చేయించారు. దత్త, సాయి, సద్గురు నామావళితో ప్రాంగణమంతా దైవభక్తితో నిండిపోయింది. ఈ ఉత్సవానికి ఒక ప్రత్యేకత కూడా వుంది.

ఎక్కడైతే శ్రీ రఘురాముని అర్చన జరుగుతుందో అక్కడ తాముంటామన్నారు



ఆంజనేయులవారు. ఆహా! శ్రీ దత్తావతారమైన శ్రీ గురునికి అర్చన దత్తాత్రేయులవారు త్రిమూర్తులనూ తమలో ఇముడ్చుకున్న తత్వము. సాక్షాత్తూ పరిపూర్ణమైన సృష్టితత్వము. ఇక ఈ ఉత్సవానికి ఎందుకు మహాభక్తులు హాజరయివుంటారో, ఎందుకు ఋషులు తమ భాగ్యంగా యీ ఉత్సవాన్ని తిలకించి ధన్యులయివుంటారో చెప్పసాధ్యమా? ఇక మన భాగ్యం చూడండి: ఎన్ని గ్రంధాలు చదివితేనో, ఎన్ని వ్రతాలు చేస్తేనో భగవంతుని సాహచర్యం యీ 'శ్రీ గురు చరిత్ర' గ్రంథ మహిమవల్ల లభించింది కదా? యీ పర్వదినము ఎంతటి పుణ్యఫలమో తిరిగి ఎంతటి పుణ్యప్రదమో! మన సంకల్పమా యిది? మన కర్మఫలమా యిది? అన్నీ తావే అయి అనుగ్రహించి నడిపించారు పూజ్య గురు భరద్వాజులు. అలా శ్రీగురుచరిత్ర కృతజ్ఞతార్చన రెండవ సంవత్సరమున ఈ రోజు ఈ గ్రంధాన్ని పూజించుకొని తీర్ధ ప్రసాదాలు స్వీకరించి భక్తులు చరితార్థులయ్యారు.

నాగోలులోనే కాకుండా ప్రపంచమందంతటా యీ వుత్సవాన్ని జరుపుకున్నారు. హైదరాబాద్(14 చోట్ల), ఒంగోలు, కావలి, ఏలూరు, దెందులూరు, పెద్దాపురం, ఇంకా America, Europe, Australia ఖండాలతో కలిపి సుమారు150కు పైగా సత్సంగాలలో ఈ రోజున కృతజ్ఞతార్చన జరిగింది. అలా భూమండలమంతా కొన్ని వేలమంది ఈ అర్చనలో పాల్గొని తరించారు. ఈనాటి సమాజంలో సంతోషం నింపటానికి, విశ్వశాంతికి నాందిగా ఈ మహోత్సవం చరిత్ర పుటలకెక్కింది. ఈ సంవత్సరము అక్టోబరు 30న పూజ్యగురుదేవుల 75వ జన్మదిన మహోత్సవము కనుక ఈ రోజును పండుగలా ప్రతివారూ తమ తమ ఇండ్లలో, సత్సంగాలలో జరుపుకోవాలని పూజ్య గురుపత్ని అలివేలుమంగమ్మ, పూజ్య బాబుగారు సంకల్పించారు. అలా అందరూ ఈ ఉత్సవాన్ని ఊరు ఊరునా, వాడ వడలా ప్రపంచమంతటా జరుపుకొని చరితార్థులవుతారని ఆశిద్దాము.

జై సాయి మాస్టర్!!

పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయి లీలామృతం-శ్రీ గురు చరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయి లీలామృతము | 70-00 |
| శ్రీ గురు చరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయినాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడమెందుకు | 5-00 |
| సత్సంగము-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞాన వీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యానయోగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్మ్యం | 40-00 |
| సంహితాయన గురు ద్విసాహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్యవాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీ చీరాల స్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యస్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ (అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము-మన సంస్కృతి | 55-00 |

## ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నందదీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| **బాలల శ్రీ సాయి లీలామృతము** | **25-00** |

## BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

## BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba (Hindi) | 100-00 |
| Sai Leelamrutham (Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitham(Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutham (Tamil) | 80-00 |
| Sri Guru Charitra (Hindi) | 50-00 |
| Sri Guru Chraitra (Kannada) | 99-00 |
| Swami Samartha (Kannada) | 45-00 |
| Shirdi Arathi (Tamil) | 6-00 |
| Stavana Manjari (Tamil) | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust,**
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri Colony, Nagole, Hyderabad - 68
Phone : 040-20063300

**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust (Publications)", payable at Hyderabad OR Ongole**

*పనిచేయి, దేవుని నామముచ్చరించు, సద్గ్రంథాలు చదువు.*

జై సాయి మాస్టర్!

## ఆవిష్కరణ

# శ్రీ సాయి సచ్చరిత్ర

మూలము:

శ్రీ అన్నాసాహెబ్ ధబోల్కర్ (హేమాద్పంతు)

తెలుగు అనువాదము:

పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్
పూజ్య శ్రీమతి అలివేలు మంగమ్మ

విజయదశమి, 24 అక్టోబరు 2012




దివ్య జనని సన్నిధిలో శ్రద్ధా భక్తులతో ఉప్పొంగిన "శ్రీ గురు చరిత్ర కృతజ్ఞతార్చన "2012 వేదిక.

ప్రపంచ నలుమూలలా 150కు పైగా సత్సంగములలో "శ్రీ గురు చరిత్ర కృతజ్ఞతార్చన" వేడుకగా జరిగింది.



"నా మట్టి పలుకుతుంది. నా సమాధి సమాధానం చెబుతుంది"

edited, printed and published by p. srinivasarao B.A. , B.l. , advocate for Sri Manga Bharadwaja Trust,
ongole - 523002. postal registration number : prakasam/16/2012-2014, regd.no. 37926/83.



శ్రీ సుధీంద్రబాబు గారి

ఆరాధన మహోత్సవము – 29.11.2012

# సాయి మన కోరికలన్నీ తీరుస్తారా?

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

శ్రీసాయిలాగా అనుక్షణమూ తమ సర్వజ్ఞత, సర్వవ్యాపకత్వాలను నిరూపించే సద్గురువుపట్ల మన విశ్వాసం త్వరగా సడలదు. అందుకే రమణ మహర్షి అటువంటి గురువునాశ్రయించిన భక్తుని పులినోట చిక్కిన వేటతో పోలుస్తారు.అంతటి గురువు ప్రత్యక్షంగా దొరకడం కష్టము. వారి నిర్దుష్టమైన జీవిత విధానం సంశయాలకు తావివ్వదు. అయినప్పటికీ అజ్ఞానంతో అడిగినదల్లా వారు నెరవేర్చలేదని భక్తులు వారికి దూరమవడము చూస్తూవుంటాము. అటువంటప్పుడు మనం వారి పట్ల విశ్వాసాన్ని వహించేబదులు ఆశను వహించామని అర్థము. మన పూర్వ జన్మలోని ధర్మాధర్మాలతో సంబంధంలేకుండా మనం కోరినదల్లా ఆయన నెరవేర్చాలంటే ఆయన సర్వ జీవులపట్ల సమభావంలేని పక్షపాతి, అధర్మాత్ముడు గావాలి! సర్వజీవుల పట్ల సమమైన ప్రేమ కలిగి యుండటమే ధర్మానికి జీవకఱ్ఱ. ధర్మమే వారి జ్ఞానానికి నిదర్శనం. ధర్మనిర్ణేత కొన్ని హద్దులకు కట్టుబడే జీవులపట్ల దయజూపడం న్యాయం.

నిజమైన భక్తి లేక విశ్వాసము సరైన అవగాహన మీద ఆధారపడుతుంది. పసిపిల్లలు తల్లిదండ్రులు తాము కోరినవిస్తారని మాత్రమే ప్రేమిస్తారు. ఇది స్వార్థమే కానీ ప్రేమ కాదు. ఆలోచన పెరిగిన కొద్దీ తల్లిదండ్రులు తమ శ్రేయస్సుకోసం శ్రమపడటాన్ని అర్థం చేసుకుని వారిచ్చే క్రమశిక్షణ తాత్కాలికంగా బాధగావున్నా సంతోషంగా స్వీకరిస్తారు. ఇది ఓరిమి, విశ్వాసాలతోగూడిన ప్రేమ. అలాటి అవగాహన ఓరిమితో కూడిన ప్రేమనే విశ్వాసము లేక భక్తి అంటారు. అదే వైద్యుడిచ్చే చేదుమందు యొక్క గుణం. పామరులమైన మనకు తెలియదు కనుక వైద్యుడు మన శ్రేయస్సు కొరకే మందిస్తాడని మనం విశ్వసించాలి. ఆయనిచ్చే మందు చేదుగా వున్నా, తీయగావున్నా మనకదిమేలు చేస్తుందని గుర్తుంచుకొని కృతజ్ఞతతో తీసుకోవాలి. అలానే మనగత జన్మల కర్మల గూర్చి, మన ఆధ్యాత్మిక శ్రేయస్సు గురించి మనకు తెలియదు కనుక అది తెలిసిన సాయి మనకు శ్రేయస్కరమైనదే చేస్తారని విశ్వసించాలి గానీ ప్రియమైనది మాత్రమే చేయాలిని తలచగూడదు. సాయివంటి పరిపూర్ణుల విషయంలో మనవిశ్వాసము ఎప్పడు సడలినా పొరపాటు మన అవగాహనలోనే, మన ప్రార్థనావిధానంలోనే వుంటుంది. ఇది తొలగాలంటే ''సాయి ప్రబోధామృతము'' జాగ్రత్తగ చదివి మననము చేసుకుంటుండాలి.నిత్యమూ స్నానం చేసి దేహ మాలిన్యాన్ని పోగొట్టుకున్నట్టు, నిత్య మననం ద్వారా అవివేకమనే హృదయ మాలిన్యాన్ని పోగొట్టుకుంటుండాలి. ఈ ప్రధాన సూత్రాన్ని మరచి ఎందరో తమ భక్తి పటిష్టం కావడంలేదని వాపోతారు.

(''పరిప్రశ్న'' గ్రంథం నుంచి)

# సాయిబాబా

ఆధాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంపుటి:30 నవంబరు2012 సంచిక:7

**OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST**

పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన ''సాయిబాబా''

## విషయ సూచిక



చిరునామా

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
jaipuri colony,Nagole,Hyderabad - 500068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**

ఛీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి

ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ ఆర్.ఎస్. శశిధర్, పిహెచ్. డి

చందా వివరములు

| | |
|---|---|
| విడి పత్రి | :రూ. 10-00 |
| సంవత్సర చందా | :రూ. 100-00 |
| రాజపోషకులు | :రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | :రూ. 5,000-00 |


*పరబ్రహ్మ స్వరూపులైన మహనీయుల అనుభవం నుండి వెలువడే వాక్యాలు వేదంవలె మంత్రాలు. వాటిని విని (శ్రవణం చేసి), బాగా ఆలోచించి (మననం చేసి) జీవించాలి. అదే ఉపనిషత్తులు, భగవద్గీత చెప్పేది. అనేక సందర్భాలలో వేరువేరు భక్తులతో శ్రీ సాయి చెప్పిన వాక్యాలు ఒక వరుసలో కూర్చుకొని చదివితే సంపూర్ణమైన ఆధ్యాత్మబోధ లభిస్తుంది. కనుక వాటిని వేరువేరు సూక్తులుగా గాక, ఒక వరుసలో కూర్చుకొని చూస్తేగాని వాటికి సరియైన అర్థం బోధపడదు.*

– ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

# కార్తీక పౌర్ణమి

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

ఏ పట్టణం వెలుపల ఒక చిన్న కుటీరం. అందులో ఎంత కాలంగా జీవిస్తున్నాడో ఎవరూ గుర్తుంచలేని ఒక సాధువు ఉండేవాడు. ఆయన ప్రాపంచిక సుఖాలన్నింటినీ త్యజించారు. రోజుకొక్కసారి మాత్రమే ఆయన ఊళ్ళోకి భిక్ష కోసం వెళ్ళొచ్చేవారు. ఒకరోజు ఒక భక్తుడు ఆయన ఉపదేశం పొంది ఆయన శిష్యుడవ్వాలని తలచాడు. ఓ రోజు ఉదయాన్నే సాధు దర్శనంకోసం అతడు కుటీరం వద్దకు చేరాడు. తలుపు వేసియున్నది. అతడు కొద్దిసేపు చూచి కొంచెం సంకోచిస్తూనే నెమ్మదిగా తలుపు తట్టాడు. ''ఎవరక్కడ?'' అన్న తీవ్రమైన కంఠధ్వని లోపలినుండి విన్పించింది. ''నేను స్వామీ!'' అన్నాడా భక్తుడు.

''అయితే నేను చనిపోయాక రా!'' అని కుటీరం లోపలినుండే సాధువుగారు సమాధాన మిచ్చారు. తాను తలుపుతట్టి సాధువుగారి ధ్యానానికి అంతరాయం కల్పించినందుకు కోపించి ఆయనలా చెప్పియుంటారని తలచి అతడు నొచ్చుకొంటూ ఇంటికి వెళ్ళాడు.



కొద్దిరోజులు గడిచాయి. పొద్దున్నే వెళితే సాధువుగారి దర్శనం కాలేదని తలచి ఆ వ్యక్తి మధ్యాహ్న సమయంలో అయితే వారి దర్శనం లభించవచ్చని తలచాడు. కనుక అతడు మధ్యాహ్నపుటెండలో కాలినడకన కుటీరం చేరాడు. ఆ సమయంలో కూడా తలుపు వేసే వున్నది. కొంచెం సంశయిస్తూనే అతను తలుపు తట్టాడు. ''ఎవరక్కడ?'' మరింత తీవ్రమైన కంఠధ్వని లోపలినుండి విన్పించింది. అతడు భయంతో వణుకుతూనే ''నేను స్వామీ!'' అన్నాడా ముముక్షువు. ''పో! ఇక్కణ్ణించి, నేను చచ్చాకే నీవిక్కడకు రావాలి!'' ఎంతో కోపంగా శాసించింది ఆ కుటీరంలోపలి కంఠం. ఆ సాధువుగారి

**నీలోని 'నేను' నశించితీరాలనే నే చెప్పింది. ఇంతకు ముందు, 'నేను' అన్నమాటకు బదులు ఈసారి 'వీడు' అన్నమాట విన్పించింది. అందుకే తలుపు తీశాను. నీవు పూర్ణిమనాడు రా, ఉపదేశమిస్తాను'' అన్నారా వయస్సు మీరిన వృద్ధుడు.**

పద్ధతి ఈ అమాయకుడికేమీ అర్థంకాలేదు. సాధువుగారి మాటలకంతరార్థం తెలుసుకోవాలని ఎలాగయినా ఆయననుండి ఉపదేశం పొందాలని అతడారాట పడుతూనే కొద్దిరోజులు గడిచిపోయాయి. ఈసారి అతడు కుటీరం చేరేసరికి సూర్యాస్తమయమై బాగా చీకటి పడింది. అయినా యథాపూర్వం ఆ కుటీరం తలుపులు మూసే ఉన్నవి. భయపడుతూనే నెమ్మదిగా తలుపుతట్టాడు. ''ఎవరక్కడ'' కంఠధ్వని మరల అలాగే విన్పించింది.

''నేను, స్వామీజీ''- కొంచెం ఆశగా అతడు సమాధానమిచ్చాడు. ''నీకు బుద్ధిలేదూ? నేను చచ్చిపోయాక నువ్విక్కడకు రావాలని ఇదివరకే చెప్పాను గదా?'' ఈసారి భక్తుడు కొంచెం ధైర్యంచేసి, ''మీకు రోజూ పట్నంలో కన్పించే వ్యక్తే వీడు, స్వామీజీ!'' అన్నాడు. ''మీరు చనిపోయిం తర్వాత వీడొస్తే మీ దర్శన భాగ్యమెలా అవుతుంది?'' అన్నారు. నెమ్మదిగా, నిశ్శబ్దంగా తలుపులు తెరుచుకున్నాయ్. వృద్ధాప్యంలో పండిపోయిన ఆ సాధువు గడపలోపలే నుంచున్నారు. ఆయన పైకెత్తిన లాంతరు వెలుగులో ఆయన ముఖాన తాండవించే చిరునవ్వు, ప్రేమ లొలికించే ఆ చిన్ని కళ్ళల్లోని ప్రేమ, తళుక్కున మెరిశాయి ''బాబూ, నువ్వు చాలా చిన్నవాడివి.నే చెప్పింది అర్థంకాలేదు.

నీలోని 'నేను' నశించితీరాలనే నే చెప్పింది. ఇంతకు ముందు, 'నేను' అన్నమాటకు బదులు ఈసారి 'వీడు' అన్నమాట విన్పించింది. అందుకే తలుపు తీశాను. నీవు పూర్ణిమనాడు రా, ఉపదేశమిస్తాను'' అన్నారా వయస్సు

**''అయితే నేను చనిపోయాక రా!'' అని కుటీరం లోపలినుండే సాధువుగారు సమాధాన మిచ్చారు. తాను తలుపుతట్టి సాధువుగారి ధ్యానానికి అంతరాయం కల్పించినందుకు కోపించి ఆయనలా చెప్పియుంటారని తలచి అతడు నొచ్చుకొంటూ ఇంటికి వెళ్ళాడు.**

మీరిన వృద్ధుడు. కొద్దిరోజులలో కార్తీక పౌర్ణమి వచ్చింది. ఆ భక్తుడు స్వామి పాదాల చెంతన కూర్చున్నాడు. సత్పురుషుల సాంగత్యమెంత గొప్పదో ఆయన వివరిస్తూ, ''రెండుసార్లు కొద్దినిముషాల పాటు ఈ వుపదేశానికొచ్చి వెళ్ళి నంతమాత్రానే నీలోని అహం పల్చబడి 'నేను' అనే మాటకు బదులు 'వీడు' అన్నమాట వచ్చింది చూచావా! ఉపదేశమివ్వకపోయినా సాధువులను దర్శించాలన్న సత్సంకల్పం వల్లనే యింత మార్పు వస్తే సుదీర్ఘ సాంగత్యంతో ఇంకెంతపరిణతి కలుగుతుందో!'' అన్నారు.

మరుక్షణమే ఆశ్రమ ప్రాంతమంతా గంభీరమైన నిశ్శబ్దంలో మునిగిపోయింది. పిల్లగాలులకు చెట్ల ఆకుల నుండి వినబడే శబ్దం బ్రహ్మం దృశ్యమైన సృష్టిని

**అంతటా నిండిన ఆకాశాన్ని చుట్టూవున్న ప్రపంచాన్ని తనలోనే చూచుకొంటూ, దేహమనే గురుభక్తుని దేవాలయం అక్కడనుండి నడిచి వెళ్ళిపోయింది.**

కలిచి వేస్తుందో అన్పిస్తుంది. అలా ఆలోచిస్తున్న ఆ భక్తుని కేసి ఆ సాధువు గంటసేపు రెప్పవాల్చక చూస్తూ ఉండిపోయారు. ఆ శబ్దబ్రహ్మాన్ని ఆయన తమ దృష్టిచేత, అగస్త్య మహర్షి హోరున చెలరేగుతున్న సముద్రాన్నంతటినీ త్రాగేసినట్లు త్రాగేస్తున్నారా అన్పించింది.

ఓర్పుతో, శ్రద్ధతో ఆశ్రయించిన సద్భక్తుడికి దృష్టి దీక్ష లభించింది. అంతటితో అతడిలోని వ్యక్తిత్వానికి నామరూపాలు లేకుండాపోయాయి. అంతటా నిండిన ఆకాశాన్ని చుట్టూవున్న ప్రపంచాన్ని తనలోనే చూచుకొంటూ, దేహమనే గురుభక్తుని దేవాలయం అక్కడనుండి నడిచి వెళ్ళిపోయింది. కాని గురు సాన్నిధ్యాన్ని విడిచి పోయిందా? సద్గురుని కంటిపాపలలోని కాంతితో వెలిగే ఈ ప్రపంచాన్ని వదలి ఎక్కడికి పోయింది? ఎక్కడకు పోగలదు.

# శిరిడీ సాయి మళ్ళీ మనమధ్య అవతరిస్తే!

"సాయిబాబా"

ఈనాడు శ్రీ శిరిడీ సాయినాధుని అద్భుతమైన జీవితచరిత్ర చదివిన వారంతా "ఆయన మనమధ్య మానవాళిలో సంచరించిన కాలంలో మనం లేక పోయామే, మనమాయనను చూచివుంటే ఎంత బాగుండేదో!" అనుకోడం సహజం. అంతేగాదు ఆయనను ప్రత్యక్షంగా సేవించిన కొందరికి "శ్రీ సాయినాధుడు మహా సమాధి చెందితే, ఆ తర్వాత మన గతేమిటి" అని ఆందోళన పడినట్లు గూడ చరిత్రలో చూడవచ్చు.



ఇటువంటి ఒక భక్తుణ్ణి సాయి ఏదైన వరం కోరుకోమన్నారు. అతడు "ఈ జన్మలో గాని, మరెన్ని జన్మలెత్తినా గాని మీరు మా చెంతనే వుండాలి" అన్నాడు. సాయి సంతోషంగా వాగ్దానం చేశారు. తమ భక్తులను తమ చెంతకు ఋణానుబంధమే తెస్తున్నదని అనేకసార్లు అన్నారు. ఎన్నో జన్మల క్రిందటనే తమ తమ భక్తులకు అనుబంధమున్నట్లుగా చెప్పారు. అంటే యీ అవతరణ ఒక రోజుదీ, ఒక జన్మదీ గాదన్నమాట. అటువంటప్పుడు ఆయన మరలా ఎక్కడ, ఎలా అవతరిస్తారోనని, అప్పుడు మనమాయనను గుర్తించి సేవించగల్గుతే బాగుండునని మనం ఆరాటపడడం సహజం.

కాని ఆయన తమ గత అవతారాల గురించి చెప్పినది విన్నాక యీ అవతారం గురించి చదివాక మనకొక చింత కల్గుతుంది. ఈ శిరిడీ అవతారం 1854లో బహిర్గతమైనా సుమారు 1872 వరకూ ఆయనను భక్తులు గుర్తించి సేవించలేకపోయారు. బహుకొద్ది మంది మాత్రమే ఆయనను సేవించగలిగారు. మిగిలిన వారు ఆయనను పిచ్చి ఫకీరని, ముస్లిమని, యిలా ఎన్నెన్నో దురభిప్రాయాలతో చాలాకాలం దూరంగా వుండిపోయారు. ఆయనకు సుస్థిరము, విస్తృతమూ అయిన కీర్తి వచ్చేసరికి సుమారు 1896 ప్రాంతమైంది. ఆ తర్వాత ఆయన రెండున్నర దశాబ్దాలు గూడ లేరు.

అలానే వారు తమ గత అవతారాల గురించి బాహాటంగానో, ప్రచ్ఛన్నంగానో చెప్పినదిగూడ అలానే వున్నది. రాజ్య భ్రష్టుడు, రాజ్య బహిష్కృతుడూ అయిన మన దేశంలో పర్యటిస్తున్న హుమాయూన్‌కు ఆయన దర్శనమిచ్చి, ఆశీర్వదించి అమర్‌కోటకు పంపినట్లు, ఆ

ప్రకారమే ఆ మాజీ రాజుకు జన్మించిన అక్బర్ మన దేశానికి చక్రవర్తి అయినట్లూ ఆయన చెప్పారు. ఆ మాటలను బట్టి సాయి అంతటి మహాత్ములని ఎవరూ గుర్తించినట్లులేదు. సరిగదా ముకుంద్ బ్రహ్మచారి అనే తపస్విగూడ వీరి ఫకీరువేషం చూచి ఆయనను నిరసించడమే జరిగింది! అలానే చెన్నబసప్ప, వీరభద్రప్పల పూర్వవృత్తాంతంలో గూడ సాక్షాత్తూ శివుడు వారికి స్వప్న దర్శనమిచ్చి భగవంతునికి చెందిన మాన్యాన్నెలా వినియోగించాలన్న దానికి సాయి నిర్ణయాన్ని తీసుకోమన్నాడు. అపుడుగూడ ఎక్కువమంది వారిని గుర్తించినట్లు సాయి చెప్పలేదు.

అంటే సాయిని ఏ అవతారంలోనైనా గుర్తించడం అంత తేలికగాదన్నమాట. ఆయన సమకాలీనులుగా మనం నమ్మేస్తే చాలదు. ఆయనను గుర్తించే సామర్థ్యం గావాలి. అలనాడు మహల్సాపతి, బయాజీబాయి, కాశీరామ్, నానావల్లి మొదలైనవారు గుర్తించినట్లు, లేకుంటే గంగగిర్, శ్రీ ఆనందనాథ్ మహరాజ్, దర్వేస్‌షా వంటి మహనీయులెవరైనా మనకు ముందు జన్మలోనైనా వారి గురించి తెల్పాలి. లేదా సాయినాథుడే తమకై తామే మనలను తమ చెంతన చేర్చుకోవాలి.

ఈ రెండింటిలో ఏదో ఒకటి జరిగి మనం ఆయనచెంత చేరవలసిన అవసరం ముందుగూడ అలాగే వుండబోతుందని ఆయనొకసారి అన్న మాటలలో విదితమైంది. హేమాద్పంతు వ్రాసిన ''శ్రీసాయి సచ్చరిత్ర''కు దీక్షిత్ ఒక ముందుమాట వ్రాశారు. అది వెనుకటి ముద్రణలో వుండేది. అందులో ఆయనిలా వ్రాశారు. ''సాయి ఒకసారిలా అన్నారు. 'నేనిక్కడనుండి వెళ్ళిపోయి ఒక మూల చింకి గుడ్డలతో కూర్చుంటాను. అయినా నేనీ విశ్వాన్నంతటినీ కబళించేస్తాను. ఇదంతా నాలోనే వున్నది,' అని''. అంటే శిరిడీ అవతారం తరువాత కూడా ఆయన ఎప్పుడు అవతరించినా ఎవరూ గుర్తించలేని చింకిగుడ్డల పిచ్చివాడిలాగనే ప్రకటమవుతారనన్నమాట. ఇక మనం జాగ్రత్తపడాలి. ఎలా? ఆలోచిద్దాము.

## భగవాన్ భరద్వాజుల జన్మదిన మహోత్సవము



**పుజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్ జన్మదిన మహోత్సవము కార్తీక శుద్ధ సప్తమి తిథి ప్రకారము నవంబరు 20న జరుగుతున్నది. పూజ్య గురుదేవుల జన్మదినము మనందరికీ అదృష్టకరమైన, పరమ పవిత్రమైన రోజు. కనుమరుగైపోయిన సరియైన ఆధ్యాత్మికతను, యోచనాశైలిని, సత్యాన్వేషణను అందరికీ అందించి, అందునా నాస్తికత్వం వెల్లివిరుస్తున్న సమయంలో సమాజ ఒరవడికి ఎదురీది ఎందరినో భగవంతుని కృపకు పాత్రులను చేసిన అద్వితీయ అవతారం పూజ్య గురుదేవులు. అటువంటి పుణ్యపురుషుడు పుట్టినరోజున పుడమి తల్లి పులకరించిపోతుందనటంలో సందేహము లేదు. ఈ పర్వదినాన మనము ప్రతి ఇంటిలోనూ, వాడవాడలా ఈ వుత్సవాన్ని జరుపుకొని తరించుదాము. ఈ రోజును అందరూ భక్తిశ్రద్ధలతో సద్వినియోగము చేసుకుంటారని ఆశిస్తున్నాము.**

# అంతా మాస్టరుగారి దయ!

ఎస్. లక్ష్మీ



మాస్టారు గారు సమాధి చెంది ఇంకా సంవత్సరము కాలేదు. అది మార్చినెల అనుకుంటాను. ఒక రోజు తెల్లవారుజామున కలలో మా అమ్మ కనిపించి ఏదో చెప్పబోతూంది. ఈ లోపల నాకు మెలకువ వచ్చింది. కొంచెముసేపు ఆలోచించి, ఏమిటి ఇలా అమ్మ వచ్చింది అని మరలా దాని సంగతి వదిలివేసాను. మరుసటిరోజు తెల్లవారు జామున మరలా మా అమ్మ కలలో వచ్చింది. మెలకువ వచ్చిన తరువాత వెంటనే బొంబాయి పోయి అమ్మని చూడాలని తీర్మానించుకొన్నాను.

నా పేరు లక్ష్మీ. మాస్టారుగారి కృప వలన మాస్టారి గారి ఇంట్లో వుండి మాస్టారు గార్కి సేవ చేసే భాగ్యం కలిగింది. అపుడు సాయిబాబా మిషన్‌లో పనిచేస్తున్నాను. మా అమ్మ, నాన్న ముంబాయిలో మా తమ్ముడు దగ్గర వుండేవారు. నేను 5 లేక 6 రోజులు సెలవు పెట్టి రాను పోను టికెట్లు రిజర్వ్ చేసాను. అపుడు నా చేతిలో మూడు వందల రూపాయిలు మాత్రమే వున్నాయి. ముంబాయి వెళ్ళి అక్కడ నుంచి శిరిడీకి వెళ్ళి తిరిగి రావాలి. ఈ డబ్బు చాలుతుందా అనుకున్నాను.

మామూలుగా ముంబాయికి రాత్రిపూట రైలులో బయలుదేరాలి. మాస్టారుగారు సమాధి చెందిన తరువాత అదే మొదటిసారి బయట ఊరికి వెళ్ళడము. మాస్టారు గార్కి నమస్కారం చేసుకొని వారిచేత ఊది తీసుకొని పోలేక పోతున్నామే అని బాగా బాధ కలిగింది. తరువాత నేను బయలుదేరి బయటకు వస్తే సందు చివర్లో కూడ రిక్షాలు లేవు. ఈ రోడ్డులో తిరుగుతే కొద్దిదూరంలో మామూలుగా రిక్షాలు వుంటాయి. కాని ఆ రోజు అక్కడ కూడ, రోడ్డు చివర్లో కూడా రిక్షాలు కనబడలేదు. అప్పుడు నాకు ఒంగోలులో మాస్టారుగారు లేకపోయేటప్పటికి ‘‘నేను అనాథ అయిపోయానా! ఒక్క రిక్షా కూడ దొరకలేదు’’ అని బాధ కలిగింది. తరువాత నేను నేరుగా రోడ్డు చివర తిరిగాను అదే బాబా గుడి రోడ్డు. అక్కడ కూడ బాబా గుడి అవతల రెండు మూడు రిక్షాలు కనబడ్డాయి. నేను గుడివైపు నడుస్తుంటే సడన్‌గా కుడివైపు చీకటి నుంచి ఒక రిక్షా వచ్చింది. రిక్షా అబ్బాయి నన్ను చూడగానే ‘‘బాగున్నారా అమ్మగారు’’ అని అడిగాడు. అతన్ని చూస్తే నాకు పరిచయం అయిన వాడిలాగా లేదు. ‘‘నన్ను ఎవరో అనుకొని నువ్వు మాట్లాడుతున్నట్లు వున్నది. నేను మాస్టారుగారు ఇంట్లో కదా వుంటున్నాను’’ అని అన్నాను. అతనితో ‘‘స్టేషన్‌కి వస్తావా’’ అని అంటే ‘‘వస్తాను’’ అని అన్నాడు. అపుడు నేను రిక్షా ఎక్కాను. మాకు ఎడమవైపు కొండయ్య బంకురోడ్డు వుంది దానివైపు కూడ వెళ్ళవచ్చు. కాని అతను వెళ్ళలేదు. నేరుగా సాయిబాబా గుడి వైపు వెళ్ళాడు. సరిగ్గా గుడి ముందు రిక్షా ఆపి వంగి రిక్షాలో ఏదో చేస్తున్నాడు. నేను అక్కడ నుంచి బాబాని చక్కగా దర్శనం చేసుకొన్నాను. అక్కడనుంచే మాస్టారుగారి సమాధిని కూడ దర్శనం చేసుకొన్నాను. తరువాత స్టేషన్‌కి వెళ్ళుతుంటే అతను ‘‘అమ్మగారు, మీతో తోడు రమ్మంటావా’’ అని అడిగాడు. ‘‘ఏంటబ్బాయ్ ఇట్లా అంటున్నావు? నీకు కుటుంబం పిల్లలు లేరా?’’ అని అడిగాను. అతను, ‘‘నాకు

భావం కలుగుతోంది అమ్మగారు'' అని చెప్పాడు. స్టేషన్ సమీపిస్తుంటే ఇద్దరు, ముగ్గురు అతన్ని పిలుస్తుంటే కూడ అతను ఏమీ పట్టించుకోలేదు. నేను రిక్షా నుంచి దిగుతుంటే అతను ''అమ్మగారు నువ్వు ఎప్పుడు వస్తావో చెప్పు. అప్పుడు వచ్చినిలబడతాను'' అని అన్నాడు. నేను ''పో అయ్యా పో! నేను ఎప్పుడు వస్తానో నాకే తెలియదు'' అని అన్నాను. ఏంటి ఈ అబ్బాయి ఇలా విచిత్రంగా మాట్లాడుతున్నాడు అని అనుకొన్నాను.

నేను ముంబాయికి చేరి ఇంట తలుపు తట్టగానే మా అమ్మ మా తమ్ముడు పిల్లలతో అత్త వచ్చింది తలుపు తీయండి అని చెప్పడం నాకు వినిపించింది. నన్ను చూడగానే, ''నిన్ను చూసి చాలా రోజులు అయిందని నిన్ను చూడాలని బాబా దగ్గర ప్రార్థన చేసాను'' అని అమ్మ చెప్పింది. మా నాన్నగారు మాత్రం మా అమ్మగారు ఉత్తరం వ్రాస్తే నేను వచ్చానని అనుకొన్నారు.

నేను ఆ రోజు ఒక ముఖ్యమైన వ్యక్తిని పని మీద చూడాలని వెళ్ళాను. నన్ను చూడగానే ఆయన ''ఇక్కడ చాలా మంది Transcendental meditation నేర్చుకోవడానికి సిద్ధంగా వున్నారు. కాని నేర్పించే వాళ్ళులేరు. TM నేర్చుకోమని doctors recommend చేసిన చాలా మంది పేషంట్లు కూడ వున్నారు. వాళ్ళందరికి TM నేర్పించిగాని నువ్వు వెళ్లటానికి వీలులేదు'' అని అన్నారు''. అయితే నా టికెట్ cancel చేసి మరలా మూడురోజుల తరువాత మీరే reserve చేసి పెట్టాలి. రేపు శిరిడీ వెళ్ళి ఎల్లుండి వస్తాను. TM నేర్చుకోవాలి అనుకొనే వాళ్ళందరిని ఎల్లుండి సమావేశపెట్టాలి'' అని చెప్పాను. మరుసటి రోజు నేను, మా అమ్మ శిరిడీకి బయలుదేరి చక్కగా సాయిని దర్శనం చేసుకొని మరుసటి రోజు ప్రొద్దున వచ్చాను. తరువాత రోజునుంచి మూడు రోజులు TM నేర్పించినాను. దాని వలన నాకు 1500/- ఆదాయం వచ్చింది. మూడు వందలు రూపాయలు డబ్బులు చాలవని అనుకొంటే మాస్టరుగారి దయవలన రూ. 1500/- వచ్చింది.

నా స్నేహితురాలు పి. రాజసులోచన ఈ సమయంలో హైదరాబాద్‌లో siddha land లో వున్నది. అక్కడ ద్రాక్ష తోటలు వున్నాయి. ప్రతి సంవత్సరం మాస్టరుగారి ఇంటికి session time లో ద్రాక్ష పండ్లు పంపించేది. నేను ముంబాయి వెళ్ళేముందు ఆమెతో మాట్లాడే పనుండి నేను ఏ trainలో ఏ టైమ్‌లో హైదరాబాద్‌కి వస్తానని తెలిపితే ఆ టైమ్‌లో ద్రాక్షపండ్లు అందిస్తాను అని చెప్పింది. నేను ఆ విషయాన్ని ఆమెకు తెలిపాను. ద్వారకనాథ్‌కు, cricket bat, మరికొన్ని ఆట వస్తువులు తెమ్మని చెపితే ముంబాయి నుంచి కొన్నాను. నా train హైదరాబాద్ చేరే టైమ్‌లో సులోచన prompt గా వచ్చి ద్రాక్షలు అందించింది. సులోచనతో పాటు హైదరాబాద్‌లో వున్న నా ఇంకొక స్నేహితురాలు ఉమా అయ్యర్ కూడా నన్ను చూడడానికి వచ్చింది. ''నువ్వు దిగాల్సిందే... నాతో ఒక్కరోజు వుండి రేపు ఇదే టైమ్‌కి నిన్ను train లో ఎక్కిస్తాను'' అని చెప్పి breakup journey చేయించింది.

మాస్టరుగారు ఎప్పుడు నాతో ''నువ్వు bombay నుంచి వచ్చేటప్పుడు హైదరాబాద్‌లో దిగి వస్తే మిసెస్ అయ్యర్ సంతోషిస్తుంది కదా'' అని అనేవారు. కాని అది ఎప్పుడూ కుదరలేదు. ఇప్పుడే కుదిరింది. మరుసటిరోజు మధ్యాహ్నం నన్ను train ఎక్కించారు. ఆ train ఒంగోలు చేరేటప్పుడు తెల్లవారుజామున 4 గం॥లవుతుంది. Train కూడ రెండవ ప్లాట్‌ఫామ్‌కి వెళుతుంది. ఫస్ట్ ప్లాట్‌ఫామ్‌లో అయితే పోర్టర్లుగాని, రిక్షావాళ్ళు గాని వుండవచ్చు కాని ఈ రెండవ ప్లాట్‌ఫామ్ మామూలుగా నిర్మానుష్యంగా వుంటుంది. కాని train ఆగి నేను సామాన్లు కింద దించేటప్పటికే ఒక రిక్షా అబ్బాయి వచ్చి సామాన్లు ఎత్తుకోవడం మొదలు పెట్టాడు. నేను ''ఏమిటబ్బాయి? ఏమీ మాట్లాడకుండా నీ సొంత సామాన్లు లాగా తీసుకు వెళుతున్నావు ఏంటి'' అని అరిచాను. తరువాత రిక్షా ఎక్కి ముందర మాస్టరుగారి ఇంటికి పోయి, ఆటవస్తువులు, ద్రాక్షపండ్లు అందించి తరువాత నేను వుంటున్న సాయిబాబా మిషన్ ఆఫీస్ buildingకి వెళ్ళి దిగి లోపలికి వెళ్ళాను. రిక్షా వెళ్ళిపోయింది. అప్పుడు నాకు తట్టింది. ''నువ్వు ఎప్పుడు వస్తావో చెప్పు అప్పుడు వచ్చి నిలబడతాను'' అన్నాడు కదా! చెప్పినట్లే చేశాడు కదా! ఆహా! నేను ఒక రిక్షా కూడ దొరకలేదు అని మానసికంగా బాధ పడుతుంటే మాస్టరుగారే స్వయంగా రిక్షా వాడుగా వచ్చి నన్ను స్టేషన్‌లో దింపటం కాక నాతో కూడ తోడుగా వచ్చినట్లే అన్నీ చక్కగా జరిగాయి. నేను రైలు నుంచి దిగుతుంటే ఆయన వచ్చి నిలబడివున్నారు కదా! ఈ పేద భక్తురాలి మీద గురువుగారు చూపించిన కారుణ్యానికి నేను ఏమి చేసి కృతజ్ఞత తెలుపుకొంటాను! అంతా మాస్టరుగారి దయ!

(నేను చెబుతూవుంటే వ్రాసి పెట్టినవారు మాస్టరుగారు భక్తుడు అయిన పి. శ్రీధర్ గారు, చెన్నై.)

# శరణాగతి

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

కాలమన్నా, జీవితమన్నా ఒక ప్రవాహం; ఆటు పోటులు కష్టసుఖాలు. సరైన ఈతగాడు ఆటుపోటుల్ని రెంటినీ తనకు అనుకూలంగా వాడుకోటం నేరుస్తాడు. గొప్ప నావికుడు ఏ గాలికి ఆ తెరచాప పట్టి ఎట్లా అయినా తన పడవ ముందుకు సాగేలా చూచుకొంటాడు. అలానే సాధకుడు తన దైవస్మరణను మంచి, చెడు కాలాల్లోనూ దైవాన్ని చేరుకునేందుకు వినియోగిస్తాడు. మంచికాలంలో ఒడుదుడుకుల్లేక తాననుకున్నవన్నీ సాగేకాలంలో దైవచింతన, భక్తి బాగా నిలుపుకోవటం తన సంకల్పంగా పెట్టుకుని నెరవేర్చుకుంటాడు. కాలం మంచికాలంకనుక సాగుతుంది తేలిగ్గా ఆరాధ్య దైవం యొక్క ప్రత్యేక నిదర్శనం, అనుభవం బాగా లభిస్తాయి. చెడుకాలంలో ఏమీ కలిసిరాక, ఏ ప్రయత్నం చెయ్యక ఉండాలికనుక, ఏ పనులూ సంకల్పించక ధ్యాస దైవం యందుంచి, ఆ కాలంలో వచ్చిన నిందలన్నింటినీ తనకు సహనము, నిరహంకారం నేర్చుకునేందుకు దైవం కల్పించినవిగా గుర్తుంచుకుని, చెడు కాలంలో తను లేమిని, బాధను అనుభవించాల్సిన యోగాన్ని తీవ్రనిష్ఠ, నియమాదులతో నింపి అందరూ ఏడుస్తూ గడిపి నిరర్థకంగా బయటపడే కాలం నుంచీ ఎంతో గొప్పవాడుగా బయటపడతాడు. ఒక దుంప పాతి మరు సంవత్సరము త్రవ్వి, పిలకలను 10పిలకలుగా పాతి, మళ్ళీ త్రవ్వి, దానిని ఒక పెద్ద చేనుగా, తోటగా ఒక దుంపని ఒక క్షేత్రంగా రూపొందిస్తాడు. పాతటం కష్టకాలం వంటిది; తీసి పెరుగుతున్న దుంపల సంఖ్య చూచుకొని సంతోషించి, అందులో కొన్ని వండుకు తిని ఆనందించటం లాంటిది మంచికాలం. రెండూ అలా సక్రమంగా వినియోగిస్తే మంచి పంట. ఇదే అంత మెలకువ లేకపోతే మంచి కాలంలో జూదంలో కొంచెం వచ్చి, ఆశ పెరిగి, చెడు కాలంలో వున్న క్షేత్రాన్ని, దుంపలనూ పోగొట్టుకుని, దురలవాట్ల వల్ల మరి భుక్తి లేకుండా చేసుకుంటాడు. ఇదే నిష్ఠగా బతికేవాడికీ, తోచినట్లల్లా బ్రతికేవాడికీ వున్న భేదం. ఈ భేదం మృత్యువులో కూడా వుంటుంది.

అఖండానంద సరస్వతి అన్న మహాత్ముణ్ణి నేను నైమిశారణ్యంలో దర్శించాను. ఆయన మహాత్ముడలానే అయ్యాడు. 16వ ఏట వివాహం, 17లో ఒక శిశువు, 19లో తప్పక మరణం వుందని జ్యోతిష్కులు చెప్పారు. అప్పుడు చావంటే ఏమిటోలో తేల్చుకుందామని, అది జరిగేలోగా పరిపూర్ణత చెందుదామని నిర్ణయించుకుని తీవ్ర సాధన చేస్తే, 19వ సంవత్సరములో మృత్యువు వంటి అనుభవంతో సాక్షాత్కారమై ఆయనలోని మానవత్వం మృతి చెంది దైవత్వం పునర్జన్మించింది. రమణ మహర్షికూడా మృత్యుముఖంలో చచ్చిపోతున్న అనుభవంలో ఆ చనిపోతానన్న భయాన్ని ఏది అనుభవిస్తున్నదా అని 'నేను'ను గమనిస్తూ వుండిపోవటంలో 20 నిమిషములలో ఆత్మజ్ఞానం కలిగి, ఆయనలోని 'వెంక్రటామన్' మృతిచెంది 'భగవాన్' ఆ స్థానే జన్మించాడు. మృత్యువే మరణించి శాశ్వత జ్ఞానపదం మిగిలింది. అందుకే ఒక మహాత్ముడన్నాడు. ''సాధనంతా ఒక రకంగా చూస్తే ఎట్లా చావాలో నేర్చుకోటం'' అని. చివరి క్షణంలో కూడా దైవం యందు మనస్సు వుంచామన్నది సాధించేందుకే జీవితమంతా అలవాటు చేసుకోటం అంటారు కొందరు.

నిద్ర లేస్తూనే దైవానికి నమస్కారం దీర్ఘంగా చేసుకోవాలి. దైవం అంటే ఒక స్థితి. వ్యక్తి శరీరం కాదు. బాబా, ''నేనీ శరీరాన్నే కాదు. శిరిడీలోనే లేను'' అనీ, అమ్మ, ''అమ్మ అంటే జిల్లెళ్ళమూడిలో మంచం మీద కూర్చొన్నదని కాదు; అంతులేనిది ''అనీ అన్నప్పుడు ఆ స్థితి అని అర్థం. పవిత్రత,

**పవిత్రత, నిర్హేతుకమైన అంతులేని ప్రేమ, శాంతి, నిశ్చింత యివీ బాబా అంటే.**

నిర్హేతుకమైన అంతులేని ప్రేమ, శాంతి, నిశ్చింత యివీ బాబా అంటే. నమస్కారం చేసుకునేప్పుడు యీ భావాన్ని స్థిరంగా కొన్ని క్షణాలు నిలుపుతూ, ఈ లక్షణాలు శ్వాసతో, శ్వాస నడిపించే వాడి నుంచీ మనకు వస్తున్నట్లు భావన చేస్తూ నిండుగా, నెమ్మదిగా శ్వాస తీసుకుని (4, 5 సార్లు బాబా అనుకున్నంతసేపు) అంతసేపే

నిలిపి, ఆ లక్షణాలు నిలుస్తున్నట్లు భావన చేసి, అంతసేపే శ్వాస ఆ భావంతో విడవాలి. ఇలా మూడుసార్లు చేస్తే స్థిరత్వం వస్తుంది. ఈ లక్షణాలు కలిగి మనలో నిద్రాణంగా వున్న బాబాను మేలుకొని బహిర్గతం కమ్మనే వుద్దేశ్యంతో సంధ్యావందనం కూర్చొని చెయ్యాలి. తర్వాత ముఖం కడుక్కుని కాలకృత్యాలు తీర్చుకోవాలి. స్నానసమయంలో మనలోని దోషాలన్నీ పోయి నామ, విశ్వాసాలతో స్నానం చేసి పునీతులమవుతున్నామన్న భావన నిలుపుకుని నామం అనుకుంటూ, నీళ్ళు పోసుకుంటూ, రుద్దుకుంటూ అంతా సాధన అన్న భావంతో చెయ్యాలి. అట్లానే కాఫీ, పాలు నివేదన పెట్టి అంటే, అన్నీ అన్ని జీవులకూ ఆహారరూపమై అందే దైవస్వరూపం మనకా రూపంలో తనను తాను లభ్యం చేసుకొని, మనలో శారీరక బలాన్నే కాక దైవం అన్న భావం పెంపొందేలా చెయ్యాలన్న కోరికతో తీసుకోటమే. తర్వాత మళ్ళీ నామం. అంటే అంతా అయి అన్నింటి రూపంలో, మన రూపంలో వుండి తనను తాను గుర్తుంచుకొన్న స్థితి యొక్క మానవరూపం అన్న భావము స్ఫురింపచేసుకుంటూ నెమ్మదిగా నామాన్ని మననం చేస్తూ, అవసరం వస్తే పెదిమలు, నాలక ఆడిస్తూ దాన్ని (అంటే మనస్సులో జరిగే వుచ్చారణని) మనస్సులో వింటూ, ఆ భావం మెదలటాన్ని నిశితంగా గమనిస్తూ ఎంతసేపు వీలవుతే అంతసేపు చెయ్యాలి. సరిగ్గా ఇది కుదరగానే అవటం కష్టం అవుతుంది. ఇంక చాలు అనిపించదు. అందాకా చెయ్యాలి. అట్లా అనిపిస్తే కేవలం బాబా గొప్పతనాన్ని మనసా అనుభవిస్తూ, ఫోటోకేసి బాబాగా చూస్తూ కొంతసేపు కూర్చోవాలి.

**భోజనంలో ప్రతి ముద్దా నివేదనతో తీసుకోవాలి. నివేదన వివరంగా, మనస్ఫూర్తిగా పెట్టాలి తొందరగా, యాంత్రికంగా కాకుండా.**

ఇట్లా భోజనం దాకా చేయాలి. భోజనంలో ప్రతి ముద్దా నివేదనతో తీసుకోవాలి. నివేదన వివరంగా, మనస్ఫూర్తిగా పెట్టాలి తొందరగా, యాంత్రికంగా కాకుండా. తర్వాత భగవద్గీతలో కొన్ని శ్లోకాలు మనకు అన్వయించుకుంటూ చదవాలి. 25కు తక్కువ లేకుండా. చిన్న అధ్యాయం అయితే రోజు కొక అధ్యాయం. 25 అయినా విసుగు అనిపించకపోతే ఇంకా చదవటమే. అయితే ఒక శ్లోకానికి దానికి వెనుక, ముందు వున్న శ్లోకాల వరుస, సంబంధమూ పూర్తిగా అర్థం చేసుకుంటూ, వాటి కనువైన బాబా వాక్యాలు గుర్తొస్తాయేమో చూచుకుంటూ, అవి గుర్తు వ్రాసుకుంటూ, చదవాలి. ఇది విసుగు పుడితే ఒక భక్తుడి చరిత్ర లేక రామకృష్ణ బోధామృతం లాంటి పుస్తకాల్లో కొన్ని సంఘటనలు మనస్సుకు హత్తుకునేలా మనకన్వయించుకుంటూ చదవటం, మన లోపాలను సరిదిద్దుకోవలసిన విషయాలను మనస్సులో సేకరించటంతో చదవాలి. సాయంత్రం పూట ధ్యానం చేయాలి. ఎప్పుడైనా విరామ సమయంలో ఎవరినైనా చూడాలనిపించటం లాంటివిగానీ, వారిని గూర్చి దిగులుగానీ అనిపిస్తే ''అసలు మానవునకు ఎందుకు అలా అనిపిస్తుంది?'' అన్నది చాలా జాగ్రత్తగా మనలో మనం చర్చ చేసుకోవాలి. అట్లా అనిపించి అట్లా చేసిన దానివల్ల ఏ ఫలితం కలుగుతోంది? కేవలం హాయి అయితే హాయి అంటే ఏమిటి? అది ఎందుకు మనిషి కావాలనుకుంటాడు? హాయి అనేది దేనిమీద ఆధారపడుతుంది? మనిషి ధర్మానికీ, హాయికీ గల సంబంధం ఏమిటి? అంతా తానే అయినది యిన్నిగా అయినప్పుడు యిలా అవసరం, కోరిక ఎందుకు ఎలా వచ్చాయి? ఎట్లా ఐక్యతను గుర్తిస్తుంది? యిలా చర్చించుకోవాలి. బుద్ధుడలానే చేశాడు. అలా మనమూ చేసి మానవుడి స్వభావాన్ని, వాడి ప్రవర్తనకు గల కారణాన్ని అర్థం చేసుకుంటే మనకు మనం బాగా అర్థమవుతాము. అప్పుడు కర్తవ్యం సహజమూ, తేలిక, ప్రియము అవుతుంది. ఇలా ఆలోచించినవాళ్లే వివేకానంద, మహమ్మద్, బుద్ధుడు, గాంధీ మొదలైన వారంతా.

ఒక సూఫీ మతస్థుడు తన మతాన్ని గురించి వ్రాసిన పుస్తకంలో వారి వస్త్రధారణ గూర్చి వ్రాసి వుంది. సూఫీలు అంటే 'ఉన్నిగుడ్డలు ధరించువారు' అని అర్థం. అలా ఎందుకు ధరించేవారో వ్రాసినదంతా నేను వేషభాషల గురించి చెప్పే పద్ధతే! ఇలాంటి నియమాల సముదాయం పేరు ధర్మం. బ్రహ్మచర్య ధర్మం, గృహస్థ ధర్మం, సన్యాస ధర్మం అని ధర్మాలున్నవి. ఈ ధర్మాలను ఏ మనిషి తయారు చెయ్యలేదు. పొయ్యిమీద పెడితే తెర్లే ధర్మం నీటికేదిచ్చిందో, నిప్పులో చాలాసేపు వుంచిన ఇనుముకు నిప్పులా ప్రజ్వలించే ధర్మం ఏదిచ్చిందో, అయస్కాంతం తాకిడికి తాను అయస్కాంతం అయ్యే ధర్మం ఇనుముకు ఏదిచ్చిందో, యీ ధర్మాన్ని ఆచరిస్తే దైవంగా అయ్యే ధర్మం మానవునికి ఆ శక్తే యిచ్చింది. అందుకే దాన్ని 'ధర్మం' అన్నారు. ''ధర్మో రక్షతి రక్షితః'' అన్నారు. తనను రక్షించినవాణ్ణి ధర్మం రక్షిస్తుంది అన్నారు. నిప్పు మీద నీరు తెర్లటం ఎంత సత్యమో, సహజమో సాధన హృదయ పూర్వకంగా చేస్తే దైవం అవటమూ అంతే.

(మాస్టరుగారి బోధలు, లేఖలు, సత్సంగాలలో చెప్పిన విషయాలను కొన్నిటిని కూర్చి ముద్రించిన ''ధ్యాన యోగ సర్వస్వం'' అన్న గ్రంథంలోనిది ఈ వ్యాసం)

# ఐహికము - పరమార్థము

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సృష్టి అంతటికీ చైతన్యం ఆధారం, ఆ చైతన్యమే వివిధ స్థాయిలుగా ఏర్పడి సృష్టి అయింది. అంటే సృష్టిలో ప్రతి పదార్థం ఒక శక్తి చైతన్యస్థాయికి చెందినది. ఇటువంటి అనేక పదార్థాలు, శక్తులు కలసి చరాచర జగత్తుగా ఏర్పడింది, ఇలా వ్యక్తిత్వం గలిగిన ఒక్కొక్క చైతన్య స్థాయిని ఒక్కొక్క దేవత అన్నారు. ఇటువంటి వివిధ దేవతలు కలసి సమిష్టిగా చేసే ప్రక్రియే ఈ సృష్టిజాలమంతా. సృష్టిని ఈ విధంగా దర్శించిన ఋషులు ఈ జగత్క్రీడనొక యజ్ఞంగా దర్శించారు. ఈ జగత్క్రీడలో ఒక్కొక్క దేవత ఒక్కొక్క పాత్రను ధరిస్తుంది. కనుక యజ్ఞం సృష్టికి మూల ధర్మమని చెప్పబడింది. ''ధర్మం'' అంటే ''ధరించునది'' అని అర్థం. మూలార్థం ఇలా వుండగా జగత్క్రీడ అనబడు యజ్ఞాన్ని అనుసరించి ఇటువంటి జ్ఞానం కలగడానికి అమర్చుకోబడిన జీవితపంథా మానవ ధర్మం అని చెప్పబడింది, అనగా మానవుడు ధర్మాన్ననుసరించడం ద్వారా ఈ సృష్టి వైవిధ్యానికి ఆధారమైన ఏకత్వాన్ని గుర్తించి అనుభవంలోకి తెచ్చుకొని, సృష్టి నుంచి తాను వేరన్న భ్రమను తొలగించుకోవడమే శాంతి, ఆనందాలకు మార్గమని మన పూర్వులు దర్శించారు. ఈ ద్రష్టలను ''ఋషులు'' అన్నారు.



**ఈ జగత్క్రీడలో ఒక్కొక్క దేవత ఒక్కొక్క పాత్రను ధరిస్తుంది. కనుక యజ్ఞం సృష్టికి మూల ధర్మమని చెప్పబడింది. ''ధర్మం'' అంటే ''ధరించునది'' అని అర్థం.**

ఆదిశక్తి వివిధ రకాలైన స్పందనములు లేక కంపనములు చెందడం (vibrations) వల్ల వివిధ శక్తి ప్రసరణ తరంగాలేర్పడి వివిధ పదార్థాలేర్పడ్డాయని ''ఏది నిజం''?లో చూచాము. ఒక పరిమితిలోని తరంగదైర్ఘ్యము గల శక్తి ప్రసరణ శబ్దంగానూ, మరొకటి కాంతిగానూ, మరొకటి వేడిమిగానూ ఇలా అనేక విధాల మానవుడికి గోచరిస్తాయి. ఈ సత్యాన్ని అనుభవపూర్వకంగా గుర్తించడమంటే మానవుడి చైతన్యం వాటిని ధ్యానించడం ద్వారా ఆయా స్థాయిలను పొందడమే మార్గం; ఈ జ్ఞానాన్ని మనలో మేల్కొల్పడానికి అనువైన అనేక వర్ణములు కల దేవతామూర్తులను, తత్సంబంధమైన మనలోని చైతన్యాన్ని ప్రేరిపించగల వివిధ స్వరములు గల వేద మంత్రాలను, వివిధప్రభావాలు గల పదార్థాలను కూర్చి మానవుడు యజ్ఞాన్ని చేసి తద్వారా తనలోని చైతన్యస్థాయిని విస్తరింపచేసికొని సృష్టితో అనుభవపూర్వకమైన తాదాత్మ్యాన్ని పొందడమే యజ్ఞం యొక్క పరమావధి.

సకల సృష్టి ఒకే యజ్ఞమైనా, మానవుడి అవగాహనశక్తి

పరిమితం గనుక, దానిని విభజించి వివిధ స్థాయిలలో ఆ యజ్ఞాన్ని దర్శిస్తాడు. సృష్టి మూలంలో వున్న ఒకేశక్తి పంచభూతాలై, అవి తిరిగి తిరిగి పరస్పర మేళనమై స్థూల భూతాలవడాన్ని వేదాంతంలో పంచీకరణ విద్య చెబుతుంది. అది ఒక కక్ష్యకు చెందిన యజ్ఞం. ఈ పంచ భూతాలతో చేయబడ్డ సృష్టి జాలం (లేక వస్తుజాలం) యొక్క ఉత్పత్తి లయాలు మరొక యజ్ఞం; ఇందులో బ్రహ్మాండాల సృష్టిలయాలు చెప్పబడతాయి. అవి జీవి రూపం ధరించి

**''పురుష సూక్తం''లో యజ్ఞ పురుషుడి వివిధ దేహభాగాల నుండి వివిధ వర్ణస్థులుత్పత్తి అయినట్లు చెప్పడంలో కల ఉత్క్రృష్టభావం సమాజమంతా ఒకే దేహంగానూ, అందులోని వివిధ ప్రవృత్తులు కలవారు ఆ దేహం యొక్క అంగాలవలె సమష్టి శ్రేయస్సు కొరకు కలసి ఎలా పనిచేయాలో సూచించటమే.**

జీవించి లయించడం మరొక యజ్ఞస్థాయి. ఇట్లా రూపొందిన వ్యక్తి పంచ జ్ఞానేంద్రియాలతో చేసేదొక స్థాయికి చెందిన యజ్ఞం, పంచ కర్మేంద్రియాలతో, సప్త ధాతువులతో శరీరంలో జరిగేది మరొక యజ్ఞం. సామాజిక జీవితమొక యజ్ఞం. ఏ జీవి ఏర్పడ్డా అందులో వుత్పన్నమయ్యే అసంఖ్యాకమైన జీవకణాలు ఆ శరీరం జీవించి వృద్ధి చెందడానిక్కావలసిన క్రియా కలాపాల నెలా పంచుకు నిర్వర్తిస్తాయో, సమాజం లోనూ వ్యక్తుల్లానే వివిధ కార్యాలను నిర్వహించే మనఃప్రవృత్తులు కలవారుగా జన్మిస్తారు. ఇదే చాతుర్వర్ణమన్న వ్యవస్థీకరణకాధారం. ఆదిలో చాతుర్వర్ణం మానవుడి ప్రవృత్తిననుసరించేగాని కేవలం జననానికి సంబంధించినది కాదనడానికి ఆధారాలు మహాభారతంలో యక్షప్రశ్నల వంటి సన్నివేశాలలో దొరుకుతాయి. ''వజ్రసూచీ ఉపనిషత్తు'' కూడా ఈ విషయాన్నే చెబుతుంది. ''పురుష సూక్తం''లో యజ్ఞ పురుషుడి వివిధ దేహభాగాల నుండి వివిధ వర్ణస్థులుత్పత్తి అయినట్లు చెప్పడంలో కల ఉత్క్రృష్టభావం సమాజమంతా ఒకే దేహంగానూ, అందులోని వివిధ ప్రవృత్తులు కలవారు ఆ దేహం యొక్క అంగాలవలె సమష్టి శ్రేయస్సు కొరకు కలసి ఎలా పనిచేయాలో సూచించటమే. (సంపూర్ణ వివరణకు నేను వ్రాసిన 'పురుషసూక్త రహస్యం' గ్రంథమును చూడండి.)

ఇలా జన్మించిన మానవుడు జప యజ్ఞాదులనే ఉత్తమ జ్ఞాన యజ్ఞం చేసినపుడు యజ్ఞం యొక్క వివిధస్థాయిలు సమన్వయమై అటు బ్రహ్మాండాల ఉత్పత్తి దగ్గర్నుంచి ఇటు పిండోత్పత్తి, జ్ఞాన, యజ్ఞాలద్వారా ఒకే యజ్ఞ స్వరూపమని గుర్తించడమే జీవిత పరమావధి. ఈ జ్ఞానాన్ని అనుభవ పూర్వకంగా గుర్తించినవాడే యజ్ఞపురుషుడౌతాడు. అటువంటివాడే శ్రీకృష్ణుడు. అందుకే సమష్టి యజ్ఞ స్వరూపుడైన ఆయన తన విశ్వరూపాన్ని అర్జునాదులకు దర్శనమీయగలిగాడు. అది, దివ్యమైన జ్ఞాన నేత్రానికే. లేకపోతే కనికట్టే అయ్యేది. ఈ బృహత్స్వరూపమైన యజ్ఞానికి ప్రతిరూపాలుగా అటు ప్రాకృతిక జీవితము, సామాజికజీవితము, గృహ జీవితము, వ్యక్తిగత శారీరక మానసిక జీవితాలను తీర్చిదిద్దుకోవడానికే మన పూర్వులేర్పరచిన వివిధ ధర్మాలు. ఇంత విశాలదృష్టిననుభవ పూర్వకంగా గ్రహించి ఇచ్చిన వారి వివేకాన్ని నెలకొచ్చే నాలుగురాళ్ళతో తృప్తి చెందే సంకుచిత మనస్కులు అపహాస్యం చేయడం చాలా హాస్యాస్పదంగా వుంటుంది.

ఈ సమగ్ర దృష్టిని పొందాలంటే, అనుక్షణం

**ఈ సమగ్ర దృష్టిని పొందాలంటే, అనుక్షణం నిలుపుకోవాలంటే, అనుక్షణము నిత్యజీవితాన్ని యజ్ఞంగా మార్చుకోవాలి.**

నిలుపుకోవాలంటే, అనుక్షణము నిత్యజీవితాన్ని యజ్ఞంగా మార్చుకోవాలి. అందుకే నిద్ర లేవగానే ప్రాతఃస్మరణాది మంత్రాల దగ్గర్నుంచి నిద్రించేప్పుడు చివరగా చేసే స్మరణ వరకూ ప్రతి పనిలోనించి సమగ్ర యజ్ఞ రూపాన్ని జ్ఞప్తిచేసే మంత్రాలను, ధర్మాలను మన పూర్వులేర్పరచారు. వారుద్దేశించిన ఈ లక్ష్యాన్ని మరచి చూస్తే ఇంత మహత్తర జీవిత విధానం గుడ్డి నమ్మకాలుగా, అర్థరహితాలుగా గోచరించకేమవుతాయి?

అయితే సృష్టిలో ప్రతి రూపం జన్మించి, వృద్ధి చెంది క్షీణించడమెలాగో ఈ యజ్ఞాన్ని వ్యక్తులు, సమాజాలు అపార్థం చేసుకొని పతనం చెంది అవి మూఢ విశ్వాసాలుగా రూపొందడం

కూడా కాలంలో అనివార్యంగా వచ్చే మార్పే. అయినా శిథిలమైన ఆకులు, చెట్లు నశించి తిరిగి బీజాలనుండి నూత్న రూపకల్పన జరగడమెంత సహజమో అలానే సమాజాలు కూడా ధర్మచ్యుతి నొంది, అంధవిశ్వాస అజ్ఞానాల వల్ల కలిగే బాధలకు గురియై, తాళలేక, విప్లవాత్మకమైన మార్పులు చెంది, తిరిగి సరియైన ధర్మాన్ని రూపొందించుకోవడమూ అంతే సహజం. దీనినే యుగ ధర్మాలుగా మన పూర్వీకులు చెప్పారు. దీనిని మార్క్స్ (Marx) వంటివారు Thesis, Antithesis, Synthesis అనే క్రమంలో కేవల సామాజిక, రాజకీయ, ఆర్థిక పదజాలములో చెప్పారు. ఈ సిద్ధాంతాన్నే సకల సృష్టికి, చైతన్యమాధారమనే స్థాయిదాకా పొడిగించి చూస్తే సృష్టి, స్థితి, లయాలుగా చెప్పవచ్చు. మార్క్స్ పరిమిత చారిత్రక కాలాల గురించే మాట్లాడారు. మన పూర్వీకులు యుగాంతాల వరకూ చూచి చెప్పారు. ఇదే వ్యత్యాసం.

''అయితే ఈ సమగ్ర యజ్ఞ రూపావగాహన అందరు వ్యక్తులూ పొందగలరా?'' అనవచ్చు, సాంకేతిక విద్య అంతు లేకుండా పురోగమించిన ఈ రోజుల్లోకూడా కళాశాలలో శాస్త్రాధ్యయనం చేసినవారు ఎంతమంది ప్రముఖ శాస్త్రకారులు (Scientists) కాగల్గుతున్నారు. జాతి అంతటిని ప్రభావితం చేసే పరిశోధనలు జరిపే శాస్త్రకారులు ఏ లక్షమందికొక్కరో! అయితే తక్కినవారికి తమ వ్యక్తిగత, సామాజిక జీవితాలను శాస్త్రీయంగా వ్యష్టి, సమష్టి అభ్యుదయాలకు దోహదం చేసేవిగా సంస్కరించుకోడం నేర్పడమే విద్యాలయాల లక్ష్యంగాని ప్రతి ఒక్కరూ శాస్త్ర ప్రవీణులవుతారని కాదుగా! అలాగే యజ్ఞం విషయంలోనూ, యజ్ఞం ద్వారా పరిపూర్ణతను పొందగలవారు కొందరే ఋషులు. అంత ధార్ఢ్యం, పట్టుదల, శ్రద్ధ అందరికీ వుండవు. అయినా సామాజిక, వ్యక్తిగత జీవితాలను సర్వ శ్రేయస్సు కనువైన విధంగా మలచుకోవడమే సామాన్యుల జీవిత లక్ష్యం, నిత్యజీవితావసరాలను, ప్రాకృతికమైన కోరికలను తీర్చుకొంటూ, తమ జీవితంలో కొంతవరకే పరమార్థానికి వినియోగించగలరు జనబాహుళ్యం. ఇటువంటి వారికి కూడా ఐహికాముష్మిక సుఖశ్రేయస్సులను ప్రాప్తింపజేసే జీవితపంథాను ఋషులేర్పరచారు. ''ఇటువంటి సామాన్యుల అవసరాలు ఋషుల దృష్టినెలా ఆకర్షించాయి? వారికి వీరిపై వీరి జీవిత మనుగడలపై అంత అభిమాన మెట్లా కలిగింది? వారు ముక్కు మూసుకొని కూర్చునేవారు కదా?'' అని ప్రశ్నరావచ్చు. ఋషులు సత్యద్రష్టలు గనుక సకల చరాచరజగత్తును భగత్స్వరూపంగా చూచి తాము అందులో ఈ సృష్టి యజ్ఞ నిర్వాహణార్థం కల్పించబడ్డామని గుర్తించి, ఆ భగవత్ప్రీతి కొరకు మానవుల రూపంలో వున్న దైవానికి సేవ అన్న భావంతో శ్రద్ధ వహించి జీవితపంథాను నిర్మించారు.




'శ్రీ రామకృష్ణ పరమహంస' మహాత్ములలో ఎంతో విశిష్టమైన వారని పూజ్యశ్రీ మాష్టరుగారు తెలియజేశారు. ఆధ్యాత్మిక శ్రేయస్సును కలిగించే శ్రీ రామకృష్ణుల జీవిత చరిత్ర, సంబంధిత గ్రంథాలను పూజ్య బాబుగారు ఎందరి చేతనో పారాయణ చేయించారు. చదువరుల సౌలభ్యం కోసం Sri Manga Bharadwaja Trust వారు ఈ పుస్తకాలను కూడా విక్రయిస్తున్నారు. ఇతర గ్రంథాలలాగానే భక్తులు ఈ పుస్తకాలను ట్రస్ట్‌వారి నుండి కొనుక్కొని, ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు.

# వార్తాలాపము

సెప్టెంబరు సంచిక తరువాయి

స్వామి ప్రకాశానంద: పూర్వకాలమునందలి బ్రాహ్మణులు విద్యా తవస్సులచే ఒప్పుచుండిరి. ''తపోయోనిఖ్యాం బ్రాహ్మణః స్మృతః'' అని శాస్త్రములు చెప్పుచున్నవి. ఇట్టి తవశ్శాలురకు వారి యోగ క్షేమముల చింత ఉండెడిది కాదు.

*యావత్ జీవేద్ అగ్నిహోత్రం జుహ్యాత్।*

''జీవించియున్నంతకాలము అగ్నిహోత్రము చేయవలెను.'' ఈ విధిని అనుసరించి ఆ కాలమునందలి క్షత్రియులును, వైశ్యులును ప్రాతఃకాలమునందును, సాయంకాలమునందును అగ్నిని ఉపాసించెడి వారు. కాని ఇప్పుడు అన్ని జాతులవారిని తమ యోగక్షేమమునకు సంబంధించిన చింత వేధించుచున్నది. ఈ ఆపత్కాలమునందు అగ్ని హోత్రాదులు ఎక్కడనైన అరుదుగా చూడనగును. కేవలము స్వధర్మరక్షణ పరాయణులు మాత్రము వానిని ఆచరించుచున్నారు. ఇట్లు కాలప్రభావము చేతను, స్థూలబుద్ధి అన్ని జాతులవారి యందును పెరిగిపోవుటచేతను విగ్రహపూజయందు యింతప్రేమ కలుగుచున్నది.

*అభిరుచి ననుసరించి ఉపాసన.*

పెద్ద విద్యార్థి : ఇప్పటిస్థితి ఇలాగ ఉన్నచో తమవంటి సత్పురుషులు అనుగ్రహించి ప్రతీకోపాసనను విడనాడునట్లు జనులకు నచ్చజెప్పి బ్రహ్మోపాసన చేయమని సూచన చేయరాదా?

స్వామి నిత్యానంద: మీరు చెప్పినది నిజమే. కానీ ప్రాణులు జన్మాంతరసంస్కారవశమున ఏ పదార్థములయందు అభిరుచి కలుగునో వానినే సేవించెదరు. అటులనే ఉపాసనకూడ ఎవరి అభిరుచిప్రకారము వారు చేసెదరు. ఉపాసనకు సంబంధించిన వారి మనో వృత్తులను మార్చి వేరొకపద్ధతియందు వారి మనస్సులను ప్రవర్తింపజేసిన ఉభయభ్రష్టులగును. కావున శ్రద్ధాభక్తులతో ఎవరు ఏ విధముగా ఉపాసించిన వారిని అట్లు ఉపాసించనిమ్ము. కర్మ పరిపాకము చెందిన వెంటనే ఆ ఉపాసన సహాయముననే క్రమముగా అతడు బ్రహ్మోపాసనయందు తత్పరుడగును. పరిపాకము కానంతవరకు వారికి ఉపదేశించుట యుక్తముకాదు.

ఈ విషయమున ఒక దృష్టాంతరము కలదు.

అరేబియా దేశమునందు ఒక అడవిమనుష్యుడు అడవిలోనుండి పశువులను మేపుచు వ్యవసాయము చేయుచుండెడివాడు. అతనికి దేవుని నిరాకారస్వరూపము తెలియదు. దేవుడు అత్యంత సౌందర్యశాలి అని అతని అభిప్రాయము. దేవుడు భక్తులను అనుగ్రహించుననియును, వారి అపరాధములను క్షమించుననియును అతని నమ్మకము. ఒక్కొక్కప్పుడు ఆతడు దేవునితో ఇట్లు సంభాషించెడివాడు.

''ఓ దేవుడా ! నీవు అత్యంత రూపశీలుడవనియును, దీనరక్షకుడవనియును విందును. నేను దీనుడను. నాయందు దయయుంచి నా దగ్గరకు రమ్ము. నీ తలవంచి శిరోజములను చిక్కుదీయుదును. నీ వస్త్రములను, శరీరమును శుభ్రము చేయుదును''.

ఇట్లు పలికి భక్త్యావేశమున ఏడ్చి దేవుని విరహముతో స్పృహ తప్పి పడిపోయెడివాడు. ఒకరోజున అతడు అరణ్యములోనుండగా దేవుని వాస్తవికస్వరూపమును తెలిసికొనిన, హసన్‌బంసరీ అను మహానుభావుడు వచ్చెను. హసన్ బంసరీ ఆ అరణ్యవాసి చెప్పుమాటలను వినెను.

''ఓ దేవుడా, నీవు సౌందర్యనిధివి. నా దగ్గరకురమ్ము. శిరోజములను చక్కబరతును. నీకు తల్లిదండ్రులు లేరు. అందుచేత నీ తలకు చిక్కు నేను తీయుదును''. ఈ మాటలు విని హసన్ బంసరీ పలికెను.

''ఓ సోదరుడా! నీవు దేవుని నిజస్వరూపమును ఎరుగవు. దేవుడేమైనా మనుష్యుడా నీ దగ్గరకు వచ్చుటకు ! ఆయన విశ్వాకారి. ఆయనకు రూపము లేదు. ప్రపంచమునకు తల్లియును, తండ్రియును కూడ ఆయనయే. ఇక ఆయనకు తల్లిదండ్రుల అవసరము ఏది? కావున నీవు అజ్ఞానముతో దేవుని అట్లు పిలువకుము. అట్లు దేవుని నీవు పిలిచినచో నరకములో పడెదవు''.

హసన్ బంసరీ వాక్యములచే అతని చిత్తము కించపడెను. అతడు ఆలోచించెను. ''ఈతడు చెప్పువిధముగనే దేవుడు ఉన్నాడా? అయితే ఇంతకాలము నేను చేసిన దేవసేవ

వ్యర్థమేనా? కాదు. ఇతడు చెప్పినది అబద్ధము. నేను అనుకొనినదియే నిజము''.

ఇట్లు మనస్సునందు నిశ్చయించుకొని ఆతడు హసన్ బంసరీతో పలికెను. ''ఓరీ! నీవు ప్రపంచమునందలి దేవుని శ్రేష్ఠభక్తులలోకెల్ల శ్రేష్ఠుడవని వింటిని. కాని నేడు నీవు చెప్పుమాటలను బట్టి చూచిన దేవుని యథార్థస్వరూపమును ఎరుగవని తేలుచున్నది. నీ బుద్ధి కాలిపోను. నీవు నాకు అసత్యమును నేర్పజూచుచున్నావా? నేటి నుండి ఈ విధముగా మరి ఎవరితోను ఇట్లు చెప్పకుము''. అని అతడు దేవుని విరహముతో ఏడ్వసాగెను.

హసన్ బంసరీ అచటినుండి ముందుకు వెళ్ళెను. త్రోవలో ఆతనికి ఇట్లు ఆకాశవాణి వినవచ్చెను.

''ఓరీ హసన్! నీవు నా భక్తుని అభీష్టరూపమగు నా స్వరూపమును ఎరుగవు. కావున నీవు వెంటనే అతనివద్దకు వెళ్ళి 'నీవు చెప్పిన విధముగనే దేవుడు ఉన్నాడని' చెప్పుము.''

ఈ అశరీరవాణి విని హసన్ బంసరీ ఆ మనుష్యునివద్దకు వెళ్లి క్షమించమని పలికెను. ''నేను చెప్పినది అజ్ఞానముచే చెప్పితిని. మీరు చెప్పినది నిజము''.

ఈకారణముచేసాంసారికజీవులకు అనురాగముకలవారి పట్ల బుద్ధి భేదము కలుగజేయప్రయత్నించుట యుక్తము కాదు. అట్లు చేసిన వారు ఉభయ భ్రష్టులగుదురు. వారి అభీష్టముననుసరించి వారు చేయుట మంచిది.

గీతకూడ చెప్పుచున్నది:

*న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసఙ్గినామ్।*
*జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్ ॥*

''విద్వాంసుడు కర్మసంగియగు అవివేకిబుద్ధిని భేదించుటకు ప్రయత్నించడు. కర్మలను అన్నిటిని గౌరవపురస్సరముగ నాచరించుచు అవివేకులను కర్మమార్గానువర్తులుగ జేయును''.

ఎవడైనను కర్తవ్యముగా భావించినదానినే ఆచరించును. కావున యోగ్యతలేనిదే ఎవనికైనను చెప్పుట నిరర్థకము.

పెద్దవిద్యార్థి : నేను పసితనమున దేవాలయములలోనికి దేవదర్శనమునకు వెళ్లెడివాడను. అచ్చటకు అనేకమంది స్త్రీపురుషులు భక్తితో దేవదర్శనమునకు వచ్చెడివారు. కాని వారు చాల గుంపులోనుండుటవలన త్రోపిడికి లోనయి ఏకాగ్రతతో దర్శనము చేయలేకపోయెడివారు. కాని ఈ పది సంవత్సరములలోను ఈ విషయమున ప్రజలమనస్తత్వములో మార్పు వచ్చినట్లు విశదమగుచున్నది. ఇప్పుడు కూడ స్త్రీపురుషులు దర్శనమునకు వెళ్ళుచు ఉన్నారు. వారికి వేరువేరు ఏర్పాట్లు కూడ ఉన్నవి. కాని నేటి జనుల మనః ప్రవృత్తులు కేవలము విగ్రహదర్శనముతో సంతోషము పొందుటలేదు. దేవస్థానములందు కథాకాలక్షేపములు, ఉపన్యాసాదులు జరుగుచున్నవి. చాలామంది వానిని వినుటకు అచ్చట కూర్చొనుచుకూడ ఉన్నారు. దేవదర్శనమాత్రము చేయుట స్థూలదృష్టికి సంబంధించిన విషయమనియు, కథాశ్రవణముచే ధర్మాధర్మవివేకము కలిగి జనులకు హితాహితములు బోధపడుననియు, తద్ద్వారా వారు కర్తవ్యాకర్తవ్యములు నిర్ణయించుకొనగలరనియు నా అభిప్రాయము. కావుననే నాకు దేవదర్శనమాత్రమే చేయుటకంటె కథాశ్రవణము చాలామంచిదని తోచుచున్నది.

స్వా.ప్ర.: నేను ఉత్తరహిందూ స్థానమునందలి కాశీ, ప్రయాగ, హరిద్వారము, హృషీకేశము మొదలగు అనేకములగు చిన్న,పెద్దపుణ్యక్షేత్రములను,దేవాలయములను,మఠములను, ఆశ్రమములను చూచితిని. అచ్చటకూడ శాస్త్రార్థము, కథాశ్రవణము, సిద్ధాంతచర్చ మొదలగు సూక్ష్మబుద్ధులను సంతోషమును కలుగజేయు జ్ఞానప్రదాయకములగు సాధనములను గురించి ఉపదేశించుట గమనించితిని. చాలపుస్తకములద్వారాను, గ్రంథాలయములద్వారాను జ్ఞానమును వృద్ధిపొందించుకొనుటకు అచ్చటిజనులు చేయు ప్రయత్నములనుకూడ చూచితిని. కొన్నిచోట్ల పుస్తకములే దేవతలనుకొని వానిని చదువుటతో కృతకృత్యుల మగుచున్నామను భావముకూడ కంటిని. నిస్సందేహముగా ఈ ప్రవృత్తులన్నియును దేవదర్శనముకంటె సూక్ష్మమును, ఉన్నతమును అగు స్థాయిని చూపించుచున్నవను మాట నిజమే. కాని వీని అన్నిటి యందునుకూడ వివేక వైరాగ్యాదిసాధనములతో, శ్రవణముచేసిన జ్ఞానమును ఆచరణలో నుంచుటకు ప్రయత్నము తక్కువగ కానవచ్చుచున్నది. జనులు శ్రవణముమాత్రమే చేయుచున్నారు. కాని అనంతరము దానిని మననమును, ఏకాంతమున నిదిధ్యాసనమును చేయువారు చాల తక్కువమంది కానవచ్చుచున్నారు. కబుర్లు చెప్పువారు చాలమంది కలరు. కాని ఆచరించువారు అరుదు. ఇది అంతయు కలియుగ ప్రభావము.

భవిష్యపురాణమందలి కలియుగవర్ణనమును పరికించుడు:

*గృహే గృహే పుస్తకభారభారం పురేపురే పణ్డిత యూథ యూథం।*
*మఠేమఠే తాపసబృన్దబృన్దం న బ్రహ్మవేత్తాన చ కర్మకర్తా॥*

ఇంటింటను పుస్తకముల బరువు మిక్కుటముగా నుండును. గ్రామగ్రామమునందును పండిత బృందములు కన్పించును. ప్రతిమతమందును తపశ్శాలురు గుంపులు గుంపులుగా నుందురు. కాని బ్రహ్మజ్ఞానికాని, కర్మయోగికాని కానరాడు. అనగా మనననిదిధ్యాసనముల ద్వారా ఆత్మసాక్షాత్కారము చేసికొని, గీతయందు చెప్పబడిన స్థిత ప్రజ్ఞలక్షణములను అన్నిటిని కలిగియున్న బ్రహ్మజ్ఞుడు దొరకుట దుర్లభము. అంతియే కాదు. కర్మోపాసనచే మల, విక్షప దోష నివృత్తిని పొంది, పరిశుద్ధ చిత్తుడయి, దైవసంపచ్ఛీలిమయి సదాచార శోభితుడగు జనుడుకూడ ఈ రోజులలో ఎక్కువగా కానవచ్చుటలేదు.

కఠోపనిషత్తునందు యముడు నచికేతునకు చెప్పెను:

*నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః।*

*నాశాన్తమానసోవాऽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥*

''దుశ్చరితమునుండి నివృత్తిని పొందనివాడును, శాంతిని పొందనివాడును, సమాహిత చిత్తవృత్తుడు కానివాడును, అశాంతమనస్కుడును విజ్ఞానముచేకూడ ఆత్మను పొందలేడు''.

దుశ్చరితుడు: పరస్త్రీగమన, పరధనాపహరణాదులు దుశ్చరితములు. ఈ నానా విధములగు పాతకముల నుండియును చిత్తవృత్తులు నివృత్తిని పొందనిచో వాడు దుశ్చరితుడు.

అశాంతుడు: విషయపంచకమును వెంటాడుటచే మనస్సు శాంతిని పొందనివాడు.

అసమాహితచిత్తుడు: ఏకాంతమున కూర్చొని యోగసమాధి యందు చిత్తైకాగ్రతను సాధించనివాడు.

అశాంతమానసుడు: వ్యాపారము, గౌరవము, కీర్తి మొదలగునవి పెంచుకొనవలెనను ప్రవృత్తితో మనస్సునకు విరామమును ఇవ్వనివాడు.

ఇట్టి బహిర్ముఖులగు వ్యక్తులు ఆత్మను పొందలేరు.

సాంసారిక ప్రవృత్తులయందు నిమగ్నులయిన వ్యక్తులు ఈ విధముగా బహిర్ముఖులగుటచే ఆత్మను పొందలేరు. అటులనే సన్యసించిన పిదప కూడ సాధువులును, సన్యాసులును ఆశ్రమములు స్థాపించుట, శిష్యుల సమూహమును పెంచుకొనుట, ఉపదేశములు ప్రచారము చేయుట మొదలగు బహిర్ముఖములగు ప్రవృత్తులయందు నిమగ్నులగుటచే విరామమును పొందుట లేదు. వారు కూడ ఆత్మను పొందలేరు.

## సగుణ నిర్గుణ బ్రహ్మోపాసనాధికారము:

పెద్ద విద్యార్థి : సగుణ బ్రహ్మోపాసన చేయనిదే ఆదినుండియు నిర్గుణబ్రహ్మోపాసనము చేయనగునా? చేయవీలులేదా?

స్వా.ప్ర.: గీతయందు భగవానుడు చెప్పెను.

*క్లేశోऽధికతరస్తేషాం అవ్యక్తాసక్తచేతసామ్ ।*

*అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥*

అవ్యక్తమునందు ఆసక్తికలిగిన మనస్సు కలవాడు అనగా నిర్గుణ బ్రహ్మమునందు ఆసక్తుడగు వ్యక్తి సగుణ బ్రహ్మోపాసనకంటె ఎక్కువ కష్టపడవలెను. ఏలనన, దేహాభిమానముకల నరుడు నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారమును చాలకష్టముతో పొందును.

సగుణబ్రహ్మోపాసనానంతరము నిర్గుణబ్రహ్మోపాసనము క్రమబద్ధము. ఇట్లు చేయుటచే నిర్గుణోపాసనయందు కొంతసదుపాయముకూడ కలుగును. సగుణబ్రహ్మోపాసనమునందుకూడా ధ్యానాదులను ఆచరించుటచే, నిర్గుణోపాసనము నందు చిత్తైకాగ్రత సులభసాధ్యముగను. కామ్యమగు సగుణ బ్రహ్మోపాసనముచే విక్షేపదోషము నివృత్తినొందును. అంతఃకరణమునందలి విషయపంచకానుభవమునకు సంబంధించిన వాసన విక్షేపదోషము. జన్మాంతరమున నిష్కామ భావముతో సగుణబ్రహ్మోపాసనమును ఒనరించి విక్షేపదోషనివృత్తిని పొందించుకొనినముముక్షువులు, సహజమగువిక్షేపరహితమగు చిత్తమును కలిగియుండుటచే, సగుణ బ్రహ్మోపాసనమును చేయకుండగనే నిర్గుణబ్రహ్మమును ఉపాసించగలరు. ఇట్లు ప్రథమమునుండియు నిర్గుణబ్రహ్మోపాసనమును చేసి ప్రాప్యమును పొందిన కొందరు ముముక్షువులు కూడ లేకపోలేదు. కావున సగుణ బ్రహ్మోపాసనము చేయనిదే నిర్గుణ బ్రహ్మోపాసనము జరుగదను నియమము లేదు.

బ్రహ్మోపాసనము సులభముకాదు. గృహము, ధనము, పశువులు, కుటుంబము, దారాపుత్రులు మొదలగువానియందు పరమాసక్తి ఉన్నంతకాలము సగుణబ్రహ్మోపాసనముకూడజరుగదు. సగుణబ్రహ్మోపాసకులు ఎక్కువ కష్టపడుదురు. నిర్గుణ బ్రహ్మోపాసకులు వారికంటెను మిక్కిలి కష్టపడుదురు. ఏలనన అత్యంత సూక్ష్మమును, నిర్విశేషమును అగు అక్షర బ్రహ్మధ్యానము చాలకఠినము. ఇహ, పరలోకములయందలి భోగములు కాకిరెట్టతో సమానము అని తలచు తీవ్రవైరాగ్యశీలురుమాత్రమే నిర్గుణబ్రహ్మోపాసనమును

ఆచరించగలరు.

ఐహికభోగములను కోరక, పారలౌకికభోగములను కోరు మందవిరాగులకు సగుణ బ్రహ్మోపాసనము నిర్దేశించబడినది.

ప్రతీకోపాసనము మిగిలినవారు చేయదగినది.

ఇట్లు ప్రథమమున ప్రతీకోపాసన, తరువాత సగుణ బ్రహ్మోపాసన, అనంతరము నిర్గుణ బ్రహ్మోపాసన చేయవలెను.

ప్రేమలేని ప్రతీకోపాసన నిరర్థకము.

పెద్దవిద్యార్థి : చాలామందికి శాలిగ్రామాదుల ప్రతీకోపాసనచే జీవితమంతయును గడచిపోవుటయును, అప్పటికి కూడ వారికి స్వస్వరూపపరిజ్ఞానము కలుగకుండుటయును నేను చూచుచున్నాను.

స్వా.ప్ర. : దీనికి కారణము కలదు. ఈ రోజులలో జనులు ప్రేమలేకుండగానే శాలిగ్రామ నర్మదేశ్వరాదులను పూజించుచున్నారు. ఆ పూజకూడ వారు యథావిధిగా చేయుట లేదు. అభిషేక చందన, పుష్ప, నైవేద్యాదులకు సంబంధించిన క్రియలను మాత్రము ఆచరించుచున్నారు. తత్సంబంధమగు భావనను కలిగియుండుటలేదు. శాలిగ్రామమును పూజించిన తదుపరి విష్ణుభావముతో ధ్యానము చేయవలెను. అటులనే నర్మదేశ్వరుని పూజించిన తరువాత శివధ్యానము చేయవలెను. ఇట్లు ఎవడును చేయుటలేదు. ఇక అంతఃకరణ పారిశుద్ధ్యము ఎట్లు కలుగును? అంతఃకరణపారిశుద్ధ్యము లేనిదే జ్ఞానము ఎట్లు లభించును?

ప్రేమచే అంతఃకరణము సత్త్వప్రధానమగును

యథావిధిగా నాచరించకపోయినను, ప్రేమతో ఆచరించినచో అంతఃకరణము సత్త్వప్రధానమయి బుద్ధియోగమును పొందును. గీతను పరికించుడు.

*''తేషాం సతతయుక్తానాం భజనాం ప్రీతి పూర్వకమ్ ।*
*దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తితే॥*

''నిరంతరము నన్ను ధ్యానించుచు, ప్రేమతో నన్ను పొందు భక్తులకు తత్త్వజ్ఞానము అను యోగమును నేను ఇచ్చుచున్నాను. దాని సహాయమున వారు నన్ను చేరగలరు'' అని కృష్ణభగవానుడు చెప్పుచున్నాడు.

ధనాది సర్వవిధ మాయిక పదార్థములయందును తీవ్రవైరాగ్యమును పొంది ప్రభువును నిరంతరము భజించినచో బుద్ధియోగము అనగా దివ్యదృష్టి లభించును అని దీని తాత్పర్యము.

వస్తు వివేకముచే వైరాగ్యము కలుగును.

పెద్దవిద్యార్థి : తీవ్రవైరాగ్యము ఎట్లు కలుగును?

స్వా.ప్ర.: సదసద్వస్తు వివేకము చేసిన వైరాగ్యము లభించును. ఈ విషయమున సిద్ధార్థుని దృష్టాంతము కలదు.

బుద్ధుడు క్రీస్తుకు పూర్వము 558 సం॥న హిమాలయ ప్రాంతభూములయందు చంపారణ్యమునకు ఉత్తరమున నేపాలుసమీపమున కపిలవస్తునగరమున జన్మించెను. కపిల వస్తునగరము మగధయందో, లేక బీహారునందో ఉండెడిదని అనుకొనుచున్నారు.

## సిద్ధార్థుని వివేకము

సిద్ధార్థుడు బాల్యము నుండియును చింతనశీలుడు. ఏకాగ్రచిత్తుడు. కంటపడిన దానిని సూక్ష్మముగా పరికించుటయును, దానిని గురించి శ్రద్ధగా యోచించుటయును అతని స్వభావము. అతడు యౌవనమున సుఖభోగములను అనుభవించునప్పుడు కూడ వివేకమును విడనాడలేదు. సుఖము అనగా నేమి? దుఃఖము అనగా నేమి? వానిని అనుభవించుట అనగా నేమి? మొదలగు విషయములను గురించి ఆలోచించెడివాడు. మూర్ఖులు వృద్ధులను, వ్యాధిగ్రస్తులను చూచి అసహ్యించుకొనెదరు. వారిని తిరస్కరించెదరు. వారివలె ఆలోచించుట నాకు తగదు అనుకొనెడివారు. అజ్ఞానులు మృతశరీరమును చూచి దూరముగా తొలగెదరు. ఆ విషయమును మరచిపోయెదరు. వారు కూడ ఒకరోజున చావవలెనను సంగతి జ్ఞప్తికి తెచ్చుకొనరు. కాని ''నేను ఆ విధముగా చేయలేను''. ఇట్టి తలంపుతో అతని యౌవనమదము, ఆరోగ్యమదము, జీవితమదము పూర్తిగా కరిగిపోయినవి.

భవనములు, అశ్వరథాదివాహనములు, పశువులు, ధనము, దారాపుత్రాదులు, దాసదాసీజనమును కలవారు సుఖించుచున్నారని ఈ జగమునందలి చాలా జనులు అనుకొనుచున్నారు. మనుష్యుని సుఖము ఈ వస్తువులపై ఆధారపడియున్నది. కాని బుద్ధదేవుడు ఇట్లనుకొనెను. ''నేను మృతిని చెందుదును. రోగగ్రస్తుడనగుదును. శోకమును పొందుదును. వార్ధక్యము, వ్యాధులు, మృత్యువు, శోకము – వీనితో సంబంధించిన వస్తువులపై నా సుఖము ఆధారపడి ఉన్నదనుకొనుట యుక్తము కాదు. నేను దుఃఖరహితుడను కానప్పుడు ఇతరులకు నా వలన సుఖము ఎట్లు కలుగును? జరా వ్యాధులును, మరణ శోకములును పొందని వస్తువును శోధించి దానిని శరణు పొందవలెను''.

– సశేషం

# బుద్ధ ధ్యాన హృదయము-4

సెప్టెంబరు సంచిక తరువాయి

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

సమ్యక్ స్మృతి యొక్క 4 లక్ష్యాలు

1) శరీరము 2) భావము, వేదన (feeling) 3) మానసిక స్థితి మనసులోని అంశాలు. మానవుడు అతని అనుభవమంతా సమ్యక్ స్మృతి యొక్క లక్ష్యము. శరీరముతో ఆరంభమై దాని క్రియలు, యింద్రియానుభవాలు, వాటిలోని అంశాలు యోచన దాక మానవుని వ్యక్తిత్వం మీద ఆధారపడటం వల్ల సాధనకు విశాలము, భద్రము అయిన చక్కటి పునాది యేర్పడుతుంది. సాధనకు మానవుని వ్యక్తిత్వాన్నంతా ఆధారం చేసుకోకపోతే అందులో ప్రధానంగా మనచేత పరిగణింపబడే అంశాలనుండి సాధనకు వ్యతిరేకమైన చర్యలు ఉత్పన్నమై సాధన నాటంకపరచటము, ప్రక్కదారి పట్టించటమూ గాక చిరకాల మభ్యసించి సాధించిన ఫలితాలను గూడ నాశనం చేసే అవకాశమున్నది. కనుక నిర్దుష్టమైన సాధనే యింతటి లక్ష్యాన్ని సాధించగలదు. సాధనకు, తద్వ్యతిరిక్త శక్తులకు మధ్య ఘర్షణలో - శరీరానికి, మనస్సుకు మధ్య వివేకానికి వివేకానికి మధ్యలాంటివి - ఎంతో శక్తిని వృథా చేయడముగాక అపజయానికి గూడా కారణమౌతుంది. మనమే శక్తులను ప్రతిఘటించి అతిక్రమించాలో మలచుకోవాలో నిర్దుష్టంగా గుర్తుంచుకోవడమవసరం. ఇందుకు సంప్రజ్ఞ సాధన అన్ని విధములైన స్మృతిని సంస్కరించుకోవాలి. అయితే సాధన క్రమంలో శారీరక స్మృతినుండి కొన్ని విషయాలనే యెన్నుకొని వాటిపై స్మృతి సాధన చేయటంతో ఆరంభం చేయాలి.

అభ్యాసానికి సూచనలు : ఇందులో ప్రతి అభ్యాసాన్ని మొదట తనకు, తరువాత యితరులకు, తరువాత ఉభయులకు అన్వయించుకొని సాధన చేయాలి. ఇలా యెందుకు చెయ్యాలో చూద్దాం.

యూంగ్ అను మనస్తత్వ శాస్త్రకారుడు మానవులను బహిర్ముఖులు, అంతర్ముఖులుగా విభజించాడు. మొదటివారు బాహ్య విషయాలను, రెండవ వారు అంతర్విషయాలను భావించే స్వభావం కలవారై ఉంటారు. వారి మనోవైఖరి పాక్షికం గనుక మొదటివారికి బాహ్యవిషయాలలోను, రెండవవారు అంతర్విషయాలలోను తక్కువ ప్రజ్ఞ కలిగి ఉంటారు. ఈ సాధకత అనే దోషాన్ని పైన చెప్పిన సాధన సరిదిద్దుతుంది.

చాలా విషయాలు యితరులలోగాని, బాహ్య విషయాలలోగాని గుర్తించి అవగాహన చేసుకోవడం తేలిక, మనలో కంటే. వాటిలోని గుణదోషాలు మరింత స్పష్టంగా అర్థమౌతాయి. ఆ విషయంలో బహిర్ముఖులు యెక్కువ సమర్థులు. అయితే వీరు తమలోని విషయాలను బాగా గుర్తించగలవారుగా ఉండరు. తమను తాము సంస్కరించుకోటానికదెంతో అవసరం. ఉదాహరణకు అనిత్యత్వము అనే ధర్మాన్ని బాహ్య జగత్తుకు మాత్రమే అన్వయించుకొని చూచినప్పుడు సాధనకు పరిమితమే, పాక్షికమే అవుతుంది. మూడవమెట్టైన బహ్యాభ్యంతర విషయాలకు, క్రొత్త విషయాలకు అన్వయించుకొని చూడటం వలన యీ రెంటికి గల సామ్యతలు, విభేదాలు స్పష్టమౌతాయి. ఆ రెండింటికి గల సంబంధం బాగా అర్థమౌతుంది. ఉదాహరణకు మన దేహం గాని, బాహ్య ప్రకృతిగాని ఒకే పదార్థంతో చేయబడుతుంది. అంతేగాక యీ రెంటిమధ్య కార్యకారణ సంబంధం గూడా బాగా అర్థమౌతుంది. కారణం యీ కార్యకారణ సంబంధమే తమ రూపంగా గల సాపేక్షికమైన అనుభవాలెన్నో ఉన్నాయి. ఈ సాధన ద్వారా అయితే వాటి తత్వం బాగా అర్థమౌతుంది. అంతేగాక కేవల శ్రద్ధ సంప్రజ్ఞానాల ద్వారా మనం సాధించిన జ్ఞానం బాహ్యాంభ్యంతర విషయాల రెంటిలోను ఉదాహరింపబడుటవలన అదియెంత సత్యమైనదో మనకు హృదయగతము కాగలదు. ఈ రెండు వస్తుత్వము లేనివని బాగా వెల్లడి కాగలదు. సర్వము

వక్తిత్వ రహితమైన క్రియారూపమని దృఢపడగలదు.

అయితే క్రమబద్ధమైన సాధన ద్వారా లోచూపును పెంచుకోవడంలో అంతర్విషయాలను కేవల శ్రద్ధకు గురిచేయడం జరుగుతుంది. కారణం తనయొక్క శారీరక, మానసిక క్రియలే ప్రత్యక్ష అనుభవాలు, ప్రత్యక్షజ్ఞానం. అందుకని యోచన, అనుమాన ప్రమాణము అనేవాటిని ఆరంభదశలో ప్రక్కకు ఉంచవలసి ఉంటుంది. ప్రత్యక్షానుభవాన్ని ఆధారంగా చేసుకొని భూత భవిష్యత్తులలోని అటువంటి అంశాలకు వర్తమానంలో సాధించిన మన అనుభవజ్ఞానాన్ని అన్వయించుకొనేటప్పుడు సాధనలో మూడుదశలలో యీ రెండూ వినియోగించబడతాయి. అయితే ధ్యానేతర సమయాలలో సమ్యక్ స్మృతిని బాహ్యవిషయాల పట్ల పనిచేయించాలి. ఇతరుల శారీరక మానసిక క్రియలు యీ కోవకు చెందుతాయి.

ఈ జ్ఞాన పద్ధతులను విడివిడిగా మరో విధంగా కూడా ఉపయోగించుకొనేటప్పుడు వాటిలో మూడంశాలను గుర్తించాలి. 1) ఉత్పత్తి 2)లయము 3) ఉత్పత్తిలయాలు. ఈ విధంగా మార్పు యొక్క తత్వాన్ని, వాస్తవాన్ని ప్రత్యక్షంగా గుర్తించడం సాధన సాఫల్యానికి యెంతో అవసరం. మూల గ్రంథంలో ఒకే పదం రెండుసార్లు ఉపయోగించబడినపుడు వాటి వివరణకై వ్యాఖ్యానాన్ని పరిశీలించాలి. వ్యాఖ్యానం ప్రత్యక్షంగా మనం గుర్తించిన సత్యాలకు యోచనాపూర్వకంగా సర్వవిషయాలకు అన్వయించుకొని బుద్ధ ధర్మాన్ని యెలా అన్వయించుకోవాలో చెబుతుంది. ఉత్పత్తిలయాల గూర్చిన అనుభవజ్ఞానాన్ని సత్యదూరాలు, కేవలం ఊహాజనితాలు అయిన సిద్ధాంతాలకు మనం లోబడకుండా ఉండడానికి వినియోగించుకోవాలి. ఉదాహరణకు శూన్య పదార్థవాదాలను 'ఉత్పత్తి' అనే సత్యంతో ప్రతిఘటించాలి. సర్వమూ శాశ్వతమైన సత్యమే, జగత్తు సత్యము మొదలగు వాదాలను 'లయం' అనే సత్యంతో ప్రతిఘటించాలి.

తక్కిన గ్రంథం అంతా ఈ రెండంశాలతో కూడిన అభ్యాసాలయొక్క ఫలితాలను చెబుతుంది. శరీరమున్నది, భావమున్నది, కాని వ్యక్తిత్వం లేదు అని. అంటే వస్తువుల యొక్క నిజతత్వాన్ని తెలుపుతుంది. వాటి నిజతత్వాన్ని గుర్తించిన వారు వాటినుంచి స్వతంత్రుడుగా, అలిప్తుడుగా జీవించగలుగుతాడు. కనుక సాధకుడు అసత్యదృష్టినుంచి, దానినాధారంగా చేసుకొన్న తృష్ణనుంచి విముక్తి పొందుతాడు.

అంతేగాక యీ గ్రంథంలోని వాక్యాలు సమ్యక్ సంబోధి అనబడు పరిపూర్ణజ్ఞాన స్థితినుండి ఉద్భవిస్తాయి గనుక హృదయం మీద కొంతవరకైన ప్రభావం కలిగి ఉంటాయి. అవి సంపూర్ణం కావడం వల్ల అన్ని స్థాయిల వారికి అర్థమై తృప్తికరంగా ఉంటాయి. మనస్సును శాంతపరచేవిగాను (అంటే సందేహాలను, అంతః సంఘర్షణలను అంతమొందిస్తాయి) ఉత్తేజకరంగాను వాటి భావగాంభీర్యం వల్ల అవగాహనను విస్తరింపజేస్తాయి.

1.కాయానుపశ్యనము లేక శరీర ధ్యానము

1) శ్వాసను గూర్చిన స్మృతి : ఈ ధ్యానము ఉఛ్వాస నిశ్వాసాలను గుర్తించడంతో ఆరంభమౌతుంది. ఇది యోగంలోలాగా ప్రాణాయామం కాదు. స్మృతి సాధన మాత్రమే. బౌద్ధ సాధనలో శ్వాసను నిలుపుట (కుంభించుట) వంటి క్రియలు లేవు. సహజంగా సాగిపోయే శ్వాసను స్థిరము, దృఢము, శ్రద్ధ పూర్వకము అయిన గుర్తింపుకు గురిచేయుటమే లక్ష్యము. శ్వాసయొక్క దీర్ఘ, హ్రస్వత్వాలను గుర్తించడమేగాని నియమించడంలేదు. నిత్యసాధన ద్వారా శ్వాస శాంతము, సమము, గాఢము, అవుతుంది. ఇందువల్ల జీవనగతే శాంతమూ, గాఢము అవుతుంది. శారీరక, మానసిక ఆరోగ్యం కూడా చేకూరుతుంది.

శ్వాసయెల్లప్పుడు జరిగే క్రియ. కనుక ఊరికే ఉన్న సమయాలన్నింటిలో మన దృష్టిని దానిపై కేంద్రీకరించాలి. ఈ శ్రద్ధ ఒక్కొక్కప్పుడు పాక్షికమేయైనప్పటికీ శాంతి, తృప్తి కలుగుతాయి. అభ్యాసంతో మన శ్రద్ధ కూడా సహజమై, నిశితము అవుతుంది.

ఏదైనా పని ఆరంభించబోయే ముందు శ్వాసపై శ్రద్ధను కేంద్రీకరించి కొద్దిసార్లు ప్రశాంతంగ, నిండుగా శ్వాస పీల్చుకొంటే మనకు సాధనకుపయోగమేగాక పనికిగూడా ఉపకరిస్తుంది. ముఖ్యమైన నిర్ణయాలు తీసుకునేముందు బాధ్యతాయుతంగా మాట్లాడేటప్పుడు, ఉద్రిక్తుడైన మనిషితో మాట్లాడేటప్పుడు మొదలగు సందర్భాలలో యిలా చేయడం అలవాటు చేసుకుంటే మాటలలో, చేతలలో, తలంపులలో ఏమరపాటు, తొందర సంభవించవు. శ్వాసపై ధ్యానాన్నుంచడం ద్వారా సాటివారికి తెలియకుండా మనమంతర్ముఖులమై వ్యర్థమైన ప్రలాపాలనుండి, ధ్యేయాన్ని మరపించే విక్షేపాలనుండి తప్పుకోగలుగుతాము. ఇవి నిత్యజీవితంలో శ్వాస, స్మృతి సాధన వల్ల కలిగే కొన్ని ప్రయోజనాలు.

ఈ సాధన ఏకాగ్రత, ధ్యానము మొదలైన ఉత్తమ సాధనలకు మొదటి మెట్టుగా కూడా యెంతో

ఉపకరిస్తుంది. అయితే సంపూర్ణ ధ్యానాన్ని పొందడానికి దీనిని వినియోగించడం అంత తేలిక కాదు. అయినప్పటికి విడవడానికి వీలులేదు. ఎందరో మహనీయులు లక్ష్యాన్ని సాధించటానికి యీ సాధన ఆధారమౌతుంది. శరీరంలో మన స్వాధీనంలో ఉండే క్రియలకు, లేని వాటికి మధ్య స్థితిలో ఉంటుంది శ్వాస. కనుక శరీరంపై సంపూర్ణ అధికారాన్ని సాధించడానికిది చక్కటి సాధనము.

ఇది లోచూపును పెంచుకోటానికి కూడా సాధన. కేవల శ్రద్ధను శ్వాసకు గురిచేసినప్పుడు జగత్తనే అనిత్యత్వసాగరము యొక్క ఆటుపోట్లను గుర్తించవచ్చు.

శరీరం యొక్క నిజతత్వాన్ని తెలుసుకోటానికి గూడా యిది ఉపకరిస్తుంది. శరీర క్రియలకు దీనిని ప్రతినిధిగా తలచవచ్చు. శ్వాస యొక్క నిజతత్వంలో శరీరం యొక్క అనిత్యత్వం ప్రతిబింబిస్తుంది. ఊపిరితిత్తులవ్యాధి వల్ల లేక రొప్పువల్ల శరీర సంబంధమైన దుఃఖాన్ని గుర్తించవచ్చు. శరీరాన్ని జీవింపజేసే వాయువు ద్వారా శరీరం వ్యక్తిత్వరహితమైన శక్తుల చేత జీవింపచేయబడుచున్నది. శరీరం యిట్టి క్రియల సముదాయమని, వాటి కన్నమైన వస్తుత్వం దానికి లేదని ఆ గాలియొక్క తత్వం నిరూపిస్తుంది. ఈ శ్వాస వివిధ అవయవాల మీద ఆధారపడటంవలన జీవశక్తి శ్వాసపై ఆధారపడటం వలన అట్టి పరిస్థితుల కూడికయే శరీరమని తెలుస్తుంది. ఇలా శరీరతత్వాన్ని గుర్తించినపుడు శరీరమే నేననెడి భ్రాంతి తొలగుతుంది.

2) భంగిమల స్మృతి : నడుస్తున్న, నిల్చున్న, కూర్చున్న, పడుకున్న, క్షణికమైన శరీర ప్రవర్తనపై గుర్తింపును పెంచటమే నిత్యజీవితంలో ఈ సాధనను కొనసాగించడం యొక్క లక్ష్యం. సామాన్యంగా ఒకచోటికి వెళ్ళేటప్పుడు వెళ్ళడానికి కారణమైన లక్ష్యం గూర్చిన యోచనలలో పడి 'వెళ్ళుట' అను శరీర క్రియలపై మన శ్రద్ధ నిలువదు. అలాగే, చేసే పనిలో నిమగ్నం కావడం చేత కూర్చొనుటలోగల శారీరక స్థితిని గుర్తించకపోవడం జరుగుతుంది. నిత్యజీవితంలో శారీరక కదలికలపై సంపూర్ణ స్మృతిని కలిగియుండడం సాధ్యము, వాంఛనీయము(ఇష్టం) కాక పోయినప్పుడే కొంతవరకైనా దానినభ్యసించటం ఉపయోగంగా ఉంటుంది. వెళ్ళేటప్పుడు శారీరక కదలికలపై దృష్టినుంచి నట్లైతే వెళ్ళటంలో అవాంఛనీయమైన తొందరపాటు తొలగిపోతుంది. నిష్ప్రయోజనము, అపాయకరములు అయిన శరీరకదలికలు జరగకుండా పోతాయి. అంతేకాక అనారోగ్యకరమైన భంగిమలు అలవాటు కాకుండా చూచుకోవచ్చు. నిష్ప్రయోజనమైన శారీరక, మానసిక అలసటను నివారించవచ్చు. శరీరంపై మనకు గల స్వాధీనం సడలకుంటుంది. నియమబద్ధమైన శారీరక కదలిక నియమబద్ధమైన మనస్సును సూచిస్తుంది.

భంగిమలపై దృష్టిని కేంద్రీకరించడం వలన శరీరం తాను కాదన్న గుర్తింపు శరీరము కేంద్రీకరింపబడిన వ్యక్తిత్వమే లేదనే గుర్తింపు కలుగుతాయి. క్రమంగా వేరొక తోలుబొమ్మ యొక్క కదలికలను చూస్తున్నట్టే తన కదలికలను గూడా చూడగల్గే స్థితి వస్తుంది. దానివల్ల అభ్యాసంగా యేర్పడిన శరీర తాదాత్మ్యం లేక దేహాత్మ బుద్ధి కరగిపోనారంభిస్తుంది.

ఆధ్యాత్మిక విషయంలో నిత్యాభ్యాసానికి మొదటిమెట్టు శారీరక భంగిమల స్మృతి. అలానే స్మృతి యెట్టి ఆధ్యాత్మిక లక్ష్యాలపై కేంద్రీకరింపబడనప్పుడు భంగిమలపై నిలుస్తుంది. అంతేగాక తాత్కాలిక ఉత్పత్తి వినాశక్రియలను, దేహ భంగిమలు ఉదహరిస్తాయి.

3) శుద్ధమైన అవగాహన : శుద్ధమైన అవగాహన శరీర క్రియలన్నింటిపై వ్యాపిస్తుంది. నాలుగు భంగిమలు, చూచుట, వూగుట, చాపుకొనుట, వస్త్రధారణ, తినుట, త్రాగుట, మలవిసర్జన, మాట్లాడుట, మాట్లాడకుండుట, మెలకువగా ఉండుట, నిద్రపట్టుట మొదలగునవి.

ఈ విధంగా శుద్ధ అవగాహన సాధన వివేకవంతము, సార్థకము అయిన కర్మాచరణను నేర్పుతుంది. ఇది నిత్యావసర విషయంలోనేగాక ఆధ్యాత్మిక ప్రగతి విషయంలోగూడ వివేకవంతము, సార్థకవంతము అయిన కర్మలను చేయడం నేర్పుతుంది.

నిత్యజీవితము, ఆధ్యాత్మిక సాధన సమన్వయ పడతాయి. శారీరక క్రియలు వ్యక్తిత్వ రహితమైనవన్న లోచూపు నిత్యజీవితంలో గూడ బలపడుతుంది. కనుక దేహము తానన్న భ్రాంతి నుండి విడివడతాడు.

ఇంతకు ముందు సాధనలో వివిధ శారీరక భంగిమలను ధరించినపుడు వాటిని స్మృతి గుర్తిస్తుంది. అలాకాక రెండు విధములైన శుద్ధ అవగాహన ('సార్థకత', 'ఔచిత్యము') మన శారీక క్రియలను సరియైన రీతిన సంస్కరిస్తాయి. క్రిందటి సాధన శరీరము యొక్క భంగిమలను గూర్చిన స్థూలము, దృఢము అయిన యెరుక కలిగియుండడమేగాక అవి వ్యక్తిత్వ రహితములన్న గుర్తు గూడా కలిగిస్తుంది. నాలుగవ రకమైన శుద్ధ అవగాహన (సత్యము లేక వాస్తవము) శారీరక క్రియలను మరింత వివరంగా విశ్లేషించి అవి వ్యక్తిత్వ రహితాలన్న గుర్తింపును మరింత లోతుగా కల్గిస్తుంది.

4) శరీర అంతర్భాగాల ధ్యానము : చర్మము చేత కప్పబడిన ఆకశములైన అంతర్భాగాలను గూర్చిన స్మృతి శరీరం వ్యష్టిత్వంతో గూడిన ఒకే ఒక్క వస్తువు అన్న భ్రాంతిని తొలగిస్తుంది. అంతేకాక శరీరం సుందరమైనది అనే భ్రాంతిని కూడా తొలగించి దాని అశుభ్రతను గుర్తు చేస్తుంది. శరీరాన్ని చర్మము, మాంసములతో కప్పబడిన అస్థిపంజరంగా గుర్తించినపుడు లేక చిత్రవిచిత్రమైన ఆకృతులుగల వివిధ వస్తువుల సంపుటి అని గుర్తించినపుడు అదే తానన్న భ్రమ తొలగడమే గాక అన్యదేహాలపై వ్యామోహం కూడా తొలగుతుంది.

అంతర్భాగాలను గూర్చి ధ్యానించడంలో మనస్సు భావపూరితమైన ఆకర్ష వికర్షణాలకు లోబడక ఏకాగ్రత చెందినటులైతే క్రమంగా దేహమే తానన్న భ్రాంతి తొలగడమేగాక అప్రయత్నంగా విషయేచ్ఛల వలయం తొలగిపోతుంది. సాధన జ్ఞాన స్థితియొక్క 2వ, 3వ దశల వరకు కొనసాగేలోపల యీ పరిమాణాలు అసంపూర్ణంగాను, తాత్కాలికంగాను వుండిపోతుంది. కాని శ్రద్ధగా సాధన చేస్తే ఆ స్థితులను త్వరగా సమీపించగలరు. సులువెరిగి తేలికగా, త్వరితంగా మనస్సును ఆ స్థితికి చెందించగలగడం శరీరంపై వ్యామోహాన్ని పెరగకుండ విషయేచ్ఛలను అరికట్టడానికి ఉపకరిస్తుంది.

ఈ సాధనలో శరీరముపై గల వ్యామోహాన్ని అరికట్టడానికి దానిపట్ల జుగుప్సను కల్గించుకొనే యత్నం లేదు. కేవలం వ్యామోహం నుండి అయత్నంగా విడివడడానికి, దానియొక్క యదార్థ తత్వాన్ని గుర్తించడానికి ప్రయత్నిస్తుంది.

ఆధునిక నగరజీవనంలో మానవుడు కోరికలను రెచ్చగొట్టే అనేక శక్తులను యెదుర్కోవలసి వస్తుంది. సినిమా, నాటకము, రేడియో, టెలివిజన్, సాహిత్యము, కళ, ఎడ్వర్టైయిజ్మెంట్, పత్రికల ముఖచిత్రాలు అన్ని యిట్టి శక్తులే. ఇవి నిత్యము తిరిగి తిరిగి తారసిల్లుతూండడంవల్ల, మనస్సు యొక్క వివిధ స్థాయిలలో వీటి ప్రభావం మేల్కొని యెవరూ గుర్తించలేనంత లోతుగా నైతికంగా, మానసికంగా, మనస్తత్వాన్నంతటిని వికారంగా మలుస్తాయి. వీటి ప్రభావాన్నుండి ప్రతివ్యక్తి దృఢనిశ్చయంతో తనను రక్షించుకోవాలి. ఇందుకు శరీరాంతర్భాగ భావనయెంతో ఉపకరిస్తుంది.

5) నాలుగు భూతాలు : శరీరం నాలుగు భూతాలతో చేయబడి ఉన్నది అన్న విషయాన్ని ధ్యానిస్తే సృష్టిలోని జడమైన వస్తువులన్నీ వేటితో చేయబడి వున్నాయో అట్టి వాటితోనే తన శరీరం కూడ చేయబడియున్నదన్న గుర్తింపు కలుగుతుంది. ఇందువలన శరీరం వ్యక్తిత్వ రహితమైనదన్న గుర్తింపు దృఢతరమవటమే కాక శరీరమే తానన్న భ్రాంతి తొలగి వ్యామోహం తొలగుతుంది.

6) స్మశానధ్యానాలు: ఈ ధ్యానానికవసరమైన విషయాలు యెప్పుడో ఒకప్పుడు ప్రత్యేకంగా చూడసాధ్యమైనవే. అట్టి అవకాశం కలుగకపోయినప్పటికీ తామే స్పష్టంగా భావించవచ్చు. ఈ సాధనలో వివిధ స్థాయిలలో కూడిన మృత కళేబరాలను ధ్యానించాలి. ఇంద్రియలోలులైన వారికి, భ్రాంతిని తొలగించడానికి యీ ధ్యానం వల్ల కలిగే జుగుప్స తోడ్పడగలదు. అంతేకాక దేహమశాశ్వతం అన్న సత్యాన్ని కూడా యీ ధ్యానం హృదయగతం చేస్తుంది. ఈ ధ్యానం యితరుల శరీరాలకే గాక యేనాటికైనా ఆ స్థితి (తన శరీరానికి) తప్పదని గుర్తించి వ్యామోహాన్ని విడనాడతాడు.

రేపోమాపో పక్షులకు, పురుగులకు, నాలుగు భూతాలుగా మార్పుచెందనున్న దేహం ''తనది'' అనే భ్రాంతిని పెంచుకోవడం యెంతటి అవివేకమో తెలియగలదు.

శరీరం తాను కాదని వ్యక్తిత్వ రహితమని తెలియడం వలన తాదాత్మ్యము, మోహము తగ్గుతాయి.

ప్రాచీనకాలంలో యీ ధ్యానానికి తగిన వస్తువులు (మృతకళేబరాలు, అస్థిపంజరాలు) చూడనవకాశముండేది. ఈనాడు యుద్ధరంగాలలోను, ఆస్పత్రులలోను, వైద్య విద్యాలయాలలోను చూడవచ్చును.

ఈ శారీరక ధ్యానాలన్నీ కొంత కేవల శ్రద్ధ సాధనకు కొంత శుద్ధ అవగాహన సాధనకు చెందుతాయి.

ఇవన్నీ శరీరముపట్ల వైరాగ్యాన్ని కల్గిస్తాయి. కారణం శరీరం యొక్క యదార్థ తత్వాన్ని తెలియపరుస్తాయి. ఈ వైరాగ్యం విషయ వాంఛలపైన నిగ్రహాన్ని, స్వేచ్ఛను యిస్తుంది. శరీరాన్ని ఫలోపవాసాలతో శుష్కింపచేయనక్కరలేకుండా వైరాగ్యాన్ని పెంపొందించటమే యీ సాధనలో గల విశిష్ట్యము. అటు యింద్రియ లోలత్వానికి, ఇటు శరీరాన్ని శుష్కింపచేయడానికి మధ్యే మార్గము స్మృతి శ్రద్ధ సాధన. ఈ దుఃఖ బాధ నివృత్తి సాధనలో శరీరం తేలిక అవుతుంది. రోగాదులు ప్రాప్తించినపుడు కూడ మనసు నిర్లిప్తంగ ఉంటుంది.

2. భావోద్రేకాల గూర్చిన ధ్యానము (వేదనానుపశ్యనము)

వేదన అను పాళి పదానికి శారీరకము, మానసికము అయిన సుఖ, అసుఖ, తటస్థభావాలు అని అర్థం. ఏ యింద్రియానుభూతికైనా ప్రథమంగా కలిగేది శారీరక, మానసకి ప్రతిక్రియభావం. మనో జయాన్ని పొందేవారు దీనిపట్ల ప్రత్యేక శ్రద్ధను వహించాలి. భావానికి ప్రధానమైన

కారణం యింద్రియానుభవమనీ, భావం కోరికకు కారణమని, దాని ద్వారా తృష్ణకు (కోరికవలన కలిగిన ఆవేదన తృష్ణ అంటారు) కారణమని చెప్పబడింది.

కనుక దుఃఖోత్పత్తికిది మూలకారణం. అందుకే దుఃఖ నివారణలో యిది ప్రథమస్థానాన్ని ఆక్రమిస్తుంది. ఇంద్రియానుభూతి కలిగినపుడు మనస్సును భావాన్ని పొందే దశలో నిలిపి దానిని కేవల శ్రద్ధకు గురిచేస్తే తృష్ణాదులు నివారణౌతాయి. అంతఃకరణ తృష్ణాదులను పొందక యింద్రియానుభూతి, సుఖం, అసుఖం తటస్థమని గుర్తించడంలో నిలిచిపోతుంది - ఆ దశలో అంతవరకు సాధించబడిన శుద్ధ అవగాహన ఆ వస్తువుపట్ల సరైన వైఖరిని నిలుపుతుంది. దాని యదార్థ తత్వ అవగాహన ద్వారా - అంతేకాక కేవల శ్రద్ధ ద్వారా భావం మరొక కారణాన్ని ఆక్రమించుకొని ఉత్పత్తి అవుతుందని క్రమంగ నశించి మరొక భావానికి తావిస్తుందని గుర్తించినపుడు ఆ భావ ప్రవాహంలో కొట్టుకు పోనవసరంలేదని అలా కొట్టుకుపోతే దుఃఖకారణం చోటు చేసుకుంటుందని ప్రత్యక్షంగా సాధకుడు గుర్తిస్తాడు.

క్రమబద్ధమైన స్మృతి సాధనలో సాధకుడు శారీరక ధ్యానాలను సాధించటంలో సౌలభ్యాన్ని సాధించినపుడు గురువు అతనిని ఆ సాధనపట్ల తనలో కలిగే తృప్తి, అసంతృప్తి అనే భావాలపై దృష్టిని కేంద్రీకరించమని చెప్తాడు. గురువులేకుండాసాధనచేసేవాళ్ళుకూడ అలానేచేయవచ్చు.

ఈ తృప్తి, అసంతృప్తులు కేవలం భావాలు మాత్రమే కాక, అంతకంటే విశేషమైనవి. కాని కేవల శ్రద్ధకు గురిచేసినపుడు వాటిలోని వ్యక్తిగతాంశాలు, వాటిలో గల తాదాత్మ్యం తొలగిపోతాయి. కేవలం సుఖ అసుఖాది అనుభూతులుగా మాత్రమే గుర్తించబడతాయి. కనుక సాధకుని యేలక్ష్యం వైపునుండి ప్రక్కకు తోసివెయ్యజాలవు.

జీవితంలో యీ భావాలు ప్రబలంగా కలవారిని భావోద్రేక స్వభావులు అంటాము. అట్టివారు సుఖాది భావాలలో తిరిగి తిరిగి ఉద్రేక పూర్వకంగా నిమగ్నులై వాటికి తగనంతటి ప్రాధాన్యాన్నిస్తారు. అందువల్ల పరిస్థితి ఉన్నదానికంటే యెక్కువగ కనుపించి తీవ్రమైన ప్రతిక్రియను వారిలో కల్గిస్తుంది. ఇది పొంగడం కావచ్చు, కుంగడం కావచ్చు. అతిగా విలువ నివ్వడం కావచ్చు. చులకన చేయడం కావచ్చు. వీటిలో స్వాధీనం తప్పుతుంది. క్రమంగా యిదేవారి స్వభావంగా మారుతుంది. తదనుశృతమైన బంధాలు కలుగుతాయి. తాను అతిగా విలువకట్టిన వస్తువు విలువ లేనిదని తెలిసినపుడు నిరుత్సాహము, పరిస్థితి ఉన్నదానికంటే ప్రమాదకరంగా తోచినపుడు అతిభయము, తద్విరుద్ధమైనపుడు మితిమీరిన అలక్ష్యము లాంటివి కలుగుతాయి. సాధారణంగా ప్రజలు యిది నా ప్రాణం అని, యిది నాకు మృత్యుతుల్యమని అనటం వింటుంటాం. స్మృతి సాధకుడు అవే అనుభవాలను యిదిగూడ ఒక ముఖ్యమైన భావమే అనిగాని, యిదికూడ ఒక అనుభవంమాత్రమే అనుకుంటాడు. దీనివలన మనస్థైర్యము, శాంతి కలుగుతాయి. అట్టి వానిని విషమ పరిస్థితులు కూడా చలింపజేయలేవు.

అదుపు తప్పిన భావాలు వస్తువులకు, వ్యక్తులకు అతిగా విలువనాపాదించేలా చేస్తాయి. ఆ విలువలు అవాస్తవమని, అనుచితమని కూడ తెలియనియ్యవు. ఆ విషయాలు మరిఒక వైఖరి లేక దృష్టి కలిగియుండడం సముచితమేనని తెలియక సాటివారిభావాలను అలక్ష్యం చెయ్యడంగాని, గాయపరచడం గాని జరుగుతుంది. సామాన్యంగ ఆ సాటివారిస్థితిగూడ అలానే వుంటుంది. కనుక జీవితంలో సంఘర్షణ తప్పదు. అట్టి స్థితిలో సమ్యక్ స్మృతి సాధన భావాలను గూడ నిర్లిప్తంగా గుర్తించడం నేర్పి సాటివారి భావాలను గూడ సహనంతో, గౌరవంతో, అవగాహన చేసుకొనేలా చేసి సంఘర్షణలను నివారిస్తుంది.

అప్పుడే ఉత్పన్నమైన భావాన్ని సుఖము, అసుఖము, తటస్థము అని మాత్రమే మొదట స్మరించాము అని మూలసూత్రం చెబుతుంది. తరువాత దానికి ఆ భావము ప్రాపంచికమైనదో, అతీతమైనదోనన్న లక్షణాన్ని కూడా గుర్తించామని చెబుతుంది. ఇలా నిర్లిప్తంగా గుర్తించే సాధన మన భావాలను పరిశుద్ధం చేసి ఉత్తమ భావాలను పెంచి అధమభావాలను నివారిస్తుంది. ఈ పద్ధతి - భావం యొక్క యదార్థతత్వాన్ని నిర్లిప్తంగ గమనించడం -- భావాలను ప్రతికూల భావాలతో (అంటే వ్యామోహాన్ని అసహ్యభావంతో) ప్రతిఘటించే పద్ధతికంటే మెరుగైనది. భావోద్రేకాలలో మునిగి తేలేవారు కేవలం శాస్త్రాలో, పెద్దలో చెప్పిన సిద్ధాంతాల సహాయంతో తమలోని భావాలను మార్చుకోజాలరు. స్మృతి సాధనలో తమకు కలిగిన భావాలతత్వాన్ని తామే స్వయంగ గుర్తించటం జరుగుతుంది గనుక నిస్సంశయముగ స్వానుభవమే వారి భావాలలో గల వైషమ్యాన్ని గమనించగలదు. భావాల విషయమేగాక భావోద్రేకాల విషయం గూడ యింతే.

- సశేషం

# చిత్తశుద్ధి సాధనకు బాబా చూపిన బాట!

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

ఆత్మ శుద్ధిలేని ఆచారమదియేల,
భాండ శుద్ధిలేని పాకమేల,
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా,
విశ్వదాభిరామ వినురవేమ!

అని గానం చేశాడు వేమనయోగి. ఎంతో చిన్న పదాలలో భగవద్గీతాది సకల శాస్త్రాల సారాన్ని యిమిడ్చాడు. యజ్ఞము, దానము, తపస్సు, కర్మలను ఎన్నడూ విడువకూడదని, వాటిని ఆచరిస్తున్నా సత్త్వగుణం లేకుంటే యివన్నీ గూడ నిష్ఫలమనీ భగవద్గీత చెబుతున్నది. చిత్తశుద్ధియని వేమన చెప్పినది సత్వగుణ ప్రధానమైన దైవగుణ సంపద గురించే. యమ నియమాలు యింద్రియ జయానికి తోడు మనోజయం గూడ సంపాదించడం యోగ సాధనకు మూల ప్రాతిపదికయని యోగశాస్త్ర చెబుతుంది. వివేక వైరాగ్యాలని వేదాంతం ప్రతిపాదించేది, నిష్కామ కర్మయని కర్మయోగం చెప్పేదికూడ ప్రధానంగా చిత్తశుద్ధి గురించేనని కొంచెమాలోచిస్తే తెలుస్తుంది.

అయినా యిలా ఒకటి రెండు మాటలలో వాచా ముఖ్యసూత్రాలను చెబితే సామాన్యులందరూ వాటి గురించి మాట్లాడడము, వల్లించడమూ మాత్రమే నేర్చి వాటిని సాధించినట్లు ఆత్మవంచనకు గురియౌతారని, నిత్యజీవితంలో దానిని ఆచరించడం మరచిపోతారనీ సాయిబాబావంటి సద్గురువులకు తెలుసు. కనుక సమయ మొచ్చినపుడు దానిని భక్తులెలా మరుస్తారో వారికెరుకపరచి హెచ్చరించేవారు. అది తెలుసుకొంటే గాని మనకూ సాయిబోధ శల్యగతం కాదు.

చిత్తశుద్ధికి ఏకైకమైన వుపాయం సత్సంగం. "సత్సంగత్వే నిస్సంగత్త్వమ్" అన్నారు. సంగమంటే మాయా మయములు, అసత్కరములు (అవాంఛనీయములు) అయిన పనుల, బాంధవ్యాల పట్ల పామరులకంటే లోలత, సత్సంగం వలన అసద్విషయాలపట్ల (ఆత్మజ్ఞాన విరుద్ధములైన విషయాలపట్ల) మనకుండే చాపల్యమంతరిస్తుంది. ఒక ఉత్తమ ఆశయం కోసం ప్రాకులాడే వారికి సంకుచితమైన భావాలు శమించునట్లు అన్నట్లు.

సత్సంగమంటే ఏమో యోచించాలి. సత్పురుషులతో సంగము అనుబంధము ఏర్పరచుకొనడం. 'సత్పురుషుల'న్న పదానికి స్థూలార్థం 'మహనీయులు' అనుకోవచ్చు. కానీ వారితో చిరకాల సాంగత్యం అందరికీ లభించదు. ఎవడో ఒకసారి కొద్దిరోజులు వారితో గడపగల్గినా మరలా మన ప్రాపంచిక జీవితంలో అజ్ఞులైన పామరులతో సహజీవనం మనకు తప్పదు. సంవత్సరమంతా

సత్సంగమంటే ఏమో యోచించాలి. సత్పురుషులతో సంగము అనుబంధము ఏర్పరచుకొనడం. 'సత్పురుషుల'న్న పదానికి స్థూలార్థం 'మహనీయులు' అనుకోవచ్చు. కానీ వారితో చిరకాల సాంగత్యం అందరికీ లభించదు.

నిరంతరం వెంటాడే యీ అసత్సాంగత్యానికే మన జీవితంపై ఎక్కువ ప్రభావముంటుంది.

అంతేగాదు మనలో కొందరికి మహనీయుల సాంగత్యం దొరికినా, దాని ఉత్తమ ప్రభావాన్ని

స్వీకరించే స్థోమత అందరికీ వుండదు. ఎక్కువకాలం పెద్దలవద్ద స్థిరంగా వుండే భాగ్యం లభించిన వారిలో పరస్పరం కార్పణ్యాలెక్కువై వారు ఆ సదవకాశాన్ని వినియోగించుకోలేరు. ఏన్నో ఆశ్రమాలలో ఆధ్యాత్మిక సంస్థలలో యిదే పరిస్థితి అన్వేషకులకు ఎదురవుతున్నది. ఇక ఆశ్రమాలలోను, ఆధ్యాత్మిక సంస్థలలోనే యిలా వుంటే, దాదాపు జీవితమంతా కలుషితమైన ప్రాపంచిక జీవితం గడిపే మన సంగతి వేరే చెప్పనక్కర్లేదు. సాయిబాబాకు మానవ దౌర్బల్యం గురించి కూడ తెలుసు. అందుకే ఆయన తమ సన్నిధిలో ఎటువంటి సంస్థనూ రూపొందనివ్వలేదు. ఆయనే గాదు – ఏ పూర్ణ పురుషుడూ అంగీకరించలేదు. కొందరు తప్పని సరియని ఉపేక్షించారు. శ్రీ అక్కల్కోటస్వామి, శ్రీ గజానన్ మహరాజ్ (షేగాం), శ్రీ తాజుద్దీన్ బాబా, శ్రీ ధునీవాలాదాదా వీరెవ్వరూ అందుకు తావియ్యలేదు.

అంతేగాదు. చిరకాలం తమ చెంతనుండే భక్తుల పనులను, భావాలను సాయి ఏమారక చక్కదిద్దుతూండేవారు. ఒకసారి సాఠేకు, మరొక భక్తుని కుటుంబానికీ, శిరిడీలోని విశ్రాంతి గృహం (వాడా) లో వుండడం గురించి భేదాభిప్రాయాలొచ్చాయి. నాడు వారంతా ద్వారకామాయికి వెళ్ళగానే ఎవరూ ఏమీ చెప్పకనే సాయి, "ఆ వాడా సాఠేదీ గాదు. మరెవరిదీగాదు. నాది!" అన్నారు. ఆ భక్తులందరికీ కనువిప్పైనది వారు వచ్చినది సాయికోసం గాని వాడాపై ఆధిపత్యం కోసం, మాట పట్టింపుకోసం కాదు అని.

అంతేగాదు. అసద్భావాలకు తావులేకుండా జీవించడం తమ సహచరులకు సాయి నిరంతరమూ నేర్పేవారు. శిరిడీలో చిరకాలమున్న దాదాసాహెబ్ కపర్దేగారి డైరీ చూస్తే యీ విషయం తెలుస్తుంది. ఉదయహారతి కాగానే కొద్దిసేపట్లో శిరిడీలో వుంటూన్న భక్తులతో సాయి, "ఇక గదికి వెళ్ళి మెదలకుండా కూర్చోండి!" అనే వారు. ఆ భక్తులు తమ గదులకు వెళ్ళి పూజ, సద్గ్రంథ పఠన, సాయిలీలలు గురించి సంభాషణ జరుపుతూ కూర్చొనేవారు. శ్రీ సాయి లెండీకి వెళ్ళేప్పుడు మశీదుకొచ్చేప్పుడూ దారిలో వారిని దర్శించి నమస్కరించుకొని మరలా గదులలోనే సత్కాలక్షేపం చేసేవారు. మరలా ఆరతికి వెళ్ళేవారు. ఆ సమయంలో గోష్ఠిజరిగేది.

ఇలాగాక భక్తులు మానవ సహజమైన ఆపసత్కాలక్షేపాలు చేస్తే బాబా మందలించేవారు. ఒక భక్తుడు కొందరు సాయి భక్తులను అభినందిస్తూను, మరికొందరిని దూషిస్తూనూ కాలం గడిపాక (మశీదు చేరగానే సాయి. "బాపూ (సోదరా)! మనం ఎవరినీ అభినందించనక్కరలేదు. నిందించనూగూడదు!" అన్నారు. తామెవరినీ నిందించకుండడం ద్వారా సాయి ఉత్తమ ఆదర్శాన్ని భక్తులకు చూపారు. ప్రత్యక్షంగా మాతృవాత్సల్యంతో గురుకృపతో పొరబడిన భక్తులకు అవసరమైన రీతిన ఆయన అనుగ్రహించారు. వారు పశ్చాత్తాపం చెందగానే అలాంటిదేమి జరుగనట్లే వారితో యధాపూర్వం మెసిలేవారు.

"చెడు చూడవద్దు, చెడు మాట్లాడవద్దు, చెడు వినవద్దు, చెడు అనవద్దు అన్న హెచ్చరికగా చెవి, కన్ను, నోరు మూసుకున్న మూడు కోతి పిల్లల బొమ్మలు మనకందించే సందేశమే చిత్తశుద్ధికి మార్గమని సాయి భావం. కారణం అన్నింటా ఆ సాయి (లేక భగవంతుని) చూడడమే మన కర్తవ్యం. అదే జ్ఞానానికి సోపానం. ఎవరెవరి గురించి చెప్పిన చెడ్డ సంగతియేమైనా అబద్ధమైనా మొత్తం మీద విశ్వమంతా సాయి రూపమన్న పరమ సత్యాన్ని మరిపించి మనలను భ్రష్టంచేస్తుంది. పరమార్థం తొలగిపోతుంది, మనసుకు మలిన వాసనలేర్పడతాయి.

మనలో ఒకరి గురించి మరొకరం చెడ్డగా మాట్లాడుకోడంలోని ఆంతర్యమేమో ఒక ఘట్టం బాగా తెల్పుతుంది. ఒక భక్తుడు భగవాన్ రమణమహర్షి వద్దకు వచ్చి కొందరు ఆశ్రమ నిర్వాహకులు ఆశ్రమ నిధులు దొంగతనంగా మింగుతున్నారని ఫిర్యాదు చేశాడు. రమణ నిర్లిప్తంగా విన్నారు. ఆయన శ్రద్ధగా వింటున్నాడని తలచి అతడు మరింత ఆవేశంగా అదే విషయం వివరించాడు తమ భావం గుర్తించి తన ధోరణి అతడు మానుకోకపోయేసరికి రమణులు "అలా అయితే నీవు గూడా వారితో నిధులు దిగమింగు!" అన్నారు. అతడు నివ్వెర బోయి "అదేమిటి భగవాన్? అలా అంటారు?" అన్నాడు. "వారెవరో ఆ పనిచేసుకుంటున్నారు. నీవెందు కొచ్చావో ఆ పనీ చేసుకో!" అన్నారు. వారి భావమర్థమై, ఆతడు నిరుత్తరుడయ్యాడు. ఆ నిర్వాహకులు నిధులే దిగమింగుతున్నట్లయితే వారందుకొచ్చారనేగదా?

అతడు ఆత్మజ్ఞానం కోసమొస్తే ... తన పని చూచుకొనక వారి గురించి పట్టించుకొంటాడా? అని మహర్షి భావం.

దానిని కొంచెం వివరిద్దాము. మనం పనికిరాని కాగితాలు, కూరలు తరుక్కునేటప్పుడొచ్చేచెత్త బయటపారేస్తాం. అపుదు ఏ గాడిదలో వచ్చి వాటిని తింటూంటే అవి తినిపోతున్నయే అని బాధపడము. అదే అవి వచ్చి మనదొడ్లో పాదులను తింటే బాధపడతాము, పట్టించుకొంటాము. కారణం మొదట మన చెత్త పట్ల మనకు ఆసక్తి వుండదు; పాదుల గురించి ఉంటుంది. అలానే సాటివారు నిధులు తినేస్తున్నారని అంతగా చెప్పబోయిన భక్తునికి నిజంగా తనకూ అలా చేయాలన్న భ్రమ గాని లేకపోతే అలా మాట్లాడడు కాకుంటే అతనికి పాపభీతి ఎక్కువై ఆ కోరికను కృత్రిమంగా అణుచుకొన్నాడన్న మాట. అది హృదయములో దాగియుంది. అతడికి నిజంగా అట్టి ఆశ లేకుంటే భగవాన్ లాగా తనపని తాను చూచుకొనే వాడే.

అంతే గాదు. ఇంకొక్క కథ యీ విషయాన్ని మరింత వివరంగా వ్యక్తం చేస్తుంది. ఒకసారి ఒక నది వరదలలో పొంగుతున్నది. నీరు ఆ ప్రాంతంలోనికి చొచ్చుకొస్తున్నది. కొందరు ఆజానుబాహూవులైన సన్యాసులు గబాగబా నడచి రక్షిత ప్రాంతాలకు వెళ్ళిపోతున్నారు. అప్పటికి నీరు వారి గుండెల వరకు వచ్చాయి. ఒక చిన్న గడ్డమీద ఒక యువతి నీళ్ళలో చిక్కబడి రక్షించమని అరుస్తోంది. గడ్డ దిగితే నీటిలో మునిగిపోతుంది. ఒక సన్యాసి అటు చూచి నాలుక కొరుకున్నాడు. తన ధర్మానికి విరుద్ధంగా ఒక యువతికేసి కన్నెత్తి చూసినందకు. అతడు సాటి వానితో, అటునించి కేకలు విన్పిస్తున్నాయి. అయినా అటు చూడకు. నేను పొరబాటున చూచాను. అదే పొరబాటు చేసి స్వధర్మాన్ని కలుషితం చేసుకోకు, మేలు కోరి చెబుతున్నాను. నేనెలాగూ ప్రాయశ్చిత్తం చేసుకోవాలి!'' అన్నాడు. అయినా కొన్నిసార్లు ఆ యువతి చేసే అర్తనాదం విన్పించడంతో ఆజానుబాహువైన రెండవ సన్యాసి అటుచూచి, జాలి చెంది, ఆమెను భుజాన వేసుకొని సురక్షిత ప్రాంతంలో దింపి ముందుకు సాగిపోయాడు. సాటి సన్యాసి, అతడు చేసిన పనిని అదేపనిగా నిందిస్తున్నాడు. కొంతసేపు వూరుకొని చివరకు రెండవ సన్యాసి అన్నాడు. ''నేను యువతిని చూడలేదు, తాకలేదు. ఒక భయార్తయైన ప్రాణిని గట్టున వేసి వెళ్ళిపోతున్నాను. కాని నీవింకా ఆ యువతినే మోస్తున్నావేమి?'' అన్నాడు. నిజానికి ఆ సన్యాసిలో నిద్రాణంగా వున్న స్త్రీ వ్యామోహం అతడంతసేపు ఆమె గురించి ఆలోచించడానికి కారణమని యితని భావం.

ఎవరు యితరులలోని చెడు వెదుకుతారో, దాని గురించి మాట్లాడుతారో వారి హృదయంలో అంతకు రెట్టింపు చెడును వహించియుంటారు. ఈ సత్యాన్నే తెల్పుతుంది క్రీస్తు చరిత్రలోని ఒక ఘట్టం, వ్యభిచరించిన ఒక స్త్రీని యూదులు తమ చట్టానుసారం రాళ్ళతో కొట్టి చంపయత్నిస్తూంటారు. ఆమె అటుగా వస్తున్న ఏసును శరణువేడుతుంది. ఆయన ఆమెకడ్డు వచ్చి జనంతో ''మీలో మనసులో గూడ ఒక్క తప్పుగూడ చేయనివారు మొదట రాయివేసేట్లయితే ఆమెను మీరు శిక్షించవచ్చు!'' అన్నారు. వారు నిరుత్తరులై తిరిగి వెళ్ళిపోయారు. ఆయన వేరొక చోట అంటారు, ''శారీరకంగా వ్యభిచరించిన వారేగాదు, అపవిత్ర భావంతో పరస్త్రీని చూచిన వారుగూడ వ్యభిచరించిన వారే అవుతారు!'' అని. చెడును చూడ్డం, దానిని గురించే ఆలోచించడం, పదిమందితో చెబుతుండడంలోని ఆంతర్యమిదేనని నేటి మనస్తత్త్వ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

చెడును చూడడము, దాని గురించి మాట్లాడడమేగాక దానిని అదే పనిగా నిరసించడం గూడ ఆధ్యాత్మిక పరిణతికెంత విఘాతమో రబియా అనే ముస్లిం మహాత్మురాలు తెల్పింది. ఆ సాంప్రదాయంలో 'గురుదీక్ష' తీసుకొనేటప్పుడు. సర్వ శుభంకరుడు, పరమ పవిత్రుడు అయిన భగవంతుని ప్రవక్త మహమ్మద్‌లవారినీ అంగీకరిస్తున్నానని, వారికి బద్ధశత్రువూ, అపవిత్రుడూ అయిన 'సైతాను'ను నిరస్తున్నాననీ ప్రమాణం చేసే ఆచారముండేది. కాని ఆమె మొదటి రెండు ప్రమాణాలూ చేసి మిన్నకున్నది. మూడవ ప్రమాణం చేయమంటే, భగవంతుడు, మహమ్మద్‌ల పట్ల ప్రేమతో నా హృదయం నిండిపోయింది. మూడవదానిపైకి నా దృష్టి వెళ్ళడం లేదు!'' అన్నది. అదీ సాయి మనకు చూపుతున్న ఆదర్శం.

# ఆంతరంగిక నిశ్చలత ఎలా ఏర్పరచుకోవాలి?

**ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

''ఇతరుల కోసం అతిగా వర్రీ అవడం మానివేయాలి. ఎందుకంటే నీవు వర్రీ అయినందువలన వారికి చేయగలిగేది ఏమీలేదు. అసలు యెక్కువమంది అనవసరంగా సమస్యలలో చిక్కుకుంటూ ఉంటారు. వాళ్ళ స్వభావమే అంత. వాళ్ళను ఆ సమస్యల నుండి తప్పించడం మన వల్లకాదు. ఒకవేళ ఎవరికైనా యేదైనా సహాయం చేయాలి అనుకుంటే మనకు అందుబాటులో ఉన్నంతవరకు చేయవచ్చు; అవకాశమున్నంత వరకు చేయించనూ వచ్చు. ఆపైన దానిని గూర్చి మరచిపోవడం అవసరం. మనం చేయగలిగిందేమీ లేనప్పుడు దానిని గూర్చి వాపోవడం అనవసరం. ఇది మన ముఖ్య సూత్రంగా పెట్టుకుంటే మనస్సు యెప్పుడూ ప్రశాంతంగా ఉంటుంది. రోగికి ప్రాణం పోకముందు మాత్రమే ఏమైనా సహాయం చేయడం మనకెలా సాధ్యమో, అతనికి ప్రాణం పోయాక మనం చేయగలిగిందేమీ యుండదో అలానే మంచో, చెడో ఫలితం ప్రాప్తించే లోపలే మనమేదైనా చేయ యత్నింపవచ్చు. ఆ తరువాత దానిని గూర్చి చింతించడం మాత్రం శుద్ధ దండుగ. కొనవూపిరి యున్నంత వరకూ అతనిని బాధ నుంచి రోగం నుండి రక్షించడానికి యెంత ప్రయత్నించినా అర్థం ఉన్నది. ఆకాస్త ప్రాణమూ పోయాక యెంత శోకించి యేమి లాభము? ఎంత వగచి యేమి లాభము? అలా వ్యర్థంగా చింతించకుండా ఉండటం నేర్చుకొనడం ఎంతో అవసరం.

సకాలంలో మనం చేయగలిగిన సహాయంతోనే వారి కష్టం తొలగి పోతుందనో, ప్రాణం నిలుస్తుందనో గూడ భ్రమించగూడదు. అది యెవరి చేతిలోనూలేదు. వాళ్ళ ప్రాప్తా ప్రాప్తాలను బట్టి సంభవించేవే. సర్వప్రాణులకూ సుఖమూ, దుఃఖమూ, మరణమూ సమానమే వారిలోయినా, మనలోనయినా బాధ, మరణములను నివారించుకొనే యత్నాన్ని కొనసాగించడం ప్రాణశక్తి యొక్క నైజం. కేవలం ఆ కారణంగనే మన బాధను మనమెలా నివారించుకొనయత్నిస్తామో అలానే సాటివారి బాధలు నివృత్తి కావాలని ప్రయత్నించడం మనస్సుగల మానవుని వంటి ప్రాణికి సహధర్మం. అందుకోసం మాత్రమే యథాశక్తి సకాలంలో సహకరించ ప్రయత్నించాలి. అది సఫలమయినా, నిష్ఫలమయినా వ్యర్థంగా చింతించడం గాని, పొంగడం గాని, తగదు. ఇతరులకు సహాయం చేయడం పుణ్యమని, చేయకుండటం పాపమని తలచి, అటువంటి భావాలతో మాత్రమే యితరులకు సహాయం చేయచూడటం అధమ పక్షం. అలా చేయడం ప్రాణం యొక్క సహజ ధర్మం కనుక మాత్రమే చేయడం ఉత్తమమయిన ఆధ్యాత్మిక స్థితి. ఈ జీవన సూత్రం తెలుసుకుంటే జీవితమే సాధన అవుతుంది. జీవితమంతా సాధనలో భాగం అవుతుంది. అది అసలయిన నిష్కామ భావము. సాటి ప్రాణులను తనను వలె ప్రేమించడమంటే ఇలా ఆలోచించి ఆ భావాన్ని దృఢం చేసుకొని అలా ఉండగలుగుతే అదే ఆంతరంగికమయిన నిశ్చలత. నిరంతర ధ్యాన స్థితి.

# దివ్యజనని
# జయంతి మహోత్సవము



భాద్రపద బహుళదశమి దివ్యజనని అలివేలుమంగమ్మ జన్మదిన మహోత్సవము. ఈ సంవత్సరము అక్టోబరు 10వ తేదీన పరమపవిత్రముగా అనందదాయకముగా జరిగింది. పరమపూజ్య గురుదేవుల ధర్మపత్ని, అర్ధాంగిగా వెలసిన కరుణామయి అయిన 'శక్తి' స్వరూపమే అలివేలుమంగమ్మ.

**నజాతు కామాన్ నభయాన్ నలోభాన్**
**ధర్మన్ త్యజేత్ జీవిత స్యాపి హెతో:**

ఎప్పుడూ, ఎక్కడా లోపమే వుండని స్వచ్ఛమైన ధర్మమే వారి జీవితము. పూజ్య గురుదేవులు, వారి ధర్మ పత్ని అలివేలుమంగమ్మల వంటి కారణజన్ములైన మహానుభావుల జీవితాలు ఊహ, విశ్లేషణలకందని సృష్టి తత్వము వలె ప్రారంభమై సృష్టికంకితమవుతాయి. ఆశ్రయించిన వారి పట్ల అపార కరుణ, సమాజంలో ధర్మ స్థాపనమే వారి జీవిత

రేఖలు. 'చేసుకున్న వారికి చేసుకున్నంత' అని నానుడి. వీలైనంతగా జీవితాన్ని సార్థకం చేసుకోగలంతగా వారిని ఆశ్రయించి తరించడమే మనందరి కర్తవ్యము.

అక్టోబరు 10న నాగోలులోను, ఇతర ప్రాంతాలలోను దివ్యజనని జయంతి మహోత్సవాన్ని భక్తిశ్రద్ధలతో జరుపుకున్నారు. శ్రీ సాయి నాధులకు కాకడ ఆరతి, పూజ్య మాస్టరుగారి 'ఉదయ ప్రార్ధన' లతో ఉత్సవాన్ని ప్రారంభించారు.

ఉదయము 10 గం॥లకు పూజ్య బాబుగారు ప్రసంగించారు.అమ్మగారి జన్మదినము జరుపుకోవటము ఎలా విశిష్టమైనదో, ఎందుకు జరుపుకోవాలో వివరించారు. అంతలో భక్తులందరికీ ఆనందము కలిగిస్తూ అమ్మగారు విచ్చేశారు. కనుల పండుగగా అందరూ అమ్మగారిని దర్శించుకున్నారు. సద్గురు సేవా తత్వములో ఎంతో ప్రాధాన్యత కలిగిన గురుపత్నిస్వరూపాన్ని సేవించుకోవటం ఎంతో విశిష్టమైనది. ఆమెను పూజించుకోవటము, గురుదేవుల కృపకై, ఆమె కృపకై అర్థించటమూ నిజభక్తుని ఉత్తమ లక్షణాలు. పూజ్య గురు పుత్రిక శ్రీమతి వేదవతిగారు 'అలివేలుమంగమ్మ తల్లి వ్రతాన్ని' ప్రారంభించారు. భక్తులందరూ, ప్రార్ధన, నామావళి, స్తోత్రాలతో వ్రతము జరుగుతుండగా చూచి తన్మయులైనారు. పూజ్య గురుపత్ని ప్రత్యక్షసేవ, పరోక్ష సేవనము, వారి వాక్కులకు విధేయులై అనుసరించి నడుచుకోవటము వంటివి భక్తులు తప్పక ఆచరించవలసినవి. జన్మ సాఫల్యత ప్రసాదించగలిగినవి. ఈ రోజుమొదలు 'అలివేలు మంగమ్మ తల్లి వ్రతము' చేసుకుని తరించడము జరుగుతుంది.

శ్రీమతి వేదవతిగారు సాయిబాబా పత్రిక అక్టోబరు 2011 లోని 'భక్తి శ్రద్ధల దీపావళి' అనే వ్యాసాన్ని





చదివి వినిపించారు. అమ్మగారి విశిష్టతను తెలియజేస్తూ సాగిన ఆ వ్యాసము వ్రత కథగా యిమిడినట్లున్నది.

''మహాత్ముల జీవితములు మనలను అనేక కోణాలలో నిర్దేశిస్తాయి. వాటిలో రాజ మార్గముగా కీర్తించబడినది, సద్గురు భక్తి. నిజమైన సద్గురువును తెలుసుకోవడం వారిని ఆశ్రయించి వారికి ప్రీతి కలిగేలా జీవించి, జీవితానుభవాలను వారి పరంగా మలుచుకొని, ఫలితంగా వారి కృపను తప్ప మరేమి ఆశించక, వారి నిరంతర స్మరణలో ప్రాణశక్తినంతటినీ అర్పించడమే మార్గము. అలా జీవించి చెక్కుచెదరని ఆధ్యాత్మిక జ్యోతిలా నిలిచారు అమ్మ. అంతటి మహనీయుని హృదయంలో నిత్యనివాసం పొందడమూ ఆమె స్థాయిని నిరూపిస్తాయి'' అన్నారు. ఈ విధంగా వ్రతము దిగ్విజయముగా ముగిసింది. అనంతరము భక్తులు నమస్కరించుకొని అమ్మగారి నివాసంలోకి వీడ్కోలు పలికారు.

అమ్మగారి ఈ పుట్టినరోజు సందేశాన్ని పూజ్య బాబుగారు యిలా తెలియజేశారు,'' ఈ రోజున

అందరూ శాశ్వత మనస్కులై, నిరంతరము భగవంతుని చింతనలో గడపాలని అమ్మగారు కోరారు''. కనుక అందరూ నిశ్శబ్దాన్ని పాటిస్తూ మనస్సులలో భగవంతుని స్మరిస్తూ రోజంతా గడపాలి'' అని చెప్పారు. అలా ఈ ఉదయమంతా  జన్మదిన మహోత్సవము చక్కగా జరిగింది. తదుపరి ప్రసాద వినియోగము జరిగింది. సాయంత్రము 4 గం॥ల నుండి పూజ్య బాబుగారు ఇష్టా గోష్టి నిర్వహించారు. 6 గం॥లకు శేజ్‌హారతి జరిగింది.



దివ్యజనని  అలివేలు మంగమ్మ నివాసమైన 'నిలయము' బిల్డింగు ముందు చక్కని మంటపము నిర్మించబడింది. తెల్లని కర్టెన్‌క్లాత్‌లతో పరదాలు, వాటిపైగా పసుపుపచ్చని బంతులు వరుసలతో అలంకరణ చేయబడింది. భక్తికి, పవిత్రతకూ చిహ్నాలుగా అవి, నూతనత్వానికి ఆలంబనగా క్రోటన్, బోగన్ విల్లియాలు చక్కగా అమర్చబడ్డాయి. స్టేజిపై శ్రీ సాయినాధులవారు మధ్యలోనూ, పూజ్య గురుదేవులు ఎడమవైపున ఆశీనులై వుండగా, దివ్యజనని అలివేలుమంగమ్మ విచ్చేసి కుడివైపున స్టేజిని అలంకరించి జనులందరినీ ఆశీర్వదించారు. పిల్లలు, భక్తులు, సమాజసేవకులు ఇంకెందరో జనులతో ప్రాంగణమంతా నిండుగా వున్నది. దివ్యజనని దర్శన ఆశీస్సులనందుకుంటూ అందరూ శ్రద్ధతో సావధానులైనారు. మొదటగా శ్రీమతి వేదవతిగారు అమ్మగారిని సేవించటము గురించి కొన్ని సూచనలు చేస్తూ ప్రసంగించారు. భక్తులు నమస్కార జయకారములు చేస్తూండగా అమ్మగారు తమ అనుగ్రహ భాషణము చేశారు. బ్రహ్మ ఈ అనంతమైన సృష్టిని చేసిన తర్వాత అంతా క్రమంగా నడుస్తూన్నది. ఎన్నో జీవరాశులు సృష్టించిన బ్రహ్మకు అవి క్రమ పద్ధతిన జీవిస్తూ, మరణిస్తూ వుండటమూ నిస్తేజముగా అనిపించసాగింది. అంతా తన ఆజ్ఞప్రకారం క్రమపద్ధతిన నడవటం రంజకముగా లేదు. కనుక బ్రహ్మ తనకు తానుగా ఆలోచించి, నడుచుకోగల జీవిని చేయదలచి, మానవుని సృష్టించాడు. కనుక బ్రహ్మ మనలను యాంత్రికముగా బ్రతకమని గాక, స్వతంత్రముగా ఆలోచించి బుద్ధిశాలురై ప్రతిసృష్టి తత్పరులై జీవించమని కోరాడు. అలా బ్రతకడంవల్ల మన జన్మ, సృష్టికి అర్థంవుంటుందిగానీ, ఒక లక్ష్యము ఆలోచనలులేని జీవిగా ఉండటము వల్లకాదు. మనందరమూ అలా ఆలోచించి, వ్యక్తిగా, సృష్టి భాగముగా, సమాజ నిర్ణేతలుగా ఈ సృష్టి తత్వాన్ని సంబంధాలను అర్థం చేసుకుంటూ నిత్యనూతనంగా జీవించాలి. ఇంకా, ఏది మంచి? ఏది చెడు? ఏది శ్రేయస్కరము? ఏది కాదు? అని ఆలోచించి, వివిధ సందర్భాలలో భక్తి, ధర్మముల పరంగా నడవడానికి ప్రయత్నించాలి. ఉదాహరణకు పిల్లలకు నేర్పే విద్య ఎలాటిదై వుండాలి? ఆడపిల్లలను సరియైన నడవడిక చిన్నప్పటినుండే తెలియజెప్పటమూ! వంటివి. పుట్టినరోజు ఎలా చేసుకోవాలి, ఆ రోజున ఎలా గడపాలి అన్నవి చెప్పారు. ఈ సాంప్రదాయము ఎలా వచ్చింది? మొదట్లో ఈ రోజున మనం తినేది అందరితో పంచుకుంటూ తినాలి, అనే దానికి అభ్యాసంగా విందు మొదలైంది. ఆలానే అన్నీ అందరితో పంచుకోవాలి అనే సాంప్రదాయము తెలియాలి. కొంత వినోదము వుంటే పరవాలేదు, ఉండాలిగూడ, కానీ అదే ప్రధానం కాకుండా ధ్యేయము తెలియాలి. మనము మాస్టరుగారికి నచ్చేటట్లు ఈరోజు గడపాలి. అదే అలవాటయ్యేట్లు ముందురోజు, తర్వాత రోజుకూడా నిష్ఠగా, భక్తి ఆనందాలతొ గడిపితె ఇంకా మంచిది. క్రమంగా అదే అభ్యాసమౌతుంది, అని ఎన్నో విషయాలు తెలియజెప్పారు. అలా అమ్మగారి భాషణం విన్న భక్తులు కృతనిశ్చయులైనారనిపించింది. అందరూ భజనచేసి, జయకారాలతో అమ్మగారికి నమస్కరించుకొని వారిని గృహములోనికి వీడ్కోలు పలికారు. ఆ విధంగా ఈ మహోత్సవము దిగ్విజయమైనది.

జై సాయి మాస్టర్!!!

## Books on Sri Ramakrishna Paramahamsa and swami Vivekananda

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 25.00 |
| భారతం నా అమర భారతం | 20.00 |
| జ్ఞాన యోగం | 30.00 |
| బుద్ధి యోగం | 15.00 |
| కర్మ యోగం | 15.00 |
| శ్రీ రామకృష్ణ కథామృతం-2 | 120.00 |
| స్వామి వివేకానంద(2- భాగాలు) | 60.00 |
| మహాభారతం | 5.00 |
| నా అమర సందేశం | 30.00 |
| భక్తి యోగం | 10.00 |
| సందేశ తరంగిణి (కొలంబో-అల్మోరా) | 40.00 |
| వివేక సూర్యోదయము | 20.00 |
| దైవంతో సహజీవనం | 100.00 |
| భగవంతుని సన్నిధిలో భక్తులు | 80.00 |
| వివేకానంద లేఖావళి | 25.00 |
| My Idea of Education | 34.00 |
| Karma Yoga | 18.00 |
| God Lived With Them | 170.00 |
| They Lived With God | 140.00 |
| Raja Yoga | 36.00 |
| Bhakti Yoga | 16.00 |
| Jnana Yoga | 50.00 |
| Letters os Swami Vivekananda | 110.00 |
| Reminiscences of swami Vivekananda | 100.00 |
| Talks With Swami vivekananda | 58.00 |
| Complete works of Swami Vivekananda-9 | 110.00 |
| Meditation and its Methods | 18.00 |
| Vivekananda on Himself | 100.00 |
| Ramakrishna and Vivekananda | 7.00 |
| Tales and Parables os Sri Ramakrishna | 45.00 |
| Lectures from colombo to Almora | 40.00 |
| Complete Works of Swami Vivekananda | 50.00 |
| Sayings of Sri Ramakrishna | 25.00 |

జై సాయి మాస్టర్ !!

ప్రియ గురు బంధువులారా! జగద్గురు శ్రీ సాయి మాస్టర్ ఆశించిన ఆధ్యాత్మిక సేవలనందించడానికి, దివ్యజనని అలివేలుమంగమ్మ భరద్వాజుల ఆశీస్సులతో 'శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్' స్థాపించబడినది. సాయి మాస్టర్ భక్తులు, జిజ్ఞాసువులు- పుస్తకములు, ఫోటోలు మొదలగు వాటికొరకుగాని, విరాళములు మరియు Magazine subscriptions మొదలగు అన్ని విషయములకు ఈ క్రింది అడ్రసును సంప్రదించగలరు. D.D.లు, M.O.లు కూడా ఈ క్రింది అడ్రసుకు పంపించగలరు.

**Sri Manga Bharadwaja Trust,**

Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar, Jaipuri Colony, Nagole,Hyderabad - 68
Phone: 040-20063300

OR,

Sri Manga Bharadwaja Trust, Ongole Branch Office
Kothapeta, Kondiah Street, Ongole, Andhra Pradesh - 523002. Phone : 08592 - 233271

**పూజ్య శ్రీ సాయిమాస్టర్ సేవాభిలాషులు యీ క్రింది చిరునామాలకు విరాళాలర్పించి తరించగలరు.**

Magazine General Donationsను **'Sri Manga Bharadwaja Trust'**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D. ల ద్వారా పంపగలరు.

Annadanam donations ను **'Sri Manga Bharadwaja Trust (Sai Master)'**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D. ల ద్వారా పంపగలరు.

Annadanam donations ను **'Sri Manga Bharadwaja Trust (Peace Foundation)'**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D. ల ద్వారా పంపగలరు.

Books order ను **'Sri Manga Bharadwaja Trust'**, payable at Hyderabad or Ongole పేరుపై M.O., D.D. ల ద్వారా పంపగలరు.

పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల
భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన
అపూర్వ గ్రంధములు

| | |
|---|---|
| శ్రీ సాయిలీలామృతం-శ్రీ గురుచరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయిలీలామృతం | 70-00 |
| శ్రీ గురుచరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయి నాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడంఎందుకు | 5-00 |
| సాత్సంగను-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్సనము | 10-00 |
| విజ్ఞానవీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యాయోహగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్యం | 40-00 |
| సంహితాయన గురుద్విసహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్య వాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీచీరాలస్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్యా స్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ(అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము- మన సంస్కృతి | 55-00 |

ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీసిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నంద దీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| బాలల శ్రీ సాయి లీలామృతము | 25-00 |

## BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

## BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba(Hindi) | 100-00 |
| Sai Leelamrutam(Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitam (Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutam(Tamil) | 80-00 |
| Sri Guru Charitra(Hindi) | 50-00 |
| Sri Guru Charitra(Kannada) | 99-00 |
| Swami Samartha(Kannada) | 45-00 |
| Shirdi arathi(tamil) | 6-00 |
| Stavana Manjari | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46p, Hanuman Nagar,
Jaipuri colony, Nagole,Hyderabad-68
Phone :040-20063300
**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust(Publications)", payable at Hyderabad OR Ongole**

జై సాయి మాస్టర్!

# శ్రీ సాయి సచ్చరిత్ర

మూలము:

అన్నాసాహెబ్ ధబోల్కర్ (హేమాద్పంతు)

తెలుగు అనువాదము:

పూజ్య గురుదేవులు ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్

పూజ్య గురుదేవులు శ్రీమతి అలివేలు మంగమ్మ

శ్రీ సాయినాధుని ప్రత్యక్ష ఆశీస్సులతో అన్నాసాహెబ్ ధబోల్కర్ ఉరఫ్ హేమాద్‌పంత్ చే వ్రాయబడిన మొదటి శ్రీ సాయి జీవిత చరిత్ర 'శ్రీ సాయి సచ్చరిత్ర'.

శ్రీ సాయినాధుని దివ్య ఆదేశముతో యీ గ్రంధము పూజ్యగురుదేవులు శ్రీ భరద్వాజ మహరాజ్, దివ్యజనని అలివేలు మంగమ్మలచే తెలుగులోకి స్వేచ్ఛానువాదము గావించబడినది. ఈ మహిమాన్వితమైన 'శ్రీ సాయి సచ్చరిత్ర (తెలుగు)' గ్రంధమును పారాయణము చేసి శ్రీ సాయినాధుని కృపకు పాత్రులై తరించండి.



దత్తావధూత శ్రీ నాంపల్లి బాబా
ఆరాధన మహోత్సవము - 6.11.2012

POSTAL REGD.NO.PRAKASAM/16/2012-2014 REGD.NO. 7926/83 ESTABLISHED : 1983

వెల – Rs.10/-

సంపుటి : 30

సంచిక : 08

DECEMBER 2012

# సాయిబాబా

ఆధ్యాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక



శ్రీ దత్తజయంతి, క్రిస్టమస్ సందర్భంగా సాయిబాబా
పాఠకులందరికీ శుభాకాంక్షలు.



డిసెంబరు 30, 2012 శ్రీ రమణ మహర్షి జయంతి సందర్భంగా సకల మానవాళిపై తమ కృపను వర్షించాలని భగవానులకు ప్రార్థన.

# "దత్తాత్రేయ" అంటే?

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ



ఏకాలంలోనైనా,
దేశంలోనైనా, మతంలోనైనా
మానవులు ఆధ్యాత్మిక
జ్ఞానానికై కృషిచేసి
మహనీయులైనారంటే,
అలా జరగడానికి వారిని
ప్రబోధించి, ప్రేరేపించి,
అందుకు వలసిన
దోహదం చేసి కృతార్థులను
చేస్తున్న భగవత్
తత్త్వమేదున్నదో దానిని
దత్తాత్రేయుడన్నారు.

- శ్రీ సాయినాథ ప్రబోధామృతము
గ్రంథం నుండి

# సాయిబాబా

ఆధాత్మిక వైజ్ఞానిక మాసపత్రిక

సంపుటి:30 | డిసెంబరు2012 | సంచిక:8

OFFICIAL ORGAN OF SRI MANGA BHARADWAJA TRUST


పరమపూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారిచే స్థాపించబడిన ఏకైక పత్రిక, మన

''సాయిబాబా''

## విషయ సూచిక




చిరునామా

Sri Manga Bharadwaja Trust,
Bhakta Nivas, 12-1-170/46P,Hanuman Nagar,
jaipuri colony,Nagole,Hyderabad - 500068
Phone No. - 040 65741550
website: **www.saibharadwaja.org**
**www.saimasterforums.org**



చీఫ్ ఎడిటర్: శ్రీ పోలూరి శ్రీనివాసరావు బి.ఎ.ఎల్.ఎల్.బి

ఎగ్జిక్యూటివ్ ఎడిటర్: డా॥ ఆర్.ఎస్. శశిధర్, పిహెచ్. డి


చందా వివరములు

| | |
|---|---|
| విడి ప్రతి | :రూ. 10-00 |
| సంవత్సర చందా | :రూ. 100-00 |
| రాజపోషకులు | :రూ. 3,000-00 |
| మహారాజపోషకులు | :రూ. 5,000-00 |

సర్వప్రాణులకూ సుఖమూ, దుఃకమూ, మరణమూ సమానమే. వారిలోనైనా మనలోనైనా బాధ, మరణములను నివారించుకొనే యత్నాన్ని కొనసాగించడం ప్రాణశక్తియొక్క నైజం. కేవలం ఆ కారణంగానే ఆ బాధను మనమేలా నివారించుకొనయత్నిస్తామో అలానే సాటివారి బాధలు నివృత్తి కావాలని ప్రయత్నించడం మనస్సుగల మానవునివంటి ప్రాణికి సహజ ధర్మం. అందుకోసంలో మాత్రమే యదాశక్తి సకాలంలో సహకరించ యత్నించాలి. అది సఫలమయినా నిష్ఫలమయినా వ్యర్థంగా చింతించడంగాని, పొంగడంగాని తగదు. ఇతరులకు సహాయం చేయడం పుణ్యమని, చెయకుండడం పాపమని తలచి, అటువంటి బావాలతో మాత్రమే ఇతరులకు సహాయం చేయచూడటం అధమ పక్షం. అలా చేయడం ప్రాణం యొక్క సహజ ధర్మం కనుక మాత్రమే చేయడం ఉత్తమమైన ఆధ్యాత్మిక స్థితి.

– ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

# సంపూర్ణ భగవదవతారము

# 'శ్రీ దత్తాత్రేయుడు'

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

శ్రీకృష్ణుడు మనకు ప్రమాణమని అంగీకరిస్తే సృష్ట్యాదిలో వివస్వంతుడు మనువు ఇక్ష్వాకులకు తననుండి ప్రాప్తించి, తర్వాత కాలాంతరములో శిథిలమైన యోగవిద్యను తాను మరల బోధిస్తున్నానని అర్జునుడికి బోధించిన యోగ విద్యకూ, మీ మిత్రులు తలచేయోగ విద్యకూ సంబంధమేలేదు. సర్వకాల సర్వావస్థలలోనూ చలించని సమత్వము,యజ్ఞదాన తపఃకర్మల దగ్గరనుండీ యుద్ధాది స్వధర్మాచరణదాకా అన్నింటినీ అట్టి భావంతో నిర్వహించే కౌశలమే యోగమనీ చెప్పాడు కృష్ణుడు. దానివల్లనే మీమాంసలో చెప్పబడిన కర్మ, కల్పంలో చెప్పబడిన యజ్ఞాదులు ఉత్తమ పురుషార్థాలవుతాయని కృష్ణుని భావం. జీవితమంతా వీటిని పరమార్థసాధనంగా మార్చేదే యోగమని ఆయన భావం. ఆయన బోధను గ్రంథస్తం చేసిన వ్యాసుడికి అది సమ్మతమే : కనుక శ్రీ దత్తాత్రేయుడు యోగనాధుడన్నప్పుడు సకల మోక్ష విద్యలకూ ఆయన మూలపురుషుడు. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వర, పరబ్రహ్మలేకమైన విశ్వజనీనమైన గురు స్వరూపమాయన. రావణ దుర్యోధనాది దానవసంహరణ, భూభార నిర్వాహణాది పరిమిత కార్యాన్ని నిర్వర్తించేవాడు గాదు. కనుకనే ఆయన తనను తాను దత్తం చేసుకొన్న అయోనిజ సంభవుడు. గీతా శాసనాన్ననుసరించి జన్మించిన ప్రతివారూ మరణించవలసినదే. కాని శ్రీ దత్తాత్రేయుడు మరణ రహితుడు. విశ్వసృష్టి వికాసంకోసం తపస్సు చేసిన అత్రి అనసూయల తపఃఫలం. ఆయన పూర్ణావతారం కాకుంటే యింకెవరు? ఈయన కార్తవీర్యార్జునుడికి అష్టాంగ యోగము, యదుప్రహ్లాదాదులకు అవధూత రూపంలో జ్ఞానమార్గాన్ని బోధించినవాడు.

ఇక పురాణాలలో అవతారంగా ఆయన పేర్కొన్న బడలేదనడం అసత్యం. హరివంశము, విష్ణు పురాణము, భాగవతములలో దత్తాత్రేయుడు మత్స్య, కూర్మ, కృష్ణ అవతారాలతో సమంగా పేర్కొనబడ్డాడు. భారతము (శాంతి పర్వములోని తొమ్మిదింటిలో ఆయన లేడుగదా అంటే తక్కిన అష్టాదశ పురాణాలకూ మూలమనదగు విష్ణు పురాణంలో దత్తావతారమున్నది. కృష్ణావతారమేలేదు! భారతము వనపర్వం ప్రకారం భగవంతుని అవతారాలు, లేక 'ప్రాదుర్భావాలు' అనంతము.

శ్రీ దత్తాత్రేయుణ్ణి గురించి ఉపనిషత్తులేదనడం సరిగాదు. శ్రీ దత్తాత్రేయోపనిషత్తున్నది.శాండిల్యోపనిషత్తూ ఈయన బ్రహ్మ,విష్ణు, శివ, సకల దేవతామయుడుగా కీర్తిస్తుంది. అవధూతోపనిషత్తుగూడ ఆయననే కీర్తిస్తున్నది. అవధూతయన్న నామము ఆయనయందే పూర్ణమైనట్లు యీ ఉపనిషత్తు చెబుతున్నది.

ఇక ఒక్క సమాధానం చాలు. శ్రోత్రియతకు మారుపేరనదగిన వాసుదేవశాస్త్రి యనే మహాపండితునితో ఒక పెద్దలు దత్తోపాసన చేయమంటే ఆయన ''నేను వైదికుణ్ణి, సూర్య, అగ్నులను పాశిస్తున్నాను. మరలా దత్తోపాసన ఎందుకు?'' అన్నారు. కాని చివరకు యీయన దత్తోపాసకులై సర్వ పురాణాంతర్గతములైన దత్తకథలను క్రోడీకరించి ''శ్రీ దత్తమహాత్మ్యము'' ''శ్రీ దత్తపురాణము'' అన్న గ్రంథాలేగాక ''శ్రీ దత్తాత్రేయ వేద పాదస్తుతి'' యని వ్రాశారు. ప్రామాణికముగాకుంటే ఆయనలాచేసి యుండరు.

# పరిపూర్ణ దత్తావతారుడు 'సాయిబాబా'

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

అద్వితీయుడు, రూపగుణరహితుడూ అయిన పరమాత్మ తన సంకల్పం వలన అనేకమైన ఈ ఆనంత విశ్వరూపం ధరించాడు. ఇలా రూపాలను సృష్టించిన ఆయన శక్తిని బ్రహ్మయని, వాటిని పోషించేదానిని విష్ణువని, వాటిని సకాలంలో లయింపజేస్తుండే శక్తిని శివుడనీ అన్నారు. ఈ మూడు శక్తులూ దేనివో, దేనియందు పనిచేస్తాయో దానిని బ్రహ్మమంటారు. పై మూడు తత్త్వాలూ కలసి పనిచేయడం వలన వివిధ ప్రకృతి శక్తులైన దేవతలు, వారి సమిష్టి క్రియయైన ''యజ్ఞం'' వలన వస్తుజాలమూ ఏర్పడతాయి. అయితే ఒకానొక శక్తి నీటిలో పనిచేసి తరంగాన్ని లేపినా, మరొక శక్తి ఆ తరంగాన్ని కొంతసేపు నిలపినా, మరలా మరొక శక్తి పనిచేయడంవలన తరంగం లయించినా యీ శక్తులన్నీ ఏ నీటియందు పనిచేస్తాయో ఆ నీరు ఆ తరంగాల రూపాలలోనూ వున్నట్లు పరబ్రహ్మ విశ్వగతము, శాశ్వతము.



అయితే బ్రహ్మ విష్ణు మహేశ్వరులనబడు సృష్టి, స్థితి లయకారకులైన శక్తుల సమిష్టి క్రియలో ఒక్కొక్కపడు పరమాత్మ సంకల్పానుసారం జరిగే సృష్టిలో అస్తవ్యస్త మేర్పడుతుంది. అంటే సృష్టి వికాసాన్ని ప్రతిఘటించే స్థితి లేక శక్తి ఏర్పడుతూంటుంది. అటువంటప్పుడు సమిష్టిమైన పరబ్రహ్మము నుండి అట్టి అస్తవ్యస్తాన్ని సవరించే ప్రతిక్రియ జరుగుతుంది. ఇట్టి అస్తవ్యస్తాన్ని 'ధర్మగ్లాని' యని, దానిని నివారించే ప్రక్రియను భగవదవతరణమనీ ఋషులు వర్ణించారు. దీనికొక సారూప్యం. మన దేహం జీవించడానికి ఆకలితో అన్నం తింటూంటే ఒక్కొక్కసారి ముద్ద గొంతుకడ్డం పడి ప్రాణాపాయావకాశ మేర్పడుతుంది అప్పుడు శరీరగతమైన ప్రాణశక్తి ఆ వ్యక్తి నీరు త్రాగేలా ప్రేరేపిస్తుంది. అలానే యిది గూడ. లేక అన్నపు మెతుకు పారబోయి ఆ మెతుకును బయటకు వెడలగొట్టి ప్రాణాన్ని కాపాడుతుంది. ఇలా సృష్టియొక్క సమిష్టివికాసానికేర్పడే అవరోధాలే ధర్మగ్లాని, తన్నివారణమే భగవదవతారం, ఆ ప్రయోజనం నెరవేరగానే

అవతారమంత మొందుతుంది. ఇట్టివే మత్స్య, కూర్మ, రామకృష్ణావతారాలు.

ఇలాగాక అనుక్షణమూ శరీరంలో శ్వాస, హృదయస్పందన వంటి నిత్యప్రక్రియలు ఆ దేహమున్నంతవరకూ జరుగవలసినదే. ఆ దేహం జీవించడానికి నిజానికి అన్న పానీయాలకంటే గూడ ఈ క్రియలే ఎక్కువ అవసరం. నిజానికి యీ క్రియలు జరుగుతుంటేనే అన్నపానీయాది సేవనం సాధ్యం. అంటే శ్వాస, హృదయ స్పందనాదులను నిర్వర్తించే ప్రాణశక్తి ప్రాథమికము. అన్నపానాది సేవనంచేసే సామర్థ్యాలు సహకారులు మాత్రమే. అలానే భగవంతుని వ్యక్తరూపము లేక దేహమూ ('విశ్వరూపం') అయిన యీ విశాల విశ్వం నిరంతరం చక్కగా కొనసాగాడాని కవసరమైన దైవశక్తి ప్రత్యేకంగా ధర్మగ్లానిని బాపడానికే గాక, దాని నిర్వహణకోసం గూడ పనిచేస్తుండాలి.

**సృష్టి వికాసాన్ని ప్రతిఘటించే స్థితి లేక శక్తి ఏర్పడుతూంటుంది. అటువంటప్పుడు సమిష్టిమైన పరబ్రహ్మము నుండి అట్టి అస్తవ్యస్తాన్ని సవరించే ప్రతిక్రియ జరుగుతుంది. ఇట్టి అస్తవ్యస్తాన్ని 'ధర్మగ్లాని' యని, దానిని నివారించే ప్రక్రియను భగవదవతరణమనీ ఋషులు వర్ణించారు.**

ఈ నిత్య సంరక్షక శక్తియొక్క లక్ష్య మొక్కటి ఉన్నది. జీవకోటియంతా జీవించ యత్నిస్తుంది. జీవితమంతా నూత్నానుభూతుల వలన మరింత వికాసం కల్గి జ్ఞానాన్ని పెంపొందిస్తుంది. తద్వారా మరింత ఉత్తమంగాను, సుఖశాంతులతోనూ జీవించడం నేర్చుకోజూస్తుంది. ఇదే ధర్మజిజ్ఞాస కల్గి ధర్మాన్ని తెలిసి ఆచరించడంగా మానవ చరిత్రలో ప్రకటమవుతుంది. ఈ జిజ్ఞాస చివరికి ఆత్మజ్ఞానంతో గాని పూర్తి కాదు. అంతవరకూ జీవికి స్థిరమైన తృప్తి, శాంతీ లభించి తనలోని ''నేను'' అన్న ప్రజ్ఞ వాస్తవానికి జనన మరణరహితమని తెలిసేదాకా మృత్యుభీతి వీడదు. అంతవరకూ జీవికి స్థిరసుఖ రూపమైన శాంతి కల్గదు.

అంటే అన్నపానాది నైమిత్తి కావసరాలను నెరవేర్చే శక్తులు దేహంలో సకాలంలో ప్రకటమై అవసరం తీరగానే ఉపశమించినట్లు రామకృష్ణాద్యవతారాలు సృష్టియనే యీ పరమేశ్వర దేహంలో అవతరించి కాలబద్ధమైన అవసరాలను నెరవేర్చి నిర్యాణం చెందుతూంటే, మరొకవంక యీ విశ్వాసాన్ని ధర్మాచరణ ద్వారా అనుక్షణమూ చక్కగా మనేలా చూస్తూ, మానవులను ఆత్మజ్ఞానోన్ముఖులను చేస్తూ జీవిత పరమార్థం వైపుకు కృషిచేసేలా ప్రేరేపించి కృతార్థతనిచ్చే భగవత్తత్వమెల్లప్పుడూ సృష్టిలో పనిచేస్తూండాలన్న మాట. ఇట్టి శక్తి దత్తాత్రేయస్వామి అవతారంగా ఎల్లప్పుడూ భూమి మీద విజయం చేస్తూంటారని, తమ మహిమచేత జీవులను ధర్మాచరణకు, ముముక్షుత్వానికీ కృషిచేసేలా ప్రోత్సహిస్తారని పురాణాలలో చెప్పబడింది. ఈ సత్యాన్నే భాగవతమిలా చెప్పింది : భగవంతుడు మహర్షుల హృదయాలకి మాత్రమే గోచరుడు; అట్టి తపోనిష్ట సర్వులకూ సాధ్యంగాదు; కనుక జీవులపట్ల అపారకరుణచేత వారందరికీ గూడ తాను లభ్యమయ్యేందుకు పరిపూర్ణులైన మహనీయుల రూపంలో ఎల్లప్పుడు భూమిపై సంచరిస్తూంటాడు. వీరందరి రూపాలలో ఎల్లప్పుడూ ప్రకటమయ్యే భగవత్తత్త్వమే శ్రీ దత్తాత్రేయుడు. అందుకనే ఆయనను భాగవతము ''యోగనాథుడు'' అని కీర్తించినది.

అంటే జీవులందరూ సుఖశాంతియుతము, శ్రేయస్కరమూ అయిన ధర్మబద్ధమైన జీవిత విధానాన్ని, దాని పర్యవసానమైన పరమార్థాన్ని పొందడానికి యీ దత్తాత్రేయునే ఆశ్రయించాలని పర్యవసానం. ఈ దత్తాత్రేయుడు ఎల్లప్పుడు పరిపూర్ణులైన మహనీయుల రూపంలో భూమిమీద మానవాళికి లభిస్తారు.

**భగవంతుడు మహర్షుల హృదయాలకి మాత్రమే గోచరుడు; అట్టి తపోనిష్ట సర్వులకూ సాధ్యంగాదు; కనుక జీవులపట్ల అపారకరుణచేత వారందరికీ గూడ తాను లభ్యమయ్యేందుకు పరిపూర్ణులైన మహనీయుల రూపంలో ఎల్లప్పుడు భూమిపై సంచరిస్తూంటాడు. వీరందరి రూపాలలో ఎల్లప్పుడూ ప్రకటమయ్యే భగవత్తత్త్వమే శ్రీ దత్తాత్రేయుడు.**

# 'శ్రీ దత్తజయంతి'

శ్రీ దత్తజయంతి నాడు
పూజ్యశ్రీ మాస్టరుగారి ఉపన్యాసం



ఈ రోజు పవిత్రమైనటువంటి దత్తజయంతి సందర్భంగా, మీ అందరి రూపంలో ఆ దత్తాత్రేయులవారు, వారి పూర్ణ అవతార స్వరూపమైనటువంటి శిరిడీసాయినాథుడు, వారి సన్నిధిని, సేవని నాకు ఈ రోజున యిక్కడ అనుగ్రహించారు. మీ అందరికీ నమస్కారాలు.

విద్యానగర్‌లో ఈ సత్సంగ కార్యక్రమాలు ఆరంభమై 10 సంవత్సరాలు దాటిపోయింది. అదేమి చిత్రమోగాని, యింతవరకూ ఈ దత్తజయంతి అనేటటువంటి ఈ వేడుకకు విద్యానగర్ విడిచి బయటికి రావటం అనేది జరుగలేదు. అది ఈ రోజు ఇక్కడ, అట్లాగే మరికొన్ని చోట్ల ఆయన సంకల్పం ఎక్కడుంటే అక్కడికి ఆయన తీసుకు వెళ్ళి సేవ చేయిస్తున్నాడు. ఈ ''సత్సంగమాలు'' అని ఇందాక చెప్పారు.

ఈ దత్తజయంతికి అని ఇప్పుడు నేను ప్రస్తావించాను. దీన్నిగూర్చి సంక్షిప్తంగా చెప్పి, తర్వాత ఈ కార్యక్రమం ఎందుకు? ఏమిటి? అనే విషయం - ఒక్కటి, రెండు విషయాలు మాట్లాడతాను.

ఈ రోజు దత్తజయంతి అనడానికి కారణం దత్తాత్రేయులు వారు అవతరించినటువంటి రోజు. పురాణ కథ ప్రకారం దత్తాత్రేయులు వారంటే అత్రి అనసూయా దేవులు ఆదర్శమైనటువంటి పాతివ్రత్యం ఏకపత్నీవ్రతంతో తపోదీక్షలో వుంటున్న కాలంలో అనసూయాదేవి యొక్క పాతివ్రత్య మహిమ విని త్రిమూర్తుల భార్యలు అసూయ పడ్డారట. అపుడు వాళ్ళ భర్తలను ప్రార్థించి, ఎలాగైనా సరే ఆమె పాతివ్రత్య మహిమ, తమ పాతివ్రత్య మహిమ కంటే గొప్పది కాకుండేలాగా చూడమని భర్తలను ప్రార్థించారు అని కథ.

అందుకని అత్రి మహాముని తపస్సు చేసుకోవడం కోసం అరణ్యంలోకి వెళ్ళిన సమయం చూచుకుని ఈ త్రిమూర్తులున్నూ, అతిధుల రూపంలో వారింటికి ఆశ్రమానికి భిక్షకొచ్చారట. ఆమె భిక్షమిస్తాను అని వాగ్దానం జేసిన తర్వాత అప్పుడు వాళ్ళొక షరతు పెట్టారట. ఆమె పాతివ్రత్యాన్ని భగ్నం చేయాలని మొదటేమో ఆకలిగొని వున్నాము, భిక్ష పెట్టవలసిందని అడిగారు. ఆమె యిస్తాను కూర్చోండి అని చెప్పిం తర్వాత మాట యిచ్చిం తర్వాత, అప్పుడు ఒక షరతు పెట్టారు. మీరు యిస్తామన్నారు బాగానే వుంది. మామూలుగా భిక్షయిస్తే మేము తీసుకోము. మాకో నియమం వున్నది. ఆ నియమానుసారం మీరు భిక్ష యివ్వాలి అన్నారు.

అంటే ఒక చిన్న ధర్మసూక్ష్మం మధ్యలో ఆమెను చిక్కించుకుంటున్నారన్న మాట. అన్నమాట చెల్లించటం అనేటువంటిది ఒకటి. ఇక వెనక్కి పోడానికి వీలుగాకుండా మాట అనిపించుకున్నారు. రెండోది అతిథి అభ్యాగతులలో భగవంతుడినే చూసుకుంటాను అనేటువంటి ఆమె వ్రతం వున్నదే దానికీ పరీక్ష పెడుతున్నారు.

ఏమన్నారంటే వాళ్ళు దిగంబరివై వచ్చి మాకు వడ్డిస్తేనే మేం తింటాము, లేకపోతే ఆకలితో వెళ్ళిపోతాము యిట్లా! ఆ వచ్చిన అతిథి ఆకలిగొని వెళ్ళిపోయినట్లయితే, అది దోషంగా పరిణమిస్తుంది, అని వున్నది ధర్మశాస్త్రంలో. అలాగే యిచ్చినమాట ఆమె తప్పిందైతుంది గనుక,

**అన్నమాట చెల్లించటం అనేటువంటిది ఒకటి. ఇక వెనక్కి పోడానికి వీలుగాకుండా మాట అనిపించుకున్నారు. రెండోది అతిథి అభ్యాగతులలో భగవంతుడినే చూసుకుంటాను అనేటువంటి ఆమె వ్రతం వున్నదే దానికీ పరీక్ష పెడుతున్నారు.**

భిక్ష పెడతానంది (గనుక), మీ షరతులేమిటని ముందు అడగలేదు. ఆ షరతులయితే నేను పెట్టనని చెప్పలేదు. పెడతానని మాటిచ్చాక, ఏ షరతులైనా పెట్టవలసే వుంటుంది గనుక, అప్పుడు శాపం బెట్టి వెళ్ళవచ్చు. అందుకని ఆమెను చిక్కించుకోంటం కోసం అని చెప్పి అలా భిక్ష అడిగారు. అప్పుడు ఆమెకు ఆశ్చర్యం వేసింది. లోపలకు వెళ్ళి భర్తను తలుచుకొని భర్త యొక్క అనుగ్రహం వలన యింత చక్కటి పాతివ్రత్యం నా మనసుకు అలవడింది. అటువంటప్పుడు, నా మనసులో ఎట్టి వికారం రావటానికి అవకాశం లేదో, అటువంటి నిగ్రహాన్ని ఆయన ప్రసాదించాడు. కాబట్టి వీళ్ళు యింటికొస్తూనే ''అమ్మా, అన్నం పెట్టు'' అన్నారు గనుక వీళ్ళను నా బిడ్డలుగా భావించి వీళ్ళకు అన్నం పెడతాను. పసిబిడ్డలే వున్నట్లయితే నేను వంటి మీద గుడ్డలు సంగతి ఎలాగైతే పట్టిచ్చుకోనో, అలానే వీళ్ళు పసిబిడ్డలనే భావన తోటి వీళ్ళకు అలాగే వడ్డిస్తాను. వీళ్ళ చేతిలో మాత్రం ఈ విషయంగా చిక్కగూడదు'' అని లెక్కేసుకుంది.

అన్నం వడ్డిస్తాను కూర్చోమని అంతా సిద్ధం చేసి వచ్చేటప్పటికీ ముగ్గురూనూ ఆ పాతివ్రత్య మహిమ చేత పసిపిల్లలైపోయి వున్నారట. ''వీళ్ళను పసిపిల్లలుగా భావించి నేను వడ్డిస్తాను'' అని ఎపుడైతే అనుకుందో, ఆ క్షణంలోనే ఆమె పాతివ్రత్య మహిమ చేత వాళ్ళు పసిబిడ్డలై వున్నారట. అప్పుడు వాళ్ళందర్నీ ఉయ్యాల్లో వేసి నిద్రబుచ్చుతూ వున్న సమయంలో అత్రి మహాముని వస్తూ ఆ కథ పాటగా పాడుతుందన్నమాట, జోల పాటగా ఆయన జరిగిన సంగతి తెలుసుకున్నారట. ఆ తర్వాత త్రిమూర్తులున్నూ ఆమె యొక్క పాతివ్రత్య మహిమకి అబ్బురపడి ఏం వరం గావాలి? అని అడిగారు. అడుగుతే ఆమె ఏమన్నదంటే, ''తమరు బిడ్డలుగా అవతరించాలె'' అని కోరింది. అందుకని దత్తాత్రేయుల వారు, తర్వాత దుర్వాస మహాముని, చంద్రుడు అనే పేర్లతో త్రిమూర్తులునూ వారి గర్భాన జన్మించటానికి ఒప్పుకున్నారు. ఆ తర్వాత దుర్వాసుడు, చంద్రుడున్నూ, వాళ్ళ అంశల యొక్క దైవత్వాన్ని ఆయనకి యిచ్చి వాళ్ళు తపస్సుకి వెళ్ళిపోయారని, తర్వాత త్రిమూర్తులే ఆ యొక్క అంశలతో విష్ణువే దత్తాత్రేయులవారుగా లోకంలో ప్రకటమైనారని, అట్లా వరం తీసుకోడానికి గల కారణంలో అత్రి మహాముని ఆలోచించినది ఏమిటంటే ఈ భగవంతుడు, ఒక పట్టాన తెలివిగా భక్తులకు లభ్యం కాకుండా వున్నాడు, ఈ రకంగా బిడ్డగా అన్నా ఈయన్ని మనం పొందగలిగినట్లయితే, లోకానికి ఒక రూపంలో వీళ్ళు దొరుకుతారు అనేటువంటిదొకటి.

ఆ తర్వాత ఆ దత్తాత్రేయుల వారి గురించే మరొక పురాణ కథ వున్నది. విష్ణు భక్తుడు అంబరీషుడు ఏకాదశి వ్రతం జేసిన తర్వాత మరుసటి రోజు పారణతిథి. పారణరోజునాడు ఆహారం దీసుకుండేటు వంటి రోజున దుర్వాసముని, అనేక మంది శిష్యులతోటి ఆయన్ని ఎట్టాగైనా సరే చిక్కించుకుందామనే ఉద్దేశంతో వచ్చాట్ట. వస్తే వాళ్ళందర్నీ ఆతిథ్యాలిచ్చి అంబరీషుల వారు ఆహ్వానించారు. అయితే ఆ (పారణ) తిథి వెళ్ళిపోయే లోపల మళ్ళీ నైవేద్య, ప్రసాదం దీసుకుంటే తప్ప అంతకు ముందు ఏకాదశీ వ్రతం యొక్క ఫలితం పోతుంది గనుక ఆయన దానికై తొందర పడుతున్నాడు.

అయితే అతిథులను వదిలి భోంచేయటానికి వీలులేదు గనుక ఆయనేమో భోజనం చేయలేడు. ఆయనేం జేశాడంటే శిష్యగణ మంతటితోటి వెళ్ళి, స్నానానికెళ్ళి ఒక పట్టాన తిరిగి రావటం లేదు. ఏం చేస్తాడో చూద్దామని అంబరీషుడ్ని యిరికిచ్చుకున్నాడనమాట! అతిథుల్ని వదిలి భోంచేస్తే శాపం బెట్టవచ్చు. అట్టా అని భోజనం చేయకుండా వుంటే వ్రతం చెడుతుంది. ఏం జేస్తాడో చూస్తామని ఆయన పరీక్ష బెట్టాడు. అప్పుడు ఆయన ఆహారంగాను, తీర్థంగాను, సరిపోతుందని, తీర్థ జలాన్ని మాత్రమే స్వీకరించాట్ట. అంటే తీర్థం గూడా, జలం గూడా ఒక రకమైన ఆహారమే అని శాస్త్రం వుంది గనుక పారణ తిథి వెళ్ళే లోపల తీర్థం తీసుకున్నట్టూ వుంటుంది, అతిథుల్ని వదలి పెట్టి భోంచేసిన దోషమూ వుండకుండా వుంటుంది అని తీసుకున్నాట్ట. ఆ సంగతి తన యోగశక్తితో గ్రహించిన దుర్వాస మహాముని శిష్యులందరితో వచ్చి ఒక్కసారి విరుచుకుపడ్డాడు. నువ్వు జలం తీర్థం

తీసుకుంటే మాత్రమేమి? ఆహారంతో సమానమని శాస్త్రంలో చెప్పింది గదా, మమ్మల్ని వదలి నువ్వు తీసుకున్నావు గనుక, అని శాపం బెట్టాడుట ''ఇల్లు వాకిలి, ఒకచోట తిండి, నిద్ర అంటూ లేకుండా దేశ దిమ్మరివై పొమ్మని శాపం బెట్టాట్ట''.

అప్పుడు ఆయనేం చలించక విష్ణువును మాత్రం స్మరించి వూరుకున్నాట్ట. అప్పుడు విష్ణుమూర్తి ఆయనకి, దుర్వాస మహామునికీ, ప్రత్యక్షమై ''వాడ్నేదో శాపం బెట్టావని నువ్వు అనుకుంటున్నావు. వాడు తన భారాన్నంతటిని నా మీదే వేసి ఊరుకుని శరణాగతుడై వున్నాడు. గనుక వాడి బాధలు నేననుభవించవలసి వుంటుంది. ఇప్పుడు వాడనుభవించలేడు గనుక వాడి మీద వేసినటువంటి శాపాన్ని నా మీద తిప్పవలసింది'' అని జెప్పి కోరాడు. సాక్షాత్తు విష్ణువే కోరాడు గనుక దుర్వాస మహాముని గూడా మళ్ళీ ఆలోచించాట్ట. ఇది గూడా బాగానే వుంది, ఇటు విష్ణుమూర్తి ఆ ప్రజలకు లభించకుండా భూమి మీద లభ్యం గాకుండా పోకుండా ఈ భూమి మీదనే ఫలాని చోటంటూ లేకుండా సర్వావస్థలయందు నిత్యం ప్రజలను తరింప జేస్తూ వుండడం కోసం ఇది మంచి అవకాశంగా వుంది అని ఆ శాపాన్ని కాస్తా ఆయన మీద, విష్ణువు మీద తిప్పాడు. ఆ శాపాన్నే దత్తాతేయుల వారి రూపంలో యిప్పటికీ ఆయన నిర్వహిస్తున్నాడు అని శాస్త్రం.

> **''వాడ్నేదో శాపం బెట్టావని నువ్వు అనుకుంటున్నావు. వాడు తన భారాన్నంతటిని నా మీదే వేసి ఊరుకుని శరణాగతుడై వున్నాడు. గనుక వాడి బాధలు నేననుభవించవలసి వుంటుంది. ఇప్పుడు వాడనుభవించలేడు గనుక వాడి మీద వేసినటువంటి శాపాన్ని నా మీద తిప్పవలసింది''**

అంటే దత్తాతేయుల వారు ఈ సృష్టిలో ఆధ్యాత్మిక విద్య నశించి పోకుండా ఎప్పటికప్పుడు ఆధ్యాత్మిక విద్య వుండడం కోసం అవతరించిన ప్రత్యేకమైన అవతారం.

అంటే రాముడు కృష్ణుడు అనే అవతారాలు కురువంశ నాశనం, రావణ సంహారం అనేటువంటి కొన్ని పరిమితమైన కార్యాల కోసం వచ్చారు గనుక ఆ కార్యాలై పోయిం తర్వాత మళ్ళీ తిరిగి వాళ్ళు శరీరాన్ని తాగ్యం జేసి, తమ స్వస్థానం, స్వస్థితికి వెళ్ళిపోయినారు. కాని దత్తాత్రేయుల వారి యొక్క అవతార కార్యం మాత్రం ప్రత్యేకతేమంటే సృష్టిలో ఆధ్యాత్మ విద్య నశించి పోకుండా, ఆధ్యాత్మ శక్తి నశించి పోకుండా కాపాడటమే ఆయన ధర్మం. ఈ ఆధ్యాత్మికత మానవ జాతి వున్నంత వరకూ నిలిచి వుండాలి అంటే మానవ జాతి వున్నంత కాలం దత్తాత్రేయుల వారు ఏదో ఒక రూపంలో ఎక్కడైనా సరే లభ్యమవుతూ వుండవలసిందే. అంటే పూర్తిగా రూపం లేకుండా ఎప్పుడు పోవటానికి వీలుకాదు. ఒక రూపం వదలి పెడితే ఇంకోటి, ఇంకో రూపం వదిలి పెడితే మరోరూపం. మొత్తం మీద ఎప్పుడూ భూమి మీద లభ్యం కావలసిందే రూపంతో. అందుకని పురాణగాథలన్నిట్లో ఏముందనే మహాయోగీశ్వరుడైనవాడు, ఆత్మజ్ఞాని అనే మహా వ్యక్తుల రూపంలో దత్తాత్రేయుల వారు ఎప్పుడూ లభ్యమవుతూనే వున్నారు. ఆ దత్తాత్రేయుల వారు కలియుగంలో అవతరిస్తూ వచ్చిన వాటిల్లో, గోదావరి జిల్లాలో పిఠాపురంలో మొట్టమొదటి అవతారంగా చెబుతారు. 17, 18 శతాబ్దాల్లో మూడవ అవతారంగా అవతరించి, బాల్యం నుంచి గూడా అద్భుతమైన మహిమలు చేసి అక్కడే వారు సిద్ధిపొందారు.

వారి అవతార కార్యం పూర్తి అయ్యే లోపల అక్కల్‌కోట నుంచి అక్కల్ కోట రాజు సంస్థానం అన్నమాట, మహారాష్ట దేశంలోనే షోలాపూర్ దగ్గర అక్కల్ కోట స్వామిగా 1856 సంవత్సరంలో ప్రకటమయ్యారు. అంటే వాళ్ళ పుట్టు పూర్వోత్తరాలు మాత్రం తెలియవన్న మాట ఆయనవి. 1856 లో ఒకసారి కౌపీనం ధరించి ఊళ్ళో కొచ్చారు. రోడ్ల మీద తిరుగుతూ వున్నారు. ఆ తర్వాత 30, 40 సంవత్సరాల పాటు అక్కడే వుంటారు. ఒక యిల్లూ వాకిలంటూ ఏం లేదు. అలాని అద్భుతమైన మహిమ ఆయన దగ్గర జరగటం అనేది ఎంతోమంది చూస్తున్నారు. వారు 1876వ సంవత్సరంలో సిద్ధి పొందారు. వారు సిద్ధిపొందే లోపల, తర్వాత దత్తావతారంగా కొలవబడినటువంటి శిరిడీసాయిబాబా వారు శిరిడీలో అదే సమయంలో ప్రకటమయ్యారు. అక్కడ 1856లో అక్కల్‌కోటలో అక్కల్‌కోట స్వామి రావటం సాయిబాబా శిరిడీలోకి, రెండవసారి రావటం అక్కడ నుండి సాయిబాబా 60 సంవత్సరాలు శిరిడీలో వున్నారు.

మొదట శ్రీపాద శ్రీవల్లభులు, తర్వాత నరసింహసరస్వతి, తర్వాత మాణిక్యప్రభువు తర్వాత అక్కల్‌కోట మహారాజు, ఆ తర్వాత శిరిడీ సాయిబాబా రూపాల్లో వాళ్ళ దత్తాతేయుల వారి అవతార పరంపర కొనసాగుతూ వచ్చింది.

ఇహ వీళ్ళు దత్తావతారాలు అని చెప్పటానికి ఎలా సాధ్యమో, ఎలా గుర్తుపట్టడమో అంటే, దానికి రెండు మూడు దాఖలాలున్నాయి. ప్రధానమైన దేమిటంటే, మత భేదాలను వాళ్ళు పాటించరు. ఇది విశేషం, వాళ్ళను తేలిగ్గా ఎక్కడ గుర్తుపట్టవచ్చంటే, భక్తులకు నిదర్శనమిచ్చి చేరదీయటంలో, ఉద్ధరించటంలో మత భేదం వల్ల ఒకళ్ళను నిరాకరించటం, ఒకళ్ళను అంగీకరించటం అనేది లేకుండా రెండు సాంప్రదాయాలను తమలో సమన్వయం జేసుకుంటూ.....

ఇది మొదటి విశేషం. రెండువదేమిటంటే సనాతనంగా వస్తూండేటువంటి మన ధర్మాలను ఎక్కడ ఎక్కడ అవి తారుమారైనా ఎక్కడ మన అవగాహన సరిగా లేదో దాన్ని సక్రమంగా దిద్దుతూ వచ్చారు వాళ్ళు.

మామూలుగా ప్రపంచంలో రెండు రకాల రీతులు మనకు కనబడుతూంటాయ్. పాతవల్ల రోత అని తీసి అవతల పారేసే పద్ధతొకటుంటుంది. లేకపోతే పాత కంటే చాలా చాలా గొప్ప అని నెత్తి మీద బెట్టుకొనే పద్ధతొకటుంటుంది. ఈ రెండు పద్ధతులూ సవ్యం కావు. మనకున్నటువంటి (ఆశ్రమాలు) సాంప్రదాయాలు, ఏ సాంప్రదాయాలు మించిపోను వచ్చిందో ఆ ప్రయోజనం నెరవేరటం దగ్గర తెలుసుండాలి. అందుకోసం దాన్ని వినియోగించాలి. అందుకని ఆ సాంప్రదాయాన్ని ఏవి ఎందుకోసం మొట్టమొదట పెట్టబడిందో దాన్ని పూజిస్తూ వుండేటు వంటి రీతిన వాళ్ళు నిదర్శనమిస్తూ వచ్చారు. అయితే అందులో వివరంలోకెళ్ళి గనుక వివరించటం మొదలుబెడితే, ఈ రకమైన ఈసడింపుకలవాటు పడన వాళ్ళకు మాతం బాధాకరంగా ఉండవచ్చు కొన్ని అంశాలు అయినా దత్తజయంతి కనుక దత్తాత్రేయులవారి అవతార కార్యం గనుక ఒకటి రెండు సన్నివేశాలు చెప్తాం. ఇదే మళ్ళీ శిరిడిసాయి చరిత్రలో గూడా గనపడుతుంది.

మన కుల వ్యవస్థ వున్నది. వర్ణ వ్యవస్థ వున్నది. ఈ వర్ణభేదాలు చాతుర్వర్ణ్యం అనేది చాలా తప్పు, ఇది అనవసరము అని చెప్పేది ఒక పద్ధతి. ఈ భేదాలు పనికిరావు అని చెప్పేది ఒక పద్ధతి. లేదు ఇవి భగవంతుని చేత సృష్టించబడ్డాయి ఇవి మాత్రం హెచ్చు తగ్గుల తోటి యిట్లాగే వుంటయి వెళ్ళెప్పుడూ ఎక్కువే, వీళ్ళెనప్పుడూ తక్కువే. ఇది శాస్త్రం, ఆర్షము. కాబట్టి యివి యింతే, అని చెప్పేటువంటిది రెండో సాంప్రదాయము.

కొన్ని..... శాస్త్ర గ్రంథాల్లో గనక చూచినట్లయితే, ఒక వాక్యమున్నది. ధర్మాచరణలో ఎక్కడన్నా సందేహమొస్తే ఏం చెయ్యాల అని అడిగితే బ్రహ్మనిష్ఠులు అంటే ధర్మాలన్నీ ఆరితేరి, ఈ ధర్మాలన్నీ ఏ పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకుంటానికి మార్గాలో ఆ ఫలితాన్ని పొందినటువంటి వాళ్ళు ఏం నిర్ణయిస్తారో, ఏం ఆచరిస్తారో దాన్ని తీసుకోమన్నారు. ఆ.... చరణంలో చెప్పిందామాట. ధర్మంలో సందేహ మొచ్చినట్టయితే, ఆత్మజ్ఞాని బ్రహ్మనిష్ఠులు అయినటువంటి, బ్రహ్మవేత్త పరమైన ధర్మంలో ఎవడైతే వుంటాడో, వాడి నిర్ణయమే, తుది నిర్ణయము అని చెప్పింది.

''ఎక్కడన్నా ధర్మశాస్త్రానికి వాడు చెప్పిందానికి విరుద్ధంగా కనిపించినా, వాడు చెప్పిన మాటకు మాత్రమే విలువిమ్మన్నాడు ధర్మ శాస్త్రం కంటే కూడా!'' ఇది శాస్త్రంలో వున్నది. దాన్ని గురించి ఒక్క చిన్న సన్నివేశం వుంది.

అక్కల్‌కోటస్వామి దర్శనానికి కొన్ని వేలమంది వచ్చేవారు. ఆ వచ్చేటటువంటి భక్తులు, మరీ తండోపతండాలుగా వుండబట్టి జనం ''క్యూ''ల్లో వచ్చి దర్శనం చేసుకుపోతుండేవారు. వాళ్ళందరూ భోంచేసేవారు

**వర్ణభేదాలు చాతుర్వర్ణ్యం అనేది చాలా తప్పు, ఇది అనవసరము అని చెప్పేది ఒక పద్ధతి. ఈ భేదాలు పనికిరావు అని చెప్పేది ఒక పద్ధతి. లేదు ఇవి భగవంతుని చేత సృష్టించబడ్డాయి ఇవి మాత్రం హెచ్చు తగ్గుల తోటి యిట్లాగే వుంటయి వెళ్ళెప్పుడూ ఎక్కువే, వీళ్ళెనప్పుడూ తక్కువే. ఇది శాస్త్రం, ఆర్షము. కాబట్టి యివి యింతే, అని చెప్పేటువంటిది రెండో సాంప్రదాయము**

కాదు. ఆయన ఇది పాటించ వద్దని చెప్పేవాడు కాదు. అది పాటించమని చెప్పే వాడూకాదు. అది చేసే వారిని ఆ విధంగా వాడ్ని సవరించేవారు. ఇది చేసే వాడ్ని ఈ విధంగా వీడ్ని సవరించేవారు.

ఆయన దగ్గర శ్రోతియుడుగా వుండి, మడిగా వండి నైవేద్యం బెట్టి ఆయన సేవ చేస్తుండేటువంట ఒకతనుండేవాడు. అలాగే మామూలు శుచిగా స్నానం జేసి, సాంప్రదాయంగా అనుష్టానం జేసుకుని, తర్వాత ఆయన దర్శనానికి ఎక్కువమంది వచ్చే అలవాటు. ఆయన వ్యర్థంగా అనుష్టానం లాంటివి మాన్పించే వాడు కాదు. సోంబేరి తనం కొద్ది యివన్నీ ఎందుకని ఎవడితో అనిపిచ్చే వాడు కాదు. నియమంగా చెయ్యాలసినవన్నీ నువ్వవన్నీ చెయ్యాల్సిందే అన్నాడు. ఆ నియమం ప్రకారం స్నానం చేయటం కోసం ఒక శ్రోత్రియుడు ప్రయత్నించేవాడు. కాని ఆ జన సమ్మర్ధంలోను

తర్వాత కొంచెం వ్యక్తికీ, మధ్య వచ్చేటి భేదాభిప్రాయాల వల్ల అతని గురించి ఎవరూ పట్టించుకోరక్కడ. ఎంత సేపటికీ నీళ్ళు దొరకలేదు. స్నానం చెయ్యటానికి అవకాశం చిక్కలేదు. అప్పుడు యింక గత్యంతరంలేక ఏంజేశాడంటే కొంచెం దూరంలో వుండేటువంటి ఒక తోటలో ఒక గుడిసె వుంటే ఆ గుడిసెలో వున్న అతన్ని, ''అయ్యా యిక్కడ బావిలో స్నానం చేస్తాం కాస్త..... నీళ్ళిప్పిచ్చ'' మన్నాడు. అంటే ''అక్కర్లేదయ్యా నీళ్ళువున్నయ్. అక్కడ, నీ కభ్యంతరం లేకపోతే స్నానం చెయ్''మన్నాడు. ఆ నీళ్ళు దీసుకొని హాయిగా స్నానం జేశాడు. ఆ తర్వాత బొట్టు పెట్టుకొని వచ్చి అందర్తోకూర్చున్నాడు. ఇక్కడ ఆ తోట్లో నీళ్ళు దీసుకొని స్నానం జేసి రావటం అనేది, ఈయనికి నైవేద్యం బెట్టేటు వంటి సద్బ్రాహ్మణుడు జూచాడు. చూసి ఏం జేశాడంటే అందరూ వచ్చి భోజనానికి కూర్చుండేదాకా ఆగాడు. ఆ భోజనాల్లో యిట్టా ఆచారంగా వుండేటువంటి వాళ్ళందరూ ఒక వరుసలో కూర్చుండేవారు. వాళ్ళతో పాటు అతను గూడా వచ్చి కూర్చున్నాడు. కూర్చున్నాక ఎమన్నాడంటే, లే... పో! బంతిలో కూర్చుంటానికి వీల్లేదు, నువ్, లేచి పొమన్నాడు. అక్కడనుంచి, ''ఎందుకు కూర్చోగూడదు? ఏం?'' అని అడిగితే, ''నువ్ అక్కడికెళ్ళి స్నానం చేసొచ్చావు. అందులో వుండేటువంటి వాళ్ళు యిచ్చినటువంటి నీళ్ళతో నువ్ స్నానం చేశావు గనుక బంతిలో కూర్చోటానికి పనికిరావు'' అన్నాడు. అనేటప్పటికి ఆయన కించపడి లేచాడక్కడనుంచి, చిన్నబుచ్చుకుని లేచాడక్కనుంచి. అయిన తర్వాత అందరిభోజనాలు అయిం తర్వాత స్వామికి నైవేద్యం దీసుకొని అక్కడ లేవగొట్టినతనే వెళ్ళాడు. అప్పుడు స్వామి భోంచేయలేదు! ''వద్దురా! ఆచారపు కంపు ఎక్కువగా వుంది, నాకు వద్దులే'' అన్నారు. అన్నాక ఏమిటి సమాచారం అంటే, ఈ నీళ్ళిచ్చాడే వాణ్ణి పిలిపిచ్చమన్నాడు, వీడ్ని, అతడ్ని పిలిచిన తర్వాత నేల మీద ఏడు గీతలు గీచి, అతనికి విభూది పెట్టి ఒక్కొక్క అడుగు లోపల కొస్తూ నువ్వెవరో చెప్పమన్నాడు.

ఒక్క అడుగు లోపల పెట్టి గడిదాటి లోపల కొచ్చేటప్పటికి యింతకు ముందు జన్మ జ్ఞాపకం వచ్చింది. అక్కడి నుంచి అలా అలా చెప్పుకుంటూ వెళ్ళి 7వ గడి దగ్గరికెళ్ళేటప్పటికి ''వేదపండితుడ్నండి, బ్రాహ్మణుడ్ని'' అన్నాడు.

''ఆహా! అట్లాగా, ఫలాన చోటనుంచి చెప్పు భలాన మంత్రాలు చెప్పు, భలానా పర్నాలు చెప్పు'' అని అడిగారు.

ఆ పర్నాలు చెప్పాడు. చెప్పిం తర్వాత స్వామి ఏమి అడిగారంటే ''మరి యిన్ని జన్మల దాకా నువ్ భలాన గదా, మరి ఈ జన్మలో ఎందుకిలా ఈ శరీరం వచ్చింది నీకు'' అని అడిగాడు.

అడిగితే అతనేమన్నాడంటే ''అప్పట్లో నాకు ఈ ఆచారం మీద ఎంత పట్టింపు, ఎంత ప్రధానంగా ఉండేదంటే, ఇదే రోడ్డు మీద మరి యితరులు కూడా నడిచిపోయి వుంటారు కనుక దాని మీద నడిస్తే నేను అపవిత్రుడ్ని అవుతానేమో ననే భయంతోటి మంత్ర జలం చల్లుకుంటూ పోతుండే వాణ్ణి'', అన్నాడు. దాని వల్ల అంతగా దాని గురించే ఆలోచించి ఆలోచించి, ఈన అసలు నేర్చుకున్న విద్య కాస్త మరుగుపడిపోయి, ఏది ధ్యానం చేస్తే అది పొందుతాడు గనక అది నాకు వచ్చిందన్నాడు.

అప్పుడు యితడ్ని పిలిచి చూపిస్తివా! ఏమవుతుందో ఆలోచించమన్నాడు. అని అప్పుడేం చెప్పాడంటే అది తాకితేనే, ఆ నీరు తాకితే మాత్రమే నువు అపవిత్రుడివయ్యేటట్లయితే ఏముంది?

''అట్లా కాదు'' అన్నారు. దేన్ననుసరించి వచ్చినయి యివి అనేటువంటిది అక్కడ సూచిస్తున్నాడన్నమాట. అట్లా అని నేను విచ్చల విడిగా వుంటానంటే నువు అనుష్టానం చేయ్, మడిగా వుండు, శుచిగా వుండు అని చెప్పేవాడు. కాని దాన్ని దీసుకొచ్చి దీనిలో తారుమారు చేసి మనిషికి, మనిషికి తేడా వుంది వ్యత్యాసం వుంది. ఉచ్చ- నీచము అనే భావమున్నది'' అనే చోట కొచ్చేటప్పటికి మాత్రము తీసి అవతల పారేస్తాడు.

ఏది ఎక్కడ, ఏది ఎందుకో తెలుసుకోమన్నాడు. హాస్పిటల్‌లోకి ప్రవేశించిన తర్వాత సర్జన్ సర్జన్, ఫిజీషియన్ ఫిజీషియన్, కంపౌండర్ కంపౌండరే. ఇవతల కొచ్చింతర్వాత అందరూ మిత్రులే బంధువులే. అందరూ కలిసి భోంచేసుకోవచ్చు. ఒక రకమైన డ్యూటి కొచ్చేటప్పటికి ఆ డ్యూటి సరిపోయినంత వరకు మాతమే restrictions గాని, యివతల కొచ్చింతర్వాత మనిషికీ మనిషికీ కాదది, అనే దాన్ని ఈ మహనీయులు మనకు ఎరుక పరుస్తున్నారు. అదే పద్ధతి శిరిడీ సాయిబాబా వారి చరిత్రలో కూడా కనబడుతుంది.

ఆయన 1854 వ సంవత్సరంలో శిరిడీ అనేటువంటి కుగ్రామంలో ఊరు బయట వుండే వేపచెట్టు క్రింద కూర్చోని, 16 ఏళ్ళ పిల్లవాడిలా మొట్టమొదటి సారి కనిపించాడు. ఆ ముఖంలో వుండే వర్చస్సు వల్ల ఆయన చాలా గొప్ప మహనీయుడని మాత్రం అందరూ తెలుసుకున్నారు. ఎంత గాలేసినా (గాలి వీచినా), ఎంత వర్షం వచ్చినా, చలేసినా, ఎండ గాచినా ఆ చెట్టు మొదట్లో నుంచి మాత్రం ఎక్కడికీ వెళ్ళేవాడు

కాదు. మధ్యాహ్నం, భోజన సమయానికి మాత్రం అయిదు ఇండ్లకి వెళ్ళి భిక్ష మాత్రం తీసుకొని వచ్చేవాడు. అయిదు (5) యిండ్లలో ఎంత పెడితే అంతే, తీసుకొనేవాడు. ఏమీ పెట్టకపోతే ఆరవ యింటికి వెళ్ళకుండా వచ్చి కూర్చునేవాడు. అది ఆయన నియమం. మొదట్లో తెలియదు గదా! అందుకని పెట్టేవాళ్ళు పెడతారు. పెట్టనివాళ్ళు పెట్టరు. పాచిపోయినది పెట్టేవారు, తిడుతూ పెట్టేవారు, అన్ని రకాలు వుండేవి. కాని అట్లాగే తీసుకుని వచ్చి తీసుకుంటుండేవారు.

తర్వాత కొంతకాలానికి యీయన ఎవరని ఆసక్తి మాత్రం ఎవరికీ పోలేదు. హిందువో తెలియదు, ముస్లిమో తెలియదు. ''అల్లా మాలిక్'' అంటుండేవాడు. ముస్లిం అనుకుందామా అంటే, ఆయన ప్రక్కన అగ్నిహోత్రం వుండేది, అగ్నిహోత్రం చూచి హిందువనుకుందామా? లేక అల్లా మాలిక్‌ను జూచి ముస్లిం అనుకుందామా? అర్థమయ్యేదిగాదు.

ఎక్కడన్నా మంచి సాంప్రదాయకులు అయినటువంటి ముస్లిములు ఆయన ధర్మాసనానికొస్తే అరబ్బీలోంచి, ఖురాన్ లోంచి, కోట్ చేసి చెప్పే వాడు వాళ్ళకి, అలానే వేదపండితులు వేదం చదువుకున్న వాళ్ళు వస్తే వేదం చదవబోయి వాళ్ళు మధ్యలో మంత్రం మర్చిపోతే వేదమంత్రం జ్ఞాపకం చేశాడు.

రామానుజ, మధ్వ, శంకర భాష్యాల తోటి బాహ్యత్రయంతోటి ఈ భగవద్గీతను క్షుణ్ణంగా చదువుకుందాము

**యీయన ఎవరని ఆసక్తి మాత్రం ఎవరికీ పోలేదు. హిందువో తెలియదు, ముస్లిమో తెలియదు. ''అల్లా మాలిక్'' అంటుండేవాడు. ముస్లిం అనుకుందామా అంటే, ఆయన ప్రక్కన అగ్నిహోత్రం వుండేది, అగ్నిహోత్రం చూచి హిందువనుకుందామా? లేక అల్లా మాలిక్‌ను జూచి ముస్లిం అనుకుందామా? అర్థమయ్యేదిగాదు.**

అని అనుకరించిన భక్తుడు నానాసాహెబ్ చందోర్కర్ అని వుండేవాడు. ఆయన సాయి మహాత్ముడు గదా అని చెంత చేరాడు. సాయి దగ్గర ఒక గుణం వుండేది.

ఆయన చెంతన కూర్చున్నపుడు మనస్సులో ఏదన్నా చెడ్డ తలంపు వస్తే మాత్రం ఆ మనిషిని చెడ్డగా తిట్టి వెళ్ళగొట్టేసేవాడు, అక్కడ్నుంచి. ఒకప్పుడు కొట్టను గూడా కొట్టేవాడు. ఎదుటి వాళ్ళు ఆశ్చర్యపోయేవారు ఎందుకురా? వీడ్ని ఇట్లా తిడుతారు, యిట్లా కొడతారని, వాళ్ళు చెప్తే మాత్రమే తెలుస్తుంది. సరిగ్గా ఆ సమయానికి నా మనస్సులో యిట్టా కాలక్షేపమవుతోంది.

**యిది భగవద్గీతలోని శ్లోకంలే నీకేం దెలుసు పొమ్మన్నాడు. అపుడు అర్థం చెప్పమని ఆయన తిరిగి ప్రశ్నించటం మొదలు పెట్టేటప్పటికి దాని అర్థం అతను సరిగ్గా వివరించలేక పోయాడు. అప్పుడు సాయి ఆరంభించి దాన్ని వివరించాడు. ఆ వివరించిన రీతి యిప్పటికి నాకెక్కడా కనబడలేదు. అది విన్న తర్వాత మరొక అర్థం సరిపోతుందని కూడా అంత బాగా సరిపోతుందని గూడా అనిపించదు.**

అందువల్ల మధ్యాహ్నం పూట ఆయన పాదసేవ చేస్తూ మనసులో చెడ్డ ఆలోచనలు రాకుండా భగవద్గీతలో శ్లోకాలు మనస్సులో వల్లించుకుంటూ పాదసేవ చేస్తున్నాడు. అప్పుడు సరిగ్గా గురుశుశ్రూష గురించినటువంటి శ్లోకం అతని మనస్సులోకి రాగానే'' ఏంటిరా గొనుక్కుంటున్నావ్? అన్నారు (బాబా). ఫలాని శ్లోకం, యిది భగవద్గీతలోని శ్లోకంలే నీకేం దెలుసు పొమ్మన్నాడు. అపుడు అర్థం చెప్పమని ఆయన తిరిగి ప్రశ్నించటం మొదలు పెట్టేటప్పటికి దాని అర్థం అతను సరిగ్గా వివరించలేక పోయాడు. అప్పుడు సాయి ఆరంభించి దాన్ని వివరించాడు. ఆ వివరించిన రీతి యిప్పటికి నాకెక్కడా కనబడలేదు. అది విన్న తర్వాత మరొక అర్థం సరిపోతుందని కూడా అంత బాగా సరిపోతుందని గూడా అనిపించదు.

అట్లా భగవద్గీత మీద దాని కట్టా వ్యాఖ్యానం యిచ్చి వున్నాడు. అలాగాక ఏ యిష్టదైవాన్ని కొలిచే వాడికి, ఆ దైవం రూపంలో దర్శనమిచ్చాడు. రామభక్తుడు ఉన్నాడు. అతనికి సాయి భక్తుడు ఒకడు స్నేహితుడున్నాడు. ఈ సాయి భక్తుడు సాయి దర్శనానికి రమ్మని పిలిస్తే, ఆ రామభక్తుడు ఏమన్నాడంటే, రాముడికి దప్ప నేను దణ్ణం పెట్టను. ఈయన మశీదులో కూర్చున్న ముసల్మాన్ నేనక్కడ కొచ్చిన తర్వాత దణ్ణం పెట్టకపోతే అందరూ నన్ను తిట్టుకుంటారు. అందుకని 'వద్దులే' అన్నాడు.

అక్కర్లేదు, నిన్నెవరూ బలవంతం చెయ్యరు రమ్మనేటప్పటికి, అంత షరతులు పెట్టి వచ్చిన వాడు కాస్తా

మందు పరిగెత్తుకు పోయి మశీదు ముంగిట్లో బాబా పాదాల మీద పడ్డాడు. వాడు కళ్ళ వెంట నీరు కారుస్తూ తలెత్తాడు. వాడు తలెత్తగానే బాబా ఏమన్నారంటే ''ఒరేయ్, తెలివి తక్కువ వాడా రాముడు చూడగలితే ఎక్కడా (అంతటా) వున్నాడు. చూడ్డం చేతకాకపోతే ఎక్కడా లేడు'' అన్నాడు అంటే ఏమిటి? వీడి మనస్సులో వున్న దేమిటో కూడా ఆయన ముందే చెబుతూన్నాడన్నమాట.

అప్పుడు యివతల కొచ్చిన తర్వాత ఆసాయి భక్తుడడిగినాడు ''ఇంటి దగ్గర బయలుదేరేటప్పుడు నమస్కారం చెయ్యను, అది, యిది, అని చెప్పి ఎన్నో షరతులు పెట్టావు గదా, ఎందుకలా పరిగెత్తి ముందు నువ్ నమస్కారం చేశావు'' అని.

మశీదులో కాలు బెడుతూనే రాముల వారే కనిపిచ్చారక్కడ. పాదాల మీద పడి నమస్కారం చేసేటప్పటికి మళ్ళీ ఈయన ఆకృతే కనిపిచ్చింది. పైగా నాకిచ్చిన దర్శనం నా వంటికి కలిగిన భ్రాంతి కాదని తెలియటానికి నా మనస్సుకు తగిలొచ్చేటట్టు ఆయన మాట కూడా అన్నాడు.

అట్టా విఠలుడి భక్తుడికి విఠలుడుగా దర్శనమిచ్చాడు. మారుతి భక్తుడికి మారుతిగా దర్శనమిచ్చాడు. అట్టా వివిధ దేవతలు తాము అని నిరూపిస్తూ వచ్చారు.

సర్వమూ తన రూపమేనని బాబా నిరూపణ యిచ్చారు. ఇందులో హిందువులేమో ఈయన దత్తాత్రేయుల వారి అవతారమని చెప్పి, హిందూ సాధువులూ, మహాత్ములందరూ వాళ్ళ భక్తుల్ని ఆశీర్వచనం కోసం ఈయన చెంతకు పంపేవారు. అలాగే దేశంలో వున్నటువంటి ముఖ్యమైనటువంటి ముస్లిం గురువులందరూ గూడా వాళ్ళ భక్తుల్ని ఆశీర్వచనం కోసం ఈయన దగ్గరికి పంపించేవారు. ఈయన గొప్ప మహనీయుడని (ఈ యిద్దరికీ సనూనంగా అక్కడ ఆదరణ లభించేది. ఇద్దరి మన్ననలూ ఆయనకుండేవి.

ముస్లిం మహాత్ములేమో, యిస్లామ్‌లో తమకుంటే (ఈయన) గొప్ప అన్నట్టు ఈయన పట్ల వ్యవహరించేవారు. హిందూ మహాత్ములేమో ఈ సాంప్రదాయంలో తమకంటే ఈయన గొప్ప. సాక్షాత్తూ దత్తాతేయుల వారి అవతారం అన్నట్లు మాట్లాడేవారు. అందరూ సమగ్రంగా ఒక్కమాట మాత్రం చెప్పేవారు. మేమంతా చిన్న చిన్న వజ్రాలు వంటి వాళ్ళమయితే ఆయన కోహినూర్ వంటివాడు అనేవారు.

కాని ఆయన మాత్రం అయిదిళ్ళ దగ్గర అడుక్కునేవాడు. ''బాబా నీ ఫొటో తీసుకుంటామయ్యా'' అంటే నీ చరిత్ర రాసుకుంటామయ్యా'' అంటే, ''ఒరేయ్ అడుక్కు తినేవాడ్ని నా ఫొటో ఎందుకు? నువ్ చేయించుకో బావుంటుందనేవాడు. అడుక్క తినేవాడ్ని నా చరిత్ర రాసేదేమిటిరా? నీ చరిత్ర రాయించుకో బావుంటుందనే వాడు. ఎన్నో ఏళ్ళు (సంవత్సరాలు) కోరి, కోరి, కోరి కోరితే. చివరికి ఒక్కసారి ఆశీర్వచనానికి ఒప్పుకున్నారు. మొత్తం 5, 6 ఫొటోలు తప్పిస్తే, 60 సంవత్సరాలలో ఆయనకు తీసిన ఫొటోలు లేవు మొత్తం. పీడించగా పీడించడా పీడించగా ఆయన ఒప్పుకున్నాడు. అట్టా నిరాడంబరంగా బతుకుతూ అడుక్కుతినే ఫకీరు దప్ప ఆయన ఇంకోటేం కాదు అన్నట్టుగా మాట్టాడేవారు. ఇతరులేమో ఆయన్ను గొప్పగా మాట్టాడేవారు.

అలాగే మామూలుగా ఆధ్యాత్మికతలో మనం ఏం వింటాం అంటే అన్నిట్లోనూ, అన్ని జీవుల్లోనూ పరమాత్మ వున్నాడు. ఆ పరమాత్మను గుర్తించి, అన్ని జీవుల్ని ఆదరించవలె. ఏ విధంగా బాధ పెట్టగూడదు. అని శాస్త్రంలో చెప్తుంది. ఈ మాట ఎంత జాగ్రత్తగా శాస్త్రంలో, చెప్పి వున్నప్పటికీ, ఎన్నిసార్లు, చదువుకున్నప్పటికీ, విన్నప్పటికీ మనస్సులో నిలిచేది మాత్రం చాలా కష్టం. ఎందుకని, దానికి సరిపడే అనుభవం ఒక్కటి గూడా వుండదు. మన అందరిలో ఒకే ఆత్మ వ్యాపించి వుంటే, ఒక ప్రాణి యొక్క బాధ ఇంకో ప్రాణికి ఎందుకు తెలియగూడదు, అనే ప్రశ్న మన మనసులో వేయటం చాతగాదు. గాని లోపల వుంటుంది. అందుకని ఎన్ని శాస్త్రాలు విన్నా గూడా మనసుకు రాదు. అందుకని సాయి ఏం చేసేవారంటే, సామాన్యంగా చెప్పేవాడు గాదు ఆ మాట. చేసి చూపేవాడు.

అంటే మనింటి దగ్గర మనం కుక్కను కొట్టామనుకోండి, అసహ్యించుకొని, ఆయన దగ్గరికి పోంగానే ఆయన తిట్టేవాడన్నమాట. ''ఈ దౌర్భాగ్యుడు నన్ననవసరంగా కొట్టాడివాళ'' అనేవాడు. గజ్జి కుక్క వచ్చి వాకిట్లో నుంచుంది. వచ్చేటప్పటికి అసహ్యంగా వుండే కుక్క వాకిట్లో కూచ్చుందని చెప్పి ఒక్క తన్ను దన్నాడు భక్తుడు, యింటి దగ్గర. బాబా దగ్గరికి రాగానే అన్నారు ''ఒరేయ్ నా లాంటిదే ఓ జబ్బు కుక్కుందిరా! ఊళ్ళో ప్రతి పనికిమాలిన వెధవా దాన్ని కాలితో తన్నేవాడే'' అన్నాడు.

ఈ రోజు భిక్ష చేసుకొని ఆ భిక్ష తీసుకొచ్చి మశీదులో తినేవాడు, ఒకసారి ఒక భక్తురాలు ఏమన్నదంటే ''నియమంగా నీ కిన్ని రోజులు శ్రద్ధాభక్తుల్తోటి భిక్ష యిస్తున్నాను గద, ఒక్క రోజైనా నీవు నా యింట్లో భిక్ష చెయ్యాలి అంది. అంటే ''ఇది ఫకీరు ధర్మానికి విరుద్ధము, ఇంట్లోకొచ్చి కూర్చుని నేను భిక్ష చేయటమనేది నా ధర్మానికి తప్పు, నీకు ధర్మానికి తప్పు. ధర్మం

కాదు. అలా పెట్టటమనేది. కాబట్టి అది కోరవద్దాన్నాడు.

అంటే, అదేం నాకు తెలియదు. నీ ధర్మాధర్మాలు నాకేం సంబంధం లేదు. నేను పెట్టాల నువ్ తినాలని ఆమె రెట్టించగా, రెట్టించగా చివరికి ఏం చేశాడంటే నా ధర్మం చెడకుండా నీకు అభిమతం నెరవేరేట్టు చూస్తాను యింటికొస్తే ''ఛీ'' కొట్టి వెళ్ళగొట్ట వద్దు''. ఆమెకేం అర్థం గాలేదు పాపం.

**గజ్జి కుక్క వచ్చి వాకిట్లో నుంచుంది. వచ్చేటప్పటికి అసహ్యంగా వుండే కుక్క వాకిట్లో కూచ్చుందని చెప్పి ఒక్క తన్ను దన్నాడు భక్తుడు, యింటి దగ్గర. బాబా దగ్గరికి రాగానే అన్నారు ''ఒరేయ్ నా లాంటిదే ఓ జబ్బు కుక్కుందిరా! ఊళ్ళో ప్రతి పనికిమాలిన వెధవా దాన్ని కాలితో తన్నేవాడే''**

బాబాను రమ్మని ''ఛీ'' ఎందుకు కొడతాను? అంటే ఫలాని రోజు వస్తాను పొమ్మన్నాడు. ఆమె ఇల్లు కడుక్కుంది. వంట చేసుకుంది. అక్కడ పెట్టుకుంది. చల్లారిపోతాయనుకున్న పదార్థాలు మాతం సన్న శెగ మీద పొయ్యి మీద అట్టే పెట్టుకుంది. ఎంత సేపటికీ రాడు! పొయ్యి మీద ఏమన్నా పాడై పోతుందేమో అనుకుని పొయ్యి చూట్టం కోసం వెళ్ళేప్పటికి ఈ వాసన కోసం తులుపులోంచి కుక్క లోపల చొరబడింది. చొరబడి ఆఖరికి ఎంత దగ్గర కొచ్చిందంటే, లేచి దగ్గరకొచ్చి తోలటానికి అవకాశం లేదన్నమాట.

ఇక ముట్టుకుందంటే నైవేద్యానికి పనికిరాదు గాబట్టి, ఆమె దృష్టిలో అందుకని అందులో వున్న కట్టె తీసి విసిరింది. దానికి తగలకుండా తప్పుకుంది. కుక్క కాస్తా వెళ్ళిపోయింది. బాబా రాలేదు! రాకపోతే వెంటనే ఈమె బాబా దగ్గరకి తగువు పెట్టుకోటానికి పోయింది. వస్తానని చెప్పి నువ్ ఎందుకు రాలేదని. ఆమె మశీదులోకి వస్తూనే ''ఏవమ్మా రా! రమ్మంటివే, వస్తే మండుతున్న కట్టె విసిరితివే మీదికి'' ఇదెక్కడిది బాబా, ఏమిటి? అని అడిగితే నే మొదటే చెప్పానుగా, నా వ్రతం చెడిపోకుండా వుంటుంది, నీ ఫలితం నెరవేరుతుంది. గుర్తు పెట్టుకో, సకల జీవరాసుల రూపాల్లో నేనే సంచరిస్తున్నాను. ఇది గుర్తు పెట్టుకొని ప్రవర్తించు బావుంటుంది. అని చెప్పాడు. ఇట్లా ఏ ప్రాణికి పెట్టినా అలానే చూపిచ్చే వాడన్నమాట.....

హంసరాజ్ అనే భక్తుడు ఉబ్బసంతో బాధపడ్డాడు. వాడికి బాబా దగ్గర కొచ్చి కొన్నాళ్ళు వుండేసరికి ఉబ్బసం తగ్గిపోయింది. బాబా ఏం చెప్పారంటే ''పుల్ల పెరుగు ఎప్పుడు తినబాకురా'' అన్నారు వాడ్ని. కాని వాడికి పుల్ల పెరుగంటే మాత్రం అపారమైన ప్రేమ. అందుకని భార్యతో ఏం చెప్పాడు? రోజూ పెరుగు తోడు పెట్టవలసిందే. అయితే నేను భర్తను గనక ఆజ్ఞాపిస్తున్నాను. నువ్ బాబాతో చెప్పటానికి వీలులేదన్నాడు. ధర్మంలో యిరికిచ్చుకున్నాడు, అన్నమాట. రోజూ ఆమె తోడేసి పెట్టేది. అయిం తర్వాత మధ్యాహ్నం హారతి కోసం వాళ్ళిద్దరూ ద్వారకామాయి కొచ్చి పోయేటప్పటికి నియమంగా పిల్లి త్రాగి పోయేది దాన్ని, వారం అయింది, పది రోజులయింది, పదిహేను రోజులైంది. ఒక్కరోజు కూడా పాపం ఆయనకు పెరుగు నోట్లోకి పోయిన పాపాన పోలె. చివరికి యిహ అక్కసు భరించలేక పోయాడు. ఈ రోజన్నా బుద్ధి చెప్పాల్సిందే పిల్లికనుకున్నాడు. ఒక కర్ర దీసుకుని కాపలా వేశాడు. బుద్ధి చెప్పాలంటే బెదిరిస్తే చాలదు. గట్టిగా ఒక దెబ్బ తగలాలన్నమాట. అందుకని మూతి బెట్టి తాగటం మొదలు బెట్టిం తర్వాత అయితే బాగా చిక్కుతుంది. అందుకేంచేశాడంటే దాన్ని రానిచ్చి మూతి పెట్టనిచ్చి అప్పుడు కొట్టాడు. కొట్టటంతో అది పెద్దగా కేక బెట్టి పారిపోయింది. ఆః దీనికి ఇవాళ్టితో బుద్ధి వచ్చింది. రేపటి నుంచి రాదులే అనుకున్నాడు. మధ్యాహ్నం నించి వచ్చి అందురు భక్తుల్తో పాటు వచ్చి కూర్చున్నాడు. ముందు చాలా మంది భక్తులు కూర్చుని వున్నారు అక్కడ. వాడొచ్చి కూర్చోగానే, ఆయన మొదలెట్టాడన్న మాట. ''మన మధ్యలో ఒక పనికిమాలిన వాడొకడు, మూర్ఖుడు ఒకడున్నాడు, పుల్ల పెరుగు తిని'' చావద్దురా అంటే చచ్చిపోదామని చూస్తున్నాడు వాడు. వాడ్ని చావనీకుండా వుంటం కోసం పిల్లి రూపంలో వెళ్ళి రోజూ తాగుతున్నాను. ఇవాళ చూడు వాడు నన్నెట్ల చచ్చేటట్టు కొట్టాడో'' అని చొక్కా పైకెత్తితే చార పడుందక్కడ. అప్పుడు వీడికి పరితాపం కలిగింది. ఒరేయ్, ఈన చెప్పిన మాటలు ఉత్తుత్తి మాటలు కావు. అన్ని రూపాల్లో ఆయనుండే మాట వాస్తవం.

# సద్గురు శ్రీ మాణిక్య ప్రభువు

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

హైదరాబాదుకు చెందిన అప్పారావు, భీమాబాయి దంపతులు శ్రీమంతులు. వారెన్ని వ్రతాలు, పూజలూ చేసినా సంతానం కల్గలేదు. అపుడు గుల్బర్గా దగ్గరున్న కల్యాణ్‌లో దివ్యశక్తులు గల ఒక బాలుడున్నాడని తెలిసి అతని దర్శనానికి పల్లకీలో బయల్దేరింది భీమాబాయి. దారిలో ఒకచోట కొందరు పిల్లలు కలసి ఒక పిల్లవాణ్ణి కొడుతున్నారు. వారి తగవు తీర్చిరమ్మని భీమాబాయి ఒక నౌకరును పంపింది. అతడితో ఆ దెబ్బలు తింటున్న పిల్లవాడు ''నేను ఈ పిల్లలతో పందెంలో ఓడిపోయినాను. 8 గవ్వలిచ్చి నన్ను విడిపిస్తే మీ యజమానురాలికి 8 మంది పిల్లలు కల్గుతారు'' అన్నాడు. తరువాత భీమాబాయి తన నౌకరుద్వారా గవ్వలు ఆ బాలునికిచ్చింది. అతడు వెంటనే అవి ఆ పిల్లలకిచ్చి ఎటో పరుగెత్తిపోయాడు. తర్వాత భీమాబాయి కల్యాణ్ చేరి 3 రోజులు వేచియున్నాక ఆ దివ్య బాలుడు ఎక్కడనుండో వస్తూనే నేను ఆమెను చూచి, ''నీకిదివరకే 8 మంది బిడ్డలనిచ్చాను గదా! ఇంకా వేధిస్తావెందుకు?'' అని చెప్పి మళ్ళీ ఎటో వెళ్ళిపోయాడు. కాలాంతరంలో అతడి మాటలక్షరాలా నిజమయ్యాయి. ఈ దివ్యబాలుడే మూడవ దత్తావతారమైన సద్గురు మాణిక్య ప్రభువు.

మాణిక్య ప్రభువు డిసెంబరు 22, 1817న కల్యాణ్‌లో మనోహర్‌నాయక్, బయాదేవి అను పుణ్యదంపతులకు జన్మించారు. వీరి అన్నగారైన హనుమంత్ దాదా తర్వాత కాలంలో మారుతి అవతారంగా కొలువబడిన దాదామహరాజ్' అను మహనీయుడుగా ప్రసిద్ధి చెందారు. వీరి సమాధి మాణిక్యనగర్‌కు తూర్పున విరజా... గంగ అను ఉపనదుల సంగమం వద్ద నున్నది. మాణిక్య ప్రభువులకు ఉపనయమైన కొద్దికాలానికి తండ్రి స్వర్గస్థుడయ్యాడు. ప్రభువు బడికి వెళ్ళక ఒక్కడే భయంకరమైన అడవులలోకి వెళ్ళి కొన్నిరోజుల తర్వాత యిల్లు చేరుతుండేవారు. ఆ బాలుని సంస్కరించమని కోరి, తల్లి బయాదేవి అతనిని దీక్షిత్ అను వేదపండితుని యింటికి పంపింది. ఆ బాలుని దివ్యత్వాన్ని గుర్తించిన దీక్షిత్ అతడికెందులోనూ అడ్డు చెప్పేవాడుగాదు. ఒకనాడు ఆ బాలుడు హోమగుండంలో మలవిసర్జన చేసాడు. దీక్షిత్ ఆ సంగతి తెలిసి హోమగుండంలో చూడగా అందులో మలానికి బదులు బంగారు ముద్ద వున్నది.



ఎట్టి ఆధారమూ లేని ఆ కుటుంబాన్ని మేనమామ చాలీచాలని తన జీవితంతో పోషించేవాడు. ఒకసారి అతడు యుక్త వయస్కుడవుతున్న మాణిక్య ప్రభువును రహదారిపైపోయే వాహనాల మీద పన్ను వసూలు చేసే పనిలో చేర్పించాడు. కాని అతడు తాను వసూలు చేసిన దంతా పేదలకిచ్చేస్తూంటే ప్రభుత్వం అతనిని ఉద్యోగం నుంచి తొలగించింది. అందుకాగ్రహించి అతనిని యింట్లో నుండి వెళ్ళిపొమ్మని మేనమామ బెదిరించాడు. వెంటనే ఆ యువకుడు ఆశువుగా వేదాంతముట్టిపడే ఒక పద్యం చెప్పి, మేనమామకు ప్రదక్షిణం చేసి కేవలం కౌపినంతో యింటిలో నుంచి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఆ మాణిక్య ప్రభువు యధేచ్ఛగా అరణ్యాలలోనూ, గుహలలోనూ సంచరిస్తూ, ఎన్నో లీలలు ప్రకటించారు. ఎందరో భక్తులు వారిని దర్శించి తమ కష్టాలు తీర్చుకునేవారు. ఆయన పరలి వైద్యనాథము, తులజాపూర్, పండరిపూర్, పూనా, తిరుపతి, గాణ్గాపూర్, కోల్హాపూర్, నృసింహవాడీ మొ॥న ప్రాంతాలలోనేగాక ఉత్తరదేశంలో గూడ పర్యటించాడు.

స్వామిని వెంకమ్మ అను బాల్య వితంతువు దర్శించి ఆ సన్నిధిలోనే జీవితశేషం గడపాలని కోరింది. వారు, ''మా సన్నిధిలో వుండాలంటే నీవద్ద నగలుంచుకోరాదు'' అన్నారు. ఆమె తన బంగారమంతా ప్రభువులవద్ద వుంచేసింది. ఆయన దానిని పేదలకు పంచివేసి ఆమెను తమ తల్లివద్ద వుంచాడు. దొంగ ఒకడు శ్రీమంతులైన ఆమె కుటుంబమంతటినీ బొందితో కైలాసానికి పంపిస్తానని నమ్మించి, మైలారులోని రుద్రకుండంలో దూకించాడు. వారు దూకగానే వారింట్లోని బంగారమంతా తీసుకుని పరారయ్యాడు. అందరూ చనిపోయారుగాని, ఒక చిత్రమైన వ్యక్తి వెంకమ్మను మాత్రం రక్షించి అదృశ్యమయ్యాడు. కొంతకాలానికి ఆమె ప్రభువులను దర్శించి, తనను రక్షించినది వారేనని గుర్తించి, వారి సేవలో వుండిపోయింది. ఆయన సేవలో ఆమెకు యోగ సమాధి లభించి, ఆయన సన్నిధిలోనే సమాధియైంది.

ఒకప్పుడు బీదర్‌కు చెందిన ధనికులెందరో ప్రభువుల నాహ్వానించి ఏనుగుల ఊరేగింపుతో పల్లకిలో ఆయనను తీసుకు వెళుతున్నారు. దారిలో ఒకచోట మేనా మోసే వారందరికీ మైకంకమ్మి వేరొకదారిన మళ్ళారు. అక్కడ వారికొక పెద్దపాము కన్పించింది. అదొక గొప్ప మహనీయుడని చెప్పి దాని ననుసరించమన్నారు, ప్రభువు. అది ఒక నరసింహస్వామి దేవాలయం వద్దకు పోయి అదృశ్యమైంది. ప్రభువక్కడ కొంత కాలమున్నారు. అప్పుడు బిదర్ నుండి వచ్చిన భక్తులెందరో తమ యిండ్లకు స్వయంగా ప్రభువులు వచ్చారని చెప్పుకోసాగారు. వారి యోగ మహిమను గుర్తించి ముస్లిములు ఆయనను సేవించేవారు. అది నచ్చని కొందరు మౌల్వీలు ప్రభువులను భోజనానికి పిలిచారు. ఆయన అంగీకరించకుంటే ఆయన బోధించే మతసామరస్యం బూటకమని నిరూపించాలని తలచారు. ప్రభువు విందుకు హాజరై, ప్రార్థనచేసి, వంటకాలపై మూత తొలగించేసరికి ఆవు మాంసమంతా అదృశ్యమై, దానికి బదులు పెద్ద గులాబీలు, ఖర్జూరాలు, మిఠాయిలు వున్నాయి. అప్పటినుండి బిదర్‌కు చెందిన ముస్లిములు ఆయనను ముస్లిం మహాత్ముడుగా తలచి, ''పీర్‌ఆన్‌పీర్ దస్తగిర్'' అను బిరుదునిచ్చారు. తర్వాత ఆయన మేనాలో హుమ్నాబాద్ సమీపించేసరికి అక్కడ దట్టమైన లతలమధ్య మేనా చిక్కుకుని కదలేదు. అప్పటినుండి ప్రభువులు శాశ్వతంగా అక్కడే స్థిరంగా వుండిపోయారు. అదే నేటి మాణిక్య నగరం. అక్కడికే ఎందరో భక్తులు రాసాగారు. ఆయన అక్కడ 'దత్తగాదీ' (దత్త సింహాసనము) ప్రతిష్ఠించారు.

అద్భుతమైన ప్రభువుల మహిమవలన అన్ని మతాలవారూ ఆయననాశ్రయించారు. ఆయనగూడ సకల మత సామర్యసమే బోధించారు. అందుకే హిందూ పండుగలతో పాటు అక్కడ మొహరం చేస్తారు. పండగలలో సన్నిధిలో వేదగానము, శాస్త్రచర్చ, నృత్యగీతాదులు వైభవంగా జరిగేవి.

ఒకప్పుడు అక్కల్కోటరాజు ప్రభువులను దర్శించి తమ పట్టణానికాహ్వానించారు. ఆయన, ''నా మరొకరూ అక్కడికి వస్తారు'' అని చెప్పారు. ఆ ప్రకారమే కొంతకాలానికి అక్కల్‌కోట స్వామి నాల్గవ దత్తావతారంగా ప్రకటమయ్యారు.

మరొకప్పుడు హంపీలోని శంకరాచార్య వీరిని కలుసుకుని వీరి మహిమను కీర్తించారు.

శ్రీ సద్గురు మణిక్య ప్రభువుల సమాధి వారి తర్వాత ఆ పీఠమలంకరించిన వారి సమాధులు, శ్రీ దాదారాజ్ గారి సమాధి, యోగిని వెంకమ్మగారి సమాధి మాణిక్య నగర్‌లో చూడవలసిన ప్రదేశాలు. మాణిక్య నగర్‌లో రోజూ 4 హారతులు జరుగుతాయి. శ్రీరామనవమి, గురుపూర్ణిమ, దత్తాత్రేయ జయంతి ముఖ్యమైన పండుగలకు ఇప్పుడు శ్రీ సిద్ధరాజ మాణిక్య ప్రభువులు ఆ పీఠాధిపతులు.

హైదరాబాదు నుండి గుల్బర్గా వెళ్ళే బస్సులో హుమ్నాబాద్ చేరాలి. అక్కడి నుండి బండిమీద 4 ఫర్లాంగుల దూరంలోనున్న మాణిక్యనగర్ చేరాలి.

# బుద్ధ ధ్యాన హృదయము - 5

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

*నవంబరు సంచిక తరువాయి*

**3. మానసిక స్థితిపై ధ్యానము (చిత్తానుపశ్యనము)**

ఈ సాధనలో గూడ మనస్సును కేవల శ్రద్ధ అను శుద్ధమైన అద్దము ముందుంచటం జరుగుతుంది. మనస్సు యొక్క లేక చైతన్యము యొక్క స్థితి లేక స్థాయిని అనుక్షణమూ గుర్తిస్తూండటమే లక్ష్యం.

ఆత్మ పరిశీలన ద్వారా తన మనస్తత్వాన్ని తాను అర్థం చేసుకోగలగడమే యీ సాధన యొక్క ప్రధానమైన ప్రయోజనం. వర్తమానంలోగాని, ముందు క్షణంలోగాని వున్న మానసిక స్థితిని సాధ్యమైనపుడల్లా నిర్లిప్తంగా గుర్తిస్తూండడమే సాధన. ఇది తన మానసిక స్థితిని గురించి యోచించడం, వితర్కించుకోటంకంటే మెరుగైనది. తన మనస్తత్వాన్ని గురించి యోచించటం, ఆత్మవిమర్శ కొందరిలో అవాంఛనీయమైన పరిణామాలను కల్గించవచ్చు. ఉదాహరణకు ఒకడికి తన దోషాలు తెలియటం వల్ల ఆత్మవిశ్వాసం నశించవచ్చు. ఇందువల్ల సాటి వారితో సరిగా మెసలుకోలేడు. మరొకడికి అహంకారం ప్రబలవచ్చు. మరికొందరికి 'నేను ఆత్మ విమర్శచేసుకొనే ఉత్తమ సాధకుడను' అనే గర్వం ప్రబలవచ్చు. కాని నిర్లిప్తంగ (యోచన, విమర్శలేకుండ) తమ మానసిక స్థితిని గుర్తించే వారిలో యిటువంటి లోపాలు నివారించుకోవచ్చు.

చిత్తాను పశ్యనంలో అహంకారంగాని, తనపై తనకు అవిశ్వాసం గాని కలుగక తన యదార్థస్థితిని గుర్తించి సరియైన సాధనను కొనసాగించే దార్ఢ్యం కలుగుతుంది.

సామాన్యంగా మానవుడు తన బలహీనతలను గుర్తించడానికి, అంగీకరించడానికి యిష్టపడడు. కారణం ఆత్మగౌరవం దెబ్బతింటుందని భయం. ఎప్పుడైన తప్పక గుర్తించవలసి వస్తే తనను తాను యెలాగో సమర్థించుకొని లేక దృష్టిని సాధ్యమైనంత త్వరలో వాటినుంచి మళ్ళించుకో చూస్తాడు. కనుక తన బలహీనతలను అతిక్రమించడమే సాధ్యం కాదు.

అలానే తనలోని సామర్థ్యాలు కూడ కొన్ని తనకే తెలియకుండా ఉండిపోతాయి. వాటిని నిర్లిప్తంగా గుర్తించటం వలన సాధనకు ఉపయోగించుకోగలుగుతాడు.

సాధనలో తన పురోగతిని వాస్తవంగా అంచనా వేయడానికి గూడ చిత్తానుపశ్యనం ఉపకరిస్తుంది.

సాధనకు అంతరాయంగా తలెత్తేభావాలను ప్రబలనివ్వకుండా యిది ఉపకరిస్తుంది. ఉదాహరణకు ధ్యానానికంతరాయం కలిగించే శబ్దాలు సాధకునికి చీకాకు పరిచేవనుకోండి. అప్పుడతడు ''యిప్పుడు మనస్సు చీకాకు అనే స్థితిలో నున్నది'' అని నిర్లిప్తంగా గుర్తించడం వల్ల ఆ చీకాకు అంతరించి ధ్యానాన్ని కాపాడుతుంది. అంతేకాక యీ సాధన ఆ శబ్దము అనే బాహ్య కారణం నుండి తన



అంతరంగికమైన చీకాకు మీదికి మరలేలా చేస్తుంది. అంటే అంతర్ముఖం చేస్తుంది.

### 4) మనోవిషయాల ధ్యానము (ధర్మానుపశ్యనము)

ఈ సాధన వల్ల యోచలన్నీ బుద్ధధర్మానుగుణంగా మారేలా చేస్తుంది. అంటే వాస్తవాన్ని గుర్తించడం ద్వారా ముక్తికి దోహదం చేస్తుంది. కనుక యీ సాధనలోని అయిదు అభ్యాసాలు సత్యదృష్టికి సంబంధించిన యోచనలకు సంబంధించి ఉంటాయి. ముక్తి అనే లక్ష్యం వైపుకు మనస్సు మొగ్గేలాగా చేస్తాయి. వీటిని సాధ్యమైనంతవరకు నిత్యజీవిత యోచనాపద్ధతుల్లోకి యిముడ్చుకొని సరియైన అవగాహనను విరుద్ధాలైన భావాలను తోసివేయటానికి వినియోగించుకోవాలి.

మొదటి సాధన అయిదు ప్రధాన మానసిక అవరోధాలను గూర్చినది. నాలుగవది ఏడు జ్ఞానాంశాలకు సంబంధించినది. అంటే యీ రెండభ్యాసాలు విడచిపెట్టదగ్గ మరికొన్ని లక్ష్యాలు 3వ అభ్యాసంలో సూచించబడతాయి.

ఒకటి, నాలుగవ అభ్యాసాలలో మొదటిభాగాలు కేవల శ్రద్ధ సాధనకు సంబంధించినవి. వాటి సారాంశమిది. ఏదైనా ఒక మానసిక అవరోధం గాని, జ్ఞానం యొక్క అంశంగాని, సాధకుడిలో ఉండడంగాని, ఉండకపోవడంగాని జరిగినప్పుడు ఆ విషయాన్ని కడు స్పష్టంగా గుర్తించాలి. అలాగే మూడవ అభ్యాసంలో యింద్రియానికి, దాని విషయానికి సంఘటన కలిగినందువల్ల యేర్పడిన బంధాన్ని గూర్చినభాగం గూడ కేవల శ్రద్ధా సాధనకు సంబంధించినదే.

పై చెప్పబడిన మూడు సూత్రవాక్యాలు - మన ప్రస్తుత చైతన్యస్థితిని చెప్పేవి - నిజానికి చిత్తానుపశ్యనములో భాగాలు. అయితే అవి వాటి తరువాత అభ్యాసాలకు అంటే ఆయా అభ్యాసాలలో ఉత్తరభాగాలకు, అత్యావశ్యకమైన సంసిద్ధతనిస్తాయి. ఆ రెండవదశలో ప్రయోజనాత్మకము, కూలంకషము అయిన శుద్ధావగాహనను యీ క్రింది పనులకు ఉపయోగిస్తాము. 1) ఆయా అవరోధాలను, బంధాలను నివారించటానికి, తాత్కాలికంగ అతిక్రమించటానికి, చివరకు పూర్తిగా రూపుమాపటానికి, 2) జ్ఞానాంశాలను ఉత్పత్తిచేసి వృద్ధి చెందించటానికి. యీ రెండు ప్రయోజనాలను సాధించాలంటే అవరోధాలు, ప్రతిబంధకాలు, అటు జ్ఞానాంశాలు ఉత్పన్నం కావటానికి కాకపోవటానికి దోహదం చేసే పరిస్థితుల గురించి సన్నిహితంగా తెలుసుకోవటమవసరం. మూలసూత్రంలో యీ పరిస్థితులను గూర్చిన విచారణ స్థూలంగా, యీ విధంగా ప్రస్తావించబడింది : ''ఏ విధంగా అంతకుముందు ఉత్పన్నం కానివి (అవరోధాలు, బంధాలు, జ్ఞానాంశాలు) ఉత్పత్తి కావడంయెలా జరుగుతుందన్నది అతడు బాగా తెలుసుకుంటాడు''.

ఆయా మానసిక అంశాలు ఉత్పన్నం కావటానికి ప్రధానమైన పరిస్థితులు ఆయా సూత్రాలకు బుద్ధఘోషుడు రచించిన వ్యాఖ్యానంలో వున్నాయి. వాటిని కూడా సూచించడమైనది.

అయితే ఆ పరిస్థితులను గూర్చిన సిద్ధాంతం పరమైన జ్ఞానమే చాలదు. తనలో ఉత్పన్నమయ్యే అవరోధాలను, బంధాలను, జ్ఞానాంశాలను తనలో వాస్తవంగా గుర్తించడం ద్వారా మాత్రమే బాహ్యంగాను ఆంతరంగికంగాను వాటిని ఉత్పన్నం చేసేవిగాని, ఆటంకపరచేవిగాని అయిన కారణాలను గూర్చిన పరిజ్ఞానం క్రమంగా లభిస్తుంది. ఈ పరిస్థితులు వ్యక్తికి, వ్యక్తికి మారవచ్చు. సామాన్యంగ యీ గుణాలు, అవగుణాలు ఉత్పన్నం కావడానికి దోహదం చేసే సందర్భాలను వ్యక్తులు పూర్తిగా తెలుసుకోలేరు. తిరిగి తిరిగి వాటిని ప్రయత్నపూర్వకంగ గుర్తించి వాటి పరిచయం కలిగిన వాళ్ళు ప్రతికూలంగా ఉండే పరిస్థితులను నివారించి అనుకూలమైన వాటిని కల్పించుకోవడానికి సహకరిస్తుంది. ఇది పురోగతి కెంతో ఉపకరిస్తుంది.

ఒకటవ, నాలుగవ అభ్యాసాలలో, మూడవ అభ్యాసంలో రెండవభాగం మనస్సును గూర్చిన పరిజ్ఞానానికి మనస్సు యొక్క అభివృద్ధికి సంబంధించినవి. రెండవ, అయిదవ అభ్యాసాలు, మూడవ అభ్యాసంలో మొదటి అంశము అయిదు విధాలైన తృష్ణ (ఉపాదాన స్కంధము). ఆరు ఆయతనాలకు (యింద్రియాలు), నాలుగు సత్యాలు కలిసి వాస్తవాన్ని సంపూర్ణంగా చెబుతాయి. ఒకే సత్యాన్ని ఒక్కొక్కటి ప్రత్యక్షమైన రీతిన ఒక్కొక్కకోణం నుండి చెబుతుంది.

నిత్యజీవితానుభవాలను వాస్తవంగా లేనట్టి (కానిదున్నట్టునిపించే) వ్యక్తిత్వానికి (లేక జీవాత్మ) అలవాటుగా మనం ముడిపెడతాము. ఈ మూడు అభ్యాసాలు యీ నిత్యజీవితానుభవాలలో వ్యక్తిత్వంతో కూడినదిగాని, వ్యక్తిత్వరహితమైనదిగాని స్థిరమైన తత్వమొకటి లేనేలేదు అన్న సత్యంతో సమన్వయ పరుస్తాయి. అట్టి స్థిరమైన వ్యక్తిత్వం ఉన్నది అన్న విశ్వాసాన్నాధారం చేసుకొని వ్యవహారిక స్థితి పరమార్థ స్థాయిగా మారుతుంది. ఈ విధంగా విడివిడిగా ఉండే జీవితానుభవాలు పూర్ణమైన బుద్ధధర్మంతో సమన్వయపడి దాని వివిధ అంశాలకు చెంది ఉంటాయి.

ఈ విధంగ ధర్మానుపశ్యన సాధనను వినియోగించుకోవడానికి ఒక చక్కని ఉదాహరణను

వ్యాఖ్యానం తిరిగి తిరిగి చెబుతుంది. సూత్రంలో యివ్వబడిన ప్రతి అభ్యాసాన్ని పూర్ణంగ వివరించిన తరువాత దానిని నాలుగు మహాసూత్రాలకు అన్వయిస్తుంది. ఉదా: ''ఇక్కడ వచ్చిపోయే శ్వాసను తప్పుకొనే స్మృతి దుఃఖమనే సత్యం''.

ఆ స్మృతికి ముందు వచ్చే కోరిక (లేక తృష్ణ) ఆరంభం లేక 'ఉత్పత్తి' అనే సత్యం. ఆ రెండు నిలచిన స్థితి 'లయం' అనే సత్యం. దుఃఖాన్ని అర్థం చేసుకోవడం, ఉత్పత్తిని పరిత్యజించడం, లయాన్ని లక్ష్యంగా తీసుకోవడం సత్యానికి మార్గం''.

ఇది నిత్యజీవితానికి ధర్మానుపశ్యన అని వినియోగించుకోటానికి చక్కని ఉదాహరణ యిది. చిన్నదిగాని పెద్దదిగాని యే సంఘటనైన స్మృతితో, యోచనతో గమనించటానికి అవకాశం కలిగినపుడల్లా నాలుగు మహాసత్యాలకు అన్వయించుకోవాలి. ఈ విధంగా ''జీవితం సాధనతో ఐక్యం కావాలి. సాధన సంపూర్ణజీవితం కావాలి'' అనే సూత్రానికి సన్నిహితుడు కావచ్చు. ఈ విధంగ 'భావానుపశ్యనం' (వేదనాను పశ్యనం), 'చిత్తానుపశ్యనం', 'ధర్మానుపశ్యనం', 'కాయానుపశ్యనం' అను నాలుగు ధ్యానాలు బుద్ధ ధర్మానికి మూల ప్రాతిపదికైన అనాత్మ అనే సత్యం మీద కేంద్రీకృతమౌతాయి. ఒక వంక వ్యక్తిత్వములేక జీవితమే లేదని మరొక వంక వస్తుత్వము లేక పదార్థమే లేదని, తెలిపే ముక్తిప్రదమైన అనాత్మ సత్యాన్ని అనుభవగతం చేసుకోడానికి తగిన తాత్విక సిద్ధాంతము, ఆచరణలను చెబుతుంది స్మృత్యపస్థానసూత్రము.

## అధ్యాయము - 4

## మనస్సంస్కరణము - హృదయ సంస్కరణము

ఒకవ్యక్తికి,సాటిమనుషులకుమధ్యఉండేసంబంధాలను నియమించవలసిన 'నీతి' అనేది కొన్ని సూత్రాలు, నియమాలు, చట్టములు చేత బలపరచబడి రక్షింపబడవలసి ఉంటుంది. అంతేకాక తాత్వికంగాను, ప్రయోజనాత్మకంగాను దానిని సహేతుకంగ వివరించవలసి ఉంటుంది. అయినప్పటికి నీతియొక్క మూలం నిజమైన హృదయ సంస్కరణలోనే ఉంటుంది. దీనికి బౌద్ధంలో యెంతో ప్రాధాన్యత ఉన్నది. సంపూర్ణంగా సంస్కరించబడిన హృదయం యొక్క నాలుగు స్థితులను బుద్ధుడిలా చెప్పాడు. ప్రేమతో కూడిన దయ (లేక మైత్రి), కరుణ, సహృదయమైన సంతోషం, సమ్మత (Equanimity); నిస్వార్థము, అనంతమైన ప్రేమ అన్నది



తక్కిన మూడు లక్షణాలకు ఆధారం. మనస్సును పవిత్రం చేసే యత్నానికి కూడ అదే ఆధారం. అందుకే స్మృత్యుపస్థాన పద్ధతిలో మనోవాక్కాయలతో చేసే క్రియలు మైత్రీ భావాన్ని భగ్నంచేసేవి కాకుండా ఉండేలాగ చూచుకోవటం స్మృతి యొక్క లక్ష్యం. ఈ మైత్రి సాధనా మార్గంలో శిష్యుడు యీ మైత్రి భావాన్ని పెంపొందించుకోకుండా యెప్పుడూ ఉండరాదు. ''మైత్రి యందు స్మృతిని కలిగి ఉండవలసినది'' అని చెప్తుంది 'మైత్రి సూత్రం' మైత్రికి, స్మృత్యుపస్థానానికి గల సంబంధాన్ని బుద్ధుడిలా చెప్పాడు. ''నన్ను నేను రక్షించు కొందునుగాక'' అన్న తలంపుతో స్మృత్యుపస్థానాన్ని అభ్యసించాలి. ''నేను యితరులను రక్షించుదునుగాక'' అన్న తలంపుతో స్మృత్యుపస్థానాన్ని అభ్యసించాలి. తనను తాను రక్షించుకోవడం ద్వారా యితరులను రక్షిస్తాడు. తనను తాను రక్షించడం ద్వారా యితరులను రక్షించడమెలా? తిరిగి తిరిగి స్మృతిని అభ్యసించడం ద్వారా, ధ్యానంలో సాధించిన అభివృద్ధి ద్వారా, తరచుగా అందులో నిమగ్నుడవటం వలన. ఇతరులను రక్షించడం ద్వారా తనను తాను రక్షించుకోవడం యెలా? ఓరిమి, అహింస, మైత్రి, కరుణల ద్వార (సంయుక్తనికాయము).

**ఆత్మోద్ధరణ** : స్మృత్యుపస్థానము ఆత్మోద్ధరణకు కావలసిన సందేశము. నిజానికి ఆత్మోద్ధరణయే నిజమైన సహకారము. అవసరమైనపుడు వ్యక్తికి యితరుల సహకారము, ఉపదేశము, సలహా, సానుభూతి, ఔదార్యము ముఖ్యమే అయినప్పటికి తనకు తాను సహాయపడినపుడే అంటే వాటిని హృదయ పూర్వకంగ అంగీకరించి వినియోగించుకో గలిగినప్పుడే అవి వినియోగపడుతాయి. ''కృషి నీవే చేయాలి, మహనీయులు మార్గం చెబుతారు''. అని చెప్తుంది ధర్మపథం. బుద్ధుని ముఖాన చిందులు తొక్కే చిరునవ్వు కూడా ''నీవు యిట్టి స్థితిని పొందగలవు. అమృతత్వానికి ద్వారాలు తెరచే ఉన్నాయి''

అన్న భావాన్ని వ్యక్తం చేస్తుంది. బుద్ధుడు జ్ఞానం పొందగానే చాటాడు, ''దోషాన్ని పరిహరించుకొన్న మహనీయులు నావలెనే విజయం సాధిస్తారు'' అని.

బుద్ధుడు మార్గాన్ని చెప్పారు - అంతేగాక ఆ మార్గాన పయనించే సాధకుడు సంపాదించవలసిన సామగ్రిని కూడ సూచించారు. ఈ సామగ్రియంతా నిజంగా తనలోనే ఉన్నదని, మానవుడు ఆత్మోద్ధరణకు సమర్థుడని బుద్ధుడెన్నో మాట్లు నొక్కి చెప్పారు. ఈ సామగ్రిని గురించి యెంతో సరళంగ, సంపూర్ణంగా చెప్పబడిన సూత్రమే స్మృత్యుపస్థాన సూత్రము. దాని సారాంశమే ''స్మృతిని కల్గియుండు'' అన్న మాటల్లో క్లుప్తంగా చెప్పవచ్చు. అంటే ఈ మనస్సును నీవు గుర్తించు. కారణం మనసులోనే అంతా ఉంది. దుఃఖము, దాని ఉత్పత్తి, దాని వినాశము, అందులకవసరమైన మార్గం. వీటిలో యేది ప్రబలంగా ఉంటుందనేది కూడా మన మనస్సుమీదనే ఆధారపడుతుంది. 'గడుస్తున్న క్షణంలోనే మనస్సు చేస్తున్న పనులు యెటువైపుగా సాగుతున్నాయి' అన్న దానిమీద మనసులో 'పై నాల్గింటిలో యేది ప్రబలియున్నది' అన్నదానిమీద ఆధారపడుతుంది.

''నిన్ను నీవే ఉద్ధరించుకోవాలి'' అని చెబుతుంది స్మృత్యుపస్థానము. కాని తనపై తానే ఆధారపడగల సామర్థ్యాన్ని క్రమంగా పెంపొందించుకోవాలి. కారణం మానవులు మనస్సనే ఉపకరణాన్ని యెలా ఉపయోగించుకోవాలో తెలియక యితరులపైన, అలవాట్లపైన ఆధారపడ్డారు. ఇలా అశ్రద్ధకు గురికావడంవల్ల మనస్సు అనే అద్భుతమైన పరికరం నమ్మికోడానికి వీలులేనిదిగా తయారైంది. అందుకని స్మృత్యుపస్థానము, ఆత్మనిగ్రహము అనే పద్ధతి యెంత బలహీనునికైనా ఉపకరించే రీతిన సరళంగా చెప్పబడింది.

స్మృత్యుపస్థానము మనస్సు యొక్క అతి ప్రాథమికమైన 'క్రియ' అయిన స్మృతి లేక గుర్తింపు అన్నదానితో ఆరంభమౌతుంది. ఈ క్రియ యెంత సుపరిచితమో సన్నిహితమో అయ్యిందంటే యెవడైనా దానిని ఆధారంగా తీసుకొని ఆత్మోద్ధరణకనువైన సాధనను కొనసాగించవచ్చు. ఆ స్మృతి లేక యెరుకచేత గుర్తింపబడే మొదటి విషయాలు, నిత్యజీవిత క్రియలు వీటిని గుడ్డిగ, అలవాటు ప్రకారం గుర్తించటం మాని మరింత సన్నిహితంగా పరిశీలించి వాటిని మరింత సంకీర్ణం చేయటమే స్మృతి సాధనలో జరిగేది. ఈ విధంగా సాధన వల్ల నిత్యజీవితం సంకీర్ణమౌడం వల్ల - అంటే శ్రద్ధా, జాగరూకలతో కూడినదౌటం వల్ల ఆత్మోద్ధరణసాధనలో సాధకుడికెంతో ప్రోత్సాహం లభిస్తుంది.

మానసిక స్థితిలో కూడ యెంతో అభివృద్ధి కలుగుతుంది. క్రియ, యోచనలు, ఆత్మనిగ్రహంతో కూడినవౌటం వల్ల చిత్తం శాంతిస్తుంది. వెనుక ఉన్న అసంతృప్తి, చీకాకు, కొఱతల స్థానంలో స్వస్థతకలుగుతుంది.

ఇంకొంచెం సాధన కొనసాగాక నిత్యజీవితంలోని సామాన్య విషయాలు కూడ మహత్తరమైన జ్ఞానాన్ని బోధించేవిగా మారుతాయి. బుద్ధ ధర్మం యొక్క గంభీర సత్యాలన్నీ ప్రత్యక్షానుభవమౌతాయి. తన మనస్సు యొక్క సామర్థ్యం పై తనకెంతో విశ్వాసము, ధైర్యము యేర్పడతాయి.

సమ్యక్ స్మృతి కలిగినపుడు మనోవాక్కాయ కర్మలన్నీ దాని ఆధీనంలోకి రావడం వలన నిత్యజీవితంలో అనాలోచితంగ, అలవాటు ప్రకారం ఉద్భవించే చిక్కులను నివారించుకోవడం చేతనౌతుంది. అంటే నిత్యజీవితం చిక్కులులేనిదిగా రూపొందుతుంది.

**బుద్ధుడు మార్గాన్ని చెప్పారు - అంతేగాక ఆ మార్గాన పయనించే సాధకుడు సంపాదించవలసిన సామగ్రిని కూడ సూచించారు. ఈ సామగ్రియంతా నిజంగా తనలోనే ఉన్నదని, మానవుడు ఆత్మోద్ధరణకు సమర్థుడని బుద్ధుడెన్నో మాట్లు నొక్కి చెప్పారు. ఈ సామగ్రిని గురించి యెంతో సరళంగ, సంపూర్ణంగా చెప్పబడిన సూత్రమే స్మృత్యుపస్థాన సూత్రము.**

నానాటికి చిక్కు సమస్యలను పెంచుకుంటూ కృత్రిమమైన తంతులపై ఆధారపడేదిగా తయారౌతున్న ప్రపంచానికి తిరిగి సహజత్వము, సమస్యారహితతత్వాన్ని ప్రసాదిస్తుంది స్మృత్యుపస్థానము. ఇందువల్ల జీవితం సుగమం అవటమే కాక సాధనలో కూడా స్వయంప్రతిపత్తినిస్తుంది. అంతేగాక యీలోపల యిటువంటి కష్టమైన చిక్కు, ప్రపంచంలో సాధకుడికి సమస్యనెదొర్కొనే సామర్థ్యానికి పెంచుతుంది. ఔచిత్యాన్ని గూర్చిన శ్రద్ధ అవగాహన ద్వారా ప్రాపంచికము, నైతికము అయిన విషయాలన్నింటినీ ఆత్మనిగ్రహంతో సకాలంలో నిర్వర్తించడం ద్వారా వాటి నన్నింటినీ

వాటికతీతమైన ప్రయోజనానికి అనుగుణంగా మార్చుకొనేలా చేస్తుంది.

అవసరాలను సముచితమైన రీతిలో పరిమితం చేయడమే స్మృత్యుపస్థానం యొక్క ఆదర్శం. నూతనమైన అవసరాలను కల్పించి, ప్రచారం చేసి పెంచేటువంటి ఆధునిక రీతుల దృష్ట్యా యిది యెంతో అవసరం. ఈ ఆధునిక వైఖరే సాంఘిక ఆర్థిక రంగాలలో పనిచేసినపుడు యుద్ధానికి ప్రథమ కారణమైన ఆశలు, దానికి ఉపకరణాలు కల్పిస్తుంది. ఈ విధంగ నానాటికి పెరిగే ఊహాజనితాలకు ప్రభావాలకు, లోబడే మనస్సు స్వయం ప్రతిపత్తి కలది యెలా కాగలదు. స్వయం ప్రతిపత్తి కలగాలంటే ఈ కృత్రిమమైన అవసరాలకు లోబడకుండడం అవసరం.

సాధన ఆరంభంలో సాధకుడు ధ్యానస్థితికి లేక మానసిక స్థితికి, నిత్యజీవితంలోని స్థితికి గల వ్యత్యాసం పట్ల ఆందోళపడడము జరుగుతుంది. స్మృత్యుపస్థానం వలన యీ వ్యత్యాసం తగ్గించబడుతుంది. క్రమంగ జీవితం, సాధన సమైకర్యము చెందుతాయి. ఈ సౌలభ్యం తెలియక నిరుత్సాహంతో ఆధ్యాత్మిక జీవితాన్ని విడచి యిట్టి విషయవాంఛలకు తావివ్వడం అన్యమైన, అతీతమైన శక్తేదో తమనుద్ధరించాలని తలచటం జరుగుతుంది. ఈ బలహీనత స్మృత్యాపస్థానసాధకులకు కలుగదు.

మనస్తత్వ శాస్త్రవేత్తలు మనస్సులో మూడు స్థాయిలుంటాయని చెబుతారు. ప్రజ్ఞ (Conscious), పాక్షిక ప్రజ్ఞ (Sub-conscious), ప్రజ్ఞారహితము (un-conscious). మానసికమైన అనేక చిక్కులకు యీ పాక్షిక ప్రజ్ఞాస్థాయి కారణం. కేవల శ్రద్ధ ద్వారా ఆ పాక్షిక ప్రజ్ఞాస్థాయితో సన్నిహితమైన పరిచయము, అవగాహన యేర్పడతాయి. స్మృతిని దానివైపు తిప్పటం వలన, దానిపై వ్యాపింపజేయటం వలన ప్రజ్ఞాస్థాయి కనుగుణంగ ఉండేటట్లు పాక్షిక ప్రజ్ఞను సంస్కరిస్తుంది. నిగ్రహం దానికి గూడా వ్యాపిస్తుంది.

స్వయం ప్రతిపత్తిని సాధించటానికి స్మృత్యుపస్థాన మార్గంలో బాహ్యమైన ఉపకరణాలేమీ అవసరం లేదు. నిత్యజీవితమే దాని క్రియారంగము, దాని విషయము. రహస్యమైన యీ ఉపదేశాలు, గుప్తమైన ఎట్టి విజ్ఞానము, కర్మకాండలతో దానికెట్టి సంబంధము లేదు. తన సామర్థ్యంతోనే తాను బుద్ధత్వం పొందుతాడు.

ఈ మార్గంలో సామాన్య జీవిత పరిస్థితులే సాధనకుపకరిస్తాయి. కనుక సంపూర్ణమైన యేకాంతము, సన్యాసము అవసరంలేదు. కొందరు వీటినాశ్రయించిన

**బుద్ధుడు తన నిర్యాణానికి ముందు ఆనందుడితో చెప్పారు, ''శిష్యుడు మార్గము, లక్ష్యాల గూర్చిన పరిజ్ఞానాన్ని గురువు నుండి విన్నాక అతని సాధన సఫలం కావడానికి రెండు నియమాలను పాటిస్తేచాలు. ఒకటి సాధన ప్రారంభించటము, రెండు కొనసాగిస్తూండటము''.**

అది కేవలం వ్యక్తిగతమైన అవసరం, కోరిక మాత్రమే. అయినప్పటికి అప్పుడప్పుడు కొద్ది యేకాంతమును అభ్యసించటం నిర్దుష్టమైన సాధనకు దాని వేగాన్ని పెంచటానికి సహకరిస్తుంది.

కర్మ సిద్ధాంతం మీద ఆధారపడటం వల్ల తన కర్మ ఫలితానికి తానే బాధ్యుడనని తెలుసుకోవటం వల్ల తనను వేరొక దైవకృప రక్షిస్తుంది అనే విశ్వాసంతో గాని, తన తరపున మరొకరు పూజా పునస్కారాలు చేసి తనకు ఫలితాన్ని ప్రసాదిస్తారన్న విశాసాలతో యీ సాధనకెట్టి సంబంధమూ లేదు. తన ముక్తిని తానే సాధించుకొనే పద్ధతి స్మృత్యుపస్థానము.

ఈ మార్గంలో దేన్నీ నమ్మవలసిన పనిలేదు. బాహ్యమైన యే యితర ఆధారాలు అవసరంలేదు. స్వానుభవం వల్ల కలిగిన అవగాహనమీదనే ఆధారపడుతుంది. సత్యమైన జ్ఞానానికి జీవనాడియైన ప్రత్యక్షానుభవాన్ని యెలా పరిశుద్ధం చేసుకోవాలో విస్తారము, అగాధము చేసుకోవాలో నేర్పుతుంది. బుద్ధుడియొక్క ఉపదేశాన్ని కూడ సాధకుడు తన కంటే ముందు ఆ మార్గాన్ని సంపూర్ణంగ అనుసరించి స్వానుభవంతో యిచ్చిన వివరమైన సూచనలుగ మాత్రమే స్వీకరిస్తాడు. అయినా యెంత వరకు తనకనుభవగతమౌతుందో అంతవరకే ఆ ఉపదేశం తన అనుభవం చేత నిరూపించబడిన నిజమైన జ్ఞానంగా రూపొందుతుంది. బుద్ధుడు తన నిర్యాణానికి ముందు ఆనందుడితో చెప్పారు, ''శిష్యుడు మార్గము, లక్ష్యాల గూర్చిన పరిజ్ఞానాన్ని గురువు నుండి విన్నాక అతని సాధన సఫలం కావడానికి రెండు నియమాలను పాటిస్తేచాలు. ఒకటి సాధన ప్రారంభించటము, రెండు కొనసాగిస్తూండటము''.

– సశేషం

# వార్తాలాపము

నవంబరు సంచిక తరువాయి

### వైరాగ్యము

ఇట్టి ఆలోచనలలో మునిగిన వ్యక్తికి సాంసారిక సుఖములయందు ఆనందము ఎట్లు లభించును? నశ్వరములును, క్షణికభోగముకలిగి భూతకాలపు స్మృతిమాత్రముగా నారిపోవునట్టివియును, వార్ధక్యమును, రోగమును, మృత్యువును సమీపించునట్టివియును, వియోగముచే శోకమును కలుగజేయునట్టివియును అగు సుఖములనుండి ఆయన మనస్సు వెనుకకు మరలెను. ఇంత ప్రియవ్యక్తి మృతినొందుటకు సిద్ధముగానుండగా దీపావళినాడు పగలు పిండివంటలు ఎట్లు రుచించును? రాత్రి దీపములు వెలిగించునిచ్ఛ ఎవరికి కలుగును? అటులనే సిద్ధార్థుడు తన శరీరము జరా, వ్యాధి, మృత్యువులను చేరుటకు వలయు రూపాంతరములను నిమిషనిమిషమునకు పొందుచుండుట చూచి సుఖానుభవమునుండి విరక్తిని పొందెను. అంతకంతకు తన సమీపమునకు వచ్చిన ప్రతివస్తువును తన బంధుమిత్రులు, దాసదాసీజనములతో సహా అందరు వ్యక్తులును అట్టి సుఖములకొరకే వెర్రిగా తిరుగుచుండుట చూచి ఆయన హృదయము కరుణాతరంగిత మయ్యెను. ''జనులు ఇంత జడత్వమును ఏల పొందియున్నారు? ఏల ఆలోచించుటలేదు? ఐహిక పారలౌకికములగు తుచ్ఛసుఖములకొరకు ఇంత ఆతురతతో నెందుకు ఉన్నారు? కాని ఈ విషయములను తెలియజెప్పుట ఎట్లు? ఈ సుఖమునకు ప్రత్యాయముగా వేరొక నశ్వరముకాని సుఖమును శోధించి తెలిపినప్పుడే ఇందు కృతకృత్యుడనగుదును. ముక్తిని పొందించు సుఖమును అన్వేషించెదను. నాహితముకొరకు ఈ సుఖమును వెతుకవెలను. నా ప్రియజనులయందలి యథార్థమగు ప్రేమను వ్యక్తము చేయవలెనినను ఈ సుఖమును శోధించవలెను.''

ఈ విధమగు ఆలోచనలతో కొంతకాలము జరిగెను. అంతట నిండుయౌవనమున తల్లిదండ్రుల అంగీకారములేకపోయినను దారా పుత్రులకు ఎరుకపరచకుండ ఇంటినుండి ఆయన బయలువెడలెను. ముండనము చేయించుకొని, కాషాయము ధరించి నిత్యసుఖమును శోధించదొడగెను.

### తపము

ఇంటినుండి సిద్ధార్థుడు కడుదూరము వెళ్లిపోయెను. చర్మకారుడు మొదలు బ్రాహ్మణుడవరకునున్న ఎల్లజాతుల జనులనుండియును లభించిన భిక్షను ఒకే పాత్రమున భుజించసాగెను. ఇట్టి ప్రవర్తన ఆరంభమున ఆతనికి చాల అసహ్యముగా తోచెను. కాని ఆయన మనస్సునకు ఇట్లు నచ్చ చెప్పెను: ''ఓ జీవుడా! నిన్ను సన్యసించమని ఎవడును బలవంతము చేయలేదు. నీయంతట నీవు ఈ వేషమును వేసికొంటివి. రాజసంపదను ఆనందముతో త్యజించితివి. ఇప్పుడు భిక్షాన్నమును తినుటకు అంత అసహ్యించుకొనుచున్నావేమి? మానవునకును మానవునకు భేదమును చూపుట చూచి నీకు బాధకలిగెను కదా! కాని ఇప్పుడు హీనకులజుని అన్నము తినవలసి వచ్చినప్పుడు ఆతనియందు కరుణ కలుగుటకు బదులుగా అసహ్యము ఏల కలిగినది? సిద్ధార్థుడా! ఈ దౌర్బల్యమును విడనాడుము. సుగంధయుక్త మగు ఆహారమునకును హీనకులజులు అర్పించిన ఆహారమునకును నీవు భేదమును పాటించరాదు. ఈ స్థితిని నీవు పొందినచో నీ సన్యాసము సఫలమగును.

## ఇరువది ఎనిమిదవ ప్రసంగము

రాత్రిభోజనానంతరము తొమ్మిదిగంటలకు స్వామివారి చెంతకు అందరును చేరిరి. అంతట పెద్దవిద్యార్థి ప్రశ్నించెను. "జ్ఞానమును సంపాదించుటకు గురువు అవసరమా? కాదా?''

**జ్ఞానమును పొందుటకు గురువు అవసరము.**

స్వా.ప్ర.: శంకరులు పార్వతితో చెప్పిరి.

యద్యప్యధీతాః నిగమాః షడఙ్గాన్యాగమాః ప్రియే।
అధ్యాత్మాదీని శాస్త్రాణి జ్ఞానం నాస్తి గురుం వినా॥

''చతుర్వేదములు, షడంగములు, ఆగమములు, అధ్యాత్మాది శాస్త్రములును చదివినను గురువు లేనిదే జ్ఞానము కలుగదు.'' ఛాందోగ్యోపనిషత్తునందు కథ ఉన్నది.

ఒక సమయమున నారదుడు సమిత్పాణియై సనత్కుమారుని సమీపించి ప్రార్థించెను, ''ఓ మహాత్మా! తమరు నాకు బ్రహ్మవిద్యను ఉపదేశించుడు''.

సనత్కుమారుడు పలికెను, ''నీకు బ్రహ్మ విద్యను గురించి తెలిసిన దంతయును నాకు వివరించుము. పిమ్మట నీకు తెలియనిదేమైన ఉన్నచో చెప్పెదను''. నారదుడు పలికెను,

''ఋగ్వేదం భగవో2ధ్యేమి యజుర్వేదం సామవేదమాథర్వణం చతుర్థమితిహాసపురాణం పఞ్చమం వేదానాం వేదం పిత్ర్యం రాదిందైవం నిధిం వాకోవాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూత విద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్పదేవజనవిద్యాం ఏతద్భగవో2ధ్యేమి॥

''స్వామీ! నేను ఋగ్వేదము చదివితిని. యజుర్వేదము, సామవేదము, నాలుగవదగు అథర్వణవేదము, ఇతిహాసపురాణమగు పంచమవేదము, వేదముల వేదము (వేదములను తెలిసికొనుటకు సాధనమగు వ్యాకరణము), శ్రాద్ధకల్పము, గణితము, ఉత్పాతజ్ఞానము, నిధిశాస్త్రము, తర్కశాస్త్రము, నీతిశాస్త్రము, నిరుక్తము, వేదవిద్య, శిక్ష, కల్పము,ఛందశ్శాస్త్రము, చితిశాస్త్రము - (అగ్నిహోత్రాగ్నిని సమకూర్చు విద్య) భూతంత్రము, ధనుర్వేదము, జ్యోతిషము, సర్పవిద్య (గారుడము) దేవజనవిద్య (గంధధారణ సామర్థ్యము, నృత్యము, గీతము, వాద్యము, శిల్పము) మొదలగు విజ్ఞానములనన్నిటిని ఎరుగుదును''. ''అయిన నీవు సర్వజ్ఞుడవు, స్వతంత్రుడవు, కృతార్థుడవు'' అని సనత్కుమారుడు పలికెను. నారదుడు తిరిగి పలికెను,

''సో2హం భగవో మన్త్రవిదేవాస్మి నా22త్మవిచ్ఛ్రుతం హ్యేవమే భగవద్దృశేభ్యస్తరతి శోకమాత్మవిదితి సో2హం భగవః శోచామి తం మా భగవచ్ఛోకస్య పారంతారయత్విితి తం హోవాచ యద్వై కించైతదధ్యగీష్ఠా నామైవైతత్॥''

''ఓ మహాత్మా! నేను మంత్రములను (కర్మలను) మాత్రమే ఎరుగుదును. ఆత్మవేత్తను కాను. ఆత్మజ్ఞాని అకృతార్థబుద్ధిరూపమగు మనఃపరితాపమును అధిగమించునని తమవంటివారల నుండి వింటిని. ఓ మహానుభావా! నేను ఆత్మజ్ఞానిని కానందున అకృతార్థబుద్ధితో సర్వకాలములయందును బాధపడుచున్నాను. నన్ను ఈ శోక సాగరము నుండి తరింపజేయుడు''.

సనత్కుమారుడు చెప్పెను : నీవు తెలిసికొన్న దంతయును నామమాత్రము. జనులు విష్ణుబుద్ధితో విగ్రహమును ఉపాసించునట్లు నీవు (1) నామమును ఉపాసించుము. నామము బ్రహ్మము అని ఉపాసించువారికి నామవిషయమునందు ఇష్టానుసారము ప్రవృత్తి కలుగును. అనగా నామోపయోగము క్రమబద్ధమగును. ఈ ఉపదేశమునువిని నారదుడు ప్రశ్నించెను. ''బ్రహ్మదృష్టి కలుగుటకు నామముకంటె మించినది ఏదైన కలదా?'' సనత్కుమారుడు జవాబు చెప్పెను. ''ఉన్నది. శబ్దములను ఉచ్చరించు (2) వాక్కు నామముకంటె మించినది.'' వాక్కును బ్రహ్మముగా నెరిగి నారదుడు తిరిగి ప్రశ్నించెను. ''వాక్కుకంటె మించినది వేరొండు కలదా?'' సనత్కుమారుడు చెప్పెను. ''కలదు. వాక్కుకంటె మించినది (3) మనస్సు. మనస్సు అనగా వివక్షాబుద్ధిస్వరూపమగు అంతఃకరణ ప్రవృత్తి. అది వాక్కు యొక్క ప్రేరకము. ఏలనన వివక్షాబుద్ధిలేనిచో వాక్కు ఉచ్చరించబడదు. కావున మనోబ్రహ్మమును ఉపాసించుము. అట్టివానికి మానసిక విషయములయందు ఇష్టానుసారము ప్రవృత్తి కలుగును. (మనోనిరోధము జరుగును).

నారదుడు తిరిగి ప్రశ్నించెను. ''మనస్సుకంటె మించినది ఏదైన కలదా?''. సనత్కుమారుడు చెప్పెను, ''మనస్సుకంటె మించినది (4) సంకల్పము. సంకల్పము అనగా విషయములను కర్తవ్యములుగను, అకర్తవ్యములుగను విభజించు అంతఃకరణవృత్తి. సంకల్పముచే జగమంతయును సామర్థ్యమును పొందును. సంకల్పం బ్రహ్మమును ఉపాసించువానికి సంకల్పవిషయములయందు ఇష్టానుసారము ప్రవృత్తి కలుగును. కావున సంకల్పమును బ్రహ్మబుద్ధితో ఉపాసించుము.'' అట్లు ఉపాసించి నారదుడు మరల ప్రశ్నించెను. ''బ్రహ్మదృష్టి కలుగుటకు సంకల్పముకంటె మించినది వేరొకటి కలదా?''

సనత్కుమారుడు సమాధానము చెప్పెను. ''(5) చిత్తము సంకల్పముకంటె మించినది. చిత్తమనగా లబ్ధపదార్థములను అవగతము చేసికొను సామర్థ్యము అను అంతఃకరణవృత్తి. ఈ వృత్తి లేనిదే సంకల్పము అసంభవము. కావున సంకల్పము కంటె చిత్తము మించినది. కావున చిత్తబ్రహ్మమును ఉపాసించుము. పిమ్మట చిత్తవిషయములందు ఇష్టానుసారము ప్రవృత్తి కలుగును'' అట్లు ఉపాసించి నారదుడు అడిగెను.

''బ్రహ్మదృష్టికి చిత్తముకంటె మించిదని వేరొకటి కలదా?'' సనత్కుమారుడు సమాధానము చెప్పెను. ''లేకేమి? చిత్తముకంటె

మించినది (6) ధ్యానము: ధ్యానమనగా శాస్త్రము ద్వారా దేవతాదులను ఆలంబనములుగా భావించు వృత్తి. ఆలంబనము అను ఏకాగ్రతావృత్తి లేనిదే చిత్తనిశ్చలతకు తావులేదు. కావున ధ్యానదృష్టితో బ్రహ్మమును ఉపాసించుము. ధ్యానబ్రహ్మమును ఉపాసించువానికి తత్త్వమునకు సంబంధించిన పదార్థము లన్నియును లభించును''. ఇట్లుధ్యానబ్రహ్మోపాసనమును తెలిసికొని నారదుడు అడిగెను. ''ధ్యానముకంటె మించినది ఏమైన కలదా?''

సనత్కుమారుడు సమాధానము చెప్పెను:

''(7) విజ్ఞానము ధ్యానముకంటె మించినది. విజ్ఞాన మనగా శాస్త్రాదివిషయకమగు జ్ఞానము. అర్థజ్ఞానం లేనిదే ధ్యానము అసంభవము. శివుడు, విష్ణువు మొదలగు వ్యక్తులరూపము అనుఅర్థము తెలియనిదే ధ్యానము జరుగదు. కావున ధ్యానముకంటె విజ్ఞానము శ్రేష్ఠమైనది. కావున విజ్ఞానరూపమగు బ్రహ్మమును ఉపాసించుము. పిమ్మట విజ్ఞానమునకు సంబంధించిన పదార్థములన్నియును లభించును''. అట్లు ఉపాసించి నారదుడు తిరిగి ప్రశ్నించెను. ''విజ్ఞానముకంటె మించినది వేరొకటి కలదా?'' సనత్కుమారుడు చెప్పెను. ''విజ్ఞానముకంటె మించినది (8) శారీరక బలము. వందమంది జ్ఞానులను ఒక శారీరిక బలసంపన్నుడు కంపింపజేయును. కావున నీవు బలబ్రహ్మమును ఉపాసించుము. అట్లు చేయువానికి బలమునకు సంబంధించిన పదార్థములు అన్నియును లభించును''. బలబ్రహ్మోపాసనానంతరము నారదుడు మరల ప్రశ్నించెను. ''బలముకంటె మించినది వేరొకటికలదా?'' సనత్కుమారుడు సమాధానము చెప్పెను. ''బలమునకు మించినది (9) అన్నము. అన్నము లేనిదే బలము కలుగదు. పదిరోజులు అన్నము తిననిచో పూర్తిగా దుర్బలుడగును. ఏమియును చేయలేడు. కావున బలమునకు కారణము అన్నము. ఆ అన్నమును నీవు బ్రహ్మరూపమున ఉపాసించుము. ఇట్లు చేసినవానికి అన్నవిషయకమగు పదార్థములన్నియును లభించును''. అన్న బ్రహ్మోపనానంతరము నారదుడు తిరిగి ప్రశ్నించెను.

''అన్న బ్రహ్మమునకు మించినది వేరొకటి కలదా?'' సనత్కుమారుడు జవాబు చెప్పెను. ''అన్నముకంటె మించినది (10) జలము. జలములేనిదే అన్నము పండదు. అల్పవృష్టిచే తక్కువ అన్నము పండును. సువృష్టిచే బాగుగా అన్నము (ఆహారపదార్థములు) పండును. కావున జలబ్రహ్మమును అట్లు ఉపాసించుము. ఉపాసించువాడు జలమునుండి ఉద్భవించు విషయములన్నిటిని పొందును''.

జలబ్రహ్మోపాసనానంతరము ''బ్రహ్మదృష్టికి జలబ్రహ్మము కంటె మించినది వేరొకటి ఏమి?'' అని ప్రశ్నింప సనత్కుమారుడు చెప్పెను. ''జలమునకు మించినది (11) తేజస్సు. తేజము వాయువును గ్రహించి ఆకాశమున వ్యాపించినప్పుడు ఈ తాపముచే ఇక వర్షము వచ్చును అని జనులు చెప్పెదరు. కావున తేజము జలము కంటె మించినది. కావున తేజోరూపముకల బ్రహ్మమును ఉపాసించుము. దానిని ఉపాసించువానికి తేజస్సునకు సంబంధించిన విషయములు అన్నియును లభించును.'' తేజోబ్రహ్మోపాసనానంతరము నారదుడు మరల ప్రశ్నించెను.

''బ్రహ్మోపాసనకు తేజస్సునకు మించినదేది?'' అని అడుగగా ''తేజమునకు మించినది (12) ఆకాశము. ఏలనన ఆకాశమునందు తేజోవంతమగు పదార్థములు అన్నియు సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, నక్షత్రములు మొదలగునవి దృగ్గోచరము లగును. కావున తేజమునకు మించినది ఆకాశము. నీవు ఆకాశమును బ్రహ్మరూపమున ఉపాసించుము. ఆ విధముగ చేయుటచేత ద్విషయకములగు పదార్థములన్నియు నీవశమగును'' అని జవాబు చెప్పెను.

''ఆకాశబ్రహ్మముకంటె మించినది బ్రహ్మదృష్టి కలుగుటకు వేరొకటి ఉన్నదా?'' నారదుడు అని ప్రశ్నించెను. సనత్కుమారుడు జవాబు చెప్పెను. ''ఆకాశమునకు మించినది (13) స్మరణము. ఇంత వరకు కార్యకారణభావరూపమున ఉత్తరోత్తరము వ్యాపకమగు పదార్థములయందు బ్రహ్మదృష్టిని కలుగజేసితిని. ఇప్పుడు తద్భిన్నమగు నిమిత్తనైమిత్తిక భావరూపమును తెలుపుదును. స్మరణములేనిదే ఏ వ్యవహారము కూడ సంభవము కాదు. కావున ఆకాశముకంటె స్మరణము శ్రేష్ఠము. ఆ స్మరణమునందు బ్రహ్మదృష్టిని పొందుము. స్మరణమునందు బ్రహ్మదృష్టిని పొందినవానికి తద్విషయములు లభించును''. స్మరణ బ్రహ్మమును ఉపాసించిన తరువాత నారదుడు అడిగెను. ''బ్రహ్మోపాసనకు స్మరణముకంటె మించినది వేరొకటికలదా?''

సనత్కుమారుడు జవాబు చెప్పెను. ''స్మరణముకంటె మించినది (14) ఆశ. అంతఃకరణమున వృద్ధిని పొందిన విషయములు అన్నియును ఆశ లేనిదే స్మరించబడవు. ఋగ్వేదాదులను అధ్యయనము చేయవలెనను ఆశ ఉన్నచో ఆ అధ్యయన విషయముల స్వాధ్యాయము తరచు చేయవలెను. కావున నీవు ఆశాబ్రహ్మమును ఉపాసించుము. దానిచే నీకు ఆ విషయమునకు చెందిన పదార్థములన్నియును లభించును''. ఆశాబ్రహ్మమును ఉపాసించి ప్రశ్నించెను.

''ఆశకంటె మించినది కలదా?'' సనత్కుమారుడు సమాధానము చెప్పెను ''ఆశకంటె (15) ప్రాణము మించినది. ఈ విషయమున శ్రుతిని పరికింపుడు.

''ప్రాణో వా ఆశాయా భూయాన్ యథా వా అరా నాభౌ సమర్పితా ఏవమస్మిన్ ప్రాణే సర్వం సమర్పితం ప్రాణః ప్రాణేన యాతి ప్రాణః ప్రాణం దదాతి ప్రాణాయ దదాతి ప్రాణో హ పితా ప్రాణో మాతా ప్రాణో భ్రాతా ప్రాణః స్వసా ప్రాణ ఆచార్యః ప్రాణో బ్రాహ్మణః॥''

''ప్రాణమే ఆశకంటె మించినది. చక్రము యొక్క కుంచములో ఆకులు ఇమిడియున్నట్లు ఈ సమష్టి ప్రాణమునందు జగమంతయు ఉన్నది. ప్రాణము ప్రాణముచే సంచరించును. ప్రాణము ప్రాణము నిచ్చును. ప్రాణము తండ్రి, ప్రాణము తల్లి, ప్రాణము సోదరుడు, ప్రాణము సోదరి, ప్రాణము ఆచార్యుడు, ప్రాణము బ్రాహ్మణుడు''.

మూర్ఖుడు ఎవడైన తన తండ్రి, తల్లి, సోదరుడు, సోదరి, ఆచార్యుడు, బ్రాహ్మణుడు మొదలుగవారి పట్ల అనుచితప్రవర్తనను కలిగి యున్నచో వానిని నిందించెదరు. కాని శరీరమునుండి ప్రాణము పోయిన తరువాత ఆ శరీరమును దహించినను, దాని అవయవములను ఛేదించినను అతడు హంతకుడుగ పేర్కొనబడడు. కావున ఇదంతయును ప్రాణమే. ప్రాణమే అన్ని అనుభవములను, చింతనములను, నిశ్చయములను చేయును. అదియే అతివాది. నామము మొదలుకొని ఆకాశము వరకు గల జగమునంతను అతిక్రమించి జగమంతకును ఆత్మను నేను అని చెప్పును. ''వీని అన్నిటికంటెను మించినది ప్రాణమే. దీనికి మించినది ఏమియు లేదు'' అనుకొని నారదుడు ఇక ప్రశ్నించలేదు.

అనంతరము సనత్కుమారుడు అనుగ్రహించి మిథ్యాజ్ఞానము నుండి అతనిని తప్పించి సత్యాదులను ఉపదేశించెను.

సత్యోపదేశము.

''ఏషతు వా అతివదలి యః సత్యేనాతివదలి సో2హం భగవః సత్యేనాతివదానీతి సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి సత్యం భగవో విజి జ్ఞాస ఇతి॥''

''ప్రాణమును తెలిసికొనినవాడు నిజమునకు అతివాది కాడు. సత్యాతివాదియే నిజమగు అతివాది''. అని సనత్కుమారుడు చెప్పినంతనే నారదుడు ప్రశ్నించెను. ''నేను సత్యాతివాదినగు విధమును తెలుపుము''. శ్రేష్ఠమగు సత్యమే తెలిసికొనదగినది. కావున నేను ఆ సత్యమును తెలిసికొనగోరుచున్నాను. తరువాత విజ్ఞాన ప్రాముఖ్యమును సనత్కుమారుడు ఉపదేశించెను.

''యదా వై విజానాత్యథ సత్యం వదతి నా విజానన్ సత్యం వదలి విజానన్నేవ సత్యం వదతి విజ్ఞానం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి విజ్ఞానం భగవో విజిజ్ఞాస ఇతి॥''

''సత్యమును విశేషముగా నెరిగివారు మాత్రమే సత్యమును తెలుపుదురు. విశేషముగా తెలియనివారు సత్యమును తెలుపలేరు. కావున విజ్ఞానము సత్యముకంటె మించిన జ్ఞాతవ్యవిషయము'' అని సనత్కుమారుడు చెప్పెను. అంతట నారదుడు ప్రశ్నించెను. ''ఓ మహాత్మా! నేను విజ్ఞానమును తెలిసికొనగోరుచున్నాను.

అనంతరము మననము ప్రధానమని చెప్పగోరి ఇట్లుపలికెను.

''యదా వై మనుతే2థ విజానాతి నామత్వా విజానాతి మత్వైవ
విజానాతి మతిస్త్వేవ విజిజ్ఞాసితవ్యేతి మతిం భగవో విజిజ్ఞాసితి॥''

''మననముచే విజ్ఞానము లభించును. మననము చేయనిదే విజ్ఞానము కలుగదు. మననమును తెలిసికొనవలెను'' అని సనత్కుమారుడు చెప్పినతోడనే నారదుడు ప్రశ్నించెను. ''స్వామీ! నేను మననము గురించి వివరముగా తెలిసికొనగోరుచున్నాను''.

పిదప ఆస్తిక్యబుద్ధి అను శ్రద్ధ జ్ఞాతవ్యము అని చెప్పగోరి ఇట్లు ఉపదేశించెను.

''యదా వై శ్రద్ధధాత్యథ మనుతే నా శ్రద్ధన్మనుతే శ్రద్ధదేవ మనుతే శ్రద్ధాత్వేవ విజిజ్ఞాసితవ్యేతి శ్రద్ధాం భగవో విజిజ్ఞాసితి॥''

''శ్రద్ధ ఉన్నచో మననము జరుగును అశ్రద్ధచే మననము జరుగదు. శ్రద్ధావంతుడే మననము చేయును. కావున శ్రద్ధయే ముఖ్యముగా తెలిసికొనదగినది'' ఇట్లు సనత్కుమారుడు చెప్పినంతనే నారదుడు శ్రద్ధను గురించి చెప్పుడని ప్రార్థించెను.

''యదా వైనిస్తిష్ఠత్యథ శ్రద్ధధాతి నానిస్తిష్ఠన్ శ్రద్ధధాతి నిస్తిష్ఠ న్నేవ శ్రద్ధధాతి నిష్ఠాత్వేవ విజిజ్ఞాసితవ్యేతినిష్ఠాం భగవో విజిజ్ఞాస ఇతి॥''

''నిష్ఠావంతునకే శ్రద్ధ కలుగును. నిష్ఠలేనిదే శ్రద్ధలేదు. కావున నిష్ఠశ్రేష్ఠమని తెలియనగును''. అని సనత్కుమారుడు చెప్పెను. అంత నారదుడు ప్రశ్నించెను. ''ఓ స్వామీ! నేను నిష్ఠను గురించి తెలిసికొనగోరుచున్నాను''. సనత్కుమారుడు ''కృతి'' (ఇంద్రియ సంయమము, చిత్తేకాగ్రతయు) తెలిసికొనదగినదని వివరించుచు ఇట్లు చెప్పెను.

''యదా వై కరోత్యథ నిస్తిష్ఠతి నా కృత్వా నిస్తిష్ఠతి కృత్వైవ నిస్తిష్ఠతి ।
కృతిస్త్వేవ విజిజ్ఞాసితవ్యేతి కృతిం భగవో విజిజ్ఞాస ఇతి॥''

''కార్యమును ఆచరించువానికే నిష్ఠకలుగును. చిత్తై కాగ్రత లేనిదే కార్యకర్తలకు నిష్ఠకలుగదు. కావున ''కృతి''ని గురించి ముఖ్యముగా తెలిసికొనవలెను.'' అంతట నారదుడు కృతిని గురించి తెలుపమని ప్రార్థించెను. సనత్కుమారుడు కృతికంటె

శ్రేష్ఠమయినది సుఖమని తెలుపుచు దానిని వివరించెను.

''యదా వై సుఖం లభతేఽథ కరోతి నా సుఖం లబ్ధ్వా కరోతి సుఖమేవ లబ్ధ్వా కరోతి సుఖం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి సుఖం భగవో విజిజ్ఞాస ఇతి॥''

''సుఖమునకు ఇచ్చట నిరతిశయసుఖమని అర్థము. అందరును సుఖముకొరకు ''కృతిని'' ఆచరించెదరు. సుఖరాహిత్యముకొరకు అనగా దుఃఖముకొరకు ఎవ్వరును కృతిని ఆచరించరు. సుఖేచ్ఛచేతనే కృతి - కర్మ జరుగుచున్నది. ఆ సుఖమే శ్రేష్ఠతమమని తెలిసికొనవలెను'' నారదుడు పలికెను. ''ఆ సుఖమును గురించి తెలుపుడు''. అనంతరము భగవానుడు ''భూమ'' అనగా నిరతిశయమగు వస్తువు తెలిసికొనవలెను అని దానిని ఉపదేశించెను.

''యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి భూమైవ సుఖం భూమా త్వేవ విజిజ్ఞాసితవ్య ఇతి భూమానం భగవో విజిజ్ఞాస ఇతి''.

''నిరతిశయమగునదియే సుఖము. అల్పాధిక్యములు తృష్ణా మూలములు. తృష్ణ దుఃఖకారణము. కావున నిరతిశయమును గురించియే బాగుగా తెలిసికొనవలెను'' అని సత్కుమారుడు ఉపదేశించినంతనే నారదుడు పలికెను. ''స్వామీ! నేను నిరతిశయవస్తువును భూమను తెలిసికొనగోరుచున్నాను.'' అప్పుడు సనత్కుమారులు నిరతిశయ వస్తువగు భూమయొక్క బ్రహ్మయొక్క లక్షణము సెలవిచ్చిరి.

''యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమాఽథ యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్ప యో వై భూమా తదమృతమథ యదల్పం తన్మర్త్యం సభగవః కస్మి--- ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని యది వా న మహిమ్నీతి॥''

''ఎచ్చట - ఏతత్త్వమునందు ఇతరములను చూచుటలేదో, ఇతరములను వినుటలేదో, అన్యవిషయములను తెలిసికొనుటలేదో, అనగా ఏది సర్వసంసారవ్యవహార రహితమో అది భూమ. ఏది ఇతరములను చూచునో, ఇతరములను వినునో, ఇతరవిషయములను తెలిసికొనునో అది అల్పము. అది స్వప్నపదార్థములవలె నశించును. తద్విపరీతమును, ప్రసిద్ధమును అగు భూమ అవినాశి. పరిచ్ఛిన్నమగునది నశ్వరము.'' సనత్కుమారుని ఈ వాక్యములను విని నారదుడు ప్రార్థించెను. ''భూమ దేనియందు ఉన్నది?'' సనత్కుమారుడు సమాధానము చెప్పెను. వ్యవహారదృష్టిని చూచిన తన విభూతియందు ఉన్నది అని చెప్పవచ్చును కాని వాస్తవమునకు అది విభూతియందు లేదు. అది ఆశ్రయరహితము, సర్వాధారము. అది దేనిని కూడ ఆశ్రయించి లేదు.

కార్యకారణ భావరూపమగు నామమునుండి ఆకాశపర్యంతము కల వ్యాపకలక్షణ విశిష్టమగు పదార్థములను వివరించిన తదుపరి సనత్కుమారుడు నారదునకు స్మరణము మొదలుకొని సుఖమువరకు గల నిత్య నైమిత్తిక భావరూపమును ఉపదేశించెను. పిమ్మట యథార్థామృత రూపమగు భూమను వివరించెను. ఈ భూమను తెలిసికొనినచో సర్వమును తెలియును. ఏలనన భూమ సర్వాధారము. సర్వాధిష్ఠానము. ఈ భూమరూపమగు చరమోపదేశమునకు పూర్వము చెప్పబడిన నామాదులయందు బ్రహ్మదృష్టితో ఉపాసన చేయవలెననునది అంతయును ప్రతీకోపాసనయే. సంసార దుఃఖపరితప్తుడగు నారదుడు సనత్కుమారునితో ''నేను నామమునే ఎరుగుదును. ఆత్మను ఎరుగను'' అని చెప్పెను. అంతట సనత్కుమారుడు ''ఆ నామమునందే బ్రహ్మదృష్టినిపొందు''మని శాసించెను. అనంతరము నారదుడు సకల నామములయందును బ్రహ్మదృష్టిని నిలిపి ఉపాసించెను. తరువాత నారదుడు నామబ్రహ్మముకంటె మించినదేమైన కలదా అని ప్రశ్నించెను. సమాధానముగా సనత్కుమారుడు క్రమముగా నామబ్రహ్మము మొదలుకొని వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, జలము, తేజము, ఆకాశము, స్మరణము, ఆశ, ప్రాణము, సత్యము, మననము, ఆస్తిక్య బుద్ధి రూపమగు శ్రద్ధ, ఆచార్య సేవారూపమగు నిష్ఠ, కృతి, సుఖము, భూమి ఈ విధముగా ఉత్తరోత్త రాధిక్యముకల పదార్థములయందు బ్రహ్మ దృష్టిని కలుగజేయుచు వానిని ఉపాసించవలసిన అవసరమును తెలిపెను. ఇది ఇంతవరకును మీరు తెలిసికొనియే ఉన్నారు.

నారదుని వంటి వాడు కూడ అంత విద్వాంసుడయినను శోకరహితుడయి ఆత్మవిద్యను తెలిసికొనలేనందుకు సనత్కుమారుని చెంతకు వెళ్లవలసి వచ్చెను. కావున శాస్త్రాభ్యాసమాత్రముచే సూక్ష్మమగు బ్రహ్మవిద్య తెలియరాదు. దానికొరకు అనుభవము కలవానివద్ద ఉపదేశమును పొందితీరవలెను. డాక్టరీ తెలియుటకొరకు మెడికలు కాలేజీలో చదువుకొనినను మంచి అనుభవము కల డాక్టరు వద్ద అభ్యాసము చేయుట అవసరము కాదా? అటులనే బ్రహ్మ విద్యా జ్ఞానము కూడ గురువులేనిదే లభించదు.

– సశేషం

# శ్రీ రమణ విజయం

డిసెంబరు 30న
భగవాన్ శ్రీ రమణ మహర్షి జయంతి
సందర్భంగా ప్రత్యేక వ్యాసం.

''తిరుచ్చిళి'' గ్రామము. 1879 సంవత్సరము సెప్టెంబర్ 29వ తేది. ఆధ్యాత్మిక లోకానికి ఒక దివ్యావతారం భూమిపై వుదయించింది. సుందరం అయ్యర్, అలగమ్మ అనే పుణ్యదంపతులకు వెంకట్రామన్ జన్మించారు. వారి జననమునకుముందె అలగమ్మ దేహములోనుంచి దివ్యకాంతి బయటికి కన్పించి తిరిగి ఆమెలో లయమయిపోతుండేది. అలగమ్మ నిదురిస్తున్నప్పుడు ఒక నీలకాంతి ఆమె చుట్టు పరిభ్రమిస్తుండేది. చిన్నతనములో శ్రీ వెంకట్రామన్ అతిగా నిద్రపోయేవాడు. ఒకసారి అలగమ్మ కుమారస్వామికి నైవేద్యము పెట్టితే ఆకతాయి పనిగా శ్రీ వెంకట్రామన్ తినేశారు. ప్రసాదము కనుపించక ఎవరు తిన్నారు అని అడిగితే ''స్కందుడు తినేశాడు'' అని బదులు చెప్పారు. తన దివ్యత్వాన్ని ముందుగానే ఆ విధముగా సూచించారు శ్రీ రమణులు.

శ్రీ రమణులకు శైవనాయనారుల గ్రంథము ''పెరియ పురాణము'' చదవటము చాలా ఇష్టము. క్లాసు పుస్తకాలు చదవటమంటె, అక్షరాలు కన్పించేవికావు. తనమీద, అన్నగారి మందలింపును అరుణాచలేశ్వరుని ఆదేశముగా తీసుకొని 1896 ఆగష్టు 29న ఇల్లు విడిచిన వెంకట్రామన్ దోవలో ఒక ముస్లిం ఫకీరు సహకారముతో అరుణాచలము చేరారు. కాలుపెట్టిన మరుక్షణమే అపరిమిత ఆనందానుభూతికి లోనైనారు. పోయిన పెన్నిధి దొరికినంత సంబరముగా తన తండ్రిని (అరుణాచలేశ్వరుని) దర్శించారు. ఆ క్షేత్ర ఆచారానుసారము క్షురకర్మ చేయించుకొన్నారు. పైనుండి కురుస్తున్న వర్షములోనే అరుణాచల ఆలయంలోనే తీవ్ర తపఃసమాధిలో మునిగిపోయారు. ఈ లోపున అలగమ్మకు తన కుమారుడు అరుణాచలములో ఉన్నాడని తెలిసింది. పెద్ద కుమారుని, చిన్నకుమారుని తీసుకురమ్మని పంపించింది. వారు ఒట్టి చేతులతో తిరిగివచ్చి ''మన వెంకట్రామనే'' ఉన్నాడు కాని వాడికి మతి పూర్తిగాపోయింది అన్నారు. కాని అలగమ్మ మాతృప్రేమ పొంగిపొరలింది. నా బిడ్డను నేనే తీసుకువస్తాను అని శపథంచేసి బయలుదేరింది. పర్వతముపైన ఉన్న ఏవలకుంద్రలో వున్న కుమారుని చూచింది. ఇంటికి రమ్మనమని, బ్రతిమాలింది; ఏడ్చింది. చుట్టువున్న వాళ్ళ మనసులు కరిగాయి గాని శ్రీ రమణులు చలించలేదు. చివరకు కాగితంమీద తల్లికి ఇలా వ్రాసియిచ్చారు: ''కర్త, వారి, వారి ప్రారబ్ధానుసారం జీవులను ఆడించును. జరుగనిది ఎవరెంత ప్రయత్నించినా జరగదు. జరుగునది ఎవరెంత అడ్డుపెట్టినా జరిగే తీరుతుంది. ఇది సత్యం. కనుక మౌనంగా ఉండటమే ఉత్తమం'' చేసేదిలేక అలగమ్మ తిరిగి వెళ్ళిపోయింది. తీవ్ర 12 సంవతసరముల తపశ్చర్య తర్వాత ఆ జ్ఞానజ్యోతి భగవాన్ రమణమహర్షిగా అరుణాచలములో ప్రకాశించి, జ్ఞానులను, ఆస్తికులకు మార్గముచెప్పె కాంతిపుంజమైంది. ''నేనెవడను'' అను ఆత్మ విచారణే జగతికి రమణ భగవానుడు అందించిన దివ్యసూక్తి. తిరిగి 1917లో అలగమ్మ, ఉన్న బంధువులంతా మరణించగా, ఇల్లు అప్పులవాళ్ళు వేలము వేసుకుపోగా, కుమారునివద్ద వుండటానికి తిరిగి అరుణాచలం చేరింది. అప్పుడు శ్రీ రమణులు విరూపాక్ష గృహలో వున్నారు. అమ్మరాక భక్తులలో వివాదం బయలుదేరింది. కాని తర్వాత అందరు అమ్మ వుండటానికి అంగీకరించారు. అలగమ్మ రాకతోనే రమణాశ్రమం రూపురేఖలు ఏర్పడ్డాయి. వంట ఏర్పాటయింది. అంతకుముందు రమణులు భక్తుల భిక్షాటనలతోనే కాలం గడిపేవారు. ఎందరో జిజ్ఞాసువులు తమ సందేహనివృత్తులకై శ్రీ రమణులను దర్శించేవారు. కాని శ్రీ రమణుని సన్నిధిలో అద్భుతమైన చర్య చిత్తము దానికై అదే శాంతించి సమాధానపడేది. చివరకు జంతువులు కూడా అట్టి

అనుభూతిని పొందుతుండేది. ఇదే దక్షిణామూర్తి తత్వమని శ్రీ ఆది శంకరులు కీర్తించారు. ఇలా జగతికి జ్ఞానబోధ అందించిన భగవాన్ శ్రీ రమణులు సుబ్రమణ్యేశ్వరస్వామి అవతారము. వారు తమ జ్ఞాన ధనమును జగతి అంతా వెదజల్లి చివరకు 1950 సం॥లో మహాసమాధి చెందినారు. వారు మహాసమాధి చెందినపుడు దివ్యతేజస్సుగల నీలికాంతి పుంజము ఆకాశమార్గమున ప్రయాణించటము చాలామంది భక్తులు ప్రత్యక్షముగా దర్శించినారు. సద్గురువు ఎవ్వరిని తమ శిష్యులు అని తలచరు. అందరిని పరమాత్మ స్వరూపంగానే దర్శిస్తారు. శ్రీ రమణులు ప్రతిజీవిని 'వారు' అని వ్యవహరించేవారు. విరామ సమయంలో ప్రతి పనిని శ్రద్ధగా చేసేవారు. ప్రూప్‌లు దిద్దటము, వంట చేయటం, కొబ్బరిగిన్నెలతో గరిటలు చేయటము, మర్కటాలకాలిగోళ్ళలో మట్టితీయటం అలా చేసేవారు. వారి సన్నిధితో జంతువులు కూడా ఎంతో జ్ఞానముతో తెలివిగా మెలిగేవి. 'లక్ష్మీ' అనే ఆవు; నెమలి, కాకి ఎంతో జాగ్రత్తగా సంచరించేవి. ప్రసాదము వేళకు అడవిలోని కోతులు ఆశ్రమానికి చేరేవి. ఎంతో భక్తిగా, వరుసక్రమంలో నిలబడి శ్రీ రమణుల చేతిమీదుగా ప్రసాదములు తీసుకొనేవి. శ్రీ రమణులకు కుడివైపునకు కూడా హృదయస్పందన జరుగుతుండటము ఎందరో భక్తులు ప్రత్యక్షముగా చూసారు. శ్రీ రమణులు, ఎవ్వరికి మంత్రోపదేశాలు చెయ్యలేదు. తీవ్రమైన ఆచార నిష్టలను విధించలేదు. భక్తులు ఆధ్యాత్మికతకు గురువు అవసరమా అని అడిగితే నేను గురువు అనావశ్యకము అనలేదే, ''దృఢభక్తితో ప్రార్థిస్తే పరమాత్మ గురువుగా మానవాకారంలో దర్శనమిచ్చి మనస్సును అంతర్ముఖం చేస్తాడు. తిరిగి మనలో చైతన్యంగా ఆయనే ఆ మనస్సును తమలో లీనం చేసుకొని ఆత్మపరమాత్మ ఒక్కడేనన్న జ్ఞానం అనుభవంగా ప్రసాదిస్తాడు''. ''అయితే మీ గురువెవరు? భగవాన్'' ఆయన స్థూలరూపంలో లేకపోవచ్చు అని సమాధానమిచ్చారు. వారి నిర్దుష్ట ఆచరణకు ఒక ఉదాహరణ. ఒకసారి రమణాశ్రమములో వేడుక జరుగుతోంది. సామానులు తయారు అయినాయి. బయట కొందరు సాధువులు తమకు భోజనాలు పెట్టమని అడుగుచున్నారు. ఆశ్రమవాసులు ముందు వచ్చిన అతిథులకు పెట్టిన తర్వాతే సన్యాసులకు పెట్టేది అని చెప్పేరు. తర్వాత భోజనాలు ప్రారంభానికిముందు ఆశ్రమవాసులు శ్రీ రమణులను పిలుచుకు రావటానికి వెళ్ళారు. కాని రమణులు ఆశ్రమములో లేరు. వెదుకుతే బయట చెట్టుక్రింద సన్యాసులతో కలిసి కూర్చొని వున్నారు. వారు భగవాన్‌ని భోజనానికి రమ్మని పిలిస్తే ''ఇందాకనే కదా చెప్పారు సన్యాసులకు తర్వాత పెట్టమని, నేను సన్యాసిని నాకు వారితో పాటే వడ్డించండి'' అన్నారు భగవాన్. ఒకసారి ఒక కుక్క భగవాన్ సన్నిధిలో గోలచేస్తుంది. దానిని ఏమి అనలేదు. భగవాన్ దానివైపు చూచి ''సమయం వృధా చేసుకోరాదు?'' అని మందలించారు వెంటనే నేను కన్నులు మూసుకొని ఆ కుక్క అలాగే ధ్యానంలోకి వెళ్ళిపోయింది. ఒకసారి ఒక హరిదాసుడు భగవాన్ సన్నిధిలో భీష్మ హరికథ చెప్తున్నాడు. కథ అయిపోగానే భగవాన్ ఎలా వుంది కథ అని అడిగారు. నన్ను అడుగుతారెందు లక్ష్మీని చూడండి అన్నారు. లక్ష్మీ అనే ఆవుకు ఆ హరికథ వింటున్నంతసేపు కన్నుల వెంట ధారాపాతంగా అశ్రువులు జాలువారుతూనే వున్నాయి.

1922 మే 19న అలగమ్మకు అవసానదశ సమీపించింది. అది గ్రహించిన భగవాన్ సాయంత్రం 5గం॥టలకు ఆమె దగ్గర కూర్చొని తమ కుడి హస్తాన్ని హృదయంపైన, ఎడమ హస్తాన్ని ఆమె శిరస్సుపైన వుంచి రాత్రి 8 గంటలవరకు అలాగే వున్నారు. ఆ తర్వాత అమ్మయ్య! అంటు చేతులు తీశారు. అలగమ్మ దేహం శవమైనది. అందరూ అడిగారు భగవాన్‌ని, 'ఏం జరిగింది?' భగవాన్ అన్నారు 'అమ్మ మోక్షంలో ఉందండి!' అని తమచర్యను యిలా చెప్పారు.

నా ఆత్మశక్తిని, నా హస్తములద్వారా అమ్మలోకి ప్రవేశపెట్టాను. నా ఆత్మశక్తికి, అమ్మ ఆగామి సంచితాలకు యుద్ధం జరిగింది. అమ్మ భవిష్యత్‌లో అనుభవించవలసిన అనేక జన్మల కర్మలను 2 గంటల కాలంలోనే సూక్ష్మలోకంలో సూక్ష్మశరీరం ద్వారానే అనుభవింపచేశాను. అట్లా ఆమె ఆగామి సంచితాలు నశించాయి. అమ్మ మోక్షంలో వున్నది.

శ్రీ రమణుడు, సాయి ఒక్కరే అనే లీల ఇక్కడ ప్రస్తావించుకోవచ్చు. శ్రీమతి డొంగ్రేను కొందరు సాయి భక్తులు విరాళమడిగారు. అందుకు డొంగ్రేవాళ్ళు మేము రమణభక్తులము గదా అన్నారు. రమణులు, సాయి, వేరు కాదు, మీరు శిరిడీ వెళితే తప్పక సత్యం తెలుస్తుంది అన్నారు భక్తులు. తర్వాత శ్రీమతి డొంగ్రేవాళ్ళు శిరిడీ దర్శించినప్పుడు గురుస్థానములోని శ్రీ సాయి పటములో రమణుల దర్శనమయింది.

# వారి దృష్టి ఆ ఒక్క దాని మీదే ఉంటుంది!

ఒక యువకుడు భగవాన్ రమణమహర్షిని ''సాధనకు గురువు కావాలి గదా?'' అని అడిగాడు. ''ఔను, కావాలి'' అన్నారు భగవాన్. ''సద్గురువును ఏవిధంగా నిర్ణయించుకోవాలి? గురుస్వరూపం ఎటువంటిది?'' అన్నాడా పృచ్ఛకుడు. ఎవనియందు నీ మనస్సు లగ్నమౌతుందో, వాడే గురువు. సద్గురువు ఇతడని నిర్ణయించడం ఎట్లా? వారి స్వరూపం ఎటువంటిది? అంటే శాంత శమదమాదులతో కూడి, సూదంటు రాతివలె దృష్టిచేతనే ఆకర్షింపగల శక్తి సంపన్నత, సమత్వం ఎవరియందు స్థిరంగా ఉంటవో వారే గురు స్వరూపులు. గురు స్వరూపం తెలుసుకోవాలంటే, తన స్వరూపమేదో తెలుసుకోవాలి ముందు. తన స్వరూపమేదో తెలియనప్పుడు, గురుస్వరూపమేవిధంగా తెలుస్తుంది? గురు స్వరూపం చూడాలంటే, లోకాన్నంతా గురు రూపంగా చూడాలి.'' ''అది తెలుసుకొనేందుకు మాత్రం గురువుకావద్దా?'' అన్నాడా యువకుడు. ''అది నిజమే. లోకంలో ఎందరో మహనీయులున్నారు. నీ మనస్సు ఎవరియందు లగ్నమౌతుందో, వారిని గురువుగా నమ్ముకో. గురియేగదా గురువు?'' అన్నారు భగవాన్. ఆ యువకుడంతటితో తృప్తిచెందక, సమకాలికులగు పెద్దలపేర్లు కొన్ని ఏకరువుపెట్టి, ''వారికా లోపం వుంది. వీరికీ లోపం ఉంది, వారేవిధంగా గురువౌతారు? వీరేవిధంగా గురువు కాగలరు?'' అని ఆక్షేపించుట కారంభించాడు.

ఆ యువకుడు తిరిగి తిరిగి అదే ధోరణితో మాట్లాడబోతో, ఒక భక్తులు వారించారు. భగవానదిచూచి ''ఉండండయ్యా, మీరు ఎవరూ మాట్లడకండి. వారి చిత్తమొచ్చినంత సేపు మాట్లాడనీయండి. వారు తెలిసినవారు. మనమంతా వారికి తగ్గి ఉండాలి. చూస్తూనేవున్నా, వచ్చినప్పటి నుంచీ ఇదంతా మూటకట్టుకొని, మూల కూర్చున్నారు. రోజుకు రోజు కాస్త, కాస్త జరిగి దగ్గరకొచ్చారు. ఈ రోజు నేను ఒకణ్ణున్నానని మూట విప్పారు. ఇదంతా బయటికి రావద్దా? ఈ లోకమంతా వెదకి గురుస్వరూపం నిర్ణయిస్తారట. వీరు గురువుగా వరించే యోగ్యత ఇంతవరకూ ఎవరివద్దనూ కనుపించలేదట. దత్తాత్రేయులు, లోక గురువు గదా? వారు లోకమంతా నాకు గురువే నన్నారట. చెడ్డచూస్తే చేయరాదని తోస్తున్నది. అందువల్ల అదీ గురువే. మంచిచూస్తే చేయాలనిపిస్తున్నది గనుక ఇదీ గురువే. మంచిచెడ్డలు రెండూ నాకు గురువులేనన్నారు. వేటగాడు దోవ అడిగిన తన మాట వినిపించుకొనక పక్షిని గురిపెట్టికొట్టడం చూచి 'నాయనా, నీవు నాకు గురువువు' అని నమస్కరించారట. 'పక్షిని చంపటం చెడ్డదైనప్పటికీ లక్ష్యముంచి బాణం వేయడం చూచి, నా మనస్సు ఈ విధంగా ఈశ్వరునియందు లక్ష్యముంచి అనుసంధించాలని బోధిస్తున్నావు గనుక, నీవొక గురువువు' అన్నారట. ఇదేవిధంగా ఏదిచూస్తే, అదే గురువని చెప్పి కడకీ శరీరమే గురువన్నారు. ఏమంటే నిద్రలో ఈ శరీరం లేదుగదా? ఈ లేనిదానియందు దేహాత్మ భావన కూడదని బోధిస్తున్నది. అందువల్ల ఇదీ గురువే నన్నారు. వారు లోకమంతా గురువుగా భావిస్తే, వారిని లోకమంతా గురువని కొండాడింది. ఈశ్వర విషయమూ అంతే. లోకమంతా ఈశ్వరమయంగా ఎవరు చూస్తారో వారిని ఈశ్వరుడని లోకం పూజిస్తుంది. మనమెంతో లోకమంతే. 'యద్భావం తద్భవతి' అన్నారు. పెద్దతోట ఉంటుంది. కోకిలవస్తే, మంచి పండ్ల నిమిత్తం మామిడి చెట్లు వెదుకుతుంది. కాకి వస్తుందనుకో. అది వేపచెట్లు వెదుకుతుంది. తుమ్మెదలు; తేనెకొరకు మంచి పూలను వెదికితే, ఈగలు మలాన్నన్వేషిస్తవి. సాలగ్రామం కావలసినవాడు రాళ్ళన్నీ త్రోసివేసి అది ఒక్కటీ గ్రహించి పూజిస్తాడు. ఆ సాలగ్రామం రాళ్ళలోనే ఉంటుంది. చెడ్డ ఉంటనే మంచి తెలుస్తుంది. చీకటి ఉంటేనే, వెలుగు శోభిస్తుంది. మాయ ఉంటేనే ఈశ్వరుడున్నాడు. సారగ్రాహి నూరింటిలో ఒక్క మంచి దొరికితే చాలు. ఆ ఒక్కటీ గ్రహించి, తొంబదితొమ్మిది త్రోసివేసి ఇదొక్కటీ చాలురా మనకు, దీనితో లోకమంతా జయించవచ్చుననుకుంటాడు. వారి దృష్టి ఆ ఒక్కదానిమీదనే ఉంటుం''దని మేఘ గంభీరధ్వనితో పలికి విరమించారు.

# కృతజ్ఞతా మహోత్సవము
## ఆరంభమైంది!

కాళిదాస్

''ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కడైతోచు పోలికన్, ఏ దేవుడు సర్వకాలము...'' అని భాగవతము కీర్తిస్తుంది. ప్రతి ఒక్కరి యొక్క సుఖశాంతులకొరకు, వారికి పరమ శ్రేయస్సును చేకూర్చడానికి వచ్చిన భగవంతుని స్వరూపమే భగవాన్ శ్రీ భరద్వాజ మహరాజ్. సరియైన లౌకిక-ఆధ్యాత్మిక జీవనాన్ని చూపించి Initiation చేసి, జీవితం పొడుగునా సాధనామయంగా నడిపించి, అలా సరిగా జీవించిన వారిని ముక్తితో తరింపజేసే త్రిమూర్తి స్వరూపమే ఆయన. అలా శ్రీ దత్తాత్రేయులు ఈ రూపంలో మనమధ్యకు వచ్చి నేటికి 75 సంవత్సరములు. అక్టోబరు 30వ తారీఖున పూజ్య ఆచార్యుల 75వ జన్మదిన మహోత్సవాన్ని నాగోలులో వైభవంగా, భక్తి శ్రద్ధలతో జరుపుకున్నాము. గురుపుత్రులు ద్వారకనాథ్‌గారు కృతజ్ఞతా మహోత్సవము ప్రారంభమయినదని ప్రకటించారు. ఈ చారిత్రాత్మకమయిన కృతజ్ఞతా మహోత్సవము భక్తి శ్రద్ధలతో దివ్యంగా జరగాలని శ్రీ సాయినాధుని, పూజ్య మాస్టరుగారిని, అమ్మగారిని నమస్కరించి ప్రారంభించారు.

ఆయన యిలా తెలియజేశారు, ''పూజ్య మాస్టరుగారి కృతజ్ఞతా మహోత్సవం జరుపుకోవడం ఎంతో అదృష్టము. మామూలుగా పండుగలు ఎవరికవరమంటే, ప్రతిరోజూ ఆయనను గుర్తుంచుకోలేని వారికి. ఈ విషయం కొందరు మహాత్ములను, అవధూతలను చూస్తే



తెలుస్తుంది. వారే పండుగలలోనూ పాల్గొనరు. నిరంతరం ఆ స్థితిలోనే వుంటారు. మనం కూడా కృతజ్ఞతామహోత్సవములో నిరంతరం ఆయన ధ్యానంలో వుండడానికి ప్రయత్నించాలి. ముందు ఆయనవల్ల మనం ఎలా బాగుపడుతున్నామో స్పష్టంగా తెలుసుకోవాలి. దానివల్ల అంతగా కృతజ్ఞత వహించగలము''.

ఆయన ఇంకా ఇలా తెలియజేశారు ''మానవజాతి ఒక వైపు, భగవంతుని చేరుకోవాలనిపించకపోవడం, ధైర్యంగా ఈ మార్గం ద్వారా భగవంతుని పొందడానికి ప్రయత్నిస్తున్నాను అని చెప్పలేని స్థితిలోవుంది. ఇంకోవైపు ఇంటర్‌నెట్, సెల్‌ఫోన్, ఇతర ఉపకరణాలతో 'పదార్థత'లో (మెటీరియల్‌గా) ఎంతో పురోగమించింది. ఇది ఎటువంటిదంటే ఒక డబ్బాలోంచి ఎవరైనా జీడిపప్పు తీసుకుంటుంటే, మనకూ తీసుకోవాలనిపిస్తుంది తప్ప, ఇంతమంది తింటున్నారు కదా, దానిని నింపి పెడదామనిపించదు. అలాగే ఇనుమును చూస్తే దాన్ని ఎలా వాడచ్చు అనిపిస్తుంది కాని, అది సృష్టి ఇచ్చిందని కానీ, ఎందరి కష్టమువల్ల వచ్చిందనికానీ అనిపించదు. మళ్ళీ అందరికీ ఉపయోగ పడేట్టు వాడాలనిపించదు. ఈ పరిస్థితులలో కీలకమైన విషయాన్ని ఆయన తెలిపారు. మీరు తపస్సులూ, ధ్యానాలు చెయ్యలేరు. అదలావుంచి, ముందు ఎందరు ఏం చేసినా, అది తృప్తీ, శాంతి కోసమే అని తెలుసుకో. అలా తృప్తి శాంతి పొందిన మహాత్ముల గురించి చదివి వారు ఏం చేశారో, ఏం చెప్పారో తెలుసుకో, వాటిల్లో నీ హృదయానికి, మనస్సుకూ నచ్చిన దాన్ని తీసుకో. ఒకరికి వివేకానందులు నచ్చవచ్చును, ఒకరికి రమణ మహర్షులు చెప్పింది. అలా చేస్తే ధ్యాస మారుతుంది. నీ దృక్పథం మారుతుంది. దాని ద్వారా వాళ్ళు అంతటా ఒకటే వున్నది అన్నదాన్ని ఎలా తెలుసుకున్నారో తెలుస్తుంది. అప్పుడు నీ ఆచరణ, మనస్సు, చిత్తమూ మారతాయి. అలా తెలుసుకున్ననాడు తృప్తీ శాంతీ వస్తాయి, అని సులువు అందించినవారు పూజ్య మాస్టరుగారు. ఇది ఎందుకు విశేషమైనదంటే ఒక్కొక్కరికీ ఒక్కొక్కటి నచ్చుతుంది. కొందరికి భజన మొదలయితే బాగుండదు, కొందరికి భజన ఆపితే బాగుండదు - కొందరికి పారాయణ నచ్చితే, కొందరికి పూజ నచ్చుతుంది.

అలా కాకుండా నీ మనస్సుకు కోరికలున్నాయా, ఇలా అనిపిస్తున్నదా, అయితే ఇలా ఆలోచించు అనీ, లేకపోతే ఎమోషన్ based వారయితే వారికి తగినట్లుగానూ చెప్పేవారు. అలా అందరికీ అన్ని విధాలుగా సరిపోయే కీలకమైన పద్ధతులు తెలియజెప్పారు.

పూజ్య గురుదేవుల 75వ జయంతి సందర్భంగా దివ్యజనని అలివేలుమంగమ్మ పూజ్య మాస్టరుగారి గురించి రాసిన 'మహాపురుషుడు' అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. భక్తులు ఈ జయంతి ఉత్సవం సందర్భంగా మాస్టరుగారి గురించి ఒక గ్రంథాన్ని రాయమని కోరారట. దివ్యజనని ఈ గ్రంథాన్ని ప్రసాదించి ఆనందింపజేసారు.

చీకటి పడింది. సాయంకాలపు గాలులు నెమ్మదించాయి. జనులు సుఖాశీనులై మరింత భక్తితో తమ మనస్సులు నింపుకొంటున్నారు. శీతాకాలపు మంచు చిక్కనై అందరినీ కమ్మి ప్రతి ఒక్కరి అంతరంగాన్ని సృజించటానికి ప్రకృతిచేసే ప్రయత్నము వలె వున్నది. ద్వారకనాథగారి కోరికపై భక్తజనులకానందం కలిగిస్తూ దివ్యజనని ప్రసంగించసాగారు.

''జై సాయి మాస్టర్! మూకం కరోతి వాచాలం, పంగుం లంఘయతి సముద్రం.. అంటారు. అలా పూజ్య మాస్టరుగారివంటి వారు ఎటువంటి వారికయినా శక్తినిచ్చి కరుణిస్తారు. అలాగే నేను మాస్టరుగారి గురించి ఏమి రాయాలి అనుకున్నా, ఆయన కృపగా ఈ పుస్తకం వచ్చింది.

ఇది ఆయనే నా చేత రాయించుకున్నదనే అనిపిస్తున్నది కనుక, దానిని మీరు ఎలా సద్వినియోగ పరచుకుంటారన్నది, ఆ బాధ్యత మీదీ, ఆయనదే. ఈ మహోత్సవం రోజున పూజ్యమాస్టరుగారికి కృతజ్ఞత తెలుపుకోవటం ఎంతో ముఖ్యమైనది. ఎందుకంటే ఆయన అన్ని సమస్యలకూ పరిష్కారంగా పారాయణ విధానాన్ని అందించారు.

ఏ సమస్యకయినా ఆయన, ''అన్నిటికీ మన మంత్రమున్నది కదయ్యా పారాయణ చేస్కో'' అనేవారు. ఒక ఆయుధంగా, అంతగా ఆయన చెప్పేవారంటే దానిలో ఎంత అద్భుతమైన శక్తి వున్నదో గుర్తించాలి.

మనస్పూర్తిగా చేయలేకపోయినా అన్ని కోరికలూ తీరుతున్నాయి. అద్భుతమైన లీలలు జరుగుతున్నాయి. అప్పుడు మనకు కృతజ్ఞత కలగాలి. హృదయంలో స్పందన మొదలవాలి. అలా కలగకపోయినా మళ్ళీ పారాయణ చేస్తే మళ్ళీ ఇంకో కోరిక తీరుతున్నదంటే మనం ఎంత కృతజ్ఞత కలిగివుండాలి? ఏమీ ఇవ్వనక్కరలేదు, ముఖ్యంగా కృతజ్ఞత కలగాలి. అందుకే మాస్టరుగారు చెప్పేవారు, కృతజ్ఞతకు మరోపేరు సాయి.

మనకూ అలా అనిపించాలి. మాస్టరుగారు, బాబా యిలా చేశారా ఇంతగొప్పదైన పారాయణా విధానాన్ని ప్రసాదించారా అనిపించాలి. మనం ఏమీ ఇవ్వక్కర్లేదు. వాళ్ళకేమీ అక్కర్లేదు. ఇచ్చినా వాళ్ళు తీసుకోరు కూడా. ఈ విధానాన్ని ఎవరికయినా చెప్పి, వాళ్ళకు ఏ కష్టమొచ్చినా ఇదిగో యిలా పారాయణ చేస్కోండి అని చెప్పడం వంటివి చేయాలి.

అదేకాకుండా మనం ఇలా హాయిగా ఉన్నామంటే అది వారి కృపే. నిజానికి ఇక్కడున్న మనకు సామాన్యంగా ఎటువంటి

కష్టాలూ లేవు, తెచ్చి పెట్టుకున్నవి తప్పితే. ఇటువంటి చక్కని జీవితాన్ని ఇచ్చినందుకు కృతజ్ఞత తెలుపుకోకపోతే మన జీవితం ఎందుకు అనే ప్రశ్న రావాలి. రోజుమొత్తం మీద మన హృదయం ఎంతవరకూ ఉప్పొంగుతున్నది, ఎంతవరకూ ఆయన చెప్పినట్లు చేసుకోగలుగుతున్నాము'' అని ఆలోచన రావాలి. అప్పుడు మనం ఏపని చేసినా, ఏం మాట్లాడినా అది కృతజ్ఞతే అవుతుంది. ఇవాళ్ళ ఈ పని జరిగేటట్లు చేశావా, నీకు కృతజ్ఞత. ఇలా భోజనం పెట్టావా, నీకు కృతజ్ఞత, ఇలా ప్రతి విషయంలోనూ నీకు కృతజ్ఞత తెలుపుకుంటూంటే కొన్నాళ్ళకు అది అలవాటువుతుంది. ఎంతమందికి లేని సౌకర్యాలు మనకు జరుగుతున్నాయో గుర్తు పెట్టుకొని ఒక్క క్షణం ఆగయినా సరే, కృతజ్ఞత నాయనా, కృతజ్ఞత తండ్రీ అని నమస్కారం చేసుకోవాలి.

అలాచేస్తే మననం చాలా బాగా జరుగుతుంది. దు:ఖం పోతుంది. కుంతీదేవి శ్రీ కృష్ణుడిని అడిగిందట, ''నాయనా నాకెప్పుడూ కష్టాలివ్వు. అప్పుడే నిన్నెప్పుడూ గుర్తుపెట్టుకుంటాను'' అని. ఆ స్థాయి వచ్చి కష్టాలు కూడా నిన్ను స్మరించటానికి వచ్చిన ప్రసాదాలుగా అనిపిస్తాయి. అప్పుడు కష్టం కష్టంగావుండదు. లేకపోతే కష్టంకానిది కూడా కష్టంగా అనిపిస్తుంది. మామూలుగావుంటే, చీఛీ ఇవ్వాళ A.C. లేదు అని మనశ్శాంతిని కోల్పోతాము. అట్లా కాకుండా, కష్టాలనిపించకుండా వుండే స్థాయికి మనలను తీసుకొస్తారు వాళ్ళు. అందుకని ఈ కృతజ్ఞతా భావాన్ని పెంపొందించుకోవటం, ఈ కృతజ్ఞతా మహోత్సవమూ అతి ప్రధానమైన విషయం. ఇంకేమీ కాదు.

సహస్రాభిషేకాలు, కనకాభిషేకాలు ఇవేవీ వారు కోరుకోరు. మన హృదయంలో కృతజ్ఞతతో హాయిగా నమస్కారం మానసికంగా చేసుకోవడం ముఖ్యం. అలా అని శక్తి వున్నా చేసుకోకపోవడం కాదు. ఆ డబ్బులు ఇంకో మంచి పనికి వాడేట్లయితే ఇవి చెయ్యనక్కరలేదు. పేదవాళ్ళకివ్వటం లాంటివి చెయ్యొచ్చు. సరే అవి వేరు, కృతజ్ఞత కలిగివుండడం ముఖ్యము'' అని తెలియజేసారు.

అలా ఈ జయంతి ఉత్సవము దిగ్విజయంగా ముగిసింది. పూజ్య మాస్టరుగారికి కృతజ్ఞతా మహోత్సవము ప్రారంభమయింది.

జై సాయి మాస్టర్!

## సాయి పాదాలను చేరిన శ్రీమాన్ బోధాయన



పూజ్య ఆచార్యుల మూడవ అన్నగారైన శ్రీ ఎక్కిరాల బోధాయనగారు నవంబరు 6, 2012 న రాజమండ్రిలో పరమపదించారు. 1936వ సం॥ నవంబరు 7 ధనత్రయోదశిన జన్మించి తండ్రిగారైన శ్రీమాన్ అనంతాచార్యుల శిక్షణలో ఆయుర్వేద శాస్త్రంలో నిష్ణాతులై ఎందరికో సేవచేసిన మహానుభావులు ఆయన. శుద్ధ సత్త్వ స్వరూపులై, పసి బాలుని మనస్తత్వము కలిగి శాంతిని వెదజల్లే వ్యక్తిత్వంగా ఆయన కొనియాడబడ్డారు. తండ్రి, సోదరుల సహచర్యములో ఎన్నో వైదిక విద్యలనలవర్చుకొని, చక్కని జీవిత పంథాననుసరించిన ఆదర్శమూర్తి ఆయన. నేడు సాయినాథుని చేరిన ఆయన తమ కృపాశీస్సులు అందరిపైన ఎల్లప్పుడూ వర్షించాలని ప్రార్థన.

పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల
భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన
అపూర్వ గ్రంధములు

| | |
|---|---|
| శ్రీ సాయిలీలామృతం-శ్రీ గురుచరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయిలీలామృతం | 70-00 |
| శ్రీ గురుచరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయి నాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడంఎందుకు | 5-00 |
| సాత్సంగను-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞానవీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యాయోహగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్యం | 40-00 |
| సంహితాయన గురుద్విసహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్య వాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీచీరాలస్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్య స్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ(అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము- మన సంస్కృతి | 55-00 |

ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీసిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నంద దీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| బాలల శ్రీ సాయి లీలామృతము | 25-00 |

## BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |

## BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba(Hindi) | 100-00 |
| Sai Leelamrutam(Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitam (Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutam(Tamil) | 80-00 |
| Sri Guru Charitra(Hindi) | 50-00 |
| Sri Guru Charitra(Kannada) | 99-00 |
| Swami Samartha(Kannada) | 45-00 |
| Shirdi arathi(tamil) | 6-00 |
| Stavana Manjari | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46p, Hanuman Nagar,
Jaipuri colony, Nagole,Hyderabad-68
Phone :040-20063300
**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust(Publications)", payable at Hyderabad OR Ongole**




పర్వదినమైన విజయదశమినాడు పూజ.శ్రీ. ఎక్కిరాల భరద్వాజ మహారాజ్ దంపతులచే
రచించబడిన మహిమాన్వితమైన 'శ్రీ సాయి సచ్చరిత్ర' గ్రంథం దివ్యజనని
కరకమలములచే ఆవిష్కరింపబడింది.

